# తెలుగులో యాత్రాచరిత్రలు

సిద్ధాంత వ్యాసం

డా॥ మచ్చ హరిదాసు

ఇందు ప్రచురణలు
కరీంనగర్
1992

# TRAVELOGUES IN TELUGU

By

Dr. M. Hari Das

First Published : 1992

Cover page :
Sheela Veerraju

Price : Rs. 150/-

Printers :
Padmavathi Art Printers
1-1-517/B/1, Gandhinagar,
New Bakaram, Hyd-500 380.
Phone : 611413.

For Copies :
Smt. M. BHARATHI,
A-83, Padmanagar Colony,
Karimnagar-505002.
and
Visalaandhra Publishing House,
4-1-435, Vignanbhavan, Bank Street,
Hyberabad - 5000 001.
and all Branches

తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థిక సహాయంతో ముద్రితం.

# అంకితం



జీవితంతో ముడివడిన
ఆప్తమిత్రుడు
రామగిరి అశోక్ కుమార్‌కు
ఆత్మీయంగా...

TRAVELOGUES IN TELUGU

By

Dr. M. Hari Das

First Published : 1992

Cover page :

Sheela Veerraju

Price : Rs. 150/-

Printers :

Padmavathi Art Printers

1-1-517/B/1, Gandhinagar,

New Bakaram, Hyd-500 380.

Phone : 611413.

For Copies :

Smt. M. BHARATHI,

A-83, Padmanagar Colony,

Karimnagar-505002.

and

Visalaandhra Publishing House,

4-1-435, Vignanbhavan, Bank Street,

Hyberabad - 5000 001.

and all Branches

---

తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థిక సహాయంతో ముద్రితం.

---

# విషయసూచిక

ఆచార్య సి. నారాయణరెడ్డి
వైస్‌ఛాన్సలర్,
తెలుగు యూనివర్సిటీ

# ఆశీరభినందన

పరిశోధనకు అర్థం కాని అంశం అంటూ ఉండదు విశ్లేషణ మతివుంటే.

యాత్రా చరిత్రల్ని ఎవరూ శాశ్వత సాహిత్య శిల్పాలుగా ఉండాలని రాసుకోరు. సందర్శన సమయాల్లో, గుండెకు తగిలిన సంఘటనల్లో కలిగిన స్పందనలను అక్షరాల్లోకి ఎక్కించుకుంటారు. అయితే ఒక్కొక్కరి వ్యక్తిత్వాన్నిబట్టి చిత్రాలే వివిధ రూపాలను సంతరించుకుంటాయి.

మచ్చ హరిదాసు ఈ సూక్ష్మాన్ని గమనించే ఈ యాత్రా చరిత్రల రచనకు శ్రీకారం చుట్టాడు. అలవోకగా రాసుకున్న ఆత్మ స్పర్శ వున్న చరిత్రలను శాస్త్రీయంగా వర్గీకరించి ఈ గ్రంథ భూమిక గురుత్వం పెంచాడు.

తెలుగులో వెలువడిన సమస్త యాత్రా చరిత్రలను సేకరించడం ఎంత మెచ్చుకోదగ్గపనో, వాటిని క్రమీకరించి వ్యాఖ్యానించడం అంత విలువైన కృషి.

హరిదాసుకు సమాచారాన్ని వింగడించి చూపే నేర్పుతోపాటు హృదయాన్ని స్పృశించే మృదుల వచనశైలి పట్టుపడింది. అందువల్ల ఈ గ్రంథం పరమ పఠనీయంగా రూపొందింది.

సమాచారం, విశ్లేషణం సమ ప్రమాణాల్లో కుదురుకున్న ఇంత చక్కని పరిశోధన గ్రంథాన్ని ఆచార్య యన్. గోపి పర్యవేక్షణలో రచించిన హరిదాసు పరిశోధన ప్రవణతకు నా ఆశీరభినందన.

సి. నారాయణరెడ్డి

డా॥ ఎన్. గోపి
ప్రొఫెసర్,
తెలుగు శాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయం.

# పరిశోధన యాత్రలో

సైర్ కర్ దునియాకి గాఫిల్ జిందగానీ ఫిర్ కహాఁ
జిందగీ అగర్ కుచ్ రహీతో నౌ జవానీ ఫిర్ కహాఁ

(ఓయి మూర్ఖుడా! జీవితం దుర్లభం, కాబట్టి ప్రపంచం తిరిగిరా. జీవితం ఎల్లకాలం ఉండేదికాదు. ఒకవేళ కొంత మిగిలినా యవ్వనం మళ్ళీరాదు - ఇదే సిద్ధాంత వ్యాసం పుట-68).

33 ఏళ్ళ పాటు ప్రపంచంలోని వివిధ ప్రాంతాలూ దేశాలూ పర్యటించిన రాహుల్ సాంకృత్యాయన్ చిన్నతనంలో చదువుకున్న పంక్తులివి. ఆయన యాత్రానుభావాలు మానవజాతికి లభించిన అపూర్వమైన నిధులు. ఈ గ్లోబుపైన రాహుల్ వంటి మానవుడు పుట్టడం అరుదు.

ఏమైనా విన్నదానికంటే చూసినదానివల్లే సంపూర్ణమైన అవగాహన కలుగుతుంది. ప్రత్యక్షసాక్షిని మించిన ప్రమాణం మరొకటి లేదు. యాత్రాగ్రంథాలు చదువుతున్నప్పుడు పాఠకులే ప్రయాణం చేసి వచ్చిన అనుభూతిని పొందుతారు. చరిత్రే అయినప్పటికీ యాత్రికుల దృక్కోణాలూ స్పందనలూ భావోద్వేగాలూ కలిసి ఉండటం వల్ల అదొక మానవ జీవనస్రవంతిగా రూపొందుతుంది.

యాత్రల వల్ల యాత్రాకాలంనాటి సామాజిక, రాజకీయ, ధార్మిక, సాంస్కృతిక పరిస్థితులు అవగతమై తరువాతి తరాలకు ఒక గొప్ప ప్రేరణ లభిస్తుంది.

మానవుని యాత్రల్లో వేగం పెరగడం ఒక విశిష్ట క్రమ పరిణామం. అయితే, రాహుల్‌జీ మాటల్లోనే చెప్పాలంటే "....డబ్బు బలంతో విమాన ప్రయాణాలు చేసి, గొప్పగొప్ప హోటళ్ళలో బస చేసే వాళ్ళని లోకసంచారులు అనడానికి వీలులేదు." అయితే మధ్య యుగాల్లోని యాత్రికుల బాధలు చూస్తే యాత్ర అంటే ఇదిగదా అని పిస్తుంది.

"బురదలో నడిచి యాత్రికులు త్రోవ తప్పుచుండిరి. చీకటి రాత్రులందు పదేపదే జారిపడుచుండిరి. వర్షాకాలములోనే కాదు, శీతాకాలములో కూడ వారి కట్టి కష్టములే ఎదురయ్యేడివి. గ్రామ దేవతల గుడిసెలలోనో, ఏ పాడుగోడపంచనో చేరి, చలిగాలికి కొంకర పోవుచు, కప్పుకొనిన బొంతలలో నుండియే వణికిపోవుచు, పండ్లు చప్పుడు చేయుచుండెడి వారి అవస్థ వర్ణనాతీతము."

మానవుని అనుభవక్రమంగా అనుభవసారంగా మిగిలిన యాత్రా చరిత్రల గురించి విశ్వవిద్యాలయ పరిధిలో పరిశోధనకు పూనుకోవటం సాహసమే. ఈ సాహస కార్యాన్ని నా మిత్రుడు ఎమ్. హరిదాసు చేపట్టాడు. అదీ నా పర్యవేక్షణలో. అసలీ పరిశోధ నాంశాన్ని నేనూ మా యస్. వి. రామారావుగారు చాలాకాలంగా అట్టే పెట్టాం ఎవరన్నా గట్టివాడు వస్తే ఇద్దామని. అది హరిదాసు పాలబడింది. హరిదాసు పరిశోధన చేపట్టినపుడు నాలుగైదు యాత్రా చరిత్రల పేర్లు మాత్రం వినిపిస్తుండేవి. పరిశోధకుని విస్తృతమైన విషయ సేకరణవల్ల ఆ సంఖ్య వందను దాటింది. దీనికోసం హరిదాసు కాళ్ళకు బలపాలు కట్టుకొని తిరగడం కళ్లకు కట్టినట్టు కనిపిస్తుంది.

ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీ యాత్రా చరిత్రను ఈ ప్రక్రియలో తొలి గ్రంథంగా నిర్ణయించటంలో హరిదాసు చూపిన ఉపపత్తులు తర్కసహంగా యుక్తియుక్తంగా ఉన్నాయి. వీరాస్వామయ్యగారు 20 ఏండ్ల తేడాతో రెండుసార్లు కాశీయాత్ర చేశాడు. రెండోదే గ్రంథరూపం ధరించింది. ఈ రెండు దశాబ్దాల్లోనే ఎన్నో మార్పులు వచ్చినట్లు వీరాస్వామయ్యగారితో పాటు పరిశోధకుడూ గుర్తించాడు. ఆ రోజుల్లో హైదరాబాద్ - నాగపూర్ మార్గంలో సోన్ వద్ద బ్రిడ్జి నిర్మాణం జరగలేదు. కాబట్టి దాని ప్రస్తావనను సహజంగానే ఏనుగులవారు పేర్కొనలేదు. నిర్మల్ వద్ద "చీకటి ఈగల" బాధలను పేర్కొన్నారు. (హరిదాసు ఇప్పుడు నిర్మల్ లోనే ఉద్యోగం చేస్తున్నాడు. చీకటిఈగల సంగతి ఆయనే చెప్పాలి.)

హైదరాబాద్‌నిగూర్చి వీరాస్వామయ్యగారు ఆనాడు పేర్కొన్న సంగతులు మొన్న మొన్నటివరకు అట్లానే ఉన్నాయి. పన్ను విధించే వాడు ఎంత అంటే అంత ఇవ్వవలసిందే. చంపినా అడిగే దిక్కులేని దిక్కుమాలిన రాజ్యమని వాపోయాడు. కాశీలో వీరాస్వామయ్య వర్ణించిన ఆనాటి పండాల బాధలకు ఇప్పటికీ తేడా పెద్దగా లేదు. హరిదాసు 'కాశీ యాత్రాచరిత్రను' పరిశీలించిన తీరు సాధికారంగా, సమగ్రంగా ఉంది. తరువాత వచ్చిన కాశీయాత్రల పరిశీలనలో తులనాత్మక పద్ధతిని అనుసరించి ఆయా కాలాల్లో వచ్చిన మార్పులను చక్కగా ప్రదర్శించాడు.

'నీలగిరి యాత్ర' చిన్నయసూరి నీతిచంద్రికకు ముందు ప్రచురించబడిందనే 'క్యూరేటర్' అభిప్రాయాన్ని ప్రామాదికంగా గుర్తించి ఖండించాడు హరిదాసు. 'నీలగిరియాత్ర' నాటికే నీలగిరి ధనవంతులకేగానీ పేదవారికి అంత సౌఖ్యప్రదమైంది కాదనీ శేషాచల కవి చలిచావులను, వానచావులను ఆయన పేర్కొన్నాడు.

యాత్రా చరిత్రలవల్ల కాలంలో వచ్చిన మార్పులు తెలుస్తా యనడానికి ఇటీవల రష్యాలో సంభవించిన మార్పులుకూడా ఒక ప్రబల నిదర్శనం. రష్యాయాత్రలు చేసినవారందరూ రష్యాలోని పాలనా వ్యవస్థను, జన జీవన విధానాన్ని ప్రశంసించినవారే. ఇప్పటి యాత్రికులు రష్యాను గురించి రాస్తే ఏం రాస్తారో!

16 అధ్యాయాలుగా విస్తరిల్లిన ఈ బృహత్ సిద్ధాంత వ్యాసం ఒక యాత్రా విజ్ఞానసర్వస్వంవంటిది. తెలుగు సాహిత్యంలో ఈ అంశంపై ఇదే మొదటి గ్రంథం. ప్రియమిత్రుడుహరిదాసును మన సారా అభినందిస్తున్నాను.

# కృతజ్ఞతలు

ఈ సిద్ధాంత వ్యాసం 1989 లో పిహెచ్.డి. పట్టాకోసం ఉస్మానియా విశ్వ విద్యాలయానికి సమర్పింపబడింది. 1990 లో డాక్టరేట్ అవార్డు అయింది. 'తెలుగులో యాత్రా చరిత్రలు' అనే ఈ పరిశోధనాంశాన్ని నాకు సూచించిన వారు ఆచార్య ఎస్ వి. రామారావు, ఆచార్య ఎన్. గోపాల్‌గార్లు. పరిశోధన చెయ్యాలనే నా అభిలాషను మన్నించి 1987 లో పరిశోధనకు అవకాశం కల్పించినవారు నాటి తెలుగుశాఖాధ్యక్షులు ఆచార్య ఎం. కులశేఖరరావుగారు. వెన్నుతట్టి ప్రోత్సహించినవారు ఆచార్య నాయని కృష్ణకుమారిగారు—

పిహెచ్.డి.లో సీటు వచ్చిన వెంటనే యాత్రా చరిత్రల గ్రంథాలకోసం అన్వేషణ ప్రారంభించాను. నేను విషయసేకరణకోసం సంప్రదించిన గ్రంథాలయాలు : మద్రాసు విశ్వవిద్యాలయం లైబ్రరీ, స్టేట్ ఆర్కైవ్స్, కన్నెమెరా, అడయార్ గ్రంథాలయాలు; వేటపాలెం సారస్వత నికేతనం, విజయవాడ రాజా రామమోహనరాయల లైబ్రరీ, రాజమండ్రి గౌతమీ గ్రంథాలయం, కరీంనగర్ జిల్లా కేంద్రగ్రంథాలయం, ఉస్మానియా విశ్వవిద్యాలయం లైబ్రరీ, సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఫర్ ఇంగ్లీషు అండ్ ఫారిన్ లాంగ్వేజెస్ హైదరాబాద్ వారి లైబ్రరీ, తెలుగు విశ్వవిద్యాలయం లైబ్రరీ, హైదరాబాద్ సిటీ సెంట్రల్ లైబ్రరీ, హైదరాబాద్ స్టేట్ సెంట్రల్ లైబ్రరీ, శ్రీ వేమనాంధ్ర గ్రంథాలయం హైదరాబాద్, శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయం హైదరాబాద్.

పై గ్రంథాలయాధికారులు - ముఖ్యంగా శ్రీ సుబ్రహ్మణ్యం (వేటపాలెం), శ్రీ సన్నిధానం శర్మ (రాజమండ్రి), శ్రీ వై. సత్యనారాయణ (ఉస్మానియా) శ్రీ ఎం. ఎల్. నరసింహారావు (ఆంధ్రభాషా నిలయం), శ్రీ పాండురంగం, శ్రీ నిరీక్షణ్‌బాబు (తెలుగు విశ్వవిద్యాలయం)గార్లు విషయ సేకరణలో తోడ్పడ్డారు.

ఎన్నో యాత్రాచరిత్రలను నా దృష్టికితెచ్చి స్వయంగా నాకు అందించి నా పరిశోధనా వ్యాసంగంలో మరువలేని ఉపకారం చేశారు యామిజాల ఆనంద్ (యామిజాల పద్మనాభస్వామి గారి కుమారుడు) గారు.

శ్రీమతి పోతం జానకమ్మ ఇంగ్లండుయాత్రను గురించి తెలిపినవారు ప్రముఖ పరిశోధకులు డా॥ ఆరుద్రగారు. దాదాపు మూడుగంటలపాటు మద్రాసులోని తమ స్వగృహంలో ఆంగ్ల యాత్రా చరిత్రల గురించి ఒక అవగాహన కలిగించారు మాలతీచందూర్ దంపతులు.

ఎప్పుడు వెళ్ళి సమాచారాన్ని అర్థించినా, సంప్రదాయాల చిక్కుముడుల ముందు బిక్కమొహం పెడితే సందేహాలు తీర్చినవారు శ్రీ జి. కృష్ణ (ప్రముఖ సీనియర్ పాత్రికేయులు), శ్రీ చీమకుర్తి శేషగిరిరావు (విజ్ఞాన సర్వస్వ సంధానకర్త) గార్లు.

అరుదుగా దొరికే చెళ్ళపిళ్ళవారి రచన 'కాశీయాత్ర'ను సంపాదించి పెట్టారు వై. రామకృష్ణారావుగారు. మూడు అజ్ఞాత యాత్రాచరిత్రల ఆచూకీ తెలపడమే కాక, వాటి సమీక్షా వ్యాసాల జిరాక్స్ కాపీలను కూడా పంపి ప్రోత్సహించారు శ్రీ ఘట్టమరాజు అశ్వత్థనారాయణ గారు. అప్పుడప్పుడు తమ అమూల్యమైన సలహాలనిచ్చారు డా॥ అక్కిరాజు రమాపతిరావు (మంజుశ్రీ) గారు. రచనా ప్రణాళికను గురించి తగు సూచన లిచ్చారు ఆచార్య చేకూరి రామారావు (చేరా) గారు. సంస్కృత సహాయం చేసినవారు శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు, శ్రీ చెలమచెర్ల వేంకట శేషాచార్యులు గార్లు.

ఇంతేకాక నా పరిశోధనా వ్యాసంగానికి వ్యక్తిగతంగా అండగా నిల్చి అనేక విధాలుగా తోడ్పడిన ప్రియమిత్రులు పి. సంగారెడ్డి, సత్యం సార్ (ఎం.ఏ. లో నా సహాధ్యాయులు), ఎస్. సూర్యనారాయణరావు (నిర్మల్ జూనియర్ కాలేజి లైబ్రేరియన్) గార్లు.

మద్రాసులో నేనున్న రోజుల్లో నాకు ఆశ్రయమిచ్చి ఆదుకున్నాడు ప్రియమిత్రుడు ప్రకాశ్. సమయానుకూలంగా థీసిస్‌ను టైపుచేసి సహకరించారు వెంకటేశ్వర్లుగారు, శ్రీమతి సుధగారు. సమాచారసేకరణలో నాకు

ఇతోధికంగా తోడ్పడ్డారు యాకూబ్, లక్ష్మి, వెలుదండ నిత్యానందరావులు (రిసెర్చి స్కాలర్లు).

నా కృషి ప్రయత్నాన్ని గురించి ప్రతిదినం అడుగుతూ ఉత్సాహాన్ని కలిగించిన 'ఉదయ' మిత్రులు - సర్వశ్రీ బసవరాజు, నారాయణరెడ్డి, రాజిరెడ్డి, నారాయణదాసు, బసవలింగప్పగార్లు. యోగాభ్యాసంలోని మెళుకువలు నేర్పి నాలాంటి జబ్బు మనిషి చేత ఈ సిద్ధాంత వ్యాసం వ్రాయించిన వీరి మేలు మరువరానిది.

రచనా పద్ధతి అంతగా తెలియని నన్ను ఓపికతో మలిచి, అత్యంత నిపుణంగా పర్యవేక్షించినవారు ఆచార్య ఎన్. గోపాల్ (ఎన్. గోపి) గారు.

సుప్రసిద్ధ చిత్రకారులు, ప్రముఖకవి శ్రీ శీలా వీర్రాజుగారు అందమైన ముఖచిత్రం వేసి ఇచ్చారు. ప్రత్యేకమైన శ్రద్ధతో అచ్చువేసినవారు పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీనివాస్‌గారు.

ఆశీరభినందనలిచ్చినవారు గురువుగారు డా॥ సి. నారాయణరెడ్డిగారు, చక్కని పీఠిక సంతరించిన ఆచార్య ఎన్. గోపిగారు.

అన్నిటిని మించి నా రచనా వ్యాసంగానికి అనుకూల వాతావరణం కల్పించడమే కాక, నాకు ఆశ్రయమిచ్చి ఆదరించిన అరుణక్క, గోపిల రుణం మరువరానిది.

ఇంకెందరో ఎన్నో విధాలుగా ఈ ఒంటరి యాత్రికునికి తోడుగా నిలిచారు, కలిసి నడిచారు. అందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఎం. హరిదాసు

# యాత్రా చరిత్రలు – స్వరూప స్వభావాలు

## 1. యాత్ర అంటే ఏమిటి?

యాత్ర అంటే ఏమిటో నిర్వచించేటందు 'యాత్ర' శబ్దానికి గల అర్థాన్ని పరిశీలించవలసి ఉంది. యాత్రకు 'యాన్తి అస్యామ్ ఇతి యాత్రా 'యా - ప్రాపణే' అని సంస్కృతంలో వ్యుత్పత్తి. ఇది అకారాంత స్త్రీలింగశబ్దం 'యా - ప్రాపణే' అంటే 'దీనియందు కదలిపోవుదురు' (గెలువ నిశ్చయించిన రాజు యొక్క పయనము) అని అర్థం.

శబ్దార్థ కల్పతరువులో 'గత్యాం, యాపనే, భోగాది వర్తనే' అనే అర్థాలు కనిపిస్తున్నాయి. అంటే క్రమంగా 'వెళ్ళుట, కాలం గడుపుట, భోగాలను అనుభవించుట' అనే అర్థాలలో యాత్రా శబ్దం వాడబడింది.

వెళ్ళటం అంటే దివ్యదేశాలకు పోవటం అనే అర్థం కూడ ఉంది. పొట్ట గడుపుకోవటానికి కూడా యాత్రా శబ్దాన్ని వాడడం ప్రాచీనకావ్యాల్లో కనిపిస్తున్నది. అదే దేహయాత్ర లేదా శరీరయాత్ర మొదలైనవి దేహయాత్ర అంటే జీవిక, జీవసాధనం, కాలం గడుపుట అని అర్థాలు తెలుగు కావ్యాల్లో కూడ ఈ అర్థం కనిపిస్తుంది.

'భిక్షమెత్తి పరితోషమునం భుజియించి **దేహయాత్ర** కుశలంబు గైకొనుట ధర్మము భిక్షునకున్.'[1]

భగవద్గీతకు వ్యాఖ్య వ్రాసిన నీలకంఠుడు శరీరయాత్రను దేహవ్యవహార మన్నాడు. ఈ పదం యాత్ర శబ్దానికి నానార్థాల్లో ఒకటి. అకర్మయందు ఆసక్తి కలవానికి దేహవ్యవహారం (శరీరయాత్ర) కూడ సాగదు.[2]

---

1. వెన్నెలకంటి సూరన 'విష్ణుపురాణము' - 4. 181
2. 'శరీరయాత్రాపి చ తేన ప్రసిద్ధ్యేదకర్మణః (భగవద్గీతా. 3-8) శరీర యాత్రా - దేహవ్యవహారః (నీలకంఠ వ్యాఖ్య)

యాపనం, గతి (వెళ్ళుట) అనే అర్థాల్లో కూడ యాత్రా శబ్దము వాడబడింది.[3] యాపనం అంటే కాలం గడుపుట. భాగవతంలో 'విధివశాత్తు లభ్యమైన దానితో తృప్తి చెందుతూ దేహయాత్రను గడుపుతున్నాడు' అనే అర్థంలో ఈ పదం ఉపయోగించబడింది.[4]

అమరకోశంలో యాత్రకు ప్రజ్య, అభినిర్యాణం, ప్రస్థానం, గమనం, గమః - అనికూడ అర్థాలు ఉన్నాయి.[5]

యాత్రకు కేవలం 'వెళ్ళుట' అనే అర్థమే కాక 'సేన వెడలుట, దాడి వెడలుట, తీర్థమునకు పోవుట' అని ప్రత్యేక గమనాన్ని సూచించే అర్థాలను కూడ నిఘంటువులు సూచిస్తున్నాయి.[6]

మనుస్మృతికాలంనాటికి యాత్ర అంటే 'జైత్రయాత్ర' అనే అర్థం. రాజు విజయం సాధించడానికి దీనియందు కదలిపోతాడు కాబట్టి ఇది యాత్ర అయింది. రాజైనవాడు శుభప్రదమైన మార్గశిరమాసంలో విజయయాత్రకు సైన్యంతో తరలిపోవాలి. యాత్ర అంటే విజయయాత్ర అనేది మనుస్మృతి అర్థం.[7] ఈ అర్థం అధునిక కాలంలో కనబడదు. అదే కాలక్రమాన 'తీర్థయాత్ర' అనే అర్థంలో విస్తరించింది. ఎందుకంటే, యాత్రికుడు అన్నమాటకు 'బాటసారి, మార్గస్థుడు' అనే సామాన్యార్థాలు కాక 'తీర్థవాసి, తీర్థయాత్రలు చేయువాడు' అనే

---

3. 'యాత్రా స్యాద్యాపనేగతౌ' (అమరకోశము— — నానార్థాలు. 175)
4. 'యాత్రా మాత్రం త్వహరహర్దైవా దుపనమంత్యుత' (భాగవతమ్. 10-86-15)
5. 'యాత్రా ప్రజ్యాఽభి నిర్యాణం ప్రస్థానం గమనం గమః' (అమర కోశము II - క్షత్ర విభాగము - 95)
6. శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు - ఆరవ సంపుటము.
7. 'మార్గశీర్షే శుభేమాసి యాయాద్యాత్రాం మహీపతిః' (మనుస్మృతి. 7-182) యాత్రయొక్క నానార్థాలలో జైత్రయాత్ర ఒకటి.

వాడుక కూడ ప్రచురంగా ఉన్నట్లు తోస్తున్నది.[8] ఐతే సామాన్యార్థంలో 'ఉత్సవము, జాతర, ప్రయాణము వెళ్ళుట' అనే అర్థాలు కూడ యాత్రకు కనిపిస్తున్నాయి.[9]

ఉత్సవానికి కొంత ఛాయాభేదంతో విస్తరింపు ఐనట్టి 'తీర్థయాత్ర' అనే అర్థం సరిగ్గా ఏ కాలంలో మొదలైందో కాని నేటికి వ్యవహారంలో కనిపిస్తున్నది. 'యాత్రకు వెళ్లొచ్చాము' అంటే తీర్థయాత్రలకు అనే అర్థం.

జీవన గమనాన్ని జీవయాత్రగా వ్యవహరించడం ఉంది. అందుకే నిర్యాణాన్ని 'జీవయాత్రను చాలించడం' గా పేర్కొంటారు.

యాత్రకు బదులుగా 'యానము, ప్రయాణము, పర్యటన' అనే మాటలు కూడ వాడటం కనిపిస్తున్నది. కాబట్టి యాత్రార్థ నిరూపణకు వీటిని కూడ పరిశీలించవలసి ఉన్నది.

'యానము' నకు శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువులో ఈ క్రింది అర్థాలు ఉన్నాయి: 1. గమనము, ప్రయాణము 2. శత్రువుల మీదికి వెళ్ళుట, దాడి వెడలుట (రాజతంత్రము నందలి ఆరు గుణములలో నొకటి) 3. వాహనము. (బండి, రథము, పల్లకి, అశ్వము, గజము).[10]

పై అర్థాల్లో 'యానము'ను కూడ 'దాడి వెడలుట' అనే అర్థంలో వాడినట్లు తెలుస్తున్నది. ఇదే అర్థాన్ని శబ్దార్థ కల్పతరువు 'రాజషాడ్గుణ్య భేద ప్రయాణే'

---

8. శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు - ఆరవ సంపుటము
9. 'యాత్రాముపవనే ద్రష్టుం జగామ సఖిభిః సహ' (కథాసరిత్సాగరః 10-87) 'రాజకుమారి తన చెలికత్తెలతో సహా ఉద్యానవనంలో యాత్రను (ఉత్సవం) తిలకించడానికి వెళ్ళింది' అని అర్థం.
10. శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు - ఆరవ సంపుటము.
యానము పంచవిధము : 1. సంధాన, 2. ప్రసంగ, 3. విగృహ్య 4. సంభూయ, 5. ఉపేక్ష్య యానములు.

అని పేర్కొన్నది. అంతేకాక, బ్రౌన్ వాహనార్థంలో 'A Vehicle or Conveyance' అనే అర్థాలిచ్చాడు.[11] తెలుగు నిఘంటువు కూడ ఇదే అర్థాన్ని సూచిస్తున్నది. 'యానపాత్రము = జనులెక్కిపోయెడి ఓడ'.

ఏనుగు లక్ష్మణకవి రచించిన జాహ్నవీ మాహాత్మ్యంలో 'యానం' వాహనమనే అర్థంలో వాడబడింది.

కం. కరితురగ రథ పదాతులు
ధరణీదేవునకు గంగ దరినిచ్చిన భూ
వరుడు రవిబింబ శతభా
సుర **యానము**లెక్కి తిరుగ సురలోకమునన్. (1-5-7)

'ప్రయాణము'నే మాటకు 'బయల్దేరటం' అనే అర్థాన్ని బ్రౌన్ సంగ్రహించాడు. 'ఎప్పుడు బయల్దేరతావు' అనే అర్థంలోని 'ప్రయాణం ఎప్పుడు?' అంటారు. కాబట్టి యాత్రా ప్రారంభానికి ప్రయాణమనే వాడుకను బ్రౌన్ నమోదు చేశాడు [12]

ప్రయాణమనే మాటకు 'తరలిపోవడమ'నే అర్థంకూడ బ్రౌన్ చూపాడు. 'ప్రస్థానభేరీ' అన్నప్పుడు 'గుంపు తరలివెళ్ళే ప్రారంభంలో మోగించే పెద్దభేరి' అన్న అర్థం పైదానికి ఉపబలకంగా ఉంది. ప్రయాణమంటే 'పయనము, ప్రస్థానము' అనే అర్థాలు కూడ కనిపిస్తున్నాయి.[13] అంతేకాక బయల్దేరడమనే సామాన్య గమనార్థంలో కూడ ఈ మాట క్రియారూపంలో వాడబడింది.

జైమినీ భారతంలోని ఈ కింది పద్యంలో ఈ రూపం కనపడుతుంది.

కం. అంచల బెస్తల వడికి జం
కించుచు బంగారు పల్లకీ యెక్కి **ప్రయా**
**ణిం**చు నెడం గాంతురు... (8-85)

---

11. 'వాహనసామాన్యే' - బ్రౌణ్య తెలుగు, ఇంగ్లీషు నిఘంటువు.
12, బ్రౌణ్య తెలుగు, ఇంగ్లీషు నిఘంటువు.
13. శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు - ఐదవ సంపుటము.

'పర్యటనము' కేవలం వెళ్ళివచ్చే యాత్రార్థంలోకాక 'దిమ్మరుట' అంటే 'పునః పునర్భ్రమణం' అనే అర్థంలో కనిపిస్తున్నది.[14] దీనికి ఉదాహరణగా నిఘంటుకారుడు ఎలకూచి బాలసరస్వతి రచించిన మల్లభూపాలీయంలోని ఓ పద్యాన్ని ఉదాహరించాడు.

మ................తత్త్వజ్ఞుడు
త్కుటరాజన్యుల పంచలంబడుచు నిస్త్రాణంపు సంసారప
**ర్యటనన్** గీడ్పడ జొచ్చునే.............

ఇవే కాక 'త్రోవ, ఉపాయము, సాధనము' అనే అర్థాలు కూడ ఉన్నట్లు ఈ నిఘంటువు సూచిస్తున్నది.

ఇంతవరకు మన సంప్రదాయం ప్రకారం యాత్రకు గల వివిధార్థాలు చూశాం. ఇప్పుడు పాశ్చాత్య అర్థాలను చూడవలసి ఉంది. ఎందుకంటే మనకు ప్రాచీన యాత్రలతోపాటు ఆధునిక యాత్రలు కూడా కనిపిస్తున్నాయి.

యాత్రకు సన్నిహితార్థంలో ఇంగ్లీషులో ట్రావెల్ (Travel) వాడబడుతున్నది. ఇంకా Travel కు దాదాపు పర్యాయ పదాలుగా Journey, Expedition, Voyage, Excursion, Trip, Tour అనే మాటలు కూడ కనిపిస్తున్నాయి. ఈ పదాల నైఘంటికార్థాలను జేరీజువేసి క్రింది విధంగా సమన్వయించవచ్చు.

ట్రావెల్ అనే మాటకు ఒక ప్రదేశం నుండి మరో ప్రదేశానికి ప్రయాణించడం అని అర్థముంది. దూరదేశాలకు లేదా అపరిచిత ప్రదేశాలకుచేసే ప్రయాణమన్నమాట.[15] ఈ నిర్వచనంలో ప్రయాణించడం అన్నారు కాని ప్రయాణించే

---

14. శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు - ఐదవ సంపుటము.
15. 'A Journey especially to a distant or unfamiliar ...............Webster's Third New International Dictionary of the Englith Language unabridged - 1668, Vol. III

పద్ధతిని చెప్పలేదు. ప్రయాణించడమంటే ప్రాచీన కాలంలో కాలినడకన వెళ్ళడం అనే అర్థం. ఆధునికకాలం వచ్చేసరికి కారు, రైలు, ఓడ, విమానం వంటి వాహనాల ద్వారా ప్రయాణించడమే ప్రయాణంగా వ్యవహరించబడుతున్నది. "To go from one place to another as by car, train, plane or ship."[16]

సంతోషం కోసం చేసే యానం ప్రయాణం. వ్యాపార ప్రతినిధిగా ఒక ప్రదేశం నుండి మరో ప్రదేశానికి తిరుగుతూ లోకమంతా చుట్టి ఇంటికి రావడ మన్నమాట। ట్రావెల్ అంటే దుఃఖము, శ్రమము, అనే అర్థాలుకూడ ఉన్నాయి. దీనివల్ల ప్రయాణం అంటే దుఃఖంతో, శ్రమతో కూడుకున్న యానం అని తెలుస్తున్నది[17] ఉదాహరణగా Travel to Benaras ఇచ్చాడు బ్రౌన్. ఆకాశంలో కాశీయాత్ర కష్టమైనదే కదా! టూర్ (Tour) అటే వరుసగా అనేక ప్రదేశాలను దర్శించే సుదీర్ఘ ప్రయాణం,[18] ఒక రౌండు కొట్టి రావడం. అంటే ఒక ప్రదేశాన్నుండి బయలుదేరి మళ్ళీ అదే ప్రదేశానికి రావడం. 'A Journey in which one returns to the starting point'[19] వ్యాపారార్థం కాని, ఉల్లాసం కొరకు కాని చేసే ప్రయాణాన్ని కూడ 'టూర్' అనే అంటారు. ఐతే దీనిలో పూర్వ ప్రణాళిక ప్రకారం నిర్ణయించిన కాలపరిమితిలో వెళ్ళి రావడం జరుగుతుంది. దేశసంచారం చేసే మత ప్రవక్తలు (బోధకులు), దేశ

---

16. The Random House Dictionary of the English Language - the unabridged Edition.
17. బ్రౌణ్య ఇంగ్లీషు, తెలుగు నిఘంటు.
18. "A Long Journey including the visiting of a number of places in sequence". The Random House Dictionary of the English Language - the Unabridged Edition.
19. Webster's third New International Dictionary of the English Language Unabridged - 1768. Vol. III.

ద్రిమ్మరులైన భాగవత వేషగాండ్లు ఈ విధంగా ఒక ప్రణాళిక ప్రకారం సంచరిస్తారు.[20]

ప్రయాణం అంటే ఒకప్పుడు యువతకు సంఘంలో హోదాను, గుర్తింపును కల్పించుకోవటానికి చేసేదిగా ఉండేది. ఇరవయ్యవ శతాబ్దం ప్రారంభంలో భారతదేశం నుండి చాలమంది బారిష్టర్ చదువుకోసం లండన్‌కు ఇందుకోసమే వెళ్లేవారు.

Trip అంటే Journey లో ఒక దశ, ఒక భాగం. 'A stage of a Journey' (Webster-Vol III). ఒకప్పుడు ఇంగ్లండునుండి ఫ్రాన్సుకి వెళ్ళిరావడం ట్రిప్పుగా భావింపబడేది. "Tripped frequently to France to ... Visit troops - S.L.A. Marshall." దగ్గరి ప్రాంతానికి వెళ్ళి రావడమన్నమాట. "A relatively short run of a Vechicle usually between two points or to a point and return."[22]

ఒక నిర్దిష్ట లక్ష్యంతో వెళ్ళి స్వల్పవ్యవధిలో తిరిగి వచ్చే చిన్న ప్రయాణాన్ని Excursion అంటారు. ఇది వినోద విజ్ఞాన యాత్ర. "A short jonrney or triy to some point for a special pur-

---

20. 'A circular trip usually for business, pleasure or education during which various places are visited and for which an itinerary is often planned'.- Webster's Third New International Dictionary of the English Language Unabridged - 1768 Vol. III.
21. Webster's third New Internntional Dictionary of the English Language unabridged - 1768. Vol. III.
22. Ibid.

pose, with the intention of a prompt return : a pleasure excursion, a scientific excursion."[23]

Tourతో పాటు Jaunt, Junket అనే పదాలు కూడా Excursion లుగా వాడబడుతున్నాయి. ఇవన్నీ వినోదయాత్రకు ఉద్దేశించినవి. సాధారణంగా ఒకరోజు వ్యవధిలో ముగించే ప్రయాణం. వీటిల్లో ఒకేవ్యక్తి కాకుండా గుంపుగా జనం వెళ్ళి వస్తారు. అనేక సందర్భాల్లో కన్సెషన్ రేట్లతో ఈ యాత్రలు ఏర్పాటు చేయబడతాయి. "An excursion is a short trip, often no more than a day's outing, made usually by a number of people, as a result of special inducements : an excursion at reduced rates."[24]

Webster's Dictionary 'Journey' అనే పదానికి 'దండయాత్ర' అర్థం సూచిస్తున్నది.[25] రాజులకాలంలో ఈ వాడుక ఉండి ఉంటుంది. ఆధునిక కాలంలో ఇంటినుండి బయలుదేరి ఎండాకాలం హాయిగా గడపడానికి సుదూర ప్రాంతాలకు తరలి వెళ్ళటాన్నికూడా Journey అంటారని అదే నిఘంటువు మరో అర్థంలో పేర్కొన్నది. "To go on a journey spent the summar journeying : go from home to a distant place."

అంతేకాదు, నిధుల అన్వేషణలో ఒకచోటినుండి మరో చోటికి తిరగటాన్ని కూడా Journey అనేవారట! "Journey from one place to another in search of treasure."

---

23. The Random House Dictionary of the English Language.

24. Ibid.

25. vo. II "A military expedition : SIEGE. CAMPAIGN."

ఇక Voyage ఆకాశయానాన్ని ముఖ్యంగా సముద్రయానాన్ని Voyage అంటారు. Webster's Dictionary ఒకచోట ఈ పదానికి 'a journey by water', 'a journey throuth air or space' అని పేర్కొంటూనే తర్వాత 'an account of journey especially of an exploratory trip by sea' అని తెలిపింది. అంటే ఖండాలను అన్వేషిస్తూనో, నూతన ప్రదేశాలను కనుగొనాలన్న ఆసక్తితోనో చేసే సాహసోపేతమైన మార్గాన్వేషణాయాత్రాలను- ముఖ్యంగా ఓడలపై చేసే యాత్రలను Voyage అనేవారు.

మన సంప్రదాయంలో ఉన్న క్షేత్రయాత్ర, తీర్థయాత్ర, దేహయాత్రలే కాక పాశ్చాత్య నిఘంటువులను పరిశీలిస్తే బయటపడిన అర్థాలు నేటి మన అధునికార్థాలకు సన్నిహితంగా ఉన్నాయి. ఆధునిక కాలంలో వ్యాపార ప్రయాణాలు ఎక్కువ. కాబట్టి సుదూర ప్రాంతాలకు చేసే వ్యాపార యాత్రలను కూడా నేడు యాత్రలుగానే పరిగణిస్తున్నారు. విజ్ఞానతృష్ణతో, జిజ్ఞాసతో చేసే యాత్రలు ఆధునికకాలంలో 'యాత్ర' అనే మాటకు సామాన్యార్థాలుగా స్థిరపడ్డాయి. పాశ్చాత్యుల దృష్టిలో యాత్ర అంటే తీర్థయాత్రకాదు, ఉల్లాసయాత్ర, వినోద విహారయాత్ర. మనకు లేని మరో అర్థం ఉల్లాసం కోసం చేసే యాత్ర.

## 2. యాత్రకు ప్రేరణ :

యాత్రలు ఎందుకు చేస్తారు? ప్రేరణ ఏమిటి? యాత్రల లక్ష్యం ఏమిటి?

యాత్ర అంటే ప్రతి మానవునికి సహజమైన ఆసక్తి ఉంటుంది. యాత్ర ఏ రకమైనదైనా, దాని ఉద్దేశం ఏదైనా అది మనస్సును విశేషంగా ఆకర్షిస్తుంది. యాత్రలు చేయడమే కాకుండా ఇతరుల యాత్రావృత్తాంతాలను తెలుసుకోవడం పట్ల కూడ మానవునికి ఆసక్తి ఉంటుంది. ఇటువంటి మానవ స్వభావాన్ని అల్లసాని పెద్దన మనుచరిత్ర ప్రబంధం ప్రారంభంలో చక్కగా వివరించాడు. ప్రవరుడు తీర్థసంవాసు లేతెంచినారని వినగానే ఎంతదూరమైనా ఎదురువెళ్ళి, వారిని సాదరంగా ఇంటికి తీసుకువచ్చి ఇష్ట మృష్టాన్నాలతో సంతృప్తిపరచి, సమీపంలో కూర్చొని—

"ఏయే దేశములన్ చరించితిరి, మీరేయే గిరుల్ చూచినా
రేయే తీర్థములందు గ్రుంకిడితి రేయే ద్వీపముల్ మెట్టినా
రేయే పుణ్యవనాళి ద్రిమ్మరితి రేయే తోయధుల్ డాసినా
రాయా చోటులగల్గు వింతలు మహాత్మా! నాకెఱింగింపరే"
(మనుచరిత్ర 1-68)

అని అర్థించేవాడు.[26]

వ్యవహారంలో యాత్ర అంటే ఒకచోటినుండి మరోచోటికి వెళ్ళే క్రియా విశేషం. ఎక్కడికైనా పోవటానికి వెళ్ళటం, లేదా బయలుదేరటం అనే క్రియ మొదలు కావాలి కదా!

యాత్ర మానవునంత పురాతనమైనది. మానవుడు నడకనేర్చుకున్న మరుక్షణం నుంచీ కోట్లాదిసంవత్సరాలుగా ఇప్పటిదాకా యాత్ర చేస్తూనే ఉన్నాడు. నాగరికత తెలియని ఆదిమకాలాల్లో మానవుడు ఆహారసంపాదనకై నిత్యం పరిభ్రమిస్తూ ఉండేవాడు. సంచార జీవనం సాగిస్తూ ఆహారాన్వేషణలో అనేక నూతన స్థలాలకు ప్రయాణించేవాడు. ఈ ప్రయత్నంలోనే మానవునికి యాత్రతో అవిచ్ఛిన్న సంబంధం ఏర్పడి ఉంటుంది.

వ్యవసాయం, పశుపోషణ వృత్తిగా ఏర్పడిన పిదప ఆహారం కోసం తిరిగే అవసరం తీరిపోయింది. మానవుడు స్థిరపడ్డాడు. వలస జీవితానికి స్వస్తి చెప్పి పల్లెలు, పట్టణాలు నిర్మించుకున్నాడు. మనోగతమైన నైపుణ్యాలను వెలికి రప్పించుకున్నాడు. నాగరికతా పరిణామదశలో మానవ సహజమైన జిజ్ఞాసతో, విజ్ఞాన తృష్ణతో సుదూరతీరాల్లో ఉన్న విద్యాకేంద్రాలకు తరలి వెళ్ళాడు. విజ్ఞాన సముపార్జనకు ఆయా ప్రాంతాలను దర్శించి, అక్కడి ప్రజల ఆచార వ్యవహారాలను ఆకళింపు చేసుకున్నాడు. వినోదంకోసం, విలాసార్థం కుటుంబ సభ్యులతో, నచ్చిన మిత్రులతో చిన్నా పెద్ద యాత్రలు చేశాడు.

---

26. మనుచరిత్రము (స్వారోచిష మనుసంభవము) - అల్లసాని పెద్దన — వ్యాఖ్యాత: వెంపరాల సూర్యనారాయణశాస్త్రి వేంకట్రామ అండ్ కో. 1968.

ప్రాచీన కాలంలో పారమార్థిక చింతనతో భవబంధాలను త్యజించి ఏ దుర్గమారణ్యాల్లోకో, హిమాలయాల్లోకో వెళ్ళిన మహనీయులున్నారు. మరి కొందరు స్వమతోద్ధరణకు నడుంబిగించి దేశం నలుమూలలా తిరుగుతూ, ప్రజల అజ్ఞానాన్ని నివృత్తి చేస్తూ ఆధ్యాత్మిక యాత్రలు చేశారు.

శ్రీనాథుని వంటి ఉద్దండ కవి పండితులు విద్యాస్పర్థతో రాజాస్థానాలను సందర్శించేవారు. అక్కడి పండితులతో శాస్త్రవాదాల్లో పాల్గొని వారిని ఓడించి ముందుకు సాగిపోయేవారు. వీటిని సాహిత్య జైత్రయాత్రలుగా పేర్కొనవచ్చు. ఇంకొందరు పండితులు రాజాస్థానాలను దర్శించి, తమ కుటుంబ పోషణకై వర్షాశనాలు స్వీకరించేవారు. నాటక సంస్థలు, సర్కస్ కంపెనీలు చిన్న పల్లె కదలినట్లుగా ఒక ఊరినుండి మరో ఊరికి భుక్తికోసం తరలి వెళ్ళటం చూస్తూనే ఉన్నాం.

ఉన్న చోటనే కూపకూర్మంలా పడిఉండటం కొందరికి నచ్చదు. నలుగురు మెచ్చేట్లుగా, పదుగురికి ఉపయోగపడే పనులు తలపెట్టాలని భావిస్తారు. కొత్త మార్గాలను అన్వేషిస్తూనో లేదా నూతన ప్రదేశాలను కనుగొనాలన్న జిజ్ఞాసతో వ్యయప్రయాసలకోర్చి సాహస యాత్రలకు పూనుకుంటారు. ఒకరిని మించి మరొకరు పోటీ పడుతూ అనితర సాధ్యంగా, అపూర్వంగా, సాహసమే ఊపిరిగా యాత్రలు చేసేవారు ఏ కాలంలోనైనా కొందరుంటారు. గిన్నిస్‌బుక్ రికార్డులను బద్దలు కొట్టాలన్నదే వీరి ప్రధానాశయం. అదే వీరికి ప్రేరణ కూడ. సైకిళ్ళపై ప్రపంచ యాత్ర, "విండ్ సర్ఫింగ్"లో విచిత్ర విన్యాసం, స్కైస్కూటర్ యాత్ర, బెలూన్‌పై గగన విహారం, జాగింగ్ చేస్తూ దేశాలను చుట్టి వచ్చే అద్భుత యాత్ర, కాణీ లేకుండా కాలినడకన ప్రపంచ యాత్ర - ఇవన్నీ మానవుడు తన ప్రత్యేక వ్యక్తిత్వాన్ని చాటుకోవటానికి చేసే సాహస యాత్రలు.

'ఇచ్చిపుచ్చుకుంటే వ్యవహారం, వచ్చిపోతుంటే బంధుత్వం' అంటారు. వేరే గ్రామాల్లో ఉండే చుట్టాలను తరచుగా చూట్టానికి మనంచేసే చిన్న యాత్రలే రెండు కుటుంబాల మధ్య స్నేహసంబంధాలనీ, బంధుత్వాన్నీ బలపరుస్తాయి. అట్లాగే ఇరుదేశాల మధ్య సంబంధం గట్టి పడాలంటే దేశనాయకులు స్నేహ యాత్రలు, సుహృద్భావ పర్యటనలు జరపవలసి ఉంటుంది.

ఒక్కోసారి పొరుగుదేశంలో జరిగే అభివృద్ధిని పరిశీలించి మనదేశంలో కూడ ఆ పథకాల అమలుకు పరిశీలక బృందాలను పంపవలసి వస్తుంది. ఈ రక మైన యాత్రలను పరిశీలక యాత్రలంటారు.

ఆరోగ్యం కుదుటపడటానికి ఒకోసారి డాక్టర్లు గాలిమార్పు అవసరమని సూచిస్తుంటారు. బెంగుళూరు, ఊటీలాంటి ప్రశాంతమైన, ఆరోగ్యకరమైన ప్రాకృతిక ప్రదేశాలకు విశ్రాంతి కోసం యాత్రలు చేసే వారుంటారు. కుటుంబ కలతల వల్ల కూడ కొంతమంది చిత్తశాంతి కోసం తీర్థయాత్రలకు వెళ్ళటం పూర్వం నుండి వస్తున్న ఆచారమే. సంతానాపేక్షతో కొందరు, కలిగిన సంతానం నష్ట మౌతుంటే శాంతి చేయించటం కోసం కొందరు భగవద్దర్శనానికై తీర్థయాత్రలు చేస్తారు. పుణ్యనదీ జలాల్లో మునగటం వల్ల సమస్త పాపాలు తొలిగిపోతాయన్న విశ్వాసంతో యాత్రలు చేస్తుంటారు.

ఋతువుల పరివర్తనం, దేశాల ప్రాంతాల విభిన్న స్వరూపాలు, ప్రకృతి లోని విభిన్నతలు, సౌందర్య వైచిత్రి, జనుల ఆచార వ్యవహారాలు మొదలైనవి మానవునికి ఎనలేని ఆనందాన్ని, కుతూహలాన్ని కలిగిస్తాయి. సౌందర్య దృష్టి నుండి పొందిన ప్రేరణ అతని యాత్రా ప్రవృత్తికి దోహదం చేస్తుంది.

ఈ విధంగా ప్రేరక శక్తులతో ప్రభావితమైన యాత్ర ప్రయోజనవంత మవుతుంది.

## 3. యాత్రా ప్రయోజనం:

సాధారణ దృష్టితో చూసినట్లైతే యాత్రల వల్ల రెండు ప్రయోజనాలున్నాయి. ఒకటి అనంతానంత ముఖాలుగా విలసిల్లే విచిత్రసృష్టి సందర్శనం, రెండు హృదయ వైశాల్యం.

ప్రతి ప్రాంతంలోని ఆచార వ్యవహారాలు, భాష, పంటలు మొదలైనవి పరస్పర భిన్నాలుగా ఉండటం వల్ల యాత్రికునికి ప్రపంచ జ్ఞానం అలవడుతుంది. యాత్రల వల్ల మలవడేటంత లోకజ్ఞానం మరి దేనివలన వృద్ధి కాదు. యాత్ర లవి పండితులకు రచనోత్సాహాన్ని కలిగించగా పామరులకు తెలివిని పెంపొం

దిస్తుంది. సాంఘిక, చారిత్రక, భౌగోళిక, ధార్మిక విషయ విజ్ఞానంతో పాటు వివిధ తీర్థక్షేత్ర సందర్శనం వల్ల సమస్త పాపాలు తొలగిపోతాయి. ఈశ్వర మాహాత్మ్యం కన్నులకు కట్టినట్లే వెంటనే తన అల్పత్వం కూడా తెలిసివస్తుంది. అహంకారం తొలగి, స్థిరమైన సాత్త్వికభావం హృదయంలో చోటుచేసుకుంటుంది. మనిషి బాగుపడాలంటే అహంకారం తొలగిపోవాలి. అందుకే చింతాదీక్షితులు గారు 'సుందర భారత యాత్ర'కు వ్రాసిన అభిప్రాయంలో "యాత్రలను అహంకారము తగ్గించే ప్రబల సాధనములు" గా పేర్కొన్నారు.[27] యాత్ర వల్ల భగవంతుని సేవించాలనే అభిలాష ఎక్కువౌతుంది. పుణ్య కార్యాలను ఆచరించటంలో ఆసక్తి పెంపొందుతుంది.

ప్రయాణం వల్ల గ్రంథపఠనం ద్వారా తెలుసుకున్న విషయాలను ప్రత్యక్షంగా చూసి అనుభూతి పొందుతారు. "వేయిమాటలు వినడం కన్నా ఒక వాక్యం చదవడం మేలు, వేయి వాక్యాలు చదవడం కన్నా ఒకసారి చూడడం మంచిది" అనేది లోక నిరూఢి. పరోక్షానుభూతి కంటే ప్రత్యక్షానుభూతి శ్రేష్ఠమైంది. స్వయంగా తెలుసుకోవడం వల్ల స్వతంత్రభావాలు ఏర్పడతాయి. చెప్పుడు మాటలకు చెవి ఒగ్గడం అస్వతంత్రతా లక్షణం.

ఆయా క్షేత్రాల్లో ఉన్న అద్భుత శిల్పాలంకృతమైన దేవాలయాలను సందర్శించినప్పుడు మనలో మరుగునబడిన సౌందర్యానుభూతి మళ్ళీ చిగురు తొడుగుతుంది.

ప్రశాంతమైన నదీతీరాల్లో కంటి కింపైన పర్వత సానువుల్లో సంచరిస్తున్నప్పుడు మనసు ప్రశాంతంగా ఉంటుంది. కాళిదాసు వింధ్య, హిమాలయాల్లో పర్యటించి 'మేఘ సందేశం' అనే గొప్ప సంస్కృత కావ్యాన్ని లోకాని కందించాడని ప్రతీతి. శ్రీనాథుడు శ్రీశైలాన్ని దర్శించి 'శివరాత్రి మహాత్మ్యాన్ని' రచించాడు. ఈ విధంగా యాత్రానుభూతి మనః పరిణామానికి తోడ్పడి, మహాకావ్య నిర్మాణానికి దోహదం చేస్తుంది.

---

27. సుందర భారత యాత్ర 1, బుఱ్ఱాసు సుందర ప్రకాశశాస్త్రి. పేజీ. 45 మన్మథ శ్రావణము. సాధన గ్రంథమండలి, తెనాలి.

దేశీయుల్లో దేశభక్తి భావాన్ని పెంపొందించడానికి యాత్రలు తోడ్పడ తాయి. ధనాభావం చేత పరదేశాలకు వెళ్ళే వీలు లేకుంటే కనీసం స్వదేశాన్నై యినా విద్యావంతులు తప్పనిసరిగా పర్యటించాలి. దేశాటనం వల్ల మానస దిశా వలయం విశాలమౌతుందనేది నగ్నసత్యం.

దేశదేశాలు తిరగటం వల్ల ఇతర ప్రజం ప్రవృత్తి సంగతి ఎలా వున్నా మన ప్రవృత్తే మనకు అవగతమవుతుంది. సాటి మానవుల ఆచార వ్యవహా రాలపై సానుభూతి ఏర్పడుతుంది. నలుగురితో కలిసి జీవించే సమాన సౌశీల్యం అలవడుతుంది.

తీర్థయాత్ర పరమావధి ఆత్మ సాక్షాత్కారం. దీనికవసరమయ్యే ఇంద్రియ నిగ్రహం, ఆహార నియమాదులు తీర్థయాత్రానుభవం వల్లనే పొంద గలుగుతారు. పదిమందితో కలిసి ప్రయాణించడం, కలిసి భుజించడం వల్ల యాత్రికుడు ఆయా సందర్భాల్లో తన భౌతిక స్థాయిని, అధికారాన్నీ, సంపన్న తనూ మరచి కలసి మెలసి జీవిస్తాడు.

భగవంతుడిచ్చిన బుద్ధితో మానవుడు ఈ సంసారసాగరాన్ని తరించ డానికి ముఖ్యమైన మార్గాలు - భక్తి, జ్ఞాన, కర్మ యోగాలు. వీటన్నిటికీ ముఖ్య సాధనం చిత్తశుద్ధి. ఈ చిత్తశుద్దికి తీర్థయాత్రలు కారణమవుతాయి.

తిండిగింజలకే కటకటలాడేవాడు తీర్థయాత్రలెట్లా చేయగలడు? ఇట్లాంటి వారి కొరకే తీర్థ మాహాత్మ్యాలను విశదంగా వర్ణించే గ్రంథాలున్నాయి. పోయి సేవించలేనివారు పుణ్యతీర్థాల మహిమను విన్నా అంతే పుణ్యం సంపాదిస్తారనేది విశ్వాసం. ప్రత్యక్షంగా సందర్శించిన అనుభూతిని కూడ వారు పొందుతారు.

"పోయి సేవింపలేకున్న పుణ్యతీర్థ
మహిమ వినుటయు నఖిల కల్మష హరంబు..."

(మనుచరిత్ర - 1-69)

## 4. యాత్రికుని లక్షణాలు :

సంచారశీలం, గత్యాత్మకత యాత్ర యొక్క మౌలిక లక్షణాలు. యాత్ర యొక్క క్షేత్రావరణ సమస్త విశ్వం.

సాహిత్యకుడు చేసే యాత్ర సమ్మోహకంగా ఉంటుంది. సాహిత్యకుడు దేన్ని చూసినా మంత్రముగ్ధుడయ్యేంత సుకుమార ప్రవృత్తిని కలిగి ఉంటాడు. సామాన్యులకు ఈ గొడవలేవీ పట్టవు. సామాన్యులు ఎన్ని ప్రదేశాలు దర్శించినా వాటి బాహ్య దూర భారాలనే గ్రహిస్తారు కాని సాహిత్యకుల్లాగా ప్రతిస్పందించ లేరు. వివృతమైన హృదయంతో ప్రతిదాన్ని పరిశీలిస్తారు కాబట్టి, సాహిత్యకులు పరిభ్రమణంలో యాత్రా పరిపూర్ణ సాఫల్యం పొందుతారు. స్థాయిలోనేకాక సాహిత్యకులకు, ఇతరులకు మౌలికంగా దృష్టికోణంలో కూడా తేడా ఉంటుంది. సామాన్య యాత్రికుడు కేవల భ్రమణమాత్రుడై, దాన్నే సంపూర్ణ యాత్రగా భావిస్తాడు. కాని సాహిత్యకుడు ఆ యాత్రను అంతరంగికంగా అనుభవించి, దానిని ఒక క్రమపద్ధతితో లేఖనబద్ధం చేసి ప్రజలకందిస్తాడు. అది లోతుగా అనుభవించింది కావటం వల్ల సుదీర్ఘమైన సార్థకమైన జీవయాత్రగా మిగుల్తుంది.

ప్రపంచంలోని ప్రసిద్ధ యాత్రికులను పరిశీలించినప్పుడు వాళ్ళు చారిత్ర కులో, సాహిత్యకులో, జిజ్ఞాసువులో అయి ఉంటారు. అట్లాంటివారు నిస్వార్థంగా లోక కళ్యాణార్థం పర్యటనలు చేస్తారు. ప్రాచీన కాలంలోని ప్రసిద్ధ యాత్రికు లందరిలో ఈ విశిష్ట గుణం కనిపిస్తుంది. వీళ్ళందరూ విభిన్న లక్ష్యాలతో యాత్రలు చేసినప్పటికీ, అందరిలోను మౌలికంగా ఒక సామాన్య గుణం కని పిస్తుంది. దానిని యాత్రాభిరతి అందాం. అంతేకాకుండా, వారు తమ యాత్రా విశేషాలు, అనుభవాలను లోకానికందించి యాత్రలను సార్థకం చేసుకున్నారు.

యాత్ర చేసిన ప్రతి వ్యక్తీ యాత్రికుడనిపించుకోడు. యాత్ర అనేది ఒక అనుభవం. ఆ అనుభవం ఇప్పటివారికి నడుస్తున్న చరిత్ర. భవిష్యత్తరాలకు గత చరిత్ర. యాత్ర చేయడంవల్ల వ్యక్తి జీవితానికి పరిపూర్ణత కలుగుతుంది. అటువంటివాని యాత్ర ఒకచోట ఆగేదికాదు. అది నిరంతర స్రవంతి. దాన్ని అభివ్యక్తం చేసేవాడే యాత్రా చరిత్రకారు డవుతాడు. యాత్రల వల్ల

తరువాతి వారికి ప్రేరణ లభించడమే కాక యాత్రాకాలంనాటి సామాజిక, రాజకీయ, ధార్మిక, సాంస్కృతిక పరిస్థితులు అవగతమౌతాయి. ప్రాచీన యాత్ర లన్నీ దాదాపుగా ఈ దృష్టితో జరిగినవే

భారతదేశంలో కూడ ఇట్లాంటి యాత్రికుల సంఖ్యకు కొదువలేదు. చైనా, బర్మా, టిబెట్, మలయా, థాయ్‌లాండ్ మరియు సుదూరద్వీపాల్లో భారతీయ ధార్మికసందేశాలు - ముఖ్యంగా బౌద్ధమత ధర్మసందేశాలు - ఈ యాత్రల వల్లనే సుసాధ్యమైనాయి.

## 5. యాత్రల వర్గీకరణ :

యాత్రలు ఎవరు చేస్తున్నారు? అంటే ఏ స్థాయివారు చేస్తున్నారు? అన్నది ఎంత ప్రధానమో, ఏ రకంగా యాత్ర జరిగిందీ అన్నది కూడ యాత్ర యొక్క సాఫల్య సార్థకతలకు అంతే ప్రధానం. ఏ యాత్రకైనా అనుభవం, అనుభూతి ముఖ్యం. ప్రాచీన కాలంలో ఎటువంటి ప్రయాణానికైనా ఎంత దూర మైనా కాలినడకే శరణ్యం కదా! అట్లాంటప్పుడు మనిషియొక్క వేగ పరిమితిలో పరిశీలన గాఢత, అనుభవ తీవ్రత ఎక్కువగా ఉండటానికి అవకాశముంటుంది. యాంత్రిక వాహనయుగం వచ్చి, వేగం పెరిగిన తర్వాత ఏర్పడ్డ పరిస్థితి వేరు. ఈ ప్రయాణంలో అనుభూతీ, ప్రపంచానికి చెప్పదగిన వినూత్న విషయాలూ లేవనలేముకాని దీని పద్ధతి వేరు. మొత్తంమీద దేని విశిష్టత దానిదే ఐనప్పటికీ, మానవ జీవన యాత్రా పరిణామంలో వేగం సాధించడం ఒక విశిష్ట క్రమపరి ణామంగా భావించవచ్చు. పక్కఊరినుంచి సమీప గృహందాకా, వందలాది మైళ్ళు కాలినడక నుండి కోట్లాదిమైళ్ళ రోదసీ యాత్రదాకా మనిషి సాధించిన ప్రగతి అంతరికమూ, బాహ్యమూ కూడ. సుదీర్ఘమైన, వైవిధ్యభరితమైన మానవ యాత్రలను సౌలభ్యం కోసం కొన్ని విభాగాలుగా వర్గీకరించుకోవచ్చు. ఈ విభజన సౌకర్యం కోసం చేసుకున్నదే కాని, గిరి గీసినట్లు ఒకదానినుండి మరో దాన్ని వేరుచేయలేం. ఎందుకంటే, ఒక యాత్రకు అనేక ప్రయోజనాలుండ వచ్చు. ఇక్కడ కొన్ని రకాల యాత్రల స్థూల పరిచయం ఇవ్వబడింది.

లక్ష్యాన్నిబట్టి, గమన విధానాన్నిబట్టి, విషయాన్ని (సమాచారం) బట్టి, కాలక్రమాన్నిబట్టి యాత్రలను నాలుగు ప్రధాన విభజనలు చేయవచ్చు.

## (అ) లక్ష్యాన్నిబట్టి యాత్రల వర్గీకరణ :

మొదట లక్ష్యాన్ని ఆధారం చేసుకున్న వర్గీకరణను పరిశీలించవలసి ఉంది.

అవి:-

i) ధర్మ ప్రచార యాత్రలు.
ii) తీర్థయాత్రలు.
iii) వ్యాపార యాత్రలు.
iv) అన్వేషణ లేదా పరిశోధక యాత్రలు.
v) సాహస యాత్రలు.
vi) విజ్ఞాన, వినోద, విహార యాత్రలు.
vii) సాహితీ, సాంస్కృతిక యాత్రలు.
viii) పరిశీలక యాత్రలు.
ix) కిసాన్ యాత్రలు.

ఇంకా సూక్ష్మంగా వెళ్ళి మరిన్ని ఉప విభజనలు చేయవచ్చు కాని అవి వీటిలో ఏదో ఒకదానితో గతార్థమౌతాయి.

### (i) ధర్మ ప్రచార యాత్రలు :-

ప్రాచీన కాలంలో తత్త్వజిజ్ఞాసతో, బ్రహ్మజ్ఞానాన్వేషణలో ఎందరో తాత్త్వికులు, యోగులు యాత్రలు చేసినట్లు వింటూ ఉంటాం. పౌరాణిక జానపద గాథల్లో తపస్సు చేసుకోవటానికి వింధ్య పర్వతాల్లోకో, హిమాలయాల్లోకో వెళ్ళే వారు. తత్త్వాన్వేషణా పరులైన వారి యాత్రా విశేషాలు ఐతిహ్యాలుగానే మిగిలి పోయాయి కాని చరిత్ర పుటల కెక్కలేదు. పురాణేతిహాసాల్లో వాటికి ఆనవాళ్ళు లభిస్తాయి. వీరి యాత్రల్లో ఆంతరిక సాధన దశలూ, బాహ్య భౌతిక పరిసరాల స్థితిగతులూ, మహిమలూ, కలగలసి ఉండి చర్మచక్షు దృష్టికి అనుభవ ఆగ

ఈ తీర్థయాత్ర వల్ల తన పూర్వజన్మ పాపాలన్నీ తొలగిపోయాయని అర్జునుడు శ్రీ కృష్ణునితో ఇట్లా అన్నాడు:

"ద్వాదశ మాసిక వ్రతము ధర్మవిధిం జలుపంగనేగి గం
గాది మహానదీ హిమవదాది మహాగిరి దర్శనంబు మీ
పాదపయోజదర్శనము బన్నుగ జేయుట జేసి పూర్వసం
పాదిత సర్వపాపములు బాసె భృశంబుగ నాకు నచ్యుతా!"42

తర్వాత వనవాసంలో మిగతా పాండవులు కూడ తీర్థయాత్రలు చేశారు.

భాగవతంలో బలరామ విదురులు కూడ ఆయా సందర్భాల్లో తీర్థయాత్రలు చేశారు. కారణం వేరైనా అర్జునుని వలెనే బలరాముడు కూడ ద్వాదశ మాసిక వ్రతాన్ని స్వీకరించి తీర్థయాత్రకు పూనుకున్నాడు.

మహాభారత యుద్ధ సన్నాహాలు మొదలయ్యాయి. బలసమీకరణ జరుగుతున్నది. ఈ సమయంలో ఏ పక్షాన్ని సమర్థించకుండా బలరాముడు తీర్థయాత్రా నెపంతో దేశాటనానికి బయలుదేరాడు

"కౌరవ పాండవ పృథు సమ
రారంభమెఱింగి తీర్థయాత్ర నెపమునన్
సీరాంకుడుభయ కులులకు
నారయ సముడగుట జేసి యరిగె నరేంద్ర." 43

ద్వారకకు సమీపంలోని ప్రభాసతీర్థంనుండి బయలుదేరి, గంగా, యమునా, సరస్వతీనదులలో మునిగి, దేవర్షి పితృతర్పణాలు వదిలాడు. తర్వాత నైమిశారణ్యం చేరుకున్నాడు. నైమిశారణ్యంలో బలరాముని రాకను గమనించి మునులంతా ప్రత్యుత్థానం చేశారు. కాని సూతుడు మాత్రం నిలబడలేదు. బలరాముడు కోపించి వానిని సంహరించాడు. తర్వాత బ్రహ్మహత్యా

---

42. శ్రీమదాంధ్ర మహాభారతము - ఆదిపర్వం. 8 - 169
43 శ్రీ మహా భాగవతము - పోతన - దశమస్కంధము - 92½.

పాతకం నుండి బయటపడే మార్గంలో భాగంగా మునుల సలహాపై మళ్ళీ వాన్ని బ్రతికించారు. ఐనా మనశ్శాంతి కలగలేదు. పాపపరిహారం కోసం అక్కడి నుండి కదలి "భారత వర్షమునం గల తీర్థంబులు ద్వాదశ మాసంబులు అవగాహనంబు" చేయుటకై బయలుదేరి, దక్షిణ సముద్రం వరకుగల సుప్రసిద్ధ తీర్థాలను, క్షేత్రాలను దర్శించాడు.

బలరాముని తీర్థయాత్ర మళ్ళీ ప్రభాస తీర్థాన్ని సేవించటంతో ముగుస్తుంది.

పాండవ పక్షాన రాయబారిగా వచ్చిన శ్రీకృష్ణుని ధర్మబోధ దుర్యోధనుని చెవికెక్కలేదు. అప్పుడు కృష్ణుడు నీతి కోవిదుడైన విదురుని పిలిపించాడు. సభాస్థలికి వచ్చిన విదురుడు, ధృతరాష్ట్రునితో 'సుయోధనుని మాటలు పట్టించుకోకు, ఎవరి పాలు వారికి పంచియిచ్చి రాజ్యాన్ని నిలుపు' మన్నాడు. దుర్యోధనుడది విని రోషంతో ఇట్లా అన్నాడు :

"దాసీ పుత్రుని మీరలు
దాసీనుం జేయకిటకు దగునె పిలువగా
నాసీనుండై ప్రేలెడు
గాసిలి చెడిపోవ జెడలగా నడువరనా.'44

దుర్యోధనుని దురాలాపాలు విదురునికి మనస్తాపం కలిగించాయి. వెంటనే ధనుర్బాణాలు విడిచిపెట్టి వనభూములకు వెళ్ళాడు. సన్యాసివేషం ధరించి, "భారతవర్షమునం గలుగు పుణ్యవర తీర్థములను" చూస్తూ సంచరించాడు. ఈ యాత్రలో ఉండగానే విదురునికి కౌరవ నాశనం గురించి తెలిసింది.

బలరాముని తీర్థయాత్రా ప్రసంగం భారతంలో శల్యపర్వంలో కూడా ఉంది.

గృహకలహాలు సంభవించినప్పుడు వాటిని ధైర్యంతో ఎదుర్కోలేక తాత్కాలికంగా ఆ సమస్యల నుండి దూరంగా వెళ్ళిపోవడం చూస్తూనే ఉన్నాము.

---

44. శ్రీ మహా భాగవతము - తృతీయస్కంధము - 35.

దుస్తుల వాడకాన్ని అమల్లో పెట్టాడు. అప్పటినుండి వీరిని 'తెల్ల సన్యాసు'లని పిలిచేవారు.

వీరు కర్నాటకలోని ఒల్లాపురం నుంచి పుంగనూర్, కృష్ణాపురం, మాది గుబ్బ, వెంకటగిరి, దేవనాలపల్లె, వాయల్పాడు, చంచలదిబ్బ, సిద్ధవటం దాకా వ్యాపించారు. ఆయా స్థలాల్లో చర్చీలు కట్టారు.

ఈ మత గురువుల జగద్గురువు రోమ్‌లో ఉండేవాడు. క్రైస్తవ పాదరీలు సనాతన బ్రాహ్మణుల వలెనే శాకాహార భోజనులై, నిజమైన సన్యాసి జీవితాన్ని గడిపేవారు అందుచేతనే స్థానికులు వీరిని 'రోమపురి సన్యాసుల'ని పిలిచేవారు [32] అప్పటి బాధగురువుల్లాగ కాకుండా వీరు ప్రజలను దయతో చేరదీసి తమ మతం లోకి మార్చుకున్నారు. 'కరుణ గురువు'ల మని చెప్పుకున్నారు కూడ. 17వ శతాబ్దంలోని పోతులూరి వీరబ్రహ్మం, వేమనలు ప్రధానంగా తత్వకవులు. వీర బ్రహ్మం తన పన్నెండవ యేట లోకసంచారానికి బయలుదేరగా, తల్లి వారిం చింది. ఐతే ఆమెకు తత్త్వబోధ కావించి వీరబ్రహ్మం ఆమెను మోహముక్తురాలిని చేశాడు. తర్వాత రామేశ్వరం, ధనుష్కోటి, చిదంబరం లను దర్శించి హరిహర పురంలో కొంతకాలం తపస్సు చేశాడు. అక్కడ నుండి శ్రీశైలం, మహానంది మొదలైన పుణ్యక్షేత్ర సందర్శనం చేస్తూ బనగానపల్లెకు చేరుకున్నాడు. తర్వాత అనేక మహిమలను ప్రదర్శించాడు. అన్ని కులాల వారిని శిష్యులను చేసు కున్నాడు. ముఖ్యంగా సిద్ధప్ప శిష్యరికం అప్పటి తురకలకు, బ్రాహ్మణులకు ఆగ్రహకారణమైంది. అందుకే "పుష్పగిరి వెళ్ళి బ్రాహ్మణ మఠాధిపతులతో వాదాలుచేసి వారి కళ్ళు తెరిపించాడు. అట్లాగే కడప, కర్నూలు, సిద్ధవటం నవాబులను దర్శించి, బోధలు చేసి, వారికి మనఃపరివర్తనం గావించి తద్వారా హిందూ మహమ్మదీయ భావసమైక్యతకు కృషి చేశాడు.''[33]

---

32. "Infact they stood on a level with the strict Brahmin and were there fore called 'Romapuri Sanyasis' or Roman monks." P. 14. History of the Telugu Christrains by A father, Trichinopoly. 1910.

33. వ్యాస నవమి - "కర్మయోగి వీరబ్రహ్మం" డా. ఎన్. గోపి, పేజీ. 22. చైతన్య పబ్లికేషన్, హైదరాబాదు. 1986.

17 వ శతాబ్దంలో దేశం అల్లకల్లోలంగా ఉంది. నిరంతరం యుద్ధాలు, దోపిడీలతో పరస్పరం మత సాంఘిక వైషమ్యాలతో ప్రజలు కష్టాల పాలయ్యారు. తమనీ దుస్థితి నుండి ఎవరో ఒక మహాత్ముడు వచ్చి రక్షించాలని ఆశతో ఎదురు చూశారు. ఈ పాడుకాలం నాశనమై మళ్ళీ కృతయుగం రావాలని కోరుకున్నారు. అట్లాంటి సంక్షోభసమయంలో వీరబ్రహ్మంగారి కాలజ్ఞానబోధ వారికి ధైర్యాన్ని కలిగించింది. అందుకే అధికసంఖ్యలో శిష్యపరివారం బయలు దేరారు. వీరబ్రహ్మం తాను జీవించినంతకాలం కాలజ్ఞానాన్ని బోధిస్తూ, ఆధ్యాత్మిక అనుభూతిని సులభ భాషలో ప్రజలకు అందించాడు. 1653 నాటికే "జోస్యాలు చెప్తూ తత్వాలు పాడుతూ చాలమంది బిచ్చగాళ్ళు మధుర గ్రామాల్లో విచ్చల విడిగా తిరిగేవారని" తెలుస్తున్నది.[34]

వీరబ్రహ్మం సంసారబంధంలో ఉంటూనే ఒకానొక ఆశయసిద్ధికోసం తత్వాలాపన చేశాడు. కాని వేమన అట్లాకాదు జీవితంమీద విరక్తితో ఆంధ్ర దేశమంతా సంచారం చేశాడు. ఈ సంచారంలో అతనికి సంఘంలోని దురన్యాయాలు బాగా అర్థమైనాయి. ఎక్కడికక్కడే వాటికి ప్రతిస్పందించి, పద్యాలు అల్లాడు. వేమన్న సంచార జీవితాన్ని ప్రదర్శించే పద్యాలు కొల్లలుగా ఉన్నాయి.

'ఊరునూరు తిరిగి ఉద్యోగధారియై
వాడవాడ తిరుగు వనిత కొరకు
ఏడనేడ దిరిగి ఏమేమి కనెనయా
విశ్వదాభిరామ వినురవేమ '

ఈ విధంగా "ఎవరు విన్నా వినకున్నా జ్ఞానమార్గాన్ని ఉపదేశించి దేశమంతా తిరిగి రొప్పుపడీ, ఉద్రేకపడీ, అన్వేషించీ" మనుషుల దుఃఖ విముక్తికోసం ఏదో ఒక పరిష్కారం సాధించాలనే తపనతో వేమన నిత్యపథికుడుగా మారి పోయాడు [35]

---

34. వ్యాస నవమి - కర్మయోగి వీరబ్రహ్మం - డా. ఎన్. గోపి, పేజీ. 23.
35. వ్యాసనవమి - పేజి 24.

వివేకానందుడు ఆసేతు హిమాచలం పర్యటించి, అనేక ధార్మికోపన్యాసాల ద్వారా స్వదేశీయుల మనస్సులలో ఆధ్యాత్మికౌన్నత్యాన్ని పరదేశీయులకు ఎరుక పరచాలనే ధ్యేయంతో సముద్రయానం కూడ చేసి అమెరికా చేరుకున్నాడు. అక్కడ హైందవాధ్యాత్మిక తత్త్వాన్ని చారిత్రాత్మక సుదీర్ఘోపన్యాసం ద్వారా ఆవిష్కరించాడు. హిందూదేశమంటే అమెరికన్లకే కాదు, ప్రపంచ ప్రజలందరికీ పవిత్రభావం కలిగేట్లు చేశాడు.

రెండు శతాబ్దాల ఆంగ్లేయుల పరిపాలనాకాలంలో భారతీయుల వేష భాషల్లో జీవనరీతిలో మార్పు వచ్చింది. అడుగడుగునా అంధానుకరణంతో మునిగి పోయి 'ఆంగ్ల మానసపుత్రులై' స్వమతాన్నే ధిక్కరించే స్థితికి దిగజారారు కొందరు. అందుకే పీఠాధిపతులు గీతాయజ్ఞాల పేరిట భగవద్గీతోపన్యాసాలిస్తూ, దేశసంచారం చేస్తూ ఆధ్యాత్మికసంపదను మళ్ళీ నింపవలసివస్తున్నది. విదేశాల్లో కూడ దివ్యజ్ఞానసమాజాలు, రామకృష్ణమఠాలు, యోగశిక్షణాకేంద్రాలు స్థాపించబడ్డాయి. ఇట్లాంటి ఆధ్యాత్మిక కేంద్రాలను స్థాపించిన ఆధునికుల్లో కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య ఒకరు. ఆయన ఐరోపాఖండంలో అనేకసార్లు పర్యటించి, అక్కడి యోగసాధకులకు ఆధ్యాత్మిక సందేహాలను తీర్చడమేగాక, గీతను గురించి అనేక విషయాలు ప్రబోధించారు. ఈ పర్యటన విశేషాలు తమ 'ప్రాక్పశ్చిమములు' అనే యాత్రాగ్రంథంలో వివరించారు.[36]

### (ii) తీర్థయాత్రలు :

భారతదేశంలో పుణ్యక్షేత్రాలను సందర్శించటానికి చేసే యాత్రలకు వట్టి యాత్రలని కాకుండా తీర్థయాత్రలని పేరు. పుణ్యస్థలాల కంటె, దివ్య క్షేత్రాల కంటె కూడ ముఖ్యమైంది తీర్థం.

తీర్థమంటే తరింపచేసేదని అర్థం.[37] తీర్థసేవనమంటే తరించుట, తీరాన్ని చేరుట అని భావం. దివ్యదృష్టిగల ఋషులు తరణోపాయంగా షోడశ సంస్కారాలను ఏర్పరిచారు.[38] వీటితో సమానమైనదే తీర్థాటనం.

---

36. ప్రాక్పశ్చిమము - కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య.
37. 'తృప్లవనే' అను ధాతువు నుండి ఈ రూప నిష్పత్తి జరిగింది.
38. షోడశ సంస్కారాలు:- గర్భాదానం, పుంసవనం, సీమంతం, జాతకర్మ,

సంసారకూపంలో కూరుకొనిపోయిన జనులకు తాత్కాలికంగానైనా ఉన్నత భావాలు రేకెత్తించి, పుణ్యకర్మాచరణకు ప్రోత్సహించేవి తీర్థయాత్రలు. తీర్థయాత్రల పేరుతో భారతదేశాన్నంతా సాంస్కృతికంగా ఏకం చేశారు మన పూర్వులు.

"గంగేచ యమునేచైవ గోదావరి సరస్వతి
నర్మదే సింధు కావేరీ జలేఽస్మిన్ సన్నిధింకురు"

గంగ మొదలుకొని కావేరీ నది వరకు భారతదేశం సాంస్కృతికంగా ఏకఖండం. కాశీనుండి తెచ్చిన గంగా జలం సేతుబంధ రామేశ్వరం వద్ద సముద్రంలో కలిసినప్పుడు అది సంపూర్ణయాత్ర అని మన సంప్రదాయం. బులుసు సూర్య ప్రకాశశాస్త్రిగారు తమ 'నేపాల యాత్ర'లో "ఋషులు, మునులు నివసించిన దేశములు వారి తపః ప్రభావమువల్ల సార్థకమైన తీర్థాభిధానమున వెలుగొందు చున్నవి" అంటూ భారతదేశమంతా ఒక పుణ్యక్షేత్రమేననీ, ముఖ్యంగా ఉత్తర దేశంలో తీర్థ స్నానాలధికమనీ పేర్కొన్నారు 39

తీర్థాలలోకెల్ల విశేషమహిమ గలది గంగానది. దివ్యక్షేత్రాలలోకెల్ల సర్వోత్కృష్టమైనది కాశీక్షేత్రం అందుకే హిందువై పుట్టిన ప్రతివ్యక్తి గంగా నదిలో మునిగి, కాశీ విశ్వనాథుని సేవించాలని కోరుకుంటాడు. మన పూర్వులు ప్రాణం కంటె తీర్థాటనమే ఎక్కువ అని గ్రహించారు అందుకే ప్రయాణ సౌకర్యాలంతగాలేని ఆ కాలంలో కూడా మోక్షార్థులై ప్రాణాల్ని సైతం లెక్కింపక యాత్రలు చేసి తీర్థయాత్రల గొప్పదనాన్ని చాటిచెప్పారు.

తీర్థాలు జంగమ, మానస, స్థావరాత్మకములని మూడు విధాలు.

---

నామకరణం, అన్నప్రాశనం, చేలెము, ఉపనయనం, ప్రాజాపత్యం, మ్యము, ఆగ్నేయం, వైశ్వదేవం, గోదానం, సమావర్తనం, వివాహం, అంత్య సంస్కారం - "విద్యార్థి కల్పతరువు"

39 నేపాల యాత్ర (పశుపతినాథము) - విద్వాన్ బులుసు సూర్యప్రకాశ శాస్త్రి - పేజీ 9 సాధన గ్రంథమండలి, తెనాలి. 1958.

భగవత్సాక్షాత్కారం పొంది తమ జీవితాన్ని భగవంతుని సేవకై విని యోగించే మహాత్ములు, సాధువులు జంగమ తీర్థాలు. వీరు స్వయంగా తీర్థస్వరూపులై, వారు అడుగుపెట్టిన ప్రతిస్థానాన్ని, తీర్థాన్ని పవిత్రం చేస్తారు. ఈ విషయాన్నే ధర్మరాజు విదురునితో ఇలా అన్నాడు.

"సీ. ఏ వర్తనంబున నింతకాలము మీరు
సంచరించితిరయ్య జగతిలోన
నే తీర్థములు గంటి రెక్కడ నుంటిరి?
భావింపగ మీవంటి భాగవతులు
దీర్ఘ సంఘంబుల ధిక్కరింతురు గదా
మీ యందు విష్ణుండు మెఱయుకతన
మీరె తీర్థంబు మీకంటె మిక్కిలి
తీర్థంబులున్నవే? తెలిసి చూడ
తే. వేరె తీర్థంబులవనిపై వెదకనేల
మిమ్ము బొడగని భాషించు మేలె చాలు
వార్తలేమండ్రు? లోకులు వసుధలోన
మీకు సర్వంబు నెఱిగెడి మేర గలదు." 40

శ్రీ మహా భాగవతము - 1-13-299.

జలమయమైన తీర్థాలు, శిలారూపులైన దేవతలు దీర్ఘకాలం సేవిస్తే కాని పవిత్రుని చేయవు. కాని సాధువులు దర్శన మాత్రాననే మానవుని పునీతుని చేస్తారు. అందుకే వీరిని జంగమ తీర్థాలంటారు

సత్యము, క్షమ, దానము, ఇంద్రియ నిగ్రహం, భూతదయ, ఋజుత్వము, సంతోషము, బ్రహ్మచర్యము, మధుర భాషణము, జ్ఞానము, తపస్సు

40. దీనికి సంస్కృత మూలమిట్లున్నది :
"భవద్విధా భాగవతాస్తీర్థ భూతా స్వయం విభో!
తీర్థ కుర్వన్తి, తీర్థాని స్వాంతస్థేన గదాభృతా"
—శ్రీమద్భాగవతమ్. 1-13-10.

మొదలైనవి మానస తీర్థాలు. మనశ్శుద్ధి తీర్థాలను కూడ పునీతం చేస్తుంది. తీర్థయాత్రలు అంతఃకరణశుద్ధి కొరకు ఏర్పడ్డాయి అని ప్రతీతి. మరి, ఆ మనస్సే పవిత్రంగా లేకపోతే? అందుకే సత్యాది తీర్థములను ప్రతి వ్యక్తి అలవరచుకోవాలి.

ఇక మనం సామాన్యంగా తీర్థాలని భావించే కాశీ, గయ, ప్రయాగ, గంగ, యమున, సరస్వతి మొదలైన అసంఖ్యాక పవిత్ర క్షేత్రాలు, జలాశయాలు స్థావర తీర్థాల కోవకి చెందుతాయి.

ఈ తీర్థమున్న ప్రదేశాలు తీర్థక్షేత్రాలు. వీటి గురించి జరిపే యాత్రలు తీర్థయాత్రలు లేదా క్షేత్ర యాత్రలు

భారత కథలో అర్జునుని తీర్థయాత్ర ప్రసిద్ధమైనది. సమయభంగం చేయటం వల్ల అర్జునుడు 'అశేష తీర్థదర్శన కాంక్ష'తో తీర్థయాత్రకు బయలుదేరాడు. పన్నెండు నెలల తీర్థసేవలో ధనంజయుని వెంట వేదపారంగతులైన బ్రాహ్మణులు, వివిధ కథాకథన దక్షులైన పౌరాణికులు కూడా ఉన్నారు. ఐతే ఈ తీర్థయాత్ర అర్జునునికి వివాహయాత్రగా పర్యవసించింది. మొదట గంగానదిలో నిత్యస్నానాలు చేస్తూ, హోమాలు నిర్వహిస్తూ దేవర్షిపితృ తర్పణాలు చేశాడు. నదీతీరంలో ఉలూచితో వివాహానంతరం 'హిమవదాది మహాగిరి దర్శనం చేసుకొన్నాడు. నైమిశారణ్యంలో జగన్నాథుని సేవించి, కళింగ రాజ్యం గుండా ఉత్తర కురుదేశం వెళ్ళి, మహేంద్ర పర్వతం, గోదావరి, భీమేశ్వరం, శ్రీశైలంల ద్వారా కావేరీనదిని చేరుకున్నాడు.'[41] ఇక్కడి మణిపూర పురంలో చిత్రాంగదను వివాహమాడాడు. అటు పిదప దక్షిణ సముద్ర తీరంలో ప్రసిద్ధములైన పంచతీర్థాల్లోని అప్సరసలను శాపవిముక్తులను చేశాడు.

ఇక్కడినుండి గోకర్ణక్షేత్రం మీదుగా పశ్చిమసముద్ర (అరేబియా సముద్రం) పార్శ్వంల్లోని ప్రభాస తీర్థానికి చేరుకున్నాడు. తర్వాత అక్కడికి చేరువలో ఉన్న ద్వారకాపురికి వెళ్ళాడు

---

41. మహేంద్ర పర్వతం అంటే తూర్పు కనుమలన్నమాట.

ప్రాచీన ఋషులు మొదలైనవారు ఈనాడు విదేశాలుగా పరిగణింపబడే ప్రదేశాలకు కూడ వెళ్ళినట్టు తెలుస్తున్నది. వ్యాసుడు పరిష్యాసీమకు వెళ్ళినట్టు తెలుస్తున్నది.[28,29] పరిష్యా అంటే నేటి ఇరాన్.

ఆది శంకరాచార్యుల ఆధ్యాత్మిక యాత్ర భారతదేశానికి అద్వైతవేదాంతాన్ని ప్రసాదించింది. ప్రయాణం దుర్గమమైన 'ఆ రోజుల్లో' వేలాదిమైళ్ళు కాలినడకన తేజశ్శాలి శంకరుడు[30] యాత్ర చేశాడు.

అద్వైత వేదాంతంతో పరిచయమున్నవారికి శంకరాచార్యులు ఒక వ్యక్తికాదు, ఒక సంస్థ. 32 ఏళ్ళ వయస్సులోనే పరమపదం పొందినా, జీవితకాలంలో ఒక మనిషి సాధించగలిగే దాని కంటే ఎన్నోరెట్లు సాధించి చూపాడు. ఇప్పటిదాకా ఏ ప్రవక్తగానీ, మతగురువుకానీ సాధించని ఘనకార్యమిది. అందుకే శంకరాదార్యులు అవతారపురుషునిగా భావించబడ్డాడు.

శంకరాచార్యుల కాలంలో నైతిక, ఆధ్యాత్మిక విలువలు పూర్తిగా పతనమయ్యాయి. స్వార్థపరులైన మతగురువులు హిందూసమాజాన్ని తమ తమ సిద్ధాంతాలతో అల్లాకుతలం చేస్తున్నారు. యజ్ఞ యాగాదులు, భగవదారాధన ప్రాధాన్యాన్ని కోల్పోయాయి. దీనికి బౌద్ధమత ప్రాబల్యం కూడ దోహదకారి అయింది.

ఈ పరిస్థితులన్నీ గమనించి శంకరాచార్యులు హిందూధర్మాన్ని పునరుద్ధరించటానికి బద్ధ కంకణుడయ్యాడు. భిన్నాభిన్నమైన భారతీయతత్త్వాన్ని ఏక త్రాటిపై నడిపించటానికి దేశం మొత్తం పర్యటించాడు. మత మౌఢ్యంతో

---

28. పూర్వపు నైమిశారణ్యమే ఇప్పటి 'నీమ్‌సార్.' కాన్పూర్‌కు నీమ్‌సార్ 103 మైళ్ళ-అంటే 166 కి.మీ. దూరం ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలో ఉంది ఈ క్షేత్రం.
29. 'శ్రీకృష్ణ ద్వైపాయనుడు' పరిష్యా సీమ కరిగెనని తెలుపు పౌరాణికాధారము నేడును నైమిశారణ్యమున నుండుటనే గాంచితిని'- నా మహారాష్ట్రయాత్ర - జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి. పే. 1.
30. 'ఆరోజుల్లో' - అంటే క్రీ.శ. 20-30 సం॥ల మధ్య.

అహంకరించిన గురువులను తన అపారమైన మేధాశక్తితో వాగ్యుద్ధంలో ఓడించాడు. భారతదేశానికి ఆధ్యాత్మికబోధలు అందించటానికిగాను దేశం నలుమూలలా నాలుగు పీఠాల నేర్పరచాడు.31 ఈ విధంగా ఒక గొప్ప పవిత్రాశయాన్ని దృష్టిలో ఉంచుకొని శంకరాచార్యులు తన కర్తవ్యాన్ని నిర్వహించాడు. భిన్నత్వంలో ఏకత్వాన్ని దర్శించటానికి శంకరునికి తన లోకసంచారం ఎంతో తోడ్పడింది. శంకరునిలాగే రామానుజ, మధ్వాచార్యులు కూడ భారతదేశమంతా సంచరించి ధర్మ ప్రచారం కావించారు.

16 వ శతాబ్దంలో భక్త్యవతారమూర్తి యైన శ్రీకృష్ణ చైతన్య ప్రభువు చేసిన ఆధ్యాత్మిక యాత్రల వల్ల హిందూ సమాజం పునర్వికాసం పొందగలిగింది. ఇతడు వంగదేశంలోని వైష్ణవ మతానికి నాయకుడు దుర్మార్గ వర్తనులైన రాజులు మార్గమధ్యంలో ఇతని బోధనలు విని పరివర్తన చెందారు. అనాగరికులైన ఆదిమనివాసులు, మత విశ్వాసం లేని స్త్రీ పురుషులు కూడ ఆధ్యాత్మిక సంపత్తితో ముక్తి మార్గాన్ని పొందారు

క్రైస్తవ మత ప్రచారం కోసం యూరప్‌నుండి మొదటిసారిగా 16 వ శతాబ్దం చివరి భాగంలో క్రైస్తవ గురువులు భారతదేశానికి వచ్చారు. వీరిని జెసూట్ ఫాదరీలనేవారు (Jesuit Fathers), దక్షిణ భారతదేశంలో వీరి ప్రధాన కార్యక్షేత్రం మధుర. ఫాదరీ రూబినో లాంటి మత గురువులు ఆనాటి ప్రజల గురించి, పాలకుల గురించి, ముఖ్యంగా మత పరిస్థితుల గురించి 'Record of the Madura Mission' అన్న పేరుతో తాము కన్న, విన్న విషయాలు వ్రాసి పదిలపరిచారు.

చంద్రగిరి నేలిన వెంకటపతిరాయల ఆస్థానంలో ఇద్దరు ఫాదరీలుండేవారు. వీరు 1597-1615 ల మధ్య ఉన్నారు. వీరు అపాదమస్తకం నల్లని దుస్తులు ధరించటంవల్ల ప్రజల్లోకి చొచ్చుకొని పోలేకపోయారు. రాయల సంహారం పై తర్వాత ఫాదర్ రాబర్ట్ డినొబ్లి (Father Robert dei Nobili) తెల్ల

---

31. తూర్పున పూరీ జగన్నాథం, దక్షిణాన శృంగేరీ, పడమరన ప్రభాసము (ద్వారకా), ఉత్తరాన బదరికా శ్రమం.

మనసు వికలమైనప్పుడు ప్రశాంతతను కోరి స్థలం మార్చేవారు కూడ ఉంటారు. బలరామ విదురులు కూడా అదే బాటలో పయనించారు.

అశోకుడు బౌద్ధమతం స్వీకరించిన తర్వాత ఉపగుప్తునితో కలిసి తీర్థ యాత్రలకు బయలుదేరాడు. వారిద్దరు పట్టపుటేనుగుపై పయనమై బౌద్ధక్షేత్రాలను సందర్శించారు. ఈ యాత్రలో చక్రవర్తి హిమాలయాలకు కూడ వెళ్ళాడు. నేపాళ దేశంలోని పర్వత పంక్తుల సౌందర్యాన్ని చూసి పులకితగాత్రుడయ్యాడు

భక్తి భావ వ్యక్తీకరణకు అనేక మార్గాలున్నాయి. వాటిలో పుణ్యక్షేత్రా టనం ఒకటి. తీర్థయాత్రను ముక్తి మార్గానికి ప్రథమ సాధనంగా ఎంచుకొని ఆ యాత్రా ఫలాన్ని అనుభవించిన వాళ్ళున్నారు. ఈ విషయంలో ఒక్కొక్కరిది ఒక్కొక్క మార్గం. పుండరీకుడు అంధులైన తన తల్లిదండ్రులను భుజాలమీద మోసుకొని యాత్రలు చేశాడు. ఏకనాథస్వామి కాశీనుండి గంగకావిళ్ళు మోసు కొని తీర్థయాత్ర చేశాడు.

ప్రాచీన కవుల్లో శ్రీనాథునంత దేశసంచారం చేసిన కవి మరొకడు లేదన వచ్చు. క్రీ.శ. 1405-08 ల మధ్య తన ప్రభువైన పెదకోమటి వేమారెడ్డితో కలసి కాశీయాత్ర చేశాడు. ఉత్తరోత్తరా కాశీఖండం అనువదించాడు. కాశీకి వెళ్ళే దారిలో ఉన్న పుణ్య క్షేత్రాలపై శ్రీనాథుని చాటు పద్యాలు ఉన్నాయి. ముఖ్యంగా 'సింహాద్రి అప్పన్న చందన యాత్ర' సందర్భంగా చెప్పిన పద్యాలు ఎక్కువ. ఇంకా శ్రీశైలం, ద్రాక్షారామాలను కూడ దర్శించినట్లు తె.స్తున్నది.

ధర్మచింతనతో యాత్రలు చేయడం అన్ని మతాల్లో ఉన్న పురాతన ఆచారమే. క్రైస్తవుల్లో ఇప్పుడిప్పుడు తగ్గిపోతున్నా, మధ్యయుగాలనాటి ప్రజల ధార్మిక జీవనంలో తీర్థయాత్రలు ప్రముఖ స్థానాన్నే ఆక్రమించాయి. మహమ్మ దీయులు ప్రతి సంవత్సరం మక్కా, మదీనాలకు యాత్రచేయటం జీవితంలో అపురూపంగా భావిస్తారు.

జైనులు కూడ ఈ సంప్రదాయాన్ని అనుసరించారు. "సన్యాసులకు విధించబడిన కొన్ని నియమాల ప్రకారం వారు వర్షాకాలం తప్ప మిగిలిన సంవ

త్సరమంతా విధిగా తీర్థయాత్రలు చేయాలి."45 ఈ సంప్రదాయం ఇప్పటికీ జైనులచే పాటించబడుతున్నట్లు తెలుస్తున్నది. పాలితాన, గిర్నారు, అబూశిఖర క్షేత్రం. పారస్నాథం జైనుల పవిత్ర యాత్రాస్థలాలు.

బుద్ధుడు విగ్రహారాధనను ప్రోత్సహించలేదు. ఐనా తదనంతరకాలంలో మహాయాన శాఖ వర్ధిల్లిన తర్వాత - యాత్రలు చేసే ఆచారం బౌద్ధుల్లో కూడ చోటు చేసుకుంది. బుద్ధుడు సంచరించిన పవిత్ర స్థలాలైన-కపిలవస్తు, బుద్ధగయ, కాశీ, శ్రావస్తి, సారనాథ్, గయ మొదలైనవి బౌద్ధులకు పుణ్యక్షేత్రాలయ్యాయి.

పూర్వం ఇప్పుడున్న ప్రయాణ సౌకర్యాలు లేవు. మార్గమధ్యంలో క్రూర జంతుభీతి, చోరభయం ఉండటం వల్ల వృద్ధులు, సన్యాసులు మాత్రమే యాత్రలు చేసేవారు. దాసర్లు తిరుపతికి, శైవులు శ్రీశైలానికి గుంపులుగా వెళ్ళేవారు. వైష్ణవులు భిక్షావృత్తిని తమ హక్కుగా భావించేవారు. తీర్థయాత్రాస్థలాల్లో వీరికి అనేక ప్రత్యేక సౌకర్యాలుండేవి. అట్లాంటి స్థలాలలో వీరు వేల సంఖ్యలో గుమి గూడేవారు. తర్వాత చిన్న చిన్న గుంపులుగా విడిపోయి ఊళ్ళమీద పడేవారు. తీర్థయాత్రలకు వెళ్ళేటప్పుడు దారిలో తటస్థించిన గ్రామాల ప్రజలే వీరి తిండి తిప్పలు చూసేవారు. వీరు గుంపులుగానే తప్ప ఒంటరిగా ప్రయాణించరని అబేడుబాయ్ అనే ఫ్రెంచి మత గురువు తన గ్రంథంలో ఇలా పేర్కొన్నాడు:

"This is the only occasion on which they travel in such a large numbers, though they never wander about quite alone."46

యాత్రలు చేయటానికి ప్రాచీనకాలంలో ఉన్న సాహసాలు, ఆయాసాలు ఇప్పుడక్కరలేదు. సప్తసముద్రాల కావల ఉన్న ద్వీపానికి కూడ తలుచుకుంటే విమానంలో కొన్ని గంటల్లో చేరుకోవచ్చు. కాశీయాత్ర చేయటానికి ఏనుగుల

---

45. తేవారం త్రయం - బి.జి.యల్. స్వామి. భారతి. మార్చి. 1977. పేజీ 58.
46. Hindu Manners, customs and ceremonies - Abbe J. Dubois. Third Edition 1906, Reprinted 1953

వీరస్వామయ్య గారికి కొన్ని నెలలు పట్టవచ్చు. కాని నేడు ఒకటి రెండు రోజుల్లో అనాయాసంగా తిరిగి రావచ్చు. ఇప్పుడున్న ప్రయాణ సౌకర్యాలు అట్లాంటివి. పుణ్యస్థలాలను గూర్చి తెలుసుకోవటానికి రైల్వేశాఖవారు ప్రచురిస్తున్న 'గైడు'లు కొంతవరకు యాత్రికులకు సహాయకారిగా ఉన్నాయి. ట్రావెల్ ఏజన్సీల ద్వారా కూడ పుణ్య స్థలాలను సందర్శించే అవకాశం ఉంది. ఐతే భారతదేశంలోని ప్రసిద్ధ పుణ్యస్థలాల గురించి, తీర్థక్షేత్రాల గురించి పాఠకులకు తీర్థ సందర్శనాభిలాష కలిగించే విధంగా స్వానుభవంతో వ్రాసిన యాత్రా గ్రంథాలు కొన్ని ఉన్నాయి. వాటిల్లో శ్రీ బులుసు సూర్యప్రకాశ శాస్త్రిగారు రచించిన 'సుందర భారత యాత్ర' ముఖ్యమైనది. దీనిలో యాత్రాక్రమము, వెంట తీసికొని వెళ్ళవలసిన వస్తువులు, ఆహారం, ఆరోగ్యం, డబ్బు విషయంలో గమనించవలసిన ముఖ్య విషయాలు, రైల్వే సమాచారం, యాత్రా మార్గాలు, దూరాలు వివరించబడ్డాయి. ఎప్పుడూ యాత్ర చేయనివారు కూడా దీన్ని కరదీపికలాగ దగ్గరుంచుకొని యాత్ర చేయవచ్చును. ఈ కోవలోకి చెందినవే రాగం వెంకటేశ్వర్లు గారి 'హిమాచల యాత్రా మార్గదర్శి,' కొల్లూరి వేంకటరావుగారి 'శ్రీ ఉత్తర దేశ సంపూర్ణ క్షేత్ర యాత్రా మార్గదర్శి,' ధర్మవరపు బుచ్చిపాపరాజుగారి 'ఆంధ్ర ప్రదేశ్ దర్శిని.' అయితే ఇవి దేశంలోని దివ్యస్థలాలను సంపూర్ణంగా వివరించలేదు.

### (iii) వ్యాపార యాత్రలు :

క్రీ. పూ. ఐదో శతాబ్ది ప్రాంతంలోని బౌద్ధ సాహిత్యంవల్ల కావడి వ్యాపారులు, గుర్రపు వర్తకులు, సాధుసన్యాసులు యాత్రలు చేసేవారని తెలుస్తున్నది. వ్యాపారయాత్రలు ప్రధానంగా భూ జల మార్గాలపై జరుగుతూండేవి. విదేశ వ్యాపారానికై సరుకులు మోసుకొని అందరూ ఒక గుంపుగా బయల్దేరి పోయే వ్యాపారులను సార్థులనేవారు. ధార్మికంగా తీర్థయాత్రలకెళ్ళేవారు ఒక గుంపుగా చేరి తమ నాయకుని ఆజ్ఞల్లో నడిచినట్లే, వ్యాపారయాత్రల్లో వ్యాపారులు సార్థవాహుని నాయకత్వంలో యాత్ర సాగించేవారు. సార్థుల జీవితాలు ఆకర్షకంగా ఉండి ఎందరికో ప్రయాణేచ్ఛను ప్రబలమొనర్చేవి. సార్థులతో వెళ్ళినవారికి యాత్ర కష్టమనిపించేది కాదు. 'ఇంట్లో ఉండేవానికి భార్య ఎట్లాగో ప్రయాణంలో ఉన్నవానికి తోటి ప్రయాణికుడట్లాంటి మిత్రుడు'

అనే అభిప్రాయముండేది 47 ఈ అభిప్రాయానికి మూలం సంస్కృత మహాభారతంలో యక్షప్రశ్నలలో ధర్మజుని నోట వెలువడినట్లు తెలుపబడింది. "సార్థః ప్రవసతో మిత్రం భార్యామిత్రం గృహేసతః" (వనపర్వః 297-45).

తోవలో వర్తకులెన్నో కష్టనష్టాలకు గురయ్యేవారు దారిలో నిషాదులు, చోరులు వ్యాపారుల నడ్డగించి దోచుకొని వాళ్ళను ఏ గుంతలలోనో కూలద్రోసేవారు.

డా॥ మోతీచంద్‌గారు హిందీలో 'సార్థవాహ' అనే గ్రంథం రచించారు. కేంద్ర సాహిత్య అకాడమీ ఈ గ్రంథాన్ని ఆంధ్రానువాదం చేయించింది. అనువాదకర్త ముట్నూరు సంగమేశం.

బౌద్ధమతకాలంనుండి 11 వ శతాబ్దంవరకున్న భారతీయ సాహిత్యం (ముఖ్యంగా సంస్కృతం, పాళీ, ప్రాకృతాలు) గ్రీకు రోమను దేశాల భౌగోళిక వృత్తాంతాలు, చైనాయాత్రికుల వివరణలు, భారతీయకళాఖండాలు - ఈ గ్రంథరచనకు కావలసిన సమాచారాన్ని చేకూర్చి పెట్టాయి బుద్ధుని జాతక కథల ఆధారంగా రచయిత, చారిత్రక సత్యాల నన్వేషించే ప్రయత్నం చేశాడు.

ఈ పుస్తకంలో రచయిత భారతదేశపు రహదారిపద్ధతులు, ఆనాటి భారతదేశపుటౌన్నత్యం, యాత్రాసాధనాల వైవిధ్యాలను స్పష్టంగా చిత్రించారు. ఇంకా భారతీయ వ్యాపారులు, వారిప్రయాణాలు, క్రయవిక్రయాలకు చెందిన వస్తువులు, వ్యాపార నియమాలు మొదలైనవి కూడ దీనిలో వివరింపబడ్డాయి. వేలాది సంవత్సరాల యానసంస్కృతిని సమర్థంగా ప్రతిబింబించిన అపూర్వ గ్రంథమిది ప్రాచీన యాత్రా విజ్ఞాన సర్వస్వమనదగిన ఈ రచన, అనంతర పరిశోధక ప్రయత్నాలకు ఉత్తమ పరామర్శగ్రంథంగా ఉపయోగపడుతుంది.

వైదిక కాలంనాటి వ్యాపారులు సుదీర్ఘయాత్రలు చేసేవారు. ఆ యాత్రలు మరింత లాభమాశించి దూరదేశాలకు వస్తువులను చేరవేయడానికి కూడా జరిపే

47. సార్థవాహులు-హిందీ మూలం డా॥మోతీచంద్, అనువాదం: ముట్నూరు సంగమేశం.

వారు. వీరు అంతర్దేశీయ, అంతర్రాష్ట్రీయ వ్యాపారాలను అభివృద్ధి పరచడమే కాక, భారతీయ సంస్కృతికి, సాహసానికి కూడ సందేశవాహకులై కీర్తి గడించారు.

(iv) **అన్వేషణ యాత్రలు :-**

ఆదికాలంలో ఈ అన్వేషణ అనేది ఆహారసంపాదనకోసం, తర్వాత నివాసయోగ్యమైన ప్రదేశాలకోసం జరిగేది. ఇది మానవుల్లోనేకాక పశుపక్ష్యాదుల్లో కూడ సహజమైన విషయం. ఐతే అన్ని వసరులు అమరిన తర్వాత కూడ హాయిగా తిని, చల్లగా ఇంటిపట్టున భార్యాబిడ్డలతో కాలక్షేపంచేస్తూ జీవితాన్ని సుఖమయం చేసుకోవడానికి బదులు కోరి కష్టాలనుకొనితెచ్చుకునే సాహస విక్రమార్కులు కొందరుంటారు వీరికి అందరిలాగా మామూలు జీవితం గడపడం ఇష్టముండదు. ఆ జీవనంలో తృప్తి ఉండదు. కొత్త మార్గాలనుకాని, ప్రదేశాలనుకాని అన్వేషించాలని, దుర్గమప్రదేశాలకువెళ్ళి అక్కడి పరిస్థితులను ప్రపంచానికి చాటి చెప్పాలని తహ తహలాడుతుంటారు ఈ కుతూహలమే అన్వేషణకు దారితీస్తుంది చరిత్రలో ఇట్లాంటి సాహసికయాత్రికుల వృత్తాంతాలెన్నో నమోదు అయ్యాయి. వీరి పరిశోధక యాత్రల వల్ల ప్రపంచవిజ్ఞానం సుసంపన్నమయింది.

15 వ శతాబ్ది చివర పోర్చుగీసు దేశీయుడు క్రిస్టోఫర్ కొలంబస్ ఓడలపై సముద్రయాత్ర చేసి అమెరికాఖండాన్ని కనుక్కున్నాడు. ఆయన యాత్రా వివరాలు ఆసక్తికరంగా ఉంటాయి. అట్లాంటిక్ మహాసముద్రంలో యాత్రను ప్రారంభించాడు. స్పెయిన్ నుండి జపాను రెండువేల మైళ్ళ దూరంలో ఉన్నట్లు కొలంబస్ మొదట భావించాడు కాని, ఆ రెండు దేశాల మధ్య దూరం 12 వేల మైళ్ళు. ఐతే ఈ విషయం అప్పుడు కొలంబస్‌కు తెలిసే అవకాశం లేదు. ఒకవేళ తెలిసి ఉంటే ఈ యాత్ర చేసేవాడుకాదు అప్పటికి సాంకేతిక సాధనాలేవీ లేకున్నా "దినదినమున తాము గడిచిన దూరమును కొలంబస్ తనకడ గుర్తుపెట్టుకొనుచుండెడివాడట."[48] నిజమైన దూరం చెప్తే భయపడ్తారని తన అనుచరులకు తక్కువ చెప్పేవాడు కొలంబస్

---

48 ధీరాన్వేషకులు - ఖండవల్లి బాలేందుశేఖరం. పేజీ 25 (1951)

కొలంబస్ తాను కొత్తగా కనుక్కున్న భూ భాగాలకు పెట్టిన పేర్లు అట్లాగే చరిత్రలో స్థిరపడిపోయాయి. క్యూబా, జమైకా ద్వీపాలను, అమెరికా ఖండం దాపున ఉన్న 'ట్రినిడాడ్' ద్వీపాన్ని కూడ కొలంబస్ కనుక్కున్నాడు. మరికొంత ముందుకుపోయి దక్షిణ అమెరికా ఖండంపై కాలుమోపాడు కాని దాన్ని ఆసియాఖండసమీపస్థ ద్వీపమనే భ్రమపడ్డాడు ఈ కారణంవల్లనే ఆయనకు అమెరికాను కనుగొన్న ఖ్యాతి దక్కలేదు.

కొలంబస్‌లాగే మరో ఇద్దరు పోర్చుగీసు దేశీయులు వాస్కోడిగామా, ఫెర్డినాండ్ మేజిలాన్‌లు కూడ గొప్పఅన్వేషకులే. 1519 వ సంవత్సరంలో ఓడలలో బయలుదేరి మేజిలాన్ అమెరికాకు దక్షిణంగా యాత్రసాగించి భూమిని చుట్టి ఇండియా చేరాలనుకున్నాడు. దారిలో అతడు చేరుకున్న జలసంధికి 'మేజిలాన్‌జలసంధి' అనీ, పశ్చిమ మహాసముద్రంలో ప్రవేశించేటప్పటికి ఇది ప్రశాంతంగా ఉండటంవల్ల దానికి పసిఫిక్ (శాంత) మహాసముద్రమనీ పేరు పెట్టాడు.

కొలంబస్ అనుచరులలో 'ఒజేడా' అనేవాడొకడు. ఈయన అట్లాంటిక్ మహాసముద్రంలో ప్రయాణించి కొలంబస్ లాగే నూతన ప్రదేశాల అన్వేషణకు పూనుకున్నాడు. ఇతని పరివారంతోపాటు అమెరిగో వెస్పుక్కి అనే వర్తకుడు నాలుగుసార్లు అమెరికా ఖండానికి ప్రయాణించి అక్కడివిశేషాలను లేఖారూపంగా నమోదుచేసి ప్రకటించాడ. జర్మన్ దేశీయుడొకాయన ఈ లేఖలను చదివి, అమెరిగో కనుగొన్నాడుకాబట్టి ఈ ఖండానికి 'అమెరికా' అనే నామకరణం బాగుంటుందని సూచించాడు. ఈ సూచన అందరికీనచ్చి అలాగే పిలవసాగారు

జ్ఞానతృష్ణ కారణంగా మరికొందరు సాహసులు అజ్ఞాత ప్రపంచ భాగాల అన్వేషణకు బయలుదేరారు. ఆ అన్వేషణలో వారు ఆఫ్రికా ఖండ మధ్యభాగం, దక్షిణ పసిఫిక్ మహాసముద్రంలోని కొన్నిదీవులనూ, భూములనూ కనుక్కున్నారు. ఈ దీవులను అన్వేషించిన గొప్ప మార్గదర్శకుడు కెప్టెన్ జేమ్సు కుక్ 18 వ శతాబ్దిలో జీవించాడు. న్యూజీలాండ్ తీరాన్ని, ఆస్ట్రేలియా తూర్పు తీరాన్ని దర్శించిన సందర్భంలో న్యూజీలాండ్ రెండు ద్వీపాలమధ్య ఉన్న

జలసంధిద్వారా కూడా ప్రయాణించాడు. దీనిద్వారా ఇదివరకు ఎవరూ ప్రయాణించలేదు. అందుకే ఈ జలసంధి నేడు 'కుక్ జలసంధి' అనే పేర వ్యవహరింపబడుతున్నది. తర్వాత అతడు ఆస్ట్రేలియాకు వెళ్ళి బోటనీ అఖాతం వద్ద, నేడు సిడ్నీ పట్టణమున్నచోట దిగాడు. ఆ ప్రదేశానికతడు 'న్యూసౌత్ వేల్సు' అని పేరు పెట్టాడు. తర్వాత పసిఫిక్ మహాసముద్రంలోని హవాయి ద్వీపాలను కనుక్కొన్నాడు.

ఒకటిన్నర శతాబ్దాం క్రితం ఆఫ్రికాను చీకటి ఖండంగా (Dark Continent) వ్యవహరించేవారు. ఆ ఖండంయొక్క తీరప్రాంతాలు తప్ప మిగతా భాగాల గురించి ఎవరికీ తెలియకపోవడమే అందుక్కారణం. స్కాట్లాండు దేశీయుడైన డాక్టర్ డేవిడ్ లివింగ్‌స్టోన్‌కు గ్రంథపఠనమంటే బాగా ఇష్టం. అతనికి అజ్ఞాత భూములను కనుక్కోవాలనీ, క్రైస్తవ మతప్రచారకుడుగా తిరగాలనీ కోర్కెలుండేవి. ఆఫ్రికాలో ఇతడు మొదట కనుగొన్న నది పేరు జెంబెజీ నది. ప్రపంచంలోని గొప్ప జలపాతాల్లో ఇది ఒకటి. ఐతే దీనికి లివింగ్‌స్టోన్ 'విక్టోరియా జలపాత'మని పేరు పెట్టాడు రెండోసారి అన్వేషణలో న్యాసా సరస్సును కనిపెట్టాడు. ఆఫ్రికాలో జరుగుతున్న బానిసత్వ వ్యాపారమెంత క్రూరంగా ఉందో యూరపు జనులకు మొదటిసారిగా తెలియజేశాడు.

ఈ సమయంలో అంటే 1871 లో ఓ క్రైస్తవ మిషనరీ ఆఫ్రికాలో పర్యటించాడు. ఆయన ఏ దారిలో వెళ్ళాడో తెలియదుగానీ ఆయినను వెతుక్కుంటూ 'హెన్రీ మార్టిన్ స్టాన్లీ' అనే అమెరికన్ పత్రికా విలేకరి బయలుదేరాడు చివరకు ఏడు నెలల తర్వాత టాంజానికా సరస్సు దగ్గర ఆ మిషనరీని కలుసుకున్నాడు. ఈ మార్గం మొత్తం దూరం 1500 మైళ్ళు. (సుమారు 2400 కి మీ.) తర్వాత విలేఖరి పయనించిన మార్గాన్ని అన్వేషిస్తూ యాత్ర చేయాలనే కోరిక ముగ్గురు బ్రిటిష్ అధ్యాపకులకు కలిగింది. 1984 ఫిబ్రవరిన ప్రారంభమైన ఈ యాత్ర రెండు సంవత్సరాలపాటు కొనసాగింది. ఆ అధ్యాపకుల్లో ఒకరైన జార్జి 115 సంవత్సరాల క్రితం దానికంటె కూడ తమది కష్ట దాయకమైన యాత్ర అని పేర్కొన్నాడు

నార్వే దేశస్థుడు థార్ హేయెర్డ్ హల్ అనే భౌతిక శాస్త్రజ్ఞుడు 'కదలి మీద కోన్ - టికీ' అనే గ్రంథం రచించాడు. దీనిని విద్వాన్ దేవరకొండ చిన్ని

కృష్ణశర్మ అనువదించారు. దీనిలో రచయిత పొలినేషియన్ల వలస విధానాన్ని వివరించాడు. 1950 వ సంవత్సరంలో దక్షిణ అమెరికా తీరంనుంచి 'ఇంకాస్' జాతి యువకులైదుగురు 4,300 మైళ్ళు (దాదాపు ఏడువేల కి. మీ) దూరాన ఉన్న దక్షిణ (పొలినేషియా) ద్వీపాలకు యాత్ర చేశారు. మేకులు బిగించకుండా ఇంకాస్ జాతివారి ప్రాచీన పద్ధతిలో తొమ్మిది బాల్సా దుంగల తెప్పను నిర్మించి సముద్రాన్ని దాటే సాధనంగా వాడుకున్నారు దానికి వారి జాతిలో ప్రాచీనుడైన 'కోన్ - టికీ' అనే పేరు పెట్టుకున్నారు. పసిఫిక్ మహా సముద్రం దాదాపు 101 రోజులుగా సాగిన ఈ అన్వేషణ యాత్రలో అడుగడుగునా అగ్ని పరీక్షలే ఎదురయ్యాయి. మనుష్యులను తినటానికి అలవాటుపడ్డ సొరచేపలతో కలసి మెలసి ఉండవలసిన ఆగత్యం ఏర్పడింది. ఐతే ఏ పరిస్థితుల్లో కూడ ఈ యువకుల స్థైర్యం చెక్కు చెదరలేదు.

దక్షిణ అమెరికా తీరంనుండి దూర తీరాలకు బయలుదేరినప్పుడు ఈ ప్రయత్నాన్ని ఒక 'అవివేకపు కుతూహలం'గానే పరిగణించారు. కాని పొలినేషియన్ దీవులను కనిపెట్టిన తర్వాత పీరి ప్రయత్నమంతా ఒక మహాకార్యంగా భావింపబడింది.

## (v) సాహస యాత్రలు :-

యాత్రలు సులభసాధ్యాలు, కష్టసాధ్యాలు, దుస్సాధ్యాలు అని మూడు విధాలుగా చెప్పుకోవచ్చు. మనమున్న ప్రదేశానికి అందుబాటులో ఉండే యాత్రలు సులభ సాధ్యాలు. కొంత దూరంలో ఉన్నప్పటికీ రవాణా సౌకర్యాలవల్ల సాధింపబడేవి కష్టసాధ్యాలు. దూరంలో ఉన్నా, దగ్గర ఉన్నా కనీస సౌకర్యాలు కూడ లేని దుర్గమ ప్రదేశాలకు చేసే యాత్రలు, మహోన్నత పర్వత శిఖరాధిరోహణం, సముద్ర యాత్ర లాంటివి అసాధ్యాలు. ఇవి సాహసవంతులైన కొందరికే పరిమితం. లోకంలో కీర్తి పతాకను ఎగుర వేయాలనే ఆశతో, పదుగురి దృష్టిని ఆకర్షించాలనే తపనతో, గిన్నిస్ బుక్‌లో రికార్డు స్థాపించాలనే లక్ష్యంతో, ప్రాణాల్ని కూడ లెక్కచేయకుండా కొందరు సాహసయాత్రలు చేయడం ఆధునిక కాలంలోని రివాజు.

పూర్వం కొద్దిమంది ప్రాణాలకు తెగించి అతిదూర యాత్రలు చేసేవారు. ఇప్పటికీ అటువంటివారికి లోటులేదు. ఇవి ఒక్కొ సారి తీర్థయాత్రలు కూడ

కావచ్చు. హిమాలయ యాత్రలు ఒకరకంగా తీర్థయాత్రలే ఐనప్పటికీ, అడుగడుగునా ప్రాకృతికమైన ప్రమాదాలు పొంచి ఉండటం వల్ల వీటిని సాహస యాత్రలుగానే పరిగణించవచ్చు పి. వి. మనోహర రావుగారు బ్రహ్మమానస సరోవర యాత్ర చేశారు.49 సులభ రవాణా సదుపాయాలున్న ఈ రోజుల్లో కూడ కైలాస మానస సరోవర యాత్ర దుష్కరంగానే ఉంది. ఈ యాత్ర దుర్గమమైనది. చాలావరకు కాలినడకన సాగించవలసి ఉంటుంది. అతి క్లిష్టమైన మార్గాల్లో, పర్వత సానువుల్లో, దుర్గమారణ్యాల్లో, నదీమార్గాల్లో ఈ యాత్ర చేయవలసి ఉంటుంది. మనోధైర్యం, కార్యదీక్ష, దేహదార్ఢ్యం, ఆరోగ్యం, ధనం కలవారే ఇట్లాంటి సాహసయాత్రను జయప్రదం, ఫలప్రదం చేసుకోగల సమర్థులు.

లక్ష్యసిద్ధి కోసం ప్రాణత్యాగానికి కూడ వెనుదీయక దారిలో ఎన్నో అవాంతరాలను ఎదుర్కొని, కొన్ని సందర్భాల్లో దైవ సహాయాన్ని కూడ పొంది సాహసకార్యాలు చేసిన రాజకుమారుల కథలెన్నో జానపదగాథల్లో చోటు చేసుకున్నాయి. గలివర్ యాత్రలు ఇప్పటికీ సాహసోపేతమైన అద్భుత యాత్రలే. ఆధునిక కాలంలో కూడ ఇట్లాంటి సాహస యాత్రలు చేస్తున్నవారు కనపడుతుంటారు. ఐతే ఈ యాత్రలు రకరకాలుగా ఉంటాయి. ఒకరిని అనుకరించాలన్న దృష్టిలేకుండా అపూర్వంగా యాత్రలు చేయాలన్నది ఈ నాటి యువతరం పట్టుదల. అద్భుతాలు చేసి ఇటీవల వార్తల్లో కెక్కిన కొంతమంది సాహసుల యాత్రల గురించి ప్రస్తావించడం అవసరం. ఐతే ఇవన్నీ స్వల్పకాలంలో ముగిసిన యాత్రలే కాని సుదీర్ఘ యాత్రలు కావు.

* సైకిళ్ళపై భారత విద్యార్థులు చేసిన ప్రపంచ యాత్ర పేర్కొనదగింది.50 బి కె శ్రీధర్, కె పి. సుధీష్ కుమార్ అనే యువకులు ఐదు ఖండాలలో మొత్తం 54 దేశాలు పర్యటించారు 20 7 80 న బెంగుళూరు నుండి బయలుదేరి 14.8.85 నాటికి మళ్ళీ బెంగుళూరు చేరుకున్నారు మొత్తమ్మీద 12,600 కిలో మీటర్ల దూరం సైకిళ్ళ మీద ప్రయాణం చేశారు.

---

49. కైలాస దర్శనం - పి. వి. మనోహరరావు - 1983.

50 "ప్రపంచ యాత్ర చేసి ప్రమాదాలు ఎదుర్కొన్నారు" - వార్త. ఈనాడు, ఆదివారం. 1.12. 1985

ఈ యాత్రలో వీరు అనేక సమస్యలు ఎదుర్కోవలసి వచ్చింది. మధ్యలో శ్రీధర్‌కు బలమైన దెబ్బలు తగిలాయి డాక్టర్లు విశ్రాంతి తీసుకొమ్మని సలహా యిచ్చారు. ఐనా ప్రపంచయాత్ర విరమించటం ఇష్టంలేక కొత్తరకం సైకిల్‌ను రూపొందించుకున్నారు. కావాలనుకుంటే ఇద్దరూ లేదా ఒక్కరూ తొక్కటానికి వీలున్న సైకిలిది. అమెరికాలో వీరి సైకిల్‌ను కారు ఢీకొన్నందువల్ల రిపేరుకు 400 డాలర్లు (దాదాపు 4,800 రూ) ఖర్చయ్యింది.

అరేబియాలో పర్యటించినప్పుడు వీరు 120 - 130 ఫారన్‌హీట్ డిగ్రీల ఉష్ణ వాతావరణంలో గడపవలసివచ్చింది. ఆ వేడికి వారి శరీరమంతా బొబ్బలెక్కింది. నీళ్ళు తాగటం కూడ వారికి సమస్యగా పరిణమిస్తే స్థానికులు వారికి నీళ్ళుతాగే పద్ధతి నేర్పారు. ముందుగా పెదవులు నీటితో తడుపుకోవాలనీ, ఆ తరువాతే నీళ్ళు తాగాలని వారు ఆ యిద్దరికీ సలహా యిచ్చారు.

* ఉత్తరప్రదేశ్‌కు చెందిన 24 యేళ్ళ యువకుడు రాజేంద్రప్రసాద్ దేశాన్ని చుట్టిరావాలన్న నిశ్చయంతో యాత్ర చేశాడు.[51] 1984 నవంబరు 19న స్వగ్రామం గంజిపూర్ నుండి బయలుదేరాడు. ఐతే అదివరకెవరూ చేయని కొత్తపద్ధతిలో ఈ యాత్ర సాగింది. ఏ వాహనాన్నీ ఆశ్రయించకుండా కేవలం జాగింగ్ చేస్తూ మార్చి 1989 నాటికి హైదరాబాద్ చేరుకునేటప్పటికే ఒకటిన్నర లక్షల కి. మీ దూరం పూర్తిచేశాడు ఇతనితో బయలుదేరిన ఆరుగురు యువకులు మూడువేల కి. మీ దూరం ప్రయాణించి ఢిల్లీ చేరుకోగానే అలసి వెనక్కుమళ్ళారు. జాతీయసమైక్యతను చాటిచెప్పాలనే ఉద్దేశ్యంతో తానీ కార్యాన్ని తలపెట్టినట్లు రాజేంద్రప్రసాద్ న్యూస్ టుడేకు చెప్పాడు

ఈ పర్యటనలో తనకు ఎదురైన అనుభవాలను క్రోడీకరిస్తూ దాదాపు 400 నోట్‌బుక్స్ తయారుచేసుకున్నాడు. 'భారత దర్శన్' అనే గ్రంథం రాయాలని అతని కోరికట!

---

51. 'కాలినడకన భారత్ దర్శన్', న్యూస్‌టుడే, హైదరాబాద్. ఈనాడు, 31-8-1989.

* ఎర్నెస్ట్ ఎబీ న్యుయార్క్ నివాసి. ప్రముఖ సర్రియలిస్ట్ చిత్రకారుడు. అతని కూతురు టానియాకు 18 యేళ్ళు. హోమ్‌వర్క్ సరిగ్గా చేయడం లేదని ఆమెను ప్రపంచయాత్ర చేసి రావల్సిందిగా షరతు విధించాడు. మార్గాంతరం లేక ఈ ప్రతిపాదనకు ఒప్పుకుంది ఎనిమిది అడుగుల పొడవున్న 'వరుణ' పేరుగల పడవలో 28-5-1985 న న్యూయార్క్ నౌకాశ్రయం నుండి బయలుదేరింది. అలా ఎగసిపడే అలలమధ్య, హోరుమనే సముద్ర గాలులమధ్య దాదాపు రెండున్నర సంవత్సలపాటు సముద్రాల్లో ఒంటరిగా గడిపి ఇంటికి చేరుకుంది. అలల సవారీ చేసిన ఈ సాహసికురాలు "ఎన్నో దీవుల్లో కాలు మోపాను. ఎందరినో కలుసుకున్నాను. ఎన్నెన్నో గొప్పగొప్ప అవకాశాలున్న ప్రపంచం అక్కడుంది. ఇప్పుడు నాకున్న దిక్చక్రాలు అనంతం" అని తన జ్ఞాపకాల యాత్రలో పేర్కొన్నది.[52]

* 26 యేళ్ళ సిలిమా హనుమంతరావు ఏర్‌హోస్టెస్. విమాన ప్రయాణాలంటే ఆమెకు విసుగెత్తింది. ఇండోర్‌కు చెందిన సాధనా కోచర్‌తో కలిసి ఢిల్లీ నుండి యెజ్డీ మోటారు సైకిల్‌పై బయలుదేరింది. ఎనిమిది వేల మైళ్ళు (దాదాపు 13 వేల కి.మీ.) ప్రయాణించి కలకత్తా చేరుకుని తమ సాహస యాత్రను ముగించింది. ఈ యాత్రకు వారికి 58 రోజులు పట్టింది.[53]

* అత్యంత ప్రమాదభరితమైన విండ్ సర్ఫింగ్ (తెరచాప) క్రీడలో 28 యేళ్ళ రాహుల్ రస్తోగి చరిత్ర సృష్టించాడు. 22-4-1988 'లక్షద్వీప్' వద్ద ప్రారంభించిన ఈ యాత్ర అదే నెల 25 న ఉదయంతో కాలికట్ వద్ద పూర్తయింది. నాలుగు రోజుల ఈ సాహసయాత్రలో 181 నాటికల్ మైళ్ళు (అంటే 400 కి.మీ) ప్రయాణించి, ఒళ్ళు గగుర్పొడిచే ప్రమాదాల నెన్నిటినో ఎదుర్కొన్నాడు.[54]

* పార్లమెంటు సభ్యుడు శ్రీ విశ్వబంధు గుప్తా నేతృత్వంలో విల్స్ సెకండ్ క్లాస్ ఇండియా బెలూన్ ఎక్స్‌పెడిషన్ బృందం శ్రీనగర్ నుంచి

---

52. 'అలల సవారీ చేసిన అమ్మాయి' - ఈనాడు, 14-9-1988.
53. 'ఏర్ హోస్టెస్ సాహసయాత్ర'—ఈనాడు, 1-12-1985.
54. 'విండ్ సర్ఫింగ్‌లో వండర్‌బాయ్'—ఈనాడు, 29-4-1988.

కన్యాకుమారి వరకు సాహసయాత్ర నిర్వహించింది. తొమ్మిది మంది ఉన్న ఈ బృందం రంగురంగుల బెలూన్లలో దాదాపు 5,100 కి మీ దూరం ప్రయాణించింది. మొత్తం నెలరోజుల పాటు సాగింది ఈ సాహసయాత్ర. నెహ్రూ శత జయంతి ఉత్సవాల సందర్భంగా 'మేరా భారత్ మహాన్' (నా భారతదేశం గొప్పది) అనే భావనను ప్రచారం చేసేందుకు భారత బెలూనింగ్ క్లబ్ పూనుకొని ఈ కార్యక్రమాన్ని నిర్వహించి ది [55]

* వ్యక్తి గత ఆశయాలతో ముడిపడిఉన్న యాత్రలే కాక కొన్ని సంస్థలు కూడ ఇలాంటి సాహస యాత్రల్ని ప్రోత్సహించడం కద్దు. సాహస కృత్యాలపై యువకుల్లో అభిరుచిని పెంపొందించేందుకు, వివిన్న ప్రాంతాల ఆచార వ్యవహారాలు, జీవనవిధానాలను అధ్యయనం చేసేందుకు నెహ్రూ యువక కేంద్రం ఒక యాత్రను తలపెట్టింది. దానిలో భాగంగానే లక్షద్వీపాల సాహస యాత్రను ఆదిలాబాద్ యువకులచే ఏర్పాటు చేసింది. 21-2-1989న ఈ యువక బృందం బయలుదేరి 27-2-1989న లక్ష దీవులను చేరుకుంది.

సీజన్‌లో రోజుకి ఐదు వేల రూపాయల విలువ చేసే చేపలను పట్టి కేరళకు ఎగుమతి చేసే అక్కడి ప్రజలు చాలా సాదాసీదాగా ఉండటం తమకు ఆశ్చర్యాన్ని కలిగించిందని ఆ యువకులు తెలిపారు.[56]

ఇవన్నీ ఒక ఎత్తు, గగన విహారం చేయడం మరో ఎత్తు ఐదుగురు ఫ్రెంచి సాహసికులు డిడియర్ ఐనవ్ నాయకత్వంలో 'స్కై - స్కూటర్' అనదగ్గ పారాచూట్‌తో సహరా ఎడారిపై గగన విహారం చేశారు ఇది గతంలో ఎవ్వరూ చేయని సాహసం. స్కై - స్కూటర్‌ను ఇప్పటికే పర్వతారోహకులు తమ పర్వతారోహణలో కొన్ని కష్టమైన చోట్ల ఉపయోగిస్తున్నారు.[57]

---

55. వార్త, ఆంధ్రభూమి దిన పత్రిక 19-11 1989.
56. 'ఆదిలాబాద్ యువకుల లక్షదీవుల సాహస యాత్ర' - న్యూస్ టుడే. ఈనాడు, 14-3-1989.
57. 'సాహసమే ఊపిరిగా స్కై స్కూటర్‌పై సహారా యాత్ర' - ఈనాడు, ఆదివారం, 28-5-1989.

మామూలుగా సాహసయాత్ర అంటేనే అత్యంత ఉత్సాహంగాను, ధైర్య సాహసాలతోను కూడి వుంటుంది. అందులో అంటార్కిటికా మంచుఖండంపై యాత్ర అంటే మనోనిబ్బరం, సాహస ప్రవృత్తిని పెంచే యాత్రగానే చెప్పుకో వచ్చు. ప్రపంచంలోని ప్రముఖదేశాలు అంటార్కిటికాపై పలు యాత్రలు జరపగా, అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఒకటైన మన భారతదేశం 1984 నాటికే నాల్గుసార్లు యాత్రలు చేయటం మనకు గర్వకారణం 4-12-1984 న 82 మంది సభ్యులు గల భారత అంటార్కిటికా యాత్రాబృందం నౌక 'ఫిన్ పోలారిస్' మంచు ఖండాన్ని చేరడానికి 25 రోజులు పట్టింది[58]

సైకిళ్ళమీదా, మోటారు సైకిళ్ళమీదా యువకులు 'భారతదేశయాత్ర'కు బయల్దేరడం ఇటీవల ఎక్కువైంది. లయన్స్‌క్లబ్బులు, రోటరీ సంస్థలు, స్వచ్ఛంద సంస్థలు వీరికి ఆర్థిక సహాయం అందజేస్తున్నాయి. అన్ని రంగాల్లో చిత్తశుద్ధి లోపించినట్లుగానే ఇక్కడ కూడ కొంతమంది దీన్నొక సంపాదనగా మలుచుకుం టున్నారు. విరాళాలు, చందాలు వసూలు చేసుకొని కనబడకుండా పోయేవారు కొందరు. వీరివల్ల నిజంగానే యాత్రకు బయల్దేరేవారికి ఇబ్బందులు ఎదురవు తున్నాయి.

ఈ విధంగా యాత్ర సాహస ప్రవృత్తికీ, సాహసిక సాధనకూ, సాహస కృత్యాలకూ విశిష్ట సాధనంగా ఉపయోగిస్తున్నదని తెలుస్తున్నది

### (vi) విజ్ఞాన, వినోద, విలాస యాత్రలు:-

ఎటువంటి వివేక హీనునికైనా దేశాటనం వల్ల విజ్ఞానం కలుగుతుందని పెద్దలమాట పుణ్యం పురుషార్థాల సంగతి అట్లా ఉంచి, యాత్రలు లౌకిక విషయజ్ఞానానికి, విద్యాసముపార్జనకు ముఖ్య సాధనాలు

మానవుడు సంఘంలో తన బాధ్యతల్ని చక్కగా నిర్వర్తించడానికి, తన జీవితాన్ని సద్వినియోగం చేసుకోవడానికి సమగ్రమైన విజ్ఞానాన్ని ఆర్జించ

---

58. (వార్త) : 'అంటార్కిటికా పై భారత్ నాల్గవ జైత్రయాత్ర', ఆంధ్ర పత్రిక, 10-2-85.

వలసి ఉంది. అందుకే 'నాలుగూళ్లయినా చూడాలి, నాలుగు పుస్తకాలైనా చదివాలి' అన్నారు పెద్దలు. కాబట్టి విజ్ఞానానికి గ్రంథపఠనంతో పాటు పర్యటన అనుభవాలు ఎక్కువగా తోడ్పడతాయి.

శ్రీ వేంకటాధ్వరి రచించిన 'విశ్వగుణాదర్శం'లో దేశాటనం చేయకుండా ఇంటనే పడి ఉండేవాడు భార్యచే అగౌరవింపబడతాడని ఉంది.

"ఆకించన్యాదతి పరిచయా జాయయోపేక్ష మాణో
భూపాలానా మనను సరణా ద్బ్రదేవాఖిలేభ్యః।
గేహే తిష్ఠన్ కుమతిరలసః కూపకూర్మ స్సధర్మా
కిం జానీతే భువన చరితం ? కిం సుఖం చోపభుంక్తే?"

(విశ్వగుణాదర్శము - 167)[59]

అతి సహవాసం వల్ల భార్యచేత అలక్ష్యం చేయబడి, బావిలోని తాబేలు వలె ఇంటనే పడి ఉండే వాడు లౌకికం తెలియక ఏమి సుఖం అనుభవిస్తాడు? అని భావం.

గ్రంథపఠనం వల్ల లభించే జ్ఞానం కేవలం సిద్ధాంతప్రాయమైతే, దేశయాత్ర ఆ జ్ఞానానికొక విధమైన ప్రయోగం వంటిది. అంటే బడి చదువు విద్యార్థులను అర్ధమానవులను చేస్తే, దేశాటనం సమగ్ర మానవులను చేస్తుంది అందుకే 'దేశమైనా చూడు, కోశమైనా చూడు' అనే నానుడి వచ్చింది.

పూర్వకాలంలో మన భారతీయ విద్యార్థులు విద్యాభ్యాసం కొరకు ఒరిస్సా నుండి తంజావూరు, నవద్వీపం, దక్షిణాన తిరువాన్కూరువరకు కూడ వెళుతుండేవారు.[60] విద్యాభ్యాసం పూర్తయిన తర్వాత ముఖ్యంగా త్రైవర్ణికులు

59. విశ్వగుణాదర్శము - వేంకటాధ్వరి (సంస్కృత మూలం). తెలుగులో టీకా తాత్పర్య సహిత అనువాదం చేసిన వారు దేవరాజు పండితులు (తంజనగిరం దేవప్పెరుమాళ్ళయ్య). శ్రీ వేంకటాధ్వరి 17 వ శతాబ్దంలో నివసించిన కవి.

60. పశ్చిమ బెంగాల్‌లో ఉన్న ప్రసిద్ధ పట్టణం నవద్వీపం - గంగాతీరంలో ఉంది. దీన్ని 'నదియా' అని కూడా పిలుస్తారు.

(బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య) స్నాతకవ్రతం కావించుకొని, లోకానుభవ సంపాదనార్థం కాలి నడకన దేశం నలుమూలలకు యాత్ర చేసి అనేకానుభవాలను పొందేవారు. వారి విద్యాపాటవాన్ని పరీక్షించుకోవడానికి మార్గమధ్యంలో ఉండే గొప్ప పండితులను, అనుభవజ్ఞులను కలిసికొని వారితో చర్చలు జరిపేవారు.

పూర్వకాలంలో మన దేశంలో రాజకుమారులు, మంత్రికుమారులు నదీ తీరాల్లోని, అరణ్యాల్లోని గురుకులాలకు విద్యార్జనకై వెళ్ళేవారు. వీరు గురువుల వద్ద సర్వశాస్త్ర పారంగతులైనప్పటికీ అంతటితో తృప్తి పడకుండా దేశాటనానికి పూనుకునేవారు. ఆ పర్యటనలో ఎన్నో అనుభవాలను సంపాదించుకొన్న తర్వాత రాజ్యభారాన్ని స్వీకరించేవారు.

పాశ్చాత్యులు కూడ దేశాటనంలోని ప్రకృతి పరిశీలన జ్ఞాన సంపాదనకు పనికి వస్తుందని గుర్తించారు. ప్రయాణం వల్ల ప్రత్యక్షానుభూతి కలుగుతుంది. అందుకే శాస్త్ర విజ్ఞానాన్ని అభ్యసించే విద్యార్థులు ప్రతి యేటా 'బొటానికల్ టూర్'ల పేరిట విజ్ఞాన యాత్రలు చేస్తుంటారు విలాస యాత్రలకు (Excursion) బయలుదేరుతుంటారు. ఐతే నేటి విద్యావిధానంలో చిన్న చిన్న వినోద యాత్రలకే అవకాశముంది కాని విజ్ఞాన సంపాదనకు అవసరమైన దీర్ఘ ప్రయాణాలకు ప్రోత్సాహం లేదు. కాగా కొన్ని విద్యాసంస్థలు డబ్బు వసూలు చేసి ఈ విజ్ఞాన యాత్రలను నేడు వ్యాపార యాత్రలుగా మార్చివేస్తున్నాయి. వ్యాపార ధోరణి ప్రబలి విద్యార్థులకు నిజమైన విజ్ఞానాన్ని కలిగించాలనే తపన తగ్గిపోయింది.

విజ్ఞాన యాత్రలను చేసి తమ అనుభవాలను గ్రంథస్థం చేసినవాళ్ళున్నారు. వాటిలో ముమ్మన్నేని లక్ష్మీనారాయణ గారు విద్యార్థులతో చేయించిన విజ్ఞాన యాత్ర "అంతేవాసులతోడ హంపీ విహారయాత్ర." ఇది 1950 ప్రాంతాల్లో రైల్లో దక్షిణాది ప్రాంతాలకు వెళ్ళిన యాత్ర.

మరొకటి 1967 లో ఉస్మానియా విశ్వవిద్యాలయ విద్యార్థులతో నాయని కృష్ణకుమారి గారు చేయించిన ఉత్తరాది యాత్ర-"కాశ్మీర దీపకళిక." హైదరాబాదు నుండి కాశ్మీరు దాకా రైలులో చేసిన విజ్ఞానయాత్ర ఇది.

**vii. సాహిత్య సాంస్కృతిక యాత్రలు :-**

కవులు, పండితులు దేశ సంచారం చేయటం లోకమంతటా ఉన్నదే. సంస్కృత కవుల్లో జగన్నాథ పండితరాయలు లాగే, తెలుగుకవి శ్రీనాథుడు కూడా విస్తారంగా సాహిత్య యాత్రలు చేశాడు. శ్రీనాథుడు అంతగా దేశసంచారం చేయటానికి అప్పటి రాజకీయ పరిస్థితులుకూడ కొంత కారణం. దేశ సంచారం చేస్తూ పొట్ట చేతపట్టుకుని కొండవీడు, పల్నాడు, రాజమహేంద్రవరం, విజయనగరం రాజాస్థానాలను సందర్శించాడు. ఈ దేశాటనమే అతని లోకజ్ఞతా విస్తృతికి మూలకారణమైంది. ఆయాదేశాల్లో సంచరించినప్పుడు ఆశువుగా చెప్పిన పద్యాలు సుప్రసిద్ధ చాటువులయ్యాయి.

ఈ క్రింది రత్నాల్లాంటి చాటు పద్యాలు శ్రీనాథుని దేశసంచారం వల్లనే లోకానికి లభించాయి.

నీటియెద్దడి బాగా ఉన్న పలనాటి ప్రాంతంలో సంచరిస్తూ ఓ శివాలయంలో పరమేశ్వరున్ని చూసి చెప్పిన పద్యమిది:

"సిరిగల వానికి చెల్లును
తరుణుల పదియారువేల తగ పెండ్లాడన్
తిరిపెమున కిద్దఱాండ్రా?
పరమేశా! గంగవిడుపు పార్వతి చాలున్."

పల్నాడులో సన్నన్నం అలవాటయిన శ్రీనాథునికి జొన్నన్నం రుచించ లేదు. దానికి తోడు చింతకూర, బచ్చలికూర వండిన ఉడుకుపుల్లసొకటి. అందుకే విసుగెత్తి ఈ క్రింది పద్యం చెప్పాడు:

'అంగడి యూరలేదు, వరియన్నములేదు, శుచిత్వమేమి లే
దంగనలింపులేరు, ప్రియమైన వనంబులు లేవు, నీటికై
భంగపడంగ పాల్పడు కృపాపరులెవ్వరు లేరు, దాతలె
న్నంగను సున్న, గాన పలనాటికి మాటికి బోవనేటికిన్.'

ఇదే విధంగా దేశసంచారం చేసిన ఇతరకవులు కూడా విద్వత్పరీక్షల సందర్భంలో, ఇతర కవులతో సంభవించిన వివాదాలకు సంబంధించి అనేకమైన

చాటువులను చెప్పారు. 17వ శతాబ్దంలో వేమన, వీరబ్రహ్మం వంటి సామాజిక కవియోగుల లోకసంచారం ధార్మిక, ఆధ్యాత్మిక రంగాలకే కాక సాహిత్య లోకానికి కూడ ప్రజల భాషతో కూడిన రచనలను ప్రసాదించింది.

18వ శతాబ్దానికి చెందిన కవి అడిదం సూరకవి సంవత్సరంలో ఐదారు పార్లు దేశాటనం చేసి, సంపన్నులను, సంస్థానాధీశులను సందర్శించి వర్షాశనాలు గ్రహించి జీవయాత్ర సాగించేవాడని తెలుస్తున్నది.

శ్రీనాథునిలాగే ఆధునిక కాలంలోని తిరుపతి వేంకటకవులు నిరాఘాటంగా రాజాస్థానాలను సందర్శించారు అక్కడి పండితులతో విద్యావివాదాల్లో పాల్గొన్నారు. ఆంధ్రదేశంలో వీరు సందర్శించి సారస్వత తీర్థం చేయని రాజాస్థానం లేనేలేదనవచ్చు వీరి చాటు రచనలు 'నానారాజ సందర్శనము' పేర ప్రకటితమయ్యాయి.

ఆధునిక కాలంలో విదేశాలకు స్నేహ పూర్వకంగా సాంస్కృతిక పర్యటనలు చేస్తున్నారు. భారత సోవియట్ సాంస్కృతిక సంఘం (Iscus అంటే Indo Soviet cultural Society) 1952లో ఆవిర్భవించినప్పటి నుండి రెండు దేశాలమధ్య స్నేహ సంబంధాలు మెరుగయ్యాయి.

ఇస్కస్ తరఫున యాత్రచేసిన వారు సినారె, పోశెట్టి, రావూరి భరద్వాజ. సి నారాయణరెడ్డి, బి. రామరాజు తమ యాత్రానుభవాలను 'సోవియట్ రష్యాలో పదిరోజులు' అని ప్రకటించగా, పోశెట్టి 'రష్యాలో ఏముంది?' రావూరి భరద్వాజ 'ఇనుపతెర వెనక' అన్న పేర్లతో యాత్రా గ్రంథాలను ప్రచురింపచేశారు 1987లో కిన్నెర ఆర్ట్ థియేటర్స్ వారి సాంస్కృతిక బృందం వారు రెండు వారాలపాటు పర్యటించారు - డా॥ వాసా ప్రభావతి ఈ సందర్భంగా 'రష్యాలో స్నేహయాత్ర' అనే పుస్తకం వెలువరించారు - అంతర్జాతీయ సాంస్కృతిక సంస్థ పిలుపుమేరకు మలేషియాలోని తెలుగువారిని ఉత్తేజపరచడానికి సినారె, దాశరథి గార్లు 1976 లో అనేకకేంద్రాల్లో సాహిత్యోపన్యాసాలిచ్చారు. సినారె తమ యాత్రానుభవాలను "ముచ్చటగా మూడు వారాలు - మలేషియాలో తెలుగు వాణి" అన్న వ్యాసాల్లో పొందుపరిస్తే, దాశరథి 'మలేషియాలో తెలుగువాణి' అన్న పేర చక్కని వ్యాసం రచించారు. ఈ యాత్ర ముందుగా మహాసభలకు

తొలి మజిలీగా జరిగింది ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా 1981 లో మలేషియాకు యాత్ర చేసిన డా॥ త్రిపురనేని వేంకటేశ్వరరావు తమ యాత్రానుభవాలను 'సువర్ణ సుందర మలేషియా' అన్న పేరుతో ప్రకటించారు. ఈయన తన యాత్రను 'సాహిత్య సాంస్కృతిక పర్యటన'గా పేర్కొన్నారు.

విదేశాలతో స్నేహం నెరపడానికి రష్యాలో వలెనే చైనాలో కూడ సుహృద్భావసంఘం 'Chinese Peoples' Association for friendship with foreign Countries' అనే పేర వెలిసింది. ఈ సంస్థ ఆహ్వానం మీద 1976 లో యాత్రచేసి వచ్చి శ్రీశ్రీ 'నా చైనాయానం' అన్న యాత్రాగ్రంథం వ్రాశారు.

ఇంకా ఆరుద్ర, పురాణం సుబ్రహ్మణ్యశర్మ, అక్కినేని నాగేశ్వరరావు, గుమ్మడి వేంకటేశ్వరరావు, జగ్గయ్య వంటి సాహితీవేత్తలు, సినీప్రముఖులు ఆయా సందర్భాల్లో విదేశయాత్రలు చేసి సాహితీ సాంస్కృతిక రచనలతో యాత్రా సాహిత్యాన్ని పురిపుష్టం చేశారు.

### (viii) పరిశీలక యాత్రలు :-

ఒక వర్తకుడు వ్యాపారంలో మెళుకువలు తెలుసుకొని రావటానికో, ఒక అధికారి తాను వెళ్ళి పని ముక్తసరిగా ముగించుకొని రావటానికో కారులో కాని, రైలులో కాని, విమానంలోకాని రెండు మూడు రోజుల్లో ప్రయాణించి రావడంవల్ల యాత్రానుభవాలు అంతగా ఉండకపోవచ్చు. అట్లా కాకుండా ఒక విషయాన్ని పరిశీలించి, దానికి సంబంధించిన పరిజ్ఞానాన్ని సంపాదించి తద్వారా తమ దేశాన్ని అభివృద్ధిపథంలో నడిపించే పర్యటనలను పరిశీలకపర్యటనలుగా భావించవచ్చు రష్యా, అమెరికా లాంటి సంపన్న దేశాలు ఏ రంగాలలో ఏవిధంగా అభివృద్ధి చెందుతున్నాయో పరిశీలించడం ఈ యాత్రల ముఖ్యోద్దేశ్యం. రెండు దేశాలమధ్య పరస్పర సంబంధ బాంధవ్యాలను నెరపటానికి కూడ ఇవి ఉపయోగ పడతాయి కాబట్టి ఈ యాత్రలను 'స్నేహయాత్ర'లని కూడా పిలువవచ్చు.

రష్యాలో సహకారవాదులు వినియోగదారుల వ్యవస్థ పనితీరును పరిశీలించేందుకు భారత ప్రభుత్వం ఎన్. పి. జనార్దనరావుగారిని పంపింది. ఆయన

భారతదేశ ప్రతినిధిగా 1976లో యాత్రచేసి 'నా రష్యా పర్యటన' అనే యాత్రా గ్రంథం వ్రాశారు.

అట్లాగే ఆవుల గోపాలకృష్ణమూర్తిగారు అమెరికా ప్రభుత్వం ఆహ్వానంపై అక్కడి వార్తాపత్రికలు, పత్రికా రచన, న్యాయస్థానాలు మొదలైనవాటిని పరిశీలించి 'నా అమెరికా పర్యటన' అన్న పేరుతో యాత్రాచరిత్రగ్రంథం రచించారు.

ప్రముఖ రచయిత్రి మాలతీ చందూర్ భారతదేశపు పునర్నిర్మాణ కార్య కలాపాలను పరిశీలించడం కోసం 1976 లో దక్షిణ దేశంలో కొన్ని ముఖ్య పట్టణాలను దర్శించారు. తర్వాత యాత్రానుభవాలను ఒక్కచోట కూర్చి 'నవ భారతి 'పేర పుస్తకం వ్రాశారు.

(xi) **కిసాన్ యాత్రలు:-**

ఒకప్పుడు దేశాటనం మతం పేరిట, విజ్ఞానం పేరిట జరిగేది. ప్రస్తుతం దేశాభివృద్ధి పేరిట జరగటం జనిపిస్తుంది. రైతాంగం, గ్రామీణ ప్రజల సమైక్య తకు ఈ రైతు యాత్రలు పునాది రాళ్ళు. ఆచార్య రంగా నాయకత్వాన రైతు యాత్రలు ఒకప్పుడు దేశవ్యాప్త మయ్యాయి. సమష్టితత్వం, సౌభ్రాతృత్వం ఈ యాత్రల్లో నిండి ఉంది 1958 మే 15 వ తేదీన ప్రారంభమై 45 రోజులపాటు సాగిన 'శ్రీ రంగా కిసాన్ యాత్ర'లో మధ్యాంధ్ర రైతులు 800 మంది పాల్గొన్నారు. కాశ్మీరుదాకా కిసాన్ ర్యాలీ నిర్వహించారు. ఈ యాత్ర దాదాపు 6 వేల మైళ్ళ (10 వేల కి మీ) పర్యంతం సాగింది. ఈ యాత్ర వివరాలను కె. వి. సుబ్బయ్య, 'నవభారత సందర్శనం' అనేపేర పుస్తకంగా ప్రకటించారు

## (ఆ) గమన విధానాన్నిబట్టి యాత్రల వర్గీకరణ :

కేవలం లక్ష్యాన్నిబట్టి కాక యాత్ర చేస్తున్న పద్ధతినిబట్టి కూడ యాత్రను అనేక తరగతులుగా విభజించుకోవచ్చు.

(i) పాదయాత్రలు
(ii) జలయాత్రలు లేదా నౌకాయాత్రలు
(iii) వాహన యాత్రలు
(iv) ఆకాశయాత్రలు
(v) రోదసీ యాత్రలు - లేదా గ్రహాంతర యాత్రలు.

(i) **పాదయాత్రలు :-**

మనమిప్పుడు శాస్త్రయుగంలో జీవిస్తున్నాం. ప్రయాణ సౌకర్యాలు విరివిగా ఉన్న ఈ రోజుల్లో ఉన్నపళంగా ఊళ్ళు తిరిగిరావడానికి ఎంతో అవకాశం ఏర్పడింది ప్రపంచమంతా కొన్ని రోజుల్లో సుఖంగా చుట్టి రావచ్చు కూడ.

కాని పూర్వకాలం పరిస్థితి వేరు ఎక్కడికి వెళ్ళలన్నా కాలినడకే శరణ్యమయ్యేది. కాళ్ళు లేనివాడు రెక్కలు తెగిన పక్షి.

17వ శతాబ్ది నాటికి కూడ బాటలు అంత సుగమంగా లేవు. ప్రాచీన కాలంలో ప్రయాణం చేసేటప్పుడు ముందున్న మార్గాలు బాగుచేసి అటు తర్వాతనే ప్రయాణాలు చేసేవారని తెలుస్తున్నది[61] తోవ నడిచే యాత్రికుల సౌకర్యం కోసం ధర్మసత్రాలు ఉండేవి. బాట వెంబడి అక్కడక్కడ బావులు, చెరువులు నిర్మింపబడేవి. సుదీర్ఘమైన యాత్రలో యాత్రికులు ఈ స్థలాల్లో విశ్రాంతి తీసుకునేవారు. గుంపుగా చేసే వ్యాపారయాత్రల్లో 'ఒకరోజు ప్రయాణం ఒక శిశువు లేదా వృద్ధుడు సునాయాసముగా పోవునంత' దూరముండేది[62] అంటే ఆయాసం కలుగకుండా ప్రయాణం చేసేవారన్నమాట.

పాదయాత్రలు చేసేకాలంలో ప్రయాణాలు సుదీర్ఘం కావటం వల్ల వారికి లోక పరిశీలనకు అవకాశముండేది. వాహనాలు వచ్చిన తర్వాత ప్రయాణవేగం వల్ల యాత్రా వివరాలు తగ్గిపోయి ఆ యాత్రా గమ్యానికే అధిక ప్రాధాన్యం లభించింది పాదయాత్రలకు, వాహన యుగంలోని యాత్రలకు ప్రధానమైన తేడా ఇదే.

ఏనుగుల వీరాస్వామయ్యగారు (1830-31) పల్లకీలో ప్రయాణం చేసినప్పటికీ దాన్ని మోసినవారు చేసినది పాదయాత్రే కాబట్టి కాశీయాత్ర పాదయాత్ర కిందకే వస్తుంది. వీరస్వామయ్య సామాన్యుడు కాడు. అన్ని హంగులూ ఉన్నవాడు. చారిత్రక అవగాహన దండిగా కలవాడు. కాబట్టే నడిచిన ప్రతి అడుగునూ సార్థకం చేసుకున్నాడు.

---

61 సార్థవాహులు - డా॥ మోతీచంద్. పేజీ 86.

62. Ibid. — ,, Page. 220

పూర్వం కాశీకి పోవాలంటే నడకతప్ప మరో గత్యంతరం లేదు. దారి దోపిడిగాండ్రు, క్రూరమృగభీతి, రోగకారకములైన నీరు, ఉప్పొంగే నదులను దాటడం - ఈ విధంగా యాత్రపొడుగునా అడుగడుగునా మృత్యుభయమే. నెలల పర్యంతం యాత్ర కొనసాగుతూ ఉండేది. కాశీకి చేరుకోవడం ఒక ఎత్తు ఐతే తిరిగి రావడం మరో ఎత్తు. అందుకే చాలామంది కాలినడకన కాశీయాత్ర చేసిన కాలంలో ఇంటివద్ద వీలునామా లాంటి అప్పగింతలన్నీ చేసిగాని బయలు దేరేవారు కారు. మళ్ళీ తిరిగిరానివ్యక్తిని చూసినట్లుగానే బంధువు లతన్ని సాగనంపేవారు. సాధారణంగా జీవితంలో అన్నీ అనుభవించిన తర్వాత కాశీకి చేరుకుని అక్కడే శేషజీవితాన్ని గడిపేవారు కొందరు.

'కాశ్యాం మరణాన్ముక్తిః' కాశీలో మరణిస్తే ముక్తి లభిస్తుందన్న విశ్వాసమే దీనికి కారణం.

తీర్థయాత్రల ఫలం దక్కాలంటే యాత్రికుడు వాహనాలు లేకుండా సాధ్యమైనంత వరకు పాదచారియై పోవాలనేది విశ్వాసం. కైలాసంనుంచి రామేశ్వరం దాకా పలుక్షేత్రాలను దర్శిస్తూ, అనేకతీర్థాల్లో మునకలిడిన వారికే సంపూర్ణయాత్రా ఫలం దక్కుతుంది. కాలినడకతో ప్రయాణించటంవల్ల కష్ట సుఖాలు తెలుస్తాయి. స్థానిక రీతి రివాజులు ఎట్లాంటివో అవగతమౌతాయి. వెళ్ళిన ప్రదేశమెంత విస్తీర్ణంలో ఉందో అర్థమౌతుంది.

మనుష్యుల చేత మోయించుకొని పోయినవానికి - (అంటే డోలీలపై కాని, పల్లకీలోగాని) - యాత్రాఫలం దక్కదంటారు.

ఎడారిలో యాత్రచేయటం మరీ కష్టం. ఇది సముద్ర యానం లాంటిదే. నడక సులువుగా సాగక పోవటం, ఎటునుండి ఎడారి దాటాలో తెలియకపోవటం, ఆహార పదార్థాల కొరత వంటి కష్టాలు అదనం - ఐతే ఈ ప్రయాణంలో ఒంటె లను వాహనాలుగా వినియోగించేవారు. ఎడారి కూడా సముద్రం లాగ అగమ్య గోచరం కాబట్టి ఎడారిని తరించటానికి ఒంటెను 'ఎడారి ఓడ' గా వ్యవహరించే వారు. ఒంటెలపై ప్రయాణించే వర్తకుల గుంపు నక్షత్ర సహాయంతో ఎడారిని గడిచేవారు. ఒక్కోసారి దారిలో పడిపోయిన పశువుల, మనుష్యుల ఎండిన ఎముకల్ని బట్టి కూడ మార్గాన్ని తెలుసుకునేవారు. ఫాహియాన్ తన అనుచరు

లతో గోబీ ఎడారిని దాటుతున్నప్పుడు "ఆ ఎడారిలో కంటిచూపు ఆనినంత వరకూ తమకంటే ముందు బయలుదేరి వచ్చిన యాత్రికుల కపాలాలూ, ఎముకలూ తప్ప మరేం కనపడలేద"ట![63].

మధ్యయుగాల్లో కూడ యాత్రికులకు చక్కని బాటలుండేవికావు. వర్షాకాలం వచ్చేసరికవి బురదతో నిండేవి. అప్పటి యాత్రికుల బాధలు సుభాషిత రత్న భాండాగారంలో వర్ణింపబడ్డట్లుగా పేర్కొనబడింది. "బురదలో నడిచి యాత్రికులు త్రోవ తప్పుచుండిరి. చీకటిరాత్రులందు పదే పదే జారిపడుచుండిరి. వర్షాకాలములోనే కాదు, శీతాకాలములో కూడ వారికట్టి కష్టములే- ఎదురయ్యేడివి గ్రామదేవతల గుడిసెలలోనో, ఏ పాడుగోడ పంచనో చేరి, చలిగాలికి కొంకరపోవుచు, కప్పుకొనిన బొంతలలోనుండియే వణికిపోవుచు, పండ్లు చప్పుడు చేయుచుండెడి వీరి అవస్థ వర్ణనాతీతము."[64]

భారతదేశంలో ప్రాచీనకాలం నుండీ ఎడ్లబండ్లే ప్రయాణసాధనాలుగా ఉన్నాయి. ఎడారుల్లోనైతే ప్రయాణానికి, సరుకులు మోయడానికి కూడ ఒంటెలను ఉపయోగించారు చతురంగ బలంతో ఏనుగులు, గుర్రాలు పనికివచ్చేవి కాని వాటిని దీర్ఘయాత్రలకు ఉపయోగించినట్లు లేదు. తర్వాతి కాలంలో వేగంగా వార్తలను చేరవేయడానికి, రాజుల ప్రయాణాల్లో రథానికి పూన్చడానికి గుర్రాలను ఉపయోగించారు. కాశ్మీర యాత్రలో పర్వతారోహణకు పోనీలను (పొట్టి గుర్రాలను) ఉపయోగించినట్లు కృష్ణకుమారిగారు 'కాశ్మీర దీపకళిక'లో వ్రాశారు, కైలాస పరిక్రమలో యాకులనే జడల బర్రెలను సామానులు మోయడానికి. వాహనాలుగా కూడ వాడుకున్నట్లు పి వి మనోహరరావుగారు తమ 'కైలాస దర్శనము'లో చెప్పుకున్నారు. నడవలేని ప్రదేశాల్లో పై వాహనాల అవసరం కలిగింది.

శ్రీశైలం, తిరుమల మొదలైన పర్వతాలను అధిరోహించేటప్పుడు బండ్లు పోయే వీలు లేకపోవటం వల్ల యాత్రికులు తమ సామానులను కూలి మనుష్యుల

---

63 ఫాహియాన్ భారతదేశయాత్ర - పణితపు నాగేశ్వరరావు - ఆంధ్రప్రభ దినపత్రిక - 12-5-1985.

64. సార్థవాహులు - డా॥ మోతీచంద్. పేజీ. 279.

చేత మోయించి తాము కాలినడకన వెళ్ళేవారు. మిగతా చోట్ల దారి సుగమంగా ఉన్నా చిన్నచిన్న ఎడ్లబండ్లు మాత్రమే అతికష్టమ్మీద పయనించేవి. కొన్నిచోట్ల బండి విడగొట్టవలసి వచ్చేది. 'గోల్కొండ-కన్యాకుమారి మార్గంలో ఇట్లాంటి అవస్థ నిత్యం ఎదురయ్యేదట!'[65] బండ్లు నడిచే వీలు లేనందువల్ల యాత్రికులు తమ సరుకులను గుర్రాలమీద, ఎడ్లమీద మోయించేవారు. అవే వాహనాలు కూడ అయ్యేవి. పల్లకీలు, డోలీలు కూడ ఈ విధంగానే ఉపయోగపడేవి. కొన్ని సందర్భాల్లో గాడిదలు కూడ సరుకులు మోయించడానికి ఉపకరించేవి.

## (ii) జలయాత్రలు లేదా నౌకాయాత్రలు:-

క్రీ. పూ. 8 వ శతాబ్దినాటికే హిందువులు సముద్రయానంలో ఆరితేరి నట్లు ప్రాచీన భారతీయ గ్రంథాలను బట్టి తెలుస్తున్నది. వీటిలో భారతీయ నావికుల ధైర్య సాహసాలను చాటే కథలు అనేకం చోటు చేసుకున్నాయి. కళింగులు తూర్పుదీవులు, లంక మొదలైన ప్రదేశాలకు వలసపోయినట్లు కథలున్నాయి. ఇక్కడి రాజుల విద్యాభ్యాసంలో అంగంగా నౌకాయానం అభ్యసింపబడేది.

ఆంగ్లో శాక్షనులు సముద్రపు చేపల్లాంటివారు. అందుకే వారు మంచినీళ్ళ ప్రాయంగా భూగోళాన్ని చుట్టివేయగలిగారు. పోర్చుగీసుదేశస్థులైన కొందరు సాహసిక అన్వేషకులు అజ్ఞాత ప్రదేశాల అన్వేషణకై వేలాది మైళ్ళు నౌకలలో సముద్రయానం చేశారు.

శాతవాహనులు కూడ విదేశాలతో వర్తక వ్యాపారాలు చేసి "త్రిసముద్రాధిపతు"లనే బిరుదును పొందారు 'పడవ చిహ్నాలు' గల వీరి నాణాలు తెలుగు దేశపు తీరంలో లభించాయి. మోటుపల్లి రేవు క్రీస్తుపూర్వం నుండి దాదాపు 1200 సం. కాలము ప్రాక్పశ్చిమఖండాలతో నౌకా వాణిజ్యం నెరపి ప్రధాన వర్తక స్థానంగా ప్రసిద్ధి పొందింది. ఐతే భారతీయవాఙ్మయంలో సముద్రయానం - ముఖ్యంగా సముద్ర మధ్యంలో ప్రయాణం చేసే నావలను, అందలి ప్రజలు అనుభవించే కష్టాలను వర్ణించిన రచనలు, కథలు, వర్ణనలు చాలకొద్ది. దీనికి ముఖ్యకారణం ప్రాచీన గ్రంథకర్తలు, కవులు పడవలలో కాని ఓడలలో కాని సముద్రాలు దాటి విదేశాలకు ప్రయాణాలు చేయకపోవటమే.

---

65. సార్థవాహులు - " పేజీ. 56.

19వ శతాబ్దం ప్రథమభాగంలో తెరచాప ఓడలలోనే భారతదేశ తీరంలో ప్రయాణాలు జరిగాయి. తరువాత అర్ధశతాబ్దిలోనే ఆవిరియంత్రాలతో నడుపబడే ఓడలు నిర్మింపబడ్డాయి. సముద్రయానంలోని భయాలు, అపాయాలు తగ్గిపోయాయి సూయజ్ కాలవ నిర్మాణం తర్వాత యూరపు ఖండానికి దగ్గరిదారి ఏర్పడటంవల్ల కూడ భారతదేశం నుండి సముద్రయాత్రలు ఎక్కువయ్యాయి.

భారతదేశంలో వింధ్యకు ఉత్తరాన ఉన్నవారికి అంత పట్టింపులేదు కాని దక్షిణవాసులకు మాత్రం సముద్రయాత్ర నిషిద్ధమని ధర్మశాస్త్రాల్లో ఉందని చెప్పి, సనాతన సంప్రదాయ వాదులు కఠిన నియమాలను విధించారు. మనువు సముద్రయాత్రను అంగీకరించలేదు. "కనుకనే సముద్రయాత్రికునికి కన్య నిచ్చుటకు అంగీకరింపలేదు. కాని ఈ నిషేధము కేవలము బ్రాహ్మణులకే వర్తించెడిది."[66]

బోయనపల్లి పద్మరాజుగారు తమ వ్యాసంలో 'హిందూ యుగమున నౌకా యాత్రికులకు మతనిషేధము వలన కొంత నిరుత్సాహము కలిగెనేమో యని అనుమానము కలుగును' అని ఇదే అభిప్రాయాన్ని వ్యక్తపరిచారు.[67] ఐతే ఈ మత నిషేధం హిందూయుగంలోనే కాదు, 20వ శతాబ్ది ప్రథమభాగంలో కూడ కొనసాగుతూనే ఉందనడానికి తగినన్ని ఆధారాలున్నాయి.

యమ్ ఆర్. అయ్యంగార్ దాక్షిణాత్యుడు. బారిష్టరు చదువు పూర్తి చేసి రాజమహేంద్రవరంలో ప్రాక్టీసు పెట్టాడనీ, ఆయన ఇంగ్లాండునుండి వచ్చిన తర్వాత అతని భార్య కాపురం చెయ్యడానికి నిరాకరించిందనీ ప్రకాశంపంతులు గారు తమ జీవిత చరిత్రలో పేర్కొన్నారు.[68]

---

66. సార్థవాహులు - పేజీ. 77.
67. ఆంధ్రుల నౌకాయాన కౌశల్యము - బోయనపల్లి పద్మరాజు. 1946 ఫిబ్రవరి, భారతి. పేజీ. 117.
68 నా జీవితయాత్ర - ప్రథమ ఖండము. పేజీ. 117.

పంతులుగారు కూడ ఇంగ్లాండుకు బారిష్టరు చదువుకై వెళతానన్నప్పుడు ఆయన తల్లిగారు, భార్యా మొదట సమ్మతింపలేదు - కాని మూడు టరముల్లో చదువంతా పూర్తి చేస్తానని, మత్స్య మాంసాదులు ముట్టబోనని శపథం చేసిన తర్వాత ఒప్పుకున్నారట. అందుకే "ఆ కాలంలో సముద్ర యానం అంటే కులం పోయిందన్నమాటే!"69 అని పంతులుగారు వ్రాయవలసి వచ్చింది. 'ఆ కాలంలో' అంటే 1905-06 ప్రాంతంలో అన్నమాట! ఐతే ఆరోగ్యం కోసం సముద్ర యానం అవసరమని అప్పుడప్పుడే డాక్టర్లు సలహాలిస్తుండటం కూడ గమనార్హమైన విషయం.

ప్రకాశం పంతులుగారు ఇంగ్లాండునుండి వచ్చిన కొత్తలో ప్రాయశ్చితం లేనిదే హిందూమతంలో కలవడానికి వీలులేదన్న మతవాదుల సవాలును ఎదుర్కొన్నారు కూడ.

లండనులో స్థిరపడిపోయిన తెలుగు వాళ్ళల్లో కన్నేపల్లి లక్ష్మీనరసింహం ఒకడు. ఈయన శ్రీకాకుళం జిల్లావాడు గిడుగు రామ్మూర్తిగారి శిష్యుడు. బారిష్టరు పరీక్ష వ్రాసివచ్చి మొదట గురువు గారిని కలుసుకున్నాడట. పంతులు గారు నరసింహంకు విందు ఏర్పాటు చేసిన పాపానికి కులస్థు లాయనను వెలివేశారనీ, ఐనా రామ్మూర్తిగారు దాన్ని లక్ష్య పెట్టలేదనీ నిడుదవోలు వేంకటరావు గారు తెలిపారు.70

1886 లో సూయజ్ కాలువ నిర్మాణం తర్వాత ఇండియానుండి ఇంగ్లాండుకు రాకపోకలు హెచ్చాయి. ఉన్నత విద్యాభ్యాసం కోసం భారతీయులు అక్కడికి వెళ్ళి రావడం ఆచారమై పోయింది.

1928-30 సంవత్సరాలమధ్యకాలంలోనే సంవత్సరానికొక్కరు చొప్పున సూయజ్ కాలువ గుండా నౌకయానం చేసిన తెలుగువారు తమ యాత్రానుభవాలకు గ్రంథరూపం ఇచ్చారు. ఆ గ్రంథాలు ఈ విధంగా

---

69. నా జీవితయాత్ర. - పేజీ 117
70. మా మహారాజుతో దూరతీరాలు-కురుమెళ్ళ వెంకటరావు పీఠిక-నిడుదవోలు వెంకటరావు. పేజీ. 10.

ఉన్నాయి. డి. వి. సుబ్బారావు గారి 'సీమకు స్టీమరులో' (1928), అత్యం నరసింహమూర్తి గారి 'భూ ప్రదక్షకుడు భార్యకు వ్రాసిన లేఖలు' (1929), కురుమెళ్ళ వెంకటరావుగారు పిఠాపురం మహారాజావారి పరివారంలో ఒకడుగా ప్రయాణించి వ్రాసిన 'మా మహారాజుతో దూరతీరాలు' (1930). ఈ బ్రాకెట్ల లోని సంవత్సరాలు యాత్రా కాలాన్ని సూచిస్తాయి.

మొదటి, చివరి నౌకాయాత్రలు ఇంగ్లాండుకు, రెండవది అమెరికాకు జరిపి నవి. ఐతే ఇవన్నీ లేఖా రూపంలో రూపుదిద్దుకున్న యాత్రాగ్రంథాలు.

పడవప్రయాణాల్లో మనుషులను మింగేసే పెద్దపెద్ద చేపలనుండీ, సముద్రపు దొంగలనుండీ అపాయాలు సంభవించేవి. ఆధునాతన నౌకాప్రయ ణాల్లో ఈ విపత్తులు లేవు కాని కొందరికి సముద్రయానం పడక Sea Sick-nessతో బాధపడేవారు.

కురుమెళ్ళ వేంకటరావుగారు ప్రయాణప్రారంభంలో రెండురోజులు పడుకున్నవారు పడుకున్నట్టుగానే ఉన్నారట! అప్పటి ఆయన అవస్థను ఆయనే ఇట్లా వర్ణించారు:

"ఏమీ తోచదు కడుపులో జాలిగా ఉన్నట్లు ఉంటుంది. ఒక్కోసారి కడుపంతా చెయ్యిపెట్టి కలిపినట్టు ఉంటుంది. వాంతి వచ్చినట్టు అనిపిస్తుంది. కాని రాదు. అంతా తిరుగుతున్నట్టు ఉంటుంది. మంచం మీంచి పడిపోతామా అన్నట్టు ఉంటుంద" అని వ్రాస్తూ "ఒక్క మాటలో చెప్పాలంటే మగవాళ్ళు వేవిళ్ళు పడడం లాంటిది" అన్నారు.[71]

1893 లో పెద్దిభొట్ల వీరయ్య బందరునుండి స్టీమరులో మద్రాసుకు మిత్రబృందంతో బయలుదేరాడు. నౌకాయానంలో ఆయన స్నేహితులఅవస్థ దారుణంగా ఉందట! వాళ్ళంతా "చిన్ననాటి దొండాకు పసరు సహితముగ కక్కుకొన్నట్లు"గా వ్రాశాడు [72]

71. మా మహారాజుతో దూరతీరాలు - పేజీ. 2

72. స్వీయ చరిత్ర - పెద్దిభొట్ల వీరయ్య, పేజీ. 33.

**(iii) వాహన యాత్రలు :-**

పూర్వకాలంలో రాకపోకలకు సాధనాలుగా ఎడ్లబండి, గుర్రం, గాడిద, ఒంటె, ఎద్దు ఇట్లాంటివి ఉండేవి. ఇప్పటికీ ఇవి అక్కడక్కడ ఉపయోగంలో ఉన్నాయి. ఆధునికకాలంలో సైకిళ్ళు, రిక్షాలు, జట్కాబళ్ళు, కార్లు, బస్సులు, రైళ్ళు, గుర్రబ్బగ్గీలు రవాణాసాధనాలుగా ఉపయోగడుతున్నాయి. పశ్చిమ దేశాల్లోవలె కాక ఏకకాలంలో ప్రాచీన ఆధునిక, అత్యాధునిక ప్రయాణ సాధనాలు ఉపయోగంలో ఉన్న విచిత్ర స్థితి మన దేశంలోనే కనిపిస్తుంది.

ఆంధ్రదేశంలో ఒంటెద్దు బండ్లు, రెండెడ్లబండ్ల మీదనే ప్రయాణాలు చేస్తుంటారు కాని కాశీలో మూడెడ్లు లాగెడి బండ్లు ఆదిభట్ల నారాయణదాసుగారి దృష్టిని ఆకట్టుకున్నాయి. దాసుగారు 1913 - 14 సంవత్సరంలో సతీసమేతంగా యాత్ర చేసి 'కాశీ శతకమ్' రచించారు. ఆ వంద శ్లోకాల్లోని ఒక శ్లోకం పై విషయాన్నే తెలుపుతున్నది

''త్రిగుణై రేవ సంసార చక్రం భ్రమతి తత్త్వతః ।
బ్రువన్నితి వా నడుద్భి శ్శకటో గచ్ఛతి త్రిభిః॥''73

తాత్విక ధోరణి అలవడ్డ దాసుగారికి ప్రపంచమే ఒక శకటంగా, సత్త్వ రజస్తమో గుణాలు మూడెడ్లుగా కనిపించాయట. సంసార చక్రాన్ని లాగడానికి ఈ త్రిగుణాలనే ఎడ్లు అవసరమే మరి. సంసారాన్ని ఈదటం, సంసారాన్ని లాగటం అన్నవి వాహనాలతో మనకున్న సంబంధాన్ని తెలిపే ఉపమానాలే.

దువ్వూరి వెంకట రమణశాస్త్రిగారు 1915 ప్రాంతంలో విజయనగరంలో 'సిటీబస్సులు లేవు, రిక్షాలు లేవు జట్కాబళ్ళు కూడ తక్కువ వంటెద్దుబళ్ళు మాత్రం స్టేషనుకు వస్తూండేవి.'74 అని వ్రాశారు. ఆ రోజుల్లో కార్లు చాలా అరుదట. విజయనగరం మొత్తానికి మహారాజావారికి ఒకటుండే దన్నారు.

---

73 శ్రీ ఆదిభట్ల నారాయణదాసు సారస్వతనీరాజనము - సంపాదకులు, యస్వీ జోగారావు, పేజీ. 615.

74. దువ్వూరి వారి స్వీయచరిత్ర - రచన 1976. పేజీ 70.

తక్కిన పెద్దవాళ్ళందరికీ గుఱ్ఱబ్బగ్గీలుండేవి. ఈ గుర్రబ్బగ్గీలంటే మన మనుకునే జట్కాబండీకాదు. అది చాలా హుందాతనంతో ఉండేదనీ, దానిని 'కోచీ' అనే వారనీ శాస్త్రిగారు తమ స్వీయచరిత్రలో వ్రాశారు. "వాటిని విశాఖ జిల్లాలో 'కోచి' లనేవారు. గోదావరి జిల్లాలో 'గుర్రపుసార్టు' లనేవారు."75

మనదేశంలో మొట్టమొదటి రైలు సరిగ్గా 16-4-1853 వ తేదీ సాయంత్రం 3 గంటలకు బొంబాయి నుండి బయలుదేరి థాణాకు చేరుకుందనీ, మొత్తం 21 మై. (33 కి.మీ.) దూరం ప్రయాణించిందని రాగం వెంకటేశ్వర్లు గారు తమ 'యాత్రా మార్గదర్శిని'లో పేర్కొన్నారు.76,77

రైలుమార్గం పడకముందు మనదేశంలో గుర్రబగ్గీలు, జట్కాబండ్లు, ఎడ్లబండ్లు ప్రయాణ సాధనాలుగా వాడబడేవి కాబట్టి బహుశా రైలుకు కూడ 'బండి' అనే ఉత్తర పదం చేర్చి 'రైలుబండి' అని పిలుచుకొని ఉంటారు. 'ఐతే కొత్తలో ఇవి బండ్లలాగే చాల నెమ్మదిగా నడిచేవట. 1925 లో విద్యుదీకరణ జరిగిన తర్వాత శరవేగంతో ప్రయాణిస్తున్నాయి 1933 లో కొక్కొండ వెంకట రత్నం పంతులుగారు పెద్దిభొట్ల వీరయ్యతో 'పొగయోడ మీద వచ్చితిరా, పొగ బండిమీద వచ్చితిరా?' అన్న ప్రశ్నలో 'పొగబండి' అన్నది ట్రెయిన్‌కు మరోపేరు.78

కార్లులేని రోజుల్లో రెండెడ్లబండ్లలో సంపన్నులు ప్రయాణిస్తుంటే వారి సేవకుడు ఆ బండిముందు దారిచూపుతూ పరిగెత్తడం మొన్నటిదాకా పల్లెల్లో మనం చూసిన దృశ్యమే. ఐతే ఇదే పద్ధతి కారు మొదట ప్రవేశపెట్టబడినప్పుడు కూడ ఉండేదని విన్నప్పుడు ఆశ్చర్యపడక మానము. కొత్తలో కారు ముందు

---

75 Ibid. P. 98

76. యాత్రా మార్గదర్శి - రాగం వెంకటేశ్వర్లు పేజీ. 63.

77. "దేశమున తొలుతటి రైలు మార్గపు నిర్మాణము - బొంబాయినుండి థాణాకు - 1850 లో ప్రారంభమై 1853 పూర్తి ఐనది". (పేజీ. 925). ప్రపంచరాజ్య సర్వస్వము - ఆంధ్రసారస్వత పరిషత్, హైదరాబాదు.

78. స్వీయ చరిత్ర - పెద్దిభొట్ల వీరయ్య. పేజీ 39.

మనిషి నడుస్తూ ప్రమాదాన్ని హెచ్చరించేవాడట. ఆ విధంగా కారును భయంగా చూడటమే కాకుండా ఈ రోజు అణ్వస్త్రాలు నిషేధించాలన్నట్టే మొదట్లో ఆ వాహనాలను కూడ నిషేధించాలనేవారట!

1930 - 40 ల మధ్య రోడ్ల నిర్మాణంలేని రోజుల్లో శ్రీశైలానికి మార్కాపురం రోడ్డులో రెండెడ్ల బండ్ల మీదనే ప్రయాణం సాగించేవారని తెలుస్తున్నది. దారిలో పెద్ద దోరణాలగుండా చింతలదాకా బండిలో, తర్వాత 20 మై. (32 కి. మీ.) ఎవరైనా కాలినడకన వెళ్ళవలసి వచ్చేదనీ, ధనవంతులు మాత్రం జోలీలలో (డోలీలు) వెళ్లేవారనీ రమణయ్యగారు వ్రాశారు.[79]

1938 లో ఆవంత్స సోమసుందర్ గారు ఆరుద్రతో కలిసి ఇంగ్లాండుకు యాత్ర చేశారు. అక్కడ బర్మింగ్‌హేమ్‌ను కేంద్రంగా చేసుకొని ప్రతిరోజు కారుతో చుట్టుపక్కల ప్రదేశాలను దర్శించి వచ్చారు. ప్రయాణం చేస్తూ కారులోనే తమ అనుభూతులకు కావ్యరూపం ఇచ్చేవాడనని తమ యాత్రా కావ్యంలో తెలుపుకున్నారు.[81]

ఇంక దాదాపు మిగతా యాత్రలన్నీ రైలు ద్వారా చేసినవే. 1935 లో జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తిగారి 'నా మహారాష్ట్ర యాత్ర' లో రైలు ద్వారా, కాలినడకన కూడ యాత్ర చేశారు 1930 - 35 ల మధ్య దాదాపు భారత దేశమంతటా యాత్రచేసి 'నా యాత్రానుభవము' అనే యాత్రాగ్రంథం వ్రాసిన ప్రాతూరివెంకటశివరామశర్మగారు అవసరాన్నిబట్టి రైలు, బస్, జట్కా, బోటు, ఎడ్ల బండి, కాలినడక ప్రయాణంచేశానని వ్రాసుకున్నారు. అతని యాత్రాకాలంలో భద్రాద్రికి మోటార్లు లేవట రెండెడ్ల బండి మీదనే అడివిగుండా యాత్ర చేశానన్నారు వేర్వేరుగా ఉత్తర దేశ యాత్రలు చేసిన బులుసు వేంకట రమణయ్య (1956). ముళ్ళపూడి కమలాదేవిగార్లు కూడ రైళ్ళలోనే

---

79. శ్రీశైల మహాక్షేత్ర యాత్రాదర్శిని - ఓరుగంటి వెంకట రమణయ్య. పేజీ. 5.

80. ఆంగ్లసీమలో ఆమని వీణలు (ఇంగ్లాండు యాత్రా కవితలు) - ఆవంత్స సోమసుందర్, (సెప్టెంబర్ - 1986)

ప్రయాణించారు విద్యార్థులను విజ్ఞానవిహారయాత్రలకు తీసుకు వెళ్ళిన ముమ్మ న్నేని లక్ష్మీనారాయణ గారు, (1950) నాయని కృష్ణకుమారి గారు (1966) రైళ్ళనే ప్రయాణసాధనాలుగా వాడుకున్నారు.

(iv) **ఆకాశయాత్రలు :-**

యాత్రచేసే విధానం గురించి పూర్వప్రణాళిక ఒకటి ఏర్పరచుకుని తదనుగుణంగా ప్రయాణిస్తే రైలు ప్రయాణమంత అనుకూలమైన ప్రయాణం మరొకటి లేదు ఇది ముఖ్యంగా ధనికులకే కాక పేదసాదలకు కూడ సులభమైన మార్గం. కానీ విమానప్రయాణం కేవలం ధనవంతులకే అనుకూలమైనది. విమానంమీద అన్ని క్షేత్రాలు తిరిగి చూసే వీలుండదు. విమాన యాత్ర అసలు యాత్రే కాదంటూ రాహుల్ సాంకృత్యాయన్ ఇలా పేర్కొన్నాడు:

"...డబ్బు బలంతో విమాన ప్రయాణాలు చేసి, గొప్ప గొప్ప హోటళ్ళలో బసచేసే వాళ్ళని అసలు లోక సంచారులు అనడానికి వీల్లేదు "81

రష్యా, అమెరికా లాంటి విదేశాలకు చేసిన యాత్రలన్నీ దాదాపుగా ఆకాశ యానాలే. ఒక భూఖండం నుంచి మరో భూఖండానికి అతి తక్కువ వ్యవధిలో, సుఖవంతంగా ప్రయాణం చేయడానికి ఇవి పనికి వస్తాయి.

(v) **రోదసీ యాత్రలు :-**

ఈ యాత్రలు అందరూ చేసేవి కావు కేవల విజ్ఞాన శాస్త్రవేత్తలు మాత్రమే చేయతగినవి. భూగోళంలోని విశ్వరహస్యాలను. గ్రహాంతర విశేషా లను ప్రపంచానికి ఎరుక పరచడానికి చేసే యాత్రలు ఇతర గ్రహాలలో జనా వాసానికి ఏమైనా అనువైన పరిస్థితులున్నాయేమో తెలుసుకోడానికి రాకెట్లను, వ్యోమ నౌకలను పంపించడం ఈ శతాబ్దిలో శాస్త్రవేత్తల కృషి ఫలితం. అమె రికా, రష్యా లాంటి సంపన్న దేశాలు తాము శాస్త్ర సాంకేతిక రంగాల్లో సాధించిన ప్రగతికి సూచనగా అనేక వ్యోమ నౌకలను గగనతలంలోకి పంపించాయి. ఒకప్పుడు సుదూర స్వప్నం అనుకున్న చంద్రమండల యాత్ర పాతబడి దశా

81. లోకసంచారి (ఘుమక్కడ్ శాస్త్ర) - రచన : రాహుల్ సాంకృత్యాయన్, అనువాదం . ఆలూరి భుజంగరావు (పేజీ. 51), విశాలాంధ్ర ప్రచురణ.

బ్దాలు గడిచింది.[82] నిన్న మొన్నటి వాయేజర్-II అమెరికా శాస్త్రజ్ఞులు నెప్ట్యూన్ గ్రహంలోకి పంపించిన వ్యోమనౌక.

ఈ గగనయాత్రలు మనకు ఈనాటివి కావు. పురాణకాలం నుండి ఉన్నాయంటారు. పుష్పక విమానం ప్రసక్తి మన పురాణాల్లో అక్కడక్కడ కనిపిస్తుంది. సాహిత్యంలో కూడ తరతరాలుగా కథలుగా చదువుకున్నాం ఆకాశయానం గురించి కాని ఆ యాత్రలు వరసిద్ధులకే సాధ్యమయ్యాయంటారు. ఇప్పుడు జరుగుతున్న కృషి సర్వజన సులభంగా తలపెట్టబడింది.

రోదసీయాత్ర ఒక వ్యక్తి చేసిన యాత్ర కాదు- మానవ జాతి చేసిన యాత్ర.[83]

ప్రాచీన కాలంలో ప్రయాణ చరిత్ర ఒక యాత్రా చరిత్రగా రూపుదిద్దుకునేది. నేడు వేగం పెరిగి వ్యవధి తగ్గి అన్ని వివరాలను సావకాశంగా గ్రహించలేకపోతున్నారు వాహనాలకు పూర్వం కాలినడకన యాత్రచేసే రోజుల్లో ప్రయాణాలు ప్రణాళికాబద్ధం కావు. ఏది ఎదురైతే అదే అప్పటికి అపూర్వానుభవం. ప్రయాణం ప్రణాళికా రచనకు కట్టుబడితే స్వేచ్ఛ ఉండదు, థ్రిల్ ఉండదు, అనుభూతీ ఉండదు.

రవాణా సౌకర్యాలు ఎక్కువ కావడం వల్ల 20 వ శతాబ్దం ద్వితీయార్థం నుంచి చాలా మంది ప్రయాణం చేస్తున్నారు. కానీ సౌకర్యాలు ఎంతగా పెరిగినా గమ్యం చేరుకున్న విషయంలో గ్యారంటీ మాత్రం చెప్పలేము. దానికి కారణం సాంకేతిక లోపాలు, ఇతర కారణాలు. ఎప్పుడు, ఎక్కడ ఏ అవాంతరం సంభవిస్తుందో తెలియదు. రైళ్ళు, బస్సులు సమయానికి రావు. వచ్చినా దారిలో ఎన్నో అవాంతరాలు. జనాభా పెరుగుదల వల్ల, రైళ్ళురాకపోకల్లో ఆలస్యంవల్ల యాత్ర మీద ఆధునికులకు పట్టులేదు. కాలినడకలో అట్లాకాదు ఆరోగ్యం బాగుంటే అంతా అనుకున్నట్లుగానే సకాలంలో చేరవచ్చు.

---

82 20-7-1969 వ తేదీన తొలిసారిగా మానవుడు చంద్రమండలం మీద కాలు పెట్టాడు ఇది అమెరికన్లు సాధించిన విజయం.

83. చంద్ర మండలం పై కాలు మోపిన వెంటనే నీల్‌అర్మ్‌స్ట్రాంగ్ 'ఇది ఓ సాధారణ మానవుడి మామూలు అడుగుకాదు, యావత్ మానవాళి ముందడుగు' అని వర్ణించాడు.

మానవ జీవితం ఎప్పుడూ ఒకేరకంగా ఉన్నట్లు అనిపిస్తుంది. కాలినడకన ప్రయాణం చేసేటప్పుడు అరణ్యాల్లో మనిషి ప్రాణానికి భద్రత లేదు. ఇప్పటి సాంకేతిక అరణ్యాల్లో కూడా యాత్రకు అనిశ్చిత పరిస్థితే ఉంది. కాబట్టి మానవునికి తృష్ణ అనేది ఆదిమకాలం నుండి ఇప్పటిదాకా ఒకేరకంగా వుంది అప్పటి అడవుల్లో లాగే ఇప్పటి జనారణ్యాల్లో కూడ ఊహించని ప్రమాదాలు పొంచి వున్నాయి బస్సులు, రైళ్లు, విమానాలు, నౌకలు- ఏ వాహనంలో ప్రయాణించినా మృత్యువు వెన్నంటివస్తూనే ఉంటుంది. మనిషి ప్రకృతిని జయించి ఏర్పరుచుకొన్న సౌకర్యమైన ప్రయాణసాధనాలే తన మరణానికి తానే గోతులు తవ్వుకున్న విధంగా తయారవుతున్నాయి. మానవుడు పాత అరణ్యాల్లోంచి వెలువడి కొత్త అరణ్యాలను సృష్టించుకొని బాధలు కొనితెచ్చుకున్నాడేమో!

19, 20 శతాబ్దాల ప్రయాణాలకు మధ్య ఉన్న భేదాన్ని పరిశీలిస్తే- ప్రాచీన యాత్రలో ప్రాక్తన అనుభవాలుండగా, ఆధునిక యాత్రలో యాతనానుభవాలు ఉన్నాయి. అసలు యాత్ర అంటేనే యాతన. ట్రావెల్ అన్న పదానికి ప్రౌఢ్యంలో 'దుఃఖము, శ్రమము' అనే అర్థాలున్నాయి.

ప్రాచీన యాత్రలో మట్టిలో పాదం మోపి యాత్ర చేయటంవల్ల యాత్రానుభూతి ఉంది. ఆధునికయాత్రలో దూరప్రదేశాలకు తొందరగా వెళ్ళి వచ్చామన్న థ్రిల్లుంది. అనుభూతి లేదు ఆ అనుభూతి కూడ సంపూర్ణంగా ఉండదు. పేరుకు మాత్రమే చూశామన్న తృప్తి. వాహనయుగానికి ముందు మనిషికి బోలెడంత సమయముండేది. ఆధునికమానవునికి అంత తీరిక లేదు. ఆధునిక కాలంలో గొప్పగా భావించే యాత్రలే ఎక్కువ. అమెరికా అద్భుతాల దేశం, రష్యా ఒక ఆదర్శరాజ్యం. ఈ దేశాలకు వెళ్ళి రావడం స్వదేశాల్లో గొప్పగా చెప్పుకోవడానికి మాత్రమే ఉపకరిస్తుంది.

## ఇ) విషయాన్నిబట్టి యాత్రల వర్గీకరణ :

మరో పద్ధతిలో యాత్రా చరిత్రలను-

1. విషయ ప్రధానం (Informative)
2. వర్ణనా ప్రధానం (Aesthetic)

అని రెండు భాగాలుగా విభజించవచ్చు. యాత్రల్లో మూడు వంతులకుపైగా విషయప్రధానమైనవే ఉంటాయి. చాలవరకు ఇవి సమాచార ప్రాయంగా-చూసిన స్థలాలను, సంఘటనలను యధాతథంగా చెప్పేవిగా ఉంటాయి.

వర్ణనా ప్రధానమైన యాత్రాచరిత్రల్లో భావుకులైన కళాకారుల, రచయితల, కవుల వర్ణనలు కనిపిస్తాయి. వీటిలో కావ్యస్పర్శ ఉంటుంది. నాయని కృష్ణకుమారి గారి 'కాశ్మీర దీపకళిక' దీనికి మంచి ఉదాహరణ.

## ఈ) కాలక్రమాన్నిబట్టి యాత్రల వర్గీకరణ :

లక్ష్యానికీ, అనుభవానికీ ప్రాధాన్యమున్న ఈ యాత్రాప్రక్రియను యుగాల ప్రకారం లేదా కాలక్రమాన్ని అనుసరించి విభజించడం కష్టమే. సాహిత్యంలో యుగవిభజన ఎప్పుడూ ఖచ్చితంగా చేయలేము. ఒకసారి రంగంలో నిలదొక్కుకున్న ఒక ప్రక్రియ పాతబడక ముందే ఇంకో ప్రక్రియ వచ్చి చేరుతుంది. ఏకకాలంలో రెండుప్రక్రియలు సహజీవనం చేస్తుంటాయి. ఇది మనదేశపు సామాజిక లక్షణాల్లో ఒకటి. ఐతే-

1. వాహన పూర్వయుగం.
2. వాహన యుగం

అని స్థూలంగా రెండు పెద్ద పెద్ద విభజనలు చేయవచ్చునేమో! ఈ కాలక్రమ విభజన కూడ యాత్రా పద్ధతిలోకే వస్తుంది. ఇంతకన్న లోతుల్లోకి వెళ్ళినప్పుడు మరికొన్ని సూక్ష్మ విభాగాలను సాధించవచ్చు.

## 6. మానవుని ప్రాచీన యాత్రలు

ఉన్నచోటికి అతుక్కుపోకుండా మరోచోటికి పోవాలనే ప్రాథమిక ఆలోచన జీవరాసుల్లో రెక్కలుగా, కాళ్ళుగా రూపు దాల్చింది. ఆహారాన్వేషణకై గుంపులు గుంపులుగా పక్షులు భూగోళం యొక్క ఈ ధ్రువం నుండి ఆ ధ్రువానికి వలసపోతూ ఉంటాయి. వాతావరణపరిస్థితుల్ని బట్టి తిరిగి వస్తుంటాయి.

నానాటికీ అభివృద్ధి చెందుతున్న ఈనాటి సమాజంలో కూడా వర్షాకాలం రావడానికీ, పక్షుల వలసకూ మధ్య సంబంధముందని శాస్త్రజ్ఞులు నిరూపించారు. గోల కోయిల (Side christed cuckoo) అనే పక్షి ఏటేటా దక్షిణం నుండి ఉత్తరంగా ప్రయాణిస్తుందని, తిరిగి మళ్ళీ అక్కడి నుండి బయలుదేరి అదే దారిన తిరుగు ప్రయాణం కడుతుందని బర్డ్‌వాచర్స్ అభిప్రాయం. ఈ పక్షి

ప్రయాణించిన తర్వాత సుమారు పది, పదిహేను రోజుల్లో వర్షఋతువు వచ్చే స్తుందని వారు పేర్కొంటున్నారు.

ఉత్తర భారతదేశం నుంచి వలస వచ్చే 'హారియర్స్' కూడ చిలుకూరు, తాళ్ళపాడు పరిసరాల్లో గూళ్ళు కట్టుకుంటాయి. ఇవి ఐదు రకాలు. వాటిలో పిల్లి గద్ద, నీలిగద్ద తాళ ప్రమాణంలో ఎగురుతూ పరికించి చూసి పాములను, ఎలుక లను వేటాడతాయి. ఈ పక్షి గమనమే ఈనాటి అధునాతన విమానం 'సీహా రియర్' నిర్మాణానికి ప్రేరణం అని టి. ఉదయవర్లు పేర్కొన్నారు.[84]

ప్రయాణమనేది ఆదినుండి సభ్యతకొక విశిష్టత చిహ్నంగా ఉండేది. అనాటి ప్రయాణోద్దేశ్యాలు నేటికంటె కొంచెం భిన్నమైనవే కావచ్చు. పెద్దపెద్ద పర్వతాలుకాని, దుర్గమారణ్యాలుకాని, మండుటెడారులుకాని అతన్ని ప్రయాణ విముఖుణ్ణి చేయలేకపోయాయి. ముఖ్యంగా ఆదిమ మానవుని యాత్ర నూతన స్థలాన్వేషణ గురించి జరిగేది ఆహారపదార్థాలు అందుబాటుగా దొరికే స్థలాలను గురించి, పశుగ్రాసం పుష్కలంగా లభించే తావుల గురించి, నివాసయోగ్యమైన గుహల గురించి అన్వేషిస్తూ ఉండేవాడు. తానున్నచోట భూమి నిస్సారమైనా, శీతోష్ణపరిస్థితులు అనుకూలించకపోయినా అతని జీవనయాత్ర దుర్భరమయ్యేది. ఉన్నచోటనే అంటిపెట్టుకుని ఉంటే క్షుదార్తికి లోను కావలసి వచ్చేది. అందుకే ఆహారాన్వేషణకై నిత్యం పరిభ్రమించేవాడు అవసరం అన్వేషణకు ప్రేరణకదా!

ఐతిహాసిక యుగంలో శకులు మండుటెడారులు, కఠిన పర్వతభూములు దాటి ఇరాన్, భారతదేశాలకు వచ్చారు. ఆర్య సంస్కృతికి మూలపురుషులైన ఆర్యులు కూడ ఈ విధంగానే యూరప్‌లోనూ, ఇరాక్‌లోను సంచరించి చివరకు భారతదేశం వచ్చినవారే ఈ సంచారంలో వారు తీసిన తోవలే పిదప వర్తకు లకు వాణిజ్య మార్గాలయ్యాయి. శత్రురాజులకు దండయాత్రలు చేయడానికి వీలు కల్పించాయి.

---

84. లోకాలోకనం (A collection of Telugu essays) టి. ఉదయ వర్లు. కిన్నెర ఆర్ట్ థియేటర్స్, హైదరాబాదు. 1988.

గజనీమహమ్మద్, తైమూరు, అలెగ్జాండర్ మొదలైనవారు దండయాత్రల వల్ల దూరస్థాలైన ప్రాచ్యఖండ సామ్రాజ్యాలకు పశ్చిమఖండంలోని సామ్రాజ్య భాగాలతో అనుబంధం ఏర్పడింది. సంస్కృతిలో మార్పు వచ్చింది. అసంఖ్యాక మైన సైన్యాల పదఘట్టనలచే నూతన మార్గాలు ఏర్పడ్డాయి. ఆసియా ఖండానికి అలెగ్జాండరు జరిపిన దిగ్విజయయాత్ర ఒక పరిశోధకయాత్రగా పరిణమించింది. అతని నౌకాదళం పర్షియా సింధుశాఖను చుట్టివచ్చి, వాణిజ్యాభివృద్ధికి అనుకూలమైన ఒక కొత్త సముద్రమార్గాన్ని కనిపెట్టింది.

ప్రాచ్య యూరప్ ఖండంలోని వాణిజ్య వ్యాపారాలన్నీ మహమ్మదీయుల వశమైనాయి. కాన్‌స్టాంట్ నోపుల్ పతనమైన తర్వాత క్రైస్తవు లక్కడ నిలవ లేకపోయారు. కాబట్టి ఆసియాతో వాణిజ్య సంబంధా లేర్పరచుకోవలసిన అగత్య మేర్పడింది పోర్చుగీసువారికి యూరప్ ఖండం నుండి పడమటి దిక్కుగా సముద్రయానం చేసి తూర్పున ఉన్న ఇండియాను చేరుకోవచ్చునన్న ఆశతో నౌకాయాత్రలను ప్రోత్సహించారు. 1498 లో పోర్చుగీసు దేశస్థుడైన వాస్కోడి గామా మొట్టమొదటిసారి మలబారు తీరంలోని కళ్ళికోటకు చేరుకున్నాడు. ఈ నావికాయాత్ర తర్వాత పోర్చుగీసువారు ఇండియాను అనేకసార్లుదర్శించారు.

మానవుడు నాగరికత పొందినప్పటినుంచి నూతనప్రదేశాలను దర్శించాలని, వాటి విశేషాలను తెలుసుకోవాలని కుతూహలపడుతూ వచ్చాడు. భరత భూమి ఐశ్వర్యానికి ఈర్ష్యచెంది కొలంబస్, వాస్కోడిగామా, అమెరిగోవెస్పుక్కి, కుక్, డ్రేక్ మొదలగు సాహసికులు సముద్రమార్గం గుండా అన్వేషణకు పూనుకున్నారు మంగోపార్కు, బేకర్, లివింగ్‌స్టోన్, స్టాన్లీ మొదలైన ధీరులు ఆఫ్రికా లాంటి చీకటి ఖండాన్ని భేదించారు. భూగోళపు ఉత్తర దక్షిణ ధ్రువాలను నిర్ణయించటంలో అత్యంత సాహసోపేతమైన యాత్రలు చేశారు. ఆ వివరాలను తెలిపే కథలు, చరిత్రలు పాశ్చాత్య సాహిత్యానికి అలంకారాలుగా భాసించాయి.

మానవజాతికి నూతన స్థలాలను కనిపెట్టాలనే అభిలాష భూగోళ పరిశోధనతో తీరలేదు. రాకెట్ల వంటి హైస్పీడ్ సాధనాల ద్వారా ఆకాశయానం చేసి చంద్రమండలం చేరుకున్నారు ఇంకా అనువైన ఇతర గ్రహాలను కూడ నివాస యోగ్యం చేసుకోవాలని ప్రయోగప్రయత్నాలు చేస్తూనే వున్నారు.

**ప్రపంచ యాత్రలు :-**

విశ్వవ్యాప్తంగా జరిగిన ఇటీవలిశతాబ్దాల్లోని యాత్రల, యాత్రికుల వివరాలను గురించి లభిస్తున్నంత వరకు పరిచయ మాత్రంగా తెలుసుకోవడం అవసరం.

డా॥ శామ్యూల్ జాన్సన్, జేమ్సు బోస్వెల్ వీరిద్దరూ సహయాత్రికులు. తమ యాత్రానుభవాలను "Journey to the western islands of Scotland (1775,) Journal of a Tour to the Hebrides (1786)" అనే యాత్రాగ్రంథాలుగా వ్రాసి ప్రకటించారు. వీటిలో స్కాట్లండు దేశంలో మారుమూల ప్రాంతాల జనుల ఆచారవ్యవహారాలు నాగరికులకు తేటతెల్లమయ్యే విధంగా చిత్రించారు.

స్కాట్లండు నివాసి కెప్టెన్ బేసిల్‌హాల్ ఈస్టిండియాకంపెనీ వారి ఆదేశాల మేరకు 1812లో భారతదేశానికి ఉద్యోగరీత్యా వచ్చాడు. ఇండియా, శ్రీలంక, బోర్నియో దేశాలనుసందర్శించాడు.ఆ యాత్రానుభవాలను "Travels to India, ceylon & Borneo'' అని ప్రచురింపజేశాడు. అట్లాగే 1820లో దక్షిణ అమెరికాకు వెళ్ళి అక్కడి వివరాలను 'Extracts from a journal written on the coasts of Chile, Peru and Mexico, in the years 1820-21-22' అనేపేర సంగ్రహపరిచాడు. ఈ గ్రంథం ఆ కాలంలో బహుళ జనాదరణ పొందింది.

ఉత్తర అమెరికాకు విశ్రాంతికోసం వెళ్ళిన కెప్టెన్ బేసిల్ అప్పటి తన అనుభవాలను గ్రంథరూపంలో పెట్టాడు. దానిపేరు 'Travels in North America in the years 1827 and 1828.' యాత్రానంతరం సంవత్సరానికి అనగా 1829లో ఈ రచన పూర్తయ్యింది. ఈ పుస్తకంపై అమెరికాలో వాదోపవాదాలు చెలరేగాయి. అమెరికాలోని జనుల ఆంతరిక జీవనానికీ రచన అద్దం పట్టడమే ఈ దుమారానికి కారణం. ఇది ఫ్రెంచి భాష లోకి అనువదింపబడింది.

ఈ గ్రంథం అమెరికాలో తీవ్ర సంచలనం కలిగించిందని ప్రొఫెసర్ హెచ్. జి. రాలిన్‌సన్ (H. G. Raulinson, Indian Educational service) ముందుమాటల్లో ఇలా చెప్పాడు: "This work caused a sort of 'moral earth quake' in the United states."[86]

అమెరికాలో పుస్తక విక్రయశాలలు (Book shelves) ఈ పుస్తకాన్ని నిషేధించాయి. రచనపై ఇంత దుమారం చెలరేగినా ఆ కాలపు మహా రచయిత మార్క్‌ట్వైన్ మాత్రం దీనిలో సత్యదూరమైన విషయాలేవీ లేవని ప్రకటన చేస్తూ బేసిల్‌హాల్‌ను సమర్థించాడు.

ప్రొఫెసర్ ఇదే విషయాన్ని తన ఉపోద్ఘాతంలో ఇట్లా పేర్కొన్నాడు. "Hall found a stout defender in Mark Twain, who declared the book contained 'not one exaggerated statement."[87]

ఆంగ్లేయులు ప్రయాణశీలురు. అందుకే ప్రపంచాన్ని చుట్టివచ్చిన వాళ్ళే కాదు, గుప్పిట పట్టుకున్నవాళ్ళుకూడా అయ్యారు. వారికున్న నౌకాయాన కౌశలం వల్లే రవి అస్తమించని సామ్రాజ్యాన్ని ఒకప్పుడు స్థాపించ గలిగారు వీరిని ఒక రకంగా సముద్రపు చేపలనవచ్చు. ఇంగ్లాండునుండి ఎందరో రచయితలు, సాహసికులు ఎన్నో యాత్రలు చేసి తమ భాషలో యాత్రా సాహిత్యాన్ని పెంపు చేశారు.

స్టీవెన్సన్ అనే గ్రంథకర్త 1876లో సర్ వాల్టర్ సింప్సన్‌తో కలిసి చిన్న నావలో యాత్ర చేశారు. ఏన్‌ట్‌వర్ప్ నుండి మొదలైన వీరి జలయాత్ర వర్షంలో, భయానకమైన సన్నని సముద్ర మార్గాలగుండా కొనసాగింది. స్టీవెన్సన్ తన యాత్రాను భవాలను 'An Inland Voyage' అనే పేర 1878లో ప్రకటించాడు. రాత్రులలో తలదాచుకోవటానికై తాము పడ్డపాట్లను ఆయన దీనిలో వివరించాడు.

---

౮౬. "Travels in India, ceylon and Borneo" -captain Basil Hall, R. N. . Introduction by H. G. Raulinson. P. 11.

87. Ibid. p. 11.

యాత్రాగ్రంథాల్లో ప్రముఖ స్థానాన్ని ఆక్రమించేది ఈయనదే మరో పుస్తకం 'Travels with a Donkey in the cevennes'... మోడెస్టెయిన్ అనే గాడిదను తీసికొని ఫ్రాన్సులో చేసిన ప్రయాణ వర్ణన దీనిలో ఉంది. ప్రయాణ సన్నాహానికి, గాడిదలను కొనడానికి సంబంధించిన అంశాలు గ్రంథారంభంలో వివరింపబడ్డాయి. ఇంకా 'Across the plains' 'The Amateur Emmigrant' అనే రచనల్లో ఇంగ్లాండునుండి అమెరికాకు, న్యూయార్కునుండి శాన్‌ఫ్రానిస్కోకు స్టీవెన్‌సన్ చేసిన యాత్రావిశేషాలున్నాయి.

ఒక చిన్న డింగీ (The casco)లో స్టీవెన్‌సన్ దక్షిణ సముద్ర దీవుల నడుమ ప్రయాణించాడు. ఈ జలయాత్రలోని అనుభూతులకు అక్షర రూపమే 'In the south seas' అన్నది. ఇది ఈయన చివరి రచన. ఆ దీవుల్లోని ప్రకృతి సౌందర్యం, అక్కడి ప్రజల జీవనస్థితిగతులూ దీనిలో వర్ణించబడ్డాయి.

ఈ శతాబ్దంలోనే ఆఫ్రికా ఖండానికి సంబంధించిన అపురూపమైన విశేషాలను తెలియచెప్పే యాత్రా గంథాలు వెలువడ్డాయి. వాటిలో మంగో పార్కు యాత్రలు (Mungo parks's Travels. 181) ప్రసిద్ధమైనవి.

1874లో ఇంగ్లండునుండి 'డెయిలీ టెలిగ్రాఫ్' పత్రికాయాజమాన్యం స్టేన్లీ (అసలు పేరు సర్ హెన్రీ మార్టిన్ 1840 - 1904) నాయకత్వంలో ఒక దళాన్ని ఆఫ్రికాకు పంపింది. మూడు సంవత్సరాలయాత్ర ఇది. దీనికి సంబంధించిన యాత్రా వర్ణన 'Through the Dark continent'లో వర్ణించబడింది.

ఈయనదే మరో పుస్తకం 'In Darkest Africa (1890)' ఆఫ్రికాలో ఎదుర్కొన్న భయానక సన్నివేశాలతో కూడిన రచన.

హెన్రీ వయస్సులో ఉన్నప్పుడు చేసిన యాత్రలను గురించి 'My Early Travels and Adventures' అనే గ్రంథంలో వ్రాశాడు. 1896లో మూడోసారి ఆఫ్రికా సందర్శించి 'Through South Africa' అన్న పుస్తకానికి రూపమిచ్చాడు.

ప్రపంచదేశాలన్నీ పర్యటించిన 'విస్తృతయాత్రికుడు' రాహుల్ సాంకృత్యాయన్. ఈయన ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలో 1893లో జన్మించాడు. అసలు పేరు కేదారనాథ్ పాండే.

పదేళ్ళ వయస్సులో తాను చదువుతున్న మూడోతరగతి పాఠ్యగ్రంథం లోని కథలో ఇలా ఉన్నదట:

''సైర్ కర్ దునియా కి గాఫిల్, జిందగానీ ఫిర్ కహాఁ
జిందగీ అగర్ కుఛ్ రహీతో నౌజవానీ ఫిర్ కహాఁ!''

"ఓ మూర్ఖుడా! జీవితం దుర్లభం కాబట్టి ప్రపంచ పర్యటన చేయి. ఈ జీవితం ఇక వుండదు. ఒకవేళ కొంత మిగిలినా మళ్ళీ యవ్వనం దుర్లభం" అని దీని అర్థం."[88] ఇది రాహుల్ మనస్సుపైన చెరగనిముద్ర వేసింది. అందుకే తన యవ్వన కాలాన్నంతా దాదాపు ౪౪ సంవత్సరాలపాటు ప్రపంచ దేశాల పర్యటనలోనే గడిపివేశాడు. ప్రపంచప్రజలతో ఎంతోసన్నిహితంగా మెలిగిన రాహుల్ వంటి మానవుడు 'నభూతో న భవిష్యతి.'

రాహుల్ తనతోపాటు మరెందరో యాత్రికులను తయారుచేసే ఉద్దేశ్యంతో 'ఘుమక్కడ్ శాస్త్ర' అనే యాత్రావిజ్ఞానశాస్త్రం రచించాడు. ప్రపంచంలోనే మొట్టమొదట ఇలాంటి గ్రంథం రచించిన ఖ్యాతి ఈయనకు దక్కింది.

'ఓల్గా సే గంగా' అన్నది క్రీస్తుపూర్వం వేల సంవత్సరాల నుండి మానవుడు పొందిన క్రమవికాస గతిని నిరూపించే అద్భుతగ్రంథం. దీనిలో ఎన్నో అపురూప చారిత్రకాంశాలను రాహుల్ మనకు వివరించాడు. ఈ గ్రంథం దాదాపు 15 భాషల్లోకి అనువదింపబడింది. స్వదేశంలోనేకాక యూరప్, ఆసియా (రష్యా), చైనా, జపాన్, టిబెట్, లడఖ్ దేశాలలో కూడ విస్తృతంగా పర్యటించి తన అనుభవాలను యాత్రా గంథాలుగా వెలువరించాడు. ఐతే ఇవన్నీ హిందీ భాషలో వ్రాయబడి ఉండటంవల్ల వాటిని వేరేచోట పేర్కొనడం జరిగింది.

---

88. మహోన్నత మానవుడు రాహుల్ సాంకృత్యాయన్.
సేకరణ : బండ్లపల్లె ఓబుల్ రెడ్డి పేజి. 25.

1964 లో ప్రపంచయాత్ర చేసి వచ్చి 'Journey round the World' అనే యాత్రాగ్రంథం వ్రాశాడు కె. పి. యస్ మీనన్. ఈయన పూర్తి పేరు కుమార పద్మనాభ శివశంకర మీనన్. రచయితగా లబ్ధప్రతిష్టుడు. భారత ప్రభుత్వ ప్రతినిధిగా అనేక పర్యాయాలు ప్రపంచ పర్యటనలు చేశాడు. రష్యా, చైనా దేశాలకు భారత ప్రభుత్వ ప్రతినిధిగా పనిచేశాడు. ఆయన పర్యటించిన వివిధ దేశాలలోని విశేషాలను, ఆయాప్రాంతాలలో త్వరితగతిని సాగుతున్న పరిణామాలను, చిత్రవిచిత్ర సాంఘికాచారాలను ఆకర్షణీయంగా రచించాడు. దాదాపు ఐదునెలల యాత్ర.

ఈయన దర్శించిన పాశ్చాత్యదేశాల పేర్లు; బాంక్‌కాక్, హాంగ్‌కాంగ్, టోక్యో, అమెరికాలోని శాన్‌ఫ్రాన్సిస్కో, లాస్‌ఏంజిల్స్, మెక్సికో, న్యూయార్కులు; యూరోప్‌లో లండన్, జర్మనీ, బెర్లిన్, జెనీవా, బెల్‌గ్రేడ్, బుడాపెస్టులు; రష్యాలో మాస్కో, క్రిమియా పట్టణాలు.

మీనన్ యాత్రాకాలంలోనే నెహ్రూగారి ఆకస్మిక మరణం, నూతన ప్రధానిగా శాస్త్రీజీ నియామకమూ జరిగాయి.

ఈ విధంగా ఒక లక్ష్యంతో సాగిన ప్రపంచయాత్రలు లోకానికి ఎంతో ఉపయోగకరంగా పరిగణమించాయి.

## 7. భారతదేశం - ప్రాచీన యాత్రికులు

వేలాది సంవత్సరాలనుండి మనదేశానికి రాయబారులుగా, మతగురువులుగా, యాత్రికులుగా, దండయాత్రల నెపంతో అనేక మంది వస్తూనే వున్నారు. వారు అక్షరబద్ధం చేసిన యాత్రాగ్రంథాలు ఆనాటి భారతదేశ పరిస్థితులను ప్రతిబింబిస్తున్నాయి. ప్రాచీన భారతదేశ చరిత్ర పునర్నిర్మాణానికి ఈ గ్రంథాలు అమూల్యమైన ఆధారశిలలవుతాయి

### (i) మెగస్తనీసు :-

ఉపలబ్ధ సమాచారాన్ని బట్టి భారతదేశాన్ని సందర్శించిన తొలి యాత్రికుడు మెగస్తనీసు. ఇతడు గ్రీకు దేశీయుడు చరిత్రకారుడు. సెల్యూకస్

నికేటర్ ఇతన్ని మౌర్య చంద్రగుప్తుని ఆస్థానానికి రాయబారిగా పంపాడు [89] ఇది క్రీ. పూ. 302 లో జరిగింది. మెగస్తనీసు పదిసంవత్సరాల పాటు పాటలీ పుత్రంలో నివసించాడు.[90] దేశమంతా పర్యటించి భారతదేశం గురించి ప్రత్య క్షంగా చూసి సేకరించిన వివరాలను 'ఇండా' అన్న గ్రంథంలో వివరించాడు. ముఖ్యంగా ఆనాటి సాంఘిక ఆర్థిక పరిస్థితులపై దృష్టిని కేంద్రీకరించాడు.

భారతదేశ ప్రజల ఆకార విశేషాల గురించి ఈ విధంగా వర్ణించాడు: "భారతీయులు పొడవుగా, బక్కపలచగా ఉంటారు. చాల మంది తెల్లని నూలు దుస్తులే ధరిస్తారు. ఐతే ఈ బట్టలు వారి నల్లని శరీర వర్ణాన్ని మరింత కొట్టొచ్చి నట్టు కనిపింపజేస్తాయి తెలుపు, ఎరుపు, నీలి, ఆకుపచ్చ వర్ణాల్లో గడ్డాలకు రంగు వేసుకుంటారు ఎండవేడిమి నుండి రక్షణకై తోలుచెప్పులను, గొడుగులను వాడ తారు."

వరకట్నాల బెడద అప్పుడు లేదు కాని కుమార్తెలకు పెండ్లి చేయలేని దుస్థితిలో తల్లిదండ్రులు తమ బిడ్డలను మార్కెట్లలో అమ్ముకుంటారు. ఈ విధానం మెగస్తనీసుకు దిగ్భ్రమ కలిగించింది.

"అధిక సంఖ్యాకులు గుర్రాలపై ప్రయాణిస్తారు. కలిగినవారు ఒంటెలపై పయనిస్తారు. అధిక సంపన్నులు ఏనుగులను, ఇంకా రథాలను కూడ ఉపయో గిస్తారు. గాడిదలపై ప్రయాణించటం కూడఉంది కాని అది హీనంగా పరిగ ణింపబడేది."[91]

---

90. ఇప్పటి పాట్నా. బీహారుకు రాజధాని

89. సెల్యూకస్ నికేటర్ (క్రీ పూ. 312 - 280) అలెగ్జాండర్ చక్రవర్తి కాలంలో సమర్థుడైన సేనాని చక్రవర్తి మరణానంతరం సెల్యూకస్ రాజయ్యాడు

91. Most people travelled on horseback. Those who were better off rode camels, but ridding an ass was considered comtemtible and inferior. The wealthier class used elephants and some times chariots - As they saw India - K. C. Khanna, National Book Trust, India - P. 11.

పన్నులు సవ్యంగా వసూలుచేయబడేవి. బాటలపొడవునా మూడు నాలుగు మైళ్ళ కొక స్తంభం పాతిపెట్టబడి ఉండేది ఇది మార్గసూచిగా, మైలురాయిగా ఉపకరించేది

క్రీస్తు శకారంభంలో ఒక ఆర్మీనియన్ దేశస్థుడు భారతదేశాన్ని సందర్శించాడట. తన పర్యటనానుభవాలను గ్రంథస్థం చేశాడనీ, దాని మూలప్రతి ఎరవాన్‌లోని మతిదరాన్ గ్రంథాలయంలో ఇప్పటికీ భద్రంగా ఉందనీ డా. రావూరి భరద్వాజ గారు ''ఇనపతెర వెనక'' అనే తమ యాత్రా గ్రంథంలో పేర్కొన్నాడు. ఎరవాన్ అన్నది సోవియట్ రష్యాలోని 15 రిపబ్లిక్‌లలో ఒకటైన ఆర్మీనియాకు రాజధానీ నగరం.

టాలెమీ ఈజిప్టు దేశస్థుడు ఈయన భూగోళ శాస్త్రజ్ఞుడు. క్రీ.శ. 150వ సంవత్సరంలో ఆంధ్రదేశ సంచారం చేశాడు. తెలుగుదేశం గురించి తన రచనల్లో ప్రస్తావించాడు.

(ii) **ఫాహియాన్ :**

మెగస్తనీను తర్వాత దాదాపు 700 సంవత్సరాలకు అంటే క్రీ.శ. 400 ప్రాంతంలో ఫాహియాన్ అనే బౌద్ధ సన్యాసి భారతదేశానికి వచ్చాడు. అప్పటి కతని వయస్సు 25 సంవత్సరాలు. చైనా సామ్రాజ్యంలోని 'షాంగన్' నగర నివాసి.

బుద్ధ భగవానుడు భిక్షువులకు కొన్ని నియమాల నేర్పరచి వాటికి 'వినయ్' అని నామకరణం చేశాడు. ఈ గ్రంథాలు చైనాలో కొరవడినందున అక్కడి బౌద్ధ భిక్షువులు తమ నియమాలను, విధులను క్రమంగా మరచిపో సాగారు ఇది గమనించిన ఫాహియాన్, బుద్ధుని జన్మస్థలమైన భారతదేశానికి బయలుదేరాడు బుద్ధుని జన్మస్థలాన్ని దర్శించాలన్న కోరిక కూడ ఈయాత్రకు తోడైంది.

క్రీ శ. 399వ సంవత్సరంలో షాంగన్ నగరం నుండి తన మిత్రులతో బయలుదేరి, ఆరు సంవత్సరాల సుదీర్ఘ ప్రయాణం తర్వాత ఆర్యావర్తం చేరుకున్నాడు. ఆకాలంలో అంతటి దూరప్రయాణం చేయటం కష్టసాధ్యమైన విషయం. ఐనా ఫాహియాన్ కేవలం కాలినడకతో అంతదూరం ప్రయాణించాడు.

ఫాహియాన్ భారతదేశంలో ఆరేండ్లుండి తక్షశిల, కపిలవస్తు, గయ, కుశనగరము లాంటి బౌద్ధక్షేత్రాలను, కన్యాకుబ్జ, కోసల, గాంధార, మగధ, మధుర రాజ్యాలను సందర్శించి అక్కడి విశేషాలను గ్రంథస్థం చేశాడు. ఈ పుస్తకానికి 'A Record of Budhist Kingdoms' అని పేరు.[92]

ఫాహియాన్ యాత్రాకాలం నాటికి మగధ సామ్రాజ్యాన్ని చంద్రగుప్త విక్రమాదిత్యుడు పరిపాలిస్తున్నాడు

ఫాహియాన్‌తో భారతదేశానికి వచ్చిన సహయాత్రికుడు టోచింగ్ ఆర్యావర్త వైభవాన్ని చూసి సమ్మోహితుడై "నేను బుద్ధత్వమును బడయు వరకు నిందేయుండెదను. పెరభూముల ద్రొక్కను" అని పాటలీపుత్రంలోనే ఉండిపోయాడు.[93]

తర్వాత ఫాహియాన్ హుగ్లీనదీ ముఖద్వారమున ఓడనెక్కి 14 రోజుల ప్రయాణానంతరం శ్రీలంకకు చేరుకున్నాడు.[94] ఈ ప్రదేశం బంగాళాఖాతపు రేవుపట్టణమనీ, దానిపేరు తామ్రలిప్తి అని పేర్కొనబడింది.[95] కె.సి. ఖన్నా కూడ ఈ ఓడరేవుకు ఇదేపేరు సూచించాడు. After Fahiens stay in India, he left form Tamralipti (Tamluk) for ceylon - a voyage which took him fourteen days."[96]

శ్రీలంకలో రెండేండ్లుండి చైనాకు తిరిగి వెళ్లేటప్పుడు నౌకాప్రయాణంలో ఫాహియాన్ ఎన్నో ఇబ్బందులు పడ్డాడు. నౌక ప్రచండమైన గాలులకు గురై

---

92. As they saw India - K C Khanna. P. 19.
93. ఫాహియాన్ భారతవర్షయాత్ర - వేలూరి సత్యనారాయణ,. తొలి పలుకు - పేజీ 8.
94. ఫాహియాన్ భారత వర్షయాత్ర - వేలూరి సత్యనారాయణ. తొలిపలుకు - పేజీ. 8.
95. ఫాహియాన్ భారత యాత్ర - పణితపు నాగేశ్వరరావు. ఆంధ్రప్రభ ఆదివారం అనుబంధం. 28. 6. 1985.
96. As they saw India - Page. 28

మునగటానికి సిద్ధమైంది. పద్నాలుగుఏండ్లు కష్టపడి సేకరించిన అమూల్య గ్రంథాలు నీటి పాలవుతాయేమోనని ఆందోళన చెందాడు కాని ఆ గండం గడిచింది. ఓడ ఒడ్డుకు చేరగానే యవ (జావా) ద్వీపంలో ప్రవేశించి అక్కడి నుండి స్వదేశం చేరుకున్నాడు.

ఉత్తర భారత, సింహళ ద్వీపాల్లో తాను గమనించినవిశేషాలను పట్టు బట్టల మీదా, వెదురు పలకల మీదా వ్రాశాడు. జైల్సు, లెగ్గీ అనే చరిత్రకారులు ఈ యాత్రానుభవ వివరాలను ఆంగ్ల భాషలోకి అనువదించారు.[97] ఐదవ శతాబ్దపు భారతదేశ చరిత్రను, సింహళదేశ చరిత్రను తెలుసుకోవటానికి ఫాహియాన్ పర్యటనానుభవాలు ఎంతో ఉపకరిస్తాయి.

ఫాహియాన్ మధురలోని (ఉత్తర దేశంలోనిది) హిందూ దేవాలయాల గురించి ఎందుకో వ్రాయలేదు కాని బౌద్ధ భిక్షువులకు ఆ కాలంలో ఎంతటి గౌరవ మర్యాదలుండేవో వివరించాడు బౌద్ధ భిక్షువులకు దానమిచ్చే సమయంలో రాజు కిరీటం ఉంచుకునేవాడు కాదనీ, ఏ భిక్షువు ముందు కూడ సింహాసనం మీద కూర్చునేవాడు కాదనీ పేర్కొన్నాడు. ఇదే విషయాన్ని వేలూరి సత్యనారాయణ గారు మరింత వివరించారు. "శ్రమణకుల (బౌద్ధభిక్షువులు)తో భాషింపవలసినపుడిచ్చటి నృపులు వారి ముంగిట నొక రత్నకంబళము బరపించి దానిపై గూర్చుండి వినమ్రులై వారితో ముచ్చటించేవారు."[98]

మధ్యప్రదేశ్ ప్రజల ఆచార వ్యవహారాలను పేర్కొంటూ ఇక్కడ ఏ వ్యక్తి అయినా రాజవిద్రోహ చర్యకు పాల్పడితే అతని చేతులు ఖండింపబడేవనీ, హత్యలు దోపిడీలు మచ్చుకైనా కానరావనీ ఐతే అంటరానితనం మాత్రం కచ్చితంగా అమలు జరుపబడుతుందని వ్రాశాడు. పశువధ మొదలైన క్రూరకర్మలు చేసే వారిని చండాలురనేవారు. వీరికి ఊరి బయటనే నివాసం. ఊళ్ళోకి ప్రవేశించేటప్పుడు గాని, మార్కెట్లోకి అడుగుపెట్టేటప్పుడు గాని తాము చండా

---

97. Travels of Fa-hien - H.A. Giles.
    Travels of Pahian - James Legge.

98. ఫాహియాన్ భారత వర్షయాత్ర - పేజీ. 49.

లరమని తెలపటానికి వీరు కర్రలతో కొట్టుకుంటూ చప్పుడుచేస్తూ వెళ్ళేవారు. జనులా ధ్వనివిని వారు తమకు అంటకుండ దూరంగా తొలిగిపోయేవారు. గిల్స్ మాటల్లో చెప్పాలంటే "When they approach a city or market they beat a piece of wood, in order to distinguish themselves. Then people know who they are and avoid coming into contact with them."[99]

## (III) యువాన్‌చ్వాంగ్ :-

మరో రెండుశతాబ్దాల తర్వాత అంటే క్రీ. శ. 630 ప్రాంతాల యువాన్‌చ్వాంగ్ అనే చీనా యాత్రికుడు భారతదేశానికి యాత్ర చేశాడు.[100] ఈయన క్రీ శ. 600 వ సంవత్సరంలో చైనాదేశంలోని 'హోన్' జిల్లాలోని 'కౌషి' నగర సమీపంలోని 'చెన్‌పావుకో' అనే కుగ్రామంలో జన్మించాడు. ఇరవైయేండ్లు వచ్చేసరికి సన్యాస దీక్ష వహించాడు. అప్పటికే బౌద్ధమతానికి ఆదరణ తగ్గిపోతూ ఉండడాన్ని గమనించి కలత చెందాడు. బుద్ధుని అసలైన బోధనలేవో తెలియాలంటే భారతదేశ పర్యటనం తప్పనిసరి అని భావించాడు.

---

99. The Travels of Fahien (A. D. 399-414) translated by H. A. Giles. ఇందులో విషయాన్ని 'some glimpses of the golden period (A D. 320 - 455)' అన్న పేర డా బి. ఎన్. పాండే తాను సంకలనం చేసిన 'A book of India' అన్న గ్రంథంలో తెలిపాడు. పేజీ. 37.

100. ఈయన పేరు హువాన్‌థ్సాంగ్, హ్యూన్‌త్సాంగ్, హ్యూన్‌త్స్యాంగ్, హోనుత్స్యంగ్, యువాన్‌త్స్యాంగ్, యువాన్‌చ్వాంగ్ అని చరిత్రకారులు రకరకాలుగా పిలుస్తున్నారు ఐతే 'యువాన్ చ్వాంగ్' అన్న పేరే చైనా పదానికి భాషాంతరీకరణమని వి. డి. గంగల్ అభిప్రాయపడ్డాడు 'హర్షుడు' - వి. డి. గంగల్, అనువాదం: ఆర్. రాఘవరావు, నేషనల్ బుక్‌ట్రస్టు, ఇండియా (పేజీ 3.).
భావరాజు వెంకటకృష్ణారావు గారు కూడ తమ 'విదేశ యాత్రికులు - ప్రాచీనాంధ్రదేశము' అన్న గ్రంథంలో ఇదే పేరు వాడుకున్నారు.

జ్ఞానతృష్ణాతంత్రుడై బుద్ధుని వలెనే ఎవరికీ చెప్పకుండా ఒకనాటి అర్ధరాత్రి యువాన్‌చ్వాంగ్ భారతదేశానికి ప్రయాణమయ్యాడు ఎడారులు, పర్వతాలు, నదీనదాలు, అపరిచిత ప్రదేశాలు దాటి 15 వేల మైళ్ళు (24,000 కి మీ.) ప్రయాణించాడు. ఫాహియాన్ లాగే ఈయన కూడ దాదాపు 14 సంవత్సరాలు ఇల్లు వదిలిపెట్టాడు హర్షుని ఆస్థానంలోనే ఎక్కువ కాలం గడిపాడు.

స్వదేశానికి వెళ్లేటప్పుడు యువాన్‌చ్వాంగ్ 657 బౌద్ధధర్మ, మంత్ర, శాస్త్ర, సూత్ర, వ్యాఖ్యాన గ్రంథాలను ఒంటెలమీద వేసి తీసికొని వెళ్ళాడు వెండి, బంగారు, మంచిగంధంతో చేసిన బుద్ధుని అందమైనప్రతిమలను, బుద్ధుని అస్థికలను 150 ని అతిభద్రంగా చైనా దేశానికి తరలించాడు.[101]

యువాన్‌చ్వాంగ్ పునరాగమనం ఒక తిరునాళ్ళ వలె గడచిపోయినదట! ఈయన యాత్రలో చూసిన వింతలు, విశేషాలను చీనా చక్రవర్తి పదే పదే అడిగి తెలుసుకున్నాడు ఐనా తృప్తిచెందక అతని యాత్రానుభవాలను గూర్చి ఒక గ్రంథం వ్రాసి తనకు అంకితమివ్వవలసిందిగా కోరాడు యువాన్‌చ్వాంగ్ తన యాత్రా వివరాలను ఒక క్రమంలో పొందు పరుస్తూ 'షీయూచి' లేదా 'సియూకి' అనే గ్రంథం వ్రాశాడు. దీని పూర్తిపేరు 'తా-తాంగ్-షీ-యూ-చీ' అనగా 'తాంగ్ వైభవకాలము నాటి పశ్చిమదేశపు వివరములు' అని అర్థం.[102] ఈ పుస్తకం దాదాపు పాశ్చాత్య భాషలన్నిటిలోకి అనువదించబడిందట! వాటిల్లో ఎస్ బీల్ రచించిన 'Hieun Tsangs' Travels in India (A D. 629-44)' అన్నది ఒహుళ ప్రచారం పొందింది.

---

101. విదేశయాత్రికులు - ప్రాచీనాంధ్ర దేశము - పేజీ. 8.
102. హర్షుడు. వి. డి. గంగల్. పేజీ. 4.
'As they saw India' అన్న పుస్తక రచయిత, K C. Khanna 'Travels or Records of westean lands' అని పేర్కొన్నాడు. పేజీ. 88
భావరాజువారు "పశ్చిమ దేశమునందలి బుద్ధునికి సంబంధించిన వృత్తాంతములు" అన్నారు. పేజీ. 9.

యువాన్‌చ్వాంగ్ మధ్య ఆసియా టర్కీల గుండా ప్రయాణిస్తూ హిందూ కుష్ పర్వతాలను దాటి, కాబూల్ లోయకు చేరుకున్నాడు. ఖైబరు కనుమ ద్వారా భారతదేశం ప్రవేశించాడు. పురుషపురం (నేటి పెషావర్)లో చెరకు గడల నుండి చక్కెర తయారు కావడాన్ని చూసి వింత చెందాడు మెగస్తనీసు కూడ ఇదేవిధంగా ఆశ్చర్యపడినట్లు ఖన్నా తమగ్రంథంలో వ్రాశాడు.

"He remarks on the production of sweet honey although there were no bees. This must have been 'gur' which is made from sugar cane."[103]

తర్వాత యువాన్‌చ్వాంగ్ కాశ్మీరానికి వెళ్ళి అక్కడ రెండేండ్లున్నాడు. ఈ సమయాన్ని అక్కడ పవిత్ర బౌద్ధమతగ్రంథాలను ఎత్తి వ్రాసుకోవడానికి సద్వినియోగం చేశాడు కాశ్మీర చక్రవర్తి ఇతన్ని ఆదరించి, కావలసిన సమాచారం సేకరించడానికి ఇరవైమంది వ్రాయసకాండ్రను నియోగించాడట!

కాశ్మీరు నుండి తిరిగివస్తూ కులూ, జలంధర్‌ల గుండా హర్షవర్ధనుని రాజ్యసీమలో ప్రవేశించాడు.[104] యువాన్‌చ్వాంగ్ వ్రాతలను బట్టి హర్షుడు తన సామ్రాజ్యమంతటా యాత్రికుల సౌకర్యార్థం విడిది గృహాలను, అధిక సంఖ్యలో బౌద్ధారామాలను నిర్మించినట్లు తెలుస్తున్నది

తర్వాత ప్రయాగ (నేటి అలహాబాదు) చేరుకున్నాడు బౌద్ధక్షేత్రాలన్నీ సందర్శించాడు. వాటిలో కపిలవస్తు, శ్రావస్తి, రాజగృహ, గయ ప్రాంతాలు ఫాహియాన్ కాలం నాటికంటె మరింత పాడుపడ్డాయట!

కాశీ పట్టణం ఇందుకు భిన్నంగా ఉంది. అధికసంఖ్యాకులు శివారాధన చేస్తున్నారు బౌద్ధ భిక్షువులు మాత్రం తక్కువే ఉన్నారు.

---

103. As they saw India - P. 6

104. హర్షున్ని ఖన్నా 'శిలాదిత్యుడ'ని పేర్కొన్నాడు.
"The Kingdom of Kanauj was governed by Siladitya (Harshavardhana) - do - P. 87.

మగధరాజ్యంలో యువాన్చ్వాంగ్ 5 సంవత్సరాలున్నాడు. ఇక్కడ నలందా విహారంలో ఎక్కువసమయాన్ని గడుపుతూ, సంస్కృతభాషను నేర్చుకున్నాడు. ఈ విహారంలో పదివేలమంది శ్రమణకులు (సన్యాసులు) నివసిస్తున్నారు. వీరి ఆలనా పాలనా రాజూ, పరిసర పట్టణాలలోని ప్రజలూ చూసేవారు. ఆరంతస్తుల ఎత్తైన భవనమిది. మెగస్తనీసు కాలంలో రెండు మూడంతస్తుల నివాస గృహాలు, ఫాహియాన్ కాలంలో ఐదంతస్తుల ఆరామాలు, యువాన్చ్వాంగ్ కాలంనాటికి ఆరంతస్తులవిహారాలు - గృహనిర్మాణంలో ఈ క్రమవికాసం గమనింపదగ్గదే. నలందావిశ్వవిద్యాలయం అప్పుడు ఉచ్చ దశలో ఉంది, విదేశాల నుండి కూడ విద్యార్థులు జ్ఞానసంపాదన కోసం ఈ విద్యాలయానికి వస్తూండేవారట!

నలందా చేరిన రెండు సంవత్సరాల తర్వాత అనగా 639 వ సం॥లో తామ్రలిప్తిలో ఓడనెక్కి సింహళద్వీపం మీదుగా చైనాదేశానికి పోవాలనుకున్నాడు. కాని యువాన్చ్వాంగ్ తామ్రలిప్తికి చేరేటప్పటికి వర్షాకాలం ప్రారంభమైంది. కాబట్టి ప్రయాణం వాయిదా వేసుకోవలసివచ్చింది. సాధువులకు, భిక్షువులకు వర్షాకాలంలో యాత్రనిషిద్ధము.[105]

ఈ మధ్యకాలంలో దక్షిణదేశం సందర్శించాలనే కోరికతో యువాన్చ్వాంగ్ ఒరిస్సా తూర్పుతీరం వెంట సాగి కళింగం, దక్షిణ కోసల, ఆంధ్రదేశం, కాంచీపురంలను (నేటి కంచి) దర్శించారు, తర్వాత మహారాష్ట్రకు చేరుకుని మాళ్వ, సౌరాష్ట్ర, సింధు, ముల్తాన్, మక్రాన్ (నేటి ఇరాక్ సరిహద్దు ప్రాంతం)ల మీదుగా ప్రయాణించి సింధునదిని దాటి మళ్ళీ నలందాకు చేరుకున్నాడు.

---

105. "ఆషాఢ బహుళ పాడ్యమి లగాయతు మూడునెలలు బుద్ధభిక్షువులు పెగోడాల్లోనే (పూజాగృహాలు) ఉండిపోవాలి గాని, ఊరమ్మట పర్యటించడానికి వీల్లేదని ఓ నియమం. ఈ మూణ్ణాళ్ళూ 'వాస్సా' అంటారు. ఈ మాట పాళీ భాషలో 'వస్సా' సంస్కృతంలో వర్షమున్నూ (పేజీ.95) 'హెనోయ్ విశేషాలు - కాంబోడియా కబుర్లు' - క్రొవ్విడి లక్ష్మన్న - విశాలాంధ్ర ప్రచురణ, 1957.

యువాన్‌చ్వాంగ్ తాను ప్రయాణించిన దూరాలను లీలలతో పేర్కొన్నాడు. ఆనాటి కొలతల ప్రకారం ఐదు లీలు ఒక మైలుతో సమానం. యువాన్ చ్వాంగ్ కళింగం నుండి దక్షిణ కోసలానికి మధ్యదూరం 18000 లీలు (360 మైళ్ళు - 580 కి. మీ) ఉందన్నాడు,

యువాన్‌చ్వాంగ్ ఉత్తరదేశాన్ని గురించి వర్ణించినట్లు దక్షిణదేశం గురించి ఎక్కువగా వర్ణించలేదు. ఆంధ్రదేశంలో రెండు సంవత్సరాలున్నాడు.

ధాన్యకటకాన్ని (నేటి ధరణికోట) ఈ యాత్రికుడు 'తె - న - క -చే -కి -యా' అనే, వేంగిదేశాన్ని 'పిన్ - గి - కి' అని పేర్కొన్నాడు.[106] వీటిలో మొదటి పదము సంస్కృతంలో ధనకనకము లేదా ధనకటకమనే అర్థమిస్తున్నదని పండితులంగీకరించారనీ, ధనకటకము టిబెట్ దేశ గ్రంథాల్లో 'ధాన్యరాసులుండే పట్టణము'ని పిలువబడుతూందని భావరాజుగారు వ్రాశారు.[107]

స్త్రీ పురుషులు ధరించే దుస్తులగురించి (హర్షుని సామ్రాజ్యంలో) యువాన్ చ్వాంగ్ ఈ విధంగా వర్ణించాడు: "పురుషులు నడుముచుట్టూ త్రిప్పి భుజముల వరకు వస్త్రములు ధరించెడివారు. స్త్రీలు చీరలుధరించి రెండుభుజములను కప్పుకొని క్రిందకు జారవిడిచెడివారు. స్త్రీలు పరదా పద్ధతి నెరుగరు."[108]

యువాన్ చ్వాంగ్ గ్రంథం ఆధారంగా హర్షునికాలంనాటి స్థితిగతులే కాక, ఏడవశతాబ్దం నాటి భారతదేశ మత, రాజకీయ, సాంఘికపరిస్థితులు తెలుస్తున్నాయి. ఐతే యువాన్‌చ్వాంగ్ యాత్రలో ధార్మికదృష్టి (మతదృష్టి) ఎక్కువ అని చెప్పవచ్చు.

యువాన్ చ్వాంగ్ తర్వాత చైనాదేశంనుండి భారతదేశానికి వచ్చిన మరొక యాత్రికుడు 'ఇ-త్సింగ్.' ఈయన తన పూర్వులవలెగాక సముద్ర మార్గంగుండా వచ్చాడు మార్గమధ్యంలో ఒక ఓడలోకి మారి నగ్నవాసుల

---

106. విదేశ యాత్రికులు - ప్రాచీనాంధ్రదేశము. పేజీ, 58, 75.
107. అదే. పుట. 82.
108. హర్షుడు - వి. డి. గంగల్. పేజీ. 50.

ద్వీపం చేరుకున్నాడట!(ఈ ద్వీపం బహుశా అండమాన్ దీవులలోనిదై ఉంటుందని వి. డి. గంగల్ అభిప్రాయపడ్డారు) అక్కడినుండి 15 రోజుల తర్వాత తామ్ర లిప్తి అనే రేవులో దిగాడు. తిరుగుప్రయాణంలోకూడ ఈయన తామ్రలిప్తినుంచే స్వదేశానికి బయలుదేరినట్లు వ్రాసుకున్నాడు.[109] ఐతే ఈయన యాత్రాగ్రంథం వివరాలు తెలియరాలేదు.

ఇప్పటిదాకా తెలుపబడ్డ చైనా యాత్రికులంతా తిరుగు ప్రయాణంలో తామ్రలిప్తి నుండే స్వదేశానికి వెళ్ళటం గమనించదగ్గ విషయం.

**(iv) అల్ బెరూనీ :-**

అల్ బెరూనీ అసలు పేరు అబూ రైహాన్ (Abu Raihan). అరబ్బీ భాషలో మంచి పండితుడు క్రీ. శ. 937 లో మధ్య ఆసియాలోని ఖీవా సీమలో జన్మించాడు. నలభై సంవత్సరాలవయస్సు వచ్చేసరికి విజ్ఞానశాస్త్రం, గణితం, జ్యోతిష్యాలలో పాండిత్యం సంపాదించాడు. సాహిత్యరంగంలో కూడ కృషి చేసేవాడేకాని రాజకీయ పరిస్థితులందుకు అనుకూలించలేదు. సుల్తాన్ మహమ్మద్ గజనీ ఖీవా రాజ్యంపై దండయాత్ర జరిపి ఆ రాజ్యంలోని ప్రముఖులతో పాటు అల్ బెరూనీని కూడ ఖైదు చేశాడు. తర్వాత వీళ్ళంతా దేశంనుండి బహిష్కరింపబడ్డారు. ఆ విధంగా అల్ బెరూనీ ఇండియాకు రావలసి వచ్చింది.

ఈ ప్రవాస కాలాన్ని అల్బెరూనీ సంస్కృత విద్యాభ్యాసం చేస్తూ గడిపాడు. అరబ్బీ భాషలో దాదాపు 20 గ్రంథాలు వ్రాశాడు.వాటిలో భారతదేశాన్ని గురించిన పుస్తకం పేర్కొనదగింది [110] భారతదేశంలోని మత, సాహిత్య,

---

109. అదే పుట. పేజీ. 55.

110. Alberuni (c. 1030), Kitab fi Tahqiq ma lil-Hind. etc. ed by Edward C. Sachau, 1885. 6, and trans by him under the tittle 'Alberuni's India, an account of the religion, philosophy, literature, geography, chronology, customs, laws and astrology of India about A.D. 1030', 2 Vols., London, 1910. Photo offest reprint Delhi, 1968.

శాస్త్ర విజ్ఞాన విషయాలను వివరించటమే ఈయన ప్రధానోద్దేశం. ఐనప్పటికీ ఇక్కడి ప్రజల ఆచారవ్యవహారాలు, మూఢనమ్మకాలు - వీటి గురించి కూడా విలువైన సమాచారాన్ని అందజేశాడు.

అల్‌బెరూనీ దృష్టిలో ఇండియాఅంటే ఉత్తరభారతదేశమే. ఇక్కడ ఒకప్పుడు సముద్రం ఉండేదనీ, కాలక్రమాన హిమాలయాలలో పుట్టి ప్రవహించే నదుల ఒండ్రుమట్టి వల్ల ఈ ప్రదేశమేర్పడిందని ఈయన అభిప్రాయం.111 ఆధునిక శాస్త్రవేత్తలు ఈ విషయాన్ని ధ్రువీకరించారు. ఐతే ఈ విశేషాన్ని అల్బెరూనీ తప్ప మరే యాత్రికుడు కూడ చెప్పకపోవడం గమనార్హం.

హిందువుల మతాచారాలను అల్బెరూనీ చాల ఆసక్తితో గమనించాడు. 'హిందువులు చట్టాన్ని ఆశ్రయించకుండా కేవలం ఒట్లు పెట్టుకొని, అగ్నిసాక్షి ప్రమాణాలు చేసి వివాదాలను పరిష్కరించుకొనేవారు' అన్నాడు.

అల్బెరూనీ యాత్రాకాలంలో భారతదేశంలో అస్పృశ్యత వేళ్ళూనుకొనే ఉంది. సమాజంలో అట్టడుగు వర్గాల వారిని అంత్యజులనే వారనీ, వీరు గ్రామాలకు దూరంగా నివసించేవారనీ ఈయన వ్రాతల వల్ల తెలుస్తున్నది.

యువాన్‌చ్వాంగ్ వలె అల్బెరూనీ కూడా ఆనాటి స్త్రీ పురుషుల ఉడుపుల గురించి వర్ణించాడు. కొంతమంది కేవలం నడుం చుట్టూ ఒక గుడ్డ పేలికను మాత్రమే చుట్టుకొనగా, మరికొందరు పొడవైన వస్త్రాన్ని పాదాల దాకా ధరించారనీ, స్త్రీలైతే భుజాలనుండి నడుముదాకా పొట్టిచొక్కాలు (రవికలు అయి ఉంటాయి) ధరించేవారనీ వ్రాశాడు పురుషులు కూడా స్త్రీల లాగా శరీరాలను నగలతో అలంకరించుకున్నారు. మెగస్తనీస్ కాలంలో దంతపు చెవి రింగులను ధరిస్తే, అల్బెరూనీ కాలంనాటికి దండకడియాలు కూడ అలంకరణల జాబితాలో చేరిపోయాయి.

---

111. "India was originally a sea which was filled over the centuries by the alluvium of the great Himalayan rivers flowing into it" - As they saw India - P.52.

ముడిలోహంను (Base Metals) బంగారంగా మార్చే విద్యతో పాటు హిందువులు కాయకల్పచికిత్సను కూడ అభ్యసించేవారు. ఈ రసాయన చికిత్స రోగులను ఆరోగ్యవంతులనుగా, వృద్ధులను యౌవనవంతులనుగా మారుస్తుంది. మాళ్వారాజు భోజదేవుని ప్రాసాదంలో తాను ప్రత్యక్షంగాచూసిన చికిత్స యొక్క అద్భుత ఫలితాలకు సంబంధించిన సంఘటనను అల్బెరూనీ గ్రంథస్థం చేశాడు.

## (v) మార్కో-పోలో :-

ఇటలీ దేశంలోని వెనిసు నగరంలో ప్రసిద్ధ వర్తకవంశంలో జన్మించాడు. తన 17 వ యేట 1271 లో చైనా ప్రయాణమయ్యాడు. చైనా చక్రవర్తి కుబ్లయి ఖాను ఆస్థానంతో 17 సంవత్సరాలు ఉన్నాడు.[112] స్వల్పకాలంలోనే చీని తార్తార భాషలను మాట్లాడటం, వ్రాయటం నేర్చుకున్నాడు. చక్రవర్తి ఆయన ప్రజ్ఞావిశేషాలకు ఆశ్చర్యపడ్డాడు. సుదూరతీరాల్లోఉన్న సామ్రాజ్యాలు ఏవిధంగా పరిపాలింపబడుతున్నాయో తెలుసుకోవాలనుకున్నాడు. ఆయా రాజ్యాలను సందర్శించి అక్కడి వివరాలు తనకు నివేదించటంకోసం మార్కోను రాజపురుషునిగా నియోగించి పంపాడు.

మార్కోపోలో స్వదేశానికి తిరిగి వచ్చిన తర్వాత 1296 లో వెనీస్, జినోవా పట్టణాల మధ్య యుద్ధం జరిగింది. వెనీషియనులు పరాభూతులయ్యారు. మార్కో ఖైదీగా పట్టుపడ్డాడు. జినీవాలోని జైలులో తోటిఖైదీలకు ఈయన యాత్రా విషయం తెలిసింది. తాను కన్న, విన్న వృత్తాంతాలు చెప్పవలసిందిగా వారు మార్కోను వేధించసాగారు. వారి పోరుపడలేక 'రస్టీకియానో' అనే తోటి ఖైదీకి వచ్చిరాని లాటిన్ భాషలో చెపుతూ ఒక గ్రంథం వ్రాయించాడు. ఆ ప్రతి ఆధారంగా ఇటలీలోని అనేకప్రాంతాలవారు వ్రాసుకున్నారు. జినోవా ప్రభుత్వం మార్కో కీర్తి విని మన్నించి చెరసాలనుండి విముక్తున్ని చేసింది.

---

112. 'మంగోలు జాతికి చెందన యూవాన్ రాజవంశంలో సుప్రసిద్ధుకు కుబ్లయ్ ఖాన్ (1279-1294). ఈ వంశీయులు చీనాదేశంపై దండయాత్రలు చేసి, వశపరచుకొని పరిపాలించారు. పేజీ 310 - ప్రపంచ రాజ్య సర్వస్వము - ఆంధ్ర సాహిత్య పరిషత్తు, హైదరాబాదు.

మార్కో వ్రాయించిన యాత్రాగ్రంథం నాలుగుఖండాలుగా విభజింపబడింది. లేఖరి పీఠికతోపాటు మార్కో జీవిత సంగ్రహాన్ని కూడ పొందుపరిచాడు.

ప్రథమఖండంలో తూర్పు అర్మీనియా దేశం నుండి కుబ్లయి ఖానుని పరిపాలన, ప్రజల గురించి వర్ణించాడు. ద్వితీయఖండంలో చైనా దేశంలో జరిపిన యాత్రావిశేషాల సంగ్రహ వర్ణన ఉంది. కుబ్లయిఖానుని రాజ్యానికి తూర్పుదిక్కున ఉన్న రాజ్యాలను గూర్చిన వివరాలు తృతీయ ఖండంలో ఉన్నాయి. ఇంకా జపానుదీవులు, హిందూమహాసముద్రంలోని ద్వీపాలు, సింహళం, దక్షిణ భారతదేశం, పారసీక దేశాల వరకున్న రేవులను గూర్చి కూడ ఈ విభాగంలోనే తెలిపాడు. చతుర్థ ఖండంలో పారసీ, తార్తార దేశాలను గూర్చి వర్ణించాడు.

మార్కోపోలో వ్రాయించిన గ్రంథాన్ని సంస్కరించి ఆంగ్ల భాషలోకి అనువాదం చేసి సవ్యాఖ్యానంగా ప్రకటించాడు సర్ హెన్రీ యూలు.[113] ఇప్పుడు మనకు తెలిసిన వృత్తాంతమంతా బహుళ వ్యాప్తి పొందిన 'యూలు' గారి గ్రంథంలోంచి వ్రాయబడిందని భావరాజుగారు తమ పుస్తకంలో తెల్పారు[114]

మార్కో దక్షిణ హిందూ దేశాన్ని దర్శించింది దాదాపు 1290 ప్రాంతంలో. మారవర్మ కులశేఖర సుందర పాండ్యదేవుని (1268-1311) కాలంలో పాండ్య దేశాన్ని దర్శించాడు. ఈయన రాయిబారులు మంగోలియా దేశాధిపతి జమాలుద్దీన్

---

113. మార్కోపోలో గ్రంథాన్ని మొదట సంపాదించి సంస్కరించినది ఇటలీ వాస్తవ్యుడైన రమోషియో. ఈయన 16వ శతాబ్దంవాడు. ఈయన ప్రచురించిన ప్రతి ఆధారంగా పరాసు (ఫ్రాన్సు) దేశీయుడు 'మూసా పాథియర్' ఫ్రెంచి భాషలోకి అనువదించాడు. ఈ రెంటిని ఉపయోగించుకుని 1818 లో 'మార్స్డన్' ఆంగ్లీకరించాడు. మార్కో తిరిగిన దేశ విశేషాలను శ్రమకోర్చి తెలుసుకుని, ఎన్నో నూతనాంశాలు సేకరించి గ్రంథాన్నంతా మళ్ళీ ఇంకోసారి సంస్కరించి, ప్రాచీనమూలప్రతిని బట్టి ఇంగ్లీషులోకి అనువదించాడు సర్ హెన్రీ యూలు.

114. విదేశీ యాత్రికులు - ప్రాచీనాంధ్రదేశము - పేజీ. 107.

కొలువుకు పంపబడినట్లు మార్కో పేర్కొన్నాడు పాండ్యరాజ్యాన్ని 'మా బారు' అనే పేరుతో విపులంగా వర్ణించాడు. ఇదే నేటి కేరళ రాష్ట్రంలోని మలబారు తీరం. కులశేఖరుని న్యాయపరిపాలన, ప్రజలనాగరికత, సముద్ర వ్యాపారం, ముత్యపు చిప్పలవేట మొదలైనవాటిని మార్కో తన గ్రంథంలో చేర్చాడు.

మార్కో ఆంధ్రప్రదేశంలోని మోటుపల్లిని గూర్చి ఇట్లా వ్రాశాడు:

"మాబారు దేశంనుండి యుత్తరముగా దాదాపు వేయిమైళ్ళు చనిన ముటఫిలి రాజ్యమును బ్రవేశింతువు. పూర్వమీదేశమొక రాజుపాలనమందుండెను అతడు చనిపోయినదాదిగా అతని రాణి నలువది సంవత్సరములుగా పరిపాలించు చున్నది. కడు ప్రజ్ఞావంతురాలు...ఇంతవరకు నేరాజును, ఏరాణియు నీరాజ్యము నింత ప్రజానురంజకముగ పరిపాలించి యుండలేదు."115

ముటఫిలి అంటే ఇప్పటి మోటుపల్లి రేవు. క్రీస్తు పూర్వం మోసల పురం అని వ్యవహరింబడేది. రోము, అలెగ్జాండ్రియా మొదలైన మధ్యధరా తీరపు రేవులనుండి వర్తకులు మోటుపల్లికి వాణిజ్యార్థమై వచ్చేవారట!

మార్కో ఆ రాణి పేరును పేర్కొనలేదు. భావరాజుగారు యుక్తియుక్తంగా ఆమెను రుద్రమదేవి చెల్లెలు గణపాంబగా గుర్తించారు.

ఈ దేశంలో సన్నని నూలు బట్టలు నేసేవారు అవి సాలెపట్టువలె బహు సున్నితంగా ఉండేవి. ఎంత వెల ఇచ్చినా సరిపోయే రకరకాల సన్నని నూలు సెల్లాలు ఇక్కడ లభించేవి అందుకే "ఏ దేశమునందైనను వాటిని చూపించి నపుడు ఏ రాజును ఏ రాణియు గూడ వాటిని ధరింపనిచ్చగొనకుండజాలరు!" అని మార్కో ప్రశంసించాడు 116

ఈ గ్రంథంలో భూగోళ, శాస్త్ర విషయాలు, నౌకాయనాలు ప్రస్తావింప బడ్డాయి.

---

115. విదేశ యాత్రికులు - ప్రాచీనాంధ్ర దేశము - పేజీ. 111

116. విదేశ యాత్రికులు - ప్రాచీనాంధ్ర దేశము - పేజీ. 114

(vi) ఇబ్న్ బటూటా (Ibn Batuta) :-

ఈయన దక్షిణాఫ్రికా లోని మధ్యధరా సముద్ర తీరంలో ఉన్న మొరాకో దేశవాసి. మార్చి 24, 1304 న టాంజీయర్ నగరంలో జన్మించాడు. ఇబ్న్ బటూటా అనేది సౌకర్యార్థం పిలుచుకునే పేరు. పూర్తి పేరు వేరే ఉంది.[117]

బటూటా మక్కా మదీనాలకు మతపరమైన యాత్రలు చేయడమే కాక అయా దేశాల్లోని జనుల ఆచార వ్యవహారాలను, మత రాజకీయవిషయాలను ఆకళింపు చేసుకోవాలనే ఆసక్తితో ప్రపంచ పర్యటనకు పూనుకున్నాడు. 1325 వ సంవత్సరంలో బయలుదేరి 28 సంవత్సరాలపాటు ఉత్తర ఆఫ్రికా, ఉత్తర ఆసియా, చైనా, భారతదేశం పర్యటించాడు. మొత్తం యాత్ర చేసిన దూరం 77,640 మైళ్ళు (దాదాపు ఒక లక్షా ఇరవై ఐదు కిలోమీటర్లు).

1333 లో ఈయన భారతదేశానికి యాత్రచేసిన కాలంలో మహమ్మద్ బిన్ తుగ్లక్ పరిపాలిస్తున్నాడు. ఆయన ఈ యాత్రికుని సన్మానించి తన ఆస్థానంలో కాజీ (న్యాయాధీశుని) పదవిలో నియోగించాడు. చక్రవర్తి ఆదేశం ప్రకారం బటూటా చైనాకు రాయబారిగా వెళ్తూ దక్షిణభారతదేశాన్ని పర్యటించాడు.

బటూటా భారతదేశంలో 1346 వ సంవత్సరం దాకా దాదాపు 14 యేండ్లు ఉన్నాడు. ఆకాలపు మత, రాజకీయ, సాంఘిక, ఆర్థిక విషయాలన్నీ రిహ్లా (Rihla) అనే యాత్రాగ్రంథంలో పేర్కొన్నాడు.

---

117. "బటూటా అనునది ఈతని వంశనామము. ఈతని పేరు మహమ్మద్. పితృపరంపర నామము అబు అబ్దుల్లా. తండ్రిపేరు అబ్దుల్లా ఇబ్న్ మహమ్మద్. ఇట్లు ఈతని పూర్తి పేరు ఈ విధముగా నున్నది: 'షేక్ అబు అబ్దుల్లా మహమ్మద్ ఇబ్న్ ఇబ్రహీమ్ బటూటా' (పేజీ. 443).
— ఆంధ్రదేశ చరిత్ర భూగోళ సర్వస్వము - తృతీయ సంపుటము (ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము, ఇతరులు),
ఆంధ్ర రచయితల సంఘము - హైదరాబాదు, 1976.

(vii) నికోలో కోంటి :-

నికోలో అనే ఇటలీ దేశస్థుడు 1420 లో విజయనగర సామ్రాజ్యాన్ని సందర్శించాడు.[118] భారతదేశానికి వస్తూనే మొట్టమొదట గుజరాత్‌లోని Cambaya పట్టణాన్ని దర్శించి, అక్కడ ఇరవై దినాలు గడిపి, అటునుండి బికనూర్ మీదుగా విజయనగరం చేరుకున్నాడు.[119]

గుజరాత్‌లోని Cambaya నివాసులు మాత్రమే కాగితాన్ని వాడేవారట! మిగతా భారతీయులంతా తాటాకుమీదనే వ్రాసేవారని కోంటి అభిప్రాయపడ్డాడు. 'The inhabitants of Cambaya alone use paper, all other Indians write on the leaves of trees.'[120]

విజయనగర కాలంలో బహుభార్యత్వాన్నీ అప్పుడు పాటింపబడుతున్న 'సతి' ఆచారాన్ని ఈ విధంగా వివరించాడు :

"The inhabitants of this region marry as many wives as they please, who are burnt with their dead husbands."[121]

ప్రజలే కాదు, ఇదే విధంగా వేలసంఖ్యలో స్త్రీలు రాజు పేర భార్యలుగా చలామణీ అయ్యేవారు. రాజు మరణానంతరం ఆత్మాహుతి (సహగమనం) చేసుకొన్నవారికి ఎనలేని గౌరవం ఆపాదింపబడేది కూడా.

---

118. "Nicolo, one Italian, commonly called Nicolo Conti or Nicolo dei conti". - A Forgotten Empire - Robert Sewell. National Book Trust, India.
119. విజయనగరాన్ని ఒక్కొక్కరు ఒక్కొరకంగా ఉచ్చరించారు. నికోలో Bizenegalia అనీ, అబ్దుర్ రజాక్ 'Bidjanagar' అనీ, బార్బో సాదురాతి 'Bijanaguer' అనీ, దక్షిణభారత, భూగర్భ శాస్త్రవేత్త లెఫ్టినెంట్ న్యూబోల్డ్ 'Bijanugger' అనీ పిలుచుకున్నారు. వారి వారి భాషల్లో ఉండే ఉచ్చారణా విధానానికి అనుకూలంగా ఇట్లా పలికారు.
120. A Forgotten Empire - Page. 85.
121. A Forgotten Empire - Page. 82.

He (king) takes to himself 12,000 wives, of whom 4,000 follow him on foot wherever he may go, and are employed solely in the service of the Kitchen. A like number, more handsomely equipped, ride on horseback. The remainder are carried by men in litters, of whom 2,000 or 3,000 are selected as his wives on condition that at his death they should voluntarily burn themselves with him, which is considered to be a great honour for them."[122]

నికోలో సందర్శించిన రాజు రెండవ దేవరాయలన్నది స్పష్టం

నికోలో వ్రాసిన గ్రంథం వివరాలు తెలియటం లేదుగాని ఆయన యాత్రా వివరాల అనువాదగ్రంథం మాత్రం కనిపిస్తున్నది [123]

(viii) అబ్దుర్ రజాక్ :-

ఈయన పూర్తిపేరు కమాలుద్దీన్ అబ్దుర్ రజాక్. మధ్యఆసియా ఖండంలోని 'సమరఖండ'దేశ వాస్తవ్యుడు. 1413 లో ఖురాసాన్‌లో జన్మించాడు గొప్ప విద్వాంసుడు, అరబ్బీ భాషలో వైయాకరణి. షారుఖ్ ఈయన పాండిత్యానికి మెచ్చి ఉచితరీతిని సత్కరించాడు కూడ.

షారుఖ్ పరాక్రమాలను విన్న కళ్ళికోట (కాలికట్) ప్రభువు 'సామూరి', ఆ చక్రవర్తి స్నేహాన్ని అభిలషిస్తూ ఒక రాయబారి ద్వారా కొన్ని విలువైన విట్నకానుకలను పంపించాడు షారుఖ్ కూడా అబ్దుర్ రజాక్‌ను కళ్ళికోటకు రాయబారిగా వెళ్ళవలసినదిగా ఆదేశించాడు.

అబ్దుర్‌రజాక్ తన యాత్రావృత్తాంతాన్ని సవివరంగా గ్రంథస్థం చేశాడు పారసీలో దాని పేరు 'మత్లా - ఉస్ - స అదయిన్' (Matla 'u's

---

122 A Forgotten Empire - Page 82.

123. Travels of Nocolo Conti in the Early Part of the Fifteenth Century, translation by J. Winter Jones.

Sa'dain) ఈ పుస్తకం రెండు సంపుటాలుగా వెలువడింది మొదటి సంపుటంలో నాటి తైమూరు చక్రవర్తి చరిత్ర సమస్తం వివరింపబడింది. రెండవసంపుటంలో తైమూరు వంశస్థుల చరిత్రమొదలుకొని తాను సేవించిన కడపటి పారశీ సుల్తానుహసన్‌మీర్జా మరణం వరకు ఉంది. ఈ రెండవ భాగంలోనే భారతదేశ యాత్రకు సంబంధించిన వివరముంది. దీనిలో ముఖ్యంగా విజయనగర సామ్రాజ్యానికి సంబంధించిన భాగాన్ని బెంగాల్ సివిల్ సర్వీసులో పనిచేసిన సి. జె. ఓల్డుఫీల్డు ఆంగ్లభాషలోకి అనువదించగా, సర్ హెన్రీ యం. ఇలియట్ సంస్కరించాడు. ఈ గ్రంథం పేరు - "The History of India as told by its own historians."

అబ్దుర్‌రజాక్ హోర్మజ్ రేవునుండి సపరివారంగా ప్రయాణమయ్యాడు.[124] ఇది నేటి ఇరాన్‌దేశంలో ఉంది. గొప్ప రేవు పట్టణం ప్రపంచంలోని అన్ని ప్రాంతాల వర్తకులు ఇక్కడికి వచ్చి సరుకుల క్రయ విక్రయం చేస్తారు అబ్దుర్ రజాక్ అనారోగ్య కారణం చేత 'మస్కాట్' రేవులో దిగి 'కరియట్' గ్రామంలో నివాసమేర్పరచుకున్నాడు. కుటుంబ సభ్యులు ఒకరి తర్వాత ఒకరు జబ్బుపడగా నాలుగు నెలలు అక్కడే ఉండవలసి వచ్చింది. ఈ గ్రామం కంటె 'సఫూర్' అనే పట్టణంవెళ్తే ఆరోగ్యం మెరుగవుతుందన్న గ్రామస్తుల మాటలు నమ్మి ఓడమీద బయలుదేరాడు. కాని అక్కడ రజాక్ ఆరోగ్యం మరింత దెబ్బతిన్నది. చివరకు భారతదేశం వెళ్ళే ఓడనెక్కి 18 రోజుల నిరంతర యాత్రచేసి సురక్షితంగా 'కళ్ళికోట'ను చేరుకున్నాడు[125] పరిశుభ్రమైన సముద్రపు గాలి వల్ల ఆయనకు సంపూర్ణ ఆరోగ్యం చిక్కింది.

కళ్ళికోట నిరపాయకరమైన ఓడరేవు. హోర్మజులాగే ఇక్కడికి కూడ నానాదేశ వర్తకులు వ్యాపారార్థం వస్తూంటారు ఈ దేశపు మనుష్యుల గురించి ఇట్లా వ్రాశాడు:

---

124. తెలుగు కావ్యాల్లో 'హురుమంజి' అన్నారు పర్షియన్ అఖాతంలో ఉంది. ఇంగ్లీషులో దీనిపేరు Ormuz అనీ, Hurmuz అనీ పేర్కొనబడింది.
125. కళ్ళికోట ఇప్పటి కేరళరాష్ట్రంలోని కోజికోడ్ అనే జిల్లాకు కేంద్ర పట్టణం. ఇంగ్లీషులో కాలికట్ (Calicut) అని వ్యవహరిస్తారు.

"మూడు దినములయిన పిదప నన్ను వారి రాజునొద్దకు దర్శనార్థము దీసికొనిపోయిరి. నేను అచ్చట నితరమనుష్యులవలె మొలగుడ్డ కట్టుకొని యున్న యొకని జూచితిని. అచ్చటి వారందఱాతని రాజందురు వారు తమ రాజును 'సామూరి'యని పిలుతురు."[126]

రాజును దర్శించబోయినప్పుడు రెండు మూడు వేలమంది హిందువులు (వీరిని రజాక్ 'కాఫిరులు' అనగా నాస్తికులు అని పేర్కొన్నాడు) పైదుస్తుల్లోనే ఉండి సభనలంకరించి కనిపించారట.

సుల్తాన్ ఫారుఖ్ పంపించిన శ్రీముఖాన్ని చదివి వినిపించి కానుకల నందచేశాడు. ఐనా సామూరి ఈ రాయబారిని తగినవిధంగా గౌరవించలేదని రజాక్ వ్రాతలవల్ల తెలుస్తున్నది.

కళ్ళికోటలో ఉండగానే విజయనగర చక్రవర్తి నుండి వచ్చిన ఆహ్వానాన్ని పురస్కరించుకుని రజాక్ విజయనగరానికి బయలుదేరాడు.

రాబర్ట్ సెవెల్‌గారు అబ్దుర్ రజాక్ కళ్ళికోటను వదలిపెట్టిన సందర్భాన్ని రజాక్ మాటల్లోనే వివరించాడు :

"On a sudden a man arrived who brought me the intelligence that the king of Bidjanagar, who holds a powerful empire and a mighty dominion under his sway, had sent him to the Sameri as delagete, charged with a letter in which he desired that he would send on to him the embassador of His Majesty, the happy Khakhan (i.e. the king of Persia.)"[127]

ఈ ఆహ్వానాన్ని మన్నించి రజాక్ కళ్ళికోటను వదలిపెట్టి సముద్ర మార్గం ద్వారా మంగళూరుకు చేరుకున్నాడు రెండుమూడు రోజులక్కడ ఉండి, తర్వాత అనేక పట్టణాల గుండా ప్రయాణించి విజయనగరం ప్రవేశించాడు.

---

126. అబ్దుర్ రజాక్ - భావరాజు వెంకట కృష్ణారావు, (పేజీ 102) భారతి, సెప్టెంబర్ 1934.

127. A Forgotten Empire - Page. 85.

రాయలవారి ఉద్యోగులచే ఆదరింపబడి రజాక్ ఒక రమ్యమైన విడిది గృహంలో సపరివారంగా ఉన్నాడు. కొన్ని రోజుల తర్వాత రాయలవారి నుండి పిలుపు వచ్చింది. షారుఖ్ రాజుపంపించిన కానుకలు రాయలవారికి అందజేశాడు. రాయల వారిని వర్ణిస్తూ రజాక్—

"He had an olive complexion, his frame was thin, and he was rather tall; on his cheeks might be seen a slight down, but there was no beard on his chin."

స్వదేశీయుల లాగా దేవరాయులకు గడ్డం లేనందుకు రజాక్ వింత చెందాడు. ఇక్కడి దేశాచారాన్ని బట్టి ఒకరు చూస్తుండగా మరొకరు భోజనం చేయరని తెలిపాడు ఆల్‌బెరూనీ కూడ తమదేశీయులవలె భారతదేశీయులు గుంపుగా భుజించక పోవడానికి ఆశ్చర్యపడ్డాడు.

"Food was served to every individual on a separate plate and no one was expected to help himself out of a common dish."[128]

ఈ వివరాలన్నీ తమ దేశీయులకు ఎరుకపరచాలనే కుతుహలంతో వ్రాయబడ్డాయి కాబట్టి వారికి వింతగొలిపే విధంగా, ఆసక్తికరంగా రచన చేయబడిందని భావించాలి.

రాయలవారి ఆదరణ రజాక్‌ను ముగ్ధున్ని చేసింది. వారానికి రెండుసార్లు రాయలనుండి కొలువు కూటానికి రమ్మని ఆహ్వానం వచ్చేది. వెళ్ళిన ప్రతిసారి కర్పూర తాంబూలం, 500 బంగారు నాణాలున్న పట్టుసంచి బహూకరింపబడేది. విజయనగరంలో ఉన్నన్ని రోజులు దినవెచ్చానికని రెండు గొర్రెలు, ఎనిమిది కోళ్ళు, ఒక మణుగు నేయి, మణుగు పంచదార, రెండు 'వరహాలు' పంపించేవాడుట 129,130

---

128. As they saw India - P.57.

129, 130. విదేశయాత్రికులు - ఫిబ్రవరి 1984, భారతి. 'వరహా' అంటే 3న్నర లేదా 4 రూపాయల నాణెము - బ్రౌణ్య తెలుగు ఇంగ్లీషు నిఘంటువు.

రాయబారితో చక్రవర్తులు సహపంక్తి భోజనం చేసే ఆచారం పర్షియాలో ఉంది కాని భారతదేశంలో ఇతర మతస్థులతో సహపంక్తి భోజనం నిషిద్ధం. కాబట్టి రజాక్‌కు ఉచిత రీతిలో భోజనానికి బదులుగా బంగారు నాణాల నిచ్చినట్లు రాయలవారొక సందర్భంలో రజాక్‌తో అన్నాడట.

రజాక్ విజయనగర ప్రజల గురించి ఇట్లా వర్ణించాడు: "అక్కడి ప్రజలకు పువ్వులంటే ప్రాణం భోజనం చేయకుండానైనా ఉంటారు కాని స్త్రీ పురుషులు పూలు ముడవకుండ, ధరింపకుండ ఎక్కడికీ పోలేరు. ఏ సరుకులవాడలో ఆ సరుకులే దొరుకుతాయి కాని వేరేచోట దొరకవు."

1934 నాటికి కూడ బందరులో ఇట్లాంటి ప్రత్యేక వాడలు ఉన్నట్లుగా భావరాజు వెంకటకృష్ణారావు గారు పేర్కొన్నారు.

ఇంకా నగరరక్షణ గురించి ఇలా వ్రాశాడు: 'టంకశాల కెదురుగా కటకపాలుని కచ్చేరి ఉంది. ఆయనక్రింద నగర రక్షణకోసం పన్నెండువేల మంది పడి కావలివాండ్లున్నారు. వారికి జీతం క్రింద మనిషకో 'పణం' చొప్పున వేశ్యావాటికలద్వారా సుంకం వసూలుచేసి ఇస్తారు.[131] నగరంలో ఎక్కట నేరం జరిగినా వెంటనే కటకపాలున (సైన్యాధ్యక్షునకు) కెరింగించడం ఈ కావలి వాండ్ల పని. నేరస్తున్ని వెదకి, పోయిన వస్తువును ఇప్పించనిచో దానికి వారు కొంత అపరాధరుసుము ఇచ్చుకోవాల్సి ఉంటుంది.'

దేవరాయల అంతఃపురంలో 700 మంది రాణులు, ఉంపుడు గత్తెలూ ఉన్నారు. వీరందరితో వినోదించటానికి తమలపాకుల గుణమే మూల కారణమై ఉంటుందని రజాక్ అభిప్రాయపడ్డాడు.

"It is probably owing to the stimulating properties of this leaf, and to the aid of this plant, that the king of that country is to entertain so large a seraglio, for it is said that it contains as many as 700 princesses and concubines."[132]

---

131 'పణము' అంటే 8 అణాలని (అర్ధరూపాయి) సురవరం ప్రతాపరెడ్డి గారు ఆంధ్రుల సాంఘిక చరిత్ర పు. 208 లో తెల్పారు.

132. A book of India - Edited by Dr. B. N. Pandey, P. 220.

రాయలు పంపించిన రాయబారులిద్దరితో తిరుగు ప్రయాణమై రజాక్ మంగుళూరుగుండా హొనూరు చేరుకున్నాడు అక్కడ పారశీకదేశానికి వెళ్ళే ఓడను కుదుర్చుకున్నాడు[133] సముద్రంలో చెలరేగిన తుఫాను వలన అనేక ఇబ్బందులు పడి మస్కాట్ రేవును చేరుకున్నారు తర్వాత వచ్చిన 'ఖూర్‌ఫకాన్' రేవులో రెండు రోజులు విశ్రాంతి తీసికొని మళ్ళీ ప్రయాణమై హొర్మజు రేవుపై కాలు మోపారు. ఈ విధంగా దారిలో కలిగిన ఇబ్బందుల వల్ల 40 రోజుల్లో సాగవలసిన ప్రయాణం మరో నెలరోజులు ఎక్కువ పట్టిందట!

సోవియట్ రష్యాతో మన స్నేహ సంబంధాలు ఈనాటివి కావు. 1468 లోనే రష్యా యాత్రికుడు అతనాసియస్ నికిటిన్ (Athanasius Nikitin) భారత దేశాన్ని సందర్శించారు ఈయన రష్యన్ భాషలో వ్రాసిన గ్రంథం 'Voyage to India.' గుల్బర్గాప్రాంతంలో సంచరించినప్పటి తన అనుభవాల్లో హిందూ సైనికులు, వారి ఆయుధాలు, ఏనుగుల గురించి వర్ణించాడు.

(ix) పోర్చుగీసు యాత్రికులు :-

15 వ శతాబ్దపు చివరి భాగంలో పోర్చుగీసు వారు మనదేశంలో అడుగు పెట్టారు. పోర్చుగీసు రాజు మాన్యుయేల్ (Dom Manuel) గారి ఆదేశంపై వాస్కోడిగామా జూలై 8, 1497 న పోర్చుగల్ నుండి ఓడలో బయలుదేరి, ఆగస్టు 28, 1498 న కాలికట్ (కళ్ళికోట) చేరుకున్నాడు గామా వ్రాసిన ప్రయాణ వివరాలు "The Voyage of Vasco da Gama" అనే గ్రంథంలో పొందుపరచబడ్డాయి.[134]

1504-08 మధ్యకాలంలో తెలుగుదేశంలో సంచరించి 'వర్తిమా' (వర్థేమా) అనే ఇటలీ యాత్రికుడు విజయనగర వర్ణన చేశాడు. ఈయన వ్రాసిన గ్రంథాన్ని జాన్ వింటర్ జేమ్సు అనే రచయిత ఇంగ్లీషులోకి అనువదించాడు దాని పేరు "Ludovic de Varthema-Travels in Eqypt, Syria, Persia, India, Ethiopia (1503-08)".

---

133. ఇదే పర్షియా. నేటి ఇరాన్ దేశము

134. A Forggotten Empire - P. 113.

పేదవాళ్ళు ధరించే దుస్తుల విషయంలో వందలయేండ్లు గడిచినా మార్పు లేదు అల్ బెరూనీ కాలం నుండీ అదే పరిస్థితి ఉంది. వర్తిమా మాటల్లో చెప్పాలంటే -

'The common people go quite naked, with the exception of cloth about their middle.'[135]

కాలిట్ (నేటి కళ్ళికోట)లో 'మూరుల'చే 48 నుంది పోర్చుగీసు వ్యాపారులు హత్య చేయబడటాన్ని చూసి ఇంక అక్కడ ఉండటం క్షేమం కాదని భావించాడు. వెంటనే వర్తిమా అక్కడినుండి దక్షిణంగా తీరం వెంట ప్రయాణమై వెళ్ళిపోయాడు

మరో పోర్చుగీసు యాత్రికుడు బార్బోసా దురాతి (Duarte Barbosa) విజయనగరాన్ని సందర్శించి, 1504 - 14 మధ్య కాలంలో విజయనగర విశేషాలను వర్ణించాడు. ఈయన తన యాత్రావివరాలను గ్రంథస్థం చేశాడు. దాని పేరు "Description of the East Indies and contries on the sea-board of the Indian Ocean in 1514." ఇది మొదట పోర్చుగీసు భాష నుండి స్పానిష్ భాషలోకి అనువదింపబడి 1524 లో ముద్రింపబడింది. పీఠికలో తాని పుస్తకాన్ని 1516 లో పూర్తి చేసినట్లు చెప్పుకున్నాడు. అంతకు మించి అయన రచనల్లో ఎక్కడా తేదీల ప్రస్తావన లేదు.

బర్బోసాలాగే న్యూనిజ్, దొమింగో పీస్‌లు పోర్చుగీసు యాత్రికులు. వీరి పుస్తకాల్లో యాత్రాస్పర్శ లేదు కాని విజయనగర సామ్రాజ్యంలోని రాజకీయాలను గురించి, ప్రజల స్థితిగతుల గురించి తమ అనుభవాలను గ్రంథస్థం చేశారు

విజయనగర సామ్రాజ్యం అత్యున్నత దశలో ఉన్నప్పుడు పోర్చుగీసు యాత్రికులు విజయనగరాన్ని సందర్శించారు ఆ సమయంలో విజయనగరాన్ని సాళువ నరసింగరాయలు పరిపాలిస్తున్నందువల్ల విజయనగర రాజ్యాన్ని 'నరసింగరాజ్యమని' వ్యవహరిస్తూ వచ్చారు.

---

135. A Fortotten Empire - page. 115.

1579 లో భారతదేశానికి థామస్ స్టీఫెన్స్ అనే రోమన్ కేథలిక్ మతానికి చెందిన ఫాదరీ వచ్చాడు. ఈయన ఇంగ్లండు నుండి వచ్చిన మొదటి వ్యక్తి. గోవాను సందర్శించాడు.

(x) **ఇంగ్లీషు యాత్రికులు:-**

తర్వాత ఏడుగురు ఇంగ్లీషు యాత్రికులు 1583 - 1619 మధ్య కాలంలో భారతదేశాన్ని దర్శించారు. వీరి యాత్రావివరాలు విలియం ఫోస్టర్ రచించిన గ్రంథంలో పేర్కొనబడ్డాయి.[136]

ఈ యాత్రికులు భారతదేశ పశ్చిమ, ఉత్తర ప్రాంతాలను పర్యటించారు. వీరిలో రాల్ఫ్ ఫిచ్ (Ralph Fitch, 1583-91), జాన్ మిల్డెన్ హాల్ (John Mildenhall, 1599-1606)లు అక్బరు చక్రవర్తి దర్బారును సందర్శించారు. విలియం హాకిన్స్ (William Hawkins, 1608-13, విలియం ఫించ్ (Willam Finch, 1608-11), నికొలస్ విథింగ్టన్ (Nicholoes (Withington 16 2-16), థామస్ కొరియట్ (Thomas Coryat, 1612 - 17), ఎడ్వర్డ్ టెర్రీ (Edward Terry, 1616-19) అనే ఐదుగురు యాత్రికులు జహంగీర్ కాలంలో వచ్చారు. ప్రయాణంలో వీరు ఎదుర్కొన్న ఇబ్బందులు (దోపిడీ, అనారోగ్యం మొదలైనవి) వీరి రచనల్లో కొంతవరకు ప్రతిబింబించాయి. ఐనా వీటిని వారు గుండె నిబ్బరంతో ఎదుర్కొన్నారు.[137]

(xi) **స్కోరర్ :-**

1616 ప్రాంతంలో భారతదేశపు తూర్పు తీరంలో ప్రయాణించిన 'స్కోరర్' హాలెండు దేశస్థుడు. ఈయన పులికాట్, నిజాంపట్టణం, మచిలీ

---

136. Early Travels in Indi - William Foster (pp. xiv-351.)

137. "Sickness, robbery, threats of Violence were incidents that did not shake their cheerfulness" - Early Travels in India - Preface. p. xi.

పట్టణాల గురించి ఎన్నో విషయాలు వ్రాశాడు. తూర్పు తీరమంతటిలో మచిలీపట్నం గొప్ప వర్తక కేంద్రం. ఇక్కడినుండి ఓడలు సుమత్రా, మలయా ద్వీపాలకు కూడ అన్ని రకాలైన కలంకారి అద్దకపు బట్టలు, బియ్యమూ తీసు కెళ్ళి, అక్కడినుండి గంధకం, తగరం, పింగాణి, కర్పూరం, మిరియాలు, పట్టు మొదలైనవాటిని చేరవేసేవి. మచిలీపట్నం నుండి ఓడలు ఏ ప్రాంతానికి వెళ్ళినా అవి తీసుకపోయే ముఖ్యమైన సరుకు నూలుబట్టలేనని 'స్కోరర్' పేర్కొన్నాడు.

## (xii) టవెర్నియర్ యాత్రలు :-

17వ శతాబ్దం ఉత్తరార్ధంలో భారతదేశాన్ని సందర్శించిన టవెర్నియర్ 1605లో పారిస్‌లో జన్మించాడు. ఈ ఫ్రెంచి యాత్రికుడు వర్తకుడు కూడ. ఇతని మొదటి యాత్ర 1630 - 32 సంవత్సరాల మధ్య కాన్‌స్టాంటినోపుల్ మీదుగా పర్షియాకు జరిగింది.[138] రెండవ యాత్ర (1638 - 1642) భారత దేశానికి. మూడవ యాత్రలో (1643 1649) జావా ద్వీపానికి వెళ్ళి తిరుగు ప్రయాణంలో గుడ్‌హోప్ అగ్రాన్ని చుట్టివెళ్ళాడు. ఈ మధ్యకాలంలోనే వజ్రాల వ్యాపారం చేసి బాగా గడించాడు. తర్వాత మూడుసార్లు భారతదేశంలో పర్య టించాడు. ఈ సందర్భంలోనే 1662లో రాయలసీమ గుండా ప్రయాణిస్తూ గండికోట నవాబు ప్రజలను శిక్షించే దారుణ పద్ధతిని ప్రత్యక్షంగా చూసి వర్ణించాడు. ఈయన యాత్రా వృత్తాంతాన్ని 1676లో "Les six Voyages de Jean-Baptiste Travernier" అనే పేర ఫ్రెంచి భాషలో వ్రాసిపెట్టాడు. Travels in India అన్న పేరుతో ఈ గ్రంథం ఇంగ్లీషు లోకి అనువదింపబడింది.[139]

---

138 కాన్‌స్టాంటినోపుల్ అంటే ఇప్పటి ఇస్తాంబుల్, యూరోప్‌ఖండంలో ఉంది. పర్షియా అంటే నేటి ఇరాన్.

139. "His valuable account of his travels, Les six voyages de Jean Baptiste Tavernier (1676), has been translated in part by Valentine Ball as Travels in India (2nd edition, 1925)'' p.286 The Encyclopaedia America Vol 26 American Corporation, New York.

ఈ పుస్తకం ఆకాలంనాటి సాంఘిక. రాజకీయ, చారిత్రకాంశాలను వెల్ల డిస్తున్నది.

(xiii) **కెప్టెన్ బేసిల్ హాల్ ఇండియా యాత్ర :-**

కెప్టెన్ బేసిల్ హాల్ (Tapitain Besil Hall R.N.) స్కాట్లండు దేశీయుడు. డిసెంబర్ 81, 1788న జన్మించాడు. ఈయన తండ్రి సర్ జేమ్సు హాల్ నెపోలియన్ చక్రవర్తిచే ప్రశంసలందుకున్న మిలిటరీ అధికారి.[140]

బేసిల్ హాల్‌కు చిన్నప్పటి నుండి యాత్రలంటే ఇష్టం. అందుకే నౌకా విభాగంలో శిక్షణ పొంది లెఫ్టినెంట్ అయ్యాడు. తన 24 వ యేట ఈస్టిండియా స్టేషన్‌కు బదిలీ చేయబడ్డాడు. 1812 వ సంవత్సరం మార్చి నెలలో సముద్ర మార్గం గుండా ప్రయాణించి ఆగష్టులో బొంబాయిరేవు చేరుకున్నాడు. అప్పటి కింకా సూయజ్ కాలువ నిర్మాణం జరుగలేదు కాబట్టి ఆఫ్రికా ఖండాన్ని చుట్టి వచ్చి ఉంటాడు

అధికార పర్యటనలో భాగంగా మైసూరును సందర్శించినప్పుడు మహా రాజావారు ఘనంగా జరిపించే దసరా వేడుకలను చూసే అవకాశం కలిగింది. వినోదకార్యక్రమాల్లో ఒక ఆసక్తికరమైన సంఘటన నిట్లా వర్ణించాడు:

'కొబ్బరికాయలను గాల్లోకి ఎగురవేసి అవి క్రిందపడకముందే వాటిని తలలతో ఢీకొనేవారు. దాన్తో అవి పగిలి కొబ్బరినీళ్ళన్నీ చింది చెల్లాచెద రయ్యేవి '[141]

---

140 "The first English man Napolean ever saw."

141. "...and a strange amusement, which consisted in throwing coconuts high in the air, so that, falling upon the hard heads of the throwers, they would burst, scattering their milk far and wide" - Travels in India, Ceylon and Borneo - Intro - P. 8.

తెలుగువాళ్ళ వినోదాలలో సిడి ఒకటి. పేరుకు వినోదమే కాని చూసే వాళ్ళకిది వినోదాన్ని కలిగించదు విజయనగర కాలంలో బార్బోసా అనే విదేశీ యాత్రికుడు, "భక్తులు మొక్కుబళ్ళు చెల్లించుకొనుటకై సిడిపై వేలాడుతుండే వారని" వ్రాశాడు.

కెప్టెన్ బేసిల్ కూడ మద్రాసులో సిడులాడటం చూశాడు. ఆయనక్కడున్న గంటకాలంలో నలుగురిని సిడిపై వ్రేలాడదీయటం జరిగిందట! ఐతే వాళ్ళలో ఎవరి ముఖంలో కూడ విషాదరేఖలు గోచరించలేదన్నాడు. "During the whole time, I never detected anything even like inpatience "[142]

దక్షిణ హిందూదేశంలో చర్చి మిషనరీ సొసైటీ వారు క్రైస్తవమత ప్రచార కేంద్రాలను స్థాపించారు వాటి పనితీరును పర్యవేక్షించడానికి వచ్చాడు యస్. టక్కర్ అనే ఓ మిషనరీ. ఈయన 1863లో దక్షిణ దేశమంతా పర్యటించి ఒక గ్రంథాన్ని వ్రాశాడు. దానిపేరు "South Indian Skethes." తిరునల్వేలి, మధుర జిల్లాల్లో తాను చూసిన దాక్షిణాత్యాంధ్రులను గురించి ఈ పుస్తకంలో వర్ణించాడు

1877లో అప్పటి ఇంగ్లండ్ యువరాజు (ప్రిన్సాఫ్ వేల్సు అంటారు) ఏడవ ఎడ్వర్డు భారతదేశాన్ని సందర్శించాడు. ఈ సంఘటనకు సాహిత్యంలో శాశ్వత స్థానం కల్పించటానికి 'The London crown Perfumery company' తలపెట్టింది. భారతదేశంలోని దేశ భాషలలో, ఇంగ్లీషులోను యువరాజు గారి రాకను వర్ణిస్తూ కావ్యాలు వ్రాసి పంపవలసిదనిగా భారతదేశ రచయితలను కోరింది. వివిధ భాషల్లో దాదాపు 108 కావ్యాలు వ్రాయబడ్డాయి. వాటిలో కొక్కొండ వెంకటరత్నం పంతులు గారి 'ప్రిన్సాఫ్ వేల్సు హిందూస్థాన సందర్శనం' పేర్కొన బడింది. దీనికి ప్రథమ బహుమతి లభించటం తెలుగు జాతికి, భాషకు గర్వకారణం.

---

142 Ibid. P. 164.

ఇది రెండు భాగాలుగా ప్రచురింపబడింది. రెండవ భాగంలో భారతదేశంలో యువరాజు పర్యటనం, భారతదేశంలోని ముఖ్య పట్టణాల ప్రసక్తి, ముఖ్యంగా చెన్నపట్టణం (మద్రాసు) ఆ కాలంలో ఎట్లున్నదో వివరింపబడింది.

(xiv) **మార్క్‌ట్వైన్ :-**

అమెరికన్ మహా రచయిత మార్క్‌ట్వైన్ భార్య, కూతురితో కలిసి ప్రపంచ యాత్రకు పూనుకున్నాడు 143 1896లో భారతదేశంలో సంచరించాడు. తన యాత్రానుభవాలను 'Following the Equator' అనే గ్రంథంలో వివరించాడు. ఇది లక్షడాలర్ల అప్పు తీర్చటానికి చేసిన యాత్ర.

ఆయన తన యాత్రలో భారతదేశంలోని బొంబాయి, పూనా, బరోడా, అలహాబాదు, కాశీ, కలకత్తా, డార్జిలింగ్, ముజఫర్‌పూర్, లక్నో, కాన్‌పూర్, ఆగ్రా, ఢిల్లీ, జయపూర్, లాహోర్, రావల్పిండి మొదలైన ప్రదేశాలను దర్శించాడు అన్నిచోట్ల తనదైన హాస్యధోరణితో ప్రసంగించాడు. కేవలం పదమూడు నెలల్లో మొత్తం అప్పంతా తీర్చగలిగాడు.

బరోడానుండి అలహాబాదుకు రైలులో, తిరుగు ప్రయాణంలో స్వదేశానికి కలకత్తానుండి నౌకలో యాత్ర చేశాడు.

Equator యాత్రలో తనకు నచ్చింది భారతదేశపు యాత్రేనట! భారత దేశం గురించి ఆయనిట్లా వ్రాశాడు: "చరిత్రకు భారతదేశం తల్లి, కథలకు ముత్తవ్వ, సంప్రదాయానికి అవ్వ. అది ఒక్కటే అంతా చూడాలనుకునే భూమి. చూడాలనుకుని చూచే నేల. చూచిన తర్వాత, సర్వప్రపంచంలో అన్ని విభ్రమాలను చూచినా, చప్పరింపు కల్గించే అద్భుత మాగాణం, భారతదేశం."144

ఇందులో కొంత ఆవేశం ఉన్నా, ఆయన అనుభూతి అట్లాంటిది మరి!

(xv) **కౌంట్ హెర్మన్ కేజర్‌లింగ్:**

కౌంట్ హెర్మన్ కేజర్‌లింగ్ 1880లో రష్యాలో జన్మించాడు. జినీవా, వియన్నాలలో విద్యాభ్యాసం జరిగింది. కేజర్‌లింగ్ తన 22 వ యేట తత్త్వశాస్త్రంలో డాక్టరేట్ పట్టా పుచ్చుకున్నాడు. జర్మనీ దేశంలోని ప్రముఖ తాత్త్వికుడు, గొథే మార్గానుయాయి.

---

143. మార్క్‌ట్వైన్ అన్నది పెట్టుకున్న పేరు. అసలు పేరు శామ్యూల్ లాంగ్‌హార్న్ క్లైమెన్స్.

144. మార్క్‌ట్వైన్ - భారతదేశం - ఫిబ్రవరి, 1967, భారతి, పేజీ 62.

ఈయన 1911 లో ప్రపంచ పర్యటనకు బయలుదేరి యాత్రానంతరం 1914 లో పుస్తకరచన చేశాడు. ఐతే మొదటి ప్రపంచయుద్ధం తర్వాత ప్రపంచకవుల్లో ప్రముఖస్థానాన్ని సంపాదించ గలిగాడు. ఈ ఖ్యాతిని ఆర్జించి పెట్టింది ఈయన యాత్రాగ్రంథం 'Travel Diary of a Philosopher.' ఇది మొదట జర్మనీభాషలో వ్రాయబడింది. తర్వాత జె. హాల్ రాయిడ్ రీస్ (J. Holroyd - Reece) ఇంగ్లీషులోకి అనువదించాడు.

ఈ పుస్తకంలో రెండు సంపుటాలున్నాయి. మొదటి సంపుటంలో మూడు భాగాలు. మొదటి భాగంలో పశ్చిమ ఆసియా యాత్ర, రెండవ భాగంలో సింహళ యాత్ర, మూడవభాగంలో భారతదేశ పర్యటన ఉన్నాయి. కేజర్‌లింగ్ భారత దేశంలో సందర్శించిన స్థలాలు: రామేశ్వరం, మదురై, తంజావూరు, కంజీవరం (కాంచీపురం), మహాబలిపురం, అడయార్, ఎల్లోరా, ఉదయ్‌పూర్, చిత్తూర్, జయపూర్, ఢిల్లీ, ఆగ్రా, బెనారస్ (కాశీ), బుద్ధగయ, హిమాలయాలు, కలకత్తా.

ఈయన ఆంధ్రదేశాన్ని దర్శించినట్లు లేదు. అప్పట్లో ఆంధ్రదేశమంటే మద్రాసే.

కేజర్‌లింగ్ తంజావూరుదేవాలయంలో తాను చూసి ఆనందించిన నృత్యాన్ని గురించి వర్ణించాడు.

ఈ సందర్భంలో నానాసాహెబ్ గురించి ఒక ఆసక్తికరమైన విషయాన్ని తెలిపాడు. "నానాసాహెబ్ ఆంగ్లేయఖైదీలను నరికివేయమని ఆజ్ఞ ఇచ్చి నలుగురు నర్తకీమణులను రప్పించి ఆ రాత్రంతా వాళ్ళ నాట్య ప్రదర్శనాన్ని ఆనందిస్తూ కాలం గడిపాడట!"

కేజర్‌లింగ్ కూడ వారి సమక్షంలో ఇట్లాంటి అనుభవాన్నే పొందాడట! "I too, in the presence of these girls, lost all consciousness of time and found happiness."[145]

(xvi) జాన్ గంథర్ :-

జాన్ గంథర్ అమెరికన్ రచయిత. సూక్ష్మంలో మోక్షం చూపించడంలో మోక్షాన్ని సూక్ష్మంలో ఇమడ్చడంలో ఆయనకు ఆయనేసాటి. ఆయన వ్రాసిన 'Inside Europe' ఇట్లాంటిది. ఆయన ఒక ఖండాన్ని గురించి వ్రాసిన

145. Indian Travel Diary of a philosopher. - count Hermann Keyserling. Bharatiya Vidya Bhavan, Bombay. 1959 (p. 20.)

పుస్తకాన్ని చదవగానే ఆ ఖండంలో ఒకటి రెండేండ్లు పర్యటించి వచ్చిన అనుభూతి కలుగుతుంది. జాన్ గంధర్ 1930 ప్రాంతంలో భారతదేశాన్ని సందర్శించాడు. కాని ఇక్కడి పర్యటన వివరాలు తెలియటం లేదు.

## 8. సాహిత్య ప్రక్రియగా యాత్రాచరిత్ర

ఫలాని వాళ్ళు యాత్రా చరిత్ర అని వ్రాసినంత మాత్రాన ప్రతి పుస్తకం యాత్రాచరిత్ర గ్రంథం కాదు. దాని స్వరూప స్వభావాలనుబట్టి దాని ప్రక్రియ నిర్ణయింపబడుతుంది. తెలుగులో యాత్రాచరిత్ర ఒక ప్రత్యేక ప్రక్రియగా ఇంత వరకు గుర్తింపు పొందలేదు. కాబట్టి దాని ద్రవస్థితినుండి ఒక స్పష్టమైన రేఖ లతో వెలువడడానికి బోలెడంత విచికిత్స జరుగవలసి ఉంది. ప్రధానంగా యాత్రా చరిత్ర ఒక అనుభవ క్రమం, ఒక అనుభవ సారం. అనుభవం అన్న ప్పుడు సార్వజనీనమైనది కాక యాత్రికుల వ్యక్తిత్వ సంస్కారాలతో అవినా భావ సంబంధం కలిగినట్టిది. యాత్ర కేవలం తేదీల సంఘటనల వివరాలు మాత్రమే కాకుండా అక్కడ ఆ యాత్రికుడు పొందే అనుభవాలు, అనుభూతి, ప్రతిస్పందనల సమాహార రూపం కావాలి. అలా జరిగినప్పుడే ఆ యాత్ర నిజ మైన యాత్ర అవుతుంది.

నిజానికి యాత్రా చరిత్ర ఒక సాహిత్య ప్రక్రియగా స్థిరపడలేదు. ఒక రకంగా ఇది చారిత్రక ప్రక్రియ. యాత్రికులు తమ ప్రయాణ కాలంనాడు తాము ప్రత్యక్షంగా చూసిన వివరాలను పేర్కొనడంవల్ల అనంతరకాలం వారికి కొన్ని చారిత్రకాంశాలు లభిస్తాయి. ఐతే యాత్రికుడు చరిత్రకారుడు కావాలని ఏమీ లేదు. అతడు సామాన్యుడు కూడ కావచ్చు. అట్లాంటప్పుడు ప్రసంగవశాన చారిత్రకాంశాలు దొర్లుతాయే తప్ప యాత్రాచరిత్రను చారిత్రకప్రక్రియగా చెప్పేంతటి చరిత్ర ఉంటుందా అన్నది సందేహమే. తెలుగులో ఏనుగుల వీరా స్వామయ్య గారి కాశీయాత్ర చరిత్రలో మాత్రమే ఈ చారిత్రకాంశ ప్రధానంగా కనిపిస్తుంది. అది ఆయన అభినివేశమూ, స్థాయిని బట్టి రూపొందింది. ఈ అంశం తరువాతి ప్రకరణంలో చర్చింపబడుతుంది.

ప్రక్రియ స్వరూపాన్నిబట్టి నిర్ణయించేదే ఐనా స్వభావాన్ని కూడ పరి గణనలోకి తీసుకోవాల్సి ఉంటుంది. భాషా దృష్టితో చూస్తే యాత్రా చరిత్ర ఒక వచన ప్రక్రియ, కాని విషయ దృష్టితో చూసినప్పుడు యాత్రాచరిత్రకు చలన శీలం, పరిశీలనాదక్షత అవసరంగా కనిపిస్తాయి. కాబట్టి యాత్రా చరిత్రలు చరిత్ర రచనకు ఆధారగ్రంథాలుగా పనికి వస్తాయేమో కాని, పూర్తి చారిత్రకప్రక్రి యగా నిర్ణయించడం సాధ్యంకాదు.

యాత్రలో భౌగోళిక పరిసరాల వర్ణన ఉంటుంది. ఐతే దీనిని భౌగోళిక ప్రక్రియగా నిర్ణయించడం కూడ కుదరదు. భౌగోళికమైన ఎల్లలు వందల సంవత్సరాలు గడచినా మారవు. కాని నగరపు ఎల్లలు, కొత్తగా తవ్విన నీటి కాలువలు - ఇట్లాంటి చిన్న చిన్న భౌతికమైన మార్పులు జరుగుతాయి. దశాబ్దం క్రితం ఒక యాత్రికునికి కొండలెదురైతే, తర్వాత ప్రయాణించిన యాత్రికునికి ఆ కొండ సొరంగంలా తొలవబడి కనిపించవచ్చు. ఇవి ఆసక్తికరమైన మార్పులు. ఏనుగుల వీరాస్వామయ్యగారు కాశీయాత్ర చేసినప్పుడు హైదరాబాద్-నాగపూర్ దారిలో అప్పటికి సోన్‌వద్ద బ్రిడ్జి నిర్మాణం జరగలేదు. కాబట్టి ఆ యాత్రలో దాని ప్రస్తావన రాలేదు.

సాహిత్య చరిత్రలు వ్రాసినవారు యాత్రా చరిత్రను వచన వాఙ్మయ వికాసానికి తోడ్పడిన తొలినాటి వచనప్రక్రియల్లో ఒకటిగా పేర్కొన్నారు.[146] ముఖ్యంగా కాశీయాత్ర చరిత్రలోని భాష, నాటి గ్రామ్య గ్రాంథిక సమ్మిశితమైన విలక్షణ శైలికి ఉదాహరణగా భావిస్తూంటారు. యాత్రా చరిత్రలు చాలావరకు హృదయ సంబంధమైనవి. అనుభవాలు, అనుభూతులు, ప్రతిస్పందనలు మొదలైనవి వీటిలో కనిపిస్తాయి. ఒకానొక అద్భుత దృశ్యాన్ని తిలకించినప్పుడు ఆ దృశ్య వైశిష్ట్యం కంటె యాత్రికుడు అనుభవించిన తీరే ఎక్కువగా హృదయాన్ని హత్తుకుంటుంది. యాత్రికుడు చరిత్రకారుడైతే అది చారిత్రకాంశంతో కూడిన సాహిత్యగ్రంథ మవుతుంది కవి ఐతే కవితా సౌరభాన్ని సంతరించుకుంటుంది. భక్తుడైతే భక్తి ప్రపత్తులను, భక్త్యావేశాన్నీ, విశ్వాసాన్నీ ప్రతిఫలిస్తుంది. మొత్తమ్మీద యాత్రాచరిత్రలన్నిట్లో సామాన్యంగా కనిపించే గుణం అనుభవ పరంపర. ఈ అనుభవాలను చెప్పేటప్పుడు యాత్రికుడు Recollection in Tranquility లాగ జ్ఞాపకాల దొంతరలను పేర్చుతూ ఉంటాడు. అవి చాలా వరకు ఆర్ద్రంగా, ఆసక్తి దాయకంగా ఉంటాయి. కాబట్టి యాత్రాచరిత్రను సాహిత్య ప్రక్రియగా భావించడంలో ఔచిత్యం కనపడుతుంది.

సాహిత్యప్రక్రియ అన్నప్పుడు ఈ ప్రక్రియకు తెలుగు సాహిత్య చరిత్రలో స్థానం కల్పించి యుగవిభజనాది ప్రయత్నాలు చేయడం సాధ్యమవుతుందా? కాలక్రమ విభజన దీనికి సరిపోతుందా? అనేవి ప్రశ్నలు. ఈ ప్రశ్నలకు సమాధానాలు ఎంతో పరిశోధనవల్లనే సాధ్యమవుతాయి. కాని యుగ విభజనను ప్రారంభించే ముందు యాత్రాచరిత్రలను విషయాన్నిబట్టి వర్గీకరణ చేసి చూడడం అవసరం. ఈ ప్రయత్నం ఇదివరకే చేయబడింది.

---

146. ఆంధ్రవచన వాఙ్మయము : ఉత్పత్తి, వికాసములు
(క్రీ. శ. 18వ శతాబ్ది వరకు) —డా. ఎం. కులశేఖరరావు.
ఆంధ్రవచన వాఙ్మయము - నిడుదవోలు వేంకటరావు.

# భారతదేశం – యాత్రా చరిత్రలు

## 1. భారతీయ సాహిత్యాల్లో యాత్రా చరిత్రలు :

ప్రాచీన భారతీయ ఋషులు, కవులు తమగ్రంథాల్లో విశాల భారత దేశాన్ని దర్శింపజేయటానికి యాత్రా వర్ణనలను సాధనంగా వాడుకున్నారు. వాల్మీకి రచించిన 'రామాయణం' పేరులోనే ప్రయాణముంది. అయనం అంటే ప్రయాణం. రాముని యొక్క జీవనగమనమే రామాయణమయింది. మహాభారతం లోని అర్జునుని తీర్థయాత్ర, భాగవతంలోని బలరామ విదురుల తీర్థయాత్రల వల్ల ఆ కాలంలో సర్వపాప నిష్కృతికోసం "భారతవర్షమునం గల తీర్థంబులు ద్వాదశమాసంబులు అవగాహనంబు సేయుటకై" దేశాటనం చేసేవారని తెలుస్తున్నది.[1]

కాళిదాసు రచించిన 'మేఘసందేశం'లో మేఘుడు రామగిరి నుండి అలకాపురి వరకు చేయవలసిన యాత్రా వర్ణన ఉంది. కైలాస శిఖర సమీపంలోని అలకాపురికి చేరుకోవటానికి కాళిదాసు యక్షుని ద్వారా మేఘునికి మార్గ నిర్దేశం చేశాడు. భౌగోళిక ప్రదేశాలు కాళిదాసు కాలంలో (క్రీ.పూ. 375-415 ప్రాంతం) ఎట్లా ఉన్నాయో ఇప్పుడూ అట్లాగే ఉన్నాయి. కాకపోతే నేటి వ్యవహారంలో వాటి పేర్లు మారినట్లు కనిపిస్తుంది. వాటి నిప్పుడు గుర్తించటం కష్టమేమీ కాదు. అప్పటి భౌగోళిక ప్రదేశాలను, వాతావరణ విశేషాలను సునిశితంగా పరిశీలించిన మీదటనే కాళిదాసు ఈ మార్గనిర్దేశం చేయగలిగి ఉంటాడన్నది స్పష్టం. కాళిదాసు విస్తృతంగా యాత్రలు చేసి ఉంటాడని ఊహించడానికి ఇది ఆస్కారం కల్పిస్తుంది.

మేఘుడు ప్రయాణించిన మార్గమిట్లా ఉంది.[2] మేఘుడు రామగిరి నుండి ప్రయాణం ప్రారంభిస్తాడు.[3] అలకాపురి చేరేవరకు దారిలో తగిలిన నదులు

---

1. శ్రీ మహాభాగవతము - దశమస్కంధము - (ఉత్తర భాగము) - 988.
2. మేఘుని మార్గాన్ని గురించి, దాని సమన్వయాన్ని గురించి రెండు వ్యాసాలున్నాయి. వాటి ఆధారంగా ఈ విషయం వ్రాయబడింది.
   అవి:- 1. మేఘసందేశములోని మేఘుని మార్గము-భౌగోళిక వాతావరణ విశేషములు. సర్దేశాయి తిరుమలరావు. భారతి, డిసెంబర్, 1966.

దేశాలు - ఆమ్రకూట పర్వతము,[4] రేవానది,[5] దశార్ణదేశము,[6] విదిశపట్టణం,[7] వేత్రవతీ (బేత్వా) నది, మాళ్వ ప్రాంతం గుండా శిప్రానది, చర్మణ్వతీ నది,[8] దశపుర పట్టణం (మాండసార్), బ్రహ్మావర్తం,[9] సరస్వతీ దృషద్వతీనదులు,[10] కురుక్షేత్రం, హరిద్వారం దగ్గరి గంగానది, హిమాలయాలు, మానస సరోవరం, కైలాసశిఖరం, అప్పుడు వస్తుంది అలకా పట్టణం [11]

---

2. మేఘసందేశము - మేఘుని మార్గ సమన్వయము. వి. రాజగోపాల రావు. భారతి, ఫిబ్రవరి, 1967
3. పూర్వపు రామగిరే ఇప్పటి రాంటెక్. ఇది నాగపూర్ దగ్గర ఉంది.
4. మధ్యప్రదేశ్‌లో ఉన్న మహాదేవ కొండలు.
5. నర్మదానదికి పూర్వపు పేరు. 'మహాదేవ పర్వత సమీపంలో మేఘల పర్వతం లోయలో అమరకంటకమనే పేరిట చెఱువు ఉన్నది. అక్కడ నర్మదానది పుట్టినది. అందుకే ఈ నదిని మేఖల కన్య, మేఖల అని కూడ పిలుస్తారట! (జీవనలీల - గుజరాతీ మూలం: కాకా సాహెబ్ కాలేల్కర్, తెలుగు అనువాదం: పురాణం సుబ్రహ్మణ్యశర్మ. పేజి 76)
6. ఇదివరకు బుందేల్‌ఖండ మనేవారు. ఇప్పటి భోపాల్.
7. బొంబాయి - ఢిల్లీ వెళ్ళే రైలు మార్గంలో భోపాల్ దాటిన తర్వాత సాంచీ, పిదప విదిశ వస్తుంది దీన్ని భేలసా (భేల్సా) స్టేషన్ అని కూడ అంటారు. (సుందర భారత యాత్ర-2, పేజీ. 487)
8. మాళ్వ ప్రాంతమంటే ఇప్పటి మధ్యప్రదేశ్.
చర్మణ్వతి (చర్మణవతి)కి ఈ పేరు రావటానికి కాలేల్కర్ ఒక పురాణ గాథ చెప్పాడు: "రంతిదేవుడు ఈ నదీతీరాన అనేక యజ్ఞాలు చేశాడు. చంపిన పశువుల రక్తంచేత తడిసిన యీ నదీతీరాలు సతతము ఎర్రనై ప్రవహించేవి. పశువుల చర్మాలను ఎండ పెట్టడంకోసం ఈ నదీతీరాన పరిచి ఉంచడంచేత యీ నదికి 'చర్మణవతి' అనే పేరు సార్థకమయినది." (జీవనలీల - కాలేల్కర్, పుట 152) ఈ నదిని ఇపుడు 'చంబల్ నది' అని పిలుస్తున్నారు.
9. నేటి హర్యానా ప్రాంతం.
10. పంచనదుల్లోని ఐరావతి (రావి), శతద్రు (సట్లెజ్) నదులకు సమాంతరంగా ప్రవహించిన ఒకప్పటి నదులిప్పుడు లేవు.
11. అలకాపట్నం కుబేరుని రాజధాని ఇది ఊహా కల్పితమనే అభిప్రాయం ఒకటుంది.

అలాగే 'రఘువంశం' కావ్యంలో రఘు మహారాజు యొక్క దిగ్విజయ యాత్రా సందర్భంలో అనేక దేశాలను వర్ణించాడు కాళిదాసు. వీటిలో కొన్ని దేశాలను స్వయంగా చూసి వుంటాడు. కొన్నిటిని గురించి విని వుంటాడు. లేదా వాటి వివరాలనైనా సేకరించి ఉంటాడు. లోకసంచార స్వభావానికి తోడు కాళిదాసు కావ్యకల్పనా ప్రతిభ ఆ విధంగా చేయించి ఉంటుంది.

ఇక బాణభట్టు కూడ జగమెరిగిన యాత్రికుడే. ఆయనను గురించిన ఒక సూక్తి 'బాణోచ్ఛిష్టం జగత్ సర్వం' అన్నది చాలా ప్రసిద్ధమైంది. 'దశ కుమార చరిత్ర' రచన ద్వారా దండి భారతదేశాన్ని పర్యటించినట్లు తెలుస్తున్నది.

వేంకటాధ్వరి 17 వ శతాబ్దంవాడు. తర్కమీమాంసాది శాస్త్రజ్ఞుడు, కవి. ఈయన పితామహుని మామగారు తాతాచార్యులు శ్రీకృష్ణదేవరాయల గురువు. వేంకటాధ్వరి 'విశ్వగుణాదర్శ'మనే సంస్కృత కావ్యం వ్రాశాడు. ఇది తెలుగులో క్రీడాభిరామం లాంటిది. ఈ కావ్యాన్ని చాలమంది తెలుగులోకి అనువదించారు.

కృశానువు, విశ్వావసువు అనే ఇద్దరు గంధర్వులు దేశాటనం చేయాలనే తలంపుతో విమానాన్ని అధిరోహించి భారతదేశంలోని వివిధ తీర్థ క్షేత్రాలను సందర్శించారట. వీరిలో కృశానువనే వాడు పురోభాగి. అంటే ఈయనకు ప్రతిదీ దోషభూయిష్టంగానే కనిపిస్తుంది. విశ్వావసువు ఈ దోషాలను గుణాలుగా సమర్థిస్తూ యాత్ర చేయిస్తాడు గ్రంథంలో అనేక తీర్థక్షేత్రాల వర్ణన ఉంది.

రాహుల్ సాంకృత్యాయన్ (1893 - 1963) ప్రపంచంలోని చాలా దేశాలను-ముఖ్యంగా యూరప్, చైనా, ఆసియా దేశాలకు విస్తృతంగా యాత్రలు చేశాడు. వెంటవెంట తన యాత్రానుభవాలను గ్రంథస్థం చేస్తూ వచ్చాడు. ఇవన్నీ హిందీలో రచింపబడ్డాయి. ఈ యాత్రా గ్రంథాలు హిందీ సాహిత్యానికే మణిపూసల్లాంటివి.

వాటిలో ముఖ్యమైనవి.[12]

1. మేరీ లడాఖ్ యాత్రా (1926)
2. తిబ్బత్‌మే సవావర్ష్ (1931)
3. మేరీ యూరప్ యాత్రా (1932)
4. మేరీ తిబ్బత్ యాత్రా (1937)
5 రూస్‌మే పచ్చీస్ మాస్ (1944-47)
6. ఆసియాకే దుర్గమ భూఖండోంమే (1956)
7. చీన్ మే క్యాదేఖా? (1960)

భారతదేశంలో కూడా విస్తారంగా యాత్రలు చేశాడు కాని ఆ యాత్రా వివరాలు తెలియరాలేదు.

18వ శతాబ్దం ఉత్తరభాగంలో మళయాళ భాషలో మొదటిసారిగా వచనగ్రంథ రచన జరిగింది. సుమారు 1778 ప్రాంతంలో కరియత్తల్ జోసెఫ్ మల్‌పాన్ అనే క్రైస్తవ ఫాదరీ తన ముఖ్యశిష్యుడూ, అనుచరుడూ ఐన పారేమక్కల్ తోమా కథనార్‌తో రోమ్ నగరానికి ప్రయాణమయ్యాడు. వీరిద్దరూ పోర్చుగీసు మత ప్రచారకులచే ప్రభావితులైన స్థానికక్రైస్తవులు. వీరు గుడ్‌హోప్ అగ్రము, బ్రెజిల్, పోర్చుగల్‌ల మీదుగా రోమ్‌నగరాన్ని చేరుకుని పోప్‌ను సందర్శించి తిరిగి వచ్చారు. సముద్రయానంలో పడ్డ క్లేశాలు, వాటి నధిగమించిన తీరు, చూసిన దృశ్యాలు, కలిసిన ప్రజలు- వీటన్నిటి గురించి సరళంగా వివరించాడు కథనార్. ఈ యాత్రాగ్రంథం మతదృక్పథంతో రచింపబడింది దీని పేరు 'వర్తమాన పుస్తకము.'

మలయాళ వాఙ్మయాన్ని గురించి పరిచయప్రాయంగా వ్రాసిన పరమేశ్వరన్ నాయర్ ఈ పుస్తకాన్ని 'భారతీయ భాషలలో వెల్వడిన ఆదిమ యాత్రా గ్రంథము'గా పరిగణించారు.[13] కేవల యాత్రా చరిత్ర మాత్రమే కాక పాశ్చాత్య

---

12. మహోన్నత మానవుడు రాహుల్ సాంకృత్యాయన్ -
సేకరణ : బండ్లపల్లె ఓబుల్‌రెడ్డి. పుట 10 నుండి స్వీకరింపబడ్డాయి.
13. మలయాళ వాఙ్మయ చరిత్రము - మూలం : పి. కె పరమేశ్వరన్ నాయర్, అనువాదం : డా. దివాకర్ల వేంకటావధాని, పేజీ 90.

సాహిత్య రీతిలో వచనంలో వ్రాయబడ్డ తొలిరచన కావడంలోకూడ దీనికి ప్రాధాన్యమున్నదని వ్రాస్తూ, నాయర్‌గారు 'వర్తమాన పుస్తకము లేనిచో మలయాళ వాఙ్మయ మిప్పుడున్నంత సంపన్నమై ఉండి ఉండదని వేరుగా చెప్ప నక్కరలేదు' అన్నారు.[14]

ఐతే 1980 ప్రాంతం దాకా మళ్ళీ యాత్రా గ్రంథాలు దాదాపు రాలేదనే చెప్పాలి. కె పి. కేశవ మీనన్ రాసిన 'బిలాతి విశేషమ్'ను ఆధునికసాహిత్యం లోని తొలి యాత్రావర్ణనగా పేర్కొనవచ్చు.

తర్వాత కేరళలోని చాలమంది రచయితలు ప్రపంచం నలుమూలలు పర్యటించి వికాసదశలో ఉన్న యాత్రాచరిత్రను విస్తరింప చేయటానికి దోహద పడుతున్నారు.

## 2. తెలుగులో యాత్రా చరిత్రలు :

తెలుగులో యాత్రా చరిత్రలు 19 వ శతాబ్దం ప్రథమార్థం నుండే ప్రారంభమయ్యాయి. వీటిలో ముఖ్యమైనవి రెండు యాత్రా చరిత్రలు కనిపిస్తు న్నాయి. ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్ర చరిత్ర, కోలా శేషాచల కవి వ్రాసిన నీలగిరి యాత్ర. వీరాస్వామయ్య గారి కంటె దాదాపు ఎనిమిది సంవత్స రాలకు ముందే కాశీయాత్ర చేసినవాడు వెన్నెలకంటి సుబ్బారావు. ఈయన తెలుగు వాడే కాని ఈయన రచించిన గ్రంథం ఇంగ్లీషులో ఉంది. ఆ పుస్తకం తర్వాత తెలుగులోకి అనువదింపబడింది. పై యాత్రా గ్రంథాల్లో ఏది తొలి యాత్రా చరిత్ర అవుతుందో తర్వాత చర్చించబడుతుంది.

తెలుగులో యాత్రా చరిత్రలన్నప్పుడు అవి తెలుగు ప్రాంతం నుండి లేదా దక్షిణదేశం నుండి బయలుదేరి ఉత్తర, దక్షిణ భారతదేశలలోని వివిధ ప్రాంతాలకు చేసిన యాత్రలను, ఇంకా విదేశాలకు కూడా జరిపిన పర్యటనలను నమోదు చేసినవని చెప్పుకోవచ్చు.

తెలుగులో యాత్రా చరిత్రల అవతరణ వికాసాలు, తొలియాత్రా చరిత్రల గురించి తెలుసుకునే ముందు తెలుగులో ఇప్పటివరకు వచ్చిన కొన్ని యాత్రా చరిత్ర గ్రంథాల రేఖామాత్ర పరిచయాన్ని తెలుసుకోవటం అవసరం.

---

14. అదే. పుట 19.

తెలుగువారు 12 వ శతాబ్దం నుండి కాశీ క్షేత్రాన్ని సేవించినట్టుగా సాహిత్యంలో ఆధారాలు కనిపిస్తున్నాయి. ఐతే వారిలో ఎవరు కూడా ప్రత్యేకంగా యాత్రా చరిత్ర దృష్టితో రచనలు చేసినవారు కారు. ఆధునిక యుగంలో అంటే 19 వ శతాబ్దం ప్రారంభంలో కాలాన్నిబట్టి కాశీయాత్ర చేసినవారిలో వెన్నెలకంటి సుబ్బారావు (1828) ఆద్యుడైనప్పటికీ, ప్రక్రియనుబట్టి చూసినట్లయితే ఏనుగుల వీరాస్వామయ్యగారు ప్రథములౌతున్నారు.

తర్వాత 1889 లో తన పందొమ్మిదవ యేట చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి కాశీవిశేషాలను గురుముఖతః విని ఉండి, చూడాలనే ఉబలాటంతో 'కాశీయాత్ర' చేసి వచ్చాడు. తర్వాత కాశీ యాత్ర గురించి పుస్తకం రచించాడు.

కేవలం కాశీని దృష్టిలో పెట్టుకొని చేసిన యాత్రలేకాక ఉత్తర దేశానికి చేసిన యాత్రలు కూడా ఉన్నాయి. బులుసు వేంకట రమణయ్య 1956 లో కెల్లెట్ హైస్కూలు ఉపాధ్యాయులతో కలిసి ఉత్తరదేశయాత్రలు చేసి 'నా ఉత్తర దేశయాత్ర' రచించాడు. అదే సంవత్సరంలో ఉత్తర దేశానికి రైతు యాత్ర చేసిన కె వి. సుబ్బయ్య 'నవభారత సందర్శనం' వ్రాశాడు డా॥ నాయని కృష్ణకుమారి విద్యార్థులతో కలిసి కాశ్మీర యాత్రచేసి 'కాశ్మీర దీపకళిక' రచించారు. పి.వి. మనోహరరావు 1983 లో చేసిన బ్రహ్మ మానస సరోవర యాత్ర 'కైలాస దర్శనం' గా రూపుదిద్దుకుంది.

ఇక దక్షిణ దేశాన్ని గురించిన యాత్రా చరిత్రలు: మదరాసు దొరతనం వారి పరివారంతో బయలుదేరి కోలా శేషాచలకవి 1846 వ సంవత్సరంలో మద్రాసు నుండి నీలగిరి యాత్ర చేశాడు. ఎనిమిది నెలల ఈ యాత్రా కాలంలో తాను పొందిన అనుభవాలను 'నీలగిరి యాత్ర' పేరిట యాత్రాగ్రంథంగా ప్రకటించాడు. 1886 వ సంవత్సరంలో బొబ్బిలి రాజావారితో దేశాన్ని చుట్టి వచ్చిన మండపాక పార్వతీశ్వర శాస్త్రి, 'బొబ్బిలి రాజావారి యాత్రా విశేషాలు' రచించాడు. దీనిలో కోయంబత్తూరు లోని ఆడ మలయాళం గురించి ఆసక్తికరమైన విషయాలు చెప్పాడు. మల్లంపల్లి సోమశేఖరశర్మ, 'నా నెల్లూరు మండల యాత్ర' (1920), బులుసు వేంకట రమణయ్య 'దక్షిణదేశ యాత్రలు' (1937), ముమ్మన్నేని లక్ష్మినారాయణ 'అంతేవాసులతోడ హంపీ విహార యాత్ర' శ్రీమతి మాలతీ చందూర్ 'నవభారతి' (1976) ఈ సందర్భంగా పేర్కొనదగినవి.

1935 లో పశ్చిమ భారతదేశ యాత్రచేసి 'నా మహారాష్ట్ర యాత్ర' రచించాడు జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి.

ఇంక తెలుగువారు విదేశాలకు చేసిన యాత్రల గురించి: తెలియవచ్చినంత వరకు విదేశాలకు యాత్రచేసిన మొదటి తెలుగు మహిళ పోతం జానకమ్మ. ఈమె యాత్రానుభవాల వ్యాసం 1874లో భాషా సంజీవనిలో ప్రకటింపబడింది. వంగల వాణీబాయి 'నా ఐరోపా ఖండ యాత్ర' (1929); తాడూరి రమణా బాయమ్మ 'సింహళ ద్వీపయాత్ర' (1929) లు కూడ వ్యాసరూప యాత్రా చరిత్రలు.

1928 లో డి వి. సుబ్బారెడ్డి పైచదువు కోసం ఇంగ్లాండుకు వెళ్ళి 'సీమకు స్టీమర్‌లో' అనే యాత్రా గ్రంథం వ్రాశాడు. 1929 లో అత్యం నరసింహమూర్తి న్యూయార్కులో ఎం. ఏ. చదవాలన్న కోరికతో అమెరికా యాత్ర చేసి 'భూ ప్రదక్షకుడు భార్యకు రాసిన లేఖలు' రచించాడు. తర్వాత పిఠాపురం మహారాజావారితో కురుమెళ్ళ వెంకటరావు ఇంగ్లాండు యాత్ర (1930) చేశాడు. తన యాత్రానుభవాలను, 'మా మహారాజుతో దూరతీరాలు' అనే పేరుతో గ్రంథస్థం చేశాడు.

పై మూడు పుస్తకాల్లో రెండు విషయాల్లో ఏక రూపత ఉంది. అన్నీ లేఖా సాహిత్యానికి చెందడం ఒకటి, యాత్రలన్నీ జలమార్గంపై సంభవించడం రెండోది.

అక్కినేని నాగేశ్వరరావు 'నేను చూసిన అమెరికా' (1963), ఆవుల గోపాలకృష్ణమూర్తి 'నా అమెరికా పర్యటన' (1965), కొడాలి వెంకటేశ్వర రావు 'అంతా కలిస్తే అమెరికా' (1974) అమెరికా యాత్రల్లో ముఖ్యమైనవిగా చెప్పుకోవచ్చు.

రష్యా విప్లవం తర్వాత శ్రీ శ్రీ 1954, 1967 సంవత్సరాలలో ఆ దేశాన్ని సందర్శించి 'నా విదేశ యాత్రానుభవాలు' అన్న వ్యాసాన్ని రచించాడు. తర్వాత చుక్కపల్లి పిచ్చయ్య, 'ప్రథమ సోషలిస్టు దేశంలో పర్యటన: పరిశీలన' (1979), డా. సి. నారాయణరెడ్డి 'రష్యాలో పదిరోజులు' (1979), డా. రావూరి భరద్వాజ 'ఇనుపతెర వెనుక' (1983), డా వాసా ప్రభావతి 'రష్యాలో స్నేహ యాత్ర' (1986), పురాణం సుబ్రహ్మణ్య శర్మ 'నా రష్యా యాత్ర' పేర్కొనదగినవి.

## 3. తెలుగులో తొలి యాత్రా చరిత్ర - నిర్ణయ చర్చ :

పందొమ్మిదవ శతాబ్దం పూర్వార్ధంలో తెలుగు సాహిత్యంలో చాలా విలువైన యాత్రా చరిత్రలు వెలువడ్డాయి. యాత్రా చరిత్ర పేరు చెప్పగనే మొదట గుర్తుకు వచ్చేది, ప్రతి వారు వెంటనే చెప్పేది 'కాశీ యాత్ర.' ఇది పెక్కు కోణాల్లో యాత్రా లక్షణాలను సంపుష్టంగా ప్రదర్శించే అపూర్వ గ్రంథం. దీని రచయిత అయిన ఏనుగుల వీరాస్వామయ్య గారు స్వీయజీవితాన్ని గురించి ఎక్కడా చెప్పుకోలేదు. 1830 - 31లో తాను కాశీకి చేసిన యాత్రను గురించి వర్ణిస్తూ మార్గమధ్యంలోని ప్రజల సాంఘిక స్థితిగతులు తదితర విశేషాలను దినచర్య రూపంలో వ్రాసుకున్నాడు[15] ఆ దినచర్య నోట్సు ఆయన సన్నిహిత మిత్రుడైన కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్ల గారిచే 1838లో గ్రంథస్థం చేయబడింది.[16]

వీరాస్వామయ్యగారు యాత్ర చేసిన 15 సంవత్సరాలకు అంటే 1846లో కోలా శేషాచల కవి నీలగిరికి యాత్ర చేశాడు.[17] ఈ గ్రంథంలో నీలగిరి మీద నివసించే పార్వతేయుల ఆచార వ్యవహారాలు, జీవన పద్ధతులను ఈయన కూడా దినచర్య రూపంలోనే వ్రాసుకున్నాడు. తర్వాత ఎనిమిదేండ్లకు-అనగా 1854 లో తన యాత్రానుభవాలకు పుస్తకరూపం కల్పించాడు ఐతే కేవలం ఇది వ్రాతప్రతి మాత్రమే. మొదటిసారిగా 9583లో ముద్రణకు నోచుకుంది.

---

15. 'వెన్నెలకంటి సుబ్బారావు జీవయాత్రా చరిత్ర'కు వ్రాసిన పీఠికలో నిడుదవోలు వెంకటరావు గారు ఈ సంవత్సరాన్ని 1886 గా పేర్కొన్నారు 'కాశీయాత్ర చరిత్రలో (1838) గాని,...ఎక్కడను వీరాస్వామి అనునది కనరాదు'. (పుట, 18)

16 నిడుదవోలు వెంకటరావుగారు 'వీరు 1583 వ సంవత్సరమున కాశీ యాత్ర చేసిరి' అని వారి ఆంధ్ర వచన వాఙ్మయము (పుట. 68) లో వ్రాశారు. ఈ తేదీ ఎక్కడ సంపాదించారో అనూహ్యం.

17. అప్పటి మద్రాసు గవర్నర్ 'ట్వీడెర్' దొర. ఆయన కార్యనిర్వాహక వర్గంలో థామస్ సిమ్సన్ దొర ఒకడు. ఈయన ఆఫీసులో శేషాచలకవి గుమాస్తాగా పని చేశాడు.

వీరాస్వామయ్యగారు, శేషాచల కవి - వీరిద్దరు తమ యాత్ర ఉద్దేశ్యాలను వాచ్యంగా ఎక్కడా పేర్కొనలేదు పేర్కొనకున్నా పేరునుబట్టి మొదటిది తీర్థ యాత్ర అయితే రెండవ ఒకరకంగా విహారయాత్ర. వీరస్వామయ్యగారు పల్లకిలో, కాలి నడకనా ఇంకా అవసరమైన చోట్ల పడవలలో యాత్ర చేశాడు. ఒకరి ఆదేశాలకు లోబడకుండా పూర్తి స్వేచ్ఛావృత్తితో యాత్ర చేశాడు వంద మంది పరివారాన్ని తానే శాసిస్తూ, మార్గదర్శనం చేస్తూ తరలి వెళ్ళాడు. ఎవరికీ ఇబ్బందులు కలగకుండా ఒక నిర్దిష్టమైన ప్రణాళికతో చేసిన యాత్ర ఇది సర్కస్ యజమానిలాగా సమస్త సంభారాలతో బయలుదేరి వెళ్ళాడు. వీరాస్వామయ్యగారు తన యాత్రకు తానే నిర్దేశకుడు, తానే నాయకుడు.

శేషాచలకవి చేసిన యాత్ర అట్లాంటిది కాదు. గవర్నర్‌గారి పరివారంలో 'ఒకడు'గా నీలగిరి యాత్ర చేశాడు. ఇతరుల అడుపాజ్ఞలకు లోబడి యాత్ర జరిగింది. అయినా తాను ఈ యాత్రకు సూత్రధారునిగానే వ్యవహరిస్తున్న ధోరణిలో ఈయన రచన సాగింది. శేషాచల కవి కూడా వీరాస్వామయ్యగారి లాగే మొదట దినచర్య రూపంగా వ్రాసుకున్నా 'నీలగిరియాత్ర'ను తర్వాత యాత్రా స్పృహతో వచన కావ్య రూపంలో రచించాడు.

ఈ రెండు పుస్తకాలు క్రియాత్మకంగా తీర్చబడిన యాత్రాచరిత్ర గ్రంథాలు. తెలుగువారు తెలుగులో వ్రాసిన తొలినాళ్ళ రచనలు.

నిజానికి వీరిద్దరికన్నా ముందు యాత్ర చేసినవాడు వెన్నెలకంటి సుబ్బా రావు. ఈయన నెల్లూరి తెలుగువాడు వీరాస్వామయ్య గారికి మిత్రుడు, బంధువు కూడ. సుబ్బారావు 1822-23లో - అనగా వీరాస్వామయ్యగారి కంటె ఎనిమిది సంవత్సరాల ముందే కాశీయాత్ర చేశాడని చెప్పుకున్నాం.

సుబ్బారావు 'A life journey of V. Soob row' అనే పేరుతో 1839లో తన జీవయాత్రా చరిత్రను ఇంగ్లీషులో వ్రాసిపెట్టి పోయాడు. 1873లో ఈ వ్రాతప్రతిని ఆయన కుమారుడు గోపాలరావు అచ్చువేయించి బంధు మిత్రులకు, అధికారులకు పంచిపెట్టాడు. డా. అక్కిరాజు రమాపతిరావు గారు 1976లో ఈ పుస్తకాన్ని 'వెన్నెలకంటి సుబ్బారావు జీవయాత్రా చరిత్ర' అనే పేరుతో అనువాదం చేశారు.

ఈ పుస్తకం సుబ్బారావు యాత్రాకథన దృష్టితో చేసిన ప్రత్యేక రచన కాదు. దీనిలోని కాశీయాత్రను ఆయన జీవయాత్రలో భాగంగా సందర్భవశాత్తు జరిగిన సంఘటనగా వర్ణించుకున్నాడు "తన గత జీవితమును గూర్చి తన ఎరుకలో జరిగిన ఉదంతములను గూర్చి ముఖ్య విషయముల ఏర్చి, కూర్చి, స్వల్పమైనవి, అనౌచిత్యమయినవి వదలి ఒక పథకము ప్రకారము నిర్ణయించుకొని వ్రాసిన రచన."[18] నేదునూరి కృష్ణమూర్తిగారు స్వీయ చరిత్రకు వివరణ ఇస్తూ వ్రాసిన మాటలివి. ఈ పుస్తకం పేరునుబట్టి చూచినా ఇది సుబ్బారావు 'life journey' లేదా 'జీవయాత్ర' అవుతుందే తప్ప ప్రత్యేకంగా ఒక ప్రదేశాన్ని గురించి చేసిన నేటి వ్యవహారార్థంలోని యాత్ర కాజాలదు.

తమకు ఆ సందర్భంలో ఎదురైన సంఘటనలు, వ్యక్తులు మొదలైన వాటి గురించి మాత్రమే యాత్రాచరిత్రలో వ్రాయటానికి అవకాశముంటుంది. గతచరిత్ర ప్రసక్తి ఈ రచనలో తక్కువ యాత్ర చేసినప్పటి అనుభవాలనూ, అనుభూతులనూ ఎప్పటికప్పుడు అక్షరబద్ధమో, మనోనిక్షిప్తమో చేయటం వల్ల ఏర్పడ్డ రచన యాత్రాచరిత్ర. స్వీయచరిత్ర అట్లాకాదు. సాధారణంగా జీవిత ఉత్తరాంకంలో గతకాల సంఘటనలను నెమరువేసుకుంటూ చేసే రచన. ఇది అనేక సంఘటనల సమాహార రూపం. జీవితకాలమంతా దీనిలో పొందుపరచ బడుతుంది. యాత్రా చరిత్రలో జీవితంలోని ఒక సంఘటన మాత్రమే చోటు చేసుకుంటుంది.

సుబ్బారావు తన గ్రంథాన్ని ఇంగ్లీషులో రచించాడు, తెలుగులో కాదు. ఇది తెలుగుదేశాన్ని గురించిన తెలుగువాడి రచనే ఐనా ప్రత్యక్షంగా తెలుగు సాహిత్యం కిందికి రాదు.

పై వాస్తవాలను దృష్టిలో ఉంచుకొని, లభించిన సమాచారాన్ని బట్టి ఏనుగుల వీరాస్వామిగారి 'కాశీయాత్ర చరిత్ర'ను తెలుగులో మొట్టమొదటి యాత్రాగ్రంథంగా భావించటానికి ఆటంకాలేమీ లేవు.

---

18. వెన్నెలకంటి సుబ్బారావు జీవయాత్రా చరిత్ర - పుట. 10.

# కాశీయాత్రలు

## 1. ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్ర చరిత్ర

### i. వీరాస్వామయ్యగారి జీవిత పరిచయం :

పందొమ్మిదవ శతాబ్దంలోని తొలినాటి యాత్రా చరిత్రల్లో అగ్రపంక్తిలో నిలిచే గ్రంథం ఏనుగుల వీరాస్వామయ్యగారి 'కాశీయాత్ర చరిత్ర'[1] ఈయన కుంఫిణీ (ఈస్టిండియా కంపెనీ) పరిపాలన కాలంలో చెన్నపట్టణం (ఇప్పటి మద్రాసు) లోని సుప్రీంకోర్టులో ఇంటర్ ప్రిటర్‌గా పని చేశాడు.[2] తర్వాత అదే కోర్టులో హెడ్ ఇంటర్‌ప్రిటర్‌గా నియమింపబడ్డాడు. ఆ రోజుల్లో అది గొప్ప ఉద్యోగం.[3] వీరాస్వామయ్యగారు 18-5-1830 నాడు మద్రాసు నుండి బయలుదేరి కాశీని దర్శించి తిరిగి కోస్తా ప్రాంతం గుండా 3-9-1831 నాటికి మద్రాసు

---

1. 'యిది ఏనుగుల వీరస్వామి అల్లించిన కాశియాత్ర చరిత్ర' అనే శీర్షికతో అసలు గ్రంథం వ్రాతప్రతి ప్రారంభమవుతుంది. ఈ ప్రతి మద్రాసు ఓరియంటల్ మానుస్క్రిప్ట్సు లైబ్రరీలో నెం 1407 తో ఉంది. ఐతే అచ్చువేసే సమయంలో ప్రెస్సువారు 'వీరస్వామి'కి బదులు 'వీరాస్వామి' అనీ, 'కాశియాత్ర'కు బదులు 'కాశీయాత్ర' అనీ దిద్దారట! ఈ విషయాన్ని తర్వాత గమనించిన దిగవల్లి వేంకట శివరావుగారు తన సంపాదకత్వంలో మూలంలోని పదాలు తప్పుగా పడినందుకు క్షమాపణలు చెప్పుకున్నారు. ఈ క్షమాపణను కేవలం వ్రాతప్రతి మచ్చుపుటలకే పరిమితం చేస్తూ, మిగతా చోట్ల 'వీరాస్వామయ్యగారు' అనీ, 'కాశీయాత్ర' అనీ పేర్కొన్నారు. కాబట్టి వ్యవహారంలో రూఢి కెక్కిన ఈ పేర్లే ఇక్కడ వాడుకోవటం జరిగింది.
2. 'అర్థము చెప్పేవాడు, వ్యాఖ్యానము చేసేవాడు, దుబాసితనము చేసేవాడు' అని బ్రౌణ్య ఇంగ్లీషు తెలుగు నిఘంటువు 'ఇంటర్ ప్రిటర్'కు అర్థాలనిచ్చింది.
3. వీరాస్వామయ్యగారి ఉద్యోగ కాలం 1819-1835.

చేరుకున్నాడు. ఈ మహాయాత్ర మొదటిసారి ఏప్రిల్ 1838 లో అచ్చయింది. దీన్ని వీరాస్వామయ్యగారు మరణించిన రెండేండ్లకు ఆయన మిత్రుడు కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్లగారు ప్రచురింపజేశారు.[4] తర్వాత మూడు దశాబ్దాలకు - అంటే 1869 లో మళ్ళీ ముద్రింపబడింది.[5] ఇంకో ఏడుదశాబ్దాల తర్వాత ప్రముఖ స్వాతంత్ర్య యోధులు, సుప్రసిద్ధ చారిత్రకపరిశోధకులు ఐన దిగవల్లి వేంకట శివరావు గారి పరిశోధక సంపాదకత్వంలో సుపరిష్కృత ముద్రణగా వెలువడింది.[6]

---

4. వీరాస్వామయ్య గారు యాత్రాకాలంలో దినచర్య వ్రాసుకుంటూనే, మిత్రుడైన కోమలేశ్వరపురం శ్రీనివాస పిళ్లకు జాబులు వ్రాసి పంపేవాడు. ఈ విషయాలనన్నిటిని క్రోడీకరించి శ్రీనివాస పిళ్ల ఒక పుస్తకంగా తయారుచేసి పెట్టాడు. ఇది మొదట పనయూరు వెంకు మొదలారి అనే తపాలా రైటరుచే తమిళంలోకి అనువదింపబడి, ముద్రింపబడింది కూడ. అప్పుడు కొంతమంది 'గొప్ప ప్రభువులు' శ్రీనివాస పిళ్ల దగ్గరి పుస్తకాన్ని తెలుగులో అచ్చువేయించవలసినదిగా కోరారు. శ్రీనివాస పిళ్ల ఉత్తరువు ప్రకారం పుదూరి నారాయణ శాస్త్రి దీనిలోని లేఖక దోషాలు సవరించగా, ఏప్రిల్ 1838 వ సంవత్సరంలో మొదటిసారిగా అచ్చు వేయబడింది.

5. ఇదే పుస్తకం మద్రాసు ప్రభుత్వ ఉత్తరువుల ప్రకారం వర్తమాన తరంగిణీ ముద్రాక్షరశాలలో పువ్వాడ వేంకటరావుచే డిసెంబరు 1869 వ సంవత్సరంలో ముద్రింపబడింది.

6 పుస్తకరచనా కాలం నాటికీ, తృతీయ ముద్రణ కాలం నాటికీ భారతదేశ పరిస్థితుల్లో వచ్చిన అనేక మార్పులు ఈ పరిష్కృత ముద్రణలో up to date చేయబడ్డాయి. వీరాస్వామయ్యగారు 1832 ప్రాంతంలో సి.పి. బ్రౌన్ దొరగారికి వ్రాయించి పంపిన పుస్తకం వ్రాతప్రతి మద్రాసు లైబ్రరీలో ఉంది. ఐతే అచ్చుపుస్తకానికీ, అసలు ప్రతికీ కొన్ని తేడాలు ఉండటంవల్ల తృతీయ ముద్రణకు పూనుకోవలసి వచ్చిందని దిగవల్లి శివరావుగారు పీఠికలో తెల్పారు.

దిగవల్లి శివరావుగారు పూర్వ ముద్రణల్లోని విషయంలో మార్పులేమీ చేయలేదు. ఉన్నది ఉన్నట్లుగానే అచ్చు వేయించాడు. కాని పఠన

యాత్రా చరిత్రల్లో కాశీయాత్ర సాటిలేని మేటి గ్రంథం. ఈ గ్రంథం ద్వారా దాదాపు ఒకటిన్నర శతాబ్దాల నాటి భారతదేశ చరిత్ర, నాటి ప్రజల

సౌకర్యం కోసం అరేంజిమెంటులో మార్పులు చేశాడు. విషయాన్నిబట్టి ప్రకరణాలుగా విభజించడం, విషయం మారినప్పుడల్లా పేరాలుగా వేరు చేయటం, అన్వయక్లిష్టత లేకుండా ఉండేందుకు అవసరమైనచోట్ల కామాలు, వాక్యాంతంలో ఫుల్‌స్టాప్ చుక్కలూ ఉంచడం వంటివి ఆ మార్పులు. ఏనుగుల వీరాస్వామయ్య తన కాలంనాటి వారందరికీ తెలిసిన సంగతులే అని విపులంగా వ్రాయక సూచనగా వదలిన ఆనాటి రాజకీయ సాంఘిక చారిత్రకాంశాలను విప్పిచెప్పే ప్రయత్నం చేశారు వెంకట శివరావు గారు. తిరుపతి దేవస్థానంవల్ల కుంఫిణీ వారికి ప్రతి సంవత్సరం లక్ష రూపాయల ఆదాయం వస్తున్నదని గ్రంథంలో ఉంది. ఇది ఎంతో చరిత్ర గర్భితమైన వాక్యం. ఆ కాలంనాటి చరిత్ర తెలిస్తే తప్ప అర్థం కానిది. ఆ కాలంలో మన ధర్మాదాయాలన్నీ కుంఫిణీవారే స్వయంగా పరిపాలించేవారనీ, భోగాలు, అర్చనలు కలెక్టర్లే స్వయంగా చేయించేవారనీ, మిగిలిన సొమ్ము కుంఫిణీ ఖజానాలో చేరేదని ఆ కాలంనాటి చరిత్రవల్ల తెలుస్తుంది. ఈ అంశాలు అపేక్షించే చారిత్రకాది వివరణలను సంపాదకుడు ఈ ముద్రణలో ఫుట్‌నోట్సుగా ఇచ్చాడు ఇది దిగవల్లి Contribution. పూర్వపు అచ్చుప్రతుల్లో చేరక ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలోని అసలు ప్రతిలో వున్న విశేషాంశాలను కొన్నిటిని సందర్భానుసారంగా అదనంగా చేర్చారు.

1824 - 26 మధ్య భారతదేశ పర్యటన చేసిన ప్రధాన క్రైస్తవ మతాధికారి, బిషప్ హెబర్ దొర గ్రంథం 'Bsihop Heber's Journal' లోంచి సందర్భాన్నిబట్టి కొన్ని విషయాలు అక్కడక్కడ ఉటంకించారు. ఈ పుస్తకంలో చేర్చిన రాజకీయ సాంఘిక చారిత్రకాంశాలు, వివరణలు, ఫుట్‌నోట్సు వ్రాయడానికి దిగవల్లి వెంకట శివరావుగారు ఎన్నో ప్రాచీన గ్రంథాలు చదవ వలసి వచ్చిందని చెప్పుకున్నారు.

పై వివరణలవల్ల గ్రంథం దాదాపు 46 పుటలదాకా పెరిగింది. (పూర్వ ముద్రణంలో 328 పుటలుంటే తృతీయ ముద్రణంలో 374 పుటలయింది.)

స్థితిగతులు ప్రత్యక్ష సాక్ష్యంగా తెలియవస్తున్నవి. వీరాస్వామయ్య గారు గొప్ప ప్రజాసేవకుడు, డొక్కశుద్ధి గల పండితుడూ అవటం వల్ల ఆ రోజుల్లో ఆయన చేసినయాత్ర వివరాలుచరిత్ర పునర్నిర్మాణానికి ప్రామాణిక గ్రంథం అయ్యాయి.

ఏనుగుల వీరాస్వామయ్యగారు తారీఖుల ప్రకారం ఎప్పుడు పుట్టాడో నిక్కచ్చిగా తెలియదు. 1835 లో ఆయన పదవీ విరమణ చేశాడు. ఆ రోజుల్లో ఉద్యోగ విరమణ వయస్సు 55 సంవత్సరాలు. కాబట్టి ఆయన 1780 లో జన్మించి ఉంటాడని దిగవల్లి శివరావుగారు సతార్కికంగా భావించారు.

వీరాస్వామయ్యగారి తండ్రి సామయ మంత్రి. ఆంధ్ర నియోగి బ్రాహ్మణుడు. వీరిది శ్రీవత్స గోత్రం. వీరాస్వామయ్య గారికి తొమ్మిదేండ్లు వచ్చేసరికి పితృవియోగం సంభవించింది. పిత్రార్జితం అంతగా లేకపోవటం వల్ల కష్టపడి వీధిబడిలో తెలుగు, తమిళం, సంస్కృతం చదువుకున్నాడు. స్వయంకృషితో ఇంగ్లీషు నేర్చుకున్నాడు. పన్నెండేళ్ళు వచ్చేసరికి ఇంగ్లీషులో అనర్గళంగా చదవగలిగే వాడట! మొదట 'బోర్డు అఫ్ ట్రేడు' ఆఫీసులో వాలంటీరుగా చేరాడు.[7] వీరాస్వామయ్యగారి పఠన సామర్థ్యాన్ని గమనించి ఈ ఆఫీసులో ఉండే ఇద్దరు ఎగ్జామినర్లు ఈయనను రీడరుగా ఉంచుకోవాలని పోటీపడ్డారు పదమూడవయేట తిర్నవల్లి కలక్టరు కచ్చేరిలో ఇంటర్‌ప్రిటర్‌గా రెండేండ్లు పనిచేసి మద్రాసుకు తిరిగి వచ్చాడు. ఆటు తర్వాత ఇంగ్లీషువారి 'వాయర్ హావుస్'లో బుక్ కీపర్‌గా ఉండి అక్కడే హెడ్ అకౌంటెంట్ అయ్యాడు.[8] ఈ చిన్న చిన్న ఉద్యోగాల్లో దొరల ప్రాపకం సంపాదించి, వారి మెప్పునూ, విశ్వాసాన్నీ పొందాడు.[9]

---

7. కుంఫినీ వారి వర్తక శాఖకు చెందిన కార్యాలయం.
8. వాయెర్ హావుస్ అంటే సరుకుల కొట్టు అని అర్థం.
9. వీరాస్వామయ్యగారు సుప్రీమ్‌కోర్టులో ఇంటర్ ప్రిటర్ పదవికి నియుక్తుడైన సందర్భంలో బోర్డు ఆఫ్ ట్రేడు ఆఫీసువారు ఆయన సేవలకు సంతసించి ముక్కుపొడి వేసే బంగారు డబ్బీ నొకదాన్ని బహూకరించారని శ్రీనివాస పిళ్ల 'వీరాస్వామయ్యగారి జీవితము'లో పేర్కొన్నారు. (పుట, 2)

వెన్నెలకంటి సుబ్బారావు ఈయనకు బంధువు. 1815-1829 ల మధ్య మద్రాసులోని సదర్ అదాలత్‌కోర్టులో సుబ్బారావు ఇంటర్ ప్రిటర్‌గా ఉండేవాడు. ఆ కాలంలో మద్రాసులో రెండు ఉన్నత న్యాయస్థానాలుండేవి. ఒకటి సుప్రీం కోర్టు, రెండోది సదరు అదాలత్ కోర్టు. 1862 లో ఈ రెంటి స్థానంలో ఇప్పుడున్న హైకోర్టు స్థాపింపబడింది.

వీరాస్వామయ్యకు ముందు సుప్రీం కోర్టులో ఉదయగిరి వెంకటరమణయ్య ఉరఫ్ అప్పలస్వామి అనే వ్యక్తి ఇంటర్ ప్రిటర్‌గా పనిచేసేవాడు. ఆయన చనిపోవటంతో ఆ పదవికి ఖాళీ ఏర్పడింది. అప్పుడా ఉద్యోగంలో చేరవలసిందిగా సుబ్బారావును కోర్టువారు కోరారు. కాని కొన్ని కౌటుంబిక పరిస్థితుల వల్ల సుబ్బారావు ఈ అవకాశాన్ని వినియోగించుకోలేకపోయాడు. అయితే అప్పటికే అన్ని విధాలా యోగ్యుడైన వీరస్వామయ్య గారిని ఇంటర్ ప్రిటర్‌గా కోర్టువారికి సిఫారసు చేశాడు. దాని కనుగుణంగా ఆయన విద్యార్హతను పరీక్షించిన తర్వాతనే వీరాస్వామయ్య గారి నియామకం జరిగింది [10]

వీరాస్వామయ్య గారు శ్రుతి స్మృతులు, శాస్త్రాలను గురించి బాగా తెలిసినవాడు. అనేక పండిత సభల్లో పాల్గొన్నవాడు. 1822-28 మధ్య జరిగిన సభలో క్షయమాసనిర్ణయం విషయంలో పండితులు తలలు బద్దలు కొట్టుకుంటుంటే తనకున్న పరిజ్ఞానంతో వాదించి గెలిచాడు. ఆ మాసాన్ని నిర్ణయించాడు. ప్రజల మేలును కోరి స్మృతి చంద్రిక మొదలైన కొన్ని పుస్తకాలకు అనువాదం చేశాడట.[11] సి.పి బ్రౌన్‌కు ఈయనకు మధ్య స్నేహపూర్వక ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగుతూ ఉండేవి.[12-13] బ్రౌన్ తెలుగు - ఇంగ్లీషు నిఘంటులో

---

10. వెన్నెలకంటి సుబ్బారావు జీవయాత్రా చరిత్ర, 1873 పుట. 33.
11. 'ఏనుగుల వీరాస్వామయ్య గారి జీవితము' - శ్రీనివాస పిళ్లగారు. పుట. 5.
12 13. వీరాస్వామయ్య గారు కాశీ యాత్రానంతరం బ్రౌన్ దొరకు ఒక లేఖ వ్రాశాడు దానిలో తన కాశీయాత్రా సంగతులను పుస్తకంగా ముద్రింపించాలని కోరుతూ లిఖిత ప్రతిని పంపిస్తానన్నాడు. బ్రౌన్‌కు పంపిన ఈ పుస్తకమే ఇప్పుడు మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో

ఇంద్రాణి, పలవర, పోలకట్టు, సీదా అనే పదాల అర్థాలకు వీరాస్వామయ్యనే ప్రమాణంగా తీసుకున్నారని సంపాదకుడు పీఠికలో వ్రాశారు.14

---

ఓ 1407 నెంబరుతో ఉంది వీరాస్వామయ్య గారి స్వదస్తూరీతో ఇంగ్లీషులో ఉన్న అసలు ఉత్తరం ఈ వ్రాతప్రతి చివర అతికించి ఉన్నది. దిగవల్లి వేంకటశివరావు గారు ఈ లేఖను తమ 'విశాలాంధ్రము - విస్మృతాంధ్రము' అన్న గ్రంథంలో ప్రకటించాడు.

శ్రీనివాస పిళ్ళె గారు ముద్రింపించిన అచ్చుప్రతి, వ్రాతప్రతికంటె సంక్షిప్తమైనదని బ్రౌన్ 1839 లో వ్రాతప్రతి ఆరంభంలో ఇట్లా వ్రాశాడు:

"N.B. - The printed copy is somewhat abridged form the present one; which was presented to me by the auother..."- 'C.P. Brown.' 1839.

14. బ్రౌన్ ఆ కాలంలో బందరుకు సబ్ కలెక్టరుగా ఉండేవాడు. తెలుగు సాహిత్యానికి ఎంతో సేవ చేశాడు.

ఇంద్రాణి : Name of the wife of Indra A sort of bracelt oranga lu Glossary.
'Dowager' a bramin widow, Enugala, 28 July 1830-P. 112.

పలవర : The rame of a certain much cultivated in the meighbour - hood of Hyderabad for its fruits, see description in the kasi yatra date 7 th September 1830. P 596.

పోలకట్టు : A Ploughed field. kasi Yatra P. 55 (P. 719).

సీదా : (i.e. సదావృత్తి daily bread) rice bestowed as a alms in a raw uncooked state. provisions, undressed vituals; forage, see kasi Yatra P. 119 (P. 124).

(శీదా అనే పదం కాశీయాత్ర చరిత్ర తృతీయ ముద్రణం పేజీ. 169 లో ఉంది. స్వయం పాకమని బ్రాకెట్టులో వ్రాసి ఉంది.)

పై పదాలకు అర్థాలనిస్తూ ప్రతి వివరణ చివర బ్రాకెట్లలో ఇచ్చిన పేజీల సంఖ్య బ్రౌణ్యములోనిదని భావించాలి.

వీరాస్వామయ్యగారు కన్యాకుమారి మొదలు కాశ్మీరం వరకు భారతదేశ మంతటా రెండుసార్లు తిరిగినట్లు దిగవల్లి శివరావు గారి పీఠికవల్ల తెలుస్తున్నది. కాని వీరాస్వామయ్య గారి మొదటి యాత్ర గురించిన తేదీలూ, వివరాలూ ఇవ్వనే లేదు.

రెండోసారి యాత్రలో వీరాస్వామయ్య గారు హైదరాబాద్‌లో బస చేశాడు. "కుంఫిణీ లష్కరు ఉండేస్థలము హయిదరాబాదు కంటే నానాటికి ఎక్కువగా బస్తీ అవుచున్నది. 20 సంవత్సరాల క్రిందట నేను చూచిన దానికంటే మిక్కిలి బస్తీ అయి యుండుటను చూడగా ఆశ్చర్యముగా నున్నది" అని వ్రాశాడు.[15] దీనిని బట్టి వీరస్వామయ్య మొదటి యాత్ర 1810 లో జరిగినట్లు భావించవచ్చు [16]

వీరాస్వామయ్య గారు సకుటుంబంగా కాశీకి బయలుదేరాడు. ఆయన వెంట వెళ్ళిన పరివారం వందమంది దాకా ఉన్నారు. ఈయన మొదటిసారి యాత్ర చేసినప్పటి యాత్రా సంగతులు తెలియవు కాని రెండోసారి గ్రంథస్థం చేయ డానికి ఓ కారణముంది, ప్రేరణ ఉంది. వీరాస్వామయ్య యాత్రకు తరలి వెళ్ళే సమయంలో ఆయన సన్నిహిత మిత్రుడు కోమలేశ్వరపురం పిళ్ళ ఆయా స్థలాల్లోని 'వినోద సంగతుల'ను వ్రాయించి పంపించాలని కోరాడు. అందుచేత వీరాస్వామయ్య గారు తాను దిన చర్య వ్రాసుకోవటమే కాక మిత్రునికి జాబుల మూలంగా అప్పటి యాత్ర విషయాలు ఎరుకపరుస్తూ వచ్చాడు.

వీరాస్వామయ్యగారు కోర్టు పనుల్లో తలమునకలవుతూనే వీలున్నప్పుడల్లా ప్రజోపయోగ కార్యక్రమాలు చేపట్టేవాడు. 1832-33 లో నందననామ సంవత్సరంలో కరువు వచ్చింది. దీన్నే 'గుంటూరు కరువు'అని కూడ పిలుస్తారట! ఆ దుర్భిక్ష సమయంలో శక్తి వంచన లేకుండా అన్న దానం చేస్తూ ఇతరులకు ప్రేరణగా ఉండేవాడు.

---

15. ఏనుగుల వీరాస్వామయ్య గారి కాశీయాత్ర చరిత్ర - పేజీ. 35

16. వీరాస్వామయ్యగారి కాశీయాత్ర 1830 లో జరిగింది. దీనికి 20 సంవత్సరాల పూర్వం అంటే 18 0లో అన్నట్లే కదా!

మద్రాసు పట్టణంలోని నాలుగువర్ణాల వారిలో ముఖ్యులందరికీ గంగా జలాన్ని, జగన్నాథ పట ప్రసాదాన్నీ పంచిపెట్టాడు. కూతురి వివాహంలో 'అన్నానికి ఆకలిగొన్న వారంతా పాత్రులే'నని భావించి సమస్త వర్ణాల వారికి అన్నదానం చేశాడు. ఆక్షేపించిన వారిని సమ్మతింప చేశాడు. దీనివలన వీర స్వామయ్య గారు ఆకాలం నాడే సంస్కరణాభిలాషిగా, సమదృష్టి కలవాడుగా తెలుస్తున్నది.

వీరస్వామయ్య గారు తన వృత్తిలో నిజాయితీపరుడిగా పేరు తెచ్చు కున్నాడు. కోర్టు జడ్జీలకు తృప్తికలిగేవిధంగా నడుచుకున్నాడు. ప్రధాన న్యాయమూర్తి సర్ రాల్ఫ్ పాల్మర్‌గారు తాను పదవీ విరమణ చేసేముందు వీర స్వామయ్యకు యోగ్యతాపత్రం వ్రాసి ఇచ్చాడు. 'కోర్టులో అలసట లేక బహు నెమ్మదిగా పనులు గడుపుచు వచ్చెననీ, తన వుద్యోగపు పనులను మిక్కిలి నమ్మకంతో జరిపించెననీ, గవర్నమెంటు వారి విశేషకృపకు ఇతనంతగా మరే హిందూ పెద్ద మనిషి పాత్రుడు కాలేదని' ఆ టెస్టిమోనియల్(Testimonial)లో పేర్కొన్నాడు.[17]

తర్వాత ఉద్యోగ విరమణను కోరుతూ అప్పటి ప్రధాన న్యాయమూర్తి యైన సర్ రాబర్ట్ బక్లే కమిషన్‌కు మనవి చేసుకున్నాడు. ఈ జడ్జిగారు కూడ వీరాస్వామయ్య సుగుణాలను ఏకరువు పెడుతూ 'యీ ఉద్యోగమును యీ పురుషుడు గడిపినట్టు గడిపే శక్తిమంతులను నేను యిదివరలో చూడలేదు. యీ పురుషుడు యీ ఉద్యోగమును వదలుట యీ కోరటుకు బహునష్టము' అని ఆవేదనతో సెలవిచ్చాడు [18]

## ii) వీరస్వామయ్యగారి వ్యక్తిత్వం :

ఏనుగుల వీరస్వామయ్యగారి కాశీయాత్ర చరిత్ర ఇప్పటికీ పరమ ప్రామా ణికంగా నిలవటానికి అది కాశీయాత్ర అవటమే కారణం కాదు. ఏ యాత్ర

---

17. ఏనుగుల వీరాస్వామయ్య గారి జీవితము - శ్రీనివాస పిళ్ళ పేజీ. 5 (వీరాస్వామయ్యగారి కాశీయాత్ర చరిత్ర)

18. ఏనుగుల వీరాస్వామయ్య గారి జీవితము-శ్రీనివాస పిళ్ళ పేజీ.8.(అదే)

అయినా అది చేసేవారి వ్యక్తిత్వ సంస్కారాల మీద కూడ ఆధారపడి ఉంటుంది. ఏ ప్రదేశాలు చూశారన్నది కాదు, ఎవరు చూశారన్నది ప్రథమంగా పరిగణన లోకి వస్తుంది. ఏ దృక్కోణంతో చూశారన్నది కూడ అవిస్మరణీయమే అవుతుంది.

ఏనుగుల వీరాస్వామయ్య గారు కాశీయాత్ర చేశాడు. చారిత్రకంగా అది చాల ఉపయోగకరమైన యాత్ర. పలు దృక్కోణాల్లో పరిశీలించి చూసినట్లయితే దాన్ని 'మహా యాత్ర' అని కూడ చెప్పవచ్చు. ఒకటిన్నర శతాబ్దాలనుండి ఇప్పటికీ పచ్చగా ఉన్న ఈ గ్రంథం వెనక ఒక మహోన్నత వ్యక్తిత్వం గల విశిష్ట యాత్రికుడు ఉన్నాడన్నది గమనార్హం. కాబట్టి ఈ గ్రంథంలోని విశేషాలను బేరీజు వేసుకునే ముందు ఏనుగుల వ్యక్తిత్వాన్ని గురించి తెలియవస్తున్నంత వరకు చెప్పుకోవడం అవసరం.

వీరాస్వామయ్యగారు బ్రిటిష దొరల ప్రాపకంలో చేసిన కోర్టు ఉద్యోగం (ఇంటర్ ప్రిటర్ పదవి) ఆ రోజుల్లో తక్కువదేమీ కాదు. ఉన్నత స్థానాల్లో ఉన్న బ్రిటిష అధికారుల అభిమానాన్ని చూరగొన్న ప్రముఖుడు వీరాస్వామయ్య. ఇది ఆయన నిజాయితీకి, పలుకుబడికి, ప్రతిష్ఠకు సంబంధించిన విషయం. వారి అభిమానాన్ని తన యాత్రలో వీరాస్వామయ్య చాల చాకచక్యంతో ఉపయోగించుకున్నాడు. ఆ రోజుల్లో చెన్నపట్టణంలోని సాంఘికంగా ఉన్నత స్థానంలో ఉన్న ప్రజాహితశీలుర స్నేహభాగ్యం ఆయనకు లభించింది. వస్తుతః ధార్మిక స్వభావి, సంఘ సంస్కరణాభిలాషి, బహుభాషాకోవిదుడు, వివిధ శాస్త్రాధ్యయనపరుడు కావడంవల్ల ఆయనకున్న సంప్రదాయ జ్ఞానం విభ్రాంతికరమైనది. హిందువుల వన్నీ మూఢ విశ్వాసాలని భావించే బ్రిటిష దొరలకు అర్థమయ్యే రీతిలో హిందూ సంప్రదాయాన్ని గురించి గుణాత్మకంగా (Positive) వాదించగలిగిన దిట్ట. తాను చూసిన స్థల క్షేత్రాలను తన అపార జ్ఞాన సంపదతో సమన్వయం చేసి ఇతరులకు చూపించగలిగిన ధీశాలి.[19] అన్నిటినీమించి కారుణిక దృష్టి, మాన

19. 'కాశీయాత్ర చరిత్ర' ప్రారంభంలో 'ఏనుగుల వీరస్వామయ్యగారి జీవిత చరిత్ర' వ్రాసిన శ్రీనివాస పిళ్ల ఈ అభిప్రాయాన్నే వ్యక్తం చేశారు. "ఆయన యాత్ర పోవునప్పుడు నేను సకృదావృత్తి అక్కడి

వతా దృష్టి, అధ్యాత్మికానుభవాలపట్ల సుముఖత కలిగిన అచ్చమైన ఆస్తికుడు కావటంవల్ల ఆయన యాత్ర అంతరంగ బహిరంగ యాత్రల విలక్షణ సమ్మేళనంగా గోచరిస్తుంది.

కాశీయాత్ర చరిత్ర కేవల సంఘటనల సమాహారంగా కాక ఒక జిజ్ఞాసాపరుడు చేసిన అంతరాంతర సాధనగా కూడ అనుకోవడానికి వీలుంది. ఇటువంటి వ్యక్తి, వ్యక్తిత్వ స్థూలప్రదర్శన కాశీయాత్ర అవగాహనకు తోడ్పడుతుందన్న దృష్టితో ఆ గ్రంథంలోని కొన్ని ఘటనలను ఆధారం చేసుకుని చూపించడం జరుగుతుంది.

మద్రాసు సుప్రీంకోర్టులో అడ్వకేటు జనరల్‌గా వున్న జార్జి నార్టన్ దొరగారు, కుంఫిణీ వారి కొలువులో పోలీసు సూపరింటెండెంట్‌గా పని చేసిన వెంబాకం రాఘవాచార్యులుగారు, కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్లగారు- వీరంతా ఏనుగుల వీరాస్వామయ్యగారికి ముఖ్యస్నేహితులు. అందరూ కలిసి ఆ కాలంలో ప్రజాహిత కార్యక్రమాల్లో పాల్గొనేవారు.

పచ్చయ్యప్ప అనే చెన్నపట్నం (మద్రాసు) ప్రముఖుడు లక్షలాది ధనాన్ని దానధర్మాల కోసం కేటాయించాడు. కాని ఆ డబ్బు సద్వినియోగం కాలేదు ఆయన వారసులు హక్కుభుక్తం చేసుకున్నారు. ఈ అధర్మాన్ని సహించని వీరాస్వామయ్యగారు కాంప్టన్, నార్టన్‌గార్ల సాయంతో దానధర్మాలకు కేటాయించిన ద్రవ్యాన్ని వెలికి తీయించాడు.[20] ఈ డబ్బు సద్వినియోగపడేందుకు మద్రాసు సుప్రీంకోర్టులో ఒక స్కీము తయారు చేయించాడు. ఆ ప్రకారంగానే ధర్మకర్తల బోర్డు నియామకం జరిగి, తర్వాతి కాలంలో ఈ సొమ్ముతో పచ్చయ్యప్ప కళాశాల స్థాపించబడింది.

---

వినోదములను వ్రాయించి పంపవలెనని అడుగుకొన్నందుకు... అప్పుడప్పుడు వ్రాసి పంపుచూ వచ్చిరి. ఆ పుస్తకమును చూచుటవల్ల యాత్ర బోయి చూచి తెలియవలసిన సంగతులన్నీ తెలియుచున్నవి." పేజీ 6.

20. సుప్రీంకోర్టు పాత అడ్వకేటు జనరల్ కాంప్టన్ దొర. కాగా జార్జి నార్టను దొర అప్పటి అడ్వకేటు జనరల్.

కుంఫిణీవారు కేవలం రాజ్యవిస్తరణలో, పన్నుల వసూళ్ళలోనూ మునిగి ప్రజల కష్టసుఖాలు పట్టించుకునేవారు కాదు. ప్రజలలో అజ్ఞానం వ్యాపించి ఉంది. అప్పటికి ఇంగ్లీషు విద్యాభ్యాసానికి స్థానికులకు అవకాశం లేదు. ఇలాంటి పరిస్థితిలో ప్రజలను చైతన్యవంతులను, విజ్ఞానవంతులను చేయాలనే ఉదారమైన ఆశయంతో 'హిందూ లిటరరీ సొసైటీ' స్థాపింపబడింది. ఏనుగుల వీరాస్వామయ్యగారు, వెంబాకం రాఘవాచార్యులుగారు, శ్రీనివాసపిళ్లగారు కలిసి జార్జి నార్టనుగారి నాయకత్వంలో ఈ ప్రజాసంఘాన్ని నెలకొల్పారు. సభలు, సమావేశాలు ఏర్పాటు చేసి, దేశచరిత్ర, పరిపాలన, ప్రజల హక్కులు, ఇంగ్లీషు విద్య ఆవశ్యకత మొదలైన విషయాల గురించి ఉపన్యాసాలిచ్చారు, ఇప్పించారు. ప్రజలలో రాజకీయ పరిజ్ఞానం కలగడానికి ఈ సంస్థ ఎక్కువగా దోహదం చేసింది. ప్రజలలో ఇంగ్లీషు విద్య కావాలనే కోరిక చిగురించి, క్రమంగా ప్రభుత్వంపై ఒత్తిడి తీసుకురావడానికి తోడ్పడింది. ఉత్తరదేశంలో రాజా రామమోహన రాయలవలె ఇక్కడ ప్రజల విద్యాభివృద్ధికి, జాతీయ చైతన్యానికి వీరాస్వామయ్యగారి లాంటి వారు పాటు పడ్డారని చెప్పవచ్చు.

వీరాస్వామయ్య గారికి ధర్మకార్యాలమీద ఆసక్తి, సంఘ సంస్కరణలపై ప్రీతి ఎక్కువ.

కూతురి వివాహంలో చతుర్వర్ణాల వారికి అన్నదానం చేయడం గిట్టని కొందరు 'ఈ విధంగా డబ్బును వృధా చేయడం కంటె కూతురి పోషణకై ఆ సొమ్మును ఆస్తిగా ఉంచుట మేలని' సలహా ఇచ్చారు. దీనికి జవాబుగా వీరాస్వామయ్య గారు 'చిన్నదాని పోషణ కొరకు ద్రవ్యమును మనుష్యాధీనముగా నుంచుటకు ప్రతిగా యీశ్వరునిచేత నేను వుంచుచున్నా'నని చెప్పాడు [21]

---

21. ఏనుగుల వీరాస్వామయ్యగారి జీవితచరిత్ర - కోమలేశ్వరపురం శ్రీనివాస పిళ్ల - పేజీ. 8.

నందన నామ సంవత్సర కరువులో ఆయన మిత్రుడు శ్రీనివాస పిళ్ల కొంత ధాన్యాన్ని సేకరించి వుంచుకోవటం మంచిదని ముందు జాగ్రత్త కొరకు చెప్పగా, వీరాస్వామయ్యము అట్లా చేయటానికి మనస్కరించలేదు. "మనము ధాన్యము సంగ్రహించి మనకు మట్టుకు భుజించి అన్నాతురులై దుఃఖపడే పేదలను చూచుచు జీవించుట అప్రయోజకము గనుక తన ప్రయోజకత్వమునకు గాను విస్తరించి జాగ్రత పెట్టుకొనరాదు" అని చెప్పారట.[22] ఇది ఆయన ధార్మిక బుద్ధికి నిదర్శనం. గంజిదొడ్డి అనే అన్నసత్రంలో గవర్నమెంటు వారు విశేష ద్రవ్యాన్ని ఖర్చు చేసినప్పుడు, ఆయన ధర్మవిచారణ కర్తలలో ఒకడుగా ఉండి, వెయ్యి రెండువేల తూముల బియ్యాన్ని ప్రతిదినం వండించి పేదలకు సకాలంలో వడ్డింప చేశాడట![23] ఆ సమయంలో రాత్రింబవళ్ళు తన కాలాన్నీ శ్రమనూ ఈ కార్యానికి వినియోగిస్తూ వచ్చాడు.

వీరాస్వామయ్య గారు తన అధికారాన్ని, పలుకుబడిని ప్రజల సౌకర్యం కొరకు కూడ వినియోగించే వాడనటానికి తార్కాణంగా ఈ వృత్తాంతాన్ని పేర్కొనవచ్చు: గయాక్షేత్రంలో <u>అక్షయవటం</u> దగ్గిర ధర్మశాలలో గయావళీలు తప్ప ఇతరులు భోజనం చేయకూడదనే నియమం ఉన్నదట[24] వీరస్వామయ్య గారు గయలో ఉన్నన్ని రోజులు (45 దినాలు) ప్రతిరోజు 80కి తక్కువ కాకుండా పంచ ద్రావిళ్ళు వీరితో సహపంక్తి భోజనం చేస్తూ వచ్చారు.[25] అట్లాగే

---

22. అదే. పుట. 6.

23. తూము = Called mercall in Tamil being a variable measure equal to about $8\frac{3}{4}$ seers. బ్రౌణ్య తెలుగు ఇంగ్లీషు నిఘంటువు.

24 బ్రహ్మకల్పిత బ్రాహ్మణులనే తెగవారు గయావళీలు. వీరు గయలో వుండి, యాత్రికులచే పిండ ప్రదానాలు చేయిస్తారు.

25. ఆంధ్రులు, ద్రావిడులు, కర్ణాటకులు, మహారాష్ట్రులు, ఘూర్జరులు-వీరిని పంచ ద్రావిడులంటారు. వీరిలో వీరికి సామాన్యంగా పంక్తి భోజనం ఉంటుంది.

ధర్మశాలలో కూడ పిండ ప్రదానం తర్వాత అందరూ కలిసి భోజనం చేశారు. ఇది అక్కడి కట్టుబాటుకు విరుద్ధమైన ఘటన. పునా శ్రీమంతుడు కూడా ఈ నియమాన్ని ఉల్లంఘించలేకపోయాడట![26] కాని వీరస్వామయ్యగారికి సాధ్యమైంది. దీనికి ముఖ్య కారణాలు: గయావళీలు ఈయనకు అనుకూలంగా ఉండటం, మేజిస్ట్రేటు ఉత్తర్వు ప్రకారం కొత్వాలు వందమంది బంట్రోతులతో ఎప్పటికీ వెన్నంటి ఉండడం - అనేవి.[27]

గయాక్షేత్రంలో అష్ట తీర్థాలలో, ఇంకా వందలాది ఉప తీర్థాలలో పిండ ప్రదానం చేయడం ఆచారం. వీటన్నిటికి బదులుగా రామసాగరమనే తీర్థం వద్ద పిండ ప్రదానం చేసినట్లయితే యాత్రికులకు ప్రయాస తప్పుతుంది. వేలాది ఉప తీర్థాలలో పిండప్రదానం చేసిన దానికన్నా ఎక్కువ ఫలాన్ని పొందవచ్చు కూడా. కాని రామసాగర తీర్థాన్ని ఇంగ్లీషు దొరలు సంకెళ్ళవాండ్ల (ఖైదీల)చే బాగు చేయిస్తూ, ఎవరినీ రానివ్వటం లేదు[28] జడ్జీ మొదలైన దొరలంతా వీరస్వామయ్య గారికి అనుకూలురుగా ఉన్న సంగతి తెలిసి గయావళీలు రామసాగరం వద్ద ఈయనచేత పిండప్రదానం చేయించారు. అక్కడి ఇంగ్లీషు దొరలకు వీరాస్వామయ్య గారు మనవి చేసుకున్న మీదట రామతీర్థం వద్ద కూడ యాత్రికులు పిండ ప్రదానాలు చేసుకోవచ్చునని ఉత్తర్వులు జారీ చేశారట!

కాశీయాత్రలో వీరాస్వామయ్య గారికి ఇంగ్లీషు దొరల సహాయం లభించింది. జబల్‌పూర్‌లో ఉండే గవర్నర్ జనరల్ ఏజెంటు స్మిత్తు దొర ఈయనకు

---

26. ఈ పునా శ్రీమంతుడు పీష్వా అని ప్రసిద్ధి చెందిన మహారాష్ట్ర నాయకుడు. శివాజీ మనుమడగు షాహు కాలంలో ప్రధాన మంత్రి.

27. 'కొత్వాలు' అంటే పోలీసు అధికారి - అని శబ్దరత్నాకరము

28 సంకెలవాడు = A convict, a prisoner in irons, నిగళ బంధనము గలవాడు—అని బ్రౌణ్యము. ఖైదీలని వీరాస్వామయ్యగారు. పేజీ. 219.

యాత్రలో ఇబ్బంది లేర్పడకుండా ఉండటానికి ఒక 'ఫరవానా' వ్రాసి యిచ్చాడు.[29] అంతేగాక కాశి వరకు 'చప్పరాశి అనే బిళ్ళ బంట్రౌతును ఒకని తయినాతి చేసి' పంపించాడు.[30]

చిన్నపట్నంలో సుప్రింకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా ఉన్న సర్ జాన్ న్యూబోల్టు దొరగారు, సర్ చార్లెస్ గ్రే దొరగారు వ్రాసి యిచ్చిన 'క్యారకట రులు' పర ప్రదేశాల్లో వీరాస్వామయ్యగారికి బాగా ఉపకరించాయి [31]

---

29. Mandate, Percent, Written Permission. Warrant. రాజాజ్ఞ, రాజసన్నదు. అని బ్రౌణ్యము.

30. 'కాశీయాత్ర చరిత్ర' పేజీ. 94.
బంట్రౌతు or బంట్రోతు = A Yeoman, Police or revenue officer. From బంటు a Soldier, and రౌతు a trooper. The English call them 'poems' which name is spanish, from south America. బ్రౌణ్య తెలుగు ఇంగ్లీషు నిఘంటు -

వీరాస్వామయ్య గారు బంట్రౌతులను నాలుగు రకాలుగా 'కాశీ యాత్ర చరిత్ర'లో పేర్కొనాడు.

1. కట్టుబడి బంట్రౌతులు. పేజీ. 22.
2. సరఫరా బంట్రౌతులు. పేజీ. 78.
3. బిళ్ల బంట్రౌతులు. పేజీ 94.
4. రాణా బంట్రౌతులు. పేజీ. 162.

బిళ్ళ బంట్రౌతులనే ఛప్పరాశి అనీ, దలాయత్‌లు అనికూడ పిలిచేవారని తెలుస్తున్నది. పేజీ. 319. - తయినాతి = Attendence, Service, Waiting - అని బ్రౌణ్యం. కాబట్టి 'తయినాతి చేసి' అంటే సేవలకు నియోగించి అని అర్థం.

31. క్యారక్టర్ సర్టిఫికెట్లు ఐ ఉంటాయి. 'నడవడి పత్రాలన్నమాట'.

కాశీ పట్టణం మొదలుకొని ప్రతి జిల్లా మెజిస్ట్రేటువారు వారి జిల్లా సరిహద్దు దాకా చప్రాశిని వెంట పంపుతూ వచ్చారు. ఈ బంట్రౌతు ద్వారా మజిలీ వూళ్ళలోని జమీందార్లను పిలిపించి వారి ఇళ్లలో వీరాస్వామయ్యగారు బస చేసేవాడు. ఈ విధంగా వెళ్లినచోట సౌకర్యాలన్నీ పై సిఫారసు ఉత్తరాల మూలంగా జరిగినవే.

గయలో విష్ణుపాదంమీద పిండప్రదానం చేసే సమయంలో గర్భగృహంలోకి ఎవరినీ రానివ్వకుండ సర్కారు మనుష్యులను నియమించుకునే వీలు కేవలం రాజాధిరాజులకే ఉండేది. కలకత్తాలో వున్న మించ్చిన్ దొర వీరాస్వామయ్యకు తగు సహాయం చేయవలసినదని ఇక్కడి జడ్జి మారిసు దొరకు కాగితం పంపించాడు. మారిసు దొర 'సరకారు హుకుము'తో పాటు మనుషులను కూడ పంపించగా, వీరాస్వామయ్య గారు ప్రశాంతచిత్తంతో, సావకాశంగా పిండప్రదానం చేశాడు.

కలకత్తాకు సమీపంలో ఉన్న వుడుబడియాలో ఆయుధాలు ధరించి తిరగ కూడదనే నియమం. సంస్థానాధిపతులకు మాత్రం గవర్నమెంటునుండి ఆయుధ ధారణకు 'ఫరవానా' ఉంటుంది. ఈ అసాధ్యమైన కార్యాన్ని కూడ కలకత్తాలోని చీఫ్ జస్టిస్ సర్ చార్లెస్ గ్రే ద్వారా వీరాస్వామయ్య గారు సుసాధ్యం చేసుకున్నాడు.

గంజాం-బురంపురంల మధ్య అడవి దట్టంగా ఉండి ప్రయాణానికి అసౌకర్యంగా ఉంది. దారిలోనే ఉన్న ఛత్రపురంలో కలెక్టరు కార్యాలయంలో ట్రాన్స్లేటర్‌గా పనిచేస్తున్న కపిల రామదాసు పంతులు గారికి వీరస్వామయ్యగారొక ఉత్తరం వ్రాసి పంపాడు. ఆయన "40 కావళ్లు, 2 దలాయతులు, ఒక గుమస్తాను పంపి అరణ్య మార్గం సుళువు చేయించాడ"ట![32]

---

32. కాశీయాత్ర చరిత్ర. పేజీ 319.
దలాయతు or ధలాయతు = Dha'wait A da'ait or armed atterda t: a B dygua d an
- వెండిబిళ్ల బంట్రౌతు. బ్రౌణ్య తెలుగు ఇంగ్లీషు నిఘంటు. Mixed Dia.ects P. 41.

పై సంఘటనలన్నీ వీరాస్వామయ్య గారి పలుకుబడినీ, కార్యదక్షతను చాటుతున్నాయి.

ఈయనకు ఇంగ్లీషు దొరల వద్ద సాన్నిహిత్యం ఎక్కువ. వారితో అనేక సందర్భాల్లో రాజకీయ, మత, సాంఘిక విషయాలు చర్చించడానికి వెనుకాడేవాడు కాదు.

ప్రయాగలో కస్టమ్స్ కలెక్టర్ మిస్టర్ నీపన్ (Mr. Nepean) దొరతో మత పరమైన ప్రసంగం వచ్చింది. ఆయన 'నదులను, గుళ్ళను ఈశ్వరుడని నమ్ముతావా?' అని ప్రశ్నించాడు. దానికి జవాబుగా వీరాస్వామయ్య గారు 'ప్రపంచ పటాలు రాసి తెలియనిదేశాలను మీరు ఏ విధంగా చూపిస్తున్నారో, అట్లాగే జ్ఞానమార్గం ద్వారా భగవంతుని తెలుసుకోలేనివారికి ఆయన మీద భక్తి కలగడానికి మా పెద్దలు ఈ స్వరూపాలను ఏర్పాటు చేశా'రని చెప్పాడు.[33]

గయలో డాక్టర్ జాన్ డేవిడ్‌సన్‌తో ఒకసారి ప్రపంచసృష్టికి సంబంధించిన సంభాషణ జరిగింది. అప్పుడాయన "హిందూ దేశములో వుండే బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణాలనే భేదము యీశ్వర నిర్ణయమా? లేక మానుష సంకేతమా?" అన్న ప్రశ్న వేశాడు వీరాస్వామయ్యగారు ఆయనకు అర్థమయ్యే రీతిలో సుదీర్ఘ చర్చచేసి చివరకు ఈ వర్ణ భేదాలు మానుష నిర్ణయమేనని తేల్చి చెప్పాడు.

ఇంకా డేవిడ్ సన్ వీరాస్వామయ్యను 'నీవు ఎందరు దేవుళ్ళను ఆరాధిస్తావు?' అని ఆశ్చర్యంతో ప్రశ్నించాడు. దానికి ఈయన జవాబు ఇట్లా ఉంది: 'దేవసమానులయిన పురుషులను మీరు 'సేయింట్స్' అన్నట్లుగానే మేము మా పురాణాల్లోని దివ్య పురుషులను దేవతలంటున్నాము. దేవత అనే పదం వచ్చినప్పుడల్లా అనువాదకులు 'గాడ్' అని వ్రాయటం వల్ల హిందువులు ముప్పైమూడు కోట్ల దేవతలను కొలుస్తున్నట్లుగా మీరు పొరబడుతున్నారు కానీ, మాకు జగదీశ్వరుడొక్కడే. ఆయననే మీరు 'గాడ్' అని తర్జుమా చేసుకోవలసింది, మిగతా వారిని కాదు.'[34] ఈ విధంగా వీరాస్వామయ్య గారు మన అద్వైత వేదాంతాన్ని సులభసుందరంగా చెప్పాడు.

---

33. కాశీయాత్ర చరిత్ర - పేజీ 141.
34. కాశీయాత్ర చరిత్ర - పేజీ 283 (సంక్షిప్తం చేయబడింది).

ఇక్కడి జడ్జి మారీసు దొర ఒకసారి వీరాస్వామయ్య గారితో 'స్త్రీలు తప్పనిసరిగా సహగమనము చెయ్యవలసినదేనా? చేయకపోతే ప్రత్యవాయమా? అని ప్రశ్నించాడు. దీనికి జవాబుగా వీరాస్వామయ్య గారు, పురుషుని మరణా నంతరం విధవ స్త్రీలు ఆచరించవలసిన విధులను గురించి స్మృతులు పేర్కొన్నాయి కాని సహగమనం విధిగా చేయాలని వ్రాయలేదని చెప్పాడు ఈ ఆచారానికి సంబంధించిన విషయాలు ఉప స్మృతులలో కల్పింపబడినవే కాని మూల స్మృతులలో లేవని సందేహనివృత్తి చేశాడు.

పై సందర్భాన్ని పరిశీలించి చూస్తే వీరాస్వామయ్యగారు ఎంత సంప్రదాయ ప్రేమికుడైనా, అమానుషమైన ఆచారాలను వ్యతిరేకించే మానవతా వాదిగా దర్శన మిస్తాడు.

క్రైస్తవ మతస్థుల ఆపోహలకు సరియైన జవాబు చెప్పడానికి వీరాస్వామయ్య గారి పురాణశాస్త్ర పరిజ్ఞానమే మూలకారణం. సంస్కృతంలో పండితుడు కాబట్టి లోకోక్తులను ఔచిత్యంతో సందర్భశుద్ధితో అక్కడక్కడ ఉపయోగించాడు.

వీరాస్వామయ్యగారు కాశీయాత్ర చరిత్రలో ఆత్మ, అంతరాత్మ, పరమాత్మలను గురించి సుదీర్ఘ చర్చ చేసి మూడు ముక్కల్లో కింది విధంగా తేల్చి చెప్పాడు:

"పాంచ భౌతిక దేహనివాసి అయిన ప్రకృతిని ఆత్మ అని పెద్దలు అనుచున్నారు, అందులో ప్రతిభాతి అయ్యే పరమాత్మ ప్రతిబింబాన్ని అంతరాత్మ అనుచున్నారు, ప్రతిభాతిని కలగచేసే వస్తువును పరమాత్మ అని అంటారు."35

వీరాస్వామయ్య గారికి శాస్త్ర పురాణాల్లోనే కాకుండా భూగోళశాస్త్రంలో కూడ మంచి ప్రవేశమున్నట్లు తెలుస్తున్నది.

'గోళం తిరుగుతున్నప్పుడు దాని కదలిక మనకెందుకు తెలియడం లేదు?' అన్న ప్రశ్న వేసుకొని 'పెద్ద ఓడలలో వున్న వారికే ఓడ నడుస్తున్నట్లు తెలియనప్పుడు, బ్రహ్మాండమైన భూగోళంలో ఉన్నవారికి దాని భ్రమణం ఎట్లా తెలుస్తుంది?' అని తనకు తానే జవాబు చెప్పుకున్నాడు.

---

35. కాశీయాత్ర చరిత్ర. పేజీ. 252.

పీరాస్వామయ్య గారు కాశీయాత్ర చరిత్రలో తాను ఎనిమిదో 'లంజం' భాగలో వుండే కన్యాకుమారి నుండి 26 వ భాగలో ఉండే కాశీ వరకు దేశాటనం చేసినట్లు చెప్పుకున్నాడు[36] ఈ యాత్రలో అహః ప్రమాణాలు దేశ దేశానికి భేదించినట్లుగా గమనించాడు. దీనికి కారణం సశాస్త్రీయంగా వివరించాడు. భూమి తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టు పరిభ్రమిస్తుందనడానికి అహః ప్రమాణ భేదమే తార్కాణమని తెలిపాడు.

పీరాస్వామయ్య గారు ఆయా క్షేత్రాలు దర్శించినప్పుడు కాశీ, గయ, ప్రయాగ మొదలైన క్షేత్రాల మాహాత్మ్యాలను పురాణ జ్ఞానంతో విపులంగా వివరించాడు. అట్లాగే తీర్థమాహాత్మ్యాలను కూడ. సంప్రదాయజ్ఞానం కలవాడు కనుక శాస్త్రోక్తంగా ఆరాధనా విధులు, పిండ ప్రదానాలు సావకాశంగా జరిపించాడు. తీర్థవిధులు నిర్వర్తించడంలో అప్పుడప్పుడు గవర్నమెంటువారి ప్రత్యేక సహాయం తీసుకున్నా సామాన్యులపై అహంకారం ప్రదర్శించినట్లు అనిపించదు. తీర్థ స్థలాలలో తనకు తోడ్పడిన బ్రాహ్మణులకు, పండాలకు, గయావళీలకు వారు ఊహించినదానికంటే ఎక్కువగానే దానం చేసి తన ఔదార్యాన్ని ప్రకటించుకున్నాడు.

## iii) దూరాలు - దూరమానాలు :

పీరాస్వామయ్యగారి యాత్రాకాలం నాటికి దేశంలో బారలు, పరుగులు, గడియలు, కోసులు, ఆమడలు, మజిలీల పద్ధతిలో దూరాలను లెక్కబెట్టే వారని తెలుస్తున్నది. ఈ దూరమానంలో కూడ ప్రాంతానికి ప్రాంతానికి మధ్య స్వల్పవ్యత్యాసాలున్నాయి.

కోసులు, ఆమడల స్థానంలో మనమిప్పుడు కిలోమీటర్లను వాడుతున్నాం. కాని అర్థం తెలియకున్నా పరుగు, బార, గడియ-లను ఇంకా నిత్య జీవన వ్యవహారంలో ఉయోగిస్తూనే ఉన్నాం. ఉదా: ఒక్క పరుగులో వచ్చేశాను, బారెడు పొద్దెక్కింది, గడియకూడ విరామంలేదు. (క్షణం తీరికలేదు అనడానికి) లాంటివి.

---

36. 'లంజం' అంటే లంబం అని అర్థం. అనగా బ్రహ్మాండం యొక్క నిడుపుగాత్రం. రేఖాంశమన్నమాట.

వీరస్వామయ్యగారు ప్రయాగలోని త్రివేణీ సంగమం వద్ద ఒక పాటక్కు నిర్మించారని వ్రాస్తూ, "ఆ పాటక్కుకు కొన్ని బారలకు ముందుగా కచ్చేరిని ఉంచి యున్నారు" అని దూరాన్ని బారలు సాచి చూపాడు.[37] బార అంటే రెండు గజాల దూరం, లేదా నాలుగు మూరలని అర్థం.[38]

మహానందికి దగ్గరలో ఉన్న వెలపనూరుకు ఓంకారమనే స్థలం ఐదు పరుగుల దూరంలో అడవి నడుమ ఉన్నదట. పరుగు దూరమంటే ఒక మనిషి మామూలుగా పరుగెత్త గలిగినంత దూరం. రెండు మైళ్ళు లేదా ఒక కోసెడు దూరమని వాడుకలో ఉంది.[39]

వీరాస్వామయ్యగారు సమయాన్ని గంటలలోనే తెలుపుతూ, దూరాన్ని మాత్రం గడియలలో లెక్కించాడు. చెన్నపట్నంలో వ్యవహారంలో ఉన్న గడియ దూరాన్ని 24 నిమిషాల్లో నడవవచ్చునట![40] ఈ నిదానంతోనే కాశీ యాత్రలో ఆయా ప్రదేశాల మధ్య దూరాలను నిర్ణయించాడు. "ఆ దినము 3 ఘంటలకు లేచి 4 గడియల దూరంలో నున్న పుల్లంపేట గడియ ప్రొద్దు ఉండగానే చేరినాను" అని ఒకచోట వ్రాశాడు.[41] వీరాస్వామయ్యగారు తెల్లవారు జామున మూడు గంటలకు నిద్రలేచాడు. పుల్లంపేట అక్కడికి నాలుగు గడియల

---

37. కాశీయాత్ర చరిత్ర పేజీ. 136.
38. బార = A fatham, the lenght of the two arms extended. పదిబారలు Twenty Yards. చాచిన రెండు చేతుల కలది, నాలుగు మూళ్ళు. బ్రౌణ్య తెలుగు ఇంగ్లీషు నిఘంటు.
39. పరుగు = *Running*, a run. The distance a man can run. This is usually called క్రోశము a coss and is about two miles.⟶ ⟶బ్రౌణ్య తెలుగు ఇంగ్లీషు నిఘంటు.
40. గడియ = Hindu hour. (of twenty four English minutes: forming the Sixtieth part of a day) బ్రౌణ్య నిఘంటు.
41. కాశీయాత్ర చరిత్ర. పేజీ 7.

దూరంలో ఉంది. అంటే పుల్లంపేటకు చేరడానికి ఒక గంట 36 నిమిషాలు పడుతుందన్న మాట![42] ఈ లెక్కన పుల్లంపేట చేరేసరికి 4 గంటల 36 నిమిషాలు అవుతుంది. అది మే నెల. ఎండాకాలం. తొందరగానే తెల్లవారుతుంది. కాబట్టి 5 గంటలకే తెలతెలవారుతుందనుకున్నా ఇంకా ఆయన చెప్పినట్టు 'గడియ పొద్దు' ఉండనే ఉంటుంది.

యాత్రా ప్రారంభాన్ని గంటల్లో సూచించినట్లుగానే గమ్యం చేరుకోవడాన్ని కూడ గంటల్లోనే చెప్పి ఉంటే ఈ డొంక తిరుగుడు వ్యవహారముండేది కాదు కదా!

చెన్నపట్నం నుండి కృష్ణానది తీరందాకా వాడే కోసు, చెన్నపట్నపు రెండు గడియల దూరంగా ఉంటున్నదట! కూతవేటు దూరాన్ని క్రోశము లేదా కోసు అంటారు. ఇది ప్రాంతాన్నిబట్టి మారుతుంటుంది. రెండువేల గజాలు కాని, రెండుమైళ్ళ దూరాన్ని కాని కోసు అంటారనీ, కొంత ప్రాంతాలలో కోసు అంటే ఒక గంట ప్రయాణం చేసే దూరమనీ బ్రౌణ్యం పేర్కొంటున్నది.[43]

మధ్యప్రదేశ్‌లోని జబల్‌పూర్ నుండి వాడుకునే కోసులు దాదాపుగా చెన్నపట్టణపు కోసులకు సరిపోవుచున్నవని వీరాస్వామయ్య గారు వ్రాశాడు.

---

42. నాలుగు గడియలకు 4 x 24 నిమిషాలు = 1 గంట. 36 నిమిషాలు.

43. కోసు = An Indian league: being an hour's distance: The length differs in different places but is about two miles.

క్రోశము: The Indian league or coss; being the distance at which a "voice" may be heard. This varies in different places but is generally about 2000 yards : Vulgarly a coss in about two miles, but is less in hilly countries, "an hour's distance" being the best measure in a mountainous country. బ్రౌణ్య తెలుగు ఇంగ్లీషు నిఘంటు.

రామటెంకి మొదలుగా కొంత కోసులను 'పక్కా కోసు'లంటారట. ఈ కొంత కోసులు నర్మదానదితో సరి. ఆపైన వీటి వాడకం లేదన్నాడు. ఒక పక్కా కోసుకు మూడు కచ్చాకోసులు, ఒక కచ్చాకోసుకు రెండుమైళ్ళని వీరాస్వామయ్య గారు వ్రాశాడు.

కృష్ణా గోదావరి మధ్య తీరంలో వాడే కోసు ఒకటిన్నర గడియల దూరం. దీన్ని 'హల్కా' కోసు అంటారట. చెన్నపట్నపు కోసుతో పోలిస్తే ఇక్కడి కోసు రెండు మైళ్ళకు కొంచెం తక్కువేనని వీరాస్వామయ్యగారు తెలిపాడు.

వీరాస్వామయ్యగారు ఈ వ్యత్యాసాలను గమనించి చెన్నపట్నపు కోసుం సుమారును బట్టే మొత్తం యాత్రలో దూరాలను లెక్కగట్టుకున్నానని వ్రాశాడు.

కళింగదేశం మొదలుగా దక్షిణంలో ఉన్న కోసులు 'సులువైనవి.' ఇక్కడి ఒక కోసు దక్షిణ దేశపు రెండు గడియల దూరానికి కాలు గడియ ($\frac{1}{4}$ గడియ) తక్కువట అంటే ఒక కోసుకు $1\frac{3}{4}$ గడియలన్నమాట!

కళింగదేశం (విజయనగరం) ప్రవేశించిన తర్వాత వీరాస్వామయ్య గారు "యీ స్థలము మొదలుగా ఆమడలు అనేమాట వినడమయినది" అని వ్రాస్తూ, "ఇక్కడ కోసుకూడ దాదాపుగా చెన్నపట్టణపు రెండుగడియల దూరంతో సమానంగా ఉంటున్నదని" అనుభవపూర్వకంగా పేర్కొన్నాడు.44

ఆ కాలంలో దూరాలను మజిలీలలో కూడ లెక్కకట్టేవారు. ఒకదినం చేయగలిగిన ప్రయాణాన్ని మజిలీ అంటారని, మజిలీ చేయటమంటే అనాటి

---

44. ఆమడ = A measure of distance equal to four Coss that is either 8 or 10 miles.
బ్రౌణ్య తెలుగు నిఘంటు.
ఒక ప్రాంతంలో కోసుకు $1\frac{1}{2}$ గడియల దూరం, మరో ప్రాంతంలో 2 గడియల దూరం ఉండటంవల్ల ఆమడకు 8 లేదా 10 మైళ్ళ దూరం అని బ్రౌన్ వ్రాయవలసి వచ్చిందేమో!

ప్రయాణం తర్వాత రాత్రి వసతికోసం ఏదో ఒక అనుకూలమైన ప్రదేశంలో విడిద చేయటం అని బ్రౌణ్యం పేర్కొంటున్నది.45

కామారెడ్డి నుండి ఆర్మూరుకు వెళ్ళేదారిలో (ఈ రెండూ ఇప్పుడు నిజామాబాద్ జిల్లాలో ఉన్నాయి) ఒక రాత్రి వీరాస్వామయ్యగారు జగనం పల్లెలో మజిలీ చేశాడు అక్కడికి "నాలుగు మజిలీల దూరంలో వేములవాడ అనే మహాక్షేత్ర మున్న"దని వ్రాశాడు.46

చెన్నపట్నంలో వ్యవహరింపబడే దూరమానాన్ని పరిగణనలోని తీసుకుని అప్పటి దూరాలను ఇప్పటి కిలోమీటర్లతో సరిచూసుకుంటే, వీరస్వామయ్య గారు ఎంత ప్రామాణికంగా లెక్కలుకట్టాడో స్పష్టమౌతుంది.

వీరాస్వామయ్య గారు హైదరాబాదు నగరాన్ని జూలై, 20, 1830 నాడు వదలి మేడిచర్ల (నేటి మేడ్చల్), మాషాపేట, బిక్కనూరు పేట (నేటి బిక్నూరు)ల మీదుగా కామారెడ్డి పేట (నేటి కామారెడ్డి) కు 23 వ తేదినాడు చేరుకున్నాడు. వీరాస్వామయ్య గారి లెక్కల్లో ఈ మధ్య దూరం 31 కోసులు అంటే 62 మైళ్ళు. దాదాపు ఇప్పటి దూరమానంలో వంద కిలోమీటర్లన్నమాట!47 రోజుకు సగటున 25 కిలోమీటర్ల దూరాన్ని కాలినడకన ప్రయాణం చేస్తూ వంద కిలోమీటర్ల దూరాన్ని (హైదరాబాద్ నుండి కామారెడ్డి) నాలుగు రోజులలో చేరుకున్నాడు. ఇప్పుడైతే బస్సులో మూడు గంటలలో చేరుకోవచ్చు.

ఒకటిన్నర శతాబ్దాల క్రితం వీరాస్వామయ్య గారు ప్రయాణించిన మార్గమే నేటి హైదరాబాద్-నాగపూర్ జాతీయ రహదారి.

---

45. మజిలీ = Manjil, one stage: a halt. A days journey. మజిలీ చేయుట to halt, stop for the night. ఒక దినం ప్రయాణం-బ్రౌణ్య తెలుగు ఇంగ్లీషు నిఘంటు. Mixed Dialects.

46. కాశీయాత్ర చరిత్ర. పేజీ 45.

47 1 మైలుకు 1.61 కి. మీ 62 మైళ్ళకు 62 × 1.61 = 100 కి. మీ. రోడ్డు రవాణా శాఖవారి 'మైలు రాళ్ళు' కూడ సరిగ్గా ఇదే దూరాన్ని సూచిస్తున్నాయి.

## vi) ప్రయాణంలో ఎదురైన ఇబ్బందులు :

నేడు ఉన్నన్ని అధునాతన యాత్రా సౌకర్యాలు పూర్వం లేకపోవడం వల్ల, యాత్రికులు ఎన్నో కష్ట నష్టాలకు ఓర్చి తీర్థయాత్రలు చేస్తూండేవారు. మార్గాలు సరిగ్గా ఉండేవి కావు. ఎడ్ల బండ్లు నడవటానికి కూడా యోగ్యమైన దారులు కావవి. సంపన్నులు మాత్రమే పల్లకిలపై యాత్రలు చేసేవారు. చిట్టడవుల్లో ప్రయాణించ దలచుకున్నప్పుడు వారు ముందుగా మనుష్యులను పంపించి త్రోవలోని చెట్ల కొమ్మలను నరికించి బాటలను సుగమం చేయించేవారు. పల్లకీలను మోయటానికి బోయీలుండేవారు. వెంబడి ఆయుధపాణులైన సేవకులుండేవారు. కనుక వారికి ప్రయాణమంటే అంత కష్టంగా తోచేదికాదు. కాని సామాన్యులకు తీర్థయాత్రలు 'దినదిన గండం నూరేళ్ళాయుస్సు'గా ఉండేవి. ముఖ్యంగా వీరు కాలినడక ప్రయాణం చేసేవారు. దూరప్రయాణాల్లో సామానులు మోయటానికి ఎద్దులను ఉపగించేవారు. దారిలో దొంగలు బాటసారుల ధన మాన ప్రాణాలకు ముప్పు తెచ్చేవారు. క్రూరమృగ భీతి కూడ హెచ్చుగానే ఉండేది. మార్గ మధ్యంలో పిల్లకాలువల నుండి పొంగిపారే నదులు దాటవలసి వచ్చేది.

వీరాస్వామయ్యగారి యాత్రా కాలంనాటికి భారతదేశంలో రైలు మార్గాలు ఏర్పడలేదు. ఈయన మద్రాసు నుండి కాశీకి కుటుంబ, పరివార సహితంగా ప్రయాణం చేశాడు. ఈయన సవారీ చేసిన బంగాళా పల్లకి 2 $\frac{3}{4}$ అడుగుల వెడల్పుందట! పుప్పాడ బోయీలు కొంతదూరం, వోఢ్ర బోయీలు కొంత దూరం పల్లకిని మోశారు. కుటుంబ సమేతంగా దూరదేశం వెళ్ళేవారు వెంట తీసికొని పోవలసిన సరుకులను అనుభవం మీద ఆయన పేర్కొన్నారు. దారిలో అనారోగ్యానికి గురి అయ్యే పరిజనుల వల్ల ప్రయాణంలో అటంకా లేర్పడకుండా ఉండాలంటే దినానికి మూడు ఆమడల (40 కి.మీ.) దూరం నడవగల ఒక గుర్రపు తట్టువను, ఐదుగురు బోయీలతో ఒక తేలికైన సామాన్యపు డోలీని వెంట ఉంచుకోవాలని సూచించాడు. అందరు ఆరోగ్యంగా ఉన్న సమయంలో వీటిలో కావలసిన భోజన సామగ్రిని అధికంగా వేసికొనపోవచ్చును.

వీరాస్వామయ్య గారు సాధారణంగా బ్రాహ్మణుల యిండ్లలోనే విడిది చేయటానికి ఇష్టపడేవాడు, ప్రయత్నించేవాడు. అ గ్రామంలో బ్రాహ్మణులు లేకున్నా ఉన్నా వారి యిల్లు వసతిగా లేకపోవటమో లేదా వసతి కల్పించటానికి వారికి

ఇష్టం లేకపోతేనో, ఊరి బయట చెరువు కట్ట సమీపంలో గుడారాలు వేసికొని విడిది చేసేవాడు. చెరువులు లేనిచోట దేవాలయాలు, కచ్చేరి చావడులు, ధర్మశాలలు, తోటలు, బంగళాలు మకాము లయ్యేవి. ఎక్కడ సిటివసతి ఉంటే అక్కడే విడిది చేసేవారు.

వీరాస్వామయ్య గారు ప్రయాణాన్ని ప్రణాళికా బద్ధంగా నిర్వహించాడు. ఎక్కువ ప్రయాస పడకుండా రేపటి మజిలీని ఈ రోజే సిద్ధం చేసుకునేవాడు. ఒక గ్రామంలో దిగగానే వెంటనే ఆ వూరి కరణం ద్వారా తర్వాత రాబోయే ఊరికి సిఫారసు ఉత్తరం వ్రాయించి ఆ ఊరి మనిషిని తన బంట్రౌతుతో జత పరచి పంపించేవాడు. ఈ ముందు జాగ్రత్త చర్య వల్ల స్థల వసతికి ఇబ్బంది సాధారణంగా కలిగేది కాదు.

ఊరి బయట విడిది చేయవలసి వచ్చినప్పుడు డేరాలు వేయడానికి దాదాపు గంటసేపు పట్టేది. నాలుగు శిపాయి డేరాలు, వంట భోజనాలకు ఒక కంబళి డేరా, ఒక ఒంటి కంభం డేరా మొత్తం ఆరు డేరాలు వేయడానికి 40 మంది బోయీలు, ముగ్గురు కళాసీలు పూనుకుంటే అంత సమయం పట్టేదని వీరాస్వామయ్య గారు వ్రాశారు.

శిపాయి డేరాలను మోయడానికి నాలుగు ఎడ్లను, ఆ డేరాలలో చెమ్మ గిల్లకుండా వేసే ఆరు కీలు చాపలను మోయడానికి ఒక ఎద్దును, 200 డేరాల మేకులను మోయడానికి మరొక ఎద్దును - ఈ విధంగా ఆరు ఎడ్లను హైదరాబాద్‌లో మాట్లాడి తెచ్చుకున్నాడు. నాగపూరు చేరుకున్న తర్వాత ఈ ఎడ్లను, వాటివెంట వచ్చిన మనుష్యులను వెనక్కి పంపించి, వాటికి బదులుగా ఆరు గుర్రాలను తీసికొని వాటితో డేరాలను మోయించాడు. డేరాలలో చెమ్మగా ఉన్నప్పుడు పడుకోవటానికి వీలుగా ఒక కావడి మనిషి మోయగలిగేంత బరువులో మూడు మంచాలు చేయించాడు. ఇవి అవసరాన్ని బట్టి విడదీసి జోడించే పద్ధతిలో తయారు చేయించాడు.

'చీకారణ్య' ప్రదేశాలు దాటవలసి వచ్చినప్పుడు బందిపోట్లనుండి, క్రూర జంతువుల నుండి రక్షణకై వీరస్వామయ్యగారు జాగ్రత్తలు తీసుకున్నాడు.

కామారెడ్డికి దాదాపు 20 కి. మీ. దూరంలో ఈదలగండి అనే దట్టమైన అడవి ఉండేదనీ, అది దొంగల నిలయమని వీరాస్వామయ్యగారు వ్రాశారు. పరిపాలకులైన ఇంగ్లీషు దొరలకే దొంగలనుండి తప్పించుకోవడం సాధ్యమయ్యేది కాదట! ఈ విషయం తెలిసికొని వీరాస్వామయ్యగారు మల్లుపేట నుంచి ఆయుధపాణులను కొందరిని కూడా తీసుకొని "నాతో కూడా వచ్చిన మనుష్యులను యుద్ధ సన్నద్ధులుగా దిట్టము చేసుకొని గండి దాటి వచ్చినాను" అని చెప్పాడు.[48] ఇట్లాంటి ప్రదేశాలలో తుపాకులు అవసరం కాబట్టి కడపనుండి రెండు తుపాకులు తెచ్చుకున్నాడు. హైదరాబాద్‌లో కొత్తగా కొలువులోకి తీసుకున్న ఆరుగురిలో ఐదుగురు తుపాకీలవారేనన్నాడు ఈదలగండిలో అక్కడక్కడ తుపాకులు కాలుస్తు రావడం వల్ల దొంగల బెడద నుండి తప్పించుకుని ఉంటారు.

హనుమాన్యా నుండి కట్రావరకు ఏడు కోసుల (22½ కి. మీ.) దూరం నీటి వసతి ఏ మాత్రం లేదు. తపాల మనుషులు కూడా వేసవిలో నీళ్ళు తీసికొని వస్తూపోతూ ఉంటారు. కొందరు యాత్రికులు నీళ్ళు దొరకక మితిమీరిన దాహంతో ప్రాణాలు వదిలారట కూడా. వీటన్నింటికితోడు దారిపొడవునా అడవి, కొండలు. మృగభయం ఎక్కువ. కాబట్టి వెంబడి ఉన్న జవానులు ఆ దినమంతా దారిలో తుపాకులను కాలుస్తూ వచ్చారట! "ఆ ధ్వనికి వృక్షాలు కూడా అదురును కనుక మృగభయము మాకు ఏ మాత్రమున్ను లేకవుండినది" అని వీరాస్వామయ్యగారు వ్రాశాడు.[49]

యేదులాబాదు (ఇప్పటి ఆదిలాబాదు) వెళ్ళే దారిలో మేకలగండి అనే ప్రసిద్ధమైన ఘాటులోని అడవి 'బల్లెము దూరని పాటి దట్టమట!' వ్యాఘ్రభయము విస్తారమనీ, పులి అడుగులు చూస్తూ దారి నడిచామనీ వీరాస్వామయ్యగారు పేర్కొన్నాడు.[50] బాటసారులు ఈ ప్రదేశంలో చాల జాగ్రత్తగా నడవా

---

48. కాశీయాత్ర చరిత్ర పేజీ. 43.
మల్లుపేట హైదరాబాద్-నాగపూర్ దారిలో కామారెడ్డి దాటిన తర్వాత 5 కోసుల (16 కి.మీ.) దూరంలో ఉంది.
49. కాశీయాత్ర చరిత్ర. పేజీ. 117.
50, అదే. పుట. పేజీ. 52

లనీ, ఒకరిని విడిచి మరొకరు నడిచే ప్రదేశం కాదని తెలిపాడు. ఈ గండిని దాటేటప్పుడు కూడ అక్కడక్కడ తుపాకులు కాల్చవలసి వచ్చిందని అన్నాడు.

నిర్మల్ నుండి బాటలో సన్నని పొడవైన "చీకటి ఈగలు" మేకలగండి దాటేదాకా కరుస్తూనే ఉన్నాయట! దాదాపు 30 కి.మీ. పై మాటే ఈ బాట. ఐతే ఈ మక్షికాల బాధ తప్పుకోవడానికి వీరాస్వామయ్య గారు అనుభవపూర్వకంగా ఓ చిట్కా కూడ చెప్పాడు. "యీ మేకలగండి యడవిలో నడిచేటప్పుడు నడిచే వారు చిన్న మండలు విరిచి చేతపట్టుకొని తొలుకొనుచు రావలసినది." అగత్యమే అన్వేషణను సృష్టిస్తున్నదనేది ఈ విషయంలో నిజమైంది.

విడిది స్థలాల్లో మరింత రక్షణ అవసరమని భావించినప్పుడు వీరా స్వామయ్యగారు తన వెంట ఉన్న బంట్రౌతులతోపాటు రాత్రిళ్ళు పహరా ఇవ్వ డానికి ఆ గ్రామంలోని చౌకీదార్లను కూడా రప్పించుకునేవాడు.

యజమానుల దగ్గరే మూలధనం ఉంటుంది కాబట్టి దోపిడీ జరిగే అవకా శాలు ఎక్కువ. ఐతే వీరాస్వామయ్య గారు డబ్బును పెట్టెలలో ఉంచి, వాటికి తాళాలు వేసి విశ్రాంతి భవనాలలో (ముసాఫిరు ఖానాలు), లేదా మసీదులలో ఇద్దరు బంట్రౌతుల పహరాతో జాగ్రత్తపరుస్తూ వచ్చాడు. తన వద్ద కేవలం సామాను కావడి పెట్టెలు ఉంచుకొని జాముకు ఒకడు వంతున బంట్రౌతులను కాపలాకు ఉంచుకునేవాడు.

కడప మొదలుకొని గొప్ప వర్తకులు, ధనికులుండే స్థలాల్లో ఒక్కొక్క సారి డాగావాండ్లు అనే దొంగలు సాయంకాలం కాగానే గుంపులుగా ప్రవేశించే వారనీ, ఎదుటపడ్డ వారినందరినీ చంపి ధనికుల యిండ్లల్లో, అంగళ్ళలో చొరబడి యజమానులను పొడిచి చంపి, ధనాన్ని మూట గట్టుకొని అరగడియలో మాయమై పోయేవారనీ వీరాస్వామయ్యగారు పేర్కొన్నాడు.[51]

వీరాస్వామయ్య గారు ప్రయాణించిన బాటలు ఎక్కువగా "సరాళములు." తిన్నవి, చిక్కులు లేని చక్కని మార్గాలకు 'బాట సరాళమన్న' పదం చాలా సార్లు ఈయన ఉపయోగించాడు.

---

51. కాశీయాత్ర చరిత్ర పేజి - 49.

ఒక ఊరి నుండి మరో ఊరికి రెండు మూడు త్రోవలున్నప్పుడు ఏది వసతి ఐన మార్గమో వివరంగా తెలుసుకున్న తర్వాతనే ప్రయాణం సాగించే వాడు వీరాస్వామయ్య. అది చుట్టు మార్గమైనా సరే సుగమంగా ఉంటే ఆ బాటనే ఎన్నుకునేవాడు.

"జగనం పల్లె నుంచి యీ దూదుగాముకు రెండు మూడు బాటలు కలవు. అందులో నేను వచ్చిన బాట కొంచము చుట్టు అయినా వసతియయినది. ఆర్మూరు అనే బస్తీ గ్రామము జగనం పల్లెకు రెండు కోసులు దూరములో నున్నది. ఆ యూరి మీద నొక బాట పోవుచున్నది. అది వసతి కాదు."[52]

వీరాస్వామయ్యగారు జగనం పల్లెనుండి బాలకొండ మీదుగా ఏ ఊరూ తగలకుండా తిన్నగా ప్రయాణించి దూదుగాము చేరుకున్నాడు.[53]

వీరాస్వామయ్యగారు వైద్య చిట్కాలు తెలిసినవాడు. కాబట్టి మార్గ మధ్యంలో జబ్బుపడిన తన పరివారమునకు స్వయంగా చికిత్సలు చేసేవాడు. కలకత్తాలో 'మలడీ' అనే జ్వరంవల్ల ఈయన పరివారంలో 20 మంది బాధ పడితే చికిత్స ద్వారా త్వరలోనే ఉపశమనం కలిగించాడట.

ఈ విధంగా ఆ కాలంలో 'కాశీకి పోవటం కాటికి వెళ్ళడం' అనే సామెత నధిగమించిన ఘనత వీరాస్వామయ్యగారికే దక్కుతుంది. సుదీర్ఘమైనదూరాన్ని, అనంతమైన కాలాన్ని, దుర్గమమైనమార్గాన్ని, అననుకూలమైన పరిస్థితుల్ని వీరాస్వామయ్యగారు తన వ్యక్తిగత ప్రాబల్యంవల్ల, నిర్దుష్టమైన ప్రణాళికవల్ల - అన్నిటినీ మించి అనితరసామాన్యమైన యాత్రాభినివేశంవల్ల సాధ్యం చేసుకోవడం విశేషం.

## V) జనుల ఆకార విశేషాలు - వేషధారణ :

ఆసేతు హిమాచల పర్యంతం యాత్ర చేస్తూ పోతే భారతదేశంలోని జన జీవనంలో వైవిధ్యం అడుగడుగునా కనిపిస్తుంది. ఒకప్రాంతంవారి వేషభాషా

---

52. కాశీయాత్ర చరిత్ర పేజి - 45.
53. దూదుగాం శ్రీరాంసాగర్ (పోచంపాడ్) ప్రాజెక్టుకు సమీపంలో గోదావరి ఒడ్డున ఉంది. నిజామాబాద్ జిల్లా.

విశేషాలు మరొక ప్రాంతంతో పోలి వుండవు. అట్లాగే ఆహార విహారాలలో కూడ భేదం కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది.

వీరాస్వామయ్యగారు కాశీయాత్ర చేస్తూ దేశమంతటా తాను గమనించిన జనుల ఆకారవిశేషాలను గురించి, వేషధారణ గురించి, తిండి తిప్పలను గురించి 'కాశీయాత్ర చరిత్ర'లో పొందుపరిచాడు.

నాగపూర్‌లోని పురుషులేకాక స్త్రీలు కూడ బలిష్ఠులనీ, జబల్‌పూర్‌లో కండపుష్టిగల స్త్రీలు ఎక్కువగా కనిపించారనీ వీరస్వామయ్యగారు వ్రాశాడు. పరపురుషులు కనిపించినప్పుడు ఇక్కడి స్త్రీలు అలవాటు ప్రకారం ముఖం మీదికి ముసుగును ఈడ్చి కప్పుకుంటారే కాని, దక్షిణదేశపు స్త్రీల వలె కులుకు బెళుకులు ప్రదర్శించరని వీరాస్వామయ్యగారు అభిప్రాయపడ్డాడు.

ప్రయాగలోని పంచగౌడ స్త్రీలు రవికలు తొడగడం లేదు కాని మహమ్మదీయ సంప్రదాయం ప్రకారం ముసుగువేసుకునే బయటకు వస్తారు[55] ఇక్కడి స్త్రీలు సౌందర్యవతులు. కాని మనదేశపు స్త్రీలలాగా ఆభరణాపేక్ష వీరికి లేదని వీరాస్వామయ్యగారు పేర్కొన్నాడు.

కలకత్తాలోని పురుషులు స్ఫురద్రూపులు కారట! దీనత్వంతో కనిపిస్తారట. కృశాంగులు, ఎండకు కష్టానికి ఓర్వలేనివారని వ్రాశాడు. స్త్రీలు కూడ అంతగా సౌందర్యవతులు కారట! 12 మూరల బట్టతో దేహాచ్ఛాదనంచేసి తల మీద ముసుగు కూడ వేసుకోవడాన్ని, రవికెలు తొడిగే సంప్రదాయం లేక పోవడం వల్ల అవయవాలు పూర్ణగోప్యం కావడంలేదన్న విషయాన్ని వీరాస్వామయ్యగారు గమనించాడు. ఒక్క స్త్రీల సౌందర్యంలో తప్ప స్త్రీ పురుషులు మళయాళదేశానికి సరిపోలి ఉంటారని వీరాస్వామయ్యగారి అభిప్రాయం.[56]

---

55. కన్యాకుబ్జులు, సర్వర్యులు, గౌడలు, సారస్వతులు, మైథిలులు - పంచ గౌడులనబడితారు. 'ఆరు మూర నిడివి, నాల్గుమూర వెడల్పులో - చంగావి వేసిన మంచిరేకు విత్తముకొద్దీ తీసి ముసుకుగా ముఖము కూడా తెలియకుండా దేహమాద్యంతము కప్పుకొనుచున్నారు.' —కాశీయాత్ర చరిత్ర. పేజి. 141.

56. "పురుషుల దీనత్వమున్ను, స్త్రీల అచ్ఛాదనమున్ను మళయాళానకు సరి పోయి వుండినా స్త్రీల సౌందర్యము మాత్రము లోపము పడివున్నది." —కాశీయాత్ర చరిత్ర. పేజి. 272.

ఈ దేశస్థులు దాదాపుగా మీసాలు వుంచుకోకపోవడం కనిపించింది. ప్రతి రోజు శైత్యోపచారాలు, తైలలేపనం చేసుకొని స్నానంచేసి వొళ్ళు తుడుచుకుంటారు కాని జిడ్డు వదిలే పదార్థాలతో తోముకోరట! దీనికి కారణం శికాయ, ఇప్ప పిండి ఆ దేశంలో లభించక పోవడమేనని వీరాస్వామయ్యగారు వ్రాశాడు. స్త్రీ పురుషులంతా బహుశా లలాట శూన్యులుగానే కనిపిస్తారనీ, తులసీ మణిధారణ విస్తారంగా చేస్తారనీ, స్త్రీలు ముక్కుమీద పచ్చ పొడిపించుకోవటం సౌందర్య చిహ్నంగా భావిస్తారనీ తెలిపాడు. ఇక్కడ దొరికే చీరలు 12 మూరలకు ఎక్కువుండవట.[57] సాధారణంగా ఇక్కడి స్త్రీలు తెల్లచీరలే ధరిస్తున్నారు.

వోఢ్రదేశపు స్త్రీలు కురచగా వున్నప్పటికీ కనుముక్కు తీరు బాగా వున్నవారనీ, విశాఖపట్టణంలోని స్త్రీలు అందగత్తెలనీ వీరాస్వామయ్య గారు పేర్కొన్నాడు.

నెల్లూరిసీమ స్త్రీ పురుషులు బెంగాలీ జాతివాళ్ళకు పూర్తిగా విరుద్ధం. వీరిలో ఉభయులూ దేహ పటుత్వం కలవారే. తగుపాటి కురచ రూపమే ఐనా సౌందర్యవంతులు. ఐతే వీరి శరీరం నలుపు కలిసిన చామనఛాయగా తోస్తున్నదన్నాడు.

మచిలీ బందరులోని స్త్రీలు స్వరూపలావణ్యంతోపాటు ఆభరణాలను కూడ అందంగా అలంకరించుకుంటారు. చెవులకు నిడుపు గొలుసులు వేసి, కొన్ని పాపటకు చేర్చి చెక్కుతారట!

మద్రాసులోని స్త్రీలు గర్విష్ఠులనీ, పురుషులతో ఎక్కువ చొరవతో వ్యవహరిస్తారనీ వీరాస్వామయ్య గారు అభిప్రాయపడ్డాడు. ఐతే వీరు వస్త్రాభరణ ప్రియులే కాని సాహసగుణం కలవారు కాదని ఆయన ఉద్దేశం.

కృష్ణా గోదావరుల మధ్య ప్రాంతంలో నివసించే స్త్రీలు ఇంటి పనులను చక్కబెట్టుకోవడంలో సమర్థులనే వాస్తవాన్ని ఈ విధంగా తెలిపాడు: "గృహ

57. చెన్నపట్నంలో ఆ కాలంలో బహుశా 16 మూరల చీరలు ధరించి వుంటారు. అందుకే 12 మూరల చీరల ప్రసక్తిని అదో విశేషంగా చెప్పి ఉంటాడు.

కల్లోల కార్యములలో పురుషులకన్నా స్త్రీలకు చొరవ యెక్కువగా యీ దేశములో కలిగియున్నది."58

## vi) ఆభరణాలు :

జబల్‌పూర్ మొదలుకొని స్త్రీలు (వృద్ధులు కూడ) కంచు పాంజేబులు, కంచు కడియాలను ధరించడం చూశాడు. బెంగాలీ స్త్రీలకు ముక్కుపచ్చ సౌందర్యహేతు వనిపిస్తే, పట్నాలోని స్త్రీలు పాపటలో సిందూరాన్ని ధరించడం శృంగారంగా భావిస్తారు. ఇక్కడి సువాసినులు శంఖపుగాజులను విధిగా ధరిస్తారు. ఇంతకుమించి మరే ఆభరణాలు అంతగా ధరించడం లేదని వీరాస్వామయ్య గారు వ్రాశాడు.

ముక్కరలు ధరించిన ముదితలు మూడు ప్రాంతాల్లో కనిపించారట. గంజాం పట్టణంలోని ప్రతి స్త్రీ బులాకి ముక్కర ధరించింది. నెల్లూరిలోని ఉప్పరజాతి స్త్రీలు దోటిముక్కరలు ధరించి పురుషులతో సమానంగా పొలం పనులు చేసుకుంటారు ఇక కళింగాంధ్ర స్త్రీలేమో నోటిని ఆవరించేపాటి ముక్కరలు చాలా లావుగా చేసి ధరిస్తారు. విశాఖపట్నం స్త్రీలు కాళ్ళకు పాడగాలు వేసుకుంటున్నట్టుగా గమనించాడు.59

దాక్షిణాత్యులకు ఉత్తర దేశస్థులకు ఆహారం విషయంలో, ధైర్య స్థైర్యాల్లో వ్యత్యాసాలుండటానికి గల కారణాలను వీరాస్వామయ్య గారు తమ పరిశీలనానుభవంతో విప్పి చెప్పాడు.

కన్యాకుమారి మొదలు నెల్లూరు వరకు ఉష్ణభూమి. ఇక్కడ నివసించే జనుల జఠరాగ్ని మందంగా ఉంటుంది. కాబట్టి వీరు తేలికగా జీర్ణమయ్యే తమిదెల పుల్లటి అంబలి, సద్దిఅన్నము, గంజి, మజ్జిగ తేట, మిరియాల చారు వంటి ఆహారం తీసుకుంటారు. ఇవేవి బలమైన ఆహారం కావు

---

58. కాశీయాత్ర చరిత్ర. పేజీ. 48.

59. పాడగము = A silver anclet అని బ్రౌణ్యము. ఇప్పటికీ తెలంగాణాలో వీటిని పట్టగొలుసులంటారు. వెండితో తయారుచేయించి కాళ్ళకు అలంకరించుకుంటారు.

నెల్లూరు నుండి ఢిల్లీ వరకు క్రమంగా శీతలమైన భూమి. ఇక్కడ నివసించే జనుల జఠరాగ్ని బలంగా ఉంటుంది. కనుక వీరు రొట్టె, నెయ్యి, పాలు, దూదుపేడాలు, పప్పు, చక్కెర, గడ్డపెరుగు మొదలైన బలవర్ధక ఆహారం స్వీకరిస్తారు. దీనివల్ల ధైర్యస్థైర్యాలు ఎక్కువగా ఉండి, దేశాటనం చేయడానికి వీరు సమర్థులై వున్నారు.

దక్షిణ దేశస్థులు భోగప్రియులైతే ఉత్తరదేశీయులు భుక్తిప్రియులు. కాబట్టి వంటపాత్రలను తెల్లగా, శుభ్రంగా తోమి ఉంచుకుంటారే కాని బట్టల విషయంలో అంతగా శుభ్రతను పాటించరు ఐతే దక్షిణ దేశస్థులు ప్రయాస పడి ఐనా సరే దుస్తుల విషయంలో శ్రద్ధ వహిస్తారు.

## vii. భోగస్త్రీలు :

విజయనగరపు రాజులు సంగీత సాహిత్యప్రియులు. వీరు కొంతమంది భోగస్త్రీలకు భరతశాస్త్రం ప్రకారం 'సంగీత రత్నాకరం' చెప్పించి నాట్య ప్రవీణురాండ్రను చేయించేవారు. వీరాస్వామయ్య గారు శ్రీకాకుళంలో ఉండగా వీరి విద్యాప్రకటనం ఈయన ముందరే జరిగిందట! "వారి విద్యారూపాలంకారములు దక్షిణ దేశ దృష్ట్యా మనోహరములుగానే వుండినవి" అంటూ శ్రీకాకుళంలో భోగపువాళ్ళ యిండ్లు యాభై దాకా ఉన్నాయని తెలిపాడు.[60]

నెల్లూరులో పినాకిని నది ఒడ్డున రంగనాయకుల పేట అనే గొప్ప విష్ణుస్థలముంది. ఈ ఊరు భోగస్త్రీలకు మిరాశీ కాబట్టి ఇక్కడ వారి సంఘ ప్రాబల్యం ఎక్కువట.[61]

గంజాం మొదలుగా తెలుగు దేశంలో భోగస్త్రీలు సభాస్థలాలకు వస్తే తంబుర వీణల నుంచుకొని పాటలు పాడే సమయంలో తప్ప మిగతా వేళలలో కూర్చోరాదని నియమమట! ఈ నియమాన్ని ఎవరైనా ఉల్లంఘిస్తే కనికరం

---

60. కాశీ యాత్ర చరిత్ర పేజీ. 329.
61. పరంపరాగతంగా హక్కుభుక్తంగా ఉండే భూమిని 'మిరాశీ' అంటారు.

చూపకుండా రెండు మూడు ఝాములు వారిని నిలబెట్టేవారని వీరాస్వామయ్య గారు పేర్కొన్నాడు.[62]

## viii. ఆచార వ్యవహారాలు :

గోదావరి మొదలుకొని ఉత్తర దేశం వెళ్ళే సంప్రదాయ కుటుంబంలోని వారు ఏకవారాశనమే చేస్తారు. ఉండలేకుంటే రాత్రి అటుకుల ఫలహారం చేస్తారు. అంతేకాని రెండోసారి భోజనం చేయడం 'దక్షిణదేశంలో మూడోసారి భోజనం లాగ' నింద్యమైనది. మూడోసారి భోజనం పిల్లలకు, అశక్తులకు, నియమం లేని వాళ్ళకు.

ఈ ఆచారాలు, అలంకారాలు, ఆహారాదులూ దేశానికి తగినట్లుగానే పెద్దలు స్మృతుల ద్వారా ఏర్పరచారు. అది తెలియని అజ్ఞానులు ఒకరి ఆచారాన్ని మరొకరు అనాచారంగా భావించి దూషిస్తుంటారు.

ఒకోసారి వెళ్ళినచోట ఆచార నియమాలకు ప్రతిబంధకం యేర్పడితే క్రమానుగతంగా వాటిని సడలించుకోవలసిన అవసరం కలుగుతుంది. వీరాస్వామయ్య గారు తన అనుభవంలోంచి ఒక ఉదాహరణ చెప్పాడు : హైదరాబాద్ దాటిన తర్వాత విడిది చేయటానికి బ్రాహ్మణుల యిండ్లు దొరకేవికావు. మొదట్లో డేరాలలో భోజనం చేయవలసి వచ్చినప్పుడు తురకలు, శూద్రులు తాకే ఈ మైల బట్టలకింద ఎట్లా భుజిస్తాము? అని స్త్రీలు ముఖాలు ముడుచుకున్నారట! కాని తర్వాత బ్రాహ్మణుల యిండ్లే దొరకక డేరాల కిందనే భోజనం చేయటం తప్పని సరి కాగా కొంచెం సవరణలు చేసుకున్నారట! వర్షం కురిసే సమయంలో "డేరాలు తడిస్తే మయిల లేదని పయి గుడ్డలు తాకకుండా వంగి కూర్చుండి భోజనము చేయవచ్చుననిన్ని బోధ అయి ఆ డేరాలలో భోజనము చేయసాగిరి."[63] కడుపు మండితే ఆచారాలు కూడ ఆ మంటలో కాలిపోతాయనడానికి ఇంతకంటే వేరే నిదర్శన మేముంటుంది? అందుకే వేమన్న 'ఆకటికిని తొలగు ఆచార క్రియలెల్ల' అని చెప్పవలసి వచ్చింది. ఎంత లోకానుభవముంటే ఈ మాటలనగలరు?

62. ఝాము అంటే 3 గంటలు.

63 కాశీయాత్ర చరిత్ర పేజీ 97.

శ్రాద్ధ కర్మలకు బ్రాహ్మణార్థం చేసేవారు రెండోసారి భోజనం చేయ రాదన్నది నియమం. కాని గయావళీలు ఈ నియమాన్ని పాటించినట్లు లేదు. వీరిలో చాలామంది ఉదయాన్నే ఫలహారం చేసి, తాంబూల చర్వణం చేస్తూ విధి నిర్వహణకు వస్తారట! "బ్రాహ్మణార్థానికి వచ్చేటప్పుడు యింట్లోనే స్నానము చేసి సవారి యెక్కి వచ్చి యిక్కడ వస్త్ర పరివర్తనము చేసుకొని బ్రాహ్మణార్థానకు కూర్చుంటున్నారు."64

దేశాచారాలు భిన్న భిన్నంగా ఉంటాయి బెంగాల్‌లో శిష్ట బ్రాహ్మణులు కూడ మత్స్యభుక్కులే. చేపలను వారు 'జల పుష్పాలని' వ్యవహరిస్తారు.

జగన్నాథ క్షేత్రంలోని అంగళ్ళలో ఒక వింత నియమమున్నదట! బియ్యము మొదలైన సమస్త పదార్థాలు అంగళ్ళలో వుంటాయి ఇవి స్వామికి నివేదనార్థాలు కాబట్టి వీటిని వాసన చూసి మళ్ళీ ఆ రాసులలో వెయ్యనియ్యరని వీరాస్వామయ్యగారు ఆశ్చర్యపడుతూ వ్రాశాడు.

ఇక్కడ నైవేద్యమయ్యే వరకు ప్రసాదాలు, నియమం పాటించే పండాల ఆధీనంలో ఉండి, నైవేద్యం సమర్పించిన తర్వాత, జాతిహీనుల ఆధీనమై, వారి చేత ఇతరులకు పంచబడుతుందని తెలిపాడు.

చింతపండులో మిరియాలు కలిపి వండితే అది సురతో సమానమని శాస్త్ర వచనం. కాని ఇవి లేకపోతే ఉష్ణభూమిలో నివసించేవారు బతకలేరు. కాబట్టి దక్షిణ దేశస్థులు వీటిని స్వీకరించడానికీ, ఉత్తరదేశీయులు వాడకపోవడానికీ ఇవీ కారణాలు. కాబట్టి అయా దేశాల శీతోష్ణపరిస్థితుల కనుగుణంగానే నియమాలు ఏర్పడతాయని భావించవచ్చు.

## ix. దృష్టిదోషం :

ద్రావిడ దేశస్థులకు భూ రూపమైన జీవనాలు పుష్కలంగా ఉండటం వల్ల తిని తీరికగా కూర్చోవడం వల్ల కర్మాదుల విషయమైన ఆచారాలు అధికమయ్యాయి. శూద్రులను అగౌరవపరుస్తూ వచ్చారు శూద్రుల దృష్టి, చండాలుర

64. కాశీయాత్ర చరిత్ర పేజీ. 216

సామీప్యం పనికిరాదని వారిని అనాదరణ చేస్తూ రావటం వల్లనే వేలాదిమంది క్రైస్తవ మతస్థులుగా మారి ఆ మతంలో సాంఘిక గౌరవాన్ని వెతుక్కోవల్సి వచ్చింది.

కాశీలో నివసించే ఘూర్జర దేశస్థులు ఖేడావారని, నాగరీలని ప్రత్యేక గుంపులుగా ఏర్పడ్డారు.[65] ఒకరి యింట్లో ఒకరు భోజనం చేయరు. ఇక్కడ దృష్టిదోషం పాటించరు కాని పక్కారసూయి కచ్చారసూయి అనే పాక నియమాలు పాటిస్తూన్నట్లు వీరాస్వామయ్య గారి పరిశీలనలో తేలింది.

వీరాస్వామయ్య గారు కాశీలో ఉన్నప్పుడు బ్రాహ్మణులకు సంతర్పణ చేశాడు. వాళ్ళంతా పంచద్రావిళ్ళు. దృష్టిదోషం పాటించేవారు కారు. చలి ఎక్కువగా ఉండటం వల్ల పగలు రెండు జాముల వేళ మిద్దెమీద ఆకులు వేయించుకొని, 'కాకుల బాధ లేకుండా నాలుగు పక్కలా నలుగురు శూద్రులు తుపాకులు కాలుస్తూ యుండేటట్టు యేర్పరచుకొని యెండ సౌఖ్యముగా వున్నదని' భోజనాలు చేశారట.[66]

నాగపూరు రాజ్యంలో యాత్రికులు తాము బ్రాహ్మణులైనా దృష్టిదోషం పాటించలేదట! ధర్మశాలలో విడిదచేసి, వీధిలో అందరూ చూస్తుండగా వంట చేసుకుని, శూద్రులను ఎదుటి వరుసలో తమతోపాటు కూర్చుండబెట్టి వడ్డించి, చూస్తూ, మాట్లాడుతూ భోజనం చేయడాన్ని వీరాస్వామయ్య గారు చూసినట్లు వ్రాశాడు. ఈ నియమాలన్నీ స్వతంత్రప్రవృత్తి నివృత్తులు కలవి కాబట్టి ప్రమాదరహితంగా భావించాడు.

## x. గృహ నిర్మాణం :

తెలుగుదేశంలో యిండ్లు ఒక్కొక్క ప్రాంతంలో ఒకో విధంగా ఉంటాయి. రాయలసీమలోని వ్యవసాయకుల యిండ్లలో పశువులు, మనుషులు ఒకే ఇంట్లో సహవాసం చేయడం కనిపిస్తుంది. ఇది ఇప్పటికీ మార్పులేకుండా

65. ఘూర్జరులు పంచద్రావిళ్ళలో చేరినవారు.
66. కాశీయాత్ర చరిత్ర. పేజీ. 184.

వస్తున్న అనారోగ్యకరమైన పద్ధతి. కర్నూలు జిల్లాలోని బండాత్మకూరు చేరి వీరాస్వామయ్య గారు యిట్లు వ్రాశాడు : "పశువులకు తాము కాపురముండే యిండ్ల కంటే చక్కగాకొఠములు కట్టి బాగా కాపాడుచున్నారు "67

హైద్రాబాద్ మొదలుగా మంచి యిండ్లు కట్టుకునేవారు, "మట్టి మిద్దెనొక అర యింటికి గాని, కూటానికి గాని వేసి పైన పెంకుల పూరితో నొక కొట్టడి యేర్పరచి పైన నెక్కడానికి ఒక నిచ్చెన గాని, ఔడుగు మెట్లు గాని కట్టిపెట్టు చున్నారు."68 ఒక హాలులోగాని లేదా సగం యింటికి గాని మట్టి మిద్దెను నిర్మించుకొని దానిపైన పెంకులతో ఇండ్లు కట్టుకోవడమన్నమాట! సాధారణంగా ఇండ్లు కట్టేవారు పెంకులతోను, గడ్డితోను కడుతున్నారనీ, ఆదిలాబాదు వరకు ఉండే దక్షిణ దేశంలో నీళ్ళ కాలువలకు పెట్టే కోవుల వలె ఈ పెంకులు ఉండటాన్ని వీరాస్వామయ్య గారు గ్రహించాడు ఆదిలాబాదు నుండి ఉత్తరం దిక్కుగా వాడే పెంకులు మిద్దెలకు వేసే చదరపు పెంకుల వలె నడుమ కొంచెం వంపు కలిగి ఉంటున్నాయని వ్రాశాడు.

నాగపూరులో బ్రిటిషువాళ్ళ ఇండ్లు 'విడవలి'తో పూరివేసి కట్టి ఉన్నాయి. విడవలి అంటే వట్టి వేళ్ళ గడ్డి. ఇక్కడ విడవలి పూరి అల్లే విధానం వింతగా, బహు నాజూగ్గా కనిపించిందట.

నద్యా మొదలుగా వుండే యిండ్లు పూరిండ్లు. వీటిని 'కచ్చా ఘర్' అంటారు. అవి నిడుపులో ధనురాకారంగా అందంగా నిర్మింపబడ్డాయి. ఇక్కడి కసువు బిరుసు కనుక ఇండ్లను కూడ కప్పుతూ ఉంటారు.

కలకత్తా బస్తీ నవీనమైనందున గొప్పవారి యిండ్లన్నీ బ్రిటిష వాళ్ళ లాగా నిర్మించబడ్డాయనీ, మామూలు వాళ్ళ యిండ్లు ఏమాత్రము బాగుండక 'ఇంగ్లిషు దౌలు'తో, హిందూ తరహా కూడ కలిసి వికారంగా కనిపిస్తున్నాయనీ

---

67. కాశీయాత్ర చరిత్ర పేజి - 11.
68. కాశీయాత్ర చరిత్ర. పేజీ 10. పెంకుల పూరి అంటే పెంకులతో పై కప్పు వేసుకోవడమని అర్థం. ఈ రీతి గృహ నిర్మాణం ఇప్పటికీ అర్మూరు నుండి నిర్మలకు వెళ్ళే దారిలో గమనించవచ్చు.

వీరాస్వామయ్యగారు వ్రాశాడు 69 బ్రిటిషువారు రెండునుండి ఐదు అంతస్తుల దాకా పెద్ద మేడలు అనేకం కట్టించారు. కలకత్తా యిండ్లు రాజ నగళ్ళు అనీ, చెన్నపట్టణపు యిండ్లు బంగళాలు అనీ బ్రిటిషువారు సగర్వంగా చెప్పుకునే వారట. హైదరాబాదులో వుండే రిసైడెంట్ ఇల్లు తప్ప అంత గొప్ప ఇల్లు తానది వరకు చూడలేదని వీరాస్వామయ్యగారు చెప్పాడు.70

జగన్నాథం నుండి దక్షిణంగా వస్తుంటే తాటిచెట్లు విస్తారం కనుక ఈ ప్రాంతం వారు ఇండ్లకు తాటాకులు కప్పి పైన కసువు (గడ్డి) పరుస్తారు.

గంజాం పట్టణం నుండి చిన్న యిండ్లకు కూడా వాకిట్లో పంచ తిన్నెలు పెట్టి కట్టారనీ, అన్ని యిండ్లల్లో గోడలకు ఎర్రమన్ను పూసి, కడపలకు పసుపు కుంకుమ వుంచుతారనీ వీరాస్వామయ్య వ్రాశాడు. ఇది తెలుగు దేశంలోని పద్ధతి.

యాత్రా చరిత్రల ఆధారంగా ఏ విషయాన్నైనా సాధారణీకరించడం కష్టం. సూత్రీకరణలు చేయడం కూడ కష్టమే. యాత్రికుడు చెప్పిన వివరాలను అన్నిసార్లు పరమ ప్రమాణంగా తీసుకోవడానికి వీలుపడదు. ఎందుకంటే యాత్రికుడు చెప్పే వివరాలు ఆయనకు తటస్థపడిన అనుభవాల నుంచి, ఆయన చేసిన విచారణల (ఎంక్వయిరీ) నుంచి పుడతాయి. అయితే ప్రజ్ఞాశాలియైన యాత్రికుడు త్రుటిలో చాలవరకు గ్రహించగలడన్న దాన్ని కొట్టిపారవేయలేం. కాని వైవిధ్యభరితమైన ఈ విశాల లోకంలో ఒక వ్యక్తి అనుభవం, దాన్ని ఆధారం చేసుకొని చేసే వ్యాఖ్యలకూ తప్పకుండా కొన్ని పరిమితులుంటాయి. యాత్రికునికి అన్నిటికంటే పెద్ద పరిమితి ఆయన మార్గంలో ఎదురయ్యే అనుభవాలు, బసచేసిన స్థలాలు, వ్యవధి వుంటే ఆయన చేసిన విచారణలు-అన్నిటి కంటే ప్రధానమైంది ఆయన కెదురైన అనుభవాల వల్ల ఏర్పడిన అభిప్రాయాలు అని చెప్పవచ్చు.

---

69. 'డౌలు' అంటే Form, appearnce - బ్రౌణ్యము.

70. "హయిదరాబాదులో మాత్రము రిసైడెంటు వుండే యిల్లు కలకత్తాలోని యిండ్లకు ముక్కాలు వాసి గొప్పగా చెప్పవచ్చును."
కాశీయాత్ర చరిత్ర. పేజీ. 277.

కాబట్టి యాత్రికుల అనుభవాలు జల్లెడపట్టి చరిత్ర నిర్మాణానికి ఉపయోగించుకోవలసి ఉంటుంది. 'ఫలానా దేశపు స్త్రీలందరు బులాకీలు ధరించారు' అన్నప్పుడు అది సంపూర్ణ సత్యం కావడానికి వీలులేదు ఆ దేశంలోని అన్ని ప్రాంతాల, అన్ని వర్గాల స్త్రీలు అట్లా ధరించారని అనలేము కదా? ఆయనకున్న తక్కువ వ్యవధిలో దారిలో కనిపించిన వారిని ఆధారం చేసుకొని సాధారణీకరించడం భావ్యమౌతుందా? కాబట్టి యాత్రికుడు వ్రాసిన చరిత్ర యాత్రా చరిత్రే తప్ప ప్రాంతాల జీవన చరిత్ర కాజాలదు. ఐతే దేశ చరిత్రపైన దీని వెలుగు అవిస్మరణీయం, అమూల్యం కూడ.

## xi. పాలనా వ్యవస్థ - స్థితిగతులు :

వీరాస్వామయ్యగారి యాత్రా కాలం నాటి ఇంగ్లీషువారికి అధీనం కాకుండా నిలిచిన ఏకైక రాజ్యం రణజిత్ సింగ్ రాజ్యం. కాశ్మీరు దేశం, లాహోరు ఈయన రాజ్యంగా పరిగణింపబడింది. మిగతా వాళ్ళంతా నవాబులు, జమీందారులు. ఆ కాలంలో కందనూరి నవాబు, ఆరికాటి నవాబు, లక్నో నవాబు, గంజాం, విశాఖపట్టణం, పిఠాపురం, పెద్దాపురం, రాజా నగరంలలో ఉన్న జమీందారులు ఆయా సంస్థానాల్లో పరిపాలన చేస్తూ వున్నారు.

ఉత్తర సర్కారులలో 31 జమీందారీలుండేవి, జమీందారులు భోగలాలసులై వున్నారని తెలుస్తున్నది.[71] ఈ ప్రాంతం 1765లో ఇంగ్లీషువారికి స్వాధీనం కాగానే వారు వెంటనే తమ యేలుబడిలోకి తీసుకోలేదు. అక్రమిత రాజ్యం పరాక్రాంతం కాకూడదనే తలంపుతో అప్పటి గవర్నర్ జనరల్ లార్డు కారన్‌వాలీస్ ఉత్తర్వు ప్రకారం సర్కారు జిల్లాల కలెక్టర్లు ఆ భూమిని పూర్వపు జమీందారులకే అప్పగించారు. యుద్ధ సమయంలో మాత్రం తమకు సైన్య సహాయం చేయవలసిందని ఒప్పందం చేసుకున్నారు. ఐతే దాదాపు భారతదేశమంతా అప్పటికే కంపెనీ వారి వశం కావటం వల్ల వారి సహాయం అవసరం లేకపోయింది. కాబట్టి సైన్యాన్ని పోషించవలసిన అగత్యం లేకుండా తమ పరు

71. 'అప్పటి కాలంలో సర్కారు జిల్లాలను చికాకోలు (శ్రీకాకుళం), రాజమండ్రి, ఏల్లూరు (ఏలూరు) కొండపల్లి అని పేర్కొన్నారు.'
—ఆంధ్రుల సాంఘిక చరిత్ర. పేజీ. 387.

వును నిలుపుకోవడానికి తగిన సిబ్బందిని మాత్రమే వుంచుకొని అష్టైశ్వర్యాలు అనుభవిస్తూ కాలక్షేపం చేశారు.

హైదరాబాదు నవాబు (నిజాం నవాబు) క్రింద ఎన్నో జమీందారీ లుండేవి. ఆ జమీనుదారులు కంపెనీ వారికి నిర్ణీత రొక్కము చెల్లించి జమీం దారీని స్వతంత్రంగా నడుపుతూ వచ్చారు. సైన్య సంపద ఎక్కువ ఉన్న జమీందారులు ఒక్కోసారి కప్పం చెల్లించకుండా వుంటే, నవాబు సైన్యం దండెత్తి వారివద్ద సొమ్ము వసూలు చేసేవారట!

జమీందారులు పరస్పరం వివాదపడ్డ సందర్భాల్లో దివాన్‌జీతనం చేసే చందులాలా వంటివారు, వారిమధ్య సయోధ్య కుదర్చడానికి బదులుగా మరింత వైరాన్ని పెంచడానికే చూసేవారట. ఇట్లాంటి కలహ ప్రసక్తి వనపర్తి కొల్లా పురం జమీందారుల మధ్య చాలాకాలం నుండి కొనసాగుతున్నట్లుగా వీరా స్వామయ్య గారు హైదరాబాదులో ఉన్నప్పుడు గమనించాడు.

హైద్రాబాద్ సంస్థానంలో ఊరూరికి కోటలుండేవనీ, జమీందార్లు ఉన్నా రనీ వ్రాశాడు. ఈ జమీందారుల వల్ల వారి నాశ్రయించుకొని ఉన్న సిబ్బందికి జీవనం గడిచేదేమో కాని రైతులకు ఇతర ప్రజలకు ఏమాత్రమూ సౌఖ్యముండేది కాదు. జమీందారులకు ప్రజాక్షేమం పట్టినట్లు లేదు.

ఐతే జమీందార్లంతా ప్రజా కంటకులు కారు. గంజాం, విశాఖపట్నం, రాజమహేంద్రవరం, మచిలీ బందరు, గుంటూరు జిల్లాలలో జమీనుదార్లు పూర్వం నుండి ఉంటున్నందున వీళ్ళు ప్రజలకు దానధర్మాలు చేసేవారు. అట్లాగే పిఠాపురం, పెద్దాపురం సంస్థానాల్లో పంటలు సమృద్ధిగా పండేవి. గంజాం జిల్లా జమీందారీ నుండి సర్కారుకు 12 లక్షల రూపాయలు, విశాఖపట్టణం జిల్లా నుండి 14 లక్షల రూపాయల ఆదాయం వచ్చేది. ఈ జిల్లాలలో జమీందారీలకు 25% లాభం వస్తున్నా బందిపోట్లనుండి అనేక ఇబ్బందులను ఎదుర్కొనేవారు. ఐతే బందరు జిల్లా ప్రవేశించిన తర్వాత బందిపోట్ల బెడద కానరాలేదని వీరా స్వామయ్యగారు వ్రాశాడు.

పెద్దాపురం జమీనులో పోలీసు దారోగా, రాజానగరం కొచ్చర్లకోట వెంకట రాయుడుగారి జమీనులో పోలీసు అమీనా జమీందారులకు సహాయంగా ఉండేవారు.

## xii. ఉద్యోగులు-జీతాలు :

తిరుపతి నుండి హైదరాబాద్ వరకు ప్రతి గ్రామానికి ఒక రెడ్డి ఒక కరణం ఉన్నట్లుగా వీరాస్వామయ్యగారు గమనించాడు. మొగలుల కాలంలోని పన్నిద్దరాయగాండ్లలో వీరు ముఖ్యులు [72] గ్రామం యొక్క సమస్త వ్యవహారాలను చక్కబెట్టి గ్రామ ప్రజల సంక్షేమం కోసం పని చేయడానికి వివిధ గ్రామోద్యోగులు, గ్రామ సేవకులు ఉండేవారు. వారి సంఖ్య ఆయా గ్రామాల జన సంఖ్యను బట్టి, భూవిస్తీర్ణాన్నిబట్టి ఉండేది.

కరణాలలో కొందరు నందవరీకులు, కొందరు ప్రథమ శాఖవారు, మరి కొందరు నియోగులని వీరాస్వామయ్యగారు వ్రాశాడు. పరువుగల యాత్రికులు రెడ్డి కరణాల ద్వారానే తమకు కావలసిన వస్తువులను తెప్పించుకునేవారు. మెత్తని స్వభావం కలవారికి పనులు సాగవని చెప్తూ వీరాస్వామయ్య గారు ఇలా అన్నాడు: "ఆ యుద్యోగస్థుల నిద్దరినిన్ని నయభయములచేత స్వాధీనపరచుకొంటేగాని మా వశముగా వచ్చే పరువుగల వారికి పనులు సాగవు. పరువు గలిగిన ముసాఫర్లు అధికారపు చిన్నె కొంత వహించితేనే బాగు. నిండా సాత్త్విక గుణము పనికిరాదు "[73] రెడ్డి కరణాల ఉత్తర్వులకు లోబడి, కట్టుబడి బంట్రౌతులు యాత్రికులకు కావలసిన సామానులు తెచ్చి ఇచ్చేవారు. వీరింకా పరదేశీయులకు మార్గదర్శనం కూడ చేసేవారు. వీరు జీతానికి బదులుగా భూమిని అనుభవిస్తూ, గ్రామాలకు కావలి కాస్తూ, గ్రామాదుల సకల పనిపాటలు చూసుకునేవారు. కావలసిన సామానులు సరఫరా చేయడంవల్లనేమో వీరిని ఇంకోచోట వీరాస్వామయ్యగారు సరఫరా బంట్రౌతులని పేర్కొన్నాడు.

---

72. గ్రామ మునసబు, కరణము, తలారి, నిరుట్టు, బారిక, చేనుకావాలి, షరాబు, పురోహితుడు, పంచాంగ బ్రాహ్మణుడు, మంగలి, కమ్మరి, చాకలి, మాదిగ - మొ॥ వారు ఆయాగాంౡడలో చేరారు.

73. కాశీయాత్ర చరిత్ర. పేజీ. 22.

గంజాం జిల్లాలో కరణాలు తక్కువ జాతివారట! బ్రాహ్మణ వేషధారులు. వీరిని శిష్ట కరణాలంటారు. అట్లాగే గయా ప్రాంతంలోని గ్రామ కరణాలను 'పట్టు వారీల'నేవారు[74] వీరికి ఇచ్చే మిరాశీ నగది భూమిలో రూపాయి ఒకంటికి అర అణా. ఈ పట్వారీలు సర్కారు లెక్కలు వ్రాయాల్సిందేకాని గ్రామాదాయ వ్యయాలు వ్రాయవలసిన పనిలేదు. గ్రామ లెక్కలకు సంబంధించిన వ్రాతలను రాజమహేంద్రవరానికి దక్షిణాన తాటాకులలో వ్రాస్తారట.[75] ఇక్కడినుండి పినాకినీ నదివరకు నియోగికరణాల ప్రాబల్యం ఎక్కువ.

వీరి ఉద్యోగాల్లో పూర్వం నుండి పనిచేస్తుండడం వల్ల గొప్ప యిండ్లు నిర్మించుకొని వున్నారట. బాటసారులకు స్థలమిస్తే తమకు పరువు తక్కువని భావిస్తారు. బ్రాహ్మణులలో తామే అధికులమనే అహంకారం వీరికుంది. యాత్రికులు విడిది చేయడానికి ఇల్లడిగితే బ్రాహ్మణుల యిండ్లకు పొమ్మంటారనీ 'మీరు బ్రాహ్మణులు కారా' అని ప్రశ్న వేస్తే 'కాదు మేము కరణాలము, స్థలము లేదు' పొమ్మంటారని వీరాస్వామయ్య గారు స్వానుభవంతో నెలవిచ్చాడు.

గ్రామాలలో వీరు కాక ఇంకా ఇతర ఉద్యోగులు కూడ ఉండేవారు. బంట్రౌతులలో కట్టుబడి (సరఫరా) బంట్రౌతులే కాక, బిళ్ళ బంట్రౌతులు, ఠాణా బంట్రౌతులని కూడ ఉండవారు.[76] వీళ్ళు జీతం తీసుకునే సర్కారు బంట్రౌతులయి ఉంటారు. ఠాణా బంట్రౌతులు బరకన్‌దాసులనే పేరుతో పోలీసు అధికారి ఆజ్ఞకు లోబడి పట్టణాల్లో గస్తీ తిరుగుతారు. వీరు ఠాణాలలో ఉండడం వల్ల వీరికీపేరు వచ్చి ఉండవచ్చు.

సరఫరా బంట్రౌతులను రాజమహేంద్రవరం నుండి గుంటూరు దాకా 'నాయక వాడీ'లని, నెలూరు జిల్లా మొదలుగా 'మహతాదు' లనీ అంటారట.[77]

---

74. తెలంగాణాలో పట్వారీలంటారు.
75. కాశీయాత్ర చరిత్ర. పేజీ. 854.
76. బంటు + రౌతు = బంట్రౌతు. A police or revenue officer.
77. కాశీయాత్ర చరిత్ర. పేజీ 357.
మహతాదు or మహతాదు బంట్రౌతు = A Village Watchman who watches fields.

తిరుపతి మొదలైన ఊళ్ళ కావలికి పాలెగాండ్రకు కొన్ని గ్రామాలు దానంగా ఇచ్చారు కంపెనీ వారిచ్చిన ఈ గ్రామాలపై వచ్చే ఆదాయాన్ని అనుభవిస్తూ పాలెగాండ్రు దొంగలనుండి గ్రామాలను కాపాడవలసి ఉంటుంది. కలెక్టర్లు, మోతుబర్లు కూడ వీరి సాయం లేకుండా మహారణ్యాలను నిర్భయంగా దాటలేరట![78] కడప కలెక్టరు ఆ ప్రాంతాలలోని అడవిని కొట్టి బాటలు వెడల్పు చేయించి అక్కడక్కడ పోలీసు స్టేషన్ల (ఠాణాలు)ను ఏర్పాటు చేయించాడు. వీరాస్వామయ్య గారు ఇక్కడ ప్రయాణిస్తున్నప్పుడు పాలెగాండ్రను మంచి చేసుకొని ఇరవై మంది తుపాకీలవారిని కరకరంబాడు నుండి శెట్టిగుంట దాకా తెచ్చుకున్నానని వ్రాశాడు.[79]

యాత్రికులు డాబు దర్పం ప్రదర్శిస్తూనే దానికి తగ్గట్టుగా దాతృత్వం కూడ అలవరచుకోవాలని వీరాస్వామయ్యగారు యాత్రానుభవంతో చెప్పాడు. సరఫరా బంట్రౌతులకు ప్రతి మజిలీ వూరిలో రూపాయికి మించకుండా ఈనామిస్తూ రావడానికదే కారణం.

మీర్జాపురం మొదలుగా ప్రతి గ్రామంలో 'పెరిమిట్టు' జవానులని ఒక జత ఠాణా బంట్రౌతులు వున్నారట[80] వారు సుంకం తగిలే వస్తువులను కని పెడతారనీ, పర్మిట్ కాగితాలు లేకపోతే చాలా ఇబ్బందులకు గురిచేస్తారని వీరాస్వామయ్యగారు వ్రాశాడు. వీళ్ళ ఆగడాలు అధికారులకు కూడ తెలుసు. అందుకే పాట్నాలో కస్టమ్స్ కలెక్టర్లు పడవలను 'తొందర' పెట్టవద్దని 'తాకీదు' (Order) పంపించారట! కాశీలో బ్రూక్ దొరతో వీరాస్వామయ్య వీరి ప్రస్తావన తెచ్చినప్పుడు ఆయన 'ఈలాగే మా దేశమున యింగిలాండులోనున్న సుంకపు వాండ్లవల్ల తొందర కలిగి వున్నది. వీరికి అధికారము యివ్వక విధి లేదు. యిచ్చినందువల్ల లోకులకు హింసగా వున్నదని' బాధ పడ్డాడట.[81]

---

78. మోతుబర్లు = కలిగినవాళ్ళు, గొప్పవాళ్ళు.
79. కాశీయాత్ర చరిత్ర. పేజీ. 6.
80. కాశీయాత్ర చరిత్ర. పేజీ. 128లో వీరినే సుంకపు బంట్రౌతులని, పేజీ. 240లో సుంకపు చౌకీవార్లని వీరాస్వామయ్యగారు పేర్కొన్నాడు.
81. కాశీయాత్ర చరిత్ర. పేజీ 240-41. శిరస్తాదార్ అని బ్రౌణ్యము = The head accountant in a revenue office or court

గయలో బంట్రౌతులనుండి 'శిరస్తా' వుద్యోగస్థుల దాకా జీతాలు చాలా స్వల్పం కాబట్టి వీరు లంచాలకు ఎగబడేవారు. ఒకవేళ వీరికి జీతాలు ఎక్కువ ఇచ్చినా కంపెనీ వారికి నష్టమే కాని ఉద్యోగస్థులకు అందవలసిన సొమ్ము అందుతూనే ఉంటుందని చెబుతూ, గయా మేజిస్ట్రేటు మిస్టర్ జాక్సన్ వీరాస్వామయ్య గారితో, 'అధికారస్థులు అడగకపోయినా వాడికె ప్రకారము పిడికిళ్ళతో యెత్తి లంచాలు యిచ్చే వాడికె మీ దేశస్థులకు ఉన్నద'న్నాడట! ఈ లంచాల వ్యవహారం రానురాను మనదేశంలో విస్తరించిందే తప్ప తగ్గలేదు.

సుంకపు బంట్రౌతులు వస్తువులను సోదా చెయ్యాలనే వంకతో లంచం ఇవ్వని వారి మూట ముల్లెలు విప్పి పడవలను నిలిపి అభాసుపాలు చేసేవారు. ప్రయాగనుంచి కాశికి రావడానికి పడవ బాడుగ కాకుండా మనిషి ఒక్కంటికి రూపాయి వంతున లంచాల కింద తగులుతున్నదట![82] ఇది పేదవారికి చాల ఇబ్బంది కరంగా ఉండేది. ఈ ఘాట్లు సుంకాల పెద్ద (దారోగా)కు నెలజీతం 15 రూ॥ ఐనా నెలకు లంచాల రూపకంగా రెండు మూడు వందల రూపాయలు ముడుతున్నాయట. జూసీ సరాయి (ప్రయాగ దగ్గర)లో గంగవొడ్డున వీరాస్వామయ్య గారికి ఇట్లాంటి అనుభవం ఎదురయ్యింది. కాని, వెంట పోలీసు బంట్రౌతులు ఉన్నారు కాబట్టి అట్లాంటి శ్రమ ఎక్కడా కలుగలేదన్నాడు.

అప్పట్లో హిందువులు చేసే ఉద్యోగాలలో హైదరాబాద్, నాగపూర్, జాల్నా, మైసూరనే నాలుగు స్థలాల్లో కమీషనరేట్ (Commissionarate) ఉద్యోగాలు ఉత్తమంగా ఉన్నాయని వీరాస్వామయ్య గారొక చోట వ్రాశాడు[83] జిల్లాలోని ముఖ్యమైన అధికారులంతా తెల్లవారే దేశీయులకు తహశీల్దారు మొదలైన చిన్నచిన్న ఉద్యోగాలను ఇస్తూండేవారు. జిల్లామేజస్ట్రేటు నాజరుకు నెలకు వంద రూపాయల జీతముండేది. ఈ ఉద్యోగం భారతీయులకు ఉత్తమమైనదనే వీరాస్వామయ్య గారి నిశ్చితాభిప్రాయం.

---

82. "మనిషి 1 కి పయిసా వంతున పడవ దాటడానికి ఘాటు సుంకము చెల్లించవలసినదని" - కాశీయాత్ర చరిత్ర. పేజీ 129లో ఉంది.
83. కాశీయాత్ర చరిత్ర. పేజీ 64.

బరకన్ దాసు అనే తాజా బంట్రౌతు జీతం నాలుగు రూపాయలు కాగా ఆయన గుర్రానికి నెలకు పది రూపాయల ఖర్చు తగులుతున్నదట.

హైదరాబాద్ మొదలుకొని ఇంగ్లీషుదొరల దర్శనార్థం వెళ్ళేవాడు వీరాస్వామయ్య. ఐతే కొంచెంతో తృప్తిపడని ఆ దొరల దగ్గరి 'చోపుదార్లు' మళ్ళీ ఇనాములకు ఎగబడేవారనీ, ఈ అనవసరపు ఖర్చు అక్కడక్కడ తగులుతూనే ఉండేదని తెల్పాడు.[84]

## xiii. రక్షణ వ్యవస్థ (పోలీసు వ్యవస్థ) :

కురాయి నుండి నర్మదానది వరకు సురక్షితంగా దారి నడవడం బాట సారులకు దుర్లభంగా ఉండేది. మధ్య ఊళ్ళు గడిచి నర్మద చేరితే తల్లి కడుపులో నుంచి మళ్ళీ పుట్టినట్టుగా భావించే రోజులవి. ఐతే ఆ భయాలు ఇంగ్లీషు దొర తనం వచ్చిన తర్వాత అంతగా లేవని వీరాస్వామయ్య గారు తెల్పాడు.

జబల్‌పూర్ ప్రాంతాల అడవులలో దొంగల భయం ఎక్కువగా ఉండేది. ఇంగ్లీషు వారు వచ్చిన తర్వాత ఊరికి మూడేసి గుర్రపు సవార్లను నియమించి అనేక మందిని పట్టి శిక్షించారు. కొందరిని దారులలో అందరికీ కనబడేటట్టు 'తూకు' (ఉరి) తీసి ఆ కళేబరాలు శిథిలమయ్యేదాకా వ్రేలాడదీసి ఉంచేవారు.

మైసూరు రాజ్యంలో లాలుగంజు అనే ఊళ్ళో డాకా అనే దొంగల గుంపు వల్ల ప్రయాణికులకు భయమున్నదని కంపెనీవారు ప్రత్యేకంగా 'సరాయి' అనే పెద్ద చావడి కట్టించారట! దీనికి నాలుగు ప్రక్కల ప్రహరీ గోడ పెట్టించి కావలికి 25 మంది తాజా జవానులను వుంచారు. రాత్రి 10 గంటలకు ఈ సరాయి తలుపులు బిగించి తాళాలు వేస్తారు. తెల్లవారే దాకా తలుపులు తెరవరు కాబట్టి ఈలోగా లోపల ఉండే యాత్రికుల దేహబాధ చెప్పరానిదని వీరాస్వామయ్య గారు ఒక సందర్భంలో వ్రాశాడు.

వీరాస్వామయ్య గారు అవసరమైనపుడు పోలీసు జవాన్ల సహాయం కూడ తీసుకునేవాడు. జబల్‌పూర్ మొదలుగా ప్రతి వూళ్ళో వుండే పోలీసు జవాన్లను

---

84. చోపుదారు = a macebearer. వెండి బెత్తపు వాడు - బ్రౌణ్యము.

పిలిపించి నలుగురేసి చౌకీదారులను రాత్రి కావలికి రప్పించుకునేవాడు. తెల్లవార్లూ ఈయన పహరా వాండ్లతో పాటు వీరిని కూడ విడిది స్థలానికి నాలుగు పక్కల పహరా ఉంచి, వెళ్ళిపోయేటప్పుడు ఒక్కొక్కసారి రెండణాల వంతున ఈనాము ఇచ్చేవాడట. తిరుగు ప్రయాణంలో కలకత్తా దాటిన తర్వాత ఊళ్లలో ఒక్కొక్కరికి నాలుగణాల వంతున ఇచ్చినట్లు చెప్పుకున్నాడు.

కలకత్తా మొదలుగా ప్రతి గ్రామంలో నాయకులుంటారు. వీరు దక్షిణాన తలారుల వంటివారు. ఇంకా సర్కారు వారు యేర్పరచిన 'చౌకీదార్లు' కూడ కొందరున్నారు. వీరంతా పోలీసు నౌకరుల అధీనంలో ఉంటారు.

కాశీ పట్టణంలో ప్రతి వీధికి ఒక ఠాణా ఏర్పాటు ఉంది. రాజానగరం, రాజమహేంద్రవరంల మధ్య దారి కిరుప్రక్కల అడవి ఉంది. కాబట్టి యాత్రికుల క్షేమం కొరకు కలెక్టరు ఈ రెండు నగరాల మధ్య పోలీసు ఠాణాను ఏర్పరచి ఉంచాడట! నాగపూరుకు 6 కోసుల దూరంలో (20 కి.మీ.) ఉన్న కామిటి అనే ప్రదేశంలో ప్రతి వీథికి ఒక ఠాణా వుండేది, అప్పట్లో ఒక ముస్లిం కొత్వాలుగా ఉండేవాడు ఈయన 'షహరులో నడివీధిలో వేసిన వస్తువు వేసిన వాడు వచ్చి వెతికి యెత్తుకొనే దాకా పడియుండేట్లు' ఆజ్ఞ చేశాడట!

## xiv. పన్నులు - సుంకాలు :

ఆ కాలంలో హిందూ దేవాలయాలన్నీ కంపెనీ వారే స్వయంగా పరిపాలించేవారు. ధర్మాదాయాల సొమ్మును కలెక్టర్లే వసూలు చేసి దేవుని భోగాలు, ఉత్సవాలు, అర్చనలు స్వయంగా జరిపించేవారు. మిగిలిన సొమ్ము కంపెనీ ఖజానాకు జమ అయ్యేది. ఈ విధంగా కంపెనీ వారికి తిరుమల దేవాలయం వల్ల ఏటా లక్షరూపాయల ఆదాయం వచ్చేదట. కొండమీద యే ధర్మకార్యం చేయవలసివచ్చినా సర్కారుకు ఒక రూపాయ ఇవ్వాల్సి ఉండేది.

అహోబిల క్షేత్రంలో జరిగే బ్రహ్మోత్సవాలకు 400 వరహాల 'హాశ్శీలు' (పన్ను) వసూలు కాగా, ఆ ప్రాంతపు నవాబు (కందనూరు నవాబు) మొత్తం స్వీకరించి తర్వాత గుడి సంగతే విచారించడట.[85] దేవస్థలాలు ఈయన కాలంలో శిథిలమయ్యాయి.

---

౮౫. కాశీయాత్ర చరిత్ర. పేజి 20.

శ్రీశైలం గుడి నుండి కందనూరి నవాబుకు (కర్నూలు) ఏడాదికి 18 వేల రూపాయల ఆదాయం వచ్చినా గుడి గురించి ఏ మాత్రం పట్టించుకోడు. ఎవరైనా మరమ్మతులు చేసినట్టు తెలిస్తే వారినుండి ఖర్చు చేసిన సొమ్ము ఎంతో అంత పన్ను రూపంలో వసూలు చేసేవాడట! ఈ నిర్బంధం చేతనే హైదరాబాద్ దివాన్ పేష్కారు చందులాలా కొంత మరమ్మతు చేసి ఉండి కూడా విసిగి విడిచి పెట్టారని వీరాస్వామయ్య తెల్పాడు.

ఇంకా ఎవరైనా స్వామివారికి గాని, దేవికి గాని వస్త్రాభరణాలు సమర్పిస్తే వాటి ఖరీదంత సొమ్ము పన్ను రూపంగా తీసుకోవడమే గాకుండా కొన్ని రోజులకు ఆ వస్తువులను కూడ అపహరించేవాడట!

హైదరాబాద్‌లోనైతే నగరంలోకి రావడానికి కట్టెల బండ్లకు, విస్తరాకులకు కూడ నాలుగైదు 'తీరువలు' ఉన్నాయట![86] పన్ను విధించేవాడు ఎంతంటే అంత ఇవ్వవలసినదే. చంపినా అడిగే దిక్కులేని దిక్కుమాలిన రాజ్యమని వాపోయాడు వీరాస్వామయ్య గారు.

త్రివేణిలో వేణీదానం చేయడానికి మనిషికి 7 రూ॥ వంతున సుంకం చెల్లించవలసి ఉండగా, కంపెనీవారు వచ్చిన తర్వాత దాన్ని తగ్గించి రూపాయిగా నిర్ణయించారు.

నదులను దాటించే సమయంలో మనిషికి ఇంత అని పన్ను వసూలు చేసేవారు. కృష్ణదాటి శ్రీశైలం వెళ్ళేందుకు వీరాస్వామయ్యగారు శూద్రునికి 3½ రూ. గుర్రానికి 3½ రూ. బ్రాహ్మణునికి రెండణాలు ఇచ్చినట్టుగా వ్రాశాడు.

నర్మదానదిలో ఒకసారి అకస్మాత్తుగా ప్రవాహం వచ్చి అదివరకున్న పడవలన్నీ కొట్టుకొనిపోగా, కంపెనీవారు రెండు చేయించి ఘాటు సుంకము యేడాదికి 30 రూ॥ చొప్పున గుత్త కిచ్చారట. ఆ గుత్తాధిపతి మనిషికి ఒక పైసా,

86. తీరువలు అంటే duties-పన్నులు. సురవరం ప్రతాపరెడ్డిగారు కూడ తమ సాంఘిక చరిత్రలో అడవి సుంకాల గురించి వ్రాశాడు. "ఆ కాలంలో (16వ శతాబ్ది) కట్టెనెత్తి మోపు కింతయని తీసుకొనెడివారు. మొదలే సుంకము చెల్లించి అడవిలోనికి పోవలసియుండెను." పేజీ 313.

గుర్రానికి ఒక అణా వంతున సుంకం వసూలు చేశాడు. ప్రయాగలో కూడ మనిషి ఒక్కింటికి ఒక పైసా వంతుననే సుంకం వసూలు చేశారట.[87]

గంగానది ఒడ్డున ఉన్న కృష్ణనగర్ వద్ద కంపెనీవారు నావల సంఖ్యను బట్టి, ఆకారాన్నిబట్టి 'నిరుకులు' ఏర్పరచి 'టల్లా' అనే సుంకం వసూలు చేస్తారట.[88] సుంకం వసూలుకు ఒక కలెక్టరు కూడ నియమింపబడ్డాడు. ఈ ప్రకారం వసూలు అయ్యే సుంకాల ద్వారా నదిలో మిట్టలు పెట్టకుండా మట్టిని యెత్తే తవ్వోడలను వుంచారట!

జగన్నాథ క్షేత్రంలో అటూనాళా ఘాట్‌వద్ద కూడ ఇట్లాంటి కార్యాలయముంది. యాత్రికుల సంఖ్యను బట్టి పన్ను చెల్లించి చీటీ వేయించుకొని స్థల ప్రవేశం చేయాలి. ఇక్కడ నాలుగు రోజులుండి ఐదోదినం భోజనం చేసి వెళ్ళడానికి మనిషి ఒక్కింటికి రెండు రూపాయల ఆరు అణాలివ్వాలి (2-6-0). గుడి మూలంగా ఏడాదికి లక్షా ఇరవై వేల ఆదాయం రాగా, కంపెనీవారు సుమారు యాభై వేలదాకా గుడి ఖర్చులకై ఇచ్చేవారట. ఐతే ఈ డబ్బుతో ప్రసాద నివేదన చేసి ప్రతి దినపు ప్రసాదాన్ని నిర్ణీత ప్రకారం పంచుకోవలసినదే కాని డబ్బు రూపకంగా పూజారులకు ఒక్కపైసా కూడ దొరకదు.

కందనూరి నవాబుతో పోలిస్తే కంపెనీవారు ఎన్నోరెట్లు నయమని తెలుస్తున్నది. కంపెనీవారు సుంకం వసూలుచేసి కొంత గుడి కొరకు వినియోగించగా, నవాబు గుడినీ, గుళ్ళో లింగాన్నీ మింగగలిగిన ఘనుడు.

వుప్పాడ బోయజాతి వాళ్ళ ఇంట్లో మగవాడు పుడితే వాడు చచ్చేవరకు మనిషి ఒక్కింటికి రూపాయన్నర సర్కారుకు పన్ను చెల్లించాలట. ఈ చిత్రమైన పన్నుకు కారణ మేమిటో అనూహ్యము. వీరికి పైరుభూమి లేదు నివసించే గుడిసెలు నాలుగు రూపాయలకు ఎక్కువ చేయవు

87. నదులపై వంతెనలు నిర్మించి వచ్చిపోయే వాహనాలపై 'ప్రవేశపు పన్ను' విధించడం ద్వారా ఖర్చు చేసిన డబ్బును వసూలు చేసుకునే పద్ధతి ఇప్పటికీ ఉంది.

88. నిరుకులు అంటే నిర్ణయాలు.

జగన్నాథ ఆలయంలోకి చండాలురకు, చాకలి జాతివారికి ప్రవేశం లేదు. ఓఢ్ర దేశస్తులైతే పన్ను చెల్లించనవసరం లేకుండానే క్షేత్ర ప్రవేశం చేయ వచ్చు ననేది పూర్వం నుండి వస్తున్న ఆచారం. అట్లాగే మైసూరుప్రాంతం వారికి శ్రీశైలంలో ఉచిత ప్రవేశముంటుంది. మైసూరు భ్రమరాంబాకు పుట్టినిల్లు. ఇంకా జంగాలు, ఆరాధ్యులు, బ్రాహ్మణులు ఉత్సవకాలంలో పన్ను చెల్లించ నక్కరలేదు.

## XV. భూమి కొలతలు :

భూమిని కొలిచే సాధనాలు ఒక్కో ప్రాంతంలో ఒక రకంగా ఉన్నాయి. కృష్ణానదికి ఉత్తరాన భూమికొలతను కత్తెలు (కత్తులు) అంటారట. ఒక మనిషి రోజంతా కోతకోసే భూమిని 'కత్తె' అంటారనీ, ప్రభుత్వ లెక్కల్లో 'కత్తి' అంటే 40 ఎకరాల, 14 గుంటలనీ బ్రౌణ్యంలో ఉంది [89]

నెల్లూరు జిల్లాలో భూమికొలతను 'కుచ్చళ్ళు' అంటారు. 'కుచ్చల' ఒక్కొంటికి 8 గొర్రుల సంఖ్య.[90] కుచ్చెల కూడ కత్తితో సమానమేనని బ్రౌణ్య

---

89. కత్తి = A measure of land; which differs in various districts. It is considered to be as much as a man can reep in one day. In the Government account a 'cutty' is rated at 40 acres and 14 గుంటలు. q.v. this phrase, "a Sword of land" perhaps implied that this quaninty of land was rated to a family who furnished the baron one fighting man. -బ్రౌణ్య తెలుగు ఇంగ్లీషు నిఘంటు.

90. 'కుచ్చెల' అని బ్రౌణ్యము.
కుచ్చెల = A land measure which is the Guntur district is twenty nine acres or 33 $\frac{3}{16}$ thirty three guntas and three sixteenthis One కుచ్చెల is nearly is same as a కత్తి of land and is equal to eight గొర్రులు or 400 కుంటలు. (బ్రౌణ్య తెలుగు ఇంగ్లీషు నిఘంటు.)

నిఘంటు పేర్కొన్నది గయలో భూమి వాటము 'మామిలియతు' వాటమట.[91] బాసు అని ఒక భూమిని కొలిచే కర్ర ఇక్కడ వాడుకలో ఉంది. ఇది 5½ మూరల పొడవుగల వెదురుగడ. ఇట్లాంటి ఇరవైగడల చదరమైతే ఒక బీగా అంటారు. సాగు చేసుకున్నందుకు బీగా భూమికి యేడాదికి 14 రూ॥ సర్కారుకు పన్నురూపంలో చెల్లించుకోవాలి వాటిలో, చెరుకు మొదలైన పైరు పెడితే సర్కారుకు ఇవ్వగా 'రహితుకు' 30 రూపాయలదాకా లాభిస్తున్నదట.[92] ఈ విధంగా సుంకం నిర్ణయం చేసి రైతుకు అధీనంచేసిన భూమిని 'నగది' అంటారు. ఇక్కడి ఫలభాగమిట్లా ఉందని వీరాస్వామయ్యగారు వ్రాశాడు.

"యిక్కడ ఫలభాగమేమంటే 16 రింట్లో 9 పాళ్ళు సర్కారుకున్ను 7 పాళ్ళు రహితుకున్ను"[93].

ఈ లెక్క ప్రకారం 5 బీగాల భూమిని సులభంగా, 7 బీగాల భూమిని కొంచెం కష్టంతో సాగుబడి చేస్తున్నారట.

విజయనగరంలో భూమి కొలతను గరిశెడు భూమి అంటున్నారని చెపుతూ వీరాస్వామయ్యగారు అర్థం కూడా చెప్పాడు: "దాని తాత్పర్యం రెండు

---

91. మామిలీయ్యతు = Management of Public business. Affairs of stage నిర్వాహము - బ్రౌణ్యము.
92. కాశీయాత్ర చరిత్ర. పేజి. 229.
వీరాస్వామయ్య గారు రైతును 'రహితు' అంటాడు.
Sir Thomas Munro Spells this word '*Rayat*' అని బ్రౌణ్య నిఘంటువు పేర్కొన్నది.
93. సురవరం ప్రతాపరెడ్డి గారు ఉదాహరించిన లెక్కలు గూడ దీనికి సరిపోయాయి. (ఇవి 1818 నాటి లెక్కలు. రమేష్‌దత్తు 'India Under early British Rule' Chapter IX P. 154).
"రైతులకు 20 పాళ్ళలో 9 పాళ్ళు ఉనగా నూటికి 45 పాళ్ళు ఇచ్చిరి."
—ఆంధ్రుల సాంఘిక చరిత్ర పేజి. 388

గరిశెలు పండగలదనిన్ని, అందులో సగం పాలు సర్కారుకు పోగా భూస్వామికి గరిశెడు మిగలవలసినదిగా తెలియవలసినది."94

18వ శతాబ్దంలో ప్రసిద్ధ కవి అడిదము సూరకవి విజయనగర ప్రభువుల సంస్థానంలో ఉండేవాడు. 'గరిశె' అన్నపదం "గరిసెలు వ్రాతగాని మరి గంటెడెరుంగము" అన్న చాటువు వల్ల వాడుకలో ఉండేదని తెలుస్తున్నది.

ఇప్పటికీ కొన్ని ప్రాంతాలలో ధాన్యం నిలవ ఉంచే వాటిని గరిసెలంటారు.

## xvi. తూనికలు :

గయలో కట్టెలు మొదలైన సమస్త పదార్థాలు తూకం మీదనే అమ్మే వారని వీరాస్వామయ్యగారు వ్రాశాడు. 4 రూ. ఎత్తు తూకాన్ని గండా అంటారనీ, 20 గండాలయితే ఒక శేరనీ అనగా 80 రూ. ఎత్తనీ గయలోని తూనికల గురించి చెప్పాడు 95

ఐతే ఈ గండాల ఎత్తు వివిధ ప్రాంతాలలో భేదిస్తూ ఉన్నదట. కొన్ని తావులలో శేరు 1కి 18 గండాలు, కొన్ని తావులలో 25 గండాలు, మరికొన్ని చోట్ల 11 గండాలు గల శేరే ఉన్నదని గమనించాడు. ఈ గండాలు శేరు ఒక్కంటికి ఎన్ని అని తెలుసుకుని ఆ ప్రాంతాన్ని బట్టి యాత్రికులు వస్తువులను బేరమాడవలసినదని హెచ్చరించాడు. ఇంకా మణుగు ఒక్కంటికి 40 శేర్లు, శేరు

---

94. గరిశ = The measure called a garce four hundred marcals : more rightly spelt గరిశె originally, a hamper or large basket for storing grain. The Madras garce is 820 pounds. Metaphorically, the 'Vessel' of the body - బ్రౌణ్యం.

95. ఇప్పటికీ బంగారం తూనికెలో అక్కడక్కడ వెండి రూపాయి బిళ్ళను 10 గ్రా. తూకంగా వాడుతున్నారు. ఒక శేరంటే 80 తులాలు. 800 గ్రా. లెక్క సరిపోతున్నది.

ఒక్కింటికి 'చితాకులు' 16 అనికూడ తెల్పాడు వీరాస్వామయ్యగారు.[96] కట్టెలు, బియ్యము మొ. గొప్ప తూనికెలు మణుగు గుండ్లతో తూచుచున్నారట!

ప్రయాగలోనైతే శేరు ఒక్కింటికి 20 రూ. ఎత్తే. ఇక్కడి శేర్లను పిచ్చ శేర్లు అంటారనీ, శేరు వెల రూపాయలలోనే కాని అణాపైసలలో లెక్కించడం లేదనీ వీరాస్వామయ్య గారు వ్రాశాడు.

## xvii. కూరగాయలు, పండ్లు :

హైద్రాబాద్‌లోని అరటిపండ్లు, కూరగాయలు మద్రాసులోకంటె దాదాపు మూడురెట్లు ఎక్కువ వెల ఇవ్వాల్సి వచ్చినప్పటికీ ఇక్కడివి మహా రుచిగా ఉంటున్నాయన్నాడు.

నాగపూరులో ఎంత ప్రయత్నం చేసినా చింతపండు దొరకలేదట కాని అతి ప్రయత్నం మీద బియ్యం సంపాదించామన్నాడు. ఈ దేశంలో చింతపండు బదులు 'ఆముచూరు'అనే మామిడి వడుగు వాడుతున్నారని, 'రామటెంకి' మొదలుగా దొరికే రాతివుప్పును మెత్తగా విసిరి శాకాలలో కలుపుకోవలసిందని సలహా ఇచ్చాడు.[97] నాగపూరు రాజ్యంలో దక్షిణ దేశంలో వలె నల్ల నువ్వులు, ఎర్ర కందులు దొరకవనీ, వీటికి బదులు తెల్లవి సమృద్ధి అని వ్రాశాడు. అన్ని ధాన్యాలు అమకిడమేగాక, అన్నిటినీ పిండిగా విసిరి అంగట్లో పెట్టి ప్రతి ఊరిలో అమ్ముతాడు.

రామ్‌టేక్ తర్వాత వచ్చే కురాయి అనే గ్రామంలోని చెరువులలో శింగాడికాయలు పండుతాయట ఆ కాయలలో బాదంపప్పు లాంటి విత్తులుంటాయి. వాటిని పిండిచేసి ఉపవాస దినాలలో పూరీలుగా కాల్చి ఫలహారం చేస్తారు. ఇది

---

96. కాశీయాత్రా చరిత్ర, పేజీ. 227.
చిటాకు for చటాకు = A liquid measure $\frac{1}{16}$ of a seer
'చితాకు' అంటే మనమిప్పుడు వాడే తూనికరాయి చటాకన్నమాట.

97. రామటెంకి అంటే ఇప్పటి రామ్‌టేక్. ఇది నాగపూరుకు పూర్వోత్తరంగా దాదాపు 40 కి.మీ. దూరంలో ఉంది. నాగపూర్ ఇటార్సీల మధ్య స్టేషన్.

రుచిగా ఉండడమే గాక ఆరోగ్యకరమైనదని స్థానికులు చెప్పగా వీరస్వామయ్య గారు విన్నాడట.

ఉత్తర దేశంలో అడుగుపెట్టిన తర్వాత రెండు నెలలకు సరిపోయే చింత పండు, మిరపకాయలు, మిరియాలు, ఆవాలు నాగపూరులోనే జాగ్రత్తపరచు కోవాలని వీరాస్వామయ్యగారు ఇతర యాత్రికులకు సూచించాడు.

కాశీలో దొరికే ముల్లంగి గడ్డలంత పొడవైన గడ్డలను తానిదివరకెక్కడా చూడలేదని వీరాస్వామయ్యగారు ఆశ్చర్యం వ్యక్తం చేశాడు.

1810 లో ఇంగ్లీషువారు దుంపల పైరును మొదటిసారిగా పాట్నాలో ప్రవేశపెట్టారనీ, వాటికి 'ఆలు' అని పేరు పెట్టారనీ వీరసామయ్య గారు వ్రాశాడు.[98]

గయలో మిఠాయి అంగళ్ళలో నువ్వులతో అనేక భక్ష్యపదార్థాలు చేసి అమ్ముతారు. శనగ ఆకులను కూరగా వండితే బాగుంటుందనీ, ఎర్ర మందారపు మొగ్గలు పెసరపప్పుతో కలిపి వండితే రుచిగా ఉంటుందనీ వీరాస్వామయ్యగారు స్వానుభవంతో చెప్పాడు. దక్షిణదేశంలో మందార మొగ్గలను కూరగా వండు కోరు కాని పూలుగా వికసించిన తర్వాత దేవతార్చనకు వినియోగిస్తారు.

పట్నా తర్వాత వచ్చే 'కహలుగాం' అనే పెద్ద గ్రామంలో ప్రతి పెరటి లోను కరివేపాకు చెట్లు పైరు వేసి ఉన్నాయట.

గౌడ, వుత్కళ దేశాలలో చింతపండు, మిరపకాయలు దక్షిణదేశంలో వలె తినకపోయినా మనవాళ్ళకొరకు అంగళ్ళలో పెట్టి అమ్ముతారు.[99] ఇక్కడ మామిడి చెట్లు ఎక్కువ అన్నాడు. అందుకేనేమో వీళ్ళు చింతపండుకు బదులు మామిడి వరుగు వాడతారని వీరస్వామయ్యగారు వ్రాశారు.

---

98. —

99. గౌడ దేశమంటే ఇప్పటి బెంగాల్ రాష్ట్రం, ఉత్కళ దేశమంటే ఒరిస్సా రాష్ట్రం.

## xviii. పండాలు :

వీరిని పండ్యాలని కూడ అంటారు. యాత్రా చరిత్రలు చదివినా, యాత్ర చేసిన వారివల్ల వినిఉన్నా పండాలను ఆశ్రయించకుండా మాత్రం యాత్ర చేయలేము. ఈ పండాల ఒత్తిడి ముఖ్యంగా గయ, కాశీ, జగన్నాథం, మధుర, ద్వారకలలో ఉంటుంది. కాశీ ఫలితం దక్కాలంటే ఏదో విధంగా పండాలను తృప్తిపరిచవలసినదే. ఇచ్చినది గ్రహించక, ఎక్కువ కోరుట వీరికి సహజమైన విషయం. తాము తృప్తిపడకపోగా యాత్రికులను కూడ అసంతృప్తిపరుస్తారు. వీళ్ళలో ఎక్కడో కాని యోగ్యులు కనిపించరు.

పండాల గురించి వీరాస్వామయ్య గారికి ఎక్కడా చేదు అనుభవం ఎదురైనట్లు లేదు. మీర్జాపూరు తర్వాత వచ్చే వింధ్యవాసిని ఊళ్ళో దేవీపూజ చేసే వారు పండాలనే బ్రాహ్మణులు. వీరు పంచగౌడులతో చేరిన కన్యాకుబ్జులట! వీరినే కనోజాలంటారని వీరాస్వామయ్యగారు తెలిపాడు. ఈ పండాలలో ఒక నియమముంది. యాత్రికులను ఎవరు ముందుగా చూస్తే వారే ఆ యాత్రికులిచ్చే దక్షిణలనందుకోవడానికి అర్హులట! వీరాస్వామయ్య గారు మీర్జాపురం సమీపించే సరికి 'లెక్కపెట్టను శక్తి లేనంత మంది' పండాలు ఆయనను అనుసరించడానికి వచ్చారన్నాడు.

జగన్నాథ క్షేత్రంలో పండాల యిండ్లు 700 దాకా వున్నాయనీ, వీరు 36 తెగలుగా విభజింపబడ్డారని, వీరి జీవనోపాధి గుళ్ళో వంట, పూజ మొదలైన పనులవల్లననీ వీరాస్వామయ్యగారు తెలిపాడు. అర్చకులకు భూరూపకమైన ఆధారమేమీ లేకపోవడంవల్ల, గవర్నమెంటు వారి నుండి ప్రసాదం తప్ప పైసా జీతం కూడ అందకపోవడం వల్ల వీరు యాత్రికులను యాచించక తప్పని పరిస్థితులేర్పడ్డాయి. వీరాస్వామయ్యగారు లక్షాధికారులుగా చలామణి అవుతున్న కొంత మంది పండాలను గురించి పేర్కొన్నాడు. వారు బహుశా యాత్రికులను పీడించి డబ్బులు గుంజే పండాలయి ఉంటారు.

జగన్నాథ క్షేత్రంలోని పండా పురోహితులు తృప్తిపడేవాళ్ళు కారని వీరాస్వామయ్యగారి స్వానుభవం. తన హోదాకు తగినట్లుగా వెంట ఉన్న పురోహితునికి మూడువందల రూపాయలు ముట్టచెప్పినప్పటికి ఆయన ప్రసన్న వదనుడు కాలేదని వీరాస్వామయ్యగారు వ్రాశాడు.

## xix. బోయీలు :

కాకినాడ సమీపంలో వుప్పాడ అనే వూరుంది. ఈ ఊరి చుట్టు 18 కి.మీ. దూరాన సముద్ర తీరంలో బోయజాతివారి నివాసం. అప్పట్లో వీరి యిండ్లు 'యేనూరు' (500) దాకా వుండవచ్చునని వీరాస్వామయ్యగారు వ్రాశాడు. సముద్రంలో చేపలు పట్టి యెండబెట్టి సర్కారుకు కొంత పన్ను చెల్లించి అమ్ముకోవడం లేదా మద్రాసులో కొలువు చేసి పొట్ట పోసుకోవడం వీరి వృత్తి తమ సంపాదన తాగడానికే చాలక కొందరు సంవత్సరాల తరబడి ఇంటిముఖం చూడకుండా పరదేశాల్లోనే కొలువు చేస్తూ గడిపేవాళ్ళు. వీరస్వామయ్య గారు కాశీ యాత్రలో పల్లకీ మోయడానికి ఎనిమిది మంది వుప్పాడ బోయీలను వెంట తెచ్చుకున్నాడు.

వోఢ్ర బోయీలు మోసే కూలి పల్లకీలు కలకత్తా పట్టణంలో వెయ్యిదాకా ఉన్నాయట. ఈ పల్లకీలకు పోలీసువారు నెంబరు వేస్తారు. 'నడుముకు వొక బట్ట చుట్టుకుని చేత మొగిలాకు గొడుగు పట్టుకుని చింపిరి తలతో' వోఢ్ర బోయీలు ఒక్కో పల్లకీని ఇద్దరు మోస్తారట![100]

వీరాస్వామయ్య గారు యాత్రలో తెచ్చుకున్న మూడు సవారీలలో రెండింటిని మోయడానికి ఇరవై మంది వోఢ్ర బోయీలను పెట్టుకున్నాడు.

ఒరిస్సాలోని బోయీలను బేరాలంటారు. వీరంతా గోపాలక జాతికి చెందినవారు. తులసీమణి ధారణ చేస్తారు. మాంసాహారులు కారు. స్నాన నియమాలు కలవారై బ్రాహ్మణులకు, ఇక్కడి దేవతలకు పాకం కోసం నీళ్ళు తెచ్చివ్వడానికి అర్హులు. కలకత్తాలోని ప్రజలంతా వీరిచేతి గంగను యథేచ్ఛగా స్వీకరిస్తారు. బోయ జాతిలోనే తాము అధికులమన్న భావన వీరికుందనడానికి వీరస్వామయ్య గారు గమనించిన కింది విషయమే ఆధారం: "మన దేశపు వుప్పాడ బోయీలు, వారు (వోఢ్ర బోయీలు) మోశే దండె మీద చేయివేస్తే మా జాతి మణిగి పోయెనని బహూరచ్చ చేస్తారు "[101]

---

100. కాశీయాత్ర చరిత్ర. పేజీ. 277.
101. కాశీయాత్ర చరిత్ర. పేజీ. 292.

వుప్పాడ బోయీలకు సమానమైన మోతగాండ్లు, చూపరులు, బలాఢ్యులు, ఆయుధ ధారులు, అలంకార ప్రియులు మరెక్కడా తనకు కనిపించలేదని వీరాస్వామయ్య గారు పేర్కొన్నాడు. ఐతే కొన్ని ప్రాంతాలలో వీరు దేహదార్ఢ్యము తప్పి తొందరగా రోగిష్టులవుతారు. కాబట్టి వీరిని జాగ్రత్తగా కాపాడుతూ, ఏ దేశంలో రోగిష్టులవుతారో ఆ దేశంలోని బోయీలతో పల్లకీలు మోయిస్తూ వుప్పాడ బోయీలకు విశ్రాంతి కల్పిస్తూ వస్తే, వీరితో భూగోళ సంచారమే చేయవచ్చునని గ్రంథకర్త అభిప్రాయ పడ్డాడు. వీరిలో ఇంకొక లోపముంది. ఇది శారీరకం కాదు. మానసిక ప్రలోభం. మద్య, మత్స్య, మాంస ప్రియత్వంచే తాగినప్పుడు పరస్పరం పోట్లాడుకొని యజమానికి మనస్తాపం కలిగిస్తారు. ఈ ఒక్క లోపం తప్పితే "పాలకీలు మోశే వృత్తికి యీ వుప్పాడ దేశస్థులనే ఈశ్వరుడు తగిన వారినిగా నియమించినట్లు తోచబడుచున్నది" అని వీరస్వామయ్య గారు వారి పనితనానికి మెచ్చుకున్నాడు.[102]

'బొందిలే ఖండం'లో బోయీలను డీమర్లంటారు.[103] ఒక చిన్న నులక మంచానికి బొంగుకట్టి డీమర్లిద్దరు దాన్ని మోస్తారు. వీటిని డోలీలంటారు. దారిలో అడవిగాలి సంబంధమైన చలి జ్వరాలతో బాధపడుతున్న బట్రౌతులను, కావలి జవాన్లను, బోయీలను ఈ డోలీల సాయంతో యాత్ర చేయించాడు వీరస్వామయ్యగారు.

తిరుగు ప్రయాణంలో రాజమహేంద్రవరం మొదలుకొని చాకలివాళ్ళు పల్లకీలు మోయడంలో ప్రసిద్ధులుగా ఉన్నారు. వీరు ఈ స్థలంలో రెండు దేవాలయాలు కట్టి ఆరాధనలు చేస్తున్నారు. ఈ జాతివారిని కొన్నిచోట్ల గుళ్ళలోకి రానివ్వరని వీరస్వామయ్య గారొక సందర్భంలో చెప్పింది గుర్తు చేసుకుంటే, వారు దేవాలయ నిర్మాణం ఎందుకు చేపట్టారో అర్థమవుతుంది

భోజశబ్దభవమే బోయ అని కొందరి అభిప్రాయం. ఇంగ్లీషువారు మద్రాసులో దిగిన కాలంలో వారివద్ద ఈ బోయీలే నౌకరులుగా కుదిరారు.

---

102. కాశీయాత్ర చరిత్ర. పేజీ 361.
103. దీన్నే బుందేల్ ఖండ్ అనేవారు. మైహరు రాజ్యమని వీరస్వామయ్య గారన్నాడు.

ఇంగ్లీషువారు ఈ బోయ పదాన్ని బాయ్ (Boy) అని పిలిచినందున, వారు ముసలి నౌకర్లను కూడ 'బాయ్'లు గానే వ్యవహరించే వారని సురవరం ప్రతాపరెడ్డిగారు అభిప్రాయ పడ్డారు.104

## XX. సవారీలు - బాడిగెలు :

మధ్యప్రదేశ్‌లోని మీర్జాపూర్ మొదలు ప్రతి మజిలీ వూరిలో గుర్రాలు బాడిగెకు దొరుకుతాయి. ఒక్కొక్క గుర్రానికి ఒక కోసుకు (3.2 కి.మీ.) ఒక అణా ఇవ్వాల్సి ఉంటుంది. నాగపూరు దాటిన తర్వాత గుర్రపు బండ్లను 'యెక్కా' లంటారు. ఈ బండికి ఒంటి గుర్రం ఉంటుంది. ఈ యెక్కా అనే సవారీ రోజుకు 33 కి మీ దూరం దాకా పోతుంది 105

కలకత్తాలో కరాచీలు అనే బండ్లు ఇంగ్లీషు చారియాట్ (Chariot) బండ్ల వలె చేసి, రెండు తట్టువాణి గుర్రాలను కట్టి నడుపుతారట.

కలకత్తా నుండి జగన్నాథం వరకు 400 కి మీ. ఈ మధ్య దూరానికి బోయీలకు ఒక్కొక్కరికి ఏడు రూపాయల చొప్పున, బండికి 28 రూ॥ చొప్పున వీరాస్వామయ్యగారు తెచ్చాడట! తర్వాత జగన్నాథం నుండి బరంపురం దాకా వేరే బోయీలను, కావడి వాండ్లను ఒక్కొక్కరికి రెండు రూపాయల పావలా (2-4-0) వంతున, బండికి 7 రూ॥ వంతున ఇచ్చాడట! అక్కడి నుండి విజయ నగరం వరకు బోయీలను, కావడి వాండ్లను మార్చి ఒక్కొక్కరికి 7 రూ॥ చొప్పున ఒప్పందం చేసుకుని యాత్ర చేశానని వ్రాసుకున్నాడు.

## XXI. టప్పా :

వీరాస్వామయ్య గారు టప్పా మనుష్యులను మజిలీ మజిలీకి రప్పించుకుని యాత్ర చేశాడు. హైదరాబాదు నుండి ఈ అవసరం ఏర్పడింది. దీని వల్ల ఖర్చు బాగానే తగిలిందట కాని, దారి తప్పామనే మాట లేకుండా, ఎవరినీ అడుగ వలసిన అవసరం లేకుండా ప్రయాణం చేయగలిగినట్లు వీరాస్వామయ్య గారు పేర్కొన్నాడు.

---

104. ఆంధ్రుల సాంఘిక చరిత్ర. పేజి 64

105. కాశీయాత్రా చరిత్ర. పేజీ. 142 '10 కోసుల దూరం' అన్నాడు.

హైద్రాబాద్ నుండి నిర్మల్ వరకు పోస్టు రన్నర్సు అనే టప్పా మనుష్యుల సాయంతో యాత్ర చేశాడు నిర్మల్ నుండి నాగపూర్ దాకా నాగపూరుకు సంబంధించిన పోస్టాఫీసు వారు సహాయపడ్డారు నిర్మల్‌లో నాగపూర్, హైదరాబాద్ ప్రాంతాలకు సంబంధించిన మున్షీలు ఇద్దరు ఉండేవారనీ, నాగపూరు మున్షీద్వారానే తాను తనతో ప్రయాణించేందుకు ఒక తపాలామనిషిని ఏర్పాటు చేసుకున్నట్లు వీరాస్వామయ్య గారు వ్రాసుకున్నాడు.

కొండ వాగును దాటడానికి కొన్ని చోట్ల పడవలుండేవి కావు. ప్రవాహం అధికంగా ఉంటే కొన్ని గంటలు వేచి ఉండాల్సిందే. తర్వాత కాలినడకన దాటాలి. నాగపూరు రాజ్యంలో జనాబానది దగ్గర తపాలా కట్టను దాటించిన పద్ధతి చిత్రంగా ఉంది. నదికి ఇరుప్రక్కల రెండు కొయ్యలు నాటి ఆ కొయ్యల తలలకు ఒక కప్పితాడు కడతారు. తపాలా కట్ట రాగానే ప్రవాహసమయంలో ఒక ప్రక్కన ఉండే 'హరకారా' తపాలా కట్టను కప్పికి కట్టివేస్తే రెండో పక్కవాడు దాన్ని ఈడ్చుకొంటాడట![106]

## xxii. వీరాస్వామయ్య గారు చూసిన కాశీ:

కాశీ నగరం వేదకాలం నుంచి ప్రసిద్ధి కెక్కి ఉంది. హిందువులు మోక్ష మార్గాన్వేషులై తప్పక దర్శించవలసిన సప్త పుణ్యక్షేత్రాల్లో ఇది ముఖ్యమైనది.

"అయోధ్యా, మధురా, మాయా, కాశీ, కాంచీ, అవంతికా,
పురీ ద్వారవతీచైవ సప్తైతా మోక్ష దాయికాః"

ఇవన్నీ మోక్షప్రదాయికాలేనని ఈ శ్లోకం వల్ల తెలుస్తుంది.

కాశీ పట్టణానికి ఉత్తరాన 'వరణ', దక్షిణాన 'అసి' అనే రెండు నదులు కాలువలుగా ప్రవహిస్తూ గంగలో సంగమిస్తున్నాయి. ఈ రెండు నదుల నడిమి ప్రాంతానికి 'వారణాశి' అన్న పేరు వచ్చింది. ఉత్తరం నుండి దక్షిణానికి అసి, వరణల మధ్య గంగ ధనురాకారంగా ప్రవహిస్తున్నది. బుద్ధుని జాతక

---

106. హర్కారా = Messenger, courier, spy. వార్తావహుడు, వేగువాడు- బ్రౌణ్య తెలుగు ఇంగ్లీషు నిఘంటు. Mixed Dialects.

కథల్లో కాశీ 'పుష్పావతి' అనీ, 'బ్రహ్మ పట్టణ'మనీ వర్ణింపబడింది.[107] అగస్త్యుడు మొదలైన ఋషులు ఇక్కడ తపస్సు చేసి సకల సిద్ధులు పొంది సచ్చిదానందాన్ని అనుభవించడం వల్ల ఈ స్థలానికి 'ఆనందవన'మనీ, త్రిగుణాత్మకమైన మూడు ముండ్లవంటి కొనలుగల ఆయుధంతో ఈ భూమి ఎత్తబడినందువల్ల 'త్రికంటక విరాజిత' మనీ, మహా శివుడిక్కడే నివాసమేర్పరచుకోవటం వల్ల 'మహాశ్మశానమ'నీ వ్యవహరింపబడింది.[108] కాశీలో చెప్పే సంకల్పంలో ఈ పేర్లన్నీ చెప్పబడతాయి [109]

పురాణాలను బట్టి 'కాస్య, కాస, ఖాస,' అని వ్యవహరించబడే ఆర్య తెగవల్ల 'కాశీ'లు అనే పేరు ఏర్పడ్డట్లూ, ఈ వంశీయులు నిర్మించిన నగరం కాబట్టి దీనికి 'కాశీ' నగరమని పేరు వచ్చినట్లు చారిత్రకుల ఊహ.

'వారణాశి' నగరం ప్రాచీన 'బాబిలోన్' నగరాన్ని, మధ్య యుగపు 'రోమ్' నగరాన్ని పోలి ఉన్నట్లుగా హేమచంద్ర రాయ్ వర్ణించాడు: "Benares in this respect resembled ancient Babylon an medieval Rome, being coveted prize of its more warlike, but less civilised neighbours." (Political History of Ancient India. P. 70)[110]

మొగలుల కాలంలో భారతదేశానికి వచ్చిన బెర్నియర్ అనే యాత్రికుడు (1656 - 68) కాశీ నగరాన్ని భారతదేశానికి 'ఏథెన్సు వంటిదని' పేర్కొన్నాడు. "Benares is the Athens of Ind.a."

---

107. చారిత్రక కాశీక్షేత్రము-కొడాలి లక్ష్మీనారాయణ, పేజీ 3.

108. కాశీయాత్ర చరిత్ర. పేజీ 171.

109. కాశిలో చెప్పే సంకల్ప క్రమమేమంటే—
"ఆర్యావర్తైకదేశే, అవిముక్త వారణాసీక్షేత్రే, అసివరణయోర్మధ్యే, మహాశ్మశానే, ఆనందవనే, గౌరీముఖే, త్రికంటక విరాజితే, భాగీరథ్యా పశ్చిమతీరే, బౌద్ధావతారే, విక్రమశకే... నామ సంవత్సరే" అని చెప్పవలెను. - కాశీయాత్ర చరిత్ర. పేజీ 155.

110. ఈ ప్రస్తావన కొడాలి లక్ష్మీ నారాయణగారి 'చారిత్రక కాశీ క్షేత్రము' పేజీ. 4లో ఉంది.

ఏనుగుల వీరాస్వామయ్య గారు కాశీ క్షేత్రంలో 61 రోజులు నివాస మున్నాడు.[111] కాశీయాత్ర చరిత్రలో కాశీని గూర్చి వర్ణించాడు.

వందమంది పరివారంతో అట్టహాసంగా తరలి వెళ్ళిన వీరాస్వామయ్య గారికి జనసమ్మర్ధంగల కాశీక్షేత్రంలో నివాసయోగ్యమైన స్థలం దొరకటానికి ఇబ్బందే అయింది. ఊరి బయట తోటలలో విడిది చేయాలని యోచించాడు కాని అక్కడ కూడ స్థలము 'సంకుచితంగా' ఉండడం వల్లా, మణికర్ణికా ఘట్టం దూరమవుతుందన్న ఉద్దేశ్యం వల్లా కాశీతంబరాయడనే పండారం ఇంట్లో బస చేశాడు.[112] కేదార ఘట్టంలో రెండంతస్తులు నాలుగు ముంగిళ్ళు గల పెద్ద ఇల్లు ఇది. వీరాస్వామయ్యగారికి ఈ ఇల్లు సౌకర్యంగానే ఉన్నట్లు తోచింది గంగా నది ఒడ్డున్నే ఉన్నందువల్ల ఈ మిద్దె మీదినుండి పవిత్ర గంగా దర్శనం చేసుకో వచ్చునని ఆశించాడు కూడ

a) నిర్మాణాలు :

కాశీలో గృహనిర్మాణం గురించి వీరాస్వామయ్య గారి అభిప్రాయమిట్లున్నది: గంగాతీరాన ఉన్న ఇండ్లు, స్నాన ఘట్టాలు ఇరుకైనవి. వీధులు కూడా ఇరుకైనవే అందుకే వీటిని వీరాస్వామయ్యగారు 'కుసంది' అని పిలిచాడు. అసీ తీరంలోని దర్గాగుడి తప్ప దేవాలయాలన్నీ ఇరుకుగానే ఉన్నాయి. సవారీ మీద ఒక ఘట్టం నుండి మరో ఘట్టానికి పోవాలంటే కూడా ప్రయాసగానే ఉండేది. అది గాక సవారీ సమేతంగా వచ్చే యాత్రికులను ధనవంతులుగా భావించి యాచకులు వారిని గల్లీలలో సాగనివ్వరు. అందుచేత పరువుగలవారు సవారీల మీద కాకుండా చిన్న పడవలమీద స్నానఘట్టాలకు వస్తూపోతూ ఉంటారట. వీధులకు కనీసం ఎనిమిదడుగుల భూమైనా వదలకుండా ఇండ్ల నిర్మాణం జరిగిందని, అందుకే వీధులు 'కుసంది'గా ఉన్నాయని వీరాస్వామయ్యగారు పేర్కొన్నాడు.

కాశీలో ఆకాలంలోనే జానెడు భూమికి వేలరూపాయల్లో ఖరీదుండేది. అసి, వరణల మధ్య గంగాతీరంలో భూమి కొనడానికి పూనా శ్రీమంతునికే

111. 27-10-1830 నుండి 16-12-1830 వరకు.
112. కాశీలో ఉండే శివభక్తుడు. 'పండారము' అంటే 'a devotee of siva sect' అని బ్రౌణ్యము.

సాధ్యమౌతుంది కాని ఇతరులకు కాదని వీరాసామయ్య గారు అభిప్రాయ పడ్డాడు.[113] ఈ స్థలంలో గృహ నిర్మాణం చేయాలనుకునేవారు వేలు గుమ్మరించి ఏ కొద్దిపాటి స్థలమో కొనుగోలు చేసి మిద్దెమీద మిద్దె కట్టుకోవచ్చు. వీరాస్వామయ్య గారు అట్లాంటి ఏడంతస్తుల మిద్దెలను కూడ చూశాడు. ఇండ్లు మరీ దగ్గర దగ్గరగా నిర్మించటం వల్ల గొప్పయిండ్లు కూడ గాలి వెలుతురు రాక 'పట్టపగలే చీకటి'గా ఉండేవట.

వరణానదికి బయట 'సిక్కులూరు' అనే స్థలంలో ఇంగ్లీషు దొరలు ఇండ్లు తోటలు కట్టుకొని నివసించేవారు. దొరల కచ్చేరీలన్నీ ఇక్కడే ఉండేవి.[114]

కాశీలో వెలసిన శివుడే విశ్వేశ్వరుడు. ఆయనపేర వెలసిన ఆలయం విశ్వేశ్వరాలయం లేదా విశ్వనాథాలయం. క్రీ. శ. 490 లో అంటే పదిహేను శతాబ్దాల క్రితం మొదటిసారి నిర్మించబడింది అనేకసార్లు ముస్లిములచే ధ్వంసం చేయబడింది కాని హిందువులు మళ్ళీ మరమ్మతులు చేసుకున్నారు. ఇది ప్రస్తుతమున్న నగరానికి కొంచెం ఉత్తరంగా 'మూలకాశీ'లో ఉండేది. 1669 లో ఈ ఆలయాన్ని ఔరంగజేబు ధ్వంసం చేయించి, దాని స్థానంలో ఒక మసీదును నిర్మింపజేశాడు.[115] పంచగంగా తీరంలో బిందుమాధవుడి ఆలయ సమీపంలో

---

113. పీష్వా అని చరిత్ర ప్రసిద్ధి చెందిన మహారాష్ట్ర ప్రధానమంత్రి. శివాజీ మనుమడగు షాహురాజు కాలంలో మంత్రి. కాని పరిపాలనంతా పీష్వా ఆధీనంలోనే నడిచేది. తర్వాత రాజ్యంలో కొంతభాగానికి రాజయ్యాడు.

114. ఇక్కడ ఉండే అధికారస్థులు:- గవర్నర్ జనరల్ ఏజెంటు, ముగ్గురు అప్పీలు కోర్టు జడ్జీలు, ఇద్దరు కష్టమ్సు కలెక్టర్లు, జడ్జీ, మేజిస్ట్రేటు - కాశీయాత్ర చరిత్ర. పేజీ. 162.

115. అక్బరు పాదుషా కాలంలో దేవాలయం పడగొట్టబడిందని వీరాస్వామయ్య గారు కాశీయాత్రలో తెల్పాడు. పేజీ. 160.
కొడాలి లక్ష్మీనారాయణ వ్రాసిన 'చారిత్రక కాశీక్షేత్రము'లో ఔరంగజేబు 2-9-1669 లో ధ్వంసం చేయబడిందని ఉండగా (పేజీ 31), దిగవల్లి శివరావుగారు ఈ తారీఖును ఏప్రిల్ 1669 గా పేర్కొన్నారు కాశీయాత్ర చరిత్ర. పేజీ. 160

నిర్మించబడిన ఈ మసీదు ఎత్తైన రెండు స్తూపీలతో (స్తంభాలు) వీరా స్వామయ్యకు ఆశ్చర్యాన్ని కలిగించింది. పైకి పోవడానికి లోపల మెట్లు కూడా ఉన్నాయి. ఈ స్తూపీల ఎత్తు 500 అడుగుల వరకు ఉండవచ్చునని వీరా స్వామయగారు భావించాడు. దాదాపు వంద సంవత్సరాలదాకా ఆలయ నిర్మాణాన్ని ఎవరూ చేపట్టలేదు. చివరకు ఇందూరు రాణి అహల్యాబాయి దైవ ప్రేరితురాలై 1775లో ఇప్పుడున్న ఆలయాన్ని నిర్మింపజేసింది.[116]

b) **జనసంఖ్య :**

కాశీ పట్టణంలో జనసంఖ్య గురించి భిన్నాభిప్రాయాలున్నాయి.

వీరాస్వామయ్యగారి కంటె ముందే 1824లో కాశీని దర్శించిన బిషప్ హెబర్ దొర వర్ణనలు చాలవరకు వీరాస్వామయ్యగారి వర్ణనకు సరిపోతున్నాయి.[117] కాని జనసంఖ్య విషయంలో చాల అంతరం కనిపిస్తున్నది. వీరాస్వామయ్యగారు కాశీలో ప్రవేశిస్తూనే 'నిండా జనసంఘము' కలిగినట్లుగా గమనించాడు. అంతేకాకుండా కాశీలో 'పదివేల యిండ్లున్ను, లక్ష ప్రజలున్ను వుందురని' భావించాడు.[118] హెబరు దొరగారు '1803 లో వేయబడిన ఒక జనాభా లెక్క ప్రకారం కాశీలో 5,82,000 మంది నివసించినట్లు తేలిందనీ, ఇందులో కొంత అతిశయోక్తి ఉందనిపించినా, జనసమ్మర్దాన్ని బట్టి చూసినట్లైతే ఈ అంచనా ఇంచుమించుగా సరియైనదిగానే తోస్తున్న'దనీ వ్రాశాడు. లండన్, ప్యారిస్ నగరాలు తప్ప యూరోప్‌లో మిగిలిన నగరాలకన్నా కాశీనగరం ఎక్కువ జనాకీర్ణంగా వుందని కూడ అభిప్రాయపడ్డాడు.

---

116. 'చారిత్రక కాశీక్షేత్రము' - కొడాలి లక్ష్మీనారాయణ. పేజీ. 52.

117. ఈయన 1824-26 మధ్య కలకత్తాలో కుంపిణీ వారి కొలువులో ప్రధాన క్రైస్తవ మతాధికారిగా ఉన్నాడు. భారతదేశ పర్యటనం చేసి తాను చూసిన సంగతులను దినచర్యగా, ఉత్తరాల ద్వారా వ్రాశాడు ఇవే తర్వాత 'బిషప్ హెబర్స్ జర్నల్' అని మూడు సంపుటాలుగా వెలువడ్డాయి.

118. కాశీయాత్ర చరిత్ర. పేజీ 170. 1941లో జనాభా 2,58,908 అనీ, 1966లో నాలుగు లక్షలనీ 'చారిత్రక కాశీ క్షేత్రము' - కొడాలి లక్ష్మీనారాయణ పేజీ. 11.

c) పంచక్రోశయాత్ర :

అసి, వరణల నడిమి ప్రదేశాన్ని అవిముక్త క్షేత్రమని కూడ అంటారు. ఇక్కడ దేహత్యాగం చేసిన వారికి సద్గతులు కలుగుతాయని హిందువుల పరంపరాగత విశ్వాసం. దక్షిణ భారతదేశం నుండి వేలాది జనం కాశీకి వచ్చి ఇక్కడనే మరణపర్యంతం గడుపుతారు. గంగాతీరంలో ముఖ్య స్నానఘట్టాలు ఐదు. వీటినే పంచతీర్థాలు అంటారు. వీటి గురించి చేసే యాత్రను 'పంచ క్రోశ యాత్ర' అని పిలుస్తారు. ఈ యాత్ర చేసి రావడానికి 50 మైళ్ళు ప్రయాణించాల్సి ఉంటుంది.[119] యాత్రలోని ప్రతి మజిలీ స్థలంలో విశాలమైన ధర్మశాలలు నిర్మింపబడ్డాయి. అక్కడక్కడ యాత్రికుల సౌకర్యం కోసం అంగళ్ళున్నాయి. దారి పొడుగునా నీడ కోసం వేసిన శాల (చెట్ల వరస) లున్నాయి.

పంచ తీర్థాలలో మణికర్ణికా గుండము ముఖ్యమైనది. దీన్ని మణికర్ణికా ఘట్టమని కూడ అంటారు. దీని సమీపంలో చక్రతీర్థముంది. కాశీలో ప్రవేశించిన వారు ప్రథమ స్నానం దీనిలోనే చేయాలి. ఐతే ఇది అనుకున్నంత తేలిక పని కాదు గయలో గయావళిలలాగే ఇక్కడ గంగాపుత్రులు యాత్రికులచే మణికర్ణికలో స్నానవిధులు నిర్వర్తింప చేస్తారు వీరిని తప్పించుకొని స్నానం చేయడం అసాధ్యమైన విషయం. ఈ తీర్థాన్ని గంగాపుత్రులు సదా ఆవరించుకొని ఉండమే ముఖ్య కారణం వీరు కాశీలో 1200 యిండ్ల దాకా వున్నారని వీరాస్వామయ్యగారు పేర్కొన్నాడు. యాత్రకు వచ్చేవారిని ఏ గంగా పుత్రుడు మొదట చూస్తాడో వాడే యాత్రికులచేత స్నానాది క్రియలు చేయిస్తాడు. గుర్రానికి 12 రూపాయలు, మనిషికి 4 రూపాయలు, గాడీకి 50 రూపాయల వంతున యాత్రికుల వద్ద వసూలు చేసేవారు.[120] బహుశా డబ్బులు ఇవ్వలేనివారిని, ఇవ్వనివారిని కొట్టి హింసించేవారట కూడ. వీరి ఆగడాలకు భయపడి శరభోజీ మహారాజంతటివాడే మణికర్ణికా ఘట్టం జోలికి పోకుండా కేదార ఘట్టంలో క్షౌర శ్రాద్ధాలు నిర్వర్తించుకొని తృప్తి చెందాడని వీరాస్వామయ్యగారు వ్రాశాడు.[121] ఇక

119. ఇప్పటి లెక్కలో దాదాపు 80 కి.మీ.

120. గాడీ అంటే Carriage, Chariot, Cart అని బ్రౌణ్యము. బహుశా గుర్రపు బండ్లయి ఉంటాయి.

121. శరభోజీ మహారాజు తంజావూరు పాలకుడు (1777-1833).

విజయనగరపు రాజు కాశీలో యేడాదిపాటు ఉండికూడ ఈ కారణం వల్లనే మణి కర్ణిక ముఖమైనా చూడటానికి ఇష్టపడలేదట!

వీరాస్వామయ్యగారికి ఇలాంటి చేదు అనుభవం ఎదురుకాలేదు మహారాజులకే అసాధ్యమైన కార్యాన్ని సాధ్యం చేసుకున్నాడు. నాగపూరు దాటిన తర్వాత రామటెంకిలోనే (ఇప్పటి రామ్‌టేక్) 'రామరహళ్లి' అనే గంగా పుత్రుడు ఈయనను ఎదురుకున్నాడు. వీరాస్వామయ్యగారు ముందు జాగ్రత్త చర్యగా తాను ఇచ్చింది పుచ్చుకుని యాత్ర చేయించే షరతుమీద 'దస్తావేజు' వ్రాయించుకున్నాడు. ఆ గంగా పుత్రుడు రామటెంకినుండి వీరాస్వామయ్యతో కలిసి ప్రయాణంచేస్తూ కాశీకి చేరుకున్నాడు. కాశీ ప్రవేశించిన వెంటనే మణికర్ణికకు వెళ్ళి అక్కడ చక్ర తీర్థంలో స్నానంచేసి క్షౌరానికి సంకల్పం చెప్పుకొని క్షౌరం అనంతరం మణి కర్ణికలో మళ్ళీ స్నానం చేసి గంగాపూజ పూర్తి చేశాడు. తర్వాత గంగాపుత్రుల సమూహానికి 15 రూపాయలు, ఘాటియాలకు 10 రూ॥, కంగాళీకు 5 రూ॥ వంతున భూరి దక్షిణలు ఇచ్చాడు.[122] అన్ని శాఖల బ్రాహ్మణులో శాఖకు యాభై మంది వంతున ఇష్టబంతికి పిలిచి, ప్రతి వ్యక్తికి పావలా దక్షిణ ఇవ్వగా సంతోషించారట!

గంగా తీరంలో ఏ దానమైనా గంగాపుత్రులను కాదని మరొకరికి ఇవ్వ కూడదు. ఘాటియాలకు, తాణీలకు గంగాపుత్రుల భయం విస్తారంగా ఉంది.[123] వీరిద్దరిపై గంగాపుత్రులు అధికారం చెలాయించేవారు.

ఆ కాలంలో ద్రావిడదేశంలో శూద్రులను - ముఖ్యంగా 'చండాలుర'ను అగౌరవపరుస్తూ, శూద్రుల దృష్టి, చండాలుర సామీప్యం కూడదని అవమానిం

---

122. ఘాటియాలనే వారు స్నానోపచర్యలు చేసే జాతివారు. చందనం, విభూతి మొదలైన ఉపచర్యాద్రవ్యాలతో స్నాన ఘట్టాలవద్ద ఉంటారు. ఈ స్థలాల్లో వీరి అధికారం ఎక్కువ కంగాళీలు దక్షిణ దేశంనుండి వచ్చిన యాత్రికులు. వీరు యాచకులు. కేదార ఘట్టంలో ఎక్కువ వుంటారు.

123 పంచద్రావిళ్ళు పంచగౌడులతో చేరిన యాచకులు తాణీలు. వీరి సంఖ్య 15 వేల దాకా ఉంటుందని వీరాస్వామయ్య తెలిపాడు.

చడంవల్ల వేలసంఖ్యలో 'క్రీస్తు మతస్థులు'గా మారిపోయారు. ఈ సంఘటనలు పెదపాళెము, మైలాపూరు ప్రాంతాల్లో జరిగినట్లు వీరాస్వామయ్యగారు సూచించారు. ఐతే కాశీలో పరిస్థితి ఇందుకు భిన్నంగా ఉంది. కాశీలో స్నాన నియమం ప్రతి మనిషికి ఉంది శిరఃస్నానం చేయకుండా శూద్రులు కూడ భోజనం చేయరట! ఈ దేశపు బ్రాహ్మణులు ఇతర వర్ణాలవారిని చిన్నచూపు చూడకపోవడానికిదే కారణమేమో? 'నీళ్ళున్నూ, ఉప్పున్నూ కలియని మిఠాయిన్ని, పక్వాన్నాలున్ను సకలమయిన బ్రాహ్మణులున్ను కొని భక్షింపుచున్నారు. చేసేవారి జాతి విచారణ అక్కరలేదు' అని వీరాస్వామయ్యగారు వ్రాశాడు.[124] బహుశా ఈ కారణాలవల్లనేనేమో అప్పటిదాకా హిందువులను మతాంతరులుగా మార్చాలనే క్రైస్తవుల ప్రయత్నాలు అంతగా ఫలించలేదని వీరాస్వామయ్యగారు అభిప్రాయపడ్డారు.

### d) మూడు రకాల ఉపద్రవాలు :

వీరాస్వామయ్యగారికి కాశీలో మూడు రకాల ఉపద్రవాలు కనిపించాయి. అవి: రాండు, సాండు, ఛీడీలు.[125] వితంతు వివాహాలు అప్పటికింకా అమలులో

---

124. కాశీయాత్ర చరిత్ర. పేజీ 164.

దాదాపు రెండు శతాబ్దాలకు పూర్వమే వేంకటాధ్వరి అనే కవి (17వ శతాబ్దంవాడు) విశ్వగుణాదర్శంలో కాశీవర్ణన చేస్తూ బ్రాహ్మణులు జాతి నియమాలు పాటించడం లేదన్నాడు.

"ప్రాతర్నస్త కృతాప్లనోపి రజకస్పృష్టాన్ జడోరాసభైః
ఊఢాన్ ధారయతే పటాననుదినం ధృత్వాబహిర్గచ్ఛతి।
గత్వామ్లేచ్ఛముఖా శుచీన్ స్పృశతిచ స్పృష్ట్వాపిన స్నాత్యహో
నస్నాఽత్యోష్యథ భుంక్త ఏవ చవలో ముక్త్వాపి న వ్రీడతి॥"

122 వ శ్లోకం.

ఇక్కడి బ్రాహ్మణుడు ఉదయం స్నానంచేసి చాకలివానిచేత, గాడిదలచేత తాకబడిన బట్టలను ధరించి, బయట తురకలను ముట్టుకుంటూ స్నానం చేయకుండానే భోజనం చేస్తాడు అని అర్థం.

125. 'రాండు' అంటే విధవ స్త్రీలు. 'సాండు' అంటే ఎద్దులు. 'ఛీడీలు' అంటే మెట్లు. ఛీడి for సిడి=steps. మెట్లు అని బ్రౌణ్యము.

లేవు. భర్త చనిపోయిన స్త్రీలు నిరాశ్రయులై యాచకవృత్తిని అవలంబించేవారు. విధవల దుర్నీతివల్ల లోకులకు ఇబ్బందిగా ఉండేదని వీరాస్వామయ్య గారు వ్రాశాడు.[126]

అనేక వృషభాలను పట్టణ వీధుల్లో వదలి పెట్టడం వల్ల ఇరుకు గల్లీలలో మనుష్యులతో పాటు అవి కూడ సంచరిస్తూ నడకకు ప్రతిబంధకంగా ఉండేవి. అదిగాక భక్తుల చేతిలోని తిలాక్షతలు, పూలమాలలు, బిల్వపత్రాలు మొదలైన పూజా ద్రవ్యాలను లాక్కొని తినడానికి పైన పడుతూండేవి. ఇక ప్రతి గళ్ళీలో (కాశీలో వీధులను గళ్ళీలంటారట) ఛీడీలు ఎక్కి దిగవలసి ఉంటుంది. ఈ మెట్ల మీది నుండి 'వైపు తప్పి' పడిపోయి చాల మంది కాళ్ళు చేతులు విరగ్గొట్టుకున్న సందర్భాలున్నాయి.

## e) శ్రీమంతుల అన్నదానం :

ఇక్కడి స్థల మాహాత్మ్యమేమో కాని, ఎప్పుడూ కొందరు శ్రీమంతులు ఈ ప్రదేశానికి వచ్చి నివాసముండి నెలకు నాలుగైదు లక్షల రూపాయలు దాన రూపంగా ఖర్చు చేస్తుంటారట. వీరాస్వామయ్య గారు కాశీలో ఉన్న రోజుల్లోనే బిమ్నాజీ అప్పా అనే శ్రీమంతుడు నెలకు మూడులక్షలు ఖర్చుపెడుతూ అసీ తీరంలో నివసించి ఉన్నాడని వ్రాశాడు.[127]

భిక్షం పెట్టే వారుంటే రెండువేల మంది దాకా అనాథ స్త్రీలు గుమికూడు తున్నారట! అన్నపూర్ణ కటాక్షం చేత ఎంతమందికైనా అన్నానికి లోటు లేకుండా జరుగుచున్నదనీ, పరదేశీయులైతే పిలవకుండానే వేలసంఖ్యలో వచ్చేవారనీ, వారిలో రెండువేలమంది స్త్రీలు పురుషులు పంచద్రావిళ్ళ వారేనని వీరాస్వామయ్య పరిశీలనలో తేలింది. కాశీలోని అన్నపూర్ణసత్రంలో పునా శ్రీమంతుని (పీష్వా) తమ్ముడు అమృతరావు ప్రతిరోజు 1500 మందికి అన్నదానం చేసే

---

126 'విధవలు నిండా యాచించడము చేతనున్ను, దుర్మార్గపు చాల విధవలు ఇతర నడతలు కలిగి యుండుట చేతనున్ను వారివల్ల బహుపీడ లోకులను కలిగియున్నది.' -కాశీయాత్ర చరిత్ర. పేజి 168

127. కాశీయాత్ర చరిత్ర. పేజి 170.

వాడట![128] దక్షిణ దేశస్థులు అనేకమంది కాశీ తంబురాయని ద్వారా ప్రతిరోజు వెయ్యిమందికి అన్నదానం చేయించేవారు మైసూరు రాజు మొదలైన గొప్పవారు అనేకులు అన్నదానాలు చేయించేవారు. స్వయంపాకం చేసుకునేవారికి ప్రతిదినం సంభారాలను సమకూర్చేవారు.

## f) అంగడిలో రత్నాల అమ్మకం :

మణికర్ణికకు దక్షిణంగా 'చౌకంబా' గుజిరీ అంగడి వుండేదట.[129] ఇక్కడ పీతాంబరాలు, వివిధరకాల అపూర్వమైన వస్త్రాలు లెక్కలేనన్ని దొరుకుతాయి.[130] కాశీలో ధనికులైన గోసాయీలు 'మహా జనుల'ని పేరు పెట్టుకుని సాహుకారు పనులు చేస్తున్నారని, వీరు విలువైనఆభరణాలు అమ్ముతున్నారని వీరాస్వామయ్య గారు వ్రాశాడు.[131] లక్నో నవాబు సంస్థానానికి కావలసిన రత్నాభరణాలు కూడ ఇక్కడి నుండే పోతున్నాయట!

కాశీలోని ప్రజలు తమ దేశ భాష అయిన హిందూస్థానీలో మాట్లాడతారు. బాహాటమైన సంత అంగళ్ళను బోళాలనీ, ఉత్సవాదులను మ్యాళాలనీ, పల్లకీలను కడు కడియాలనీ, బోయీలను కారులోక్‌లనీ వ్యవహరిస్తారు[132]

---

128. వీరాస్వామయ్యగారు ఈయనను 'అమృతరాయడు' అంటాడు. అమృతరాయని గురించి హేబరు దొర కూడ వర్ణించాడుట. 'ప్రతి బ్రాహ్మణునికి ఈ మహారాష్ట్ర పీష్వా ఒక శేరు బియ్యము, ఒక రూపాయ డబ్బు యిచ్చుచుండెనని, కుంటి గ్రుడ్డి వారికి కూడ ధర్మము నిచ్చుచుండెనని, సంవత్సరమునకు రు. 50 వేలు ధర్మము చేయుచుండె'నని హేబరు వ్రాసినట్లుగా కొడాలి వారి 'చారిత్రిక కాశీ క్షేత్రము' పేజీ 12లో ప్రస్తావన ఉంది.
129. గుజరి, గుజిరి or గుజిలి = A market place, thieving market (A madras word) అని బ్రౌణ్య తెలుగు ఇంగ్లీషు నిఘంటు.
130. రెండవ శతాబ్దం నాటికే కాశీ పట్టు వస్త్రాలకు పేరు పొందినట్లు, ఈనాడీ పట్టు వస్త్రాల పరిశ్రమ అంతా మహమ్మదీయ సాలీల చేతిలో ఉన్నట్లు కొడాలి వారి 'చారిత్రక కాశీ క్షేత్రము' పేజీ. 20 లో ఉంది.
131. కాశీయాత్ర చరిత్ర. పేజీ. 163.
132. వీరాస్వామయ్య గారు సంతను 'బోళా' అని పేజి 159 లో, 'బాళా' అని పేజి 170 లో పేర్కొన్నాడు. బ్రౌణ్యము 'బోళా' అన్న పదానికి Unreserved Frank, కపటికాని, మనసులో దాచని- అని అర్థాలనిచ్చింది. వస్తువులను నల్ల బజారులో కాకుండా బాహాటంగా అమ్ముతారు కాబట్టి 'బోళా' అన్న పేరే సార్థకంగా ఉంది.

కాశీలోని వీధులను గళ్ళీలంటారు. ప్రతి గళ్ళీకి ఠాణాలున్నాయి. ఠాణా అంటే పోలీసు స్టేషనన్నమాట! ఠాణా బంట్రౌతులను ఇక్కడ బరకన్ దాసు లంటారు. వీరంతా కొత్వాల్ (పోలీసు అధికారి) అధికారానికి లోబడి రాత్రిళ్ళు గస్తీ తిరుగుతుంటారు. కాశీలోని ప్రతి గళ్ళీలో పాటక్కు అని తలుపులు, ద్వార బంధనాలు ఉన్నాయట! ప్రతి పాటకును రాత్రి 10 గంటలకే బిగిస్తున్నారనీ, తర్వాత జనం తిరగడానికి వీలుండదనీ వీరాస్వామయ్య గారు తెల్పాడు.

ఏనుగుల వీరాస్వామయ్య గారు తమ యాత్రా గ్రంథానికి 'కాశీయాత్ర చరిత్ర' అని పేరు పెట్టాడు. దాదాపు 51 రోజులు కాశీలో ఉన్నాడు. అన్ని రోజులుండి కూడ కాశీని గురించి ఆయన చెప్పిన విషయాలు చాలా తక్కువ. ఇది ఆశ్చర్యకరమే. అక్కడ ఆయన అనుభవించిన ఆధ్యాత్మిక జీవనాన్ని గురించి మనకేమీ తెలియదు. కనీసం విశ్వేశ్వరాలయంలో లింగదర్శనం చేసిన అనుభూతి వివరాలను కూడ పేర్కొనలేదు. మరి అంతకాలం ఆయన ఏం చేసినట్టు? ఆయన వ్యక్తిగత వ్యవహారాలేమిటి? జబ్బు పడ్డాడా? పడితే ఎందుకు వ్రాయలేదు? అక్కడి గళ్ళీలలో కాలినడకన సంచారం చేశాడా? పల్లకీలోగాని వాహనంపై గాని వెళ్లాడా? వ్యాసుని గురించి, కబీరుని గురించి, తులసీదాసు గురించి ఎక్కడా ఎందుకు ప్రస్తావించలేదు? దక్షిణదేశం నుండి కాశీకి వెళ్ళి స్థిరపడ్డ వాళ్ళను కలిసినట్లుగా కూడా ఎందుకు తెలుపలేదు? ఇవన్నీ వీరాస్వామయ్యగారు వ్రాస్తే తప్ప తెలియని విషయాలు. ఈ కారణాల వల్లనే వీరాస్వామయ్యగారిది కాశీయాత్ర చరిత్ర అవుతుంది. యాత్రా గమ్యమైన నాటి కాశీ విశేషాలు ఇందులో ఆశించినంతగా గ్రథితం కాలేదు అని చెప్పవచ్చు.

వీరాస్వామయ్యగారు కాశీకి వెళ్ళే దారిలో బాటలు, మజిలీలు, సత్రాలు, విశ్రాంతి భవనాలు, దొరికే వస్తువులు, గ్రామాల మధ్య దూరాలు, యాత్రలో కలిగే ఇబ్బందులు - వాటి నధిగమించే తీరు - వీటన్నింటినీ వివరంగా తర్వాత ప్రయాణం చేసేవారికి సులువుగా ఉండేట్లు వర్ణించాడు. కాబట్టి దీనిని కాశీయాత్ర చరిత్ర అనడం కంటే కాశీ మార్గ చరిత్ర లేదా మార్గాయాస, మార్గానుభవ చరిత్రగా కూడా భావించడం సమంజసం.

## xxiii. భాషా విశేషాలు :

కాశీయాత్ర చరిత్రలో వీరాస్వామయ్యగారు కాశీయాత్ర విశేషాలను ఎప్పటికప్పుడు తన సన్నిహిత మిత్రుడైన కోమలేశ్వరపురం శ్రీనివాస పిళ్ల గారికి జాబులుగా వ్రాశాడు. ఆ ఉత్తరాలు ఎట్లాంటి భాషలో ఉన్నాయో చెప్ప డానికి ఆధారాలు చూపడం కష్టం కాని, అది ఆనాటి ఒక రకమైన ఉత్తరాల భాషలోనే ఉండి ఉంటుంది. ఆ ఉత్తరాలు మనికిప్పుడు లభించడం లేదుగాని అవి సాంప్రదాయిక లేఖా పద్ధతిలో 'మహారాజశ్రీ'తో ప్రారంభమై 'చిత్తగించ వలెను.' 'భవదీయుడు'తో ముగిసి ఉంటాయి. ఆ కాలంలో పండితులు బ్రౌన్‌కు వ్రాసుకున్న లేఖా సంచయంలోని వివరాలను మినహాయిస్తే అవన్నీ దాదాపు ఒకేరకమైన భాషా శైలులతో కనిపిస్తాయి. బ్రౌన్ లేఖల నమూనాలను బంగోరె ప్రచురించిన 'బ్రౌన్ లేఖలు' అనే పుస్తకాల్లో చూడవచ్చు.

యాత్రా కాలంలో వీరాస్వామయ్యగారు తన రోజువారీ దిన చర్యను వ్రాసుకున్నాడు. శ్రీనివాస పిళ్లగారికి వ్రాసిన ఉత్తరాలు, డైరీలలోని విషయాల ఆధారంగా యాత్రా చరిత్రను వ్రాయించాడు 'వ్రాయించాడు' అన్నది ఇక్కడ గమనార్హం. ఈ పదానికి అర్థం డిక్టేట్ చేశాడా? లేదా తాను దినచర్యలో వ్రాసు కున్న సమాచారాన్ని ఇచ్చి వ్రాయమన్నాడా? అనేది తెలియడం కష్టం. కాని ఇంతకుముందే చెప్పినట్టు ఆనాటి ఒక విలక్షణమైన భాషాశైలి విద్యావంతులలో సర్వసామాన్యంగా ఉండేదని అప్పటి రికార్డులను చూస్తే స్పష్టమౌతుంది. ఐతే ఈ భాషాశైలుల్లో వీరాస్వామయ్యగారి ప్రమేయమే ఎక్కువగా ఉంటుందని ఊహించవచ్చు.

వీరాస్వామయ్యగారు కాశీయాత్ర చరిత్రలో వాడినభాష సరళమైనది. ఐతే ఇది ఆకాలపు ఒకానొక విలక్షణమైన వ్యావహారిక శైలిలో ఉంది. దీర్ఘ సమాసాలు లేవు. శైలి సంస్కృత భాషా సంపర్కం కలిగిన గ్రామ్యం లాగా ఉంటుంది. ఉదా:- "నా క్షుత్తు నివృత్తి అయ్యే మార్గము నీవే విచారించవలెనని ఆ రాక్షసుడు సరస్వతిని ప్రార్థించినందున సరస్వతి బడబాసురుని మంచిదని వెంట పెట్టుకొని సముద్రమధ్యే తెచ్చి సముద్రోదకాన్ని పానము చేయుము... అని చెప్పెను. మంచిదని అద్యాపి బడబుడు అగ్ని స్వరూపముగా బడబాగ్ని యనే పేరు పెట్టుకుని సముద్రోదకాన్ని పానము చేస్తూ ఉన్నాడు "134

134. కాశీయాత్ర చరిత్ర. పేజీ. 131 - 32.

పై వాక్యాల్లో 'చేస్తూ ఉన్నాడు' లాంటి వాడుకప్రయోగాల్తో పాటు 'క్షుత్తు, నివృత్తి, సముద్రోదకం, పానము, అద్యాపి' అనే సంస్కృత పదాలు, 'సముద్రమధ్యే' లాంటి సంస్కృత ప్రయోగాలు కూడ అప్రయత్నంగా దొర్లుతూ ఒక మణిప్రవాళ స్ఫూర్తిని కలిగిస్తాయి. 'సముద్ర మధ్యే' అన్నది వైదిక సంప్రదాయాన్ని తలపిస్తుంది. కాశీలో చెప్పే సంకల్ప క్రమంలోని 'అవిముక్త వారణాసీక్షేత్రే, అసివరణ యోర్మధ్యే...' అన్న శ్లోకం గుర్తుకు వస్తుంది.

వీరాస్వామయ్య గారిలో తెలుగుసామెతల వాడకం తక్కువే. కాని సంస్కృత లోకోక్తులు కొల్లలుగా కనిపిస్తాయి. లోకరీతిలోంచి ఏరినవి కొన్నైతే, ఆచార సంప్రదాయాల్లోంచి జారినవి మరికొన్ని, వాటిని యథాత థంగా ఇవ్వడం వీరాస్వామయ్య గారి ప్రత్యేకత.

ఉదా :-'అన్నస్య క్షుధితం పాత్రం'
'అభావే విరక్తిః'
'అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం'
'అహో గుణవతీ భార్యా భాండమూలం న యాచతే'
'ఉష్ణ ముష్ణేన శీతలం'
'స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం'—మొదలైనవి.

అప్పటి వాడుకభాషలోని పదాలు కొన్ని వీరాస్వామయ్య గారి వ్రాతలో రూపాంతరం చెందాయి.

ఉదా :-బాట - భాట
(కొండ పక్కను భాట పోవుచున్నది. పేజీ - 7)
బావి - భావి

(సరాయిమధ్యే ఒక భావి యున్నది. పేజీ 203) దారకు బదులు 'ధార' అనేది కూడ ఇట్లాంటిదే. ఆనాటి వైదికబ్రాహ్మణ కుటుంబాల్లో ఈ మహా ప్రాణోచ్చారణ ఉన్నట్లు తెలుస్తుంది.

బాట తిన్ననిది, వంకరలేనిది అనే అర్థంలో 'భాట సరాళము' అని వీరాస్వామయ్య గారు అనేక చోట్ల వ్రాశారు. ఇది సరళము అన్న పదానికి రూపాంతరమే. ఇంకా రైతులను 'రహితుల'నీ, నాణాలను 'నాణ్యెము'లనీ, పేట స్థలాన్ని 'ప్యాట స్థలమ'నీ ఉపయోగించాడు.

పదాదిని ఒకారంతో మొదలయ్యే అక్షరాన్ని 'వ' కారంగా పలకడం కూడ ఎక్కువగా కనిపిస్తుంది.

'ఆవాడవాడు వాడకు ఆధీనమై పోవునో (పేజీ. 71).' ఇక్కడ ఓడకు బదులు 'వాడ' అన్న పదం వాడబడింది. ఇది మాండలికరూపమై ఉంటుంది.[135]

అన్యభాషాపదాలు తెలుగులోకి మార్చుకున్నప్పుడు అజంతాలుగా మారడం సహజం.

మజిలీ లాయఖు, ఖుల్లస్సు, సదరహి, మజుబూతీ, ముసద్దీ, హాశ్శీలు, బేబందు, పారా, హరకారా, రస్తు - మొదలైనవి ఉర్దూ, పార్శీ పదాలకు ఉదాహరణలు.

ఇతర భాషా పదాలకు, ముఖ్యంగా ఉర్దూ పదాలకు 'ఇంచుక్కు'లు చేర్చి వాడడం ఇప్పటికీ వ్యవహారంలో ఉన్న విషయం. ఐతే చెన్నపట్టణంలో నివసించిన తెలుగువాడు తన రచనలో ఉర్దూ పదాలకు 'ఇంచుక్కు'లు చేర్చి తెలుగు పదాలుగా తోపింపజేయడం గమనార్హం.

ఉదా:- హామీ ఖరాయించి,
పునలాయించి,
కటాయించి - మొదలైనవి.

వీరాస్వామయ్యగారు సందర్భోచితంగా అక్కడక్కడ తమిళ, మలయాళ సామెతలు వాడుకున్నాడు. 'శలవు' అన్నది తమిళ పదం.[136] దీనికర్థం 'ఆజ్ఞ, సెలవు, ఖర్చు' అని బ్రౌణ్యంలో ఉంది. తెలుగువారికి మొదటి రెండర్థాలు

---

135. 1934 లో చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు వ్యావహారికభాషలో కావాలని వ్రాసిన 'కాశీయాత్ర'లో ఒడ్డున వడ్డు అనీ ఒక పర్వతం అనడానికి వక పర్వతం అనీ ఈ 'వ'కార ప్రయోగమే చేశారు. ఇప్పటికీ చీరాల దగ్గరి ఓడరేవును 'వాడరేవు'అనే వ్యవహరిస్తారు.

136. వీరాస్వామయ్య గారి సమకాలికుడు రావిపాటి గురుమూర్తిశాస్త్రి 1834లో వ్రాసిన 'పంచతంత్ర కథలు'లో ఈ పదాన్ని వాడుకున్నాడు.'
'వృద్ధి పొందించని ధనము కొంచెముగా 'సెలవు' చేసిన కాటుకవలె సమసిపోవును.'

మాత్రమే తెలుసు 'శలవు'కు ఖర్చు అన్న అర్థాన్ని వాడడం తెలియదు. వీరా స్వామయ్య గారు ఈ అర్థంలోనే చాల చోట్ల వాడాడు.

ఉదా:- 'అక్కడ డబ్బులు మార్చి పెట్టుకొని సెలవు చేయవలసినది' (పేజీ 15)
'నాలుగయిదు లక్షలు సెలవు చేసేపాటి ఆసామి' (పేజీ. 170)
'కొట్లోవేసి కోర్టు సెలవులతో కూడా తీసుకుంటారు' (పేజీ. 150)
'సకల శలవులతో కూడా అరువై రూపాయలు పట్టుతున్నవి.' (పేజీ.218)

కొన్ని ఇంగ్లీషు పదాలు ఉచ్చారణ మారి కనిపిస్తాయి. వీరాస్వామయ్య గారు వీటిని విచిత్రంగా రూపొందించారు:

| ఇంగ్లీషు పదాలు | | తెలుగులో ఉచ్చరించినతీరు | |
|---|---|---|---|
| Chief secretary | - | చీపు శక్రటేరి | (పేజీ 281) |
| Astronomy | - | యస్ట్రానోమి | (పేజీ. 259) |
| Commissioner | - | కమిష్షనరు | (పేజీ 135) |
| Police Superintendent | - | పోలైసు సూప్రింటెండాంటు | (పేజీ. 281) |
| Public Buildings | - | పబ్లికు బులుడింగసు | (పేజీ. 64) |
| Principal Assistants | - | ప్రిన్సైపాల్ అసిస్టాంట్సు | (పేజీ 78) |

ఇప్పుడంతగా వ్యవహారంలో లేని పదాలు కూడ వీరాస్వామయ్య గారి యాత్రా రచనలో కనిపిస్తాయి ఉరి తీయడానికి వీరు తలకాజ్ఞ చేసి'(పేజీ. 107) 'తూకు తీసి' (పేజీ. 81) అని వాడాడు.

'అంతు' అన్న పదం ఇప్పుడు ఉపయోగంలో లేదు. అంతు ఎంత? అంటే మొత్తమెంత? అని అర్థం.

ఉదా:- 'నాలుగు శిపాయి డేరాలు, ఒక కంబళిడేరా ఒక యొంటి కంభం డేరా అంతు ఆరు డేరాలు' (పేజీ. 87).

వీరాస్వామయ్య గారి రచనలో ఇప్పుడు మరుగునపడ్డ ఆనాటి కొన్ని జాతీయాలు కూడ కనిపిస్తున్నాయి. ఐకమత్యంతో ఉన్నారనడానికి-

'వారు ఒక పొట్లముగా మిత్ర భావమును పొంది ఉన్నారు ' (పేజీ 63) అంటారు. ఒకే పొట్లంలో రకరకాల వస్తువులు కలిపి వున్నట్లు ఒకే సూత్రానికి కట్టుబడి ఐక్యంగా ఉన్నారని చెప్పబడింది.

కాశీయాత్ర వ్రాత ప్రతిలో పూర్తిగా, అచ్చుప్రతిలో పాక్షికంగా రేఫ సంయుక్తాక్షరాన్ని వలపల గిలక (ౙ) తో వ్రాయడం కనిపిస్తుంది.

ఉదా:- అథౙము (అర్థము)
ఖచౙ (ఖర్చు)
నిభౙయము (నిర్భయము)
నిమౙల (నిర్మల)
పవౙతము (పర్వతము)

ఐతే చిన్నయసూరి తర్వాత ముద్రణలో కొన్ని మార్పులు తెచ్చి 'అథౙము'ను 'అర్థము'గా నవీనంగా ముద్రింపచేశాడు

వీరాస్వామయ్యగారి కాశీయాత్రలో గ్రాంథిక రచన చిహ్నలైన అర్ధాను స్వారం, శకటరేఫం కనిపించవు.

వైదిక బ్రాహ్మణుల వ్యావహారిక భాష కొన్ని క్రియారూపాల్లో కని పిస్తున్నది.

'ఉంటున్నవి' అనడానికి 'ఉంచున్నవి' అన్నది అక్కడక్కడ కనిపించే ఉదాహరణ :

'బాగా రుచిగా ఉంచున్నవి' (పేజీ. 48)

'చూడవేడుకగా వుంచున్నది' (పేజీ. 231)

'మధ్యే ఒకొక్కక్క యెర్రవర్ణపు పూలున్ను సకృత్తుగా పూచియుంచున్నవి' (పేజీ. 231).

'వచ్చుబడి', 'వుండరాములు' లాంటి విశిష్ట ప్రయోగాలు కూడ కాశీ యాత్ర చరిత్రలో కనిపిస్తున్నాయి.

ఉదా: 'తమ వచ్చుబడిలో ఒక హిస్సా నిజాము సర్కారుకు ఇస్తారు' (పేజీ. 54). ఇక్కడ 'వచ్చుబడి' అంటే రాబడి లేదా ఆదాయమన్న మాట!

ఉదా: 'యిక్కడ యింగిలీషువారికి వుండరాములు చేసినంతలో వారు ఢిల్లీ పాదుషాతో మొరపెట్టుకొనేటందుకు వెళ్ళినారు' (పేజీ. 275)[137] ఉండరాములు చేయడమంటే ఉండకుండా చేయడమనే అర్థంలో ఇక్కడ వాడబడిందనుకోవాలి.

---

137. 'ఉండమి' అంటే 'ఉండుటకు' వ్యతిరేకార్థం. లేక పోవడమని అర్థం. అట్లాగే 'రామి' అంటే 'వచ్చుట'కు వ్యతిరేకార్థం రాకపోవడమన్నమాట! 'రామి'కి బహువచన పదమే 'రాములు.' రాకపోకలు అనే అర్థంలో భాగ వతంలో 'పోరాములు' వాడబడింది.

కొన్నిచోట్ల తెలుగు వాక్యాల నిర్మాణం ఇంగ్లీషు వాక్య నిర్మాణాన్ననుసరించి వ్రాయబడ్డట్లు కనిపిస్తుంది.

ఉదా: 'అక్కడ పదార్థములు మృగ్యముగా దొరికినవి' (పేజీ. 319). మృగ్యముగా అనే పదానికి అర్థం తెలియనివారు ఏవో పదార్థాలు దొరికాయనే అనుకుంటారు. కాని నిజానికి అక్కడ ఏమీ దొరకలేదు అనే రచయిత చెప్ప దలచుకున్నాడు. Not found అనే అర్థంలో 'మృగ్యముగా దొరికినవి' అని ఇక్కడ వాడబడింది. ఇట్లాంటిదే 'లేక వున్నది' అనేది కూడ. ఇది నేటి పాలమూరు మాండలికంలో కూడ కనిపిస్తుంది.

వీరాస్వామయ్యగారి శైలి చాల చోట్ల ప్రసన్నంగా ద్రాక్షాపాకంలో ఉంటుంది. ఒకటి రెండు చోట్ల మాత్రం డొంక తిరుగుడు వాక్యాలున్నాయి. వీటిలో అన్వయక్లిష్టత ఎక్కువ.

ఉదా: "వారున్ను భగవత్సృష్టిలో చేరినవారై తద్వారా నా సహోదరులయిన వారికి నావల్ల హింస కావడము యుక్తము కదనిన్ని క్రోధము పాపకాది అనిన్ని యీశ్వరుడు నా బుద్ధికి తోపింపి చేసిన వాడయి నాకుండా ఆ దొరలను మళ్ళీ ప్రార్థింపబడేటట్లు చేసి వారి జీవనాలు కాపాడినాడు.' (పేజి 186).

సర్కారు ఉత్తర్వులకు వ్యతిరేకంగా జూసీ సరాయిలో వీరాస్వామయ్య గారి మూటా ముల్లెలను శోధించిన సుంకపు బంట్రోతులను కొలువు నుండి తీసి వేసేటట్టు నిర్ణయమైంది. కాని వీరాస్వామయ్యగారు దొరలను ప్రార్థించిన తర్వాత ఆ బంట్రోతులను క్షమించి వదలి పెట్టారట ఈ విషయాన్ని ఇంత సూటిగా కాకుండా వీరాస్వామయ్య గారు పై విధంగా తిప్పి చెప్పాడు.

ఇక్కడ వీరాస్వామయ్య గారి చొరవ వల్లనే ఆ బంట్రౌతులు రక్షింపబడినప్పటికీ, భగవంతుని కర్తను చేసి ఆయన కటాక్షం వల్లనే ఇదంతా జరిగినట్లు వ్రాశాడు.

## XXIV నాణాలు :

నాణాలు చరిత్ర నిర్మాణానికి శకలాల వంటివి. సమకాలంలోని నాణాలు నాటి ఆర్థికవ్యవస్థ యొక్క మారకపు చిహ్నాలైతే, అనంతర కాలంలో చరిత్రకు ఆధారాలుగా ఉండవచ్చు. నేటి చరిత్రకారులు నాణాలు లభించిన స్థలాలను బట్టి అక్కడ ఏయే రాజవంశాలు వర్ధిల్లినాయో ఊహించగలుగుతున్నారు. ఐతే 19 వ శతాబ్దం పూర్వార్ధంలో అంటే దాదాపు 160 సంవత్సరాల కిందట ఏనుగుల వీరాస్వామయ్య గారు తన ప్రయాణంలో తటస్థించిన పలు నాణాల గురించి అప్పటికప్పుడు తన కర్థమైన విలువల గురించి అక్కడక్కడ పేర్కొన్నాడు. ఈ నాణాల విలువలకు ఆయన యాదృచ్ఛికమైన అనుభవమూ, విచారణలే ఆధారం కాని ఆర్థికశాస్త్ర రీత్యా ఉండే నిక్కచ్చితనం ఉంటుందని చెప్పడం కష్టం. ఈ దృష్టితో వీరాస్వామయ్యగారి అనుభవం వల్ల ఒకే పేరుగల నాణాలకు వేరువేరు చోట్ల విలువల వ్యత్యాసం ఎట్లా ఉందో కొంతవరకు తెలుసుకోవచ్చు. ఆ రకంగా ఆయన పేర్కొన్న డబ్బుకు సంబంధించిన సమాచారం విలువైంది గానే తోస్తుంది.

వీరాస్వామయ్య గారి కాలంనాటికి అనేక రకాల నాణాలు చెలామణిలో ఉన్నాయి. వాటిలో ప్రాచీన కాలం నుండి వస్తున్న నాణాల పేర్లు కనిపిస్తాయి. కాకతీయుల కాలం నుండి అమలులో ఉన్న 'వరహా' ప్రసక్తి అట్లాంటిదే.

అహోబిళ క్షేత్రలో 'ఉత్సవ కాలమందు 400 వరహాల హాశ్శీలు (యాత్రా సుంకం) వసూలవుచున్న'దని వీరాస్వామయ్యగారు వ్రాశాడు. వరహాల విలువల్లో తేడాలున్నాయి.[138] వీరాస్వామయ్య గారు ఏ వరహాను దృష్టిలో పెట్టుకొని వ్రాశారో తెలియదు. మొత్తంమీద వరహా ఆ కాలంలో అన్ని నాణాలకంటే విలువైంది. ఈ లెక్కన అహోబిళక్షేత్రంలో యాత్రికులనుండి వసూలైన ఆదాయం 1400-1600 రూపాయల మధ్య ఉంటుందన్నమాట:

---

138. పెగోడా అనే పేరుగల బంగారునాణెం. దీన్నే 'పూల వరహా' అంటారు. Star Pagoda. దీని ఖరీదు రు. 3-8-0. దీనికి ఒక ప్రక్క భగవతి విగ్రహం, రెండో ప్రక్క నక్షత్రం బొమ్మలూ ఉండేవి. ఇంకోరకం వరహా పేరు 'కరకు వరహా' దీని ఖరీదు రు. 4-0-0.

అట్లాగే అన్నిటికన్న తక్కువ విలువకలది గవ్వ. ఇది నాణెం కాదు. వస్తువుల మార్పిడికీ, లోహనాణాల ముద్రణకీ మధ్యకాలంలో ఉపయోగించిన మారకపు విలువ. ఇది ప్రస్తుతం వాడుకలో లేకున్నా 'గవ్వకు కొరగాడు' అనే సామెత మాత్రం ఇంకా జనవ్యవహారంలో ఉంది.

వీరాస్వామయ్య గారి కాలంనాటికి ఇంకా 'గవ్వలకు' మారకపు విలువ ఉన్నట్టు తెలుస్తున్నది. చెన్నపట్టణంలో వాటి విలువ వీరస్వామయ్య గారిట్చారు:

"చెన్నపట్టణపు రూపాయికి అకడి పయిసాలు 50. పయిసా 1 కి 20 పుంజీల గవ్వలు. పుంజీ 1 కి గవ్వలు 4."

గవ్వల మారకం గాయాక్షేత్రం దాకా వ్యాపించినట్లు వీరాస్వామయ్య గారి మాటలవల్ల తెలుస్తున్నది.

అణాలు, అర్ధలు, పావులాలు, చెన్నపట్టణపు దుడ్లు కడప విడిచిన వెనుక దొరకవు' అన్నాడు వీరాస్వామయ్యగారు![139] వాటి విలువలు ఇట్లున్నాయి:

దుడ్డు = 2 పైసలు.
అణా = రూపాయిలో 16 వ వంతు.
పావులా = 4 అణాలు.
అర్ధ = 8 అణాలు. రూపాయిలో అర్ధభాగం. కాబట్టి అర్ధరూపాయి.

శ్రీశైలం వెళ్ళే దారిలో సిద్ధాపురం దగ్గర చెంచులు మనిషి ఒక్కంటికి మూడు డబ్బుల యాత్రా సుంకం వసూలు చేస్తున్నారని వీరాస్వామయ్యగారు వ్రాశాడు. ఐతే చెన్నపట్టణంలో డబ్బుల మారకం లేదు. అట్లాగే శ్రీశైలం ప్రాంతంలో చెన్నపట్టణంలోని నాణాలూ చెల్లవు. అందుకే వీరాస్వామయ్యగారు చెన్నపట్టణపు దుడ్లను డబ్బులుగా మార్చుకోవాలన్నారు.

"డబ్బులు అనగా చెన్నాపట్టణపు రెండు దుడ్లు...అణాకు మూడు డబ్బు లవుచున్నవి."[140]

కాబట్టి ఆయన దుడ్లను, అణాలను కూడ డబ్బుల క్రింద మార్చుకొని ఖర్చు పెట్టుకోవలసి వచ్చింది.

---

139. కాశీయాత్ర చరిత్ర. పెజి. 31.
140. కాశీయాత్ర చరిత్ర. పేజీ. 15.

'నాగపూరి రూపాయికి 82 దుడ్లు' అన్నా 'గయలో రూపాయికి 64 పయిసాలు' అన్నా ఒకటే. చెన్నపట్టణపు దుడ్డుకు 2 పైసలు కాబట్టి మారకపు విలువలో గయా, నాగపూరు ప్రాంతాల్లో నష్టమేమీ లేదు. కాని హైదరాబాద్‌లో చెన్నపట్టణం రూపాయికి 40 పైసలే ఇస్తారు. అంటే 10 పైసలు నష్టం వస్తుంది. అందుకే వీరాస్వామయ్యగారు నాగపూరులో ప్రయాణిస్తున్నప్పుడు రూపాయల మార్పులో హైదరాబాదువలె చెయ్యికి చెయ్యి నష్టం తగలదన్నారు.[141]

వీరాస్వామయ్య గారికి కాశీలోని రూపాయలకు చెన్నపట్టణంలోని రూపాయలకు ఒక అణాభేదం కనబడింది. చెన్నపట్నపు రూపాయిలే చిన్నవట! కాశీలో ఒక "రూపాయికి 16 గండులనే 64 పయిసాలు."[142] నాగపూరు గయా ప్రాంతపు మారకపు విలువకు ఇది సరిపోతున్నట్టుంది. గండులంటే 'వరహా' అన్నాడు బ్రౌన్. కాని అది ఏ విలువలో వాడబడిందో తెలియదు. 4 పైసల విలువ ఉన్న గండును నాలుగు రూపాయల విలువగల 'వరహా'తో పోల్చటంలో ఎంతో వ్యత్యాసమున్నట్లు తోస్తుంది. బహుశా కాశీలోని గండులే చెన్నపట్టణంలోని అణాలయి ఉంటాయని ఊహించవచ్చు.

'ప్రయాగ మొదలుగా దక్షిణదేశం వస్తుంటే చెన్నపట్టణపు రూకలు దుడ్ల లెక్క.'[143]

రూక అంటే ఒక వెండి పణం లేదా వెండి నాణెం. రెండు డబ్బులు, నాలుగు దుడ్లు, 1¼ అణాతో సమానం. 16 అణాలకు ఒక రూపాయి అయితే చెన్నపట్టణంలో రూపాయికి 13 రూకల విలువ ఉంటుందన్నమాట!

ఈ విధంగా వీరాస్వామయ్య గారు పేర్కొన్న నాణాల విలువలు ఆనాటి డబ్బు విలువలపై, వాటి తేడాలపై కొంత వెలుగును ప్రసరిస్తాయి.

---

141. "ఇక్కడ నాగపూరి రూపాయి అనేది ఒక్కటే చెలామణి. రూపాయల మార్పులో హైదరాబాదువలె చెయ్యికి చెయ్యి నష్టం తగలదు...నాగపూరు రూపాయి 1కి ఇక్కడి దుడ్లు 82." —కాశీయాత్ర చరిత్ర. పేజీ. 72.

142. కాశీయాత్ర చరిత్ర. పేజీ. 1‿4.

143. కాశీయాత్ర చరిత్ర పేజీ. 317.

# 2. వెన్నెలకంటి కాశీయాత్ర

## i. పుస్తక పరిచయం :

వీరాస్వామయ్య గారు మద్రాసులోని సుప్రీంకోర్టులో హెడ్ ఇంటర్‌ప్రిటర్‌గా పనిచేస్తున్న కాలంలోనే, మరో కోర్టు (సదర్ అదాలత్ కోర్టు)లో వెన్నెలకంటి సుబ్బారావు కూడా అదే పదవిలో ఉంటూ వచ్చాడు. ఏనుగుల వీరాస్వామయ్య గారు 1830లో ఒక సంవత్సరం కాశీయాత్ర చేసి దినచర్యగా వ్రాసిన సంగతుల్లో ఆయన వ్యక్తిగత జీవితం, కుటుంబ గాథ వ్యక్తం కాలేదు. కాగా సమకాలీన సంఘాన్ని గురించి, ఇంగ్లీషువారి పాలనా వ్యవస్థగురించి ఎన్నో విశేషాలు తెలియచేశాడు.

సుబ్బారావు స్వీయ చరిత్ర అట్లాంటిది కాదు దినిలో కాశీ రామేశ్వర యాత్రల ప్రసక్తితో పాటు ఈయన కుటుంబ జీవితం, బంధువులు, సాంఘిక జీవన స్థితిగతులు, అప్పటి ఇంగ్లీషు అధికారులతో తనకున్న సంబంధాలు, వారి గొప్ప మనసు-ఇవన్నీ ఈయన జీవయాత్రలో భాగంగా స్వీయ రచనలో చోటు చేసుకున్నాయి.

ఐతే సుబ్బారావుగారు తమ జీవయాత్రకు సంబంధించిన రచన తెలుగులో చేయలేదు. 1839లో A Life journey of V. Soob row అనే పేరుతో స్వీయ చరిత్ర వ్రాసి అచ్చువేయించకుండానే వెళ్ళిపోయాడు 144 తర్వాత ఆయన కుమారుడు వెన్నెలకంటి వెంకట గోపాలరావు 1873లో ఈ వ్రాత ప్రతిని మద్రాసులో The Life of Vennelacuntry Soob row అన్న పేరుతో ముద్రింపచేశాడు.

---

144. ఇంగ్లీషులో గ్రంథరచన చేసిన భారతీయుల్లోనే ఈయన మూడవ వాడని తెలుస్తున్నది. 1. కావలి వెంకట బొర్రయ్య (మెకంజీ అనుచరుడు). 2 రాజా రామమోహన రాయలు. 3 వెన్నెలకంటి సుబ్బారావు.

డా॥ అక్కిరాజు రమాపతిరావు గారు దీన్ని వెలుగులోకి తెచ్చి 1976లో తెలుగులో అనువదించారు. అదే 'వెన్నెలకంటి సుబ్బారావు జీవయాత్ర చరిత్ర' అయింది.

వీరేశలింగం పంతులు తెలుగులో స్వీయ చరిత్ర రచనకు తానే ఆద్యుడనని చెప్పుకున్నాడు. కాని ఆయనకు వంద సంవత్సరాల ముందు జన్మించిన వెన్నెలకంటి సుబ్బారావు స్వీయచరిత్ర కూడ ఒక రకంగా తెలుగులో స్వీయ చరిత్ర పరంపరలో ప్రాచీనమైనదని చెప్పవచ్చు. కాని ఇది ఇంగ్లీషులో వ్రాయబడింది కాబట్టి తెలుగు సాహిత్య ప్రక్రియ కిందకి రాదు. ఐతే తెలుగువాడు ఇంగ్లీషులో వ్రాసిన మొట్టమొదటి స్వీయ చరిత్ర అని చెప్పుకోవడానికి విప్రతిపత్తి ఏమీ ఉండబోదు.

సుబ్బారావు లాగే ఇంగ్లీషులో యాత్రారచన చేసిన తెలుగు మహిళ గురించి ఈ సందర్భంగా ప్రస్తావించడం అప్రస్తుతమేమీ కాదనవచ్చు.

## ii. పోతం జానకమ్మ ఇంగ్లండు యాత్ర :

పోతం జానకమ్మ 1860 లో తన భర్త రాఘవయ్యగారితో కలిసి ఇంగ్లండు, యూరప్‌లకు యాత్ర చేసినట్లు తెలుస్తున్నది. ఈమెను విదేశయాత్ర చేసిన తొలి తెలుగు మహిళగా భావిస్తున్నారు. తన యాత్రానుభవాలను క్రోడీకరిస్తూ 'Pictures of England' అనే గ్రంథం ప్రకటించినట్లు కూడ తెలుస్తున్నది. జానకమ్మ గారి యాత్రా వివరాల గ్రంథం ఇంగ్లీషులో రచింపబడటంవల్లనోయేమో, తెలుగునాట అంతగా ప్రసిద్ధి కెక్కినట్లు లేదు. ఇది ప్రస్తుతం లండన్‌లోని ఇండియా ఆఫీసులో ఉన్నట్లు తెలుస్తున్నది. ఈమె విదేశీ యాత్రానుభవాల గురించి తెలుగులో కొక్కొండ సంపాదకత్వంలో వెలువడ్డ 'ఆంధ్రభాషా సంజీవని' పత్రికలో చక్కని వ్యాసం ప్రకటించారు. వ్యాస ప్రకటన తేది ఫిబ్రవరి 1874. జానకమ్మ గారి గ్రంథం పూర్తిగా చదివితేగాని దానిలోని విశేషాలు తెలియరావు [145]

---

145. జానకమ్మ గారు ఇంగ్లీషులో వ్రాసిన ప్రతిని లండన్ నుండి తెప్పించడానికి ఈ పరిశోధకుడు చేస్తున్న ప్రయత్నాలు త్వరలో ఫలిస్తాయని ఆశ.

ఈమె యాత్రాకాలం నాటికి సూయజ్ కాలువ నిర్మాణం కాలేదు కాబట్టి జానకమ్మ గుడ్ హోప్ అగ్రాన్ని చుట్టి తొలినాళ్ళలో సాగిన సముద్ర మార్గం ద్వారానే ఇంగ్లండు చేరి ఉంటుందని ఊహించడానికి అవకాశముంది

## iii. సుబ్బారావు వ్యక్తిత్వం :

సుబ్బారావు జన్మించి రెండు శతాబ్దాలు దాటింది. వెన్నెలకంటి జోగన్న, వెంకమ్మల తొలి సంతానంగా 28-11-1784 న జన్మించాడు.

సుబ్బారావు గారికి చిన్నతనంలోనే తండ్రి చనిపోవటం, కుటుంబ భారం నెత్తిమీద పడటం కారణాలుగా కష్టసహిష్ణుత అలవడింది. పరిమితమైన జ్ఞానంతో మొదట చిన్న ఉద్యోగం సంపాదించుకొని, క్రమంగా స్వశక్తితో మద్రాసులోని సదర్ అదాలత్ కోర్టులో స్వదేశీయులు గర్వపడే ఉన్నతోద్యోగాన్ని పొంద గలిగాడు.

ఆ రోజుల్లో తెలుగువారు ఇల్లు కదిలి వెళ్ళడమే గొప్ప. అట్లాంటిది సుబ్బారావు ఉద్యోగాల పేరుతో దక్షిణదేశం ఈ కొసనుండి ఆ కొసదాకా ఎన్నోసార్లు ప్రయాణించాడు. దేశ పర్యటన వల్ల హృదయ వైశాల్యం ఏర్ప డింది. జనవాళ్ళకు దూరంగా ఉండటంవల్ల వారిపై మమకారంతో ఆశ్రయించిన బంధువు లందరికీ జీవనోపాధి కల్పించాడు. సమర్థుడైన ఇంటర్‌ప్రిటర్‌గా అధికారుల ప్రశంసలు పొందాడు. సన్మానాలకు పాత్రుడయ్యాడు.

మైసూరు మహారాజావారు శ్రీరంగపట్నం మొదటిసారిగా దర్శించి నప్పుడు వీరి ప్రతిభా సామర్థ్యాలను గురించి విని జోడు శాలువలు బహూక రించాడు.

సదర్ అదాలత్ కోర్టులో రిజిష్ట్రారుగా పనిచేసిన జార్జి కె. కసమేజర్ గారు నెల్లూరు జిల్లాకు జడ్జిగా నియుక్తుడై వెళ్ళిపోతున్నప్పుడు, 'ముచ్చటైన వెండి ముక్కుపొడి డబ్బీ'ని సుబ్బారావుకు బహుమానంగా ఇచ్చాడు.

సుబ్బారావు చిత్తశుద్ధితో ప్రభుత్వ వ్యవహారాలను నిర్వర్తించేవాడన డానికి ఎన్నో ఉదాహరణ లివ్వవచ్చు. అడుగడుగునా అనారోగ్యంతో బాధ పడుతూనే పై అధికారులు ఊహించని రీతిలో కోర్టు పనులు చక్కబెట్టాడు. కెనరా జిల్లా కోర్టులో ఏకకాలంలో ఇంటర్ ప్రిటర్‌గా, ట్రాన్స్‌లేటర్‌గా బాధ్య తలు నిర్వహించాడు. మద్రాసులో నాలుగైదేళ్ళుగా పేరుకుపోయిన పనంతా ఒక్క సంవత్సరంలో సహాయకులెవరూ లేకుండానే పూర్తిచేశాడు.

విరామ మెరుగని పరిశ్రమ, నిరంతరం భాషాపరివర్తన కోసం కృషి చేయటం, నిర్దుష్టమైన నుడికారంతో కూడిన ఇంగ్లీషు భాషా పరిజ్ఞానం- ఇవన్నీ ఆయన్ని అసాధారణ ప్రతిభావంతుని చేశాయి. అధికారుల ప్రేమాదరాలకు పాత్రం చేశాయి.

జె. కసమేజర్‌గారు సుబ్బారావుగారి గుణసంపదను ఇట్లా కొనియాడారు:

"వెన్నెలకంటి సుబ్బారావు అత్యంత సమర్థుడైన దేశీయోద్యోగి...ఇంతటి సమర్థతను నేనిదివరకెక్కడా చూడలేదు. ఈయన స్థానంలో మరొకరి నెవరి నైనా నియమించవలసి వస్తే అది అతి దుస్సాధ్యం."146

ఈయన సమకాలీనుడు, బంధువూ ఐన పిరాస్వామయ్యగారు కూడ ఇట్లాంటి దక్షతతో ఇంగ్లీషువారి మెప్పును పొందాడు. వీరిద్దరూ తెలుగువాళ్ళు కావడం తెలుగు దేశానికి గర్వకారణం.

## iv. కాశీయాత్ర :

వెన్నెలకంటి సుబ్బారావు మొదటినుండి జబ్బుమనిషి. ఒకరొకరుగా ఆత్మీయులందరూ కనులముందే చనిపోవటం, ఉద్యోగధర్మంలో తలమునక లుగా శ్రమించి పనిచేయటం మూలంగా ఆరోగ్యం క్రమంగా క్షీణించింది. విప రీతంగా జబ్బుపడి రెండు మూడుసార్లు మృత్యువు తలుపు తట్టి వచ్చాడు కూడా.

146. వెన్నెలకంటి సుబ్బారావు జీవయాత్ర చరిత్ర. పేజీ. 62.

ఇట్లాంటి అనారోగ్యదేహంతో ఆ కాలంలో 55 సంవత్సరాలు జీవించి, ఉత్తర దేశంలో కొంతభాగం, దక్షిణదేశం విస్తృత యాత్రలు చేశాడు. ఈయన యాత్రలు ఎక్కువగా గాలిమార్పుకు సంబంధించినవే.

1832 వ సంవత్సరంలో సుబ్బారావు తన 38 వ యేట మూత్ర కోశ వ్యాధితో, భరించలేని మోకాళ్ళ నొప్పితో బాధపడ్డాడు. మూడు నెలలు సెలవు పెట్టినా తగ్గలేదు. మొదట ఉద్యోగ విరమణ చెయ్యాలనుకున్నాడు కాని, మిత్రుల సలహాపై దూర ప్రాంతాలకు యాత్ర తలపెట్టాడు. అక్కడి వాతావరణం ఆరోగ్యాన్ని కుదుటపరుస్తుందని చెప్పటంతో, అధికారుల అనుమతితో ఆరు నెలల సెలవు తీసికొని సుబ్బారావు మద్రాసునుండి 8-8-1882న బయలుదేరాడు. వెంట ఆయన భార్య, కొంతమంది పరిజనం ప్రయాణించారు.

ఆయన ప్రయాణించిన మార్గంలో తటస్థ పడ్డ గ్రామాలు, పట్టణాల పేర్లు ఈ విధంగా ఉన్నాయి. ఈ మార్గం మద్రాసునుండి బయలుదేరి కాశీ చేరుకుని మళ్ళీ మద్రాసు చేరుకునే వరకు ఇవ్వబడింది.

మద్రాసు - నెల్లూరు - ఒంగోలు - గుంటూరు - ఏలూరు - రాజమండ్రి - పెద్దాపురం - పిఠాపురం - విజయనగరం - శ్రీకాకుళం - గంజాం - పూరీ జగన్నాథం - కటక్ - మహానది - బాలేశ్వరం - మేదినీపూర్ - హాజీపూర్ - హజారీబాగ్ - కోసల - గయ - ఫరక్‌బాద్ - మొగల్‌సరాయి - కాశీ - ప్రయాగ - ఘాజీపూర్ - బక్సర్ - బందా - మూంగేరి - బాగల్పూర్ - మూర్షిదాబాద్ - హుగ్లీ - కలకత్తా - జేలేశ్వరపట్నం - కటక్ - జగన్నాథం - సౌరాష్ట్రి - గంజాం - ఇచ్చాపురం - శ్రీకాకుళం - నందిగాం - బొబ్బిలి - విజయనగరం - సింహాచలం - అనకాపల్లి - ఎలమంచిలి - పిఠాపురం - పెద్దాపురం - రాజానగరం - రాజమండ్రి - ఆచంట - కొల్లూరు - బాపట్ల - చీరాల - ఒంగోలు - నెల్లూరు - మద్రాసు.

సుబ్బారావు మద్రాసుకు చేరుకున్న తేదీ 10-9-1833. అంటే పదమూడు నెలల సుదీర్ఘ యాత్ర ఇది. మొదట ఆరునెలల సెలవు మీదనే బయలుదేరాడు. మేదినీపూర్ చేరుకునే సరికి పెద్దపెట్టున జ్వరంతో చాలా జబ్బు చేసింది. మద్రాసుకు తిరిగిపోవాలన్న నిర్ణయానికి వచ్చాడు. కాని కొంత కాలం అక్కడే ఉండి ఆరోగ్యం కుదుట పడ్డాక, కాశీ అక్కడికి దగ్గరే అని విని సెలవు పొడిగించుతూ కాశీకి బయలుదేరాడు. మద్రాసు వదిలిపెట్టే సమయానికే కాశీకి వెళ్ళా

లనే ఆలోచన ఉండేదనీ, ఐతే ఈ విషయం ఎవరికీ చెప్పలేదనీ వ్రాసు కున్నాడు.[147]

సుబ్బారావు కాశీనుండి తిరుగు ప్రయాణంలో కలకత్తా వరకు గంగా నదిపై బోటులో ప్రయాణం చేసినట్లు చెప్పుకున్నాడు. కాని మిగతా ప్రదేశాలకు ఏ విధంగా యాత్ర చేశాడో, ఆ యాన సాధన లేమిటో ఎక్కడా పేర్కొనలేదు. ఐతే యాత్రకు ముందు 'శరీరంమంతా భరించలేని నొప్పులతో, మూత్రకోశ వ్యాధితో' బాధపడ్డానని వ్రాసుకోవడం వల్ల ఆయన కాలినడకన ప్రయాణం చేయలేదని భావించవలసి వస్తున్నది. ఎడ్లబండ్లపై అంతదూరం ప్రయాణిం చడం కూడ అసాధ్యమైన సంగతి. బహుశా వీరాస్వామయ్యగారి లాగా పల్లకీలో యాత్రచేసి ఉంటాడని ఊహ చేయవలసినదే.

యాత్రా మార్గంలో ఊళ్ళ పేర్లను క్రమంగా, తేదీల వారీగా పేర్చుకుంటూ పోవడం తప్ప ఈయన చేసిన యాత్రలో విశేషాలేమీ వ్రాయలేదు. మధ్య మధ్య అనారోగ్యం, కాశీ గయ ప్రయాగల్లో నిర్వర్తించిన కర్మకాండ, మార్గమధ్యంలో ఏయే పరిచితుల, బంధువుల యిళ్ళల్లో బస చేసిందీ యథాలాపంగా వ్రాస్తూ వచ్చాడు. గయావళీల నిర్బంధం గురించి వివరంగా వ్రాయకుండా టూకీగా తేల్చివేశాడు.

యాత్రా ప్రారంభంలో గుంటూరులో సతీ సహగమనం ప్రత్యక్షంగా చూసినట్లు చెప్పిన సంఘటన ఒక్కటే, యాత్ర అంతటిలో ఆసక్తికరమైన విషయంగా తోస్తున్నది [148]

కాశీయాత్ర తర్వాత కాశీ సంతర్పణం నిర్వర్తించి, మరి రెండున్నర సంవత్సరాల తర్వాత కాశీగంగతో శివలింగాన్ని అభిషేకించడానికి సకుటుంబంగా రామేశ్వర యాత్ర చేశాడు. అది ముందు ముందు వివరింపబడుతుంది.

---

147. "నా అంతర్యము ఐతే కాశికి వెళదామనే కాని, అది మాత్రం బయట పెట్టలేదు. నా జ్ఞాతిసోదరుడు వెంకట కృష్ణయ్యకు కాని, ఇతర సోదరు లకు కాని యీ విషయం నేను తెలియపరచలేదు."
—వెన్నెలకంటి సుబ్బారావు జీవయాత్రా చరిత్ర. పేజీ. 41

148. "గుంటూరులో తూము పాపయ్య గారనే ఆయన చనిపోగా, ఆయన భార్య ఆనాడు సహగమనం చేయడం నేను చూశాను. భర్త శవానికి ముట్టించిన చితిని ఆమె ఎక్కి సహగమనం చేసింది."
—వెన్నెలకంటి జీవయాత్రా చరిత్ర. పేజి 41.

## ఇతర కాశీయాత్రలు

# 3. చెళ్లపిళ్ల కాశీయాత్ర

గత శతాబ్దం ప్రారంభంలో అవధానాల పేరిట ఆంధ్రదేశమంతటా 'నానారాజసందర్శనం' చేసిన తిరుపతి వేంకట కవులలో చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారొకరు. ఈయన 1870లో జన్మించాడు.

శాస్త్రిగారికి తల్లిదండ్రులు పెట్టిన పేరు వేంకటాచలం. చామర్లకోటలో మాధుకరం ఎత్తుకొని లఘు కౌముదిని, భావవినీ చదువుకున్నాడు, తర్వాత బ్రహ్మశ్రీ చర్ల బ్రహ్మయ్య శాస్త్రిగారి వద్ద సిద్ధాంత కౌముది నేర్చుకోవడం ప్రారంభించాడు. ఈ కాలంలోనే గురువాగా రీయనకు 'శాస్త్రి' బిరుదును ప్రసాదించగా. వేంకటశాస్త్రి అయ్యాడు. దివాకర్ల తిరుపతి శాస్త్రిని సహాధ్యాయిగా చేసుకొని శాస్త్రాలు, వ్యాకరణం అభ్యసించాడు,

### i. కాశీయాత్ర సంకల్పం :

శాస్త్రిగారు గురువుగారి వద్ద చేరడానికి ముందే బ్రహ్మయ్య శాస్త్రులు కాశీకి వెళ్ళి వచ్చాడు[149] తరచుగా గురువుగారి నోట కాశీ విశేషాలు విని ఉండడంవల్ల అయా విశేషాలు చూసి తీరాలనే అభిలాష వేంకటశాస్త్రిగారికి కలిగింది. ఇంతకు పూర్వం ఏడెనిమిది సంవత్సరాలుగా యానాంలో గడిపాడు. దాంతో పట్నవాసపు అభ్యాసాలు అలవాటయ్యాయి. గురువు గారుండే కడియొద్ద పల్లెటూరు. యానాంలోవలె ఇక్కడ తాంబూలం వేసుకోవటం దుర్లభమైంది. కాశీలో సత్రాలలో భోజనంతోపాటు ప్రతిరోజూ తాంబూలం తప్పకుండా ఇస్తారని విన్నాడు కనుక కాశీకి వెళ్ళాలనే కోరిక మరింత బలపడింది.

---

149 బ్రహ్మయ్య శాస్త్రులుగారు కాశీలోఉన్న సమయంలోనె కర్లంపూడి నుండి తేజోమూర్తుల అన్నపూర్ణమ్మ అనే ఆడ ఉత్తర దేశ యాత్రలు చేస్తూ కాశీకి వెళ్ళిందట. కాశీయాత్ర. పేజీ. 10.

వీరాస్వామయ్య గారి కాలం వేరు. అప్పుడు ఏ హంగులూ లేని ఒక సామాన్య వ్యక్తి కాశీకి యాత్ర చేయడమంటే జీవితం మీద ఆశ వదులుకోవడమే నన్నమాట! తిరిగి వస్తామో లేదో నన్న అనిశ్చిత పరిస్థితుల్లో అప్పటి యాత్రలు కొనసాగేవి.

యాభై అరవై సంవత్సరాలు గడిచేసరికి ప్రయాణ సౌకర్యాలు మెరుగ య్యాయి. బ్రిటిషువాళ్ళు స్వప్రయోజనం కోసం వేయించిన రైలు మార్గాలు దూర తీరాలకు యాత్రలను సుగమం చేశాయి.

1889లో అంటే తన పందొమ్మిదవ యేట శాస్త్రిగారు కాశీయాత్ర తల పెట్టాడు. కనీసం పన్నెండేండ్లయినా కాశీలో ఉండి పాండిత్యం సంపాదించి రావాలని ఆయన కోరిక. ఐతే కన్నవాళ్ళు కూడ సకాలానికి రాలేనంత అనూ హ్యంగా ఒక ఐదేండ్ల అమ్మాయితో శాస్త్రిగారి వివాహం జరిగింది. పెండ్లి ఆయన కాశీయాత్ర సంకల్పాన్ని ఆపలేకపోయింది. కాగా కోరినంత కాలం కాశీలో ఉండడానికి అనుకూలంగానే ఉందని భావించాడు కూడ.[150] తర్వాత నెల రోజులకే కాశీయాత్రకు బయలుదేరాడు.

## ii. డబ్బు సమస్య :

కాశీకి వెళ్ళాలనే ఆలోచన దివ్యంగానే ఉంది కాని డబ్బుతో సమస్య వచ్చి పడింది. పురాణ పఠనం విని సంపన్న గృహస్థులు ఐదో, పదో యిస్తే గురువు గారి వద్ద దాచుకున్నాడు కాని అవి కాశీకి వెళ్ళేందుకు సరిపోవు.

అప్పటికి రైలు కలకత్తా నుండి విజయవాడ దాకా వచ్చింది. ఇక్కడి నుండి కాశీకి వెళ్ళాలంటే ఆ కాలంలో (1889లో) 18 రూపాయల రైలు ఛార్జీ. ఈ సమయంలోనే గురువుగారి తల్లి 'శత వృద్ధురాలు' స్వర్గస్థురాలైంది.

---

150. పెండ్లి నాటికి శాస్త్రిగారి వయస్సు 19 సంవత్సరాల నాలుగు నెలలు. పెండ్లి కుమార్తెకు ఐదేండ్లు మాత్రమే. అందుకే "నేననుకొన్నంత కాలమున్నా కాశీలోనున్నను భార్యా ప్రతిబంధమేమియున్ని వుండదని వూహించుకొన్నాను" అని శాస్త్రిగారు వ్రాశాడు. -కాశీయాత్ర. పేజి 8.

'శాస్త్రులుగారు కొన్నాళ్ళ వరకు మనకు పాఠాలు చెప్పలేరు. ఈ మధ్య మనకు విద్యా విఘ్న మెట్లాగూ తప్పదు. కాబట్టి కాశీకి వెళ్ళుదమా' అని సహాధ్యాయి కందుకూరి కృష్ణశాస్త్రితో చెళ్ళపిళ్ళ వారు ఆలోచించారు. కాశీకి వెంటనే వెళ్ళాలని నిశ్చయించుకున్నారు. అప్పుడు కృష్ణశాస్త్రి దగ్గర అరణాలు, వేంకటశాస్త్రిగారి వద్ద మూడు డబ్బులు మాత్రమున్నాయి. బెజవాడకు పోయేలోపు రైలు టిక్కెట్లకు సరిపడా డబ్బులు సంపాదించాలని సాహిత్యయాత్రకు బయలుదేరారు. గణపవరం మీదుగా నిడమర్రు చేరుకున్నారు. ఈ ఊరు శనివారప్పేట సంస్థానంలోనిది. అక్కడ మొట్టమొదటగా అవధానం చేయాలని తలిచాడు శాస్త్రిగారు. వారు, వీరు చేశారని చెప్పగా విన్నదేకాని అదివరకు చూసిందికాదు, చేసిందికాదు. విధానం అంతకన్నా తెలియదు. అయినా క్రొత్తగా మొదలుపెట్టాలని శాస్త్రి గారు అవధానానికి పూనుకున్నాడు. కృష్ణశాస్త్రికి గూడ కవిత్వంలో ప్రవేశం లేదు.

ఎనమండుగురిని కూర్చోబెట్టి పద్యాలు చెప్పడానికి బదులు ఒక్క కృష్ణ శాస్త్రిగారినే కూర్చోబెట్టి వరసగా ఎనిమిది పద్యాలు చెప్పి అష్టావధానం ముగించాడు. ఈ సభనాటికి అవధాన ప్రక్రియ గురించి అక్కడివారికి అంతగా తెలియదు. కాబట్టి సభ్యులీ రహస్యాన్ని కనిపెట్టలేకపోయారు. ఎట్లాగైతేనేం ఇద్దరి ఖర్చులకు డబ్బు సమకూరింది.

## iii. కాశీకి చేసిన యాత్ర :

అక్కడినుండి గుండుకొలను, ఏలూరుల మీదుగా బెజవాడకు పోయి రైలెక్కారు. ఇక్కడినుండి ఏకంగా కాశీకి ప్రయాణం చేయలేదు. మధ్యలో అనేకచోట్ల మజిలీలు చేశారు.

బోనగల్లు స్టేషనులో దిగి వత్సవాయి గ్రామానికి వెళ్ళారు. ఇక్కడ జొన్నన్నం తినవలసివచ్చింది. తర్వాత జగ్గయ్యపేటలో పురాణం చెప్పారు. ఇక్కడి వైశ్య వృద్ధు డొకాయన వీరిని వారం రోజులుంచుకొని సన్మానించి పంపాడు. మళ్ళీ బోనగల్లుకు వచ్చి రైలెక్కి సికింద్రాబాదులో దిగారు. ఈ పట్టణం చూస్తూ వారం రోజులున్నారట కాని ఇక్కడి విశేషాలేమీ వ్రాయలేదు. వ్రాసి ఉంటే వీరాస్వామయ్యగారి యాత్రాకాలం నుండి ఈ అరవై యేండ్లలో ఏయే మార్పులు సంభవించాయో తెలిసి ఉండేది.

శాస్త్రిగారు ఆయా సందర్భాలలో కవిత్వం చెప్పిన ఆలవాటే కాని దిన చర్యగాని, యాత్రాచరిత్రకాని వ్రాసుకున్నట్టు లేదు. ఇదికూడ తన అరవై నాల్గవయేట (1934 లో) గుర్తుచేసుకొని వ్రాసిన రచనే

సికింద్రాబాదులో రైలెక్కి వాడీ, ధోండు, జబల్‌పూర్ స్టేషన్లలో దిగుతూ వచ్చారు. ప్రయాగలో త్రివేణీ సంగమస్నానం చేశారు తర్వాత నేరుగా కాశీకి ప్రయాణం చేశారు.

ప్రయాణంలో తేదీలు వగైరా తెలుపకపోవడం వల్ల కాశీయాత్ర చేయ డానికి వీరికి ఎన్నిరోజులు పట్టిందో తెలిపే అవకాశం లేదు. కాని 'కాశీకి బయలు దేరినది పుష్య శుద్ధ తదియ, అటనుంచి దేశానికి వచ్చినది ఆషాఢమాసము' అన్న శాస్త్రిగారి మాటలవల్ల మొత్తం ప్రయాణం చేసి రావడానికి ఏడు నెలలు పట్టిందని ఊహించవచ్చు.[151]

నోరి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు కాశీకి వెళ్ళి స్థిరపడ్డ దక్షిణ దేశీయుడు. చర్ల బ్రహ్మయ్యశాస్త్రి గారికి వేదాంతశాస్త్ర గురువు. ఆ విధంగా వేంకటశాస్త్రి గారికి 'గురు గురువులు' ఈయన వద్ద వ్యాకరణం తరువాయి చదవటం మొదలుపెట్టాడు శాస్త్రిగారు. అదే సమయంలో కావ్యపాఠం చదువుకునే ఇద్దరు విద్యార్థులకు గురుత్వం వహించాడు కూడ.

ఈ కాశీ గమన వృత్తాంతం వీరి తల్లిదండ్రులకు తెలిసింది. బ్రహ్మయ్య గారి వద్దకు వెళ్ళి ఎట్లాగైనా అబ్బాయిని రప్పించకపోతే తాము కూడ కాశీకి పోతామని పట్టుపట్టారట. దానితో గురువుగారు శాస్త్రిగారికి ఉత్తరం వ్రాశారు. పన్నెండేండ్లు కాశీలో గడుపుదామనుకున్న శాస్త్రిగారికి వెంటనే స్వగ్రామం రాక తప్పలేదు.

---

151. 'ఈ కాశీయాత్రన్నది నాజాతకరీత్యా చంద్రమహాదశలో శుక్రాంతరంలో తటస్థించింది. వివాహం కూడా దానిలోనే... ఈ శుక్రాంతరం విరోధి సం॥ వైశాఖ బహుళ 13 శి మొదలుకొని, వికృతి సం॥ పుష్య బహుళ 13 శి వఱకు. కాశీకి బయలుదేరినది పుష్యశుద్ధ తదియ. అట నుండి దేశానికి వచ్చినది ఆషాఢ మాసము.' —కాశీయాత్ర. పేజీ 52.

## vi. స్వదేశాగమనంలో పడ్డ ఇబ్బందులు :

శాస్త్రిగారి వెంట వచ్చిన కృష్ణశాస్త్రి కాశీలోనే ఉండి భాష్యాంతం చదువు కొని తర్వాత కొన్ని సంవత్సరాలకు స్వదేశానికి వచ్చాడు.

తిరుగు ప్రయాణంలో వందనపు నర్సయ్య అనే తెలుగుదేశపు 'కోమటి బిడ్డ' తటస్థపడ్డాడు. గయలో విష్ణుపాద దర్శనం చేసుకుని కలకత్తాకు టిక్కెట్టు తీసుకున్నారు. అక్కడ 'అల్లరి చిల్లర జనంతో ఎంతో సంకులంగా వున్న' ఒక ధర్మశాలలో విడిది చేశారు. వారం రోజులున్నా కలకత్తాలో నిలువనీడ దొరకలేదు కాని జగన్నాథం వెళ్ళడానికి తోవ దొరికింది. అది ఆషాఢమాసం. గాలితో పాటు తొలకరి వానలు వంట చేసుకునే వీలులేక రొట్టెలు కొనుక్కొని తింటూ ఆ వారం రోజులు కాలక్షేపం చేశారు.

కలకత్తా నుండి తిరుగు ప్రయాణానికని స్టీమరు టిక్కెట్టు తేవడానికి 16 రూ॥ తీసికొని బయలుదేరిన శాస్త్రిగారిని బంగాళీవాడొకడు నమ్మించి మోస గించాడు. డబ్బు పోతే పోయింది కాని వాడు ఈయనకిచ్చిన పదహారు బెత్తాల సరిక్రొత్త గుడ్డగొడుగు మిగిలినందుకు సంతోషించాడు. దేశాటనంవల్ల అప్పు డప్పుడూ ఇట్లాంటి మోసాలకు గురి కావలసి వస్తుంది. తర్వాత ఎప్పుడో విజయ నగరం మహారాజా వారి దర్శనానికి వెళ్ళినప్పుడు చెప్పిన "పడవలె పడరాని పాటులెల్ల" అన్న పద్యం ఈ సందర్భాన్ని దృష్టిలో పెట్టుకొని చెప్పినదేనని శాస్త్రిగారు పేర్కొన్నాడు.

కలకత్తాలో స్టీమరెక్కి చాందిసీవాలా అనే ఓఢ్ర గ్రామంలో దిగాడు. ఒక దుకాణదారుడి యింటి చావడిలో మకాం చేశాడు. ఇక్కడి జనులు చింతపండు వాడరట! దానికి బదులు లేతమామిడి వరుగులు ఉపయోగిస్తారని శాస్త్రిగారు వ్రాశాడు[152] పదిరోజుల నుండి రొట్టె తప్ప అన్నం దొరకలేదు. అందుకే అక్కడ ఎక్కువగా లభించే ఉప్పుడు బియ్యం అన్నం 'అమృతోపమానంగా' తోచిందట!

---

152. పేరాస్వామయ్య గారి కాలంలో కూడ చింతపండుకు బదులు 'యెండు మామిడి వరుగు' వాడుతున్నట్లు (పేజీ. 294) తెల్పాడు. శాస్త్రిగారు ఈ పదార్థాన్ని 'లేత మామిడి కాయల తాలూకు ఎండబెట్టిన చీలికలు' అంటాడు.

తరువాతి మజిలీ కటకం. దీన్నే శాస్త్రజ్ఞులు కీకటమని వ్యవహరిస్తారంటూ శాస్త్రిగారు "ఢిటిజాధిప కీకటంబు దేహపగయున్" అని దేవీభాగవతంలోని ఉదాహరణ చెప్పాడు. ఈ దేశంలో తీర్థయాత్రకు కాకుండా వేరే కారణాలవల్ల ప్రయాణం చేసినట్లయితే ద్విజులు మరల ఉపనయన సంస్కారం చేసుకోవాలని ధర్మశాస్త్ర వచనమట![153] కాని మళ్ళీ ఉపనయనం జరిగినప్పటికీ పవిత్రత కలుగదనే శాస్త్రిగారి అభిప్రాయం

దారిలో తిన్న ఆహారంవల్ల శాస్త్రిగారికి కాశీలో సంక్రమించిన గ్రహణి వ్యాధి మరింత ఏక్కువయింది. చిన్నప్పుడు నేర్చుకొన్న ఈత ఈ బాధనుండి ఉపశమనం పొందడానికి ఉపకరించిందట! కాలువలో ఉండే లాకుల దగ్గర స్టీమరుకు కొంత ఆలస్యం తప్పదు. కాబట్టి ఈ లాకు ఒక అరమైలు దూరం ఉందనగానే గభాలున కాలువలో దూకి ఈదుకొని ఒడ్డుకు వెళ్ళి 'తరువాయి తీర్చికొని' లాకు దగ్గర పడవను కలుసుకునేవాడట!

కటకం నుండి ఎడ్ల బండిలో ప్రయాణం. ఒకటి రెండు మకాములు (వీరాస్వామయ్య గారు వీటినే మజిలీలు అంటాడు) వెళ్ళేసరికి బండి యెద్దొకటి పడుకోవటం మొదలు పెట్టిందట. ఆ యెద్దుకు బదులు పాపమా బండివాడే కావడి బుజం మీద పెట్టుకొని నడిచాడు. వీలునుబట్టి వీరిద్దరు కూడ నడుస్తూ వచ్చారు. చివరకు ఎట్లాగో జగన్నాథక్షేత్రం చేరుకుని సముద్ర స్నానం చేస్తూ వారం రోజులున్నాడు.

ఇక్కడి నుండి మళ్ళీ బండి కుదుర్చుకుని గంజాంకు బయలుదేరారు. చిలకసముద్రం త్రోవకుండా పోతే పడవలమీద ప్రయాణించవలసి ఉంటుంది.[154] కాని శాస్త్రిగారు 'చుట్టయినా మెట్టమార్గం మేలని' కొందరు చెప్పగా ఆ మార్గాన్నే ఎన్నుకున్నాడు. కలకత్తా నుండి గంజాం దాకా స్వహస్తపాకమే. కటకంలో మాత్రం వేంకటాచలం పంతులు గారింట్లో అతిథ్యం లభించిందట! అదో వారం రోజుల భోగం. మళ్ళీ కష్టాలు మొదలు. వర్షాకాలం కాబట్టి ఒకోసారి

---

153. 'తీర్థయాత్రాం వినా గచ్ఛేత్ పునస్సంస్కార మర్హతి.'

154. ఏనుగులు వీరాస్వామయ్య గారు ఈ మార్గం గుండానే ప్రయాణించాడు.

బండి క్రింద వంట చేసుకొని, ఉడికీవుడకని మెతుకులు తిని, బండి మీద నిద్రించడం - ఇట్లా ప్రయాణం సాగిస్తూ గంజాం చేరుకున్నాడు. అక్కడినుండి సత్రాలలో భోజనం దొరకడం వల్ల వంట బాధ తప్పింది కాని సత్రంలో ఉండగా చెవిపోటు వచ్చిందట! తమలపాకులూ సున్నమూ ఈ రెంటి రసంతో ఆ బాధ పోగొట్టుకున్నాడు అందుకే శాస్త్రిగారు 'తాంబూలము కాశీయాత్ర చేయించడానికే కాకుండా చెవిపోటు వైద్యానిక్కూడా పనికి వచ్చిం'దని వ్యాఖ్యానించవలసివచ్చింది.[155]

గంజాం నుండి సీతారాంపురం మొదలైన గ్రామాల ద్వారా బరంపురం చేరుకుని వారం రోజులున్నారు. కాశి కావళ్ళు ఇంతవరకు ఒక్కసారన్నా మోయలేదు. కాబట్టి ఇక ముందైనా మోయాలని నిర్ణయించుకున్నాడు 16 కి. మీ. దూరంలో ఉన్న గోవిందపురం సత్రానికి బయలుదేరారు, భుజాల మీద కావిళ్ళు పెట్టుకుని.[156] కోమటి లావాటి వెదురుబొంగును, శాస్త్రిగారు సన్నటి బొంగును కట్టించుకున్నారు. ఒకటి రెండు 'కోసులు' నడిచేసరికి అలవాటు లేకపోవటం వల్ల శాస్త్రిగారికి భుజం నొప్పి పెట్టింది. ఇద్దరూ కావిళ్ళు మార్చుకున్నారు. ఐతే గోవిందపురం తర్వాత శాస్త్రిగారు జబ్బు పడ్డ కారణంగా మళ్ళీ బండి మీదనే ప్రయాణం సాగించాడు.

దారిలో రోడ్డుకు కొంచెం దూరంగా ఉన్నప్పటికీ శ్రీకూర్మం, సింహాచలం మొ. క్షేత్రాలు సేవించుకుంటూ తుని చేరాడు. మార్గమధ్యంలో సత్రాల నిర్వహణ చాల ఘోరంగా వుందట !'ఏదో ఆ పూట తిని వెళ్లేవాళ్ళకి సదుపాయమెందుకు? అసలు లేకపోవడం కంటే, ఇంత చారునీళ్ళు అన్నం వుంటే చాలదా?' అని ఆ సత్రపు యజమానుల అభిప్రాయంగా శాస్త్రిగారు గ్రహించాడు.[157]

తుని నుండి పిఠాపురం, చామర్లకోట, కాకినాడ, యానాం చేరుకున్నాడు. ఇక్కడితో కాశీయాత్ర పరిసమాప్తమయింది. ఐతే యానాం సమీప గ్రామం

---

155. కాశీయాత్ర. పేజీ. 43
156 కాశీయాత్ర. పేజీ. 46 '5 కోసులని శాస్త్రిగారు.'
157. కోసుకు 3 2 కి.మీ.

నీలపల్లె దేవాలయంలో కాశీకావడి సహితంగా ఆగి ఇంటికి కబురుచేస్తే, బాజా బజంత్రీలతో ఎదురు వచ్చి ఇంటికి తీసుకు వెళ్ళారట! అప్పటికింకా కాశీ నుండి గంగకావిడి తెచ్చిన వాళ్ళకు ఈ మర్యాద ఉన్నాయని తెలుస్తున్నది.

## V. కాశీవాసము - విశేషాలు :

వేంకటశాస్త్రిగారు తమ యాత్రావిశేషాలను వెంట వెంట దినచర్యగా వ్రాసుకోలేదు. యాత్రానంతరం వెంటనే రచన చేయడానికి పూనుకోలేదు. కాశీయాత్ర చేసిన 44 సంవత్సరాల తర్వాత జ్ఞాపకాల పొరల్లోంచి ఒక్కొక్క విషయాన్ని జాగ్రత్తగా తీసి కూర్చిన రచన ఇది. యాత్రా సందర్భంలో వ్రాసినట్లయితే ఇంకా ఎక్కువ వివరాలు ఇవ్వడానికి అవకాశముండేది. వీరా స్వామయ్య గారివలె వీరికి చారిత్రక దృష్టి తక్కువే. ఆ కాలంనాటి ప్రజల జీవన పద్ధతులు, ఆచార వ్యవహారాలు కూడ ఈ చిన్న పుస్తకంలో అంతంత మాత్రంగానే చోటు చేసుకున్నాయి.

శాస్త్రిగారికి ముందు కాశీలో చదివి అక్కడే పేరుప్రతిష్ఠలు పొంది, తెలుగుదేశానికి వచ్చి స్థిరపడ్డ పండితులెందరో ఉన్నారు. వీరి విద్యార్థి దశనాటికి అంటే 1890 నాటికి 'కాశీ నుంచి వచ్చిన పండితుడంటే వక పెద్ద పర్వతం లాగు మా మనస్సుకు తట్టేవాడు' అని శాస్త్రిగారు వ్రాసుకున్నారు.[158] వ్యాకరణానికి కాశీ, తర్కానికి నవద్వీపం, మీమాంసకు దక్షిణదేశం, వేదానికి కృష్ణా గోదావరీ తీరాలు అనాదిగా ప్రసిద్ధి. వేద శ్రౌతాలు తప్ప తక్కినవన్నీ కాశీలో తెలుగుదేశం కంటె ఎక్కువేనని శాస్త్రిగారి అభిప్రాయం.

కాశీలో అనధ్యయనాల చిక్కు ఎక్కువనీ, చదువు ఇక్కడికన్నా కాశీలో విశేషంగా జరుగకున్నా కాశీ మహాపట్నవాస మనేసరికి ఉల్లాసమనిపించేదని శాస్త్రిగారు సమాధానపడ్డారు.

శాస్త్రిగారు కాశీలో నేర్చుకోదలచిన వ్యాకరణం చెప్పడానికి తెలుగు దేశంలోనే బోలెడు గురువులున్నారు. నిజానికి దీనికోసం కాశీదాకా వెళ్ళనక్కర

158. కాశీయాత్ర. పేజీ 20.

లేదు. ఐనా ఎందుకు వెళ్ళాడంటే - ముందే చెప్పినట్లు గురువుగారి ఊళ్ళో తాంబూలచర్వణానికి వీలు లేకపోవడం అన్నదే ముఖ్య కారణం!

కాశీలో రోజుకు ఎన్నోసార్లు తాంబూలం వేసుకుంటారట! దీనిలో 'సురితీ' కలుస్తుందని శాస్త్రిగారు వ్రాశాడు.[159] ఎవరింటికి వెళ్ళినా ముందు తాంబూలపు సామాను ఎదుట పెట్టిన తర్వాతే మాటాముచ్చట ఉంటుందట! అది ఆ దేశపు ఆచారం.[160]

నారదఘట్టానికి దగ్గరలో ఉన్న అన్నపూర్ణ సత్రంలో చాలామంది సన్యాసులకు 'భిక్ష' జరుగుతూందనీ, ఇంకా రామరాజా (అనంతపురం)సత్రం, తంజావూరు రాజా రాణీల సత్రాలు, సింధ్యా సత్రం కూడ ఉన్నట్లు శాస్త్రిగారు పేర్కొన్నాడు. వీటిలో వీరాస్వామయ్య గారొక్క అన్నపూర్ణ సత్రం గురించి మాత్రమే తెలుపుతూ ఆ కాలంలోనే ఇక్కడ ప్రతిదినం 1500 మందికి అన్నదానం జరుగుతున్నట్లు వ్రాశాడు. ఐతే వేంకటశాస్త్రి కాలంనాటికి ఈ సత్రాల్లో 'కానో అర్ధణో దక్షిణ'గా తీసుకుంటున్నట్లు తెలుస్తున్నది. ఈ పద్ధతి వీరాస్వామయ్య గారి యాత్రా కాలంనాడు లేదు.

కొన్ని సత్రాల్లో భార్యా సహితంగా చదువుకొనే విద్యార్థులకు అన్నం పెడతారట కాని వితంతువులకు ఏ సత్రంలో కూడ ప్రవేశం లేదట! వితంతువులే కాదు ఒంటరిగా ఏస్త్రీ వెళ్ళినా ఇదే మర్యాద జరుగుతుందనీ, మళ్ళీ కేవలం మగవారు కాని, వారితో కలిసి స్త్రీలు కాని వెళ్తే భోజన సదుపాయం ఉంటుందనీ శాస్త్రిగారు వ్రాశాడు. ఉర్లాం జమీందారు బసవరాజుగారు కాశీలోని పండితులను సమ్మానించడంలో ఏదో అనుచితం జరగడం వల్ల వీరి జాతి వారి (లింగ

---

159. సున్నం కలిపి నలిపిన పొగాకును 'సురితీ' అంటారు. (పేజీ. 21)

160. వీరాస్వామయ్య గారు కాశీలో తాంబూల ప్రసక్తి తీసుకురాలేదు కాని 'గంజాం మొదలుగా కృష్ణాతీరము వరకు పెద్దమనుష్యులు సమానుల సమాగమము అయినప్పుడు అత్తరు తాను వుంచి తాంబూలంతో కూడా అత్తరున్ను ఆవశ్యము యిస్తూ వస్తారు' అని వ్రాశాడు. పేజీ 854. ఐతే ఈ తాంబూలంలో పైన పేర్కొన్న 'సురితీ' ప్రసక్తి లేదు.

ధారి బ్రాహ్మణుల)తో భోజన ప్రతిభోజనాలు చూసుకున్నారనీ, ఆ కారణంగా లింగధారి బ్రాహ్మణులకు కూడ ఈ సత్రాల్లో అన్నం పెట్టకుండా తగిన కట్టుబాట్లు చేశారని శాస్త్రిగారు తెలుసుకున్నారు.

వేంకట శాస్త్రిగారు కాశీయాత్ర రచించేనాటికి కాశీలో పై సత్రాలలో కొన్ని కూడా లేవనీ, విద్యార్థులకు ఏ విధమైన సౌకర్యం లేదని తెలిసి విచారించాడు.161 తాను కాశీలో వున్నప్పుడు ఉన్నంతమంది పండితులు కూడ లేరని బాధపడ్డాడు. ఇది కాలం తెచ్చిన మార్పు అని ఒక ఉదాహరణ చెప్పాడు: దర్భాంగ మహారాజా లక్షలాది రూపాయలు వెచ్చించి నిర్మించిన దశాశ్వమేధ ఘట్టంలోని మహాసౌధాన్ని ద్రావిడ సుబ్రహ్మణ్య శాస్త్రుల గారికి నివాసంగా ఇవ్వడమే కాక, నెలకు వందరూపాయల జీవనభృతి ఏర్పాటు చేసి, తామే స్వయంగా అప్పుడప్పుడు వచ్చి దర్శనం చేసుకునేవాడట. పండితులను సన్మానించే కాలమది.

కాశీలో మధుకరవృత్తి లేదుకాబట్టి విద్యార్థులకు తీర్థవిధి, బ్రాహ్మణార్థాలే అంతో యింతో ధనార్జన చేయదగ్గ ఉపాయాలు. గోదావరి ప్రాంతపు శంభు సోమయాజులు గారితో రెండవ బ్రాహ్మణుడిగా ఉంటూ భంగు ఖర్చు, యజ్ఞోపవీతపు ఖర్చు కాక పావలా, అర్ధా దక్షిణ కూడ సంపాదించేవాడనని శాస్త్రిగారు చెప్పుకున్నాడు.

దేశాన్ని బట్టి ఆచారాలు మారుతూంటాయి. కాశీలో కాలాతకం నాడు (కాల భైరవ ప్రీతికి చేసే సంతర్పణ) విధిగా భంగును సేవించాలట!162 ఈ దేశంలో భంగును సేవిస్తే తప్పులేదు కాని గంజాయి పొగ పీలిస్తే చాలా తప్పని శాస్త్రిగారు పేర్కొన్నాడు

---

161. వేంకటశాస్త్రిగారు కాశీలో ఉన్నది 1890 లో. తర్వాత 44 సంవత్సరాలకు ఈ రచన చేశాడు. అంటే 1934 లో నన్నమాట!

162 భంగంటే గంజాయి, ఏలక్కాలయలపై నుండే తొక్కలు, ఎండిన గులాబీరేకులు, సోపు - కలిపి నూరి ముద్దచేసి నీళ్ళల్లో కలిపి తాగే మత్తు పదార్థమని కాశీ చరిత్ర పేజీ. 28 లో ఉంది.

కాలార్థకం నాడేకాక 'యజ్ఞోపవీతం' నాడు కూడ శాస్త్రిగారికి తోటి విద్యార్థులు బలవంతంగా భంగు పట్టించారట. ఒక ఔన్సు తాగితేనే మత్తు బాగా యెక్కి ప్రాణాపాయం కలుగుతుందేమోనని భయమేసిందట శాస్త్రిగారికి. మత్తు త్వరగా తగ్గించడానికి విరుగుళ్ళు వాడడంవల్ల అది గ్రహణిలోకి దించి, తిరుగు ప్రయాణంలో అవస్థ పెట్టింది.

జందెం వున్న కాశీలోని పంచ ద్రావిడులందరికీ తలా ఒక రూపాయి దక్షిణ ఇచ్చి పంచపక్వాన్నాలతో సంతర్పణ చేయడాన్ని 'యజ్ఞోపవీతం' అంటారు. పంచగౌడులు యజ్ఞోపవీతానికే కాదు- సత్రంలో భోజనానికి కూడ పిలువబడరు వీరు స్వయంపాకం చేసుకుంటూ చదువుకోవలసిందే. వీరు మత్స్య భుక్కులు కావడమే దీనికి కారణం కావచ్చునేమో!

విజయనగర సంస్థానంలో వెనుకటి ప్రభువులందరూ తమ సంస్థానం లోని వారినెవరినైనా తొలగించవలసి వస్తే, పదవినుండి తీసివేసిన తర్వాత కూడ వారికి జీతం పంపిస్తూ రావటం ఆచారంగా పెట్టుకున్నారట! ఐతే తర్వాత రాజవంశీకులు తొలగింపబడిన వారికి ఎన్నడూ దర్శనం కూడా ఇవ్వరట!

పై విషయానికి సమర్థంగా శాస్త్రిగారు తనకు తెలిసిన ఒక సంఘట నను పేర్కొన్నాడు.

కొవ్వూరి గోపాల శాస్త్రిగరు షడ్దర్శనీ పారంగతులు. దుర్గాదేవిని గూర్చి 12 సంవత్సరాలు తపస్సు చేసి దేవిని ప్రత్యక్షం చేసుకున్నాడు. వీరు మంత్ర శాస్త్రంలో కూడ దిట్ట. విజయనగరం మహారాజావారు వీరి గొప్పతనాన్ని తెలుసుకో గోరగా, తాను జపం చేసుకొని వచ్చేసరికి నిమ్మకాయంత బంగారు ముద్దను సిద్ధంగా ఉంచవలసినదని చెప్పాడట తర్వాత శాస్త్రిలవారు ఆ బంగారం మీద మంత్రోదకం ప్రోక్షించేసరికి ఆ ముద్ద రెండు ముక్కలుగా పగిలిందట! మహా రాజావారికి భయం కలిగి తనపైకూడ కోపించి ఇదేవిధంగా చేసే అవకాశ ముందని భావించి, ఉపాయంగా వారిని సంస్థానంనుండి తప్పించి, వారికి నెల నెలా 'భృతకం' పంపిస్తూ వుండేవాడట!

ఇంతకు తొమ్మిది శతాబ్దాల క్రితం భారతదేశానికి యాత్రికుడుగా వచ్చిన అల్ బెరూనీ ఇట్లాంటి సంఘటన నొకదాని మాళ్వారాజ్యంలో ప్రత్యక్షంగా చూసినట్లు చెప్పుకున్నాడు. ఐతే అది రసవాద విద్యకు సంబంధించిన సంఘటన.

## vi. రచనకు ప్రేరణ :

తమ పందొమ్మిదవ యేట కాశీయాత్ర చేసిన వేంకట శాస్త్రిగారు వెంటనే వివరంగా యాత్రావృత్తాంతం వ్రాయలేదు. ఐనా ఈ వివరాలు 'జాతక చర్య'లో అక్కడక్కడ సంక్షిప్తంగానైనా తెలుపబడ్డాయి.

తమ 64 వ యేట అంటే కాశీయాత్ర చేసిన తర్వాత మళ్ళీ ఇన్నాళ్ళకు యాత్రారచనకు పూనుకోవటంలోగల అంతర్యాన్ని విప్పి చెప్పాడు ఈ వృత్తాంతాన్ని సంక్షిప్తంగా కాకుండా 'విస్తరించవలసిన పుణ్య గాథలా' భావించారు. 'నేనీ మధ్య షష్టిపూర్తి జరిగినది మొదలుకొనిన్నీ, అంతకు పూర్వం నించిన్నీ, మిక్కిలి జబ్బు స్థితిలో వుండి, నిన్న నేటినుండి కొంచెం తేరుకుంటూ, ఈ రచన యిహపర సాధకమని చెప్పి దీనిని కొంత విస్తరించి వ్రాశాను' అన్నారు.[163]

ఆ వయసులో కాశీయాత్ర చేయకున్నా, చేసిన యాత్రను స్మరిస్తూ, ఇప్పుడు రచిస్తే అది 'ఇహపర సాధకంగా' వుంటుందని శాస్త్రిగారు భావించి వ్రాశారు.

## vii రచనా శైలి :

శాస్త్రిగారు వందలాది అవధానాలు చేశారు. 'నానా రాజా సందర్శనం' పేరిట విస్తృత యాత్రలు చేసి ఆయా సంస్థానాల్లోన్ని పండితులను ఓడించారు. లఘు కౌముది, సిద్ధాంతకౌముది గురుముఖతః నేర్చుకున్నారు. ఇంతటి పండితుడు కాలానుగుణంగా ఈ 'కాశీయాత్ర'ను వ్యవహారిక భాషలో రచించాడు. శాస్త్రిగారి ఈ రచన 1934 లో జరిగింది. అప్పటికి నాలుగు దశాబ్దాల క్రితమే

---

163 కాశీయాత్ర. పేజీ. 52.

గురజాడ వ్యావహారిక భాషలో 'కన్యాశుల్కం' అనే గొప్ప నాటకాన్ని వ్రాశాడు. 1919లో వీరేశలింగం పంతులుగారు కూడా వ్యవహారిక భాషను గుర్తించి దాని వ్యాప్తి కొరకు పూనుకున్నాడు: అంతకు తొమ్మిదేండ్ల క్రితమే గిడుగు రామ్మూర్తి గారు వ్యవహారిక భాషావాదాన్ని ప్రారంభించారు. గ్రాంథిక వ్యవహారిక భాషా వివాదాలు దేశంలో వ్యాపించిన రోజులలో వేటూరి ప్రభాకరశాస్త్రి వంటి ప్రశస్త పండితులే వ్యావహారిక భాషా వాదాన్ని ఆమోదించారు.

కాశీయాత్ర రచనకు ముందే 'పల్లెటూర్ల పట్టుదలలు' అన్న పుస్తకాన్ని వేంకటశాస్త్రిగారు వ్యవహారిక భాషలోనే వ్రాశారు శాస్త్రిగారు ఈ భాషను సమర్థించకపోయినా, వానిపై ఇష్టం లేకున్నా ద్వేషం మాత్రం లేదని తెలపటానికే ఈ రచన చేసినట్లు క్రింది వాక్యాలవల్ల తెలుస్తుంది:

"నేనీ పొత్తమును సర్వసాధారణమయిన వ్యావహారిక భాషలోనే వ్రాస్తాను. 64 సంవత్సరముల నిండు వయస్సులో వ్రాస్తూవున్న దీనిని చూచి, నన్ను 'తుదకబ్బెరా తురక భాష' అని నా మిత్రులూ, శిష్యులూ లోనగువారు కొందరు నిందింతురని నాకు తెలిసిన్నీ, నేనిట్టి భాషను సమర్థించువారిలో చేరినవాడను కాకయుండిన్నీ ఇందులో వ్రాయుటకు కారణము, నాకు ఈ భాష అంటే అంతగా యిష్టం లేకపోయినా, ద్వేషం కూడా అంతగా లేదని లోకులకు తెలియజేయుటయే నా ముఖ్యోద్దేశ్యము."164

పై మచ్చు వాక్యాలే ఆయన వ్యావహారిక శైలికి ఉదాహరణంగా గ్రహించవలసింది.

---

164. కాశీయాత్ర పేజీ. 3.

# 4. పరబ్రహ్మశాస్త్రిగారి కాశీయాత్ర

ఇరవయవ శతాబ్దం పూర్వార్ధంలో కాశీయాత్రచేసి వచ్చిన వారింకా కొందరు కనపడుతున్నారు. వారిలో ఆకుండి పరబ్రహ్మశాస్త్రి ఒకరు. ఈయన కృష్ణాజిల్లా కాకరపర్రు గ్రామనివాసి.

ఈయన ఆంగ్ల భాషలో ఇంటర్మీడియేటు పరీక్షకు చదువుకోవడానికని 1913లో కాశీకి వెళ్ళి అక్కడ 18 నెలలు ఉన్నాడు. అక్కడి పుణ్య తీర్థాలను, ఇతరక్షేత్రాలను సేవించినాడు. తర్వాత స్వానుభవంతో ఒక యాత్రా గ్రంథం వ్రాయాలనే తలంపు వీరికి కలిగింది. అందువల్ల 'కాశీయాత్ర' అనే పేరుతో 'సకల యాత్రా జనోపయోగార్థము' ఈ పుస్తక రచన చేసినట్లు రచయిత పీఠికలో వ్రాసుకున్నాడు. ఈ గ్రంథం మొదట 1914 లో, తర్వాత వెంటనే 1916లో ముద్రింపబడింది.

దీనిలో ఉత్తర భారత దేశంలోని తీర్థయాత్రలు సంగ్రహంగా వర్ణింప బడ్డాయి. పుణ్యతీర్థాలు, తైర్థికుల సేవావిధానాలు, కథాసందర్భాలు కూడ 'తేట మాటలతో' వివరింపబడ్డాయి. ఇందలి శైలి సులభగ్రాంథిక భాషలో ఉంది.

కాశీ,గయ, ప్రయాగలను సేవించినప్పటికీ సంప్రదాయాన్నిబట్టి రచయిత ఈ మూడుక్షేత్రాల వర్ణనను 'కాశీయాత్ర' అనే పేర్కొన్నాడు. పరబ్రహ్మ శాస్త్రి తన ప్రయాణాన్ని ఎక్కడినుండి ప్రారంభించాడో, ఏ విధంగా చేశాడో పుస్తకంలో ఎక్కడా ప్రస్తావించలేదు. దీన్నిబట్టి యాత్రా మార్గాన్ని సూచిం చడం వీరి ఉద్దేశ్యం కాదనుకోవాలి.

రచయిత యాత్రాకాలం నాటికి కుటుంబసమేతంగా దేశాటనం చేయ గలిగినన్ని ప్రయాణ సౌకర్యాలు ఏర్పడి ఉన్నాయి. కాబట్టి వీరు రైలులో ప్రయాణం చేసి ఉంటారని ఊహించడానికి అవకాశముంది.

ప్రయాగలో మొదటిరోజు క్షేత్రోపవాసముండి రెండవరోజు తీర్థ శ్రాద్ధము చేయాలట! హిరణ్యశ్రాద్ధము, నామశ్రాద్ధము క్షత్రియ, వైశ్య, శూద్రులూ, మంత్రయుక్తమగు అన్నశ్రాద్ధము బ్రాహ్మణులూ చేయదగినవి.

తీర్థవిధియైన తర్వాతి రోజు స్త్రీలు వేణీదానం చేస్తారు. తమ ఇష్టాను సారంగా జడను కత్తిరించి ఇవ్వటాన్నే వేణీదానమంటారు. వేణీదానం వల్ల ముత్తైదువులకు వైధవ్యం దాపురించదని విశ్వాసం. సభర్తృకలైన స్త్రీలు ఒక్క ప్రయాగలోనే ముండనం చేసుకోవచ్చు. ఇతర క్షేత్రాల్లో ముండనం చేసుకో కూడదు కాని వేణీదానం యథేచ్ఛగా చేయవచ్చు.

సాధారణంగా తూర్పు దిక్కున ప్రవహించే గంగ కాశీలో ఉత్తరవాహిని కావటం క్షేత్రమహిమా విశేషమే అనుకోవాలి. 'కాశృదీప్తౌ' అనే దీప్త్యర్థం గల ధాతువుకు పుట్టింది కాబట్టి 'కాశి' అనే పేరు వచ్చిందని పరబ్రహ్మశాస్త్రి వ్రాశాడు.

కాశీ క్షేత్రంలో ప్రాణత్యాగం చేసే సమస్త జీవకోటికి పరమశివుడు కుడిచెవిలో తారకమంత్రోపదేశం చేస్తాడని ప్రతీతి. అందుకే సర్వజీవజంతు వులు ఇక్కడ కుడిచెవి పైకి ఉండునట్లుగా ప్రాణాలు విడుస్తాయని వాడుక. ఈ నమ్మకం ప్రకారమే యాత్రికులు శవానికి నమస్కారం చేస్తారు. గంగాస్నానం చేసి వచ్చే జనులు విశ్వేశ్వరునికి అభిషేకం చేసినట్లుగా ఉద్ధరిణెడు గంగాజలం శవం మీద చల్లుతారు. ఈ విషయాన్ని కాశీయాత్ర చేసిన పీరాస్వామయ్య గారు గ్రంథంలో ఎక్కడా ప్రస్తావించలేదు.

మొత్తం మీద ఈ యాత్రవల్ల కాశీ గయా ప్రయాగ క్షేత్రాల్లోని సంప్ర దాయ విశేషాలు తెలుస్తున్నాయి.

# 5. ఆదిభట్లవారి 'కాశీ శతకమ్'

నారాయణ దాసుగారు శ్రీకాకుళం జిల్లాలోని బొబ్బిలి తాలూకా అజ్జాడ గ్రామస్థులు. ఇంటిపేరు 'ఆదిభట్ల' కాబట్టి ఈయన పూర్తి పేరు అజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు. సంగీత సార్వభౌమ, హరికథాపితామహ బిరుదాంకితుడు.

నారాయణదాసు గారు తమ యాభయ్యవ యేట అనగా 1914 వ సంవత్సరంలో సతీసమేతంగా కాశీయాత్ర చేశాడు. తాను అక్కడ దర్శించిన అనేక విషయాలను, అనుభూతి విశేషాలను సంస్కృత శ్లోకాల్లో ఒక చక్కని శతకంగా రచించాడు. అదే 'కాశీశతకమ్.'

ఈ శతకంలో వందశ్లోకాలున్నాయి. అన్నీ అనుష్టుప్పులే, 1921 ప్రాంతంలో మొదటి ముద్రణ పొందింది.

ముక్తి స్థానమనే నిశ్చయంతో యాత్రికులు కాశీని సేవిస్తారు. కవియైన వాడు ఇతరుల వలె కేవలం దర్శనం వల్లనే తృప్తి చెందక, తన ప్రయాణానికి కావ్య రూపమిచ్చి తనకే కాక తన పాఠకులకు కూడ సిద్ధిని చేకూర్చగలుగుతాడు. ముక్తిస్థానమైన కాశిని వర్ణించినప్పుడే కవిగా తనకు ధన్యత అని భావించి దాసు గారు కవితా మార్గాన్ని ఎన్నుకున్నారు.

"కాశీం ముక్తి స్థానమితి - చాతుర్వర్ణ్యం ప్రసేవతే
తద్వర్ణ నేనైవ కవిః - కృతీభవతి నాన్యథా॥"

నారాయణదాసు గారు తెలుగువాడేఐనా ఆయన వ్రాసిన శతకం సంస్కృత భాషలో ఉండటం వల్ల దీన్ని విస్తరించి వ్రాయడం అప్రస్తుతంగా భావించనైనది.

# 6. ప్రాతూరివారి "నా యాత్ర"

ప్రాతూరి వేంకట శివరామ శర్మ 1930 లో శ్రీశైలం తప్ప మిగతా క్షేత్రాలు, స్థలాలు సందర్శించాడు. ఈయన బాపట్ల నివాసి. రైలు, బస్సు, జట్కాబండి, ఎడ్లబండ్ల మీదనే కాకుండా కాలినడకన కూడ యాత్ర చేశాడు.

ఈయన తన యాత్రను దినచర్యలో ఎప్పటికప్పుడు 'సూత్ర రూపకముగ' వ్రాసికొని తర్వాత 1934 లో పుస్తకంగా అచ్చొత్తించాడు. ఇది 'విషయ ప్రధానంగా వ్రాయించిన డయిరీ పొత్తము.' విపులీకరించి వ్రాయడం వల్ల చదువరులకు లాభముందో లేదో కాని తనకు మాత్రం మళ్ళీ యాత్రచేసిన సంతృప్తి కలిగినట్లుగా పీఠికలో వ్రాశాడు. ఈయన యాత్రా గ్రంథం పేరు 'నా యాత్ర'.

భార్య, ఇద్దరు మిత్రులు, ఒక విద్యార్థితో కలిసి శివరామశర్మ యాత్ర చేశాడు. 24-1-1930 న తెనాలి స్టేషన్ నుండి బయలుదేరి 28-2-1930న కాశీకి చేరుకున్నాడు. 16 రోజులు కాశిలో నివాసమున్నాడు.

ఈ యాత్రలో బాగా గుర్తుంచుకోదగిన విశేషాలు ఏమీ లేవు. యాంత్రికంగా క్షేత్రదర్శనం చేసినట్లుగా ఉంది. అయినా ఒకటి రెండు విశేషాలు:

శ్రీకాశీక్షేత్రంలో అల్పాచమాన అధికాచమానాలు చేసినందుకుగాను కాశీ క్షేత్రం చుట్టూ విశ్వరూపయాత్ర అనే పేరుతో యాత్రికులు ప్రదక్షిణం చేయాలని పేర్కొన్నాడు. ప్రదక్షిణానంతరం యాత్రికులు కాశీలో ఉండ కూడదు. కాని శివరామశర్మ రెండు మూడు రోజులు ఆగవలసి వచ్చినందున అన్నపూర్ణాదేవి గుడి చుట్టూ ప్రాయశ్చిత్తంగా 108 సార్లు ప్రదక్షిణం చేశాడు.

ఔరంగజేబు కాశీ పట్టణాన్ని నాశనం చేసిన తర్వాత అసీనది సమీపంలో విశ్వేశ్వరాలయాన్ని పరివేష్టించి నగర నిర్మాణం జరిగింది నదిని సమీపించే వీధులన్నీ సన్నని 'అల్పసందులై' రాళ్ళతో పరచబడి ఉన్నాయి.[165]

---

165. వీరాస్వామయ్యగారు వీటిని 'కుసందు' లన్నాడు.
"సవారీలలో స్నానానికి ఒక ఘట్టమునుండి ఒక ఘట్టానికి పోవడము వీధుల కుసంది చేత ప్రయాస గనుక చిన్న పడవల మీద పరువు గల వారు గంగగుండా పోతూ వస్తూ ఉంటారు." (పేజీ. 159)

ఈ 'వరసందులు' కాశీలోనే కాక గయ, ప్రయాగ, అయోధ్య వంటి క్షేత్రాలలో కూడ ఉన్నాయని శర్మ వ్రాశాడు.[166]

ప్రతి రైల్వేస్టేషన్ ప్లాట్‌ఫారం మీద హిందూ చా, ముసల్మాన్ చా అని కేకలు వేసేవారట! 'చా' అంటే టీ కషాయం! స్టేషన్‌లో హిందూ ముస్లిములకు త్రాగటానికి వేర్వేరు నీళ్ళ పంపులుండేవి. సర్కారు లెక్కలన్నీ హిందీలో ఉండాలని అధిక సంఖ్యాకులగు హిందువులు ఆందోళన చేశారని రామశర్మ తెలిపాడు. సర్కారువారు దీని కనుగుణంగా 'అర్జీలను' హిందీలో పంపుకో వచ్చునని నియమాలను మార్చినారు.

వీరు కాశీలో ఉన్న రోజుల్లో 'కాముని దహన పండుగ' జరిగింది. అక్కడి 'అసహ్యకరమైన' ఆచారాన్ని శర్మ ఇట్లా వ్రాశాడు: "యువకులు దుర్భాషణలతో బజారుల వెంబడి తిరిగిరి. స్త్రీలు చరించుటకు వీలుకాదు. పురుషులు దుర్భాషలతో తలుపులు కొట్టెదరు. స్త్రీలగపడిన వంచన చేసెదరు."[167]

ఈ విధంగా కొన్నే అయినా 'నా యాత్ర' ద్వారా ఆసక్తికరమైన విశేషాలు తెలుస్తున్నాయి.

# 7. రామసుబ్బారాయుడి కాశీయాత్ర

బ్రహ్మశ్రీ వాజపేయయాజుల రామసుబ్బారాయుడు జటప్రోలు సంస్థానంలో 'పెరసనల్ సెక్రటరీ' (Personnel Secretary) గా ఉండేవాడు. బహుభాషాభిజ్ఞుడు.

40 సంవత్సరాల వయస్సులో తా నదివరకు చేసిన కాశీయాత్రను గుర్తు చేసుకొని సుబ్బారాయుడు 'కాశీయాత్ర' అన్న పేరుతో కావ్యము రచించాడు. ఈ పుస్తకం 1934 లో ప్రకటింపబడింది. పూర్వ రచయితల వలె కాక సుబ్బారాయుడు తన భావాలను ఛందోబద్ధమైన పద్యభాగంలో ఇమిడ్చి వ్రాశాడు. ఐతే ఇది యాత్రా సమయంలో వ్రాసినది కాదు. స్మృతిరూపకమైన యాత్రా రచన.

రచయితకు కాశీ పూర్వపరిచితప్రదేశమే. అక్కడి ఘట్టాలు, ఆలయాలు, తీర్థాలు ఇదివరకు సేవించి వచ్చినవే వారణాసిని మొదటిసారి ప్రకృతి సౌందర్య దర్శనార్థం విలాస ప్రదేశమనే దృష్టితో దర్శించాడు.

---

166. వరసంది = Shore: Bank. పరిసరము. బ్రౌణ్య నిఘంటువు. నదీతీర పరిసరాలన్న మాట.

167. నా యాత్ర - ప్రాతూరి వేంకట శివరామశర్మ. పేజీ. 130.

"అప్పుడొకింత జ్ఞానమును నందగనైతి విలాసమెంతయే
నొప్పెడు రీతి జూచితినహో కడు భాగ్యమటంచు నుబ్బితిన్."

ఐతే ఈ విధమైన దృష్టి పవిత్రమైన క్షేత్రాన్ని దర్శించటానికి తగినది కాదని భావించి, కాశీ క్షేత్రాన్ని విలాస దృష్టితో చూసినందుకు పరితపించి వెంటనే -

"చెప్పేడిదేమి సద్గతికి చెందెడు మార్గమెరుంగనైతి
ఇప్పుడు జ్ఞానమబ్బె సుదతీ! యల కాశికి నేగగావలెన్."

అని వైరాగ్యదృష్టితో రెండవసారి కాశీకి వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు. ఇంక పది సంవత్సరాలకు అంటే తన యాభయ్యవయేట కాశీయాత్ర చేయాలనుకున్నాడు. ఐతే ఈసారి ఒంటరిగా మాత్రం కాదు, భార్యా పిల్లలతో. పునర్జన్మ రాహిత్యాన్ని కోరుతూ జీవిత శేషాన్ని కాశీలో గడపాలని కోరుకున్నాడు.

ప్రసంగవశాత్తు రెండు రాత్రులలో సుబ్బారాయుడు తన అర్ధాంగికి కాశీపుర వాసంలోని విశేషాలు, ఆ క్షేత్ర మాహాత్మ్యాన్ని గురించి వర్ణించాడు. ఆమె కూడ కాశీకి వెళ్ళాలనే అభీష్టాన్ని వెలిబుచ్చింది.

ఛందస్సులో వ్రాయబడిన చాలాకొద్ది యాత్రా రచనల్లో 'కాశీయాత్ర' ఎన్నదగినది.

# 8. కమలాదేవి గారి కాశీయాత్ర

సెప్టెంబర్ 1966 లో శ్రీమతి ముళ్ళపూడి కమలాదేవి యాత్ర చేస్తూ ఒక యాత్రానివేదిక వ్రాసింది. దానిపేరు 'మా ఉత్తర భారతయాత్ర' ఈమె జమీందారు కుటుంబీకురాలు. భర్త ముళ్ళపూడి తిమ్మరాజు ఆజ్ఞ ప్రకారం ఈమె తన యాత్రా వివరాలను డైరీగా వ్రాస్తూ భర్త కొరకు రూపొందించిన పుస్తకమిది. వీరి యాత్ర ప్రణాళికా బద్ధంగా జరిగింది. ఒక గైడ్, ఒక అటెండర్, చాకలి, వంటమనిషితో కలిసి 15 మంది యాత్ర చేశారు.

ఢిల్లీ, శ్రీనగర్, కాశీ, కలకత్తాలను చూస్తూ సింహాద్రి అప్పన్న దర్శనంతో యాత్రా పరిసమాప్తం చేశారు. ఇది కూడ మూడు వారాల యాత్రే.

హరిశ్చంద్ర ఘాట్‌లో మృతుల శవాలను మోసుకెళ్లేవారు 'రామ నామ సత్య్‌హై' అని బిగ్గరగా పలుకుతూ, 'పరలోకపు విమానాశ్రయానికి ప్రయాణికులను తీసుకువెళ్ళేవారు' బహువేగంగా వెళ్తారట. ఇప్పటికీ అంతే.

# నీలగిరి యాత్రలు

## 1. శేషాచలకవి 'నీలగిరి యాత్ర'

పందొమ్మిదవ శతాబ్దం ప్రథమార్థభాగంలో వెలువడిన మరో యాత్రా గ్రంథం 'నీలగిరి యాత్ర'. ఈ పుస్తక రచయిత కోలా శేషాచలకవి. థామస్ సిమ్సన్ అనే బ్రిటిషు అధికారి కార్యాలయంలో ఈయన గుమాస్తాగా పనిచేసేవాడు.[1] ఈ అధికారి అప్పటి మద్రాసు గవర్నరు అయిన 'ట్వీదేల్' దొరగారి కార్యనిర్వాహక వర్గంలో ఒకడు.

మద్రాసు ప్రెసిడెన్సీలోని నాటి బ్రిటిషుఅధికారులు ప్రతివేసవిలో నీలగిరికి వెళ్తూండేవారు. వెంట పరివారాన్ని తీసుకెళ్లేవారు. ఆ విధంగానే 1846 లో 'ట్వీదేల్' దొరగారు ప్రయాణమయ్యారు. అతనివెంట బయలుదేరిన పరివారంలో కోలా శేషగిరికవితోపాటు ఆయన మిత్రుడయిన మాంగాడు శ్రీనివాస మొదలారికూడ ఉన్నాడు.[2]

**అ) గ్రంథపరిచయం :**

శేషాచలకవి తన యాత్రానుభవాలను 'నీలగిరి యాత్ర' అన్న పేరుతో 1854 లో గ్రంథంగా రచించాడు.[3] దీన్ని గోడె జగ్గరాయలుతో తనకున్న స్నేహానికి గుర్తుగా ఆయనకు అంకితం చేశాడు.

మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారంలోని వచనకావ్యాల్లో నీలగిరి యాత్ర D. Vol. vi-1463. A సంఖ్యతో పేర్కొనబడింది. కాగితపు

---

1. "క్లార్కు అనంబడు లేఖకుడు."
2. "హెడ్ క్లార్కు అనంబడు లేఖక ప్రముఖుడు."
3. ఈ వ్రాతప్రతి మద్రాసు ప్రాచ్యలిఖిత భాండాగారం వారి సంపాదకత్వంలో సరిగ్గా వంద సంవత్సరాలకు అనగా 1953 లో ప్రథమ ముద్రణకు నోచుకున్నది.

ప్రతి, వ్రాత అందంగా లేదు. మాతృకలో రెండుపుటల గ్రంథపాతమున్నట్లు పీఠికలో చెప్పబడింది. గ్రంథాలయంలో ఈ ప్రతితప్ప మరొకటి లేదు.

కాబట్టి ఈ వ్రాతప్రతి శేషాచల కవి గోడె జగ్గరాయలకు స్వయంగా అందజేసినదై ఉంటుందన్న క్యురేటర్ శ్రీ టి. చంద్రశేఖరన్ గారి అభిప్రాయం సరియైనదే అనిపిస్తుంది.[4]

నీలగిరి యాత్ర మూడు ప్రకరణాల గ్రంథం. మొదటి ప్రకరణంలో చెన్నపట్టణం నుండి నీలగిరిదాకా చేసిన ప్రయాణ వర్ణన, రెండవ ప్రకరణంలో నీలగిరి విశేషాలు, మూడవ ప్రకరణం తిరుగుప్రయాణంలోని విశేషాలను తెలుపుతుంది.

ప్రథమ ప్రకరణంలోని అవతారికలో "నీలగిరికి నేగిన చరిత్రమెల్ల 'వచన రచన' నెరుకపరుతు" అని ఈ గ్రంథాన్ని వచన రచన అంటూనే గ్రంథాంతంలోని కృతిపతిప్రశంసలో 'నిఖిలజన సుఖ బోధనంబగు వచన కావ్యంబుగా నియ్యాత్ర రచయించి' అని 'వచన కావ్యంగా' పేర్కొన్నాడు. నిజానికిది వచనగ్రంథమే ఐనా పుస్తకంలో షష్ట్యంతాలు, గర్భగతకందాలు, పాదగోపనలు, ద్వ్యర్థిపద్యాలు, సీసమాలికలు చేర్చబడటంవల్ల 'వచన కావ్యం'గా పేర్కొనబడి ఉంటుంది. అంతేకాని కావ్యలక్షణాలతో ఒప్పే గ్రంథం కాదు. మొత్తమ్మీద శేషాచల కవి ఒకే పుస్తకంలో గద్యరచనతో పాటు, తాను పద్య రచనలో కూడ సిద్ధహస్తుడనని నిరూపించుకున్నాడు.

వీరాస్వామయ్య గారివలె చారిత్రకస్ఫూర్తితోకాక ప్రాబంధిక శైలిలో రచింపబడిన బిగువైన రచన ఇది. ప్రశస్తమైన గ్రాంథిక శైలిలో ఉన్న వచన గ్రంథం.

---

4. "ముఖపత్రమున 'గిల్టు' చేయబడిన-శ్రీమత్కృతిపతులగు గోడె వేంకట జగ్గరాయలుగారికి కోలా శేషాచలకవి వలన సమర్పితంబగు నీలగిరి యాత్ర-అను నీ వ్రాతవలన నీ ప్రతి కవి స్వహస్తసంపాదితమై యుండ నోపునని పొడకట్టుచున్నది." - పీఠిక. పేజి. V.

### ఆ) శేషాచలకవి వ్యక్తిత్వం :

రచయిత మద్రాసులోని చింతాద్రి పేట నివాసి. వెంకటాచలనాయనికి మంగమకు ప్రియసుతుడు. యాదవ కులానికి చెందినవాడు. వైష్ణవ సంప్రదాయి.

పై వివరాలలో కొన్ని పీఠికలో, మరికొన్ని గ్రంథాంతంలోని సీసమాలికలో లభిస్తాయి.[5] ఇంకా తాతముత్తాతలను, బంధుబలగాన్ని, మిత్రవర్గాన్ని కూడ ఆ పద్యంలో పేరు పేరునా పేర్కొన్నాడు కాని వ్యక్తిగత వివరాలు-జన్మించిన తేది, విద్యాభ్యాసం, వగైరాలు - ఎక్కడా తెలుపలేదు. యాత్రాచరిత్రలోని ప్రౌఢమైన శైలినిబట్టి ఈయనకు సంస్కృతాంధ్ర తమిళ భాషల్లో పాండిత్యమున్నట్లు తెలుస్తుంది కాని ఆ భాషలను ఎవరివద్ద అభ్యసించాడో ఆ 'గురుస్మరణ' చేయలేదు.[6]

యాత్రకు ముందు, యాత్రాంతంలో కూడ చింతాద్రిపేట గ్రామదేవత ఐన 'ఆదిపొన్నమ్మ'కు భక్తితో ప్రణమిల్లి ఆశీస్సులు పొందాడు కవి. సంప్రదాయానుగామి కాబట్టి యాత్రలో ప్రతి గ్రామంలో విధిగా దైవదర్శనం చేసుకునేవాడు. ఇది ఆయన భక్తివిశ్వాసాలను ప్రదర్శించే విషయం. తాము చేసేది విహారయాత్ర అయినా శేషాచల కవి అడుగడుగునా దైవ దర్శనం చేసుకుని తీర్థయాత్రను చేసిన అనుభూతిని పొందగలిగాడు.

---

5. "శ్రీ వల్లభుడు వసుదేవ కుమారుడై - యే వంశమున నభివృద్ధి నొందెనట్టి గోపాలాన్వయమున వల్వలగోత్ర - మున నుద్భవించిన ... వేంకటాచలనాయని కభిలబంధు - మాన్య సౌజన్య ధీమతి మంగమకు ప్రియసుతుడ..." —— (సీసమాలిక) - నీలగిరి యాత్ర. పేజీ. 77.

6. "మితవచనుడు నా నొప్పు మాంగాడు శ్రీనివాస మొదలికి
గణితశాస్త్ర శిక్షితుడు దీర్ఘమతి రామధేను రామానుజ
నాయనికిని......ముఖ్య హితుడ." —— పేజీ 78.

పీఠికలో క్యురేటర్, శేషాచలకవికి గణితశాస్త్ర గురువు మాంగాడు శ్రీనివాస మొదలారి అని వ్రాశాడు. పై పద్యాన్ని గమనిస్తే ఎవరు కూడ ఎవరికీ గురువు కారు. వారు తనస్నేహితులని మాత్రమే కవి పేర్కొన్నాడు. ఇది అన్వయక్లిష్టతవల్ల దొరలిన పొరపాటు.

అవతారికలో త్రిమూర్తులు, లక్ష్మీసరస్వతులు, పార్వతీగణపతులు మిత్రుడైన జగ్గరాయలకు కార్యసిద్ధి కలుగజేయాలని ప్రార్థిస్తూ, ఇష్టసిద్ధికై సర్వమంగళను శేషాచలకవి భజించాడు.

గ్రంథ ప్రారంభంలో మిత్రుడైన మాంగాడుశ్రీనివాసమొదలారితో కలిసి దొరవారిపరివారంలో ఒకడుగా నీలగిరికి ప్రయాణమైనట్లు చెప్పుకున్నాడు. తర్వాత దొరగారి ప్రసక్తి గాని, పరివారంతో తనఅనుభవాలు కాని ఎక్కడా గ్రంథస్థం చేయలేదు. పుస్తకంలోని మొదటిపేరా చదవకుంటే తానే ఈ యాత్ర చేసినట్లు భావించే అవకాశముంది. గుంపుతో కలిసి వెళ్ళిన వ్యక్తి తానొక్కడే యాత్ర చేసినట్లు పుస్తకం వ్రాయడం ఆశ్చర్యం కలిగించే విషయం. ఇతరులతో కలిసి చేసిన ప్రయాణాన్ని తనవరకు పరిమితం చేసుకుని గ్రంథ రచన చేయడానికి కారణాలేమిటో కొంతవరకు ఊహించవచ్చు. యాత్రా సమయంలో పొడిపొడిగా వ్రాసుకున్న దినచర్యనోట్సు గ్రంథంగా ప్రకటించాలన్న సంకల్పం మొదట లేకపోవడం, తర్వాత మిత్రునికి ఈ నోట్సునే 'వచనకావ్యం'గా మలిచి అంకితమివ్వాలనుకోవడం మూలంగా ఆ డైరీలలోని ఇతరులకు సంబంధించిన అంశాలను తొలగించి తన అనుభవాలకే పరిమితమైన ప్రౌఢగ్రంథంగా రచించటం కారణాలని భావించవచ్చు. 'దేవతానుగ్రహంబున తేర్చినాడ నీలగిరి యాత్ర' అని చెప్పుకోవడంలో 'తేర్చడం' (సంస్కరించడం) అంటే డైరీలోని యాత్రానుభవాలను 'ఎడిట్' చేసుకోవడమేనని స్ఫురిస్తుంది.

**ఇ) నీలగిరి యాత్ర - రచనాకాలం :**

శేషాచల కవి నేటికి సరిగ్గా 143 సంవత్సరాల కిందట అంటే 1846లో నీలగిరికి యాత్ర చేశాడు. దానికి అయనే యాత్రా గ్రంథం ప్రారంభంలో స్పష్టంగా చెప్పాడు కూడా:

"...పరాభవ వర్షంబున వైశాఖ మాసంబున బహుళ పక్షంబున తొలు తిథికి సరియగు క్రైస్తుశకంబున వేయు నెనుమన్నూట నలువదియారవ సంవత్సరంబు మే నెల పంద్రెండవ తేది భానువారంబు దినంబునం... మదీయ నికాయంబు వెడలి."[7]

7. నీలగిరి యాత్ర - పేజి 3.

దీన్ని ఆధారంగా చేసుకొని వ్రాసిన క్యురేటర్ పేరుతో ఉన్న పీఠికలో కూడా నీలగిరి యాత్రా కాలాన్ని 1846 గానే పేర్కొన్నారు.[8] అప్పటి నుండి నీలగిరి యాత్ర గ్రంథ రచనా కాలాన్ని 1846గానే భావిస్తూ వస్తున్నారు. పైగా ఇది చిన్నయసూరి 'నీతిచంద్రిక'కు ముందు రచింపబడిందనీ, ఆ కారణంగా గ్రాంథిక వచనరచనకు ఇదే మార్గదర్శక మౌతుందనీ క్యురేటర్ అభిప్రాయ పడ్డాడు.

"ఆధునిక కాలమున పరవస్తు చిన్నయసూరి నీతి చంద్రికయే గ్రాంథిక వచన రచనకు మార్గదర్శక మైనదని కొందరు విమర్శకుల యభిప్రాయము. కాని నీలగిరి యాత్ర రచనము నీతి చంద్రిక కన్న పదేండ్లు పూర్వము కాబట్టి యా మార్గదర్శకత్వము శేషాచల కవికే చెందవలసి యున్నది."[9]

కాని ఇది ప్రామాదికం ఎందుకంటే నీతి చంద్రిక 1853 లోనే వెలువ డింది.[10] నీతి చంద్రికకు పదేళ్ళు ముందు అన్నప్పుడు నీలగిరి యాత్ర రచన 1843 లో అవుతుంది. అప్పటికి శేషాచల కవి నీలగిరికి వెళ్ళనేలేదు. వాస్తవం ఏమిటంటే నీలగిరి యాత్రా చరిత్ర రచన జరిగింది 1854 లో, దీనికి పుస్తకం లోనే స్పష్టమైన సాక్ష్యం ఉంది.

---

8. "శేషాచల కవి క్రీ.శ. 1846 మే 12వ తేదీన చెన్నపురి నుండి బయలు దేరి యెనిమిది నెలలుండి తిరిగి క్రీ.శ. 1847 జనవరి 13వ తేదీన మదరాసు చేరుకొనెను. ఈ కాలములో శేషాచల కవి తన ప్రయాణమును గూర్చి తెలుపుచు, నీలగిరిలోని విశేషములను తన యనుభవములను సేకరించి పై గ్రంథమును రచించెను." నీలగిరి యాత్ర - పీఠిక. పేజి. iii.
9. నీలగిరి యాత్ర. పీఠిక (టి. చంద్రశేఖరన్, క్యురేటర్) - పేజి iv.
10. మద్రాసులోని వాణీదర్పణం ప్రెస్‌లో ముద్రింపబడినట్లు నీతిచంద్రిక ముఖపత్రపు నకలు నిడుదవోలు వేంకటరావు గారి 'ఆంధ్ర వచన వాఙ్మయము' పేజీ. 75 లో ఉంది.

"...............క్రైస్తు
శకమున నొక వేయి శతము లెన్మిది పదు లయిదును
మరి నాల్గు హాయనములు
నడుచు నానంద వర్షంబునను నినుండు
వృషభరాశి గతుండైన వేళ నిష్ట
దేవతానుగ్రహంబున దేర్చినాడ
నీలగిరి యాత్ర నెమ్మది నెఱయువేడ్క." (పేజీ. 76)

పై పద్యంలోని అక్షరాలను అంకెల్లో పెడితే ఆ సంవత్సరం 1854 అవుతుంది. అంటే 1846 లో యాత్ర జరిగితే తర్వాత ఎనిమిదేళ్ళకు గాని అది అక్షరబద్ధం కాలేదన్న మాట!

మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారం వారు దీన్ని ముద్రించడానికి ముందు క్షుణ్ణంగా చదివినట్లు లేదు.[11] చదివి వుంటే పై పద్యంలోని తేదీపై వారి దృష్టి పడిఉండేది. నీలగిరి యాత్రను పేర్కొన్న ప్రతి రచయితా దాని రచనా కాలం గురించి పొరపాటు పడివుండేవాడు కాదు.

కాబట్టి 1853 లో వెలువడిన నీతి చంద్రికకు నీలగిరియాత్ర తరువాతదే అవుతుంది కాని పూర్వపుది కాదు. ఐనప్పుడు ముందే వెలువడ్డ పుస్తకానికి తర్వాతది ఒరవడి పెట్టే ప్రసక్తి లేనేలేదు. దీన్నిబట్టి తెలియవచ్చేదేమంటే నీలగిరియాత్ర జరిగింది 1846 లోనే కాని, గ్రంథ రచన మాత్రం 1854 లో పూర్తయింది. అంటే నీలగిరి యాత్రా కాలం, యాత్రా విశేషాల రచనాకాలం ఒకటి కాదు.

### ఈ) యాత్రా రచనకు ప్రేరణ :

గొడే సూర్యనారాయణ రాయుడు విశాఖ పట్టణంలోని ఒక కోటీశ్వరుడు. ఆయన కుమారుడు వేంకటజగ్గరాయుడు ఇంగ్లీషుభాష నభ్యసించడానికి

---

11. మద్రాసు ప్రభుత్వ అనుమతితో ఈ గ్రంథం మొదటిసారి 1953 లో గవర్నమెంట్ ప్రెస్‌లో అచ్చువేయబడింది.

మద్రాసుకు వచ్చాడు. ఆయన ఇక్కడున్న ఎనిమిది సంవత్సరాల్లో శేషాచల కవితో సాన్నిహిత్యాన్ని పెంచుకున్నాడు. వేంకట జగ్గారాయలు 'చెలికారము' నకు గుర్తుగా ఏదైనా ఒక కావ్యాన్ని వ్రాసి అంకితమివ్వాలనుకున్నాడు రచయిత. అపూర్వ కథాన్వేషణలో కొంతకాలం గడిచింది. తర్వాత అనుకోకుండా నీలశైల యాత్ర' సంఘటిల్లినది. యాత్రానంతరం కూడ కవికి కావ్య నిర్మాణానికి తగిన ఇతివృత్తం దొరికి ఉండదు. చివరికి యాత్రా విశేషాలనే 'వచన కావ్యం'గా మలచాలన్న ఆలోచన వచ్చి ఉంటుంది. వెంటనే తాను యాత్రా సమయంలో దినచర్యగా వ్రాసుకున్న నీలగిరి యాత్రానుభవాల ఆధారంగా 'నీలగిరి యాత్ర' అన్న పేరుతో పుస్తకంగా రచించి, మిత్రునికి అర్పితం చేసి ఉంటాడని ఊహించవలసి వస్తున్నది.

పుస్తకం చివర పేర్కొనబడ్డ సీసపద్యంలో 'దేవతానుగ్రహమున తేర్చినాడ నీలగిరి యాత్ర' అని కవి చెప్పుకున్నాడు. 'తేర్చుట' అన్న పదానికి బ్రౌణ్యం సవరించుట, సరిచేయుట అనే అర్థాలనిస్తున్నది.[12] కాబట్టి అదివరకే డైరీలో వ్రాసికొన్న యాత్రానుభవాల ముడిసరుకుకు సవరణలు, వివరణలు జోడించి వచన కావ్యంగా మలిచి ఉంటాడన్నది స్పష్టం.

## ఉ) యాత్రా మార్గం :

శేషాచల కవి స్వస్థలమైన చింతాద్రిపేటను వదిలి 'నీలగిరి యాత్ర' చేసి మళ్ళీ రావడానికి దాదాపు ఏడునెలలు పట్టింది. యాత్రా వివరాలు తేదీల వారీగా ఇట్లా ఉన్నాయి: 12-5-1846న చింత్రాదిపేట నుండి బయలుదేరి 2-6-1846న నీలగిరికి చేరుకున్న కాలం - 22 రోజులు.

| | |
|---|---|
| 3-6-1846 నుండి 26-12-1946 వరకు నీలగిరిపై ఉన్నకాలం | 6 నెలల 24 రోజులు |
| 27-12-1846 నుండి 18-1-1847 వరకు తిరుగు ప్రయాణం | 18 రోజులు |

12. తేర్చుట = To make clear, clarify, To rectify, to correct. బ్రౌణ్య తెలుగు ఇంగ్లీషు నిఘంటు.

ప్రయాణంలో తగిలిన గ్రామాల మధ్యదూరం, దేవాలయాలు, నీలగిరి పైని శీతోష్ణస్థితిగతులు మొ॥ వాటిని విపులంగా వర్ణిస్తూ వచ్చాడు.

చింతాద్రిపేట నుండి నీలగిరికి చేరేవరకు మధ్యలో తటస్థించిన స్థలాల మధ్య దూరాన్ని కోసులలో తెల్పాడు.

యాత్రా మార్గమిట్లా ఉంది:

చింతాద్రిపేట (మద్రాసు) - పూవిరుందమల్లి - పెరుంబూరు - ఓచేరి-వారాజాపేట - రాణిపేట - పాలేటి - యీవలి దరి - పాలేరు - వేలూరు-విరించిపురం - పళ్ళికొండ - *తోటాళము - ఆమూరిపేట - వాణియంబాడి - తిరుప్పత్తియూరు - *మత్తూరు - ఇరుమత్తూరు - ధర్మపురి - అదమాన్‌కోట -తోప్పూరు-పూజారిపట్టి - ఓమలూరు - సేలం - కాకాపాలియం - ముద్దునాయనిపాలెం - *పల్లిపాళియం - ఈరోడ్ - పెరుందొరె - *విజయ మంగళము - చెంగపల్లి - అనినాశి - అన్నూరు - మోటుపాళియం - కల్లారు - నీలగిరి శిఖరం - ఉదక మండలం.

చింతాద్రిపేట నుండి మోటుపాళియందాకా దాదాపు 40 యోజనాల దూరం (515 కి.మీ.) ఎడ్లబండిపై, అక్కడినుండి ఉదకమండలానికి 2 యోజనాల కోసు దూరం (29 కి మీ.) కాలినడకన మొత్తం 545 కి.మీ దూరాన్ని 22 రోజులలో చేరుకున్నారు.[13] ఈ లెక్కన రోజుకు సగటున 25 కి మీ. ప్రయాణం సాగినట్లు తెలుస్తున్నది.

---

* ఈ గుర్తుగల గ్రామాలలో శేషాచలకవి మొదట విడిది చేయలేదు. తిరుగు ప్రయాణంలో నిలిచాడు.

13. "రెండు మయిలొక్క కోసు వంతున నా యూరికిగల దూరంబింతింత యని వ్రాయుచు వచ్చినాడ. ఈ కోసులు నాలుగొక్క యోజనంబని యెరుంగునది" - నీలగిరి యాత్ర పేజీ. 13.

42 యోజనాలకు 8 మైళ్ళు + 2 మై. (1 కోసు) = 338 మైళ్ళు. 1 మైలుకు 1 61 కి.మీ. ఈ లెక్కన 544 కి.మీ. అవుతాయి.

దారిలో తటస్థించిన స్థలాలలో నాలుగైదుగుడిసెలు గల చెంగపల్లి అన్నిటికన్న చిన్నపల్లె కాగా ఆమూరిపేట, వాణియంబాడి, ధర్మపురి, సేలం, ఈరోడు పేట, పళ్ళిపాళియం - గొప్ప పేటలుగా పేర్కొనబడ్డాయి. మొదటి రెండు పేటలలో వేయి ఇండ్లవరకు ఉండవచ్చునని శేషాచలకవి ఊహించాడు. ఆయన చూసిన స్థలాల్లో జనసంఖ్యనుబట్టి చూస్తే అప్పటికవే పెద్ద ప్రదేశాలు.

వాణియంబాడిలో తురకలు ఎక్కువగా ఉన్నారనీ, వారు వ్యాపారాన్ని ముఖ్య వృత్తిగా జీవిస్తున్నారనీ వ్రాశాడు. అట్లాగే సేలం దగ్గరి శివ్వాయిపేటలో సాలెవారి ప్రాబల్యం మెక్కువట.

శేషాచల కవి యాత్రాకాలం నాటికి రైలు మార్గాలు లేవు, బస్సులసలే లేవు. మోటు పాళియం నుండి పర్వతారోహణ ప్రారంభం. కొండలు నిటారుగా ఉండటం వల్ల బండ్లు వెళ్ళడానికి వీలులేకుండేది. అందుకే యాత్రికులు తామది వరకు ప్రయాణించిన బండ్లను మోటు పాళియంలోనే వదిలిపెట్టి సామానులను మోయడానికి కూలీలను లేదా ఎడ్లను కుదుర్చుకోవాల్సివచ్చేది. ఈ ఏర్పాటు మోటుపాలియంలో ఉండే పోలీసు అధికారి (కొత్వాలు) ఏర్పాటు చేసేవాడు. నడవలేనివారు డోలీల సాయంతో పైకి వెళ్ళవచ్చు. ఐతే ఈ డోలీలు ఎప్పుడంటే అప్పుడు అంత సులభంగా లభించేవి కావట!

1950 నాటికి రైలు సౌకర్యం ఏర్పాటైనా ప్రస్తుతమున్నంత అధునాతనమైన సౌకర్యం కాదు అప్పటిది. విద్వాన్ సూరాబత్తుల సుబ్రహ్మణ్యంగారి యాత్రాకాలం (1950) నాటికి నీలగిరికి క్రొత్తగా రైలు మార్గం పడింది. మెట్టుపాలియం స్టేషన్ నుండి నీలగిరి శిఖరం చేరే వరకు 18 చోట్ల కొండలను సొరంగాలుగా తొలిచారని పేర్కొన్నాడు. మూడు పెట్టెల చిన్న రైలుబండి పైకి వెళ్ళేటప్పుడు ఇంజను వెనక ఉండి పైకి తోసేదనీ, రైలు క్రిందికి వచ్చేటప్పుడు జారకుండ రెండు ఇనుపబద్దీల మధ్య మరో కొక్కెముల బద్దీ దారి పొడుగునా వస్తూందనీ సుబ్రహ్మణ్యం గారు వ్రాశాడు. ఈ రైలు పెట్టెలో గార్డు

వెనక ఉండకుండా ట్రాంబండిలో లాగ ముందుండి వెనక ఉన్న డ్రైవరుకు జెండా చూపేవాడట.[14]

శేషాచలకవి ప్రయాణించిన మార్గంలోని కొన్ని గ్రామాలను కలుపుతూ మద్రాసునుండి ఉదక మండలానికి వచ్చే రైలు మార్గం ప్రస్తుతం దక్షిణ రైల్వేలో ఉంది.[15] ఆ గ్రామాలు : వాలాజాపేట, తిరుప్పత్తూరు, సేలం, ఈరోడ్‌లు.

**ఊ) నీలగిరి విశేషాలు :**

దక్షిణ భారతదేశంలో నీలగిరి అప్పటికీ ఇప్పటికీ వేసవి విడిదిగా ఉంటున్నది. చల్లదనానికే కాక అరుదైన, అద్భుతమైన ప్రకృతి సౌందర్యానికికూడ నిలయం నీలగిరి. డార్జిలింగ్, నైనితాల్, సిమ్లాలు ఈ పర్వత విశ్రామ నగరి ముందు దిగదుడుపేనన్నది ప్రపంచ యాత్రికుల అనుభవపూర్వక ప్రశంస.

శేషాచలకవి యాత్రాకాలం నాటికి భారతదేశంలో ఆంగ్లేయుల పరిపాలన ఉంది నీలగిరి వాతావరణం ఇంగ్లండులోవలె హాయిని కలిగించేదిగా ఉండటం వల్ల చాలమంది ఇంగ్లీషువారు ఈ కొండకు విహారయాత్రలకు తరలివచ్చేవారు. మద్రాసు, బొంబాయి రాష్ట్రాలనుండి కూడ ఇంగ్లీషువారు 'శారీర సౌఖ్యార్థం బగ్గిరికి' యాత్ర చేయడంవల్ల నీలగిరి నిరంతరం జనాకీర్ణంగా ఉండేదని శేషాచలకవి పేర్కొన్నాడు. వచ్చిపోయే జనం కాకుండా యాత్రాకాలం నాటికి నీలగిరిపై ఇంగ్లీషువారు ఐదువందల మందిదాకా గృహాల నేర్పరచుకొని నివాసమున్నట్లు తెలుస్తున్నది.

---

14. కళ-ప్రకృతి (నీలగిరి సుందరి రాచవీవి)-సూరాబత్తుల సుబ్రహ్మణ్యముగారు - పేజీ. 87.

15. ఇప్పుడు నీలగిరి ఎక్స్‌ప్రెస్ వెళ్ళే రైలు మార్గమిట్లా ఉంది:
మద్రాసు సెంట్రల్ - ఆర్కోణం, షోలింగర్, వాలాజారోడ్, కాట్పడి, జోలారుపేట, తిరుప్పత్తూరు, మేగ్నసైట్, సేలం, ఈరోడ్, ఇరుగూర్, కోయంబత్తూరు, కూనూరు, ఉదకమండలం.

మంజనికోరె, కాందల, కొత్తగిరి, ఇంకా కొన్ని గ్రామాలు ఉదక మండలానికి(నీలగిరికి మరోపేరు) అంతర గ్రామాలు. ఈ గ్రామాలలో నివసించే వర్తకులు, ఉద్యోగస్తులు బెంగుళూరు, మంగుళూరు, తంజావూరు, వేలూరు, కోయంబత్తూరు, తిరుచిరాపల్లి, బొంబాయి, మద్రాసు మొదలైన చోట్లనుండి వచ్చినవారు.

## i. పార్వతీయుల జీవన విధానం :

నీలగిరిపై గ్రామాలలో కాక వాటికి దూరంగా పూర్వకాలంనుండి పార్వతీయులు నివసిస్తున్నారు. వీరు - బడుగర్, ఊరాళి, తొదువర్, కోత్తర్, ముళ్ల కురుంబర్ - అని ఐదు జాతులవారు. శేషాచలకవి వీరి జీవనవిధానం గురించి యాత్రాగ్రంథంలో కొన్ని ఆసక్తికరమైన విషయాలు పొందుపరచాడు.

బడుగరులు నుదుట విభూతి ధరిస్తారు. ముళ్ళ కురుంబరు జాతివారు ధరించరు కాని మిగతావారు బడుగరులంత ఎక్కువగా కాకున్నా అప్పుడప్పుడు విభూతి రేఖలను అలదుకుంటారు. బడుగరులంతా కృషీవలులే. పంటద్వారా సంపాదించిన డబ్బును బిడ్డలకు ఆస్తిగా ఇచ్చి, అడవిలో కట్టెలు కొట్టగా వచ్చిన సొమ్ముతో తాము జీవనం సాగిస్తారు. ఎంత కష్టం వచ్చినాసరే బిడ్డలకిచ్చిన సొమ్ములోంచి 'కాసైనా' ముట్టరట! వీరిలో కొంతమంది ఇంగ్లీషుభాష నేర్చుకొని బట్లర్, క్లోక్‌కీపర్‌లాంటి సేవకవృత్తుల్లో ప్రవేశిస్తారు. ఎడుందేవర్ అనే పేరు గల దైవం వీరి ఇలవేల్పు. ఎడుం దేవరంటే ఉద్ధరించే దైవమని శేషాచలకవి వ్రాశాడు.

బడుగరులలో పెండ్లికి ముందు, తర్వాతి పద్ధతులు విచిత్రంగా కనిపిస్తాయి. స్త్రీ పురుషులలో ఇద్దరికీ వివాహం సమానావసరమే ఐనా ఈ జాతిలో ముందుగా వరుని ఏరి కోరుకునే అవకాశం స్త్రీకి లేదు. పురుషుడే తన మనసుకు నచ్చిన స్త్రీ ఇంటికి వెళ్ళి ఆమె తల్లిదండ్రులకు తాను వచ్చిన విషయం చెప్పాలి. వారు అతన్ని తమ కూతురికి చూపించి 'నీ కీయన భర్త కావడం ఇష్టమేనా' అని అడుగుతారు. ఆమెకు నచ్చనిచో వెంటనే చెపుతుంది. నచ్చినట్లయితే శయనానంతరం చెపుతానంటుంది. నచ్చిన సందర్భంలో పెద్దలు అతనికి భోజనం పెట్టించి ఆ రాత్రి ఇరువురికి ఏకాంతం కల్పిస్తారు. తెల్లవారిన తర్వాత ఆ స్త్రీకి

అతడు నచ్చినట్లైతే వారికి పెండ్లి జరుగుతుంది, లేకుంటే వచ్చిన మనిషి నిరాశతో వెళ్ళవలసి వస్తుంది. ఈ విధంగా "అమ్మదవతులు మదన కదనమునం దమకు ముదమొదవించువాడు దొరకుదనుక రుచి చూచుచుండుటం" జేసి వివాహకాలం నాటికి గర్భవతులుగానో, బిడ్డల తల్లులుగానో తయారవుతున్నారట![16]

పెండ్లి ఐన తర్వాత కూడ ఆమెకు ఇష్టం లేకుంటే మరొకరిని వివాహం, చేసుకునే స్వేచ్ఛ ఉంది. ఆ సందర్భంలో రెండవ భర్త మొదటి భర్తకు పెండ్లి ఖర్చులు ఇచ్చుకోవాల్సి ఉంటుంది. భార్యాభర్తల్లో ఎవరు ఎవరిని వదలిపెట్టినా వెళ్ళిపోయేవారికి తమ బిడ్డల మీద అధికారముండదు దంపతుల్లో ఎవరు చనిపోయినా మిగిలినవారు పునర్వివాహం చేసుకుంటారు. వస్త్రాభరణాలను, వారు వాడుకొన్న మట్టి పాత్రలను మృతుల చితిపై ఉంచి దహనం చేస్తారు. లోకాంతరంలో కూడ వారికా వస్తువులు అవసరమనే విశ్వాసంతో ఈ పనికి పూనుకుంటారు.

బడుగరులలో ఒక్కో గ్రామానికి ఒక్కరు పెద్దతనం వహించి 'మణియగాండ్రు'గా నియమింపబడతారు.[17] ముళ్ళు కురుంబర జాతి తప్ప మిగతా నాలుగు జాతులలో వీరి మాటకు ఎదురులేదు. వీరికి జీవనాధారం కోసం మిరాశి నేలలు ఇవ్వబడతాయి. దీనికి ప్రతిగా పై నాలుగు కులాల నుండి 'బేడిగ రూకలు' కూడ బెట్టి దివాణం వారికి చెల్లించడం వీరి పని.[18]

ఊరాళి జాతివారు బడుగరులకు సేవకులై వారిచ్చే జీతంతో కాలం గడుపుతారు. బడుగరుల భాష, వారి నాశ్రయించిన ఊరాళి వారి భాష కర్ణాటా భాసంతో ఉంటుందట!

---

16. నీలగిరి యాత్ర. పేజీ 40.
17. మన్నెము = Highlands, hilly land, hill - country, Uplands. మన్నెగాడు a high lander. మన్నెదొర, మన్నెపుదొర a high land chieftain. బ్రౌణ్య తెలుగు ఇంగ్లీషు నిఘంటు.
18. బేడిగ = The sum paid as rent. బ్రౌణ్యం.

తొదువరుల భాష ఇంగ్లీషు భాషోచ్చారణతో ఉంటుంది. వీరు నీలగిరిలోని భూములన్నిటికి అధికారులు. నీలగిరిపై స్థలం కావాల్సిన వారంతా వీరి వద్దనే కొని ఇండ్లు నిర్మించుకొంటారు. వ్యవసాయకులైన బడుగరులు వీరికి 'మేలు వారము' చెల్లిస్తారు.[19] తొదువరులకు భూముల వల్లనే కాకుండా గేదెలవల్ల కూడ జీవిక ఉంది. వీరి కులంలో ఎవరైనా మరణిస్తే తద్దినానికి బంధువుల నందరినీ పిలిపించి వారికి తృప్తిగా నెయ్యి, పెరుగులతో భోజనం పెడతారు. వచ్చిన చుట్టాలంతా ఇంటికో బర్రె వంతున తెచ్చి చచ్చిన ఇంటి వారికిస్తారు. వీటిని తాముంచుకొని తమ దగ్గరున్న బర్రెలను ఉత్తర క్రియలనాడు చంపి వాటి చుట్టు కూర్చుండి ఏడుస్తారు.

దహనసంస్కార సమయంలో బడుగరుల కంటె వీరొక అడుగు ముందుకు వేశారు. మృత శరీరంతోపాటు వధింపబడిన మహిషములను, అతని వస్తువులను, చివరకు ఇంటిని కూడ దహించి ఆశౌచ నివృత్తి చేసికొని మరొకచోట ఇల్లు కట్టుకొని, బంధువులు తెచ్చి ఇచ్చిన గేదెలతో నూతన జీవితం ప్రారంభిస్తారు.

ఈ కులంలోని వివాహక్రమాన్ని శేషాచలకవి ఈ విధంగా తెలియ పరచాడు: తొదువరజాతి స్త్రీలు రజస్వలలు కాకమునుపే మగలతో కూడుతారు. ఒకే కుటుంబంలోని సోదరులంతా అగ్రజుని భార్యతో సంసారం చేసే ఆచార ముంది. అతడు బాగా ముసలివాడైనా, లేదా ఆ స్త్రీ మరణించినా, మళ్ళీ అతనికే పెండ్లి చేసి వచ్చిన స్త్రీతో సంసారం చేస్తారు. కాని అన్న బ్రతికుండగా వారు పెండ్లి తలపెట్టరు. భార్య జీవించి ఉండగా వేరే స్త్రీతో సంబంధం పెట్టుకోరు. అది ఆచారం కాదు. వివాహాపేక్ష కలవాడు కాని, ఏక కుటుంబంలో ఉండటానికిష్ట పడలేనివాడు కాని విడిపోయి వివాహం చేసుకోవచ్చు.

ఈ ఇంటి స్త్రీలు ఇళ్ళలో ఉన్నప్పుడు వివస్త్రలై నిర్లజ్జగా తిరుగుతారు. ఐతే ఆ సమయంలో కుటుంబేతరులు కనిపిస్తే మాత్రం వస్త్రధారణ చేస్తారట!

---

19 ఇది తమిళ పదం Government share of agricultural produce. మేటికోరు is the same as స్వామిభాగము or the farmer's share. బ్రౌణ్యము.

ఇది వింత ఆచారమే. వస్త్రధారణ గురించి శేషాచలకవి ఇట్లా చెప్పాడు: కటి స్థానం మొదలుకొని తొడలు, స్తనాలు కప్పేటట్లుగా పోకముడి వేయకుండానే ఒంటి చుట్టు గుడ్డ చుట్టుకుంటారు. ఒక మూపునుండి రెండో మూపుదాకా కుచోర్ధ్వ భాగంలో ధనురాకారంగా పచ్చబొట్టు పొడిపించుకుంటారు. కొప్పు ముడుచుకునే అలవాటు లేదు. వెంట్రుకలను కత్తిరించి చెక్కిళ్ళ మీదికి జారవిడుస్తారు.

ఈ జాతిలో పురుషులకంటె స్త్రీలే రూపవంతులు, విలాసవతులు కూడనట! పురుషులు గడ్డాలు, మీసాలు, తల వెంట్రుకలు పెంచుకొని అసహ్యంగా ఉంటారు. బడుగరి జాతి పెద్ద మనుష్యులు ఈ జాతి స్త్రీలను ఒంటరిగా చూసి బలాత్కరించి అనుభవిస్తుంటారు. ఇట్లాంటి సంఘటనలు అనేకం జరిగిన తర్వాత, ఆ పెద్ద మనుష్యుల నెదిరించే స్తోమతలేక పురుషులు బయటకు వెళ్ళే టప్పుడు తమ భార్యలను మోసికొని పోయి తిరిగి ఇంటికి చేరుస్తారట!

కోత్తరనువారు పై మూడు వర్ణాలవారి కంటే తక్కువజాతి. వీరు మాట్లాడే భాష కన్నడ భాషను పోలి ఉంటుంది. వడ్రంగి, కంసాలి, కమ్మర, కుమ్మర, ఉప్పర, మంగల, చలవాది పనులు చేసేవారు ఎక్కువ.[20] చర్మ, సుషిర (డప్పు, మురళి వాద్యాలు) వృత్తిలో కూడ కొందరున్నారు.

ముళ్ళు కురుంబరులకు కురుంబరులని కూడ వ్యవహార నామమున్నట్లు శేషాచలకవి తెల్పారు. వీరికి స్వభాష అంటూ ఏదీలేదు. తక్కిన పార్వతీయులతో కలిసి ఉండకపోవడానికి ఇదొక కారణం కావచ్చు. మరింత దట్టమైన అరణ్యం లోపలి ప్రాంతంలో పర్ణశాలలు నిర్మించుకొని జీవిస్తారు. మంత్రశక్తి, మూలికా శక్తులు తెలిసినవారు కాబట్టి పురుషులే కాదు స్త్రీలుకూడ క్రూర మృగాలంటే భీతిచెందరు. ఈ అతీత శక్తులవల్ల వేరే జాతివారు వీరంటే భయభక్తులు ప్రదర్శి

---

20. చలవాది = An undertaker's messenger, who carries about the news of a death. A beadle or javelin bearer who attend the Pedda Shetti or mayor. These attend when the (Banijgar) shopkeepers perform any procession. (బ్రౌణ్య నిఘంటువు).

స్తారు. అంతేకాక తాము సంపాదించిన డబ్బులో కొంత కప్పం రూపంలో సంవత్సరానికింత అని చెల్లిస్తారు. వేరే జాతివారికి అసాధ్యమనిపించిన స్థానాల్లోని తేనె తుట్టెలనుంచి తేనెను సేకరించడం వీరి ప్రత్యేకత.

ప్రతియేడు కటకమాసంలో 18 వ రోజు కావేరినది తప్పకుండా నిండుగా ప్రవహిస్తుందట. పద్దెనిమిదవ అనే అర్థంలో తమిళులు దీన్ని 'పదనెట్టాం పెఱుక్కు' అంటారనీ, ఐతే అక్కడి తెలుగువారు దీన్నే 'పద్దెనిమిదవ పండుగ' అని పిలుచుకుంటారనీ శేషాచలకవి వ్రాశాడు. ఈ నది ఏయే గ్రామాలను చుట్టుకొని ప్రవహిస్తుందో ఆయా గ్రామాల ప్రజలు ఈ రోజు అక్కడికి వచ్చి అందులో స్నానం చేస్తారు. ఒడ్డున పసుపు ముద్దనుంచి దాన్నే కావేరిగా భావించి, చందన పుష్పధూప దీపాదులతో పూజలు చేస్తారు. చెవి యాకులు(చెవి కమ్మలు కావచ్చు), కొత్త బట్టలు, కొత్త చేటలు, నల్లపూసలు, బంగారు తాళిబొట్లు, కొబ్బరికాయలు, కుంకుమ ఇంకా కొన్ని వస్తువులు తమ శక్త్యనుసారం ఆ నదిలో విడిచి ఇండ్లకు వెళతారు. తర్వాత ఇలవేల్పులను, మృత సువాసినులను నట్టింట్లో పూజించి నమస్కరించడం ఇక్కడి స్త్రీల సంప్రదాయంగా శేషాచలకవి పేర్కొన్నాడు.

ఆశ్వయుజ శుద్ధ నవమి నాటి ఆయుధ పూజ జరిపే విధానాన్ని గురించి కూడ శేషాచలకవి వర్ణించాడు. నానాదేశాలనుండి వచ్చి నీలగిరిలో నివాసమేర్పరచుకొన్న ప్రజలు ఆయుధ పూజ కొరకు వేటలను 'గావు' లిస్తారు.[21] వివిధ ఫలాలు, అపూపములు, నైవేద్యాలతో మేష మస్తకాలను ఆయుధం దగ్గర ఉంచి, పూజ చేసిన తర్వాత ఆ తలలను అక్కడే గంపల క్రింద కమ్మి ఉంచి తెల్లవారి వాటిని చాకలివారి కిస్తారట. ఐతే మిగతావారు మాత్రం పూజ జరిగిన రోజునే వేటలను వండి భుజిస్తారని తెలుస్తున్నది.

## ii. గృహ నిర్మాణం :

నీలగిరిలోని ఇంగ్లీషువారి గృహాలు కొన్ని ఉప్పరిగెలు, కొన్ని దద్దడములని శేషాచలకవి పేర్కొన్నాడు. మరికొన్ని యోడు బిల్లలచే కొన్ని యవురుచే

---

21. గావులివ్వటం అంటే బలి ఇవ్వటం అని అర్థం.

కప్పబడి ఉన్నాయట.[22] అక్కడి చలికి తట్టుకోవటానికి వీలుగా ఆ నివాసాల కన్నిటికి కిటికీలు, తలుపులు గాజు పలకలతో నిర్మింపబడి ఉన్నట్లు గమనించాడు.

సిలగిరిపైన పెద్ద బజారులో అనేక నివాసాలు మట్టిగోడలచే చిన్నగా కట్టబడి ఓడు బిల్లలచే కప్పబడ్డాయి. ప్రతి ఇంటికి లోపలిగది, ఒక వంటగది, ఈ రెంటి నడుమ వెదురు తడకలచే ఆవరింపబడి ఒక లోగిలి ఉంటుంది. ఏ ఇంటికైనా ముందు వాకిళ్ళు నాలుగడుగులకు మించి ఉండవు. అగ్రహారంలో ఒక తహసీలుదారు గృహమూ, పెద్ద బజారులోని సుబేదారు ఇల్లూ విశాలంగా ఇంగ్లీషువారి గృహ నిర్మాణాన్ని పోలి ఉన్నాయి[23] అన్ని వసతులతో అనుకూలంగా ఉన్న సుబేదారుని భవనంలోని ఒక భాగంలో శేషాచల కవి, తన మిత్రుడు మాంగాడు శ్రీనివాస మొదలారితో విడిది చేసినట్లు వ్రాసుకున్నాడు.

## iii. వాతావరణ స్థితిగతులు :

కోలా శేషాచలకవి నివసించిన ఏడు నెలల కాలంలో తన అనుభవానికి వచ్చిన శీతోష్ణ పరిస్థితులను గురించి ఈ విధంగా వివరించాడు:

ఈ పర్వతం మీద మేష సంక్రమణం (ఏప్రిల్) మొదలుకొని ఏడు నెలలు వానాకాలం. తర్వాత నాలుగు నెలలు శీతాకాలం తక్కిన నెల వర్షంగాని, మంచుగాని ఉంటుంది. కాని ఎండకు ఇన్ని నెలలని లేదు. తూర్పుగాలి వీచేటప్పుడు ఉరుములు, మెరుపులతో కుంభవర్షం కురుస్తుంది. వానలేని వేళ ఎండా, చలీ ఎక్కువగానే ఉంటాయి. పడమటి గాలులు వీచేటప్పుడు సన్నని చినుకులు పడతాయి ఉరుములు, మెరుపులుగాని, ఎండగాని ఉండవు. ఐనా చలి ఎప్పటి మాదిరిగానే ఉంటుంది. కాగా ఈ సమయంలో ఆ కొండమీద స్వాభావికమైన శైత్యగుణం నెలకొని ఉంటుంది.

---

22. ఉప్పరిగె = The chamber or Upper storey of a house.
దద్దళము = A flat ceiling. A small temple with a flat mud roof. A flat roofed house. ఇంటి మిద్దె.

23. ఈ ఉద్యోగస్థులిద్దరూ భారతీయులే.

అక్కడి వారు స్వల్పంగా కురిసే మంచును 'నీరు మంచు' అంటారనీ, ఎక్కువగా కురిసే మంచును 'గండు మంచు' అంటారనీ శేషాచలకవి పేర్కొన్నాడు. ఈ మంచు నవంబర్, డిసెంబర్ మాసాల్లో ఎక్కువగా కురుస్తుంది. మంచుకురిసే సమయాల్లో ఉన్ని వస్త్రాలెన్ని తొడిగినా, చలిగాలి చొరని లోపలి గదుల్లో ఉన్నా చలి వెంటాడి తీరుతుందట! ముఖం, పెదవులు చిట్లిపోతాయి. ఇంగ్లీషు వారే 'కోల్డుక్రీము' పూసుకొని తిరగటాన్ని శేషాచలకవి గమనించాడు. అది లేనివాళ్ళు వెన్న రాసుకుంటే చాలుననీ, ఒంటినిండా దుస్తులు ధరించి తీరాలనీ, లేకుంటే కాళ్ళు చేతులకు కూడ పగుళ్ళు తప్పవని శేషాచలకవి చెప్పాడు. ఈ కాలంలో మంచు గడ్డకట్టుటే కాక రాత్రి బయట ఉంచిన పాత్రల్లోని నీళ్ళు కూడ గడ్డ కడతాయి. రచయిత మాటల్లో చెప్పాలంటే "అచ్చట నగ్ని యొకండు దక్క నెల్ల పదార్థంబులు నతి శీతలంబులయి యున్నయవి."[24] నిప్పును తాకి ఓర్చుకోవచ్చునేమో కాని, మంచుగడ్డలను తాకినచో ఓర్చుకొనుట కష్టమట!

గండుమంచు కురిసే సమయంలో ప్రజలు జ్వరం, నెత్తురు బంక వంటి దేహబాధలకు గురౌతారు. పూటపూటకు పాలు, పెరుగు, నేయి వాడితే ఉపయోగకరంగా ఉంటుంది. కాని ఆ కాలంలో పాలు సమృద్ధిగా దొరకవు. హిమపాతం వల్ల చివికిపోయిన పూరిళ్ళు పగటివేళ ఒక్కొక్కసారి నిప్పంటుకుంటాయి. ఈ సమయంలో ఇంగ్లీషువారు ఇక్కడ ఉండటానికి ఇష్టపడక కోత్తగిరి, కున్నూరు గ్రామాలకు వెళ్ళి నివసిస్తారట. శీతలదేశస్థులకే ఇక్కడి చలి ఇంత వెక్కసంగా ఉంటే ఉష్ణదేశస్థుల గురించి చెప్పవలసిన పని లేదుకదా!

విస్తట్లో వడ్డించుకొన్న వేడి వేడి అన్నాన్ని కొంత భుజించిన తర్వాత, ఎడంగా ఉంచుకొన్న అవశిష్టాన్నాన్ని తినబోతే చద్దన్నం వలె ఉంటుంది. 'టెంకాయ నూనియ నేతి తెరగునం బేరుచున్నది' అన్నాడు శేషాచలకవి. దీనిలో స్థానిక విశేషమేమీ కనిపించదు. వేరే ప్రాంతాల్లో నూనె చలికి గడ్డకడుతుంది

---

24. నీలగిరి యాత్ర. పేజీ 45.
సూరాబత్తుల సుబ్రహ్మణ్యముగారు నీలగిరి యాత్రచేసి అక్కడి చలి గురించి వర్ణిస్తూ, 'గదిలోని విద్యుద్దీపములొక్కటే ఈ చలికి లొంగక వెక్కిరించుచున్నట్లు వెలుగుచున్నవి' - "కళ - ప్రకృతి". పేజీ. 94.

కూడ. చలిగాలి వీచేటప్పుడు నీడనున్న పదార్థాలేకాదు, ఎండలో ఉన్న నూలు బట్టలు కూడ చల్లబడటాన్ని కవి అనుభవించాడు.[25] ఒక్కరోజు కూడ ఈ చలిలో నిత్యకృత్యాలను సక్రమంగా జరుపుకోవడానికి వీలు కాలేదని శేషాచలకవి చింతించాడు.

రచయిత ఆ చలిని తట్టుకోవడానికి జంట ఇజారులు(పైజామాలు), జంట అరచట్టలు (కోట్లు), చెవులు కప్పునట్లు టోపీలు, చేతులకు కాళ్ళకు ఉన్ని తొడుగులు, కొన్ని సందర్భాల్లో కంబళి కప్పుకోవటం కూడ చేయవలసి వచ్చిందని వ్రాశాడు.

ఐతే ఆ వాతావరణ ప్రభావంవల్ల ఒక సుగుణముందట! జీర్ణశక్తి ఎక్కువగా ఉంటుంది. ఆరోగ్యంగా ఉండాలంటే గొర్రె మాంసము, బంగాళా దుంపలు, పెసరపప్పు, పాలు, పెరుగు, నేయి, మొదలైన సారవత్పదార్థాలు క్రమం తప్పక భుజించాల్సి ఉంటుంది.

నీలగిరి ధనవంతులకే కాని లేనివారికి అంత సౌఖ్యప్రదమైనది కాదని ఆ నాటికే ఆ అభిప్రాయమున్నట్లు తెలుస్తున్నది. కట్టుకోవడానికి సరైన గుడ్డలు లేక బజారుల్లో నడిచే ప్రజలు వానకు తడిసి వడవడ వణుకుతూ చలి తీవ్రతకు నాడులన్నీ బిగిసికొని దుర్మరణం పాలవుతారు. ఉధృతమైన చలిగాలికి ఊపి రాడక ఉక్కిరి బిక్కిరి అయి మరణించేవారు మరికొందరు. ప్రతియేడు ఈ రకమైన వానచావులు, చలిచావులు సహజమేనట!

శేషాచలకవి గారు తన అనుభవంలోకి వచ్చిన ఒక సంఘటనను వివరించాడు: అంగడి సాగుతున్న ఒకనాటి మధ్యాహ్నం వర్షం ప్రారంభమయింది. ఎక్కడ ఉన్న వస్తువుల నక్కడే ఉంచి వ్యాపారస్తులు సమీపస్థ గృహాలకు పరుగెత్తి వెళ్ళారు మరికొంతమంది లోభులు తమ సరుకులను కూడ మోసికొని

25. సుబ్రహ్మణ్యము గారు 'తాళము వేసిన పెట్టెలోని బట్టలకు కూడ మంచు మహాత్త్య మంటినవి. ఇచ్చట ముట్టినదెల్ల మంచుగడ్డయే' అన్నాడు. అదే. పుట. 94.

పోవటంలో చాలసేపు వానలో తడిసి కొంకర్లుపోయారు. అక్కడి తహసీలు దారు ఇది గమనించి తన మనుష్యులచే వారిని తెప్పించి, బాగా అగ్నిని రగుల జేయగా ఆ వెచ్చదానికి కొంతమంది కోలుకున్నారు! మరికొంతమంది మర ణించారట!!

ఐతే పైన వర్ణించిన శీతవాత వర్షాలు శేషాచలకవి యాత్రాకాలం నాటికి ఇరవై యేండ్లకు పూర్వమున్న వాటిలో పదోవంతు కూడ కాదట! ఇప్పుడే ఇట్లా ఉంటే అప్పుడెట్లా జనం సహించారో ఊహించడానికే కష్టంగా ఉంది.

## iv. పండ్లూ, కాయగూరల వివరాలు :

యాత్రాకాలంనాటికి ఒక్కొక్క ఊరిలో ఒక్కొక్క రోజు సంత జరిగే దనీ, సమీపంలోని గ్రామవాసులు తమకు కావలసిన వస్తువులను కొనుక్కొని వెళ్ళేవారనీ 'నీలగిరి యాత్ర' గ్రంథంవల్ల తెలుస్తున్నది.

నీలగిరిలో ప్రతి మంగళవారం సంత జరిగేది. ఈ సంతలో అమ్మడానికి వచ్చిన కాయగూరలు, పండ్లు - అరటి, గుమ్మడి, బెండ, బీర, ఉసిరిక, వంగ, కాకర, మావి, పందిరి చిక్కుడు, గోరుచిక్కుడు, వదరు (సొరకాయ), కంద, చిలకదదుంపలు, మునుగాకు, అవిసె ఆకు, కోయకూర, తోటకూరలు, మామిడి, అరటి, పనస, దానిమ్మ, ఖర్జూర, త్రాటి, అనాస, దోసపండ్లు. కొబ్బరికాయలు, చెరకు గడలు, చెరకు బెల్లము, తాటి బెల్లము, తాటి కలకండ, చక్కెర- ఇంకా బాతులు, కోళ్ళు, వాటి గ్రుడ్లున్ను, పావురాలు కూడ కొండక్రిందిగ్రామాల నుండి పైకి తెచ్చి అమ్ముతుంటారు.

బంగాళాదుంపలు, కిచ్చిలి మణీలా, కిచ్చిలి నిమ్మపండ్లు, ముల్లంగి గడ్డలు, ఉల్లిగడ్డలు, గసగసాలు, గంజాయి, గోధుమలు, కొఱ్ఱలు, బఠాణీలు, కాఫీగింజలు- ఈ పర్వతంపై పండే పంటలు. స్థానిక పంటలు కాబట్టి ఇవి తక్కువ ధరకే అమ్మబడుతాయి. ఈ కొండపై గసగసాలు బాగా పైరు చేస్తారు కనుక ఇక్కడ

నల్లమందు కూడ తయారుచేసి అమ్ముతారు.[26] ఇక్కడ తయారయ్యే నల్లమందు చౌక్కమైనదని శేషాచలకవి తెలుసుకున్నాడు.[27]

నీలగిరిలో పండే బంగాళా దుంపలు కొన్ని తాటిపడ్లంత పెద్దగా ఉండి కూరగా వండితే రుచిగా ఉంటున్నాయట!

హిల్గూస్పైటి అనే పండ్లను భారతీయులు తవిటి జామపండ్లంటారు వీటిలో ఒక ప్రత్యేకత ఉంది. మన దేశపు జామ పండ్లు ఎక్కువ తినేవారికి గ్రహణి వ్యాధి కలిగితే, ఈ పండ్లు తిన్నవారికి ఆ వ్యాధి అణగిపోతుందట.

జాజులు, సంపెంగలు, మల్లెలు, మొల్లలు ఇక్కడ లేవు. కాని చేమంతులు, గులాబి పూలు మాత్రమున్నాయి. కొబ్బరి, తాటి, ఉసిరిక, అరటి, రేగు, మర్రి, ఖర్జూరం, మునగ, పోకచెట్లు కొండపై కనిపించవు. 'ఇరుల్‌కణ్' అనే ఒక జాతి వృక్షాలు నరికిన చోట తడి ఉండేదాకా నిప్పులా వెలుగుతూనే ఉంటాయని, రాత్రివేళ అగ్నిలాగ చాల దూరం కనిపించే జ్యోతిర్వృక్షాలు కూడ ఆ కొండపై ఉండేవని శేషాచలకవి విన్నట్లుగా వ్రాశాడు.

కొండమీద తయారయ్యే నెయ్యి చూడటానికి తెల్లగా బాగానే ఉంటుంది కాని, వాసన బాగుండదు. 'కమ్మెరాకులు', లవంగాలు కలిపి కాచినట్లైతే ఆ వాసన కొంత తగ్గుతుందని అనుభవపూర్వకంగా శేషాచలకవి చెప్పాడు.[28] అయినా ఆ నెయ్యి తినదగినది కాదన్నాడు. కాని కాచిన నేతితో వండిన లడ్డు మొదలైన భక్ష్యాలు చాలా రుచిగా ఉన్నాయనీ, వీటి ధర వీసె ఒక్కంటికి పదిహేను అణాలని పేర్కొన్నాడు.[29] కోయంబత్తూరు నుండి కొంతమంది మంచి నేయిని

---

26. 'గసగసా కాయలమీది బంకనే అభినిమందు (నల్లమందు) అంటారు' అని కాశీయాత్ర చరిత్ర పేజీ. 280.
27. కాశీయాత్ర చరిత్రలో కూడ దీని ప్రస్తావన వచ్చింది. "హిందూస్తాన్‌లో పండే పంటను శేఖరం చేసేకొరకు పాట్నాలో సర్ చార్లిస్ డాలిబ్యార్టు అనే దొరను నియమించార"ని వ్రాశాడు. పేజీ 280.
28. కమ్మెరాకులు = A sort of paun leaves. బ్రౌణ్య నిఘంటువు.
29. వీసె = 120 Tolas. శేరున్నర అన్నమాట! దాదాపుగా కిలోపావు తూకం.

కొండమీదికి తెచ్చి అమ్ముతుంటారు. కాని ఇన్ని అవస్థలు పడటంకంటె వెన్న కరిగించి వాడటం మంచిదని రచయిత అభిప్రాయపడ్డాడు.

అక్కడ దొరికే ఉప్పు మట్టితో కలిసినది. నీళ్ళలో కరిగించి వాడుకోవాలి. ఎండుచేపలు, రొయ్యలు లభిస్తాయి కాని పచ్చివి అరుదు. కావాలనుకుంటే మోటుపాళియం నుండి 'అంచెల' ద్వారా తెప్పించుకోవలసిందే.[30]

వంట చెరకు పుష్కలంగా దొరుకుతుంది కాబట్టి పిడకలతో వంటచేసే పద్ధతి అక్కడ లేదు.

ఇతర ప్రాంతాలలోవలె ఇక్కడ వడలు రంధ్రాలతో చేయడం లేదు. దీనికి శేషాచలకవి అక్కడి వృత్తాంతాన్ని హేతువుగా పేర్కొన్నాడు : వివిధ రకాల 'అపూపముల' నక్కడ స్త్రీలే అమ్ముతారు. కొండమీది పార్వతీయులు, కొండక్రింది పిండారివాళ్ళు అతిరసాలు, వడలను కలిపి వడలనే వ్యవహరిస్తారు. వీటిమధ్య భేదం తెలియడానికి వడలకు 'దొండివడై' అని పేరు పెట్టుకొని, వెల యిచ్చి 'దొండివడై యిమ్మని' అడుగుతూ వచ్చారు.[31] ఆ మాట ద్రావిడులకు నర్మగర్భితంగా ఉండటంవల్ల అక్కడి స్త్రీలు వడలను సరంధ్రాలుగా చేయడం మానేశారట!

వివిధ రకాల లోహపాత్రలే కాని మట్టిపాత్రలు అక్కడ తయారుకావడం లేదు. కొండ క్రిందినుండి తెచ్చి ఎక్కువ ధరకు అమ్ముతారు. చెన్నపట్టణంలో ఒక రూక దొరికే కడవ ఇక్కడ నాలుగు రూకలవుతుందనీ, కొండ మట్టితో కుండలు చేసే నేర్పరు లిక్కడ లేకపోవడమే ఇందుకు కారణమనీ శేషాచలకవి వ్రాశాడు.

---

30. అంచె = The Post, a relay of horses or Palankeen bearer. బ్రౌణ్య నిఘంటువు.
31. దొండి = రంధ్రము, సందు, బొక్క. దొండి పొడుచుట To bore - బ్రౌణ్య నిఘంటువు. "ద్రావిడంబునందు.న రంధ్రమునకు దొండి యను పేరుగలదు" - నీలగిరియాత్ర. ఫుట్‌నోట్. పేజి. 36.

అరటి ఆకులు అధికంగానే దొరుకుతాయి. ధర తక్కువే. పోకపట్టలు కూడ బజారులో ఎప్పుడూ అమ్ముతూనే ఉంటారు. మూరెడు పొడవు, జానెడు వెడల్పు ఉండే ఈ పట్టలను 'రువ్వ' కొక్కటి చొప్పున అమ్ముతారు.[32] అనగా అప్పటి మారకంలో ఒక పైసా అవుతుంది. పైసకు విలువ లేని నేటి కాలంలో మనకు విచిత్రమనిపించవచ్చు గాని, సామాన్యులు ఈ పట్టలను పూటపూటకు భోజనం తర్వాత శుభ్రం చేస్తూ ఒక్కొక్క పట్టాను పక్షం రోజుల దాకా వాడుకునేవారట!

నీలగిరిపై కొన్నిచోట్ల గుంపులు గుంపులుగా చెట్లు దర్శనమిస్తాయి. వీటిని అరవలు 'శోలె' లంటారు. అంటే తోపులని అర్థం. ఈ తోపులు బెబ్బులులు, చిరుతపులులకు నిలయాలుగా ఉండేవి.

## V. పశు పక్ష్యాదులు :

నీలగిరిపై త్రాచులు, చీమలు, దోమలు, నల్లులు, బల్లులు, తేళ్ళు లేవట! నువ్వుగింజల కంటె కొంచెం పెద్దగా ఉండే 'తెళ్ళుపూచి' అనే పేరున్న పురుగులు రాత్రి నిద్రపోయాక కొరికి నెత్తురు పీలుస్తాయనీ, వీటి బాధనుండి తప్పుకోవడానికి ధనవంతులు మంచాల మీద, పేదవారు పెట్టెల మీద, అటకల మీద పడుకొంటారు. ఎత్తు పైన పడుకొంటే వీటి బాధ ఉండదు.

కోలా శేషాచల కవి యాత్రచేసే కాలం నాటికి కొన్ని సంవత్సరాల క్రితం ఈ ప్రాంతంలో మాలకాకులు, గ్రద్దలు, ఊరపిచ్చుకలు, గరుడ పక్షులు, గోరువంకలు ఉండేవి కావట! ఐతే వీటిని ఇంగ్లీషువారు కొండ క్రింది నుండి పట్టి తెచ్చి ఇక్కడ విడిచిపెట్టడంవల్ల క్రమక్రమంగా అవి వృద్ధి పొందాయని వ్రాశాడు.

---

32. రువ్వ = A Farthing. దమ్మిడీ. బ్రౌణ్య నిఘంటువు. "1 దుడ్డు లేక దుగ్గాణీ = 2 పైసలు (పేజీ. 231), 1 దుగ్గాణీ = 2 దమ్మిడీలు (పేజీ 230) అని 'విస్మృతాంధ్రము - విశాలాంధ్రము' అన్న గ్రంథంలో దిగవల్లి వేంకట శివరావుగారు వ్రాశారు.

## vi. భౌగోళిక వివరాలు :

చెన్నపట్టణానికి నైరుతి దిశలో ఉంది నీలగిరి ఇది సముద్ర మట్టానికి 8640 అడుగుల ఎత్తుంది.

యాత్రాకాలం నాటికి నీలగిరిలో సగం కోయంబత్తూరు జిల్లాలో, సగం మలయాళ దేశంలో చేరి ఉన్నట్లుగా శేషాచల కవి వ్రాశాడు. ఇప్పుడు ఇది ఉదకమండలం (ఊటీ) పేరుతో తమిళనాడులో జిల్లా కేంద్రంగా పరిగణింప బడుతోంది.

శేషాచలకవి ప్రయాణించిన మార్గంలో తటస్థపడ్డ అప్పటి గ్రామాలు కొన్ని ఇప్పుడు జిల్లా కేంద్రాలయ్యాయి. అవి కాంచీపురం, వేలూరు, ధర్మపురి, ఉదకమండలం.

కాంచీపురం ఆకాలం నాటికే నాలుగైదు వేల యిండ్ల గ్రామమని, అక్కడ తాలూకా కచ్చేరి ఉండేదని తెలుస్తున్నది. వేలూరులో తాలూకా కచ్చేరి, కంపెనీవారి సైన్యం, కోట, దానిలో దళనాయకుడు ఉండేవారు. యాత్రాకాలం నాటికి వేలూరు చిత్తూరు జిల్లా క్రిందిది. తర్వాత తమిళనాడులో జిల్లా కేంద్ర మైంది.

సేలం అప్పటికే జిల్లా కేంద్రం. ఇక్కడ కలెక్టరు కచ్చేరి, జిల్లా కోర్టు, మునసబు కోర్టు, సెషన్ కోర్టులు ఉండేవి. ఒకటిన్నర కిలోమీటర్ల పొడవున్న విశాలమైన ఊరు. సేలం జిల్లా క్రింది గొప్ప పేట ధర్మపురి. ఇక్కడ తాలూకా కచ్చేరి ఉండేది. తర్వాత ఇది జిల్లా కేంద్రంగా మారింది.

ఈరోడుపేట ఆకాలంలో గొప్ప పేటస్థలం తాలూకా కచ్చేరీ ఉండేది. కోటకూడ ఉండేది. ఇప్పుడిది జిల్లా కేంద్రం.

శేషాచల కవి యాత్రా కాలం నాటి పళ్ళికొండ, తిరుప్పత్తియూరు అనే తాలూకా కచ్చేరీలు గల గ్రామాలు తప్ప, అప్పటి తాలూకా కచ్చేరీలున్న కాంచీపురం, వేలూరు, ధర్మపురి, ఈరోడులు ప్రస్తుతం తమిళనాడు రాష్ట్రంలో జిల్లా కేంద్రాలైనాయి.

## vii. ఆర్థికాంశాలు :

### a) ధరవరలు :

నీలగిరిపై పెద్ద బజారులో జరిగే సంతలో అమ్మే వస్తువుల ధరలు క్రింది విధంగా ఉన్నాయి :

తెలుపు నలుపుల బాణాల గొంగడి = 10 అణాలు (ఇప్పటి 60 పైసలు)
లడ్డు మొదలైన మధుర భక్ష్యాలు వీసె 1కి అంటే దాదాపు 1200 గ్రాలకు } = 15 అణాలు (ఇప్పటి 90 పైసలు)
నీళ్ళ కడవ (కొండ క్రింద) = 1 రూక. ($7\frac{1}{2}$ పైసలు)[33]
నీళ్ళ కడవ (కొండ పైన) = 4 రూకలు (30 పైసలు)

### b) కిరాయిలు :

కావేరి నదిని దాటించడానికి బండి ఒక్కంటికి = 2 అణాలు (12 పైసలు)
మోటు పాళియం నుండి నీలగిరిదాక కూలి మనిషికి = 10 అణాలు (60 పైసలు)
నీలగిరి దాక డోలీ మోసే మనిషికి = 1 రూపాయి పావలా.
నీలగిరి దాక ఎద్దుకు = 1 రూపాయి పావలా.
మద్రాసు నుండి మోటుపాళియంకు బండి కిరాయి = 24 రూపాయలు.

### c) జీత బత్తెములు :

యాత్రాకాలం నాటికి కోర్టులు, తాలూకా కచ్చేరీలు ఉన్నప్పటికీ అప్పటి ఉద్యోగస్థుల జీతనాతాల గురించి శేషాచలకవి పేర్కొనలేదు. ఐనా దొరికినంత మట్టుకు :

తహశీలుదారుని నెల జీతము — 50 రూపాయలు
కొత్తవాలు (Chief officer of the Police of a city or town) — 42 రూపాయలు

జిల్లాలోని ముఖ్యమైన అధికారులంతా తెల్లవారే. దేశీయులకు తహశీలు దారు, మొదలైన చిన్న చిన్న ఉద్యోగాలు ఇచ్చేవారు. మహమ్మదీయ ప్రభు

---

33. రూక అంటే వెండి నాణెం, సాధారణంగా వెండి పణం అనేవారు.
1 పణం = $1\frac{1}{4}$ అణా. అంటే $7\frac{1}{2}$ లేదా 8 పైసలు.

త్వంలో నేరాలను విచారించే కొత్వాలుకు జాగీరులుండేవి కాని ఇంగ్లీషు ప్రభుత్వం వచ్చిన తర్వాత వారికి నెల జీతాలు ఏర్పాటు చేశారు.

d) పారితోషికాలు :

ఉదకమండలం పైన బెబ్బులులు, చిరుతపులులు, తోడేళ్ళుండేవి. క్రూర జంతువులను చంపిన వారికి దివాణం వారు పారితోషికాలు ప్రకటించినట్లుగా నీలగిరి యాత్ర వల్ల తెలుస్తున్నది.

కోయంబత్తూరు, మలయాళపు జిల్లాలలో —

| | | |
|---|---|---|
| ఏనుగును చంపినందుకు | - | 70 రూపాయలు. |
| ఆడ ఏనుగును చంపినందుకు | - | 50 రూపాయలు. |
| పులిని చంపినందుకు | - | 35 రూపాయలు. |
| చిఱుతను చంపినందుకు | - | 10 రూపాయలు. |
| ఎలుగుబంటిని చంపినందుకు | - | 5 రూపాయలు. |

మద్రాసు గవర్నర్ 'ట్వీడేల్' దొరగారు అక్కడున్న కాలంలో ఒక పెద్దపులిని తుపాకీతో కాల్చి చంపినందుకు దివాణం వారు ప్రకటించిన 35 రూపాయల పారితోషికం అందజేశారనీ, ఆ సొమ్మును తమను సేవించి ఉండే వేటగాండ్రకు పంచిపెట్టాడనీ శేషాచలకవి పేర్కొన్నాడు.

e) శేషాచలకవి శాస్త్రవైదుష్యం :

నీలగిరి యాత్రలో శేషాచల కవి సందర్భవశాత్తు వెలిబుచ్చిన అభిప్రాయాలవల్ల, ఆయన భూగోళ శాస్త్రంలో, వాతావరణ శాస్త్రంలోనేకాక పాక శాస్త్రంలో కూడ ప్రవీణుడని తెలుస్తున్నది.

డైరీ వ్రాసుకునేవారు తేదీలతో సహా వారాలు వ్రాసుకోవటం అంత విశేషమైన విషయం కాదుగాని, శేషాచల కవి వ్యవహారంలో ఉన్న పేర్లను కాకుండా, వారాలకున్న సంస్కృత పదాలను పాండిత్య ప్రదర్శకంగా పేర్కొన్నాడు:

ఆదివారం - తపన, భాను (వారం)
సోమవారం - ఇందు, తారాధిప (వారం)
మంగళవార - మేదినీకుమార, మేదినీతనయ, భౌమ, అంగారక, కుజ (వారం)
బుధవారం - మధ్య, సౌమ్య (వారం)
గురువారం - సురగురు (వారం)
శుక్రవారం - దైతేయ గురు, భార్గవ (వారం)
శనివారం - దివసపతిసుత దివసము, కాళ, శనైశ్వర (వారం).

ఈ విధంగానే దిక్కుల పేర్లు కూడ. యముడు దక్షిణ దిక్కుకు అధిపతి. ఈ పురాణజ్ఞానంతో దక్షిణ దిక్కును—యామ్య దిశ, పాశపాణి దిశ, వైవస్వత దిశ అని పేర్కొన్నాడు.

కుబేరుడు ధనాధిపతి. ఉత్తరదిక్కును పాలించేవాడు. కాబట్టి ఉత్తర దిక్కును - జక్కులదొర దిక్కు, అర్థేశ దిక్కు, ఉదగ్దిశ - అని వ్రాశాడు.

పడమటి దిశను 'వారుణాశ' అన్నాడు. 'ఆశ' అంటే దిక్కని అర్థం. వారుణ + ఆశ — వరుణ దేవుని దిక్కన్నమాట!

శేషాచలకవి వీరాస్వామయ్య గారి లాగ ఈ యాత్రకు నాయకుడు కాడు. దొరగారి పరివారం వెంట గుమాస్తా హోదాలో వెళ్ళాడంతే. కాబట్టి పరివారంతో కలిసి భోజనం చేసినట్లుకాని, కలిసి తిరిగినట్లు కాని ఎక్కడా పేర్కొనబడ లేదు. కాగా ఈయన వర్ణించిన దాన్నిబట్టి నీరున్న ప్రదేశాల్లో చెట్టునీడన బండ్లను నిల్పుకొని స్వయంగా వంట చేసుకొన్నట్లు తెలుస్తున్నది. వంటసామాను కూడ వెంట తెచ్చుకొన్నట్లు ఆ సందర్భంలోనే చెప్పుకొన్నాడు [34]

---

34. "పచనంబున కుచితంబులగు సామగ్రులు గొఱలేక నాకడ నునికించేసి వ్రజంబున నొక్క కుజంబు క్రింద, **భోజన కృత్యంబు** నిర్వర్తించి..." (పేజీ 13)
"ఒక చెట్టు క్రింద **యొనరించిన యోగిరం** బొక్క మఠంబున భుజియించి..." (పేజీ 67)
"దేవళమ్మున నోగిరమ్ము వేగిరమ్ముగ జేసికొని...". (పేజీ 66)

స్వయంపాకంతో శేషాచలపతికి విశేషానుభవ మున్నట్లుగా ఈ క్రింది సందర్భాలవల్ల స్పష్టమౌతున్నది:

నీలగిరిపైనున్న నీటిలో కందిపప్పు తొందరగా ఉడకదని చెప్తూ దానికి ఉపాయం కూడ సూచించాడు:

"అక్కడి నీట గందిపప్పు చక్కగ శీఘ్రంబుగ బక్వంబు గాదు. కావున ముందుగా గొంత లవణంబు గూర్చి యెసరు గాచి దాన నుడికించిన నప్పప్పు శీఘ్రంబ పక్వంబయ్యెడు."35

మరొకచోట క్యాబేజిని పెసర పప్పుతోకాని, మేక మాంసంతో కాని కలిపి వండితే మహా రుచిగా ఉంటుందని స్వానుభవంతో చెప్పాడు:

"ఈ శాకద్వయము మేక మాంసంబుతోడ నొండెం బెసరపప్పు నొండెం గూర్చి పచించిన భోజన యోగ్యతా భాజనంబయి యున్నయది."36

f) భాషా శైలి :

పాలకుల భాషను పాలితులు అనుసరించడం సహజం. ముఖ్యంగా కొత్తగా వచ్చిన పాలనాభాషకు స్వదేశీయపదాలు ఏర్పడని దశలో వాటి ప్రాతిదేయము (Borrowing) అనివార్యమవుతుంది. ఎంతగా భాషా శుచిత్వం మీద మడి గట్టున్న వాడైనా దీన్ని ఆపలేడు. ఆ కాలంలో ప్రభు వర్గాల వారి భాషను మాట్లాడటం ఉపయోగించటం గొప్పతనంగా పరిగణింపబడేది. అంతేగాక ప్రభుత్వోద్యోగాల్లో పని చేసేవారికి ఇది అవసరం కూడ. అయితే ఇట్లాంటి ఆధారం కొన్ని ప్రత్యేకతల్తో జరుగుతుంది. ముఖ్యంగా ఆ భాష మాతృభాషా స్వభావాని కనుగుణంగా ఒదిగిపోతుంది. ఉదాహరణకి అన్యదేశ్యాలు తెలుగులోకి వస్తే సాధారణంగా అజంతాలవుతాయి. తెలుగు నోటికి మాటల చివర అచ్చుల్లేకుండా పలకడం కష్టం. అట్లాగే మాతృభాషలోని యాసలు, అరువు తెచ్చుకొన్న మాటలను బట్టి అవి వింత స్వరూపాలను పొందవచ్చు.

---

35. నీలగిరి యాత్ర. పేజీ. 35.

36. నీలగిరి యాత్ర. పేజీ. 34.

భాషకు ఒక క్రమరూప వ్యాకరణ ప్రచారం లేని కాలంలో భాషలో కొంత ద్రవస్థితి ఉండేదనిపిస్తుంది. ద్రవస్థితి అంటే పండితులు పట్టుబట్టి ఒక భాషావ్యవస్థలో రూపాలను ప్రచారం చేయకముందు ఉండేస్థితి అని అర్థం. ఆ దశలో భాష, మాట్లాడే భాషకు దగ్గరగా ఉంటూనే ఒకరకమైన సాంస్కృతీకరణ రీతిని సంతరించుకొని ఉండేది. దీన్ని సాంప్రదాయిక పదజాలం, గ్రామ్యపద విన్యాసం కలిసిన మణిప్రవాళ భాషగా చమత్కరించవచ్చు. ఈ పద్ధతి భాషకు తిరుగులేని ఉదాహరణ మెకంజీ కైఫీయతుల్లోని భాష.

వీరాస్వామయ్యగారు, శేషాచలకవి వీరిద్దరూ ఇంగ్లీషువారి కొలువు చేసిన వారే. వీరాస్వామయ్యగారు 'ఇంటర్‌ప్రిటర్'గా, శేషాచలకవి కార్యాలయ గుమాస్తాగా పనిచేశారు. వీరాస్వామయ్యగారు తమ యాత్రా గ్రంథంలో ఇంగ్లీషు పదాలను ఉన్నది ఉన్నట్లుగా వాడుకున్నారు కాని వాటికి తెలుగులో తగిన పారిభాషిక పదాలనివ్వలేదు. శేషాచల కవి అట్లాకాక తనదైన ప్రత్యేకమైన భాషోచ్చారణతో ఇంగ్లీషు పదాలను పేర్కొంటూనే వాటికి సరైన అనువాద రూపాలను వెంటవెంటనే జోడిస్తూ వచ్చాడు. ఈ సందర్భంగా 'నీలగిరి యాత్ర' లోని కొన్ని వాక్యాలను పరిశీలించడం అవసరం:

"ఆఫీసరులనంబడు పడవాళ్ళు గొందరును నక్కడ (పూవిరుందమల్లి దగ్గరి కోటలో) నుండుటం జేసి కమాండింగ్ ఆఫీసరు అనంబడు నొక్క దళనాయకుండును, సర్జన్ అను నొక్క వెజ్జును, చాప్లెయిన్ అనునొక్క యొజ్జయు నిచ్చటనుందురు. మరియు...బారక్స్ అను సైనిక గృహవాటికయు...హాస్పటల్ అను చికిత్సాశాలయు నున్నయవి. పెన్షన్ అను ననుజీవికం గొని జీవించు నెంగిలీషు సేన యచ్చోన కొండొక యున్నయది." (పేజి. 4)

వీరాస్వామయ్యగారు, శేషాచలకవి సమకాలికులైనప్పటికీ వారి ఉచ్చారణల్లో భేదమున్నట్లు తెలుస్తున్నది. Barracks అనే పదాన్ని శేషాచలకవి 'బ్యారక్స్' అని సరిగానే ఉచ్చరించాడు కాని, వీరాస్వామయ్య గారు 'బ్యారకుసులు' అన్నారు. Assistant అనే పదాన్ని ఇద్దరూ 'అసిస్టాంట్' అనే ఉపయోగించారు. బహువచన రూపంలో వాడినప్పుడు వీరాస్వామయ్య గారైతే ఇంగ్లీషు బహువచన రూపానికి మళ్ళీ తెలుగు 'బహువచన ప్రత్యయం 'లు కూడ చేర్చారు.

ఉదా:- Assistants = అసిస్టాంటుసులు.

బ్యారకుసులు కూడ ఇట్లాంటిదే. ఇప్పటికీ హుక్కులు (Hooks) అన డానికి బదులు 'హుక్సులు' అని వాడటం వింటూనే ఉన్నాం.

వీరాస్వామయ్యగారి లాగ శేషాచలకవి 'ముసాఫరుఖానా' పదాన్ని వాడుతూనే, దానిని 'జనాశ్రయం' అనే చక్కని అనువాద రూపం కూడ రూపొందించాడు.

Hospital ను ఇప్పటికీ పరాయి భాషలో 'ఆస్పత్రి' లేదా 'దవాఖాన' అని వాడటమే మన కలవాటు. అదే అసలైన అనువాదరూపమా అన్నట్లుగా తెలుగులో వ్యవహరింపబడుతోంది కూడ. ఐతే శేషాచలకవి ఈ పదానికి 'చికిత్సాశాల' అని పేరుపెట్టాడు.

Officer పదాన్ని మనమిప్పుడు యథాతథంగా కాని లేదా 'అధికారి' అని కాని వాడుకుంటున్నాం. శేషాచలకవి 'పడవాలు' అనే అచ్చమైన తెలుగు పదాన్ని నిఘంటువుల్లోంచి వెలికితీసి చూపించాడు. ఈ పదాన్ని పదహారవ శతాబ్దంలోని ప్రబంధ కవి అల్లసాని పెద్దన మనుచరిత్రలో ఉపయోగించాడు.

"కనపపులు వేల్పు 'పడవాలు' గన్నచోటు" దేవతల సేనాపతి అనే అర్థంలో ఈ పదం వాడబడింది.37

'పెన్షన్'కు 'అనుజీవిక' అనీ, 'ఇంజనీర్లను' 'యంత్రవేదులనీ' అపూర్వమైన అర్థాల నిచ్చాడు. బ్రౌణ్యం కూడ ఈ పదాలకు ఇంత చక్కని సూటియైన అనువాదార్థాలు ఇవ్వలేదు.38

ఇంకా మసీదులను 'యవన దేవభవనము'లనీ, కోర్టు కచ్చేరీలను 'ఒప్పు దప్పుల విమర్శించు తలము'లనీ రూపొందించాడు. ఐతే రెండో పదం వర్ణనాత్మకంగా ఉండి రైల్వే స్టేషనుకు ఇవ్వబడిన అనువాద రూపాన్ని గుర్తుకు తెస్తుందే కాని నిత్యవ్యవహారానుగుణంగా లేదు.

---

37. బ్రౌణ్యం కూడ 'Commander of an army' అనే పేర్కొంది.

38. Pension, pen' shon = పని పుచ్చుకోక యిచ్చే జీతము, జీవనోపాధి, కొలువు కొలిచి తొయ్యని వాడుగా వుండే వాడికి యిచ్చే జీతము. భరణము.

Engineer = ఇంజినీరు, వాస్తు శాస్త్రము తెలిసిన సూత్రధారి,

Post office వీరాస్వామయ్యగారి కాలంనాటికి టపా లేదా తపాల ఆఫీసు అనే వాడుకలో ఉండేది. శేషాచలకవి దాన్ని అట్లా వాడకుండా 'అంచెల దావడి' అనే ప్రాచీన తెలుగు రూపాన్నే వాడుకున్నాడు.

ఉన్ని గుడ్డలకు 'ఊర్ణావస్త్రము'లనే సంక్షిప్త రూపమిస్తూనే మరోచోట దాన్ని వివరిస్తున్నట్లుగా 'పశురోమ నిర్మితము' అంటాడు.

శేషాచల కవి నన్నయ ప్రయోగాలను వాడినట్లు ఈ క్రింది ఉదాహరణ ద్వారా తెలుస్తుంది. నన్నయ 'అందఱు' అనడానికి బదులు 'అందొఱు' అనే పదాన్ని ప్రయోగించాడు.

"అపార బలంబుల్, మెఱయునెడ భీమునకు నందొఱు
గీడ్పడ దొడగి రుద్ధతులు రాజసుతుల్." (భార. ఆది. 5-164)

శేషాచల కవి ఈ పదాన్ని వాడుకున్న ఉదాహరణలివి :

1. **మేమందొఱము** ననుజ్ఞాతుల నగుటం జేసి (పేజి. 67)
2. అచ్చోనున్న **వారందొఱు** లేవ... (పేజి. 61)
3. అరుదెంచిన **నందొఱకు** నక్కొత్త వాలె... (పేజి. 26)

తిక్కన మాత్రం ఈ పదాన్ని 'అందఱు' అనే ప్రయోగించాడు :

'అందఱుం గ్రమంబున దేఱిరి...' (భార. శల్య. 1-10)

కొద్ది గొప్పగా లేదా ఇంచుమించుగా అనే అర్థంలో ఎన్ని విధాలుగా వ్రాయడాని కవకాశముందో శేషాచలకవి 'నీలగిరి యాత్ర'లో అన్ని విధాలుగా ఉపయోగించుకున్నాడు:

1. పళ్ళికొండయను నూర **న్యూనాధిక్యంబుగ** మున్నూ ఱాగారంబులు గను పట్టెడు. (పేజి. 10)
2. అక్కనుమ యెక్కించుక **పెచ్చులొచ్చుగ** పాద క్రోశ దూరంబు గలిగియుండెడు. (పేజి 15)

ఈ పదాన్నే కొంచం మార్పులతో మరికొన్ని చోట్ల వాడుకున్నాడు:

3) అయ్యవినాశి **లొచ్చుపెచ్చుగ** నాపణదశకంబును గలయది. (పేజి 24)
4. కాందలు **హెచ్చుతుందుగ** నిన్నూరు గృహంబులు గలిగి యున్నయది. (పేజి 31)
5. విరించి పురంబుల విసర్జించి **యించుక మించుగ** నాలుగు కోసుల మేర నుండు వేలూరు... (పేజి 69).

శేషాచలకవి ఎడ్లబండిపై నీలగిరికి యాత్ర చేశాడు. ఈయన ఎడ్లను వృషభములని కూడ పేర్కొనడానికి ఇష్టపడడు. అందరికీ అర్థమయ్యే పదాలు కాకుండా పాండిత్య ప్రకర్షంగా ఉండాలని మూలనున్న పదాలను కూడ తట్టి లేపుతాడు. అందుకే వృషభములను 'వృషము'లనీ, బండియెద్దు అనడానికి 'శాకటము' అనీ అంటాడు. శకటానికి సంబంధించినది శాకటము. ఇంకా ఎడ్లను ఉక్షము, సౌరభేయము, అనడ్వాహము, బలీవర్థములని ఆయా సందర్భాల్లో ఉపయోగించాడు.[39]

సంస్కృత పదాలనేకాక ప్రచారంలో లేని తెలుగు పదాలనుకూడ అక్కడక్కడ ప్రయోగించాడు.

వినార్థకంలో 'తప్పు' లేదా 'తక్క' అనడానికి బదులు 'త్రిక్క' అనే ప్రాచీన రూపాన్నే ఆశ్రయించాడు.[40]

నదికి మనకు తెలిసిన పేర్లెన్నో ఉన్నా 'జక్కర' అనే పదాన్నే ప్రయోగించాడు. అట్లాంటిదే 'కృపీటము' అను పదంకూడ.

---

39. i) బలవంతంబులు వేగవంతంబులు నన నెగడిన శ్రీరంగ పట్టణో ద్భూతంబులగు **వృషంబులచే** ... (పేజీ. 80).
ii) బొత్తిగ నా **శాకటంబు** రెండు ఘటికల దాక నుత్థితము గాక యుండె - (పేజీ. 66).
iii) సామగ్రులంగొని తేర నక్కడి క్రొత్తవాలు మూలంబుగ వలయు కర్మకరుల, **నుక్షంబుల** రావించుకొనవలయు. (పేజీ. 25.)
vi) సామగ్రులు సానుమంతంబుపైకి నెక్కించుకొని చన భార వాహులు **సౌరభేయంబులు** నచ్చో లభింపమింజేసి...(పేజీ. 26).
v) శకటంబుల **ననడ్వాహంబు** లీడ్వనేరమి ... కొందరరుదెంచి యనశ్వోదకుండప్రయాదంబున బలీవర్దంబులనడుప.(పేజీ. 19)

40. i) పథంబు **త్రిక్కం** దక్కగల నెలవులు. (పేజీ 29).
ii) గరుడ పక్షులొకండు రెండు **త్రిక్క** మిగులలేవు. (పేజీ. 37).
iii) కొన్ని యెడల **త్రిక్క** దక్కనెడల కొన్ని యతుగలైన నడువ నలవడదు (పేజీ. 15)

'ప్రవాహకాలంబునం దక్క దక్కిన కాలంబున నయ్యేట **తృపితంబు** లింక కుండవట!' (పేజీ. 9)

సీళ్ళకు వచ్చిన తిప్పలు ఇది. ఇంకా కొబ్బరి నూనెను 'టెంకాయ నూనియ' అనీ, మొత్తము అనడానికి 'అంతు' అని పేర్కొనడం కూడ జరిగింది.[41]

'వగ' అంటే విచారమనీ, విలాసచేష్ట అనీ సామాన్యార్థంలో వాడు కుంటాము, వింటుంటాము. Mode, way, manner అనే అర్థంలో కూడ ఈ పదాన్ని వాడవచ్చునని బ్రౌణ్యం పేర్కొన్నది. శేషాచల కవి ఇదే అర్థంలో—

"పరశియారులోని అంగడులలో శుష్క మత్స్యంబులును, రెండు మూడు వగల కాయగూరలు గానంబడి యెడి." (పేజీ 27). ఇక్కడ 'వగ' అంటే రకాలు అనే అర్థమిస్తున్నది.

మనకు నిత్య వ్యవహారంలో 'వదరుట' అనే క్రియా రూపానికే అర్థం తెలుసుకాని, 'వదరు' అనే నామవాచకానికున్న అర్థమేమిటో వాడుకలో లేదు. ఇది అచ్చ తెలుగు పదం. బ్రౌణ్యంలో 'సొరకాయ' అనే అర్థం ఇవ్వబడింది. మహాభారతంలో ఈ ప్రయోగముంది.[42] శేషాచల కవి కూడ ఈ పదాన్ని 'ఆనపకాయ' అనే అర్థంలోనే ప్రయోగించాడు.

"కూరగాయలలో '**వదరు**' లభ్యము" (పేజీ 33).

శేషాచల కవి ప్రాచీన పదాలను వాడుకొనే 'పద్ధతి' పండితులకు మాత్రమే అర్థమవుతుంది. విధానమనే అర్థంలో కాకుండా ఈ పదానికి 'త్రోవ, మార్గము' అనే మరో అర్థమిచ్చాడు. ఇది కూడ బ్రౌణ్యంలో ఉన్నదే.

---

41. అంతు రూపాయలు. (పేజీ 44). - నీలగిరి యాత్ర.
అంతు (Tel.) = The whole, Total, మొత్తము. అంతు ఎంత? what is the total? బ్రౌణ్య నిఘంటువు.

42. వరదుడైన యీశు వరమున నిదియొక్క, **వదరు** పుట్టె నెట్టి వరమొ యనుచు, దాని బారవైవగానున్న...(భార. 3-44).

"అవ్యర్థ సముద్ధతికి నా **పద్ధతి** యందయుండి" (పేజీ 21).

ఏనుగుల వీరాస్వామయ్యగారు అవిరళంగా వాడిన 'బాట సరాళము' అనే మాట, రెండు మూడుచోట్ల శేషాచల కవి కూడ ఉపయోగించాడు. కాని సరాళముకు బదులు 'సరళ' మనే మూల రూపాన్నే ఇచ్చాడు.[43]

మున్నూరు, వేయి, నూటయేబది వంటి నిత్యవ్యవహారంలోని సంఖ్యావాచక పదాలను వాడుతూనే, అక్కడక్కడ కావ్య భాషలోంచి కూడ అంకెలను పేర్కొన్నాడు:

"ఈరాఱు దివసంబులు బ్రహోత్సవంబు వర్తిల్లెడు."[44]

ఈరు + ఆరు = 2 × 6 = 12 దినాలన్నమాట. ఇదే పుటలో 'రెండాఱు' అనే పదం కూడ వాడాడు.

"అన్నూరను యూరు **రెండాఱు** గడియలకు చేరినాడ." (పేజీ. 24) ఇట్లే చెంగపల్లిలో 'నాలుగేను' గుడిసెలు కలవని వ్రాశాడు. అంటే నాలుగైదు అన్నమాట!

శేషాచల కవి పదం మీద ఉండే మోజుతో ఒకే అర్థమున్న తెలుగు సంస్కృత పదాలను ఒకే వాక్యంలో ఉపయోగించిన సందర్భాలున్నాయి:

"అచ్చోట నప్పటి **పెరసు** బిరుసగుటం జేసి తొలినాటి **తరసంబ** తఱచుగ నమ్మెదరు." (పేజీ. 32)

పెరసు అన్నా, తరసము అన్నా మాంసమనే అర్థం. కాకపోతే మొదటిది తెలుగు పదమైతే రెండోది సంస్కృతం.

---

43. "కావేరీ తీరంబు దాట్టి యీరేడు జేరునంతవట్టు తెరువవిరళంబును, సరళంబును గాదు." (పేజీ. 21).

44. 'ఈరాఱు'—ఆంధ్రనామ సంగ్రహంలో మానవ వర్గు కింద ఈ పదం ఉదాహరింపబడింది. ఈరేడు, ఈరైదు—లు మహాభారతంలోను, ఈరేను—భాస్కర రామాయణంలోను ఉన్న ప్రయోగాలు.

# 2. బులుసు వారి "నా దక్షిణ దేశ యాత్రలు" అనే నీలగిరి యాత్ర*

ప్రతి సంవత్సరం మద్రాసు రాష్ట్రంలో (స్టేట్ ఎడ్యుకేషనల్ కాన్ఫరెన్సు) రాష్ట్రీయ విద్యా సదస్సు జరగడం పరిపాటిగా ఉండేది. ఇది సాధారణంగా మే నెలలో జరిగేది. ఐతే ఎప్పుడూ ఒకేచోట కాకుండా ప్రతి యేటా ఒక్కొ నగరంలో నిర్వహింపబడేవి.

1950 మే నెంలో కోయంబత్తూరులో జరిగిన మహాసభకు రమణయ్య గారు హాజరయ్యాడు.

మద్రాసు సెంట్రల్ నుండి 'నీలగిరి ఎక్స్‌ప్రెస్'లో ప్రయాణం. ఈ బండి ఆర్కొణంలో ఆగలేదు కాని తిరువళ్లూరుకు వచ్చేసరికి ఆటంకం కలిగి ఆరు గంటలపాటు ఆగిపోయిందట. తర్వాత స్టేషన్లు : జోలార్పేట, సేలం, ఈరోడు జంక్షన్ - తిరుప్పూరు - కోయంబత్తూరు,

మహాసభ అనంతరం నీలగిరి యాత్రకు పూనుకున్నాడు.

కోయంబత్తూరు నుండి మెట్టుపాళయం దాకా ప్యాసింజరు బండీ మీద వెళ్ళి, మెట్టుపాళయంలో చిన్న లైనులో వున్న 'నీలగిరి బండీ' ఎక్కాడు. ఇది పూర్వకాలపుట్రాము బండీవలె ఉందట. నాలుగే నాలుగు పెట్టెలు. ముందు భాగంలో బ్రేక్‌మేన్ మాత్రం ఉంటాడు. రైలు పైకి పోయేటప్పుడు, క్రిందికి వచ్చేటప్పుడు కూడ ఇంజను వెనకాలే ఉంటుంది. ఆరోహణలో పైకి నెట్టడానికి అవరోహణలో కిందికి దొర్లకుండా వెనక్కి పట్టిలాగడానికి ఈ ఏర్పాటట!

---

* బులుసు వేంకట రమణయ్య గారి నాల్గవ యాత్ర.

బండీ సరిగ్గా ఏడుగంటలకు బయలుదేరి 20 నిమిషాలకే కల్లారు స్టేషన్ చేరుకుంది. ఇక్కడి నుండి ఘాటు ప్రారంభం! కల్లారు నుంచి కూనూరు దాకా మామూలు పట్టాల మధ్య ఇంకో ముళ్ళ పట్టా వేయబడింది. బండీ క్రిందికి దొర్లే పరిస్థితి సంభవిస్తే ఈ నడిమి పట్టాను మధ్యలో ఉండే చక్రాలు అంటిపెట్టుకొని బండీని దొర్లకుండా ఆపుతాయట.

కూనూరు వద్ద కొంచెం సమప్రదేశం కనపడింది. నీలగిరులపై ఉన్న ముఖ్య పట్నాలలో రెండవది. 6000' ఎత్తున ఉంది. ఇక్కడి నుండి నీలగిరికి ఇంకా 12 మై. (19 కి.మీ) పోవాలి. అక్కడక్కడ బండిగూళ్ళ ఆకారంతో చిన్న ద్వారాలతో గుడిసెలు కనిపించాయట! అవి 'తోడాలనివాసాలని' తర్వాత తెలుసుకున్నా నన్నాడు.[1]

బయలుదేరిన తర్వాత ఐదుగంటల్లో నీలగిరి (ఉదకమండలం) చేరుకున్నాడు. మే నెల పగలు ఒంటి గంటయినా నేల చాల చల్లగా ఉండి ఇంట్లో అడుగు పెట్టడమే కష్టమైందట! వేసవి కాలంలో ఇక్కడ ధనవంతులూ, జమీందారులూ నివాస మేర్పరచుకోవటం వల్ల, నిత్యావసర వస్తువులను పైకి తేవడం శ్రమసాధ్యం కావడం వల్ల సామాన్యుల జీవన వ్యయం ఎక్కువేనని చెప్పవచ్చు. ఒక పూట భోజనానికి రూపాయి దాకా ఇవ్వాల్సి వస్తుందన్నాడు, రమణయ్యగారు. ఇంకా ఇతర వివరాలు కూడా ఇస్తే మరింత బాగుండేది.

ఉదకమండలంలోని బొటానికల్ గార్డెన్స్ ఆసియా ఖండంలోని ప్రధానమైన ఉద్యాన వనాల్లో ముఖ్యమైనదట. తోడాల పాటలు వినదగినవే. చిల్లర డబ్బులిచ్చి బులుసువారు వారిచే గేయాలు పాడించుకున్నాడట. ఐతే ఆ పాటలో వాళ్ళు 'నోరు మెదిపినట్లుగాని, పెదవులు కదిలించినట్లు గాని కానరాలేదు' అన్నాడు. అందే వాళ్ళ భాషంతా నిరోష్ఠమేనా?

---

1. దాదాపు శతాబ్దం క్రితం 'నీలగిరి యాత్ర' చేసిన కోలావారు వీరి గురించి చెప్పలేదు. పార్వతీయుల్లో 'తోదువర్'లు ఒక తెగ అన్నాడు. వారే 'తోడా'లా?

కాశీలో చలికాలపు రాత్రి ఎట్లా ఉంటుందో, ఊటీలో వేసవికాలపు రాత్రి కూడా అట్లాగే తోచిందట!

బస్సు మార్గం చూడాలనే ఉద్దేశ్యంతో తిరుగు ప్రయాణంలో బస్సు మీద కూనూరు గుండా మెట్టుపాళయం చేరుకున్నాడు. ఈ ప్రయాణానికి రెండు గంటలు పట్టింది.

రైల్వే మార్గం అధికవ్యయంతో కూడుకున్నది కావటం వల్ల రైల్వే వారు ప్రయాణీకుల నుండి ఎక్కువ చార్జీ చేయడానికి 91 మై. (146 కి.మీ.) దూరం చూపుతారట! కాని నిజానికి మెట్టుపాళయం నుండి ఊటీకి 40 మై. (64 కి.మీ.) దూరానికి మించి ఉండదని రమణయ్య గారి అంచనా.

మెట్టుపాళయంలో సాయంకాల $5\frac{1}{2}$ గం మద్రాసు ఎక్స్‌ప్రెస్ ఎక్కి ఉదయం ఏడుంపావుకు మద్రాసు చేరుకున్నాడు. అంటే ఈ ప్రయాణానికి పట్టిన కాలం 10 గంటలు.

# కాశ్మీర యాత్రలు

ప్రాచీన కాలంనుండి కాశ్మీర్ లోయ సౌందర్యం జగత్ప్రసిద్ధమైంది. కాశ్మీర్ ప్రపంచానికే నందన వనం, క్రీడా మైదానం అని పేరు పొందింది. ప్రకృతి సంపదకి పుట్టినిల్లు. చుట్టూ హిమాలయాలు. మధ్యలో ఈ సుందర సీమ. ప్రపంచం నలుమూలల నుండి యాత్రికులు వచ్చి, కాశ్మీర్ రామణీయకతను దర్శించి ఆనంద పరవశులౌతారు. అక్కడ ముఖ్యంగా మనసును ఆకట్టుకునేవి - సహజ సుందర దృశ్యాలు, సుందరోద్యానవనాలు, సరస్సులు, మహోన్నత మంచు పర్వతాలు, పచ్చికబయళ్ళు మొదలైనవి. ఐతే కాశ్మీర్‌లోయ నిసర్గ సౌందర్యం ఇంతవరకు ఎవరికీ సంపూర్ణంగా అనుభవానికి రాలేదు. యాత్ర చేసిన వ్యక్తుల సంస్కారాన్ని బట్టి, అనుభూతులను బట్టి ఒక్కొక్కరికి ఒక్కో విధంగా తోపింప జేస్తుంది. పర్వతరాజైన హిమవంతుని మకుట మణివలె ప్రకాశిస్తున్నదని పేర్కొంటూ బులుసు సూర్యప్రకాశ శాస్త్రిగారు 'వానకు తడవని వారు, ఆ దేశపు టందము (కాశ్మీరు) చూచి ఆనంద తన్మయులు కాని వారు ఇంతవరకు పుట్టలేదు' అన్నాడు.[1]

కాశ్మీర దేశం ఒకప్పుడు స్వతంత్ర దేశం. మొదట ఇది మొగలుల చేత ఆక్రమింపబడింది. మొగలుల పతనం తర్వాత 18 వ శతాబ్దంలో ఆఫ్ఘన్ పఠానులు దీన్ని వశపరచుకున్నారు. క్రూరులైన పఠాన్లను కాశ్మీర్ లోయనుండి తరిమివేసి సిక్కులు 19 వ శతాబ్దం ప్రారంభంలో ఈ ప్రాంతాన్ని కైవసం చేసుకున్నారు.

మొగలుల కాలంలో భారతదేశం సందర్శించ వచ్చిన బెర్నియర్ సిక్కుల పాలనాకాలంలో వచ్చిన 'విగ్నే' (Vigne) అనే ఇంగ్లీషు యాత్రికుడు - వీరివురు కాశ్మీర దేశాన్ని సందర్శించి తమ అనుభూతులను గ్రంథస్థం చేశారు. 19 వ శతాబ్దంలో కాశ్మీరు లోయలో రోడ్డు నిర్మాణం, ప్రయాణ సౌకర్యాలు అధికం కావడం వల్ల యాత్రికుల రాకపోకలు ప్రబలమయ్యాయి.

---

1. సుందర భారత యాత్ర —2. పేజి 622.

## నాయనివారి కాశ్మీర దీపకళిక :

డా॥ నాయని కృష్ణకుమారి గారు కాలేజీ విద్యార్థులను వెంట తీసికొని కాశ్మీరదేశానికి విహార యాత్ర చేశారు. మొత్తం 24 మందిలో ఎనిమిది మంది అమ్మాయిలు, మిగతావారు అబ్బాయిలు. అమ్మాయిలను అదుపులో పెట్టడానికి కృష్ణకుమారి గారు 'పర్యవేక్షక పంతులమ్మ'గా వారి వెంట వెళ్ళవలసి వచ్చింది. ఇది విజ్ఞాన ప్రదమైన అధికారిక వినోద యాత్ర.

ఇట్లాంటి యాత్రల ప్రణాళికా రచన అఖిల భారత స్థాయిలో జరుగుతుంది. ప్రతి నగరంలోని వై. యం. సి. ఏ. లు స్థానిక కళాశాల విద్యార్థులను కొందరిని ఎంపిక చేసి సమూహంగా బయలుదేర తీస్తారు. దర్శనీయ స్థలాల్లో అందరికీ అన్ని సౌకర్యాలు సమకూర్చే బాధ్యత ఢిల్లీ వై. యం. సి. ఏ. వారిది. తక్కువ ఖర్చుతో విద్యార్థులకు దేశంలోని సుందరమైన స్థలాలను చూపించాలన్నది ఈ సంస్థ ముఖ్య ఆశయం.

1967 జూన్ 13 వ తేదీన హైద్రాబాద్ నుండి ఈ యాత్ర ప్రారంభమైంది. జి. టి. (గ్రాండ్ ట్రంక్) ఎక్స్‌ప్రెస్‌లో ఐదురోజుల పాటు ప్రయాణించి కాశ్మీరులో కాలు మోపారు. ఆగ్రా, ఢిల్లీ, పంజాబు, పఠాను కోటలకు రైలులో, అక్కడినుండి బస్సులో శ్రీనగర్‌కు చేరుకున్నారు.

ఏ ప్రదేశాన్ని చూడటానికి వెళ్ళినా అక్కడ విశేషాలను దినచర్యగా వ్రాసుకోవడం కృష్ణ కుమారి గారికి అలవాటు. ఈ దినచర్యే తరువాత "కాశ్మీరు దీపకళిక" అనే గ్రంథంగా ప్రకటింపబడింది. కాశ్మీర్ దీపకళికకు 'నా మాట' వ్రాస్తూ వారీవిషయాన్ని చెప్పారు. "దాన్ని (డైరీని) తరువాత ప్రపంచించగా అవతరించిందే ఈ కాశ్మీర దీపకళిక. ఈ రచనకు నన్ను ప్రభావితం చేసింది కేవలం నాలో ఉన్న సౌందర్య దృష్టి మాత్రమే."[2]

డైరీ వ్రాసి మూలకు పడేయకుండా యాత్రానంతరం తీరిక చేసుకుని మళ్లీ చదువుతూ యాత్ర చేసిన అనుభూతిని పొందుతుంటారు కొందరు. 'సౌందర్య దృష్టి' దండిగా ఉండటం వల్ల స్వయంగా రచయిత్రీ, కవయిత్రీ కావడం వల్ల డైరీలోని విశేషాలకు ఒక గ్రంథరూపమివ్వాలనే తలంపు కలిగింది

2. కాశ్మీర దీపకళిక - నా మాట. P. VIII.

కృష్ణకుమారి గారికి. ఫలితంగా 1967 లో 'కాశ్మీర దీపకళిక' అనే పుస్తకంగా రూపొందింది అయితే ఈ వ్రాతపుస్తకం వెంటనే ముద్రణకు నోచుకోలేదు 1978లో మొదటిసారి, తర్వాత ఎనిమిదేళ్ళకు 1986లో రెండవసారి ముద్రింపించారు.

వీరాస్వామయ్య గారి 'కాశీయాత్ర చరిత్ర', శేషాచలకవి 'నీలగిరి యాత్ర' తప్పించి "ఆధునిక యుగంలో యాత్రా చరిత్రలు చాల తక్కువ. అందుకని అధునిక సాహిత్యములో మొదటిదిగా ఈ కాశ్మీర దీప కళికను ఎన్న వచ్చును" అని రచయిత్రి తమ అభిప్రాయం వెలిబుచ్చారు.[3] కాని ఇంత ఖచ్చితంగా చెప్పడం కష్టం. ఆధునిక యుగంలోనే వీరి యాత్రాకాలం నాటికి కొన్ని యాత్రా గ్రంథాలు కనిపిస్తున్నాయి. వాటిలో ముమ్మన్నేని లక్ష్మీనారాయణ గారి 'అంతే వాసులతోడ హేంపీ విహార యాత్ర' ముఖ్యమైనది. ఇది కూడ ఉపాధ్యాయుల పర్యవేక్షణలో విద్యార్థులు చేసిన విజ్ఞాన విహార యాత్రే.

ఇంకా 'రెండో మాట'లో రచయిత్రి 1967 లో వ్రాయబడ్డ కాశ్మీర దీప కళిక తర్వాత 1985 లో యాత్రా చరిత్రగా డా॥ రావూరి భరద్వాజగారి 'ఇనుప తెర వెనుక' అనే గ్రంథం అవతరించిందని చెపుతూ, "ఈ రెండు పుస్తకాలకూ మధ్యకాలంలో యాత్రా విశేషాలపై వ్యాసాలేకాని గ్రంథ రూపంలో వెలువడిన రచనలు లేవు" అని అంటున్నారు.[4] కాని ఇది కూడ నిర్వివాదమైన విషయం కాదు. ఈ 'మధ్య కాలంలో' యాత్రామార్గదర్శులు, అనువాదగ్రంథాలు కాకుండా ఓ అరడజనుకు పైగా స్వతంత్ర యాత్రాగ్రంథాలు ముద్రింపబడ్డాయి. వాటిలో అమెరికా, రష్యా యాత్రలే నాలుగైదు ఉన్నాయి.

అయితే ఒక్కటి మాత్రం నిజం. మిగతా రష్యా పర్యటనలవలె స్టీరియో పద్ధతి ధోరణిలో కాకుండా, భరద్వాజగారు సామాజికఅవగాహనతో తమ గ్రంథాన్ని తీర్చిదిద్దారు. అట్లాగే కృష్ణకుమారి గారి 'కాశ్మీరదీపకళిక' అంతకు పూర్వపు యాత్రా గ్రంథాలవలె మొక్కుబడి రచన కాదు. ప్రయాణ

---

3.

4. కాశ్మీర దీప కళిక - రెండో మాట. P. xii.

మార్గంలో 'ప్రకృతి సౌందర్యాన్నంతా తనివితీరా ఆస్వాదిస్తూ' ఆ అనుభూతులను పాఠకులకు పంచిపెడుతూ సాగింది రచన. పేరున్న కవయిత్రి, పైగా విదుషీమణి, అన్నిటికన్న గొప్ప భావుకురాలు కావడంవల్ల కృష్ణకుమారి గారు ఈ గ్రంథాన్ని అడుగడుగునా అనుభూతులతో నింపేశారు.

దేవులపల్లి రామానుజరావు గారు ఈ పుస్తకానికి తొలిపలుకు వ్రాస్తూ, రచయిత్రి సాహిత్య నేపథ్యాన్ని ఈ విధంగా పాఠకులకు పరిచయం చేశారు: "ఎంతటి కష్టతరమైన విషయాన్నైనా అరటిపండువలె ఒలిచి చేతికిచ్చినట్లు మన కందించే శక్తిగల ప్రజ్ఞాసమన్వితురాలు. ఆమె సృజనాత్మకరచన, విమర్శన కళ ఈ రెండింటిలోను సిద్ధహస్తురాలు. ఆమె కథానికలు వ్రాసినది, కవితలు అల్లినది, చరిత్రగ్రంథాలు రచించినది. పరిశోధనాత్మకమైన ప్రామాణిక ప్రచురణలు గావించినది."[5]

అందుకే ఇది సాధారణ యాత్రా గ్రంథం కాదు. ప్రకృతి వర్ణనా వైభవంతో విరాజిల్లిన వచనకావ్యం. సరళమైన శైలిలో వ్రాయబడ్డ ఈ పుస్తకం ఒక నవలలాగ పాఠకులను ఏకబిగిన చదివిస్తుంది. కాబట్టి సాహిత్య విలువల్ని బట్టిచూస్తే ఒక రకంగా 'కాశ్మీర దీప కళిక' నీలగిరి యాత్ర తరువాతి స్థానాన్ని ఆక్రమిస్తుందని చెప్పుకోవచ్చు.

## i) యాత్రానుభవ పరంపర :

ఏ యాత్ర ఐనా యాత్ర చేసేవారి వ్యక్తిత్వం, సంస్కారంమీద ఆధారపడి ఉంటుంది. ఏయే ప్రదేశాలను సందర్శించారన్నది కాదు, ఎవరు చూశారన్నది ముఖ్యం. ఏ దృష్టికోణంతో పరిశీలించారన్నది కూడ మరీ ముఖ్యంగా గమనించవలసిన విషయం.

కృష్ణకుమారిగారు ప్రవృత్తి పరంగా కవయిత్రి, భావకురాలు. యాత్ర పొడుగునా కనిపించిన ప్రదేశాలను చారిత్రక దృష్టితో చూస్తూనే "ప్రకృతి పరిశీలనా తాత్పర్యాన్ని భజిస్తూ," చేసిన యాత్ర కాబట్టి ఇది విశిష్టమైనది.

---

5. కాశ్మీర దీప కళిక - తొలిపలుకు - P. iv.

కృష్ణకుమారి గారికి తాజ్‌మహల్ కనిపించిన తీరు వేరు. అందరిలాగా తాజ్ సౌందర్యానికి రచయిత్రి నిశ్చేష్టురాలు కాదు, ఆశ్చర్యాన్ని వెలిబుచ్చదు. తాజ్‌మహల్‌ను చూసిన వాళ్ళు యాత్రానంతరం రచనలు చేసినవాళ్ళు చరిత్ర మూలాల్లోకి వెళ్తారు. నిర్మాణకౌశలాన్ని మెచ్చుకుంటారు. అప్పటి నిర్మాణ వ్యయాన్ని ఇప్పటి విలువలతో అంచనా వేస్తూ కాలక్షేపం చేస్తారు. ఆ కట్టడంలో పొదగబడ్డ అమూల్య రత్నాలను గురించి ముచ్చటిస్తారు. ఏ శ్రీశ్రీ లాంటి మహాకవో అయితే దీనికి భిన్నంగా ఆలోచిస్తాడు. తాజ్‌మహల్‌ను చూడగానే మనకు మొదట గుర్తుకు రావాల్సినది దాని బాహిర సౌందర్యం కాదు, షాజహాన్ ప్రేమ పురాణం కాదు. 'తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరు?' ఎందరు రాళ్ళెత్తారన్నది సరే. దానికి గణాంక వివరాలున్నాయి. అదికాదు చరిత్రసారం. ఈ శ్రమ జీవుల జీవన పరిస్థితులను ప్రతిబింబించే చరిత్ర కావాలి అన్నాడు శ్రీశ్రీ అంటే శ్రీశ్రీకి తాజ్‌మహల్‌లో ఇతరులకు కనిపించే సౌందర్యం కాక శ్రమైక జీవన సౌందర్యం గోచరించింది.

కె.వి. సుబ్బయ్యగారు ఆంధ్ర రైతులతో ఉత్తరాపథ యాత్ర చేసినప్పుడు, ఆయన తాజ్‌ను చూసినప్పటి అనుభవాన్ని ఇలా చెప్పుకున్నారు. "తాజ్‌మహల్ లాంటి కట్టడాలు ఒక్క మొగల్ షాహజాదాలకు మాత్రమే సమాధులు కావు- సామాన్య ప్రజానీకానికి కూడా."[6] తాజ్‌మహల్‌ను చూడగానే నిర్మాణ కాలం నాటి ప్రజల బాధలు గుర్తుకు రాగా కలిగిన భావన ఇది.

కృష్ణకుమారిగారు తాజ్‌మహల్‌ను ప్రపంచంలోని అద్భుతాల్లో ఒకటిగా చూడలేదు, ఒక చారిత్రక నిర్మాణంగా భావించారు. ఆమె తాజ్‌ను అంతకు ముందు ఎన్నోసార్లు చూశారు. అనేక కోణాల్లో అనేక సమయాల్లో దర్శించారు. సాయంకాలపు అరుణ కాంతుల్లో, మధ్యాహ్నపు ఎండలో 'చంద్రకిరణ ధావళ్యంలో' కూడా చూశారు. బాహిర రూపంలో ఎప్పుడూ పెద్ద మార్పు కనిపించలేదామెకు. కాని లోపలికి పోగా మనస్సును పులకరింప చేసేది ఒక్కటేనట! అదే ముంతాజ్ మహల్ సమాధి. ఇక్కడ 'తాజ్‌కుండే సెంటిమెంట్ విలువ' కృష్ణకుమారి గారిలోని స్త్రీ తత్వాన్ని కదిలించింది. ఈమెను అణువణువునా పులకరింపచేసింది.

6. నవభారత సందర్శనం - కె.వి. సుబ్బయ్య. పేజీ 48.

షాజహాన్ మనస్సులో శాశ్వతంగా నిలిచిపోయిన ఆయన భార్య స్మృతి. తాజ్ గురించి ఆమె ఇట్లా అంటారు:

"అనంత రాజకార్యాల మధ్య వ్యగ్రుడైన ఒక మకుటాధిపతి హృదయంలో విశ్వరూపం వహించి చిందులు తొక్కిన ఆయన స్మృతి! తన మనస్సులో మెదిలే పత్నిని శాశ్వతంగా లోకంలో అందరి స్మృతిపథంలోకి వచ్చేట్లు నిలవబెట్టాలనే ఆకాంక్ష ఎంత గొప్పది! తాజ్‌ను తలుచుకున్నప్పుడల్లా నాకు దాని సౌరభం గుర్తుకురాదు. భర్త మనస్సులో చెరగని స్థానాన్ని సంపాదించుకున్న ముంతాజు వ్యక్తిత్వం నన్ను కదిలిస్తుంది."[7]

పంజాబు దేశపు మనుష్యుల శుచి శుభ్రతలమీద వీరికి మంచి అభిప్రాయం ఏర్పడక పోవడానికి కారణం - ఇక్కడి స్త్రీల ఒళ్ళు తెల్లగా వున్నా గుడ్డలు మురికిగా వుండడమే. ఒక్కొక్కరు బండెడు గుడ్డలు మోస్తున్నట్లుగా భారంగా 'గుడ్డల మూటల్లా' కనిపించారట! పంజాబులో మట్టిమిద్దెలు 'చురుకైన కుర్రాడు హైజంప్ చేస్తే సునాయాసంగా చేరుకోగలిగేంత' తక్కువ ఎత్తులో కనిపించాయి.[8] రచయిత్రికి కనిపించిన పంజాబు స్త్రీలు 'సవ్యమైన ఆకారం లేని మాంసపిండాలు.' ఇంటి ముందు స్థలం లేక ఇల్లాళ్ళు నిచ్చెనలు వేసుకొని పక్కలూ మంచాలూ మిద్దెల మీదికి చేరవేస్తుంటే, ఆ సన్నని నిచ్చెనలు వీళ్ళ బరువు నెట్లా ఆపగలిగాయా అని ఈమె మనస్సు తర్కించింది. వీళ్ళు బొద్దుగా, గుండ్రంగా, లావుగా ఉంటారని చెప్పడానికి 'ఈ ఇల్లాళ్ళలాగే ఇక్కడ వీళ్ళు చేసే పిడకలు కూడా ఘన పరిమాణం కలవి' అంటారు. అక్కడి పిడకలు మన వైపులాగా ఒకే వైపు కాకుండా రెండు వైపుల ఉబ్బి ఇడ్లీల ఆకారంతో కనిపించడమే ఈ ఊహకు కారణం. రైల్లో ప్రయాణిస్తూ కూడ ఎంతో సునిశితమైన పరిశీలన చేశారు!

పఠానుకోట ఊరు చిన్నదే. వీధులన్నీ ఇరుకుగా మురికిగా ఉన్నాయనీ, ఎక్కడ చూచినా రగ్గులూ, మగ్గులూ, తోలుచెప్పులూ అమ్మే కొట్లు విపరీతంగా

7. కాశ్మీర దీపకళిక - పేజీ 16.
8. కాశ్మీర దీప కళిక. పేజీ. 25.

ఉన్నాయనీ, జీవితావసర వస్తువులన్నీ మామూలు ధరకంటే ఎక్కువ చెప్పారనీ కృష్ణకుమారి గారు వ్రాశారు.

పఠానుకోటనుండి శ్రీనగర్‌కు 267 మైళ్ళ (430 కి.మీ.) ప్రయాణం. జమ్మూ ప్రజలది డోగ్రా జాతి. వీరు బొత్తిగా ఉప్పూ పులుపూ తినని చప్పిడి వాళ్ళు. మనుష్యులు ఆజానుబాహులూ, దీర్ఘకాయులూ కానప్పటికీ సాహసానికి ప్రతీకలు. పొడుగ్గా, సంచి తొడిగినట్లుగా పైనుండి చీలమండల దాకా కప్పే కుర్తా ఒకటి, పైన చిన్న కోటు ఒకటి వీళ్ళు ధరించే దుస్తులు. వీధుల్లో ఆడ వాళ్ళు తక్కువగానే కనిపించినా వాళ్ళంతా 'పంక నిర్మగ్న సుందర పద్మాలే' నట! కారణం వారు వేసుకున్న గుడ్డలు పంజాబు వారి లాగే మహా మురికిగా ఉండడమే.

బనిహాల్ కనుమ అందం వర్ణనాతీతం. అందుకే ప్రభుత్వం వారిక్కడ 'స్టాప్ అండ్ సీ బ్యూటిఫుల్ బనీహాల్' అనే బోర్డు పెట్టారు. సౌందర్య దృష్టి లేనివారు కూడ రమ్యప్రకృతిని కొద్ది సేపు చూసి, తన్మయులై వెళ్ళిపోయే వారని కృష్ణ కుమారిగారి ప్రత్యక్షానుభవం.

పిర్‌పంజల్ పర్వత శ్రేణిని దూసుకొని దాన్ని దాటుకుంటూ కింద ఉన్న కాశ్మీరులోయలోకి దిగడానికి ఒక సొరంగ మార్గముంది. అదే జవహర్ టన్నెల్. రెండు మైళ్ళ పొడవుంది.[9]

---

9. కె.వి. సుబ్బయ్యగారు 1956లో యాత్ర చేసినప్పుడు ఆ సొరంగానికి 'బని హాల్ టన్నెల్' అనే పేరుంది. ఆయన ఈ సొరంగం ఎత్తు తొమ్మిదివేల అడుగులని పేర్కొన్నారు. కృష్ణకుమారిగారు దీని ఎత్తు తెల్పకుండా కేవలం పొడవు మాత్రమే వ్రాశారు.

పదకొండు సంవత్సరాల్లోనే పేరు మార్పు ఎందుకు జరిగిందని ఆలోచిస్తే ఒక విషయం స్ఫురిస్తుంది. 1964 లో నెహ్రూ మరణించారు. తర్వాత మూడేండ్లకు కాశ్మీరయాత్ర జరిగింది. ఈ మధ్యకాలంలో నెహ్రూగారి స్మృతి చిహ్నంగా ఆ టన్నెల్‌కు 'జవహర్ టన్నెల్' అని పేరు పెట్టి ఉంటారని సులభంగా ఊహించవచ్చు.

## II) కాశ్మీర్‌లో అనుభవాలు :

1956 లో 'నవభారత సందర్శనం' చేసిన కె.వి. సుబ్బయ్యగారు పఠాన్ కోటనుండి 430 కి. మీ. దూరమున్న శ్రీనగర్‌కు బస్సులో ప్రయాణం చేశారు. 1966 లో శ్రీమతి ముళ్ళపూడి కమలాదేవి ఢిల్లీనుండి నేరుగా విమానంలో శ్రీనగర్ చేరుకున్నారు. సుబ్బయ్యగారికి ఒకరోజు ప్రయాణం కాగా, కమలాదేవికి గంటం బావు మాత్రమే పట్టింది. తర్వాత పదేళ్ళకు ప్రయాణం చేసినప్పటికీ, కృష్ణ కుమారిగారు సుబ్బయ్యగారిలాగే బస్సు ప్రయాణమే చేశారు. దీనికి కారణం విద్యార్థులవెంట పర్యవేక్షకులుగా వెళ్ళటమే.

ఈ యాత్రలో పాల్గొనే విద్యార్థులు యన్.సి.సి. క్యాంపులకు వెళ్ళేవారి లాగ కష్టనష్టాలకు, శరీర శ్రమకూ ఓర్చుకోగలిగి, వీలయినంత తక్కువ ఖర్చుతో యాత్ర చేయగలిగేవారు కావాలని వారి ఉద్దేశ్యం. అందుకే విమాన యాన సౌకర్యం ఉండికూడ బస్సు ప్రయాణం ఏర్పాటు చేశారు.

శ్రీనగర కాశ్మీర్ లోయలోని ముఖ్య నగరం. అది లోయమధ్యలో ఉంది. 1000 అడుగుల ఎత్తున్న శంకరాచార్య పర్వతం, 700 అడుగుల ఎత్తున్న హరి పర్వతం - ఈ రెంటి మధ్య శ్రీనగర్ విస్తరించి ఉందనీ, శంకరాచార్య పర్వతం అధిరోహించి చూస్తే శ్రీనగర్ భౌతిక స్వరూపం ఎల్లలు తెలుసుకోవచ్చుననీ రచయిత్రి వ్రాశారు.

శ్రీనగర్‌లో కెల్లా ప్రశస్తమైన సరస్సు 'దాల్ లేక్', ఈ సరస్సు 4 మైళ్ళ పొడవు, ఒక మైలు వెడల్పుంది. ఈ సరోవరంలో నౌకా విహారం చేస్తూ చెష్మెషాహీ, నిషాత్‌బాగ్, చార్‌చినాల్ మొదలైన విహార వాసాలను దర్శించారు.

దాల్‌సరస్సులో ఒకరకం మంచి హౌస్ బోట్‌లు ఉంటాయనీ, ఒక మనిషికి రోజుకు 30 రూపాయల దాకా వసూలు చేస్తారనీ తెలియజేశారు రచయిత్రి.[10] మొదట ఈ బోట్లలో కాని, టూరిస్ట్ సెంటర్‌లో కాని వసతి కల్పిస్తా

10. కె. వి. సుబ్బయ్యగారు వీటిని 'నావికా గృహాలు' అన్నారు. ఐతే రెండు నివాసపు గదులు, ఒక స్నానపు గది ఉన్న సాధారణ హౌస్ బోట్‌కే 25 నుండి 75 రూ॥ వరకు అద్దె ఉంటుందని పేర్కొన్నారు. 'నవభారత సందర్శనం' (పేజీ. 98).

మని మాట ఇచ్చిన నిర్వాహకులు, తీరా అక్కడికి వచ్చిన తర్వాత టూరిస్ట్ సెంటర్ కూడా కేటాయించకుండా దాని ఎదురుగా 'క్యాంపింగ్ గ్రౌండ్'లో డేరాలు వేశారట? బోట్ హౌస్‌ల గురించి కలలుగన్న విద్యార్థులకి యేర్పాట్లు ఆగ్రహం కలిగించాయి.

ఇంకా సరస్సులో తిరగడానికి చిన్న చిన్న పడవలు అందంగా అలంకరింపబడి ఉన్నాయనీ, వాటిని 'షికారా' అంటారనీ కృష్ణకుమారిగారు తెల్పారు.[11] ముఖ్యంగా ఎవరికివారే తమ బోటులో స్ప్రింగ్ పరుపులున్నాయన్న విషయం ప్రతి బోటువాడూ సగర్వంగా చెప్పుకోవడం గమనార్హం. ఈ స్ప్రింగ్ సీట్ల పైనం దశాబ్దం క్రితం లేనట్లుంది. ఉంటే సుబ్బయ్యగారి యాత్రలో ప్రస్తావింపబడేది. ఈ పదేళ్ళలో ఇద్దరు ముగ్గురు కూర్చొగల చిన్న బోటు, ఐదుగురు సుఖంగా కూర్చొని ప్రయాణం చేయగలిగే స్థితికి ఎదిగింది. బహుశా వ్యాపార స్పర్థే ఈ అలంకరణకు మూలకారణం కావచ్చు.

తోటలున్న చోట మన వైపైతే జంతువుల నుండి రక్షణకై ముళ్ళ కంచె లుంటాయి. కాని అక్కడ కంచె పొడవునా విరగబూసిన అడవి గులాబీ గుత్తులే రచయిత్రికి కనులపండువు చేశాయట!

తర్వాత 'చెష్మె షాహీ' అనే పూల తోటను సందర్శించారు. 'చష్మ' అంటే ఊట అనీ, 'షాహీ' అంటే శ్రేష్ఠమైనదనీ అర్థం. ఐతే కృష్ణకుమారిగారు ఈ పదాన్ని ఇంగ్లీషులో 'రాయల్ స్ప్రింగ్'గా, తెలుగులో 'గొప్ప ఊట'గా అనువదించుకున్నారు. ఈ ఊటనీరు త్రాగితే కడుపులోని కల్మషాలన్నీ కొట్టుకుపోతాయని దాని ఔషధ విలువను తెలుసుకున్నారు. ఇక్కడనుండి చుట్టూ చూస్తే అంతటా 'దిద్ది తీర్చిన గడ్డి పరుపులే' కనిపించాయన్నారు.

నిషాత్‌బాగ్ ఇంకో సరోవరం. 'నిషాత్' అన్న పదానికున్న సంతోష మనే అర్థానికి దీనికి ఆనంద వనమనే పేరు చెప్పుకో వచ్చునేమో? తర్వాత చూసింది 'చార్ చినార్.' నాలుగు పక్కలా నాలుగు చినార్ చెట్లు ఉండటంవల్ల దీనికి పేరు వచ్చినట్లు తెలుసుకున్నారు. చినార్ చెట్లు శ్రీనగర్‌లోని బాటల కిరు

---

11. సుబ్బయ్యగారు వీటినే 'షికారీ' లన్నారు.

ప్రక్కలా ఎత్తుగా, ఏపుగా పెరిగి నీడ నిస్తాయని మరోచోట ఈ చెట్ల ప్రసక్తి తేబడింది.

పైన తెలిపినవన్నీ మొగల్ తోటలు. తర్వాత 'ఊలర్ సరస్సు'ను చూశారు. ఇది ఆసియాలో అతి పెద్ద సరస్సనీ, వెడల్పు దాదాపు 15 మైళ్ళనీ (24 కి.మీ.) రచయిత్రి తెలిపారు.

బస్సులో హజరత్ బాల్, తులాముల్లా, బందీపూర్, సోపూర్, హాజీపూర్‌ల గుండా ప్రయాణిస్తూ బారాముల్లా చేరుకున్నారు. ఇది బెంగాల్‌లోని నవకాళీ లాంటిది. దేశ విభజన జరిగిన కొత్తలో ఇక్కడకూడ హింసాకాండ చెలరేగింది. "ఇప్పటికీ కాశ్మీరంలో ఏ మూల ఎటువంటి చిన్న కలహం తలఎత్తినా ఆ 'మూల'తో పాటు బారాముల్లాకూడా ఉండి తీరుతుందన్న ప్రసిద్ధి ఉంద"ని రచయిత్రి పేర్కొన్నారు [12]

కాశ్మీరులో తాము తిరిగిన ప్రతిచోట ఒక విచిత్రం కనిపించినట్లు ఆమె వ్రాశారు. భారతదేశ నాయకుల పటాలు కానీ, అభివృద్ధి పథకాల వివరాలు కానీ ఎక్కడా కనిపించవు. ఎక్కడో 'State Bank of India', 'India Coffee House' లాంటి బోర్డులమీద తప్ప 'ఇండియా' అన్నమాట ఎక్కడా కనపడదు. చివరకు 'రేడియో కాశ్మీర్' అంటారు కాని ఆలిండియా రేడియో అనరు. ఇంతకూ కాశ్మీర్ ఇండియాతో అంతర్భాగమనే స్పృహ అక్కడి వారికి ఉన్నట్లు లేదని గ్రంథకర్త్రి ఆశ్చర్యం వ్యక్తం చేశారు.[13]

---

12. కాశ్మీర దీపకళిక. పేజీ 70.
13. సుబ్బయ్యగారి అనుభవం మరోరకంగా ఉంది. షికారీ నడిపే ఒక ముస్లింను కాశ్మీర్ పాకిస్తాన్‌లో కలిస్తే ఎట్లా ఉంటుందని ప్రశ్నిస్తే ఆయన జవాబు ఇట్లా ఉన్నదట: 'పాకిస్తానియోం హమారే పేట్‌పర్ లాత్ మారేగా... దేఖోసాబ్! ఆజాద్ కాశ్మీర్‌కా హాలత్ దేఖో! భూఖోం ప్యాసేసే తడప్ రహీ హై ' కాశ్మీర్ పాకిస్తాన్‌లో కలిస్తే ఇండియా నుంచి యాత్రికులు రారనీ, ఇప్పుడు లభించే జీవనాధారం కూడ ఉండదని ఆ ముస్లిం పై మాటలన్నాడని 'నవ భారత సందర్శనం' పేజీ. 13 లో ఉంది.

కాశ్మీరం కుంకుమ పువ్వుకు ప్రసిద్ధి. అసలు కాశ్మీరమంటేనే సంస్కృతంలో 'కుంకుమ' అనే అర్థముంది. బారాముల్లానుండి ఇంకా కొంచెం ముందుకు పోగా కుంకుమపువ్వు కోసం వేసిన మళ్ళు కనిపించాయనీ, ఐతే అది పంటకాలం కాకపోవటంవల్ల 'కాశ్మీరజమైన కుంకుమపువ్వును' చూసే భాగ్యం కలగనందుకు కృష్ణకుమారిగారు చింతించారు. వీరు తిరిగిన చోట్లలో 'పాంపూర్' అనే ప్రదేశం - పూర్వకాలంలో దీని పేరు పద్మపురం - కుంకుమ పంట విస్తారంగా పండే స్థలం.

మర్నాడు శ్రీనగర్‌కు 50 మైళ్ళ (80 కి.మీ.) దూరంలో ఉన్న 'సోనా మార్గ్'కు ప్రయాణమయ్యారు[14] ఇది సముద్రమట్టానికి 7850 అడుగుల ఎత్తుంది. కె.వి సుబ్బయ్య గారికి సాహస యాత్రగా,ఆయన తోటి ప్రయాణికులకు భయంకరంగా తోచిన ఈ ప్రాంతపు ఎత్తు పల్లాలు కృష్ణకుమారి గారి రసహృదయానికి మనోహర దృశ్యాలుగా కనిపించాయి. అడుగడుగునా పైకి వెళ్తున్న బస్సు 'హాయలు కురిసే సింగారిలా కులుకుతూ పర్వతారోహణ చేస్తున్నట్లే' అనిపించింది కాని భయం వెయ్యలేదు. ప్రకృతిని పరమేశ్వరసృష్టిలో అంశంగా భావించడం వల్ల రచయిత్రిలో ఈ భావుకత సహజ సుందరమై భాసించింది.

'సోనామార్గ్'లో బస్సు దిగి మూడు మైళ్ళ (5 కి.మీ.) దూరంలో ఉన్న 'తాజ్ వాస్' అనే పర్వత పాద ప్రదేశానికి 'పోనీ'లను కుదుర్చుకొని ప్రయాణమయ్యారు.[15] దారంతా ఎగుడు దిగుడు, పోనీలపై సవారీ ప్రథమానుభవం కారణాలుగా గమ్యం చేరేటప్పటికి ఒళ్ళు హూనమై, నడకే నయమనిపించింది రచయిత్రికి, తిరుగు ప్రయాణంలో దారిలో కనిపించిన మాలకాకులు 'కాకా' అన డానికి బదులు 'గాగా' అనటాన్ని శ్రద్ధగా గమనించి 'ఇవి బొత్తిగా పరుషత్వం తెలీనివి' అని భాషాశాస్త్రంతో అన్వయించి చమత్కరించారు.

---

14. కాశ్మీరులు ఈ పదాన్ని 'సోనా మరగ్' అంటారనీ, ఐతే ఇవి బంగారపు దారి కాబోలన్న రచయిత్రి భావం సరైనదేననిపిస్తుంది.

15. 'పోనీ'లంటే గుర్రపు తట్టువలు, సవారీకి ఉపయోగపడే గుర్రాలు.

ఇంకో రోజు కార్యక్రమం గుల్‌మార్గ్ (పూలబాట) సుందర ప్రదేశ దర్శనం. ఇది శ్రీనగర్‌కు 29 మైళ్ళ (47 కి.మీ) దూరంలో ఉంది. బస్సు తంగ్‌మార్గ్ వరకే వెళ్ళగా, ఇక్కడి నుండి గుల్మార్గ్‌కు గుర్రాలపై 4 మైళ్ళు (6½ కి.మీ.), కాలినడకన 6 మైళ్ళు (9½ కి మీ.) అని తెలిసికొని కృష్ణకుమారి గారు నలుగురైదుగురితో కలిసి నడవడానికే పూనుకున్నారు. ఐతే యాత్రలో ఏ దూరానికి ఎంత సమయం పట్టిందో ఎక్కడా తెలుపలేదు.

శ్రీనగర్ నుండి 'పెహల్ గాం'కు 60 మైళ్ళ (96½ కి.మీ.) దూరం. అమరనాథ లింగదర్శనం చేయాలనుకున్నవాళ్ళు తమ యాత్ర ఇక్కడినుండే మొదలుపెడతారు. అందుకే దీనికి 'పెహల్ గాం'అంటే మొదటి గ్రామం అనే పేరు వచ్చిందట! వీళ్ళ కార్యక్రమంలో అమర్‌నాథ్ లేదు.

సాయంత్రం పెహల్‌గాం చేరుకున్నారు. అక్కడి విపరీతమైన చలిని గురించిన తమాషా వివరించడానికి భోజనశాల దగ్గరి ఒక అనుభవాన్ని పాఠకుల ముందుంచారు.

"ఒక్కసారే రెండు మూడు పుల్కాలు వేయించుకున్నవాళ్ళు ఒకటి తిని రెండోదాని దగ్గరకి వచ్చేటప్పటికి పళ్ళెంలో కూర జిడ్డు గట్టి, అందులో వాడిన డాల్డా తెల్లగా పేరుకుపోయి వేళ్ళకు చుట్టుకోవడం మొదలుపెట్టింది. పొయ్యి మీద ఉన్నంతసేపు నీ ప్రతాపం కాని పళ్ళెంలోకి వచ్చాక నా ప్రతాపం సుమా అని చలి ఎగబడి తన ప్రతాపం చూపించడమే అందుక్కారణం "[16]

కోలా శేషాచలకవి 'నీలగిరి యాత్ర'లో కూడ భోజనం దగ్గర ఇట్లాంటి అనుభవాన్నే వివరించాడు. విస్తట్లో వడ్డించుకొనిన వేడివేడి అన్నాన్ని కొంత భుజించిన తర్వాత, ఎడంగా ఉంచుకొన్న మిగిలిన అన్నం భుజింపబోతే చద్ద న్నము వలె అనిపించిందట.[17]

---

16 కాశ్మీరదీప కళిక. పేజీ 100.

17. 'వార్చిన తోడన పులియ యందు వడ్డించి కొనిన యన్నంబు కొంత ఘృత వ్యంజనాదులతోడ మొదల భుజించి యెడగలుగ ద్రోచి యుంచిన యవశిష్టాన్నంబు భుజింపబోయిన నొకానొకప్పుడు పర్యుషితకల్పంబయి కానంబడియెడు." పేజీ 45.

పెహల్‌గావ్ దగ్గరి ప్రకృతి సౌందర్యాన్ని చూసి ముళ్ళపూడి కమలాదేవి "నా కంటే, కవి యెవరైనా వచ్చి ఉంటే, ఎంత గొప్పగా ఈ దృశ్యం వర్ణించి ఉండేవారో" అని తన 'చేతకాని తనానికి'[18] విచారించారు.

ఐతే ఆ లోటును కృష్ణకుమారిగారు పూరించారని చెప్పవచ్చు. కింది నుండి పైకి చూస్తే అక్కడి పర్వత శ్రేణి ఇట్లా కనిపించిందట: "ఒకటా రెండా దాదాపు పది పన్నెండు పర్వత శిఖరాలు, ఆ నదికి ఆ వైపు అర్ధచంద్రాకారంగా ఒకదాని పక్కన మరొకటీ ఒకదాని వెనుక మరొకటిగా తొంగి తొంగి చూస్తూ వచ్చేవాళ్ళని పలకరించే ప్రియబాంధవుల్లా ఉన్నయ్ "[19]

శ్రీనగర్లో ప్రపంచ ప్రసిద్ధమైన షాలిమార్ తోటకు బయలుదేరారు. ఈ తోటకు భూమార్గం, జలమార్గం రెండున్నాయి. వీరు నీటి దారి గుండా పడవలు కుదుర్చుకుని ప్రయాణించారు. ఇతర స్థలాలలో మనుష్యులు కార్లమీద బస్సులమీద ప్రయాణం చేసినట్లు, ఇక్కడివాళ్ళు పడవల్లో ప్రయాణిస్తారు. అన్నీ పడవ ఇళ్ళే. ఉభయచరాలవంటి ఈ పడవిళ్ళు అవసరమైతే నీళ్ళలో కదిలిపోతాయి లేదా ఒడ్డున లంగరు దించుకుని ఏదో ఒకచోట నిలబడిపోతాయి. ఈ విధంగా ఇక్కడి జన జీవితంలో నీరు ప్రముఖ స్థానం వహించి, వీటి సంప్రదాయాలతో పెనవేసుకొనిపోయింది. ఇక్కడ ఎవడైనా అల్లరి చిల్లరగా తిరిగేవాడు కనబడితే వాణ్ణి 'ఫైరీఘాట్' అని పిలుస్తారట! అంటే తీరానికి దూరంగా ఉన్నవాడని అర్థం. మనం 'దారం తెగిన గాలిపటంలా' అన్నట్లు.

వీరి జల జీవితంలో ముడిపడి ఉన్న వస్తువులు రెండు రచయిత్రికి ప్రముఖంగా కనిపించాయి. ఒకటి 'చాయ్'. మన టీలాగా కాకుండా ఈ చాయ్ గులాబీ రంగులో ఉంటుంది. రెండవది 'కంగడి' పూలకుండ ఆకారంలో ఉండే చిన్న సైజు గోలెం. దీని చుట్టూ పేముతో అల్లి ఆ గోలెంలో బొగ్గులు వేసి రగిల్చి బయట తిరిగేటప్పుడు 'ఫిరక్' అనే పొడుగాటి అంగికింద భద్రంగా వుంచుకుంటారు. అది లోపల సెగలు చిమ్ముతూ అతణ్ణి వెచ్చగా వుంచుతుంది.

---

18. మా ఉత్తర భారత యాత్ర. పేజీ ౬౬.
19. కాశ్మీర దీప కళిక. పేజి 98

వేసవిలో చలివేంద్రాలు పెట్టి, చల్లని నీరు దానంచేయడం మనప్రాంతపు ఆచారం. కాగా మకర సంక్రాంతినాడు- అంటే నిండు చలికాలంలో- తమ పెద్దల పేరుచెప్పి బీదవాళ్ళకు 'కంగిడీలు' దానం చెయడం ఇక్కడి ఆచారమట!

భావుకులైన జానపదులు ఈ విచిత్ర వస్తువుచుట్టూ ఎన్నో గేయాలు అల్లుకొని పాడుతూంటారు. జానపద గేయ సాహిత్యంలో డాక్టరేట్ పట్టా పుచ్చుకొన్న కృష్ణకుమారిగారు ఇట్లాంటి గేయాన్నొకదాన్ని ఎవరో పాడగా విన్నారు. అర్థాన్నికూడ వివరించారు.

"అందమైన పరాయి ఆడది తన మొగుణ్ణి వశం చేసుకుంటే తాళి గట్టిన ఆలు శాపనార్థాలు పెడ్తూ ఎట్లా గుండెలు బాదుకుంటూ తిట్ల దుమారాన్ని రేపుతుందో అదే విధంగా తన దగ్గరి కంగిడిని మరే వనిత అయినా దోచుకోవడం సంభవిస్తే కాశ్మీర్ దేశపు ఆడది అలాగే వాపోతుంది."[20]

నిజమే, భర్త దగ్గరలేని సమయంలో అతడిచ్చే వెచ్చదనాన్ని కల్పించే ఆ 'కంగిడీ'ని పోగొట్టుకొన్నవారికి, మగడు పరాయత్తం కావడమంత బాధేమరి!

తెల్లవారితే తిరుగు ప్రయాణమనగా ఆ రాత్రి వినోద కార్యక్రమాలతో గడిచింది. "తెల్లవారే సరికల్లా తట్టాబుట్టా సవరించుకుని ఐదున్నరకే గేటు దగ్గర ఉండాలన్న" మేనేజరుగారి హెచ్చరిక రచయిత్రికి చేదుమాత్రలు మింగినంత వెక్కసంగా తోచింది.

కాశ్మీర దేశం అపూర్వమైన ఆనందానుభూతిని కలిగించింది కాబట్టే జన్మభూమిని కూడ మరపించగలిగింది. ఈ అనుభూతులను మననం చేసుకుంటూ తిరుగు ప్రయాణాన్ని వర్ణించటం మరచిపోయి వుంటారు రచయిత్రి.

## iii) మాతృ భావం :

ఈ యాత్ర మగపిల్లలు, ఆడపిల్లలూ కలిసి చేశారు. అందుకే పర్యవేక్షకులుగా స్త్రీలను పురుషులను వెంట పంపించారు. కృష్ణకుమారిగారు పర్యవేక్షకుల్లో

20. కాశ్మీర దీప కళిక. పేజీ 120.

ఒకరు. విద్యార్థులతో ఆదివరకే పదిహేను సంవత్సరాల బోధన, బోధనేతర అనుభవం ఆమెది. సాధారణంగా ఇరువర్గాలవారు కలిసి ప్రయాణం చేస్తే అల్లర్లు పుడతాయనీ, వాళ్ళను నిభాయించడం, అట్లాంటి ప్రయాణాలు నిర్వహించడమూ కష్టమేనని అంటూంటారు. కాని కృష్ణకుమారిగారు పంతులమ్మగానే కాక 'అమ్మ'గా కూడ అనేక సందర్భాల్లో విద్యార్థులపట్ల వాత్సల్యాన్ని కురిపించారు.

పగలంతా ప్రపంచాన్ని పిండి కొడదామన్నంత ఉత్సాహోద్రేకాల్ని ప్రదర్శించే పిల్లలు రాత్రయ్యేసరికి రైలుపెట్టెలో ఎక్కడి వాళ్ళక్కడ నిద్ర పోయేసరికి రచయిత్రిలోని మాతృభావం మేల్కొవేది. అందుకే ఆ సందర్భంలో ఇలా అన్నారు:

"ఒకరి మీద ఒకరు పడి చద్దిమూటల్లా చప్పగా అయిపోయిన వాళ్ళను చూస్తుంటే నాలోని మాతృత్వమైన అంశం (Motherly Instinct) సానుభూతితో నిండిపోయింది."[21]

కృష్ణకుమారి గారు ప్రిన్సిపాల్ గారి ఆదేశం మేరకు ఇంట్లో నాలుగేళ్ళ పసివాణ్ణి వదలిపెట్టి యాత్ర కుపక్రమించారు. అప్పుడప్పుడూ ప్రయాణం మధ్యలో ఈ మమకారం ఆమెకు తెలియకుండానే వెన్నంటి ప్రకృతి వర్ణనలల్లో సాక్షాత్కరిస్తూండేది.

దాల్ సరస్సులో నీటిని చీల్చుకుంటూ నావ ముందుకు పోతూంది. ఆ నీటి తుళ్ళింతలకు చుట్టు ప్రక్కల చిన్న చిన్న అలలు ఏర్పడి చూస్తుండగానే - "దూరంగా తప్పటడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయే పసిపిల్లల చిన్న పాదాల్లా" జరిగిపోయాయని అంటారు.[22]

బస్సు కొండమీద మెల్లమెల్లగా అధిరోహిస్తుంటే కొండ తల్లివక్షం లాగా, బస్సు పసిపాపలాగ తోచిందట! "కొండ శరీరం మీద తల్లి వక్షాన్ని అట్టి పెట్టుకున్నట్లు అతి మెల్లగా మెత్తగా జరిగే బస్సు పసిపాపలా" అనిపించింది.[23]

---

21. కాశ్మీర దీప కళిక. పేజీ. 28.
22. కాశ్మీర దీప కళిక. పేజీ. 74
23. కాశ్మీర దీప కళిక. పేజి. 118.

విద్యార్థుల ప్రవర్తన ఎబ్బెట్టుగా తోచనంత వరకు ఈమె వారిపై ఆంక్షలు విధించలేదు. వీళ్ళగుంపులో ముగ్గురమ్మాయిలకు ముగ్గురు మగవాళ్ళు అంగ రక్షకులు తయారై ప్రతి క్షణం వారిని కనిపెట్టుకొని రావటం ఒక రోజు ఆమె దృష్టిలోకి వచ్చింది. ఆరాధనాభావంతో మగపిల్లలు తమవెంట పడుతుంటే, కించిత్ గర్వం ప్రదర్శించబోయి, మళ్ళీ తానేమన్నా అంటానేమోనని భయపడటం రచయిత్రి గమనించారు. ఐనప్పటికీ వారిని ఆ సందర్భంలో అభినందించడానికే పూనుకున్నారు కాని ఆంక్షలకు గురిచేయలేదు. చూసీ చూడనట్లుగానే వ్యవహ రించారు. ఈ సంఘటనను ఆమె ఇట్లా సమర్థించుకున్నారు:

"ఏమనడానికేముంది? అసభ్యం కాని ఆరాధనను అరికట్టవలసిన అవ సరం లేదు కదా! అందులో కంటికి రెప్పవలె కాపాడవలసిన నా బాధ్యతను వాళ్ళూ కొంతలో కొంత పంచుకుంటున్నందుకు వాళ్ళు అభినందనలకు అర్హులు కాని, ఆంక్షలకు కాదు."[24]

అందుకే కృష్ణకుమారి గారు విద్యార్థులతో చక్కగా కలిసి పోయినం దుకు, ఏ కట్టుదిట్టాలు చేయనందుకు వాళ్ళు యాత్రాంతంలో కృతజ్ఞతలు తెలుపు కున్నారు. అప్పటి రచయిత్రి మానసిక స్థితి ఇట్లా ఉంది:

"పిచ్చి పిల్లలు పాలవంటి మనస్సులుకల పడుచుపిల్లలు! వాళ్ళను అర్థం చేసుకోలేనంత మూర్ఖురాలినా నేను! ఈ యాత్ర ఇంత సుగమంగా సాగి, ఇంత మధుర స్పందనల్ని నాలో కలిగిస్తున్నదంటే, మా పిల్లల క్రమయుతమైన సత్ప్రవర్తన కదా మొదటి కారణం!" అని వాళ్ళను మనస్సులోనే అభినందిం చారు.[25]

అయితే బాధ్యతారహితంగా అప్పుడప్పుడు పిల్లలు మూర్ఖంగా ప్రవ ర్తించి తోటివారికి ఇబ్బందులు తెచ్చిపెడుతుంటారు. అట్లాంటప్పుడు వారిని ఉపేక్షించడం వల్ల లాభముండదు అమ్మలాగే నచ్చచెప్పి, బుజ్జగించి, వినక పోతే కాఠిన్యం వహించి దారికి తేవాల్సి ఉంటుంది. అదే నిజమైన పర్యవేక్షకుల లక్షణం.

---

24. కాశ్మీర దీప కళిక. పేజీ. 113.
25. కాశ్మీర దీప కళిక. పేజీ 114.

ఒకసారి ఒక అమ్మాయి ఆకలికి ఆగలేక భోరుమని ఏడ్చేసి 'ఇలా తిండి లేని ప్రయాణం నేను చేయలేను ఢిల్లీలో దిగి లక్నోలోని మా నాయనమ్మ దగ్గరికి పోతాను' అని గునిసిందట! ప్రయాణంలో ఇట్లాంటి ఒడుదుడుకులు సహజమే. 'ఆడుతూ పాడుతూ అనుభవించాలి' అని ఎంత నచ్చచెప్పినా విన లేదు. అప్పుడు కృష్ణకుమారిగారు, "చూడమ్మా... అక్కడికీ ఇక్కడికీ వెళ్ళా నంటే కుదరదు. నిజంగా నువ్వీ ప్రయాణం చేయలేకపోతే చెప్పు. మీ వాళ్ళకు వైర్ యిచ్చి పిలిపిస్తాను. ఇంటికి వెళ్ళిపోదువుగాని" అని కసురుకుంటే తప్ప ఆ అమ్మాయి తగ్గలేదు [26]

ఎదుటి వాళ్ళను సాధించాలన్న పెంకితనమే కాని, ఆ అమ్మాయికి మాత్రం నిజంగా ప్రయాణం మానుకోవాలని లేదు. అందుకే తర్కానికి లొంగి పోయింది.

## vi) భావుకత :

సుకుమారలైన స్త్రీలను లతలతో, పురుషులను వృక్షాలతో పోల్చడం అనాదిగా వస్తున్న కవి సమయం. ఆధునికులు ఈ సంప్రదాయాన్ని పాటించినట్లు లేదు. కృష్ణకుమారిగారు వృక్షాలలో కూడ స్త్రీ రూపాలను దర్శించగలిగారు.

ఆగ్రానుండి ఢిల్లీకి వెళ్ళేవారిలో రైలు కిటికీల్లోంచి కనిపించిన దృశ్యంలో స్త్రీలు ఈతచెట్లతో పోల్చబడ్డారు. "తలలు విరియబోసుకున్న తరుణీమణుల్లాంటి ఈతచెట్లు పెరగడంలో ఓ పద్ధతి, వైనమూ అవలంబించినట్లు లేదు "[27]

చష్మె షాహి తోటలో యాపిల్‌చెట్లు నూతన వధువుల్లా కనిపించాయి. "అక్కడక్కడా ఏపుగా పెరిగి అందంగా మట్టసంగా పొక్తాతనం నేర్చుకున్న కొత్త పెళ్ళికూతురిలా ముచ్చటగా ఆపిల్ చెట్ల గుబురులు."

మరోచోట కరువుకాలంలో వయసొచ్చిన అమ్మాయి శరీరంలా చింత చెట్లు కనిపించాయి రచయిత్రికి. పంజాబులో చీమచింత చెట్లు "సన్నగా పొడుగ్గా కరువు కాలంలో వయసొచ్చిన ఆడపిల్ల దేహంలా ఎదిగిన చెట్లు మనస్సులో సంతోషభావ పరంపరను కలిగించడం లేదు."[28]

---

26. కాశ్మీర దీప కళిక. పేజీ 17-18.
27. కాశ్మీర దీపకళిక. పేజి 21.
28. కాశ్మీర దీపకళిక. పేజి. 25.

తినడానికే తిండిలేని స్థితిలో అమ్మాయి చెట్టంత ఎదిగి గుండె మీద కుంపటై కూర్చుంటే, ఆమె పెళ్ళి విషయం పదేపదే గుర్తుకురాగా ఏ తల్లి సంతోషంగా ఉండగలదు? ఆ విధంగానే సన్నని చెట్లు రచయిత్రిలోని అమ్మకు నయనానందకరంగా కనిపించలేదు.

ఒకచోట ఒక చెట్టు 'పూనకం వచ్చిన ఆడదానిలా తలాడిస్తున్నట్లు'గా తోచగా, మరోవృక్షం 'అంత ఎత్తున పెరిగి చివర నెక్కడో కాసిని ఆకులు తొడిగి డెబ్బయ్ ఏళ్ళ వృద్ధుడిలా' కనిపించింది.

ఒంటరితనం భయంకరమైనది కష్టసుఖాలు చెప్పుకోవడానికి ఎవరో ఒకరు తోడుగా ఉండవలసిందే. లేకపోతే కష్టంలో ఉన్నవాళ్ళు మరింత పొగిలి పొగిలి మిగలకుండా పోయే ప్రమాదముంది. అందుకే ఒంటరి చెట్లు దూరంగా తోడు దొరకని మనిషిలా తనలో తను వల పోసుకుంటున్నట్లుగా కనిపించగా కృష్ణకుమారిగారు జాలిపడ్డారు పోతే గుంపులు గుంపులుగా కనిపించిన చెట్లు పడుచు పిల్లలు పడీపడీ నవ్వుతున్నట్లుగా స్ఫురించాయి. "పడుచుపిల్లలు మనస్సు స్పందించిన క్షణాన ఒకరిమీద ఒకరు కిందా మీదాపడి పకపకా నవ్వుతున్నట్లుగా దగ్గర దగ్గరగా పెరిగి విరగబడే చెట్లు!"29

పర్వత శిఖరాలను చూస్తే కూడ రచయిత్రికి ఇట్లాంటి భావమే కలిగింది. సోనమార్గ్‌లో సూర్యకాంతి ప్రతిఫలంవల్ల కొండ కొమ్ములు తళతళ మెరుస్తుంటే, "అందకత్తెలంతా ఒకరి భుజాల్ని మరొకరు రాచుకుంటూ వరసగా చేరి, పడీ పడీ నవ్వుతున్న భావన కలుగుతోంది."30

జవహర్ టెన్నెల్ దాటగానే ఒక మంచుకొండ 'కులకాంత'లాగా గోచరించింది. 'మంచు ముసుగు వేసుకుని, అవకుంఠితశిరస్క అయిన కులీన స్త్రీకి మల్లే కించిద్వినమ్రభావం వెలారుస్తూ ఓ పర్వత శిఖరం ప్రత్యక్షమైంది దాని వెనుకనుండి నాయకురాలి చాటునుండి నక్కిచూచే చెలికత్తెలకుమల్లే నాలుగైదు శిఖరాగ్రాలు కనిపించసాగాయి."31

---

29. కాశ్మీర దీపకళిక. పే. 18.
30. కాశ్మీర దీపకళిక. పే. 77.
31. కాశ్మీర దీపకళిక. పే. 47-48.

## V) కాశ్మీర సౌందర్యం :

కాశ్మీర దేశాన్ని దర్శించి వర్ణించిన మొదటి యాత్రికుడు 17 వ శతాబ్దానికి చెందిన ఫ్రాన్సిస్ బెర్నియర్ అనే ఫ్రెంచివాడు. ఢిల్లీలో మొగలుదర్బారులో వైద్యు డీయన. మొగలాయి అశ్వికదళంతోపాటు కాశ్మీరు లోయ చేరుకొని, ఆ లోయ సౌందర్యాన్ని ఎత్తునుండి నిలబడి చూస్తూ తన్మయుడయ్యాడు. కాశ్మీరు ఆయనకు భూలోకస్వర్గంలా కనిపించింది. "చుట్టూ హిమవత్పర్వత శ్రేణియొక్క తెల్లదనంచేత పొదగబడిన పచ్చని కాశ్మీరు లోయ ఆసియా ఖండపు హృదయభాగాలంకృత నాయకమణిలా ప్రకాశిస్తున్నది" అని వ్రాశాడట![32] తర్వాత దర్శించిన చాల మంది కళాత్మక హృదయులను కాశ్మీరం 'ముగ్ధ ప్రకృతి చేత విభూషితయై' కదిలించింది.

'పర్వత శ్రేణీ, వృక్ష సంపదా, మేఘపటలీ, ఝరీ ప్రవాహ సౌందర్యమూ' అంతటా ఇవే ప్రకృతి దృశ్యాలు పరమేశ్వర చిద్విలాసంలో భాగంగా రచయిత్రికివి గోచరించాయి. కాశ్మీరం వీటన్నిటి రాశీభూతసౌందర్యంలా తోచింది. బెర్నియర్ లాగే ఈమెకు కూడ కాశ్మీరం 'పచ్చల పతకం'లా భాసించింది. "బస్ కిటికీలోనుండి కిందికి చూస్తే...పచ్చని పైర్ల శోభా, వాటిమధ్య జిలుగు దారాల్లా మెరుస్తూ చకచకా కదిలే కొండవాగుల అందమూ, అన్నీ కలగలపి భూవనిత నిర్భర వక్షస్థలాన్ని అధిగమించి హృదయస్థానంలో కుదురుకున్న ముత్యాలహారానికి కూర్చిన పచ్చలపతకంలా భాసిస్తోంది లోయ."[33]

అది బస్సుగానీ, రైలుగానీ ప్రయాణంలో కిటికీ దగ్గర కూర్చుంటే అనేకానేక దృశ్యాలు సినిమా రీళ్ళలా దూసుకుపోతుంటాయి. కిటికీలో నుండి కవిత్వం వీస్తుందన్నది ఈ యాత్రా గ్రంథం చదివితే తెలుస్తుంది.

పైనుండి కిందికి జారిపడే కొండ యేళ్ళు కృష్ణకుమారిగారికి అనేక సందర్భాల్లో 'వెండి తీగల్లా' మిలమిలలాడుతూ దర్శనమిచ్చాయి.

ఎక్కడ చూసినా 'రమణీయ దృశ్యపటలి' మనస్సును ఆహ్లాదంలో ముంచెత్తిందని తెలుపుతూ "ఈ అందమే అన్నమూ నీళ్ళుగా మారి జీవనధారణకు మరో వ్యాపకం అవసరంలేని స్థితిని భగవంతుడు కల్పిస్తే నేనిక్కడే ఉండిపోతాను కాబోలు" అనే విచికిత్సలో పడిపోయారు.[34]

---

32. కాశ్మీర దీపకళిక. పే. 31.
33. కాశ్మీర దీప కళిక, పేజీ. 45.
34. కాశ్మీర దీప కళిక, పేజీ 68.

కృష్ణకుమారిగారికి హిమావృత శిఖరాలు చాలాచోట్ల ముసుగు వేసుకున్నట్లుగా అనిపించింది. మరికొన్నిచోట్ల ఎండపడి మిలమిలలాడే మంచుపొరలు తెల్లగా 'సున్నం పూసినట్లు' తోపింపజేశాయి. పర్వతారోహణలో తలయెత్తి నిటారుగా చూడవలసిన మనోహర శిఖర దృశ్యం ఒకవైపు, లోతుగా పాతాళ లోకపు దృశ్యంలా భ్రమ గొలిపే ప్రకృతి మరోవైపు కళ్ళకు అందాన్నే కలిగించాయన్నారు.

కనుచూపు మేర ఎక్కడ చూసినా పచ్చగా కింద గడ్డి పరుపు ఈదర గాలికి గడ్డి మొలకలు తలలూపుతూ మొత్తం మైదానమంతా 'వాయుతాడిత తరంగ శోభిత శైవాల రమ్య సరోవరం'లా సాక్షాత్కరించిందట! ఇటువంటి చోట్ల కృష్ణకుమారిగారు పండిత కవయిత్రిగా దర్శనమిస్తారు.

అనంత విశాలప్రపంచం ముందు మానవుని అల్పత్వం ఎంత? అనే భావం ప్రకృతి పరిశీలనలో, ప్రపంచ పర్యటనలో కలగక మానదు. రచయిత్రి ఒక్కొసారి ప్రకృతి రామణీయకతను ఆస్వాదిస్తూనే, దీనికంతటికీ మూలకారకుడైన ఆ పరమాత్ముని కళాత్మకహస్తాన్ని వెదకి పట్టుకోవడంలో మునిగిపోతుంది. ఈ క్రింది పంక్తులు ఆమె ఆధ్యాత్మిక చింతనను స్ఫురింపచేస్తాయి.

"ఈ నీలాకాశమూ. విశృంఖలంగా పెరిగిన ఈ చెట్ల అతిశయమూ, చుట్టూ బలిష్ట ప్రాకారాల్లా మెరిసే హిమాచ్ఛన్న శిఖరసమూహమూ - ఇవన్నీ చూస్తుంటే అల్పబుద్ధీ అల్పజీవీ అయిన మనుష్యుడికి అవగతం కాకుండా ఉండడానికి అన్ని విధాలైన జాగ్రత్తలూ తీసుకుని సవాలుచేస్తున్నట్లుగా అనిపిస్తోంది."[35]

ప్రకృతి విశ్వజనకుడైన భగవంతుని సృష్టిగా అడుగడుగున సంభావిస్తూ వర్ణించారు రచయిత్రి. ఒకచోట చెట్లన్నీ భూమంటపం మీద 'నీలిరంగు షామియానా' నిలబడడానికి విశ్వకర్త అమర్చిన 'దన్ను కర్రల్లా' శోభిస్తున్నాయంటారు.

ఆకాశాన్ని నీలిరంగు షామియానాగా, చెట్లను దన్ను కర్రల్లా ఊహించుకున్న భావుకురాలు కృష్ణకుమారిగారు.

### vi) వర్ణనా వైదగ్ధ్యం :

వీరి వర్ణనల్లో ఉపమా సంపద అనంతం. విత్తనాలు చల్లడానికి దున్నుకొన్న భూమి నీగ్రో వనిత కేశాలంకరణ లాగా కనిపించింది.

---

35. కాశ్మీర దీపకళిక. పేజీ. 90.

"దున్ని సిద్ధంగా ఉంచుకున్న నేల. నల్లగా వుండలు వుండలుగా పరచు కొని వుంది నేలతల్లి. నీగ్రోవనిత తలకట్టు అందానికి ఆశపడి, అలా తయారు చేయించుకున్న కేశాలంకరణలాగా అది కనిపిస్తోంది నాకు."36

పంజాబు గడ్డమీది నేలంతా ఎగుడు దిగుడు. ఇది 'మధ్యతరగతి కుటుం బీకుని ఆర్థిక వ్యవస్థ'లా రచయిత్రికి స్ఫురించింది.

మధ్యాహ్నం ఎండ 'గంజి పెట్టిన నూలు గుడ్డ'లా పెళ పెళలాడుతున్నట్లు అనిపించిందట!

ఇవన్నీ నిత్య జీవితంలో సమన్వయించుకున్న పోలికలు.

వర్ణన సమయంలో సాధారణ గృహిణిగా గృహవాతావరణాన్ని ప్రకృతితో జోడించి వర్ణించారు.

రైలు కదలగానే ఎవరి సీట్లకింద వారు తమ సామాన్లు పదిలంగా సర్దు కుంటుంటే ఈ దృశ్యాన్ని, కృష్ణకుమారి గారు 'ఇల్లు మార్చినప్పుడు ఇల్లాలు ఇల్లు సర్దుకునే మనస్తత్వంగా' పోల్చారు.37

దాల్ సరస్సు ఎంత నిర్మలంగా ఉందీ అంటే లోపలికి తొంగి చూస్తే అడుగున నాచు మొక్కలూ తామర కాడలూ 'కలగా పులగంగా ఇల్లు ఊడ్చి మూలకు పెట్టిన చెత్త లాగా' నీళ్ళల్లో అల్లల్లాడుతూ కనిపించాయి.38

వాన చినుకులు భూమి మీద చిటపట శబ్దంతో రాలటం 'తొందరకత్తె అయిన ఇల్లాలు పనివేళ ఇంట్లో చేసే హడావుడి'ని తలపించచేసిందట!39

విరగబూసిన ఒంటిరేక గులాబి గుత్తులు గుత్తులుగా నిండి స్పందించిన హృదయంతో విరగబడి నవ్వుతున్నట్లుగా ఉందంటూ, ఒకవేళ ఆ విరగబాటు నవ్వే అనుకుంటే దాని గొప్పతనాన్ని మాటలలో ఎట్లా కొలిచి చెప్పాలో తెలి యటం లేదన్నారు ఈ క్రింది ఉల్లేఖాలంకారంలో కూడ గృహ వాతావరణమే చోటు చేసుకుంది.

"తప్పటడుగులతో పడుతూ లేస్తూ తల్లిని చేరుకోవడానికి సర్వశక్తులతో ప్రయత్నాలు చేస్తున్న బిడ్డ యొక్క బృహత్ప్రయత్నానికి తల్లి తృప్తిగా మన స్ఫూర్తిగా 'నవ్వినట్లు, భర్తలో ఉన్న సుగుణగణపరిపూర్తికి గాంభీర్యానికి ముగ్ధురాలైన భార్య అద్భుత రసావిష్టయై ప్రమాన్పదగా భర్త లాలనగా నవ్వినట్లు

36. కాశ్మీర దీపకళిక. పేజీ. 10.
37.
38. కాశ్మీర దీప కళిక. పేజీ. 61.
39. కాశ్మీర దీప కళిక. పేజీ. 65.

పరమ భక్తి భావ భరితయైన సేవక హృదయాన్ని గ్రహించి వాత్సల్యంతో యజమాని నవ్వినట్లు" ఎన్నో రకాలుగా ఆ పువ్వులు నవ్వులు రువ్వినట్లు, తోచింది.[40] అనంత ముఖాలుగా ప్రసరించేది ఆ పూల అందమే కాదు, రచయిత్రి భావనా సౌందర్యం కూడ.

శ్రీనగర్‌లో విసుగూ, చిరాకూ పుట్టేంత అసహ్యంగా వేధించిన చలిని కూడ ప్రియమైన నేస్తంగా భావించుకున్నారు. "మర్నాడు వెళ్ళిపోతున్నాం కదా అని మమ్మల్ని వదలలేని ఆప్యాయతతో సర్వ శరీరాన్ని కౌగిలించుకొని పరామర్శిస్తున్నది కాబోలు."[41] ఎంత మంచి ఊహ! శత్రువునుకూడ ప్రేమతో చూసే గొప్ప వ్యక్తిత్వం ఈ భావనలో కనిపిస్తుంది.

## vii) కావ్యగుణం :

'కాశ్మీర దీప కళిక' విషయ ప్రధానమైన రచన కాదు, వర్ణనా ప్రధానమైనది. మామూలుగా చెప్పే విషయమే అందంగా మలిచి చెప్పబడింది. భాష, భావం పోటీపడుతూ సరళ శైలిలో రచన సాగింది. 'చేరా' దీన్ని 'వచన కావ్యం'గా అభివర్ణించారు. దీనిలోని వచనం 'సాధారణ స్థాయి వచనం కాకుండా సాహిత్య స్థాయి వచనమనీ, కృష్ణకుమారిగారు ఈ పుస్తకంలో తెలుగువచనానికి సౌందర్య స్థాయిని కల్పించా'రనీ అభిప్రాయపడ్డారు.[42] రచయిత్రి సౌందర్య దృష్టితో ఈ రచన చేసినట్లు ఇదివరకే చెప్పబడింది.

ఈ విధంగా కాశ్మీర దీపకళికను చదివిన పాఠకులకు కాశ్మీరు వెళ్లొచ్చిన అనుభూతి మిగులుతుంది. కాశ్మీరునుగురించి కొద్దో గొప్పో తెలిసిన వారికి మరిన్ని విశేషాలు తెలుస్తాయి. యాత్రికురాలు కేవలం ఒంటరి కాక సమూహ జీవీ, విదుషీమణి, కవయిత్రికూడ కాబట్టి ఆమె తన అనుభవాలను కావ్యరస స్ఫూర్తితో అందించటంవల్ల పాఠకులకు అనిర్వచనీయ ఆనందం కలుగుతుంది.

---

40. కాశ్మీర దీపకళిక. పేజీ 76.

41. ఈ వాక్యాన్ని చూడగానే మూర్తిగారిని చలి ఆహ్వానించిన తీరు గుర్తుకు వచ్చింది. జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు పంజాబు మెయిలులో నాసికకు ప్రయాణమైనపుడు ఆ రాత్రి 'పడమటి కొండలకు రాక రాక వచ్చితినని కాబోలు కొండ కోనలనుండి చివాలున నెగసివచ్చి తీవ్ర శీతవాతూలము నాకాహ్వాన మొసగినది'- నా మహారాష్ట్ర యాత్ర, పేజీ 11.

41. 'చేరా' తలు -మార్చి 22, 1987 -ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక.

# దక్షిణభారతదేశ యాత్రలు

## 1. ప్రాతూరి వారి "నా యాత్ర"లో 'దక్షిణాది యాత్ర'

బాపట్ల నివాసి ప్రాతూరి వేంకట శివరామశర్మగారు జనవరి 1930 నుండి ఫిబ్రవరి 1934 దాకా ఉత్తర, దక్షిణ భారతదేశాలలోని దాదాపు 81 క్షేత్రాలను దర్శించారు. మొత్తం సుమారు పదమూడు వేల కిలోమీటర్ల (8 వేల మైళ్ళు) ప్రయాణం. రైలు, బస్సు, జట్కా, బోటు, రెండెడ్లబండి, చివరకు కాలి నడకన - ఈ విధంగా అన్ని ప్రయాణసాధనాల ద్వారా ఈయన ఈ యాత్రను పూర్తి చేశారు.

యాత్రానంతరం తానదివరకు దినచర్యగా వ్రాసుకున్న విషయాలను ఇతరులచే పుస్తకరూపంగా విపులీకరించి వ్రాయించారు. ఈ విపులీకరణవల్ల చదువరులకు ఉపయోగమున్నా లేకున్నా 'స్మృతిరూపముగ నా యాత్రను తిరిగి సలిపిన సంతృప్తి' చెందినట్లుగా పీఠికలో తెల్పాడు. ఈ గ్రంథ రచనలో విషయ ప్రకటనను ప్రధానంగా ఎంచుకొన్నట్లు, భాషానిపుణతకై అంతగా శ్రద్ధ వహించనట్లు మనవి చేశారు.

239 పుటలు గల ఈ యాత్రాగ్రంథం రాజమహేంద్రవరంలోని గౌతమీ గ్రంథాలయంలో Rare Material కింద జాగ్రత్త పెట్టబడింది. దీన్నిబట్టి ఈ పుస్తకానికున్న ప్రాధాన్యం స్పష్టమవుతుంది.

శర్మగారు శ్రీ బ్రహ్మానంద తీర్థస్వామి వారి వద్ద మత విషయక శిక్షను, పొందారు. శ్రీ శంకర విద్యాలయానికి అనుబంధంగా శ్రీ దత్త దేవాలయం

అన్నపూర్ణ మందిరం నిర్మింపజేశారు. ఈ విధంగా భగవత్సేవలో కాలక్షేపం చేసే అదృష్టం వీరికి కలిగింది. శ్రీ స్వామివారు ఈయనను సంపూర్ణ భారత యాత్ర చేయిస్తామని చెప్పినప్పటికీ ఎప్పుడూ ఆ అవకాశం కలుగలేదని రచయిత విచారించారు.

పైన పేర్కొన్న దేవాలయ నిర్మాణం జరిగిన తర్వాత జనవరి 1930 లో ప్రయాగ కుంభమేళానికి వెళ్తూ ఒక మిత్రుడీయనను తనతో రమ్మన్నారు. కాని శర్మగారికప్పుడు విపరీతమైన మోకాలినొప్పి, నడవటానికి కూడ వీలులేకుండా ఉంది. కాబట్టి ప్రయాణం చేసే స్థితిలో లేనని చెప్పి పంపారు. కాని తర్వాత భోజన సమయంలో చెవి దగ్గర 'ముందు సంవత్సరము నీ శరీర స్థితి యింత కంటె బాగుండునని నమ్మకమేమి? యిప్పుడే కుంభమేళమునకు ప్రయాణ మెందుకు చేయకూడదు?' అనే మాటలు వినబడి, అది దైవ సంకల్పంగా భావించి యాత్రకు సిద్ధపడ్డారట!

మోకాలి నొప్పితో ప్రయాణం చేయలేని స్థితిలో ఉన్నందున శ్రీ శంకర విద్యాలయ విద్యార్థి చేజర్ల సుబ్బరాయ శర్మను సహాయంగా తీసుకొని కుటుంబ సహితంగా ఉత్తర దేశానికి ప్రయాణమయ్యారు.

ఉత్తరాది యాత్ర ముగించిన తర్వాత శివరామశర్మ గారు నెల రోజులు ఇంటివద్ద విశ్రాంతి పొంది దక్షిణ దేశ యాత్రలకు పూనుకున్నారు.

ఈ యాత్రలో సమయానుకూలంగా కొన్ని చోట్ల బస్సులో, ఎక్కువగా రైలు బండిలో ప్రయాణించారు. యాత్రా మార్గమిట్లుంది :-

బాపట్ల - చెన్నపురి - కంచి - పక్షితీర్థం - చిదంబరం - కుంభకోణం- తంజావూరు - శ్రీరంగం - రామేశ్వరం - మదురై - రాజపాలయం-షంకోట- కురుత్తాళం - తిన్నెవల్లి (తిరునెల్వేలి) - కన్యాకుమారి - నాగర్‌కోయిల్-అనంత శయం - క్విలాన్ - వైకం - కాలడి - మంగుళూరు - గోకరణం - హుబ్లీ - గడగ్ - బళ్ళారి - గుంతకల్లు - ద్రోణాచలం - తుంగభద్రానది - హోస్పేట- హంపి - గుంటూరు - బాపట్ల.

## i) యాత్రా విశేషాలు :

ఈ యాత్రలో శర్మగారు కంచి, శ్రీరంగం, రామేశ్వరం, మధుర, గోకరణం, హంపి మొదలైన పుణ్యక్షేత్రాలు సందర్శించాడు. 1-5-1930 నుండి 16-6-1930 దాకా మొత్తం 45 రోజుల యాత్ర. దక్షిణ దేశంలోని దేవాలయాలు పెద్దవనీ, ప్రతి గుడిలో భక్తిశ్రద్ధలతో పూజలు నిర్వహింపబడతాయనీ రచయిత పేర్కొన్నారు.

కంచి పట్టణం శివకంచి, విష్ణుకంచి అని రెండు పట్టణాలుగా విభజింపబడింది. శివకంచిలో శర్మగారు స్నానం, శ్రాద్ధకర్మలు నిర్వర్తించారు. ఇక్కడి ప్రధాన దేవాలయం ఏకామ్రేశ్వర దేవాలయానికి ఐదు ప్రాకారాలున్నాయి.

ఇక్కడ నుండి రైలుబండి చెంగల్పట్టుకు వెళ్ళి, అక్కడి నుండి బస్సుపై పక్షితీర్థం చేరుకున్నారు. ఆ సమయంలో పక్షితీర్థంలో బ్రహ్మోత్సవాలు కాబట్టి సత్రాలలో చోటు దొరకలేదనీ, వైశ్య సత్రాలలో స్థలమున్నా బ్రాహ్మణుడైన శర్మగారిని - ఏ కారణం వల్లనో యేమోకాని - చేరనివ్వలేదనీ ఆయన వ్రాసుకున్నాడు. అందుకని వీరు అద్దెయింట్లో బసచేశారట. కొండమీద పక్షులు ఆహారం తీసుకుంటూంటే వందల సంఖ్యలో జనం చూసి రావడం ఇక్కడి ప్రత్యేకత.

చిదంబరంలో రైల్వేస్టేషన్‌కు దగ్గరలోనే ఉన్న అన్నామలై విశ్వవిద్యాలయం దర్శించారు.[1] నాలుగు పెద్ద భవనాలతో 'అతి బాల్యదశ'లో ఉందట. విద్యాలయం చుట్టూ తోటలు లేకపోవడం రచయితకు ఆశ్చర్యం కలిగించింది.

తంజావూరులో గర్భాలయం మీది గాలిగోపురం నీడ చుట్టు ప్రక్కల పడదట! ఇక్కడి స్టేషన్‌దగ్గరి సత్రంలో రోజుకు ఒక రూపాయి అద్దె చెల్లించామన్నారు.

---

1. చిదంబరం దగ్గర అణ్ణామలై చెట్టిగారు తన పేరిట విశ్వవిద్యాలయం స్థాపించారని ఆరుద్ర 'వ్యాస పీఠం' (పేజీ 152)లో ఉంది.

తంజావూరు నుండి శ్రీరంగం వెళ్ళడానికి రైలుబండిపై ఐదుగంటల ప్రయాణం. కొంతమంది మలయాళ స్త్రీ పురుషులు నదీస్నానం చేసి ఒడ్డున హిరణ్య శ్రాద్ధం చేస్తున్నారనీ, మలయాళ స్త్రీలు స్నాన సమయంలో మోకాలు చిన్న తుండుగుడ్డ మాత్రమే చుట్టుకుని దాదాపు వివస్త్రలుగా కనిపించారని రచయిత వ్రాశారు.

శ్రీరంగనాయకుల గుడిలో వైష్ణవులను తప్ప ఇతరులను అంటే స్మార్తులను మరి ఇతర బ్రాహ్మణులను హీనంగా చూడటం, తీర్థప్రసాదాలు కూడ దైవసన్నిధిలో వైష్ణవులకే ఇవ్వడం గమనించాడు.

అఖండ కావేరి యొక్క ఒక పాయ శ్రీరంగం దగ్గర దక్షిణకావేరి అని పిలువబడుతుంది. ఇది లోతైన నది. కొల్లడం రెండోపాయ. ఇక్కడి కావేరిని ఉత్తర కావేరి అంటారు. లోతు తక్కువ. కాబట్టి ఇక్కడ స్త్రీ పురుషులు కూర్చుని, పరుండి యథేచ్ఛగా స్నానాలు చేస్తుండడం శర్మగారి దృష్టికి వచ్చింది.

తిరుచినాపల్లిలో కొండమీద ఈశ్వర దేవాలయం తర్వాత క్లైవుగారి కోట దర్శించారు. బహుశా ఇంగ్లీషు వారి ప్రభావం ఎక్కువగా ఉండడంవల్ల కావచ్చు ఇక్కడ క్రైస్తవులు ఎక్కువగా కనిపించారని వ్రాశారు.

జంబుకేశ్వరంలోని వేయికాళ్ళ మంటపం శిల్ప విన్యాసంతో శోభిల్లుతున్నదట. కాని ధర్మకర్తలు దీన్ని రైసుమిల్లు వారికి అద్దెకిచ్చి భక్తిని వంచించారని విచారం వ్యక్తం చేశారు. శ్రీరంగ దేవాలయంలో మొదట శివలింగ ప్రతిష్ట జరుగగా, కాలాంతరాన వాటిని తీసివేసి నరసింహ విగ్రహాల ప్రతిష్ఠ జరిగిందని అక్కడివారు చెప్పినట్లు వ్రాశాడు. అక్కడి వైష్ణవుల శాఖావైషమ్యం వల్ల - అంటే బ్రాహ్మణులలోని ఇతర శాఖల వారిని తక్కువగా చూడడం వల్ల- ఇక్కడి స్థలమాహాత్మ్యానికి కళంకం ఆపాదింపబడినట్లు రచయిత అభిప్రాయం వెలిబుచ్చారు. శ్రీరంగాలయంలో కొబ్బరికాయను నివేదనకు స్వీకరించక పోవడానికి కారణం స్వీయమత దురభిమానమేనట! నారికేళం నెత్తిన మూడు కన్నులుంటాయి కాబట్టి దాన్ని పరమేశ్వరుని త్రిలోచనాలకు ప్రతీకగా భావించుకొని ఈశ్వర సంబంధమైన వస్తువనే దుర్భ్రమతో దాన్ని ఆ గుడిలో నివేదనకు తీసికొనరని పేర్కొన్నారు.

## vi) రామేశ్వరం :

'రామేశ్వరంలో సేతు మాధవస్వామి కాళ్ళకు సంకెళ్ళుంటాయి. సేతు స్నాన ఫలం యాత్రికుల కివ్వడానికి స్వామివారక్కడ ఉన్నట్లుగా చెప్తారు. ఇక్కడ ఉండడానికి విసిగి వైకుంఠానికి వెళ్ళిపోతానేమో అన్న అనుమానంతో తన కాళ్ళకు తానే సంకెళ్ళు వేసుకొని స్వీయ నిర్బంధంలో ఉన్నట్లుగా ప్రతీతి. సముద్రం దగ్గర మంచినీటి బావి ఉండడం ఏకాంత రామేశ్వరంలో ఒక విశేషం. దాన్ని రచయిత చూశారు.

రామేశ్వర దేవాలయం దక్షిణదేశ దేవాలయాల్లో అన్నిటికంటె పెద్దది. మధుర దేవాలయం దీనికి దీటైనది కావొచ్చునేమో కాని ఇంత అందమైనది మాత్రం కాదు. రామశర్మగారి యాత్రాకాలం నాటికి (1930) రామేశ్వరాలయాన్ని ఊడదీసి, మంచి నల్లరాతితో నాటుకోటి సెట్లు పునర్మిస్తున్నారట![2]

మధురలో రైల్వే స్టేషన్ దగ్గరి మంగమ్మ సత్రంలో బస చేశారు వీళ్ళక్కడ ఉన్న రోజున (19-5-1930) మధురలో 'హర్తాల్' జరిగిందనీ, దుకాణాలు హోటళ్ళు మూసివేశారనీ, పోలీసువారు తుపాకులు చేతబట్టి వీధుల్లో కదం తొక్కినా షాపులు తెరవలేదనీ వ్రాశారు. కాని రచయిత అందుక్కారణం మాత్రం తెలుపలేదు. మీనాక్షీ దేవాలయంలో ఒక విశేషం గమనించారు. ఒక పెద్ద స్తంభం మధ్యనుండి నాలుగు స్తంభాలుగా విడదీసి చెక్కబడింది. ఈ నాలుగింటిని మ్రోగిస్తే నాలుగు వేర్వేరు నాదాలు పలుకుతాయనీ. వెంట వెంటనే వరుసగా వాయిస్తూ పోతే సంగీత ధ్వనులను వినగలమనీ గ్రంథకర్త ప్రత్యక్షంగా చూసి వ్రాశారు.

---

2. తమిళనాడులో మధుర మండలంలోని శివలింగ సీమలోని తిరుప్పత్తూరు, దేవకోట డివిజన్లలో నాటుకోటు చెట్టియార్ల ఉనికిపట్టు ఉంది. ఈ సెట్లు అనాదిగా వడ్డీ వ్యాపారస్తులు... ఐతే ఆర్జనలో ఒక నిర్దిష్టమైన శాతాన్ని ధర్మకార్యాల కోసం కేటాయిస్తారు. దీన్ని 'మగమై' అంటారు. చెట్టియార్లు శైవులు. అందుచేత శివాలయాలకు దానాలు చేస్తారు. పడిపోయిన గుళ్ళు బాగుచేయిస్తారు."

—ఆరుద్ర రచనలు 'వ్యాస పీఠం' పేజీ. 151-52.

### iii) రాజపాళయం :

మధురనుండి రైల్లో రాజపాళయంకు 5 గంటల ప్రయాణం. ఇక్కడ ఆంధ్ర క్షత్రియులు, ఆంధ్ర బ్రాహ్మణులుతప్ప అరవవారు లేరనే చెప్పవచ్చు నట! తమిళ దేశంలో తెలుగువారి ఆచార సంప్రదాయాలను నూటికి నూరుపాళ్ళు కాపాడుతూ వచ్చే గ్రామం ఇదొక్కటేనని పేర్కొంటూ శర్మగారు ఆ గ్రామ వ్యవస్థనిట్లా తెలిపారు:

ఈ గ్రామమంతా ముఠాలుగా విభజింపబడి ఉంది. ఐతే ఇవి రాజకీయ ముఠాలు కావు. ఒకే గోత్రంవారు ఒక ముఠా. ఒక్కొక్క ముఠాకు ఒకో ప్రత్యేక బజారు, ఒక పంచాయితీ, గ్రామ చావడీ ఉన్నాయి. అన్ని ముఠాల మీద అందరి తగవులను పరిష్కరించడానికి సమష్టి గ్రామ పంచాయితీ చావడి ఉంది. రామశర్మగారు వెళ్ళినప్పుడు ఈ చావడిలో అరవ కంబ రామాయణ పురాణం చెప్తున్నారట.

ఈ గ్రామ క్షత్రియుల్లో ధర్మరాజు. వెంకట్రాజులనే తండ్రీ కొడుకులు రచయితకు మిత్రులు కావడంవల్ల వీరిని చూడాలని ఇక్కడికి వచ్చినట్లు వ్రాశాడు. ఇక్కడి క్షత్రియులు మాట్లాడే తెలుగు అరవమిశ్రితమై సంకరమై నందున చక్కని ఉచ్చారణతో తెలుగు నేర్చుకోవడానికి గోదావరి జిల్లానుండి ఒక బ్రాహ్మణుని సకుటుంబంగా రప్పించుకొన్నారు. తర్వాత గ్రామంలో ఒక తెలుగు పాఠశాలకూడ ప్రత్యేకంగా స్థాపించుకున్నారు.

రాజపాళయం తూర్పుకనుమలు, పడమటి కనుమలతో కలిసి అంతరించిన చోటు. ఈ గ్రామం వేటకుక్కలకు ప్రసిద్ధి. గ్రామం వెలుపలి కోనేరులో గ్రామ ప్రజలంతా స్నానాలు చేస్తారు. స్త్రీలు తెల్లవారు జామున్నే పురుషులకంటె ముందువెళ్ళి ఈతలు కొడుతూ పురుషులు వచ్చేవేళకు ఒడ్డుకు చేరతారు.

ఇక్కడినుండి శంకరన్ కోయల్ అనే గ్రామం వెళ్ళారు అక్కడ ఆది శంకర నారాయణ విగ్రహంలో ఓ ప్రత్యేకత ఉంది. సగం శివుడు, సగం విష్ణువు. అట్లాగే విగ్రహానికి సగం అడ్డబొట్టు, సగం నిలువుబొట్టు పెడతారట!

రాజపాళయం దగ్గరి కురుత్తాళానికి బండీ చేసుకొని వెళ్ళారు. కురుత్తాళ మంటే త్రికూటాచలం. తూర్పు, పడమటి కనుమలు, ఊటీ కొండలు ఒకే చోట కూటమి అయిన చోటు. ఇవి పాపనాశనపు పొండల్లో కలిసి ఉన్నాయి. ఇక్కడే తామ్రపర్ణినది జన్మస్థానం, రచయిత ఇక్కడి కొండధారల క్రింద స్నానాదికాలు నిర్వర్తించారు.

## iv) హరిజనుల దేవాలయ ప్రవేశం :

'తిన్నె వల్లి' నుండి బస్సులో నాగర్‌కోయిల్ గుండా సుచేంద్రం వెళ్ళారు.[3] ఈ బస్తీ తిరువాన్కూరు సంస్థానంలోనిది. ఇక్కడి దేవాలయ ప్రవేశం కొరకు 'పంచమ సత్యాగ్రహి'లు చేసిన ప్రయత్నాన్ని రచయిత స్వయంగా చూసి వ్రాశాడు. మొదట దేవాలయం చుట్టూ ఉండే వీధులలోకి, తర్వాత దేవాలయం ఆవరణలోకి ప్రవేశించాలని వీరు ప్రయత్నించగా, పోలీసులు ముప్పయి మందిని అరెస్టు చేసి మిగిలినవారిని వెళ్ళగొట్టి వాళ్ళు మళ్ళీ రాకుండా గుడికి కాపలా కాశారట! ఐతే వీళ్ళు ఎవరి నాయకత్వంలో లేదా ఎవరి ప్రేరణతో దేవాలయ ప్రవేశం చేయడానికి పూనుకున్నారో శర్మగారు తెలుపలేదు.

ఇక్కడి ప్రధాన దేవత స్థానేశ్వరుడు. అమ్మవారిగుడి లేదు కన్యాకుమారీ వద్ద ఉన్న అమ్మవారికీ స్థానేశ్వరునికీ మధ్య ఒక విచిత్రమైన గాథ ఉన్నట్లు రచయిత పేర్కొన్నాడు. "కన్యాకుమారీ వద్ద ఉన్న అమ్మవారు ఈ స్థానేశ్వరుని వరించి వివాహము చేసుకొనుటకు నిశ్చయించుకొని వివాహ లగ్నము నేర్పరుచుకొనబడెను. ఆ లగ్న సమయమునకు యీ స్థానేశ్వరుడు కన్యాకుమారీ వద్దకు వెళ్ళలేనందున పెండ్లి ఆగిపోయినది. అందువలన అప్పటినుండి యీ స్థానేశ్వరుడు బ్రహ్మచారిగాను, కన్యాకుమారీ అమ్మవారు కన్యగాను నుండి పోయిరి."[4]

రామేశ్వర కన్యాకుమారీ ఆలయాలు ఇదివరకు తెల్లని చట్రాళ్ళతో నిర్మించారు. ఈ రాళ్ళను రుద్దితే ఇసుకరాలుతుందట! అందుకే ఈ రాళ్ళను తీసివేసి నల్లని కొండరాళ్ళతో పునర్నిర్మిస్తున్నట్లుగా రచయిత వ్రాశారు.

---

3. రచయిత 'తిన్నెవల్లి'గా పేర్కొన్నది 'తిరునెల్వేలి' కావచ్చు.
4. నా యాత్ర - "దక్షిణాది యాత్ర" - పేజీ. 171.

వేదారణ్యం ఆదిసేతువనీ, రామేశ్వరం మధ్య సేతువనీ, కన్యాకుమారి అంత్య సేతువనీ ప్రతీతి. మూడుచోట్ల తీరం ధనుస్సు ఆకారంతో ఉండడం ఒక విశేషం.

బస్సులో సుచేంద్రం కుండా తోతాద్రి చేరుకున్నారు. ఇక్కడి వైష్ణవ మతంలో విష్ణువుకు నూనెతో అభిషేకం చేస్తారు. పానవట్టం గుండా చిన్న కోనేరులోకి వెళ్ళిన నూనెను యాత్రికులు పూసుకుంటారట! ఒళ్ళు నొప్పులు తగ్గిపోతాయని వారి నమ్మకం.

నాగర్ కోయిల్ మలయాళ దేశానికి ప్రవేశ ద్వారం. కష్టమ్స్ ఆఫీసు వారు పన్నులు వసూలు చేసే నిమిత్తం పెట్టెలను వెతికి చూస్తారనీ, 'మ్యాంగ లూరు పెంకులు' అని పిలువబడే ఎర్ర పెంకులు ఇక్కడ కుమ్మరివాళ్ళు చేసి అమ్ముతారనీ రచయిత వ్రాశారు.

అనంతశయనంలో వీరు బసచేసిన సత్రంలో బ్రాహ్మణులకు, బ్రాహ్మణేతరులకు వేర్వేరు వసతులున్నాయి. తమిళ, మలయాళ దేశాల్లో అన్ని సత్రాల్లో కూడ ఇది సహజమని శర్మగారి అనుభవంలో తేలింది. అనంతశయనంలోని పద్మనాభస్వామి వారిని తిరువాన్కూరు సంస్థానానికి ఏలికగా భావించి, మహారాజావారు స్వామివారి ప్రతినిధిగా ఈ సంస్థానాన్ని పరిపాలిస్తున్నారట! అందుకేనేమో గుడిముందు సిపాయిలు కాపలా వుంటారు. సంస్థానం ఉద్యోగులు ప్రతిరోజు స్వామివారి దర్శనం చేసుకుంటారు. మహారాజావారి కోటనుండి గుడికి రహస్య మార్గమున్నట్లు రచయిత పేర్కొన్నారు.

స్త్రీ పురుషులకిక్కడ స్నానానికి ప్రత్యేకమైన కోనేర్లున్నాయి. పురుషుల్లాగే స్త్రీలు కూడ కొబ్బరినూనె పూసుకొని లంగోటా వంటి చిన్న గుడ్డలను కట్టుకొని స్వేచ్ఛగా స్నానం చేస్తారట!

అరవదేశంలో బ్రాహ్మణులు మాత్రమే ధరించే తెల్లని వస్త్రాలను మలయాళ దేశంలో అన్ని వర్గాలవారూ ధరిస్తారు. ఐతే మీసాలు తీసివేయడంలో ఉభయ ప్రాంతాలవారికీ సామ్యం ఉంది. మలయాళ స్త్రీలు స్నానానంతరం మొలచుట్టూ గుడ్డతోనూ, రొమ్ములమీద తుండు గుడ్డతోను స్వామివారి ఆలయానికి వస్తారనీ, ఇంటిదగ్గరైతే వక్షస్థలాన్ని ఏ అచ్ఛాదన లేకుండానే వుంచుతారని శర్మగారు గమనించారు. కూలి చేసుకునే స్త్రీలైతే బజార్లవెంట కూడ అనాచ్ఛాదితంగానే కూలిపనులు చేస్తూ కనిపిస్తారని వ్రాశాడు.

## V) మలబారు తీరంలో నీటి మార్గాలు :

మలబారులోని నీటి మార్గాల గురించి శివరామశర్మగారి వివరణకు సంక్షిప్తపాఠం ఇది:-

మలబారు పడమటి కనుమలకూ అరేబియా సముద్రానికీ మధ్య ఉన్న చీలిక భూమి. క్విలాన్ నుండి తిరువాన్కూరుకు, అట్లాగే ఎర్నాకులం నుండి మంగుళూరుకు మధ్య రైల్వే లైన్లున్నాయి. కాని క్విలాన్ నుండి ఎర్నాకులం రావాలంటే బోటుమీద కాని, మోటారు ప్రయాణం కాని చెయ్యాల్సి ఉంటుంది. రైళ్ళు పడక పూర్వమైతే మలబారు ప్రాంతమంతా బోటు ప్రయాణాలే చేసేవారు. నీటి మార్గాలను చూపే ప్లాను త్రివేంద్రం మ్యూజియంలో ఉంది. వాళ్ళకు వీథుల్లో నడిచే అవకాశం లేదు. అన్నీ పిల్లకాలువలే. వీటినే నీటి బజారులుగా వాడుకుంటారు. ఇంటి నుండి బయటకు రాగానే కాలు నేలమీద కాదు పెట్టాల్సింది- బోటు మీద కాని, బల్లకట్టు మీద గాని. ఎందరింటికి పోవాలన్నా ఇదే పద్ధతి. పరదేశి ఈ గ్రామాల్లో దారి తప్పినట్లైతే మలయాళ స్త్రీలచేత చిక్కి తప్పించుకు రాలేడన్న కథ పూర్వపు రోజుల్లో నిజమై ఉంటుందేమో అంటూనే, శర్మగారు "ఇప్పటికీ అట్లు జరుగుటకు కొన్ని సావకాశములుండ వచ్చునని చెప్పవచ్చును" అని వ్రాశారు [5] దీనికి ఆధారమేమిటో తెలియదు.

శర్మగారు క్విలాన్ నుండి వైకం దాకా రాత్రి పూట వెన్నెల్లో బోటు ప్రయాణం చేశారు. క్విలాన్ వైకముల మధ్య మోటారు ప్రయాణం కూడా చేసే వీలుండగా శర్మగారు ఈ మార్గాన్నే ఎంచుకోవడానికి కారణం ఉంది. సాల్వేషన్ ఆర్మీ మిషనరీలు ఈ నీటి మార్గాల మీది బోటు ప్రయాణాల ఫోటోగ్రాఫులను బాపట్లలో చూపినపుడు శర్మగారికి ఈ ప్రాంతం చూడాలనే కుతూహలం కలిగిందట! ఈ ఫోటోగ్రాఫులను 'లాంతర్లతో ప్రదర్శించి' చూపారని వ్రాశారు. ఇది బహుశా ఫిల్మ్ షో అయి ఉంటుంది. ఇప్పటి ప్రయాణానుభవంతో వీరికి మలబారు ప్రాంతం 'భూమి మీద స్వర్గం' లాగా తోచినట్లు చెప్పారు.

---

5. నా యాత్ర -"దక్షిణాపథ యాత్ర" -పేజీ 180.

## VI) అమ్మాయిల సంత :

అనంత శయనంలో, వైకంలో శర్మ బృందాన్ని స్థానిక దళారీ బ్రాహ్మణులు యాత్రార్థం వచ్చినవాళ్ళుగా కాక పెండ్లిబేరగాళ్ళుగా భావించారు. దీనికి ఓ కారణముంది. ఈ రెండు చోట్లు 'సంత స్థలాలట!'[6] అంతకు ముందు బాపట్ల నివాసి ఒకాయన వైకం నుండే ఒకమ్మాయిని పైకమిచ్చి కొని వివాహం చేసుకున్నాడు. ఇప్పుడీ అబ్బాయికి (శివరామ అయ్యరు) ఆ పిల్ల చెల్లెల్నిచ్చి పెండ్లి చేయడానికి నిశ్చయించుకొని, ఆ పిల్లతల్లి అమ్మాయిని కొనడానికి బేరాలు ప్రారంభించింది. పిల్ల అన్నగారు వీరితో మాట్లాడితే బెట్టుతగ్గి బేరం చెడిపోతుందని చెల్లెల్ని ఎత్తుకొని దూరంగా గంతులు వేస్తూ ఉన్నాడట! వైకంలో జరిగిన వైనం ఇంతటితో ఆపేశారు శర్మగారు.

మొదట రచయిత కోయంబత్తూరు గుండా మైసూరు, బెంగుళూరు లకు వెళ్ళాలనుకున్నారు కాని అతివర్షం వల్ల సముద్రపు ఒడ్డునే బస్సుమీద గోకర్ణం వెళ్ళాలని నిర్ణయించుకున్నారు. ఈ ప్రయాణం వల్ల భారతదేశ ప్రదక్షిణ జరిగినట్లవుతుందని భావించారు కూడ.

'మ్యాంగలూరు' నుండి మాధ్వుల పుణ్యక్షేత్రం వుడిపికి, అక్కడినుండి గోకర్ణానికి బస్సు ద్వారా ప్రయాణించారు. గోకర్ణ యాత్రలో దారిలో కొన్ని నదుల వద్ద బసు అనగానే బల్ల కట్టుల మీద బస్సును అవతలికి తీసుకుపోతారు. బాటసారులు సామాన్లతో బోటుల మీద నదులను దాటుతారు. మలబారు ప్రాంతంలో నీటి ప్రయాణాలు సహజం అందుకని వాళ్ళు బస్సుల్ని కూడ బల్ల కట్లమీద దాటిస్తారు. మన దగ్గర ఏ ఒడ్డు దగ్గరి బస్సు ఆ ఒడ్డునే ఆగిపోతుంది. దేశావసరాలను బట్టి సౌకర్యాలు అన్నదిందుకే. గోకర్ణ దేవాలయంలో శ్రీశైలం మాదిరి ధూళి దర్శనం చేసుకోవచ్చు.

ప్రాతూరి వేంకట శివరామ శర్మగారు తూర్పు పడమటి తీరాల వ్యత్యాసం గురించి ప్రస్తావించారు:

---

6. మనం పశువుల సంత అని ఏ అర్థంలో వాడతామో, ఆ కాలంలో అక్కడ స్త్రీలను కొనే, అమ్మే స్థలాలకు 'సంతస్థలాలు' అని పేరున్నట్లు తెలుస్తున్నది అమ్మాయిలను అమ్మేసే స్థలాలన్నమాట!

తూర్పు సముద్ర తీరం కంటె పడమటి తీరం అందంగా ఉంటుంది. ఈ తీరస్థులగు స్త్రీలలో కూడ ఈ తారతమ్యం కనిపిస్తుంది. పడమటి తీరంలో తాటిచెట్లు, పందులు లేకపోవడం వల్ల తురకలు ఎక్కువన్నారు.

కాశీకంటె గోకర్ణం ఎక్కువని గోకర్ణం దిక్కు మొగ్గుచూపే త్రాసొకటి ఇక్కడి పార్వతీదేవి చేతిలో ఉన్నట్లుగా రచయిత వ్రాశారు. ఇక్కడి లింగం మీద మూడు నాలుగు సానవట్టాలు బిగించడం వల్ల భూమట్టం మీద గజం పొడుగున్న లింగం సుమారు అంగుళమెత్తు కనిపిస్తుందట! శాస్త్రీయంగా తయారు చేసిన ఒక జిగట పదార్థంతో పానవట్టాలను ఒకదాని మీద ఒకటి అతికించి వాటిని పుష్కరానికొకసారి ఊడదీసి ఆత్మలింగాన్ని ప్రజల దర్శనం కోసం ప్రదర్శిస్తారని శర్మగారు తెలుసుకున్నారు. ఈ ఆలయ సమీపంలో రాణీ అహల్యాబాయి నిర్మింపచేసిన సత్రమున్నది.[7]

ఇక్కడి మేడలన్నీ మట్టిగోడలవే. ఒక విధమైన బంకమట్టిని మెత్తగా నూరి నేలకు పూసి గట్టిగా రుద్దుతారు ఆకారంలో గట్టితనంలో సిమెంటులాగా ఉండి, గోడకు సిమెంటుతో గచ్చు చేసినట్లుగానే ఉంటుందట!

గోకరణంలో గడ్డబెల్లం దొరకదు. ద్రవ రూపంలో ఉన్న బెల్లాన్ని డబ్బాలలో పోసి ఉంచుతారు. ఈ ద్రవంలో మామిడి పండ్ల రసం పిండి భోజనంలో వాడుతారు. అరవదేశంలో పడమటి తీరంలో బ్రాహ్మణులు, ఇతరులు కూడ తాంబూలంలో పొగాకు వేసుకుంటారు. కాని శర్మగారికిది అలవాటు లేకపోవడం వల్ల పొగాకును తీసేసి తాంబూలం వేసుకున్నారట.

గోకరణం నుండి హుబ్లీకి 161 కి.మీ. (100 మైళ్ళు) దూరం. పడమటి కనుమలకు పశ్చిమంగా గోకరణం, తూర్పుగా హుబ్లీ ఉన్నాయి. కాబట్టి హుబ్లీ చేరుకోవాలంటే పడమటి కనుమలనుదాటవలసిందే. ఇంతకుముందు ఈ

---

7. ఈమె ఇందూరు (Indore) ను పాలించిన మల్హాల్‌రావు హోల్కారు భార్య. ఆయన తర్వాత 1765 -1795 దాకా ఇందూరును పాలించిన రాణి. దేశంలో అనేక పుణ్యక్షేత్రాల్లో దాన ధర్మాలు చేసింది.

ప్రయాణం తప్పిపోయింది. క్విలాన్ నుండి ఎర్నాకులకు బస్సుమీద వచ్చినట్లైతే కనుమలను దాటవలసి వచ్చేది. కాని వీళ్ళు బోటు ప్రయాణం చేసినందువల్ల పడమటి కనుమల ప్రకృతి సౌందర్యం చూడలేకపోయారు. ఐతే ఆ అవకాశం మళ్ళీ కలిగినందుకు సంతోషిస్తూ శర్మగారు ఈ ప్రయాణం లోని దృశ్యాలను తనివితీరా సందర్శించారు.

## vii) హంపికి పయనం :-

హుబ్లీ నుండి గడగ్ మీదుగా రైలుబండిలో హోస్పేటకు చేరుకున్నారు. ఇక్కడి నుండి రెండెడ్ల బండిలో హంపికి వెళ్ళారు. ఇది స్టేషన్‌కు 16 కి.మీ. (10 మైళ్ళు) దూరంలో ఉంది. తుంగభద్రానదీ తీరంలోని విరూపాక్ష దేవాలయ గాలిగోపురం మీద కోతులు విశేషంగా ఉన్నాయి. వీటి పోషణకు దేవాలయపు యీనాం ఉన్నదట కాని ధర్మకర్తలు 'అయివేజు'ను అపహరిస్తున్నారని శర్మగారు విన్నదాన్ని తెల్పారు.[8] విరూపాక్ష దేవాలయం తప్ప మిగతా గుళ్ళన్నీ తురకల చేత ధ్వంసం చెయ్యబడ్డాయి. దీనికి 5 కి.మీ. దూరంలో హంపీ పట్టణం శిథిల రూపంలో దర్శన మిస్తుంది. ఇక్కడి మేడలను దూలాలు లేకుండానే ఆర్చీల మీద నిర్మించారట. ఇట్లాంటి కట్టడాలు ఢిల్లీ, ఆగ్రా కోటలలో మాత్రమే చూడగలమని శర్మగారు యాత్రానుభవంతో చెప్పారు.

ఇక్కడి బండ్లవాళ్ళే దొంగలతో కలిసి యాత్రికులను దోపిడీ చేస్తారని తెలిసి చీకటి పడకుండానే హోస్పేటకు చేరుకున్నారు శర్మగారు. ఇక్కడి గేదెల కొమ్ములు బాగా పొడవైనవి. తల నుండి తోక దాకా ఉండి వెడల్పుకూడ ఉంటాయి. ఇట్లాంటి కొమ్ములున్న పశువులను తన యాత్రానుభవంలో భారత దేశంలో ఎక్కడా చూడలేదని ఆయన వ్రాశారు. హోస్పేట నుండి మూడు గంటల వ్యవధిలో రైలుబండి ద్వారా గుంటూరు చేరుకుని, ఇక్కడి నుండి బాపట్లకు వెళ్ళి కొంతకాలానికి సంపూర్ణయాత్ర చేసిన సందర్భంగా సమారాధన జరిపించారట!

---

8. (అయివేజు) అయివజు = మూలధనము - బ్రౌణ్య నిఘంటువు.

శర్మగారు ఆంధ్రదేశంలో చేసిన యాత్రల గురించి కూడ తను యాత్రా గ్రంథంలో పేర్కొన్నారు. వీటిలో శ్రీశైలం యాత్ర గురించి వేరొకచోట ప్రత్యేక శీర్షికలో వివరించడం జరిగింది. మిగతా యాత్రలు 1930 కి ముందే చేసినట్లు ఒకచోట చెప్పుకున్నారు.[9] ఆ యాత్రాస్థలాలు: శ్రీకాళహస్తి, మంగళగిరి, అమరావతి, వేదాద్రి, ద్రాక్షారామం, కోటిపల్లి, భద్రాద్రి.

ఐతే ఈ స్థలాల వివరాలు యాత్రా మార్గదర్శి పద్ధతిలో సమాచారాన్ని అందించే విధంగా ఉన్నాయి కాని యాత్రాస్పర్శతో లేవు అంటే తాను ప్రయాణించిన విధానం, దూరమానం, తేదీలు, అనుభవాలు తదితర వివరాలు లేవు. అందుకే వాటి నిక్కడ చేర్చలేదు.

## 2. బులుసు వారి "నా దక్షిణ దేశ యాత్రలు"*

వేంకట రమణయ్య గారు దక్షిణ దేశంలో జరిపిన ఎనిమిది యాత్రా వివరాల సంపుటి 'నా దక్షిణ దేశ యాత్రలు' అనే పుస్తకం. దీనిలో మొదటి యాత్ర 1937లో, ఆరవ యాత్ర 1954లో జరిగింది. ఏడు, ఎనిమిది యాత్రల తేదీలు పేర్కొనలేదు. ఇవి చిరుయాత్రలు కూడ. రెండు మూడు రోజుల వ్యవధిలో పూర్తిచేసినవి.

లభించిన గ్రంథంలో మొదటి 'రెండు మూడు' పుటలు తొలగింపబడి ఉండటంవల్ల ఈ రచన ఏ కాలంలో చేయబడిందో తెలిసే అవకాశం లేదు. ఐతే ఈయన 1958లో ప్రకటించిన 'నా ఉత్తర దేశయాత్ర' అన్న పుస్తకంలో ఇతర ముద్రిత రచనల క్రింద 'దక్షిణ దేశ యాత్రలు' కూడ ప్రకటింపబడి ఉండటంవల్ల, ఇది 1958కి ముందు రచించినట్లు తెలుస్తున్నది. ఇంకా ఖచ్చితంగా చెప్పాలంటే ఈ పుస్తకం 1953 - 57 ల మధ్య అచ్చువేసి ఉంటారని చెప్పవచ్చు.[10]

---

9. దక్షిణాది యాత్రల తర్వాత క్రింది విషయం వ్రాశారు. "ఆంధ్రదేశము లోని క్షేత్రములను యిదివరకే చాలవరకు దర్శించితిని...శ్రీశైలము నకు మాత్రము వెళ్ళలేదు." —పేజీ. 201.

* బులుసు వేంకట రమణయ్యగారు.

10. ఎనిమిది యాత్రల్లో ఆరవది 1954లో కావడంవల్ల యాత్రలు పూర్తి కావడానికి 1955 కూడ గడిచిందనుకోవాలి.

అటు యాత్రా పరులకూ, ఇటు విశేషాలు గ్రహింపదలచిన వారికీ ఉపయోగకరంగా ఉండాలని, చదవటానికి ఆకర్షకంగా ఉండేవిధంగా రాసి పుస్తకాన్ని రచించినట్లు రచయిత పీఠికలో చెప్పుకున్నారు.

## i) త్రివేంద్రం యాత్ర :

మద్రాసులోని కెల్లెట్ హైస్కూల్లో రమణయ్యగారు ఉపాధ్యాయులు. 1937లో అఖిల భారత ప్రాచ్య విజ్ఞాన పరిషత్తువారు నిర్వహించిన సభకు ఈయన సభ్యుడుగా పాల్గొన్నారు. ఈ సభ త్రివేంద్రంలో జరిగింది. పూర్వం నుండి మలయాళదేశంగా ప్రసిద్ధి పొందిన నేటి కేరళ రాష్ట్రానికిది రాజధానీ నగరం.

ఇదే సంవత్సరం దక్షిణ భారత రైల్వేవారు కొత్తగా 'బైరాగి టిక్కెట్టు' ప్రవేశపెట్టారు.[11] దక్షిణ దేశమంతా తిరగడానికి రైల్వేఛార్జి రూ॥ 12-50. మూడవ తరగతిలో ప్రయాణించే యాత్రికుల సౌకర్యార్థం ఈ పద్ధతి ఏర్పాటయింది. దేశాన్ని చూడాలనే కుతూహలం కలిగిన మధ్యతరగతి కుటుంబీకులకు ఇంతకంటె మంచి అవకాశం లభించదుకదా? రమణయ్యగారు ఈ యాత్రలో బైరాగి టిక్కెట్టు మీదనే ప్రయాణించారు.

రమణయ్యగారు పన్నెండు రోజుల్లో తిరిగి రావడానికి ప్లాను చేసుకొని 1937 డిసెంబరు నెలలో యాత్ర ప్రారంభించారు. వెంట మిత్రుడు ముళ్ళపూడి నారాయణశాస్త్రి ఉన్నారు.

త్రివేంద్రం ఎక్స్‌ప్రెస్‌లో ఎగ్మూరు స్టేషన్‌నుండి యాత్ర ప్రారంభం. తాంబరం దాకా ఎలక్ట్రిక్ ట్రెయిన్.

---

11. దక్షిణ దేశంలో యధేచ్ఛగా తిరిగే వీలు కల్పించడం వల్లనే దీనికి బైరాగి టిక్కెట్టు అనే పేరు పెట్టారేమో! ఒక ప్రణాళిక ప్రకారం కాకుండా ఎక్కడికైనా ఎప్పుడైనా సంచారం చేసే 'బైరాగి' పేరు మీద ఈ టిక్కెట్టు పెట్టడంలో అర్థముంది.

## a) ప్రయాణ మార్గం :

ఎగ్మూరు- చిదంబరం- చెంగల్పట్టు- తిండివనం- విల్లుపురం- వృద్ధాచలం- లాల్ గుడి- శ్రీరంగం- తిరుచినాపల్లి- దిండిగల్లు- కొడైకెనాల్ రోడ్డు- మధుర- విరుదునగర్ - విల్లుపుత్తూరు- రాజపాళయం - తెంకాశి - కుర్తాళం - క్విలాన్ - త్రివేండ్రం - కన్యాకుమారి అగ్రం - నాగర్‌కోయిల్ - పద్మనాభపురం - త్రివేండ్రం- (తిరుగు ప్రయాణం)- కొచ్చిన్- ఎర్నాకులం- షోరనూరు - షోద నూరు- పళని - దిండిగల్లు - మధుర - రామనాథపురం - మండపం క్యాంపు - పాంబన్- రామేశ్వరం- పాంబన్ - ధనుష్కోటి - మానా మధుర - త్రివేండ్రం మద్రాసు ఎక్స్‌ప్రెస్‌లో ఎగ్మూరుకు.

## b) యాత్రా వివరాలు :

మద్రాసు దాటి దక్షిణ ప్రాంతం రావడం రచయితకిదే తొలిసారి. విల్లు పురం పెద్ద జంక్షన్. ఇక్కడి ప్రధాన రైలు మార్గం మెయిన్ లైను, కార్డు లైనులుగా విడిపోతుంది. మెయిన్ లైను ద్వారా ప్రయాణిస్తే కడలూరు, చిదం బరం, మాయవరం, కుంభకోణం, తంజావూరు, తిరుచినాపల్లి, పుదుక్కోటల మీదుగా ధనుష్కోటి చేరుతుంది. కార్డు లైనులో వెళ్తే వృద్ధాచలం, లాల్‌గుడి, శ్రీరంగంల మీదుగా తిరుచినాపల్లి చేరుకోవచ్చు. ఈ రెండు దార్లలో రెండోదే దగ్గరి దారి. తిరుచినాపల్లికి చేరుకోవడానికి 40 మైళ్ళు (65 కి. మీ ) ప్రయాణం తగ్గుతుంది. రమణయ్యగారు ప్రయాణించిన 'త్రివేండ్రం ఎక్స్‌ప్రెస్' ఈ దగ్గరి దారిలోనే నడిచింది.

శ్రీరంగం స్టేషన్ నుండి 9 గంటలు ప్రయాణిస్తే తిరుచినాపల్లి వస్తుంది. ఇది దక్షిణ ఇండియా రైల్వేకు ప్రధాన కేంద్రంగా ఉండేది.[12] ప్రధాన కార్యాల యాలన్నీ ఇక్కడే. రైల్వే ఇంకా కంపెనీ అధికారంలోనే ఉంది కాని ప్రభుత్వం అధీనంలోకి రాలేదు. ఇక్కడ చాలా ప్లాటు ఫారాలున్నాయి. ఒక ప్లాటు ఫారం నుండి మరో ప్లాటు ఫారానికి వెళ్ళడానికి సొరంగమార్గాలు (సబ్ వేస్) ఉన్నా యట! అప్పటి ఈస్టరన్ రైల్వేస్‌లోని ఖరగ్‌పూర్‌లో తప్ప మరెక్కడా ఇలాంటి ఏర్పాటు తానప్పటివరకు చూడలేదని రచయిత వ్రాశారు.[13]

---

12. రమణయ్య గారింకా అప్పటికి ఉత్తర దేశ యాత్రలు చేయలేదు. ఇప్పుడు మద్రాసు కేంద్రంగా ఉంది.

13. ఇప్పుడిది ఆగ్నేయ రైల్వేలో ఉంది. (South East Railway)

మధుర జంక్షన్ తరువాతి స్టేషన్ విరుదునగర్. తూత్తుకుడికి, తిరునల్వేలికి వెళ్ళదలచిన వారు ఇక్కడే లైనుమారి దక్షిణం దిక్కుగా వెళ్ళాల్సి ఉంటుంది. కాని బులుసువారు వెళ్లేది పడమటి ప్రాంతం కనుక దారి మారకుండానే ప్రయాణం సాగింది.

విల్లి పుత్తూరు దాటిన తర్వాత రాజపాళయం వస్తుంది. ఇది పరిశ్రమల కేంద్రం. ఇక్కడ నివసించేవాళ్ళు ఆంధ్రదేశం నుండి వలసవచ్చి స్థిరపడ్డవారు. వీరు మాట్లాడే తెలుగు "ఒక విచిత్రమైన యాసతో" ఉంటుందని ప్రాతూరి వేంకట శివరామ శర్మగారిలాగే గమనించారు.

రాజపాళయం తర్వాత స్టేషన్ తెంకాశి (టెంకాశి) 14 ఇక్కడ భోజన గృహం లేదుకాని పులుసన్నం, పెరుగన్నం తయారుచేసి పొట్లాలు కట్టి ఒక సంచిలో ఇస్తారట! ఒక్క పొట్లం వెల అప్పట్లో రెండణాలు. రెండు పొట్లాలు కొంటే - అంటే 25 పైసలకే - సామాన్య భోజనం చేసేవాళ్ళకు సరిపోయేదని రమణయ్యగారి స్వానుభవం.

సెంకోట, తెంకాశికి ప్రక్కస్టేషనే. పడమటి కనుమలు ఇక్కడినుండే ప్రారంభం. ఇక్కడినుండి మలయాళదేశపు వాతావరణం కొట్టొచ్చినట్టు కనపడుతుందట! క్విలాన్‌దాకా దాదాపు వంద కిలోమీటర్లు (60 మైళ్ళు) ప్రయాణం సాగింది. దారిలో రైలు పడమటి కనుమలలోని మైదానాలగుండా, పర్వతాల మీదా, సొరంగాల ద్వారా ప్రయాణించింది.

క్విలాన్ ఇప్పటికీ జిల్లా ముఖ్యపట్టణమే. ఇంతదాకా పడమరగా ప్రయాణించిన రైలు ఇక్కడినుండి దక్షిణానికి మరలింది. క్విలాన్‌కు త్రివేంద్రం సరిగ్గా దక్షిణం దిక్కున ఉంది.

త్రివేంద్రం సెంట్రల్ స్టేషన్ తర్వాత రైల్వే లైను కూడ లేదనీ, ఇంకా దక్షిణం దిక్కు వెళ్ళాలంటే బస్సుల మీదే ప్రయాణం చెయ్యాల్సి ఉటుందని రచ

---

14. "దక్షిణ కాశి అన్న పేరుబడ్డది టెంకాసి సరియైన పేరు తెన్‌కాశి తెన్ అనగా దక్షిణం అని అరవంలో అర్థం. తిరునెల్వేలి జిల్లాలోనిదిది" అని లింగం వీరభద్రయ్య చౌదరి 'స్వవిషయం'లో వివరించారు. పేజీ 982.

యిత తెలిపారు.[15] త్రివేంద్రంలో టైము మద్రాసులో కంటె 18 నిమిషాలు ముందుంటుంది.

'కౌడియర్ ప్యాలెస్' రాజభవనంలోని ఆతిథ్యపు విధానం రమణయ్య గారికి ఆశ్చర్యాన్ని కలిగించింది. పాశ్చాత్య దేశపు పద్ధతిలో అక్కడి టీపార్టీ జరిగిందనీ, వేరొక ద్వారం గుండా తిరిగి వచ్చేటప్పుడు బీడా (తాంబూలం) ఇచ్చారనీ వ్రాశారు.

తమిళ మలయాళ దేశాల్లో తెలుగు పాటలు బహుళ ప్రచారంలో ఉన్నాయి. ఒకనాటి రాత్రి జూబిలీ హాలులో నాట్య ప్రదర్శంతో పాటు 'రార వేణు గోప బాల' అనే పదం పాడుతూ నటీమణులు వేసిన కోలాటం బులుసువారికి ఆశ్చర్యాన్నే కాక ఆనందాన్ని కూడ కలిగించిందట!

అక్కడి అనంత పద్మనాభ స్వామి దేవాలయంలోకి కోట్లతో, చొక్కాలతో చివరకు బనీన్లతో కూడ ప్రవేశింపరాదని సంస్థానం వారి నిబంధన ఉంది. పైన అంగ వస్త్రం మాత్రం వేసికొని స్వామివారి దర్శనం చేసుకోవచ్చు.

సైన్సు కాలేజి భవనంలో జరిగిన పండిత పరిషత్ సభకు మహారాజా వారు దుకూలాలను ధరించి, పైన కేవలం పట్టు అంగవస్త్రమే ధరించి రావటాన్ని బట్టి, బహుశా ఇది పండిత మర్యాద కోసం కావచ్చునని రమణయ్య గారు అభిప్రాయపడ్డారు.

అంత్యసమావేశం ముగిసిన తర్వాత కన్యాకుమారి అగ్రం చూడటానికి కారులో బయలుదేరారు. త్రివేంద్రం నుండి మూడు గంటల ప్రయాణం. మూడు సముద్రాలు కలిసే అద్భుత సంగమస్థలం కన్యాకుమారిని దర్శించి, తిరుగు ప్రయాణంలో శుచీంద్రం, నాగర్‌కోయిల్, పద్మనాభపురం చూసివచ్చారు.[16]

---

15. సర్వే ఆఫ్ ఇండియా వారి సౌజన్యంలో 1986 లో ముద్రింపబడిన "ఇండియాన్ రైల్వేస్" అన్న అట్లాస్‌లో తిరునల్వేలినుండి కన్యాకుమారికి, అక్కడి నుండి త్రివేంద్రంకు రైలు మార్గమున్నట్లు చూపబడింది.
16. ప్రాతూరి శివరామశర్మగారు దీన్నే 'సుచేంద్రము' అన్నాడు. పద్మనాభ పురం అన్నది ప్రాతూరి వారు దర్శించిన 'అనంతశయనమే' ఐ ఉంటుంది. ఆయన కూడ బస్సులో నాగర్ కోయిల్ తర్వాత అనంతశయనం చూశాననే వ్రాసుకున్నాడు. పేజీ. 174.

### c) తిరుగు ప్రయాణం :

త్రివేంద్రం సెంట్రల్ స్టేషన్‌లో ప్యాసింజరు బండిపై బయలుదేరి కొచ్చిన్ (Cochin) హార్బరుకు చేరుకున్నారు. హార్బరుకు ఒకవైపు కొచ్చిన్, ఇంకోవైపు ఎర్నాకులం. కొచ్చిన్ సంస్థానంలో ఇది ముఖ్య నగరం. కొచ్చిన్ హార్బరునుండి ఎర్నాకులం వెళ్ళడానికి గంట పట్టిందట! అప్పటికింకా కొచ్చిన్ హార్బరుకు రైలు పడలేదనీ, ఎర్నాకులంతోనే రైల్వేలైను నిలిచిపోయిందనీ రచయిత వ్రాశారు.

మళ్ళీ ఎర్నాకులంలో బండిలో బయలుదేరారు. రామేశ్వరం పోవాలని తలంపు, మళ్ళీ దక్షిణానికే ప్రయాణం. ఎందుకంటే, అది బైరాగి టిక్కెట్ల మహిమ. ఒకే టికెట్‌పై ఎటు తిరిగినా అభ్యంతరం లేదుకదా! అందులో తిరుగు ప్రయాణం. రచయితకు తొందర పనులేవీ లేవు. అందుకే తీరికగా ఇష్టం వచ్చినట్లు తిరగడానికే పూనుకున్నారు. ఎక్స్‌ప్రెస్‌లో షోరనూరు ద్వారా షోదనూరు చేరుకున్నారు. అక్కడినుండి చిన్నబండిలో పళని స్టేషనుకు వచ్చారు. తర్వాత దిండిగల్లు నుండి మధురదాకా పాతమార్గమే.

దక్షిణాదికి తొలియాత్రలో రమణయ్యగారు ఎక్కడా ఆగకుండా త్రివేంద్రం చేరుకున్నారు. కాబట్టి దారిలో ఆయన వర్ణించిన ఆయా ప్రదేశాలలోని వివరాలు లోతుగా పరిశీలించినవి కావు. ప్రయాణిస్తూనే చూసిన దృశ్యాలు కొన్ని, విన్నవి కొన్నీ. ప్రకృతి సౌందర్యాన్ని దర్శించాలన్న కుతూహలం ఉన్నవారు సామాన్యంగా కిటికీ ప్రక్కనున్న సీటునే కోరుకుంటారు. రమణయ్యగారు చేసిన పనికూడ అదే.

మలయాళదేశం గురించి మన ప్రాచీనులు అనేక కథలు చెపుతారని ఒక చోట వ్రాస్తూనే, ఆ కథల సంగతిని పక్కకు నెట్టారు.[17] అనుభవానికి వచ్చిన సంగతులే వ్రాయాలన్న ధ్యేయం వీరి రచనలో కనిపిస్తుంది.

---

17. పెద్దిభొట్ల వీరయ్యగారు గుంటూరుజిల్లా తెనాలి వాస్తవ్యులు. ఈయన తన 'స్వీయ చరిత్ర'లో 1895-98ల మధ్య కొచ్చిన్‌లో ఉన్నట్లు వ్రాసుకున్నారు. దానికి 'కొచ్చి ప్రయాణము' (అడ మళయాళము) అని పేరు పెట్టాడు.

రామశర్మగారికి కనిపించినట్లు గానే వీరికి కూడ మలయాళ దేశంలో "చుట్టూ ప్రాకారం గల ఒక తోటా, ఆ తోటలో ఒకటి రెండు యిళ్ళూ, ఆ ప్రాకారాన్ని అనుకుని మరొక తోటా...'' ఇదే విధంగా దేశమంతటా కనిపించిందట.

త్రివేంద్రం, కొచ్చిన్, ఎర్నాకులం మొదలైన పట్నాల్లో రైలులోంచి చూస్తే స్త్రీల వస్త్రాలంకరణ విధానం ఈ విధంగా ఉందట: "వయసు మీరిన స్త్రీలు మొలవరకూ మాత్రం వస్త్రాలు ధరించి, ఉపరిభాగం అచ్ఛాదన లేకుండా స్వేచ్ఛగ తిరగడం రైలులోంచే చాలా చోట్ల కానవచ్చినది. యువతులూ, బాలికలూ మాత్రం ఊర్ధ్వ దేహాన్ని అంగవస్త్రంతో కప్పుకొని వుండడం తరచు కనిపించేది".18

అతిశయం లేకుండా ఇరువురూ ఒకే విధంగా అక్కడి స్త్రీల వేషధారణ గురించి వర్ణించారంటే అది వారి వాస్తవ దృష్టికి నిదర్శనంగా చెప్పుకోవచ్చు.

## II) మలియాత్ర మైసూరుకు :

దక్షిణానికి తొలియాత్ర చేసిన మూడేండ్లకు అనగా 1940 లో పాఠశాల తరపున ముప్పయిమంది ఉపాధ్యాయులతో కలిసి చేసిన యాత్ర ఇది. దసరా సెలవుల్లో చేసిన మైసూరు యాత్ర.

---

ఆ ప్రాంతంలోని స్త్రీల దుస్తుల గురించి వివరంగా తెలుపలేదు కాని "వారి వస్త్ర విధానమునుబట్టి అచ్చటి పడుచు స్త్రీలు కూడ వృద్ధులవలె కన్పడుచుందురు" అన్నారు. ఇంకా నాయరుల యిండ్లలో స్త్రీలదే పెత్తనమని తెల్పుతూ, తాను వారి బారిన పడకుండా క్షేమంగా రావడానికి తన అనారోగ్యమే కారణమని చెప్పుకున్నారు." మగవాండ్ర కింటి మేనేజిమెంటుతో సంబంధము లేదు. పెత్తనదారురాలు చెప్పిన ప్రకారము వారు నడుచుకొనవలెను. ఎట్టి పొరబాట్లకు లోనుగాకుండా నేను రాగలుగుటకు నా అనారోగ్యము ముఖ్యకారణమని తలంచుచున్నాను." — పేజీ. 81.

18 నా దక్షిణదేశ యాత్రలు - పేజీ 4.

ఈ ప్రయాణంలో కూడ మైసూరు చేరుకునే దాకా దారిలో ఎక్కడా ఆగకుండా యాత్ర చేశారు. "మైసూరు రావడంలోని పరమ ప్రయోజనాల్లో దర్బారు చూడడం ఒకటి" అని ఒకచోట చెప్పుకున్నారు రచయిత[19].

## a) యాత్రామార్గం :

వేగంగా వెళ్ళే బెంగుళూరు ఎక్స్‌ప్రెస్‌లో ప్రయాణం. మద్రాసు సెంట్రల్ - ఆర్కోణం - వాలాజారోడ్డు - కాట్పాడి - జోలారుపేట - కుప్పం - బంగారుపేట - బెంగుళూరు సిటీ - మద్దూరు - మండ్యా - ఫ్రెంచిరాక్ - శ్రీరంగ పట్నం - మైసూరు స్టేషన్.

## b) యాత్రా వివరాలు :

జోలారుపేట వచ్చిన తర్వాత రైలు ఉత్తరం దిక్కు మళ్ళిందట. మద్రాసునుండి ఇక్కడిదాకా ఎక్కడా కనపడని తెలుగుపేర్లు కొన్ని స్టేషన్లలోని బోర్డులమీద కనిపించడం రచయితకు ఆశ్చర్యం కలిగించింది. అవన్నీ తెలుగు ప్రాంతాలు కావడమే అందుక్కారణం!

కొండ ప్రాంతాల్లోని చిన్న స్టేషన్లలో పెద్దది కుప్పెం. ఇది తెలుగు ప్రాంతం. చిత్తూరు జిల్లాలోనిది. అటుతర్వాత స్టేషన్ బౌరింగుపేటకూడ తెలుగు ప్రాంతమే. ఐతే ఇది స్వాతంత్ర్యానంతరం 'బంగారు పేట'గా పేరు మార్చు కుంది. ప్రస్తుతం కర్నాటకలో ఉన్న జంక్షన్.

బెంగుళూరు సిటీ స్టేషన్‌వరకే ఈ ఎక్స్‌ప్రెస్. ఇక్కడితో పెద్ద లైను ఆఖరు కాబట్టి ఇక్కడ బండి మారారు.

శ్రీరంగపట్నం పూర్వపు మైసూరు రాష్ట్రానికి రాజధాని నగరం. ఇప్పుడు అవి రెండూ కర్నాటక రాష్ట్రంలో ప్రధాన నగరాలు మాత్రమే అట్లాగే మైసూరు స్టేషన్ అప్పట్లో మైసూరు సంస్థానం (స్టేట్) రైల్వేకు కేంద్రంగా ఉండేది. ఇప్పుడు దీన్ని దక్షిణ రైల్వేలో కలిపివేశారు.

మైసూరులో కొండ శిఖరమ్మీద చాముండేశ్వరీ దేవి ఆలయం దర్శించారు. అది సముద్ర మట్టానికి 3500 అడుగుల ఎత్తున ఉన్నదట. అందుకే ఇక్కడి

---

19. నా దక్షిణదేశ యాత్రలు - పేజీ 15.

నుండి చూస్తే మైసూరు పరిసర ప్రాంతాలు కూడ కనిపిస్తాయని వ్రాశారు. పైకి వెళ్ళడానికి చక్కని రోడ్డు రోడ్డు కిరువైపులా దగ్గర దగ్గరగా విద్యుద్దీపాలు. రాత్రివేళల్లో చూస్తే దీపాల వరుస 'కొండకు హారం వేసినట్టుగా' తోస్తుందన్నారు.

శ్రీరంగపట్టణం నుండి మైసూరుకు రైలులో వచ్చి అక్కడి మహారాజా వారి దర్బారు, ఎగ్జిబిషన్ చూశారు. అక్కడినుండి బెంగుళూరు సిటీకి 138 కి. మీ. (86 మైళ్ళు) దూరం. ఈ ప్రయాణం చేయడానికి ఏడుగంటలు పట్టిందట![20]

బెంగుళూరు సిటీలో 'లాల్ బాగ్' చూసి మద్రాసుకు తిరిగి వచ్చారు. యాత్రలో విశేషాలింతకుమించి ఏమీ లేవు. మొత్తం ఐదు రోజుల యాత్ర. దీనిలో సగం ప్రయాణానికీ, సగం మైసూరు, బెంగుళూరు పట్టణాలను దర్శించడానికి సరిపోయింది.

## iii) రామేశ్వర యాత్ర :

రమణయ్య గారికి తొలియాత్రలోనే రామేశ్వర దర్శనం అయింది. మరోసారి ఎందుకంటే - ఆప్త బంధువొకరు సహాయంగా రమ్మని నిర్బంధించడమే నన్నారు. ఐతే ఒక్కపూటలో ఇదివరకు చూసిన రామేశ్వరాన్ని ఈసారి 'సావకాశంగా' దర్శించగలిగారు.

రెండవ ప్రపంచ యుద్ధం చివరి రోజుల్లో అనగా 1945 మే నెలలో ఈ యాత్ర జరిగింది. ఎగ్మూరులో బయలుదేరిన తొమ్మిది గంటల తర్వాత తిరుచినాపల్లి చేరుకున్నారు. ఇక్కడి నుండి ప్యాసింజరు బండీలో ధనుష్కోటికి. దారిలో పుదుక్కోటి, కారైకుడి, శివగంగ స్టేషన్లు తగిలాయి. మధ్య మధ్య చిన్న స్టేషన్లలో పల్లెటూరి జనం ఎక్కుతూ దిగుతూ ఉన్నారట. స్త్రీల కర్ణాభరణాలు చాలా వింతగా కనిపించాయి. ధరించిన ఆభరణాల బరువుకు చెవిరంధ్రం రెండు మూడంగుళాల మేరకైనా క్రిందికి సాగి ఉండటాన్ని రచయిత ఆశ్చర్యంతో గమనించారు. ఈ ప్రాంతం నాటుకోటు సెట్టులది. వీళ్ళలో చాలమంది స్త్రీల ఆభరణాలవెనట! తర్వాతి స్టేషన్ మానామధుర.

---

20. ఇది బహుశా ప్యాసింజరు బండీ అయ్యుంటుంది. 65 కి.మీ. (40 మై). బెంగుళూరు ఎక్స్‌ప్రెస్‌లో మద్రాసు నుండి ఆర్కోణానికి గంటలో వచ్చినందుకు రమణయ్యగారు ఆశ్చర్యపడింది ఇందుకొరకే. ఈ లెక్కన మరో ఐదు గంటలు ఆలస్యంగా నడిచినట్లయింది.

రామేశ్వరంలో పురోహితులు యాత్రికులను నొప్పించకుండానే మాటలతో తమకు కావలసిన కట్న కానుకలు రాబడతారని రమణయ్య గారి సానుభవం.

ధనుష్కోటి ఇక్కడికి 29 కి. మీ. (18 మై). దూరం. ఐతే ఈ మాత్రం దూరానికే నాటు పడవపై వెళ్ళడానికి నాలుగున్నర గంటలు పట్టినట్లుగా రచయిత తెల్పారు. పడవ బాడుగ మనిషి ఒక్కంటికి రానుపోను పన్నెండణాలట! ఇప్పటి 75 పైసలన్నమాట!

ఇది రామేశ్వరానికి చేసిన యాత్రలాగా ఉంది కాని రామేశ్వరం లోని వివరాలను తెలిపే యాత్రలాగ లేదు ఉంటే అక్కడి విశేషాలు తప్పకుండా వివరింపబడేవి.

నాల్గవ యాత్ర నీంగిరికి చేసినది కాబట్టి అది ఆ యాత్రా ప్రకరణంలో చర్చింపబడింది.

## IV) ఘటికాచల, తిరుత్తణి క్షేత్రయాత్ర :

రమణయ్యగారు దక్షిణాదికి చేసిన ఐదవ యాత్ర ఇది. సాధారణంగా ఉపాధ్యాయులు విద్యార్థులచే విజ్ఞాన విహారయాత్రలు చేయిస్తుంటారు. కాని వీరు క్షేత్ర యాత్ర చేయించారు. విద్యార్థుల పేరుతో తామీ క్షేత్రాలను చూసి రావచ్చుననే కోరిక దీనికి మూలం కావచ్చుననిపిస్తున్నది.

మొత్తం 25 మందితో కలిసి చేసిన యాత్ర ఇది. మద్రాసు-బెంగుళూరు లైనులో ఆర్కోణం దాటాక 13 కి. మీ. (8 మై.) దూరంలో ఉంది షోలింగరు క్షేత్రం. ఇక్కడ ఘటికాచలం మీద నరసింహ స్వామి ఆలయం ఉంది. పూర్వపు చోళసింహపురమే ఇప్పుడు షోలింగర్ అని పిలువబడుతూందట. కొండ ఎక్కి దిగటానికి కనీసం మూడు గంటలు పట్టిందన్న వివరం తప్ప రచయిత మరేమీ చెప్పలేదు.

రెండో క్షేత్రం ప్రసిద్ధ శైవక్షేత్రం తిరుత్తని. కొండ మీది నుండి తిరుత్తని వూరు మనోహరంగా కనిపించిందట! అప్పుడు యాత్రికుల రద్దీ ఎక్కువగా ఉండడం వల్ల దర్శనానికి కొంత డబ్బు చెల్లించి టిక్కెట్లు కొనవలసి వచ్చిందనీ రమణయ్య గారు వ్రాసిన దాన్ని బట్టి, ప్రత్యేక దర్శనం చేసుకున్నట్లు తెలుస్తున్నది.

## v) మిగతా యాత్రల పరిచయం :

1954 మే నెలలో తంజావూరులో జరిగిన రాష్ట్ర విద్యా మహాసభకు వెళ్ళినప్పటిది ఆరవయాత్ర. యాత్రామార్గం : ఎగ్మూరు-చిదంబరం-మాయ వరం-కుంభకోణం (మధ్యలో స్వామిమల - బహుశా శబరిమలై కావచ్చు) మళ్ళీ కుంభకోణం - తంజావూరు.

ఏడవ యాత్రలో 20 మంది ఉపాధ్యాయులు సరదాగా కాలక్షేపం చేయ డానికి వెళ్ళిన వినోదయాత్ర. ఈ యాత్రలో రాణీపేట, వేలూర్లను రెండు మూడు రోజుల్లో దర్శించి వచ్చారు.

ఎనిమిదవ యాత్ర నాగర్‌కోయిల్‌కు. 16 మంది ఉపాధ్యాయులు కలిసి చేశారు. కారణం తెలియదు ఎగ్మూరు నుండి బయలుదేరి తిరువనంతపురం - దిండిగల్లు - మధుర - క్విలోన్ త్రివేంద్రంల గుండా రైలుపై ప్రయాణించి అక్కడినుండి 72 కి. మీ. (45 మై.) దూరం వ్యానులో ప్రయాణించారు. గంటన్నర ప్రయాణమిది.

త్రివేంద్రంలో భోజనం ఖర్చు ఎంతయిందో వ్రాయలేదు కాని నాగర్ కోయిల్‌లో ఆహార సమస్య కొంత క్లిష్టంగానే ఉన్నట్లు గమనించాడు. భోజనా నికి 12 అణాలు (75 పై.) పుచ్చుకోవడం ఎక్కువే అనిపించిందట.

రమణయ్య గారు మొదటి రెండు యాత్రల్లో ప్రదర్శించిన యాత్రో త్సాహం మిగిలిన వాటిలో చూపలేదనడానికి వారు వ్రాసిన యాత్రా గ్రంథమే సాక్షి. "అప్పటి నా ప్రయాణానుభవాలను, ఆయా చోట్లలోని వ్యక్తుల స్వభావా దులను వివరించాలనే కుతూహలంతో" ఈ యాత్రలకు పూనుకున్నట్లు ఆదిలో ఉబలాటపడ్డారే కాని రచనలో ఆ ఆసక్తి కనిపించనే లేదు.

ఆరు, ఎనిమిదవ యాత్రలు విద్యా సదస్సులకు హాజరు కావాలనే దృష్టితో చేసినవి. కాని ఆ సభల గురించి ఎక్కడా వివరించలేదు.

ఇంక మిగిలిన యాత్రల్లో ఈ మాత్రం అనుభవాలను కూడ గ్రంథస్థం చేయలేకపోయారు.ఐతే ప్రయాణాలు మిగిల్చిన అనుభవంతో రాటుదేలి రచయిత, తర్వాతి ఉత్తర దేశ యాత్రలను బాగానే వర్ణించారు.

# 3. సూరాబత్తుల వారి 'కళ - ప్రకృతి' అనే ఆంధ్రదేశ యాత్ర*

సుబ్రహ్మణ్యం గారి 'కళా - ప్రకృతి' రసవంతమైన యాత్రా రచన. దీనిలో అజంతా - ఎల్లోరా గుహలు కళలకు; అరకులోయ, చింతపల్లి,పుణ్యగిరి, భీమిలీ ఆంధ్రదేశంలోని అందమైన ప్రదేశాలకు, నీలగిరి ప్రకృతిని నిలయంగా వర్ణింపబడ్డాయి. ఈ పుస్తకంలో కళకు, ప్రకృతికి అభేదం కల్పింపబడింది.

రచయిత బహుభాషా విశారదు, కవి కూడ. ఇంగ్లీషు, హిందీ, సంస్కృతం, తెలుగు - భాషల్లో అపారమైన పాండిత్యం కలవారు. ఢిల్లీ నుండి కన్యాకుమారిదాకా భారత దేశమంతా సంచరించినట్లు ఆయన మిత్రుడు శ్రీ నండూరి బంగారయ్య పుస్తకం 'తొలి పలుకు'లో తెలిపాడు కాని 'కళ-ప్రకృతి' తప్ప వేరే యాత్రా రచన కానరావడం లేదు. పై యాత్రా వ్యాసాల్లో ఆంధ్రదేశంలో చేసిన యాత్రల గురించి ప్రస్తావించడం ప్రస్తుతాంశం. మిగతావి వేరే ప్రకరణాల్లో వివరింపబడ్డాయి.

## i) అరకు ప్రయాణం :

అరకులోయ ప్రయాణం కళారాధకులు తప్పకుండా చేయాల్సింది. బస్సు విశాఖపట్టణం నుండి శృంగవరపు కోటద్వారా తూర్పు కనుమలను దాటి సముద్రమట్టానికి నాలుగువేల అడుగుల ఎత్తున ఉన్న అరకులోయకు చేరుతుంది. విశాఖనుండి అరకులోయ మధ్యదూరం 116 కి మీ.[21]

ఎత్తు ఎక్కువైన కొద్దీ బాట వంపులు కూడ ఎక్కువవుతాయి. వెళ్ళిన దారిలోనే బస్సు మళ్ళీ వెనక్కితిరిగి వచ్చినట్లుంటుంది. ఈ అనుభవం తిరుపతి కొండలమీద కలిగేది. "దారి తెలియక ముందుకు వెళ్ళి ఎవరైనా కాదనిచెప్పితే

---

* విద్వాన్ సూరాబత్తుల సుబ్రహ్మణ్యం గారు.

21. విశాఖ ఏజెన్సీకి శృంగవరపు కోట సింహద్వారం. విశాఖనుండి ఈ కోట 52 కి.మీ. (33 మై ) కోటనుండి అరకులోయ 64 కి.మీ. (40 మై.) మొత్తం 116 కి.మీ. (73 మైళ్ళు).

వెనక్కి మళ్ళినట్లు బస్సు పదేప దే పొరపాట్ల సుడిగుండంలో పడుతున్నట్లు" సుబ్రహ్మణ్యంగారికి తోచిందట! ఇంకా ఈ వంకదారులను "నొక్కుల తల వెంట్రుకంలో నొక్కుకునే పిన్నుల్లాగా" కూడ రచయిత భావించారు.[22]

ఏజెన్సీ ప్రాంతంలో అడుగుపెట్టినప్పటి నుండి ఈ 64 కి.మీ. ఒకే పెళ్ళి పందిరిలాగా ఉందంటూ, ఆ దారి పచ్చని వృక్షాలతో సుబ్రహ్మణ్యం గారికి 'సజీవ పట విశాల శాల' లాగా కనిపించిందట.

సుమారు 57-63 మైలు రాళ్ళ మధ్య విశ్వశిల్పి తన చమత్కారాన్నంతా కుమ్మరించినట్లుగా ఉందంటూ పరుగెత్తేది బస్సో, మనస్సో తెలియడం లేద న్నారు. అంతటి పండితుడే ఆ వన దృశ్యాలు అనుభవైక వేద్యమే తాని వర్ణ నకు సాధ్యం కాదన్నారు. ఇక్కడ మూడు సార్లైనా పర్వతం వృత్తాకారంగా తిరిగి వస్తుందట. "ఒక అవిచ్ఛిన్న పర్వత వృత్తపంక్తి, దాని మధ్య గుండ్రని అగాధలోయ - రెండు కొమ్ములు కలుసుకొన్న విదియ చంద్రరేఖ - ఇట్టి గిరి వృత్తములు మూడు"[23] పర్వతం చుట్టూ వడ్డాణం లాగా దారి తొలచబడింది. ఒక మూల బయలుదేరిన బస్సు మండలాకారంగా తిరుగుతూంటే ప్రేక్షకునకు సమగ్ర దృశ్యం కనబడుతుంద"ని వ్రాశారు.

## ii) భీమిలీ యాత్ర :

సుబ్రహ్మణ్యం గారు దీనికి "బీదవాని ఊటీ భీమిలీ" అని పేరు పెట్టారు. నీలగిరి శ్రీమంతులకు, ధనవంతులకు మాత్రమే దర్శనీయ స్థలం, నివాస యోగ్యమైన ప్రదేశంకూడ. డబ్బున్న వాళ్ళ జనాభా ఎక్కువ కాబట్టి పేద వాళ్ళకు నిత్యావసర సరుకులు కొనుక్కోవడానికి శక్తికి మించిన ఖర్చవు తుంది.

భీమిలీ అట్లాంటిది కాదు. ఇక్కడ ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదించి తిరిగి వెళ్ళేవారే కాని స్థిరనివాసాలేర్పరచుకున్న వారుకారు. కాబట్టి పేద వారైనా సరే ప్రకృతి సంపదలో ఊటీకి పోటీ రాదగిన భీమిలీని, ఊటీకి వెళ్ళ లేని వారు హాయిగా దర్శించి రావచ్చు. అందుకే రచయిత పెట్టిన పేరు సార్థ

---

22. కళ - ప్రకృతి (ఆంధ్రదేశపు 'అరకు లోయ') - పేజీ. 49.
23. కళ-ప్రకృతి (ఆంధ్రదేశపు 'అరకులోయ')-పుట 57.

కంగా ఉంది భీమిలీ ఇప్పటికీ యాత్రికులను 'వేసవి కాలపు విడిదిగా' ఆకర్షిస్తూ వుండడమే దాన్ని ఊటీకి సాటిగా పేర్కొనడానికి కారణం!

విశాఖ పట్టణం నుండి భీమిలీ 32 కి.మీ. (20 మైళ్ళు) దూరం. బంగాళా ఖాతానికీ, ఒక పర్వతానికీ మధ్య ఇది నిర్మింపబడింది. కొండమీది నుండి చూస్తే పట్టణ దృశ్యం 'అరచేతిలో గీచిన పటం'లాగ కనపడుతుందన్నారు. ఐతే ఇక్కడ ఎర్రమట్టి దిబ్బలు ఒక ప్రత్యేక ఆకర్షణంటూ వాటిని చూడకుండా వచ్చేస్తే సిక్రీని చూడకుండా ఆగ్రా నుండి మరలి వచ్చినట్లుంటుందట!

ఒక్కో కట్టడాన్ని ఒక్కో దృష్టికోణంతో చూస్తేనే సంపూర్ణ సౌందర్యం అవగాహనకు వస్తుందని చెప్తూ, సముద్రం ఒడ్డు నుండి చూస్తే ఈ ఎర్రమట్టి దిబ్బల సౌందర్యం వెల్లడి కాదన్నారు. "ఈ దిబ్బల పైకెక్కి, కొంత దూరం ప్రయాణించి, తర్వాత క్రిందికి దిగి అక్కడి నుండి సముద్ర తీరం చేసుకుంటే పూర్తి దృశ్యం చూసిన లెక్క. లేకపోతే మామూలు కొండలలాగే కనపడతాయట!"24

## iii) చీమలు దూరని చిట్టడవి 'చింతపల్లి' యాత్ర :

సుబ్రహ్మణ్యంగారు చింతపల్లిని ఆంధ్ర దేశపు 'కాశ్మీర్' అని పేరు పెట్టారు. అరకులోయ పర్వత శోభకు నిలయమైనట్లే, చింతపల్లి అటవీ సంపదకు పుట్టిల్లు. చీమలు దూరని చిట్టడవి అనవచ్చు కూడ. నర్సీపట్నానికి 50 కి. మీ. (31 మైళ్ళు) దూరంలో సముద్ర మట్టానికి మూడు వేల అడుగుల ఎత్తున ఉంది.

ఇక్కడి అడవుల్లో మూడు పాళ్ళు వెదురు వనమే. ఈ వెదురు చింతపల్లి అడవులకు 'వెన్నెముక'ట! ఇక్కడి కొండజాతి వారు స్వేచ్ఛా ప్రియులు. కమలా తోటలు, కొండ పంటల్లో కొన్ని మాత్రమే వీరికి తెలుసు. అవి లేకుంటే ఏ దుంపలో తవ్వుకొని తింటారు. కాని కూలి పని మాత్రం చేయరు. 'చిన్న కంకరబాట వేయాలన్నా నర్సీ పట్నం కూలీలే గతి' అన్నారు రచయిత.

ట్రావెలర్స్ బంగళాను సుబ్రహ్మణ్యంగారు 'శ్రీవాస గృహమ'ంటారు. మంటలంటుకోనంత దగ్గరగా మంచాలీడ్చుకొని పడుకుంటారు ఇక్కడి జనం. తలుపులు తీస్తే పులులేమో కాని భయంకరమైన చలి పట్టుకునే ప్రమాదం ఉంటుంది. మంటను విసనకర్రతో ప్రజ్వలింపజేసినట్లు ఇక్కడి అడవి ఆకులు చలిని మరింత విజృంభించేట్లు చేస్తున్నాయేమో అని రచయిత భావించారు.

---

24. కళ - ప్రకృతి (బీదవాని ఊటీ - భీమిలీ) - పేజీ 68.

## iv) పుణ్యగిరి యాత్ర :

శృంగవరపు కోటకు రెండున్నర కిలోమీటర్ల దూరంలో ఉంది పుణ్యగిరి. మహాశివరాత్రికి ఇక్కడి శివాలయం క్రిక్కిరిసి ఉంటుంది. మిగతా రోజుల్లో నిశ్శబ్దం.

రచయిత ఈ కొండమీది వివిధ 'ద్రుమదళ శోభ'ను తన్మయంతో వర్ణించారు. ఇక్కడి జల జీవధారల్లో గంగమ్మలోయ దగ్గరి ధార ముఖ్యమైంది. అతి కష్టమ్మీద క్రిందికి దిగాలి. అక్కడ గుహవలె ఉన్న లోయలో బండలమధ్య నుండి జాలువారే ధారలో మునగడానికి ముప్పతిప్పలు పడాలి. సన్నని నిచ్చెన ఎక్కి పక్కనున్న బిలంలోని శివలింగాన్ని పూజించి రావడానికి ఒక్కరికే వీలుంటుంది. ఈ స్థలం చేరుకుని స్నానం చేయడం ఈ యాత్రలో కష్టమైనది. ఐనా ఇక్కడికి వచ్చినవాళ్ళంతా ఈ పద్ధతి తెలిసి వచ్చేవారే. విశ్వాసమే కష్టాలను ఓర్చుకునేట్లు చేస్తుందనేది పుణ్యగిరి యాత్రవల్ల స్పష్టమౌతుంది.

విద్వాన్ సూరాబత్తుల సుబ్రహ్మణ్యంగారి శైలి సరళగ్రాంథికం. కాని కొన్నిచోట్ల భావానుకూలంగా, ఔచితీమంతంగా రచన సాగింది.

అవిచ్ఛిన్న పర్వత వృత్త పంక్తుల గురించి వివరిస్తూ దీర్ఘ సమాసభూయిష్ఠంగా రెండు 'అవిచ్ఛిన్న వాక్యాలను' వినిర్మించారు.

"రాధారాణి మనోమోహన రాకా సుధాకర సుందర బృందావన నందబాల నీలాలక కౌటిల్యశోభ కెనవచ్చునుగదా ఈ కుండలీకృత కుధర పథ విభవంబు. పర్వత కుమారీ పవిత్ర సుగాత్ర పరిరంభలాలస తాండవలోల నటరాజ కుండలీకృత బాహుబంధ భంగిమ కెనవచ్చుగదా నీ వృత్తాకార విశ్వంభరా ధర వధ విధానంబు."[25]

అంతటా ఇదే శైలి ఉందనుకోవడం పొరపాటే. పుస్తకమంతా అందరికీ అర్థమయ్యే సులభశైలిలోనే రచన కొనసాగింది.

---

25. 'కళ-ప్రకృతి' (ఆంధ్రదేశపు అరకులోయ) -పేజీ. 58.

ప్రయాణంలో చూచిన వానిని గూర్చి వ్రాయడం, వినోద సభల ఏర్పాటు, దర్శనీయ స్థలాల చరిత్ర సేకరణ - అనేవి సంస్కృతీ సంఘం యొక్క విధులని మొదటే చెప్పుకున్నారు. బహుశా సుబ్రహ్మణ్యం గారు ఈ సంఘంలో క్రియాశీల సభ్యుడై ఉంటారు ఈ గ్రంథ రచనకు ప్రేరణకూడ అదే అయ్యుంటుంది.

## 4. ముమ్మన్నేనివారి "హంపి విహార యాత్ర"*

ముమ్మన్నేని లక్ష్మీనారాయణ గుంటూరు జిల్లాలోని పెద పులివర్రు హైస్కూలులో హిందీ పండితులు. విద్యార్థులకు కేవలం పుస్తక పాండిత్యం వల్ల లోకజ్ఞానం అలవడదని భావించి, హంపీక్షేత్ర దర్శనం చేయించడానికి బయలుదేర దీశారు. ఈ యాత్రా బృందంలో నలుగురు ఉపాధ్యాయులు, 19 మంది బాలురు, ఇద్దరు బాలికలు.

యాత్రానంతరం తమ అనుభవాలను గ్రంథ రూపంగా రచించి రచయిత అక్కడి శాసన సభ్యుడు గింజుపల్లి బాపయ్య గారికి అంకితం చేశారు. ఐతే ఈ పుస్తకంలో ఎక్కడా కనీసం యాత్ర చేసిననెల కాని, సంవత్సరం కాని పేర్కొనలేదు. చివరకు ముద్రణ కాలం కూడ తెలియరాలేదు.

పుస్తకంలో ఒక చోట రచయిత "ఆ రాస్తా యొక్క కొస నుండి బస్సు యాంధ్ర రాష్ట్ర తాత్కాలిక రాజధానియగు కర్నూలునకు బోవు"నని వ్రాసిన దాన్ని బట్టి 1954 వ సంవత్సరంలో ఈ యాత్ర సాధ్యమైనట్లు తెలుస్తున్నది.[26] లక్ష్మీనారాయణ పుస్తకానికి పెట్టిన పేరు "అంతేవాసులతోడ హంపీ విహార యాత్ర." మొత్తం 112 పుటలు. ఈ గ్రంథం సరళ గ్రాంథిక భాషలో వ్రాయబడింది.

---

* ముమ్మన్నేని లక్ష్మీనారాయణగారు.

26. అంతేవాసులతోడ హంపీ విహార యాత్ర - పేజీ. 20.
టంగుటూరి ప్రకాశం పంతులు ముఖ్యమంత్రిగా, కర్నూలు రాజధానిగా ఆంధ్రరాష్ట్రం 1-10-1953 న ఏర్పడింది. ప్రకాశంగారి మంత్రివర్గం 6-11-1954 న పతనమైంది. కాబట్టి 1954 లోనే ఈ యాత్ర జరిగిందనవచ్చు.

ఈ పుస్తకాన్ని పఠన సౌకర్యం కోసం యాత్రాక్రమం తప్పకుండా అధ్యాయాలుగా విభజించారు. వాటికి మజిలీలని పేరు పెట్టారు. మొదటి రెండు మజిలీలకు అవతారిక, యాత్రాసన్నాహం, చివరిది తిరుగు ప్రయాణం, మధ్యలో అరు ప్రకరణాలు ఆయా ఊర్ల పేర్లనుబట్టి ఉంచినవి.

## i) యాత్రా మార్గం - మజిలీలు :

పెద పులివర్రు (రేపల్లె తాలూకా) - భట్టిప్రోలు (మజిలీ) - తెనాలి - గుంటూరు - గర్తపురి మండలం (మజిలీ) - నరసరావు పేట - సంతమాగు లూరు - వినుకొండ - దొనకొండ - మార్కాపురం - కంబం - నల్లమల అడవులు - చలమ స్టేషన్ - గాజుల పల్లె - మహానంది - నంద్యాల - పాణ్యం - బుగ్గనిపల్లె - బేటమంచెర్ల - రంగాపురం - ద్రోణాచలం - హంపీ విజయనగరము (మజిలీ) - గుంటకల్లు - బళ్ళారి మండలం (మజిలీ) - హోస్పేట - మైసూరు మండలం (మజిలీ) - హోస్పేట - బళ్ళారి కంటోన్మెంటు - వీరాపూరు - గుంటకల్లు - అనంతపూరు - ధర్మవరం - హిందూపురం - బెంగుళూరు - శ్రీరంగ పట్టణము - మాండ్యా - మద్దూరు - బెంగుళూరు - బంగారుపేట - చెన్నపట్టణం - గూడూరు - బిట్రగుంట - నెల్లూరు - ఒంగోలు - చీరాల - బాపట్ల - నిడుబ్రోలు - తెనాలి - భట్టిప్రోలు.

హంపీ విజయనగరానికి బస్సులో, మిగతా ప్రదేశాలకు రైలుబండిలో ప్రయాణం చేశారు.

## ii) యాత్రా విశేషాలు :

లక్ష్మీనారాయణగారు భట్టిప్రోలు నుండి గుంటూరుదాకా ఏ విశేషాలు చెప్పకుండానే బండి నడిపించారు. బహుశా స్థిమితపడేసరికి కృత్యాద్యవస్థ అయి ఉంటుంది.

నల్లమల అడవుల్లో కొండగర్భంగుండా మైలుకు మించి రైలు ప్రయాణం సాగిందట! తెలుగువారి పట్టణం బళ్లారిలోని హోస్పేటలో హంపీ విహారయాత్ర చేసి వచ్చిన యువకులు కొందరు ప్లాట్‌ఫారం మీద కనిపించారనీ, వారి భుజాల మీద ఫ్లాస్కులు వ్రేలాడుతున్నాయనీ పేర్కొన్నాడు.[27]

---

27. "యజ్ఞోపవీత స్థానమున ప్రాస్కులు వ్రేలాడు చుండ..." (పేజీ. 30) ఫ్లాస్కులే అచ్చుతప్పుతో ప్రాస్కులై ఉంటాయి.

హాస్పేట నుండి హంపీకి 18 కి.మీ. (8 మై.) దూరం బస్సులో ప్రయాణించారు. ఈమధ్య విశాలమైన మార్గముంది. పూర్వం ఇది రాజవీధి. కన్నడంలో 'పంప'ను 'హంపి' అంటారు. పంపా సరోవర తీరంలో ఉంది కాబట్టి ఈ క్షేత్రానికి పంపా లేదా హంపీ క్షేత్రమనే పేరు వచ్చిందంటారు.

ఇక్కడి విఠల దేవాలయంలోని విశాల మంటపంలో చిన్న స్తంభాలను కొట్టినచో వరుసగా ఆవరోహణక్రమంలో సప్తస్వరాలు పలికిస్తాయట! హంపీ క్షేత్రంలో ఎక్కడ చూసినా మహావేగంగా ప్రవహించే కాల్వలే దర్శనమిచ్చాయి.

హుబ్లీ నుండి బెంగుళూరు దారిలో అనంతపూర్ దగ్గరికి వచ్చేసరికి అప్పుడు ఆంధ్ర అసెంబ్లీకి ఉప ప్రధానిగా ఉన్న నీలం సంజీవరెడ్డిగారు రచయితకు గుర్తుకు వచ్చారు.

రైలు శ్రీరంగపట్టణం ద్వారా మైసూరు చేరుకున్నది. వీటి మధ్యదూరం 16 కి. మీ. (10 మై.). ఇక్కడ ఉప్పుకారం లేని చప్పిడి భోజనం, 'కాలకూట విషం' లాంటి నిమ్మకాయ పచ్చడి లభించింది. ఐతే ఈ భోజనం దక్షిణదేశంలో ఆంధ్రేతరులందరూ ఇష్టపడేదే! గుంతకల్లులో తిన్న భోజనం ఇట్లాంటిది కాదు. అక్కడి నేతి మెతుకులు, అల్లపు పచ్చడి గుర్తుకు తెచ్చుకోగానే రచయితకు నోరూరింది.

మైసూరులో ఇండ్లను అద్దెకిచ్చేవారు కాశీలోని పండాలవలె చుట్టుముట్టారనీ, రెండున్నర కిలోమీటర్ల దూరంలోని సత్రానికి బండికిరాయి అరణాలు (३ర పై.) తగిలిందనీ వ్రాశారు. ఇక్కడి జనం తెలుగువాళ్ళ వేషధారణ చేసుకొని కనిపించారనీ, అక్కడి వారంతా ఎక్కువమంది శైవులేనని రచయిత పేర్కొన్నారు.

మైసూరులో జగన్మోహన ప్యాలెస్ చూడదగింది. వీరి యాత్రాకాలం నాటికి మైసూరు మహారాజా కృష్ణరాజ వడయారు. సంప్రదాయ దుస్తులు ధరిస్తేనే రాజ దర్బారులో ప్రవేశింపనిస్తారు. మొదట రాజదర్బారులో కూర్చోవడానికి ప్రభుత్వ అనుమతి సంపాదించాలి. వినతిపత్రం మంజూరు కాగానే బజారుకు వెళ్ళి, దుస్తులను అద్దెకు తెచ్చుకోవాలి. అద్దె రోజుకు రెండున్నర రూపాయలు.

మద్రాసులోని మూర్ మార్కెట్‌లో పాత వస్తువులమ్ముతారనీ, వందరూపాయల వస్తువు ఒక్కోసారి రెండు రూపాయలకు దొరుకుతుందనీ, రెండు రూపాయల సరుకు రెండువందల దాకా పలుకుతుందనీ రచయిత వ్రాశారు.[28]

మొత్తం పుస్తకమంతా సరళ గ్రాంథికంలో వ్రాయబడినా అక్కడక్కడ ఔచిత్యం లేకున్నా లక్ష్మీనారాయణ గారు తమ పాండిత్య ప్రకర్షను ప్రదర్శించడం జరిగింది.

"శాల్యోదనమును ఘృత సూప లేహ్య సమేతముగ వడ్డించి యంతమున మాహిష దధితో బుభుక్షను దీర్చి సంతృప్తుల గావించి మఱల ధూమశకట నిలయమునకు చేర్చితిమి."[29]

ఈ గ్రంథంలో అక్కడక్కడ సందర్భానుసారంగా సంస్కృత శ్లోకాలు, సామెతలు ఉపయోగింపబడ్డాయి.

దారిలో తటస్థపడిన కొన్ని ప్రసిద్ధ స్థలాల పేర్లు వాటికెలా వచ్చాయో తెలపడానికి ప్రయత్నించారు. ఉదా: సీతాన్వేషణకై బయలుదేరిన శ్రీరాముడు జటాయువు మూలంగా సీతను రావణుడు అపహరించి లంకకు తీసికొనిపోయిన వార్తను విన్న చోటుకు విన్నకొండ లేదా వినుకొండ అన్న పేరు వచ్చిందనీ, అక్కడ ఒక గ్రామం వెలిసిందనీ చెప్పారు.

అట్లాగే బోధన్‌ను బహుధాన్య నగరమనీ, ముదిరాచ లేదా ముతరాచ అనే తెనుగు జాతి వారు నివసించడం వల్ల చెన్నపట్టణానికి మదరాసు అనే పేరు వచ్చిందనీ ఆయన తెల్పారు.

---

28. ఇటీవల మూర్ మార్కెట్‌ను నేలమట్టం చేసి దాని స్థానంలో రైల్వే వారు నూతన భవన సముదాయం నిర్మించారు.

29. అంతేవాసులతోడ హంపీ విహారయాత్ర - పేజీ 7.

## 5. మాలతీ చందూర్‌గారి "నవభారతి"

పాతలోంచి కొత్తలోకి అడుగిడుతున్న భారతదేశపు పునర్నిర్మాణ కార్యకలాపాలను కొన్నింటిని ప్రత్యక్షంగా చూసిన పిమ్మట మాలతీ చందూర్‌గారు వ్రాసిన వ్యాస సంపుటి ఇది. 75 పుటల గ్రంథం.

ఫిబ్రవరి 1976 లో ఈ యాత్ర జరిగింది. ఐతే గ్రంథ రూపం ధరించింది మాత్రం 1978 లో.

ఇది విజ్ఞాన యాత్ర. కేంద్ర ప్రభుత్వ సమాచార శాఖ ఫీల్డ్ పబ్లిసిటీ విభాగం రచయితల కోసం ఈ యాత్రను ఏర్పాటు చేసింది. పబ్లిక్ సెక్టర్ ప్రాజెక్టులూ, ప్రాచీన కళావైభవమూ - అంటే దేశంలోని పురాతన సంస్కృతి, అధునాతన ప్రగతి - చూపుతామంటూ కొంత మంది రచయితలకు ఆహ్వానం పంపుతూ దాని వెంట టూర్ ప్రోగ్రామ్ కూడ జతపరిచారు.

తెలుగు, తమిళం, కన్నడం, మళయాళం, హిందీ, ఉర్దూ, బెంగాలీ భాషలనుండి ముగ్గురేసి రచయితలకు ఆహ్వానాలు పంపగా మొత్తమ్మీద 21 మంది రావడానికి బదులు 17 మంది మాత్రమే తమ సమ్మతిని తెలిపారట!

టూరిజం వారి లగ్జరీ కోచ్‌లో 42 మందికి స్థలముంది. కాని ఈ యాత్రలో 17 మంది పాల్గొన్నారు. ఇందులో ఐదుగురు స్త్రీలు. మొత్తం 10, 15 రోజుల పాటు తమిళనాడు, కర్ణాటక రాష్ట్రాలలో పర్యటన.

ఈ యాత్ర పన్నెండు రోజులు పట్టింది. అంటే మద్రాసు నుండి కన్యాకుమారి దాకా వెళ్ళి తిరిగి మద్రాసుకు రావడానికి పట్టిన సమయమన్నమాట.

తెలుగు భాషకు ప్రాతినిధ్యం వహించిన రచయితలు : కొమ్మూరి వేణుగోపాలరావు, దండమూడి మహీధర్, మాలతీ చందూర్ గార్లు.

ఇలా ఏడు భాషల్లోనూ పేరు తెచ్చుకున్న నవలా రచయితలు, కథకులు, కవయిత్రులు, పత్రికా రచయితలు కలిసి చేసిన ఈ యాత్ర భాషా సమైక్యానికి ఎంతో ఉపయోగపడుతుంది

## i) ఈ టూర్ (యాత్ర) ఉద్దేశ్యం :

నవీన దేవాలయాలుగా పిలువబడే కర్మాగారాలు, పరమాణు శక్తి కేంద్రాలు, ఆనకట్టలు, నౌకాశ్రయాలు - వీటిలో ఏం జరుగుతున్నది? మనదేశం ఆర్థికంగా ఎలా ముందుకు వెళ్తోంది? ప్రతి పల్లెకూ విద్యుచ్ఛక్తి, ప్రతి పొలానికి పంపునీరు, వ్యక్తికి కనీసావసరాలు సమకూర్చగల ఈ లక్ష్యానికి పబ్లిక్ సెక్టర్ ఏం చేస్తున్నది? ఇవన్నీ రచయితలు తెలుసుకొని, తెలుసుకున్నది పాఠకులకు తెలియబరచాలి. ప్రభుత్వం తరపున యాత్ర కాబట్టి ప్రచారం చేసి పొగడాలి.

"మీరు చూసినది ప్రజలకి చెప్పండి: ఇప్పుడు కాకపోతే... మీకు తోచిన విధంగా చెప్పండి" అని యాత్రకు ముందు చెప్పారట, టూర్‌ని ఏర్పాటు చేసినవాళ్ళు.

వివిధ ప్రాంతాలకూ, భాషలకూ చెంది, ఆహార విహారాల్లో వైవిధ్యం గలవారిని ఒకే త్రాటిపై నడిపించడం సామాన్య విషయం కాదు.

ఈ గ్రంథంలో :
అణువిద్యుత్ (కల్పాక్కం ఆటమిక్ పవర్ ప్రాజెక్టు)
మధుర, కన్యాకుమారి
స్పిక్
తంజావూరు - మద్రాసు
శీర్షికలతో పర్యటన వివరాలున్నాయి.

మొదట మహాబలిపురం దర్శించారు. ఈ నగరం 1300 సంవత్సరముల క్రితం నాటి రాజధానీ నగరం. ఇది చాలా మట్టుకు సముద్రంలో మునిగిపోయిందట. ఈ 'జలగర్భ శిలానగరానికి' గుద్దుకొని నౌకలు మునిగిపోయే ప్రమాదముందని భావించి ఇక్కడొక లైటు హౌస్ నిర్మించారని ప్రతీతి.

## ii) అణువిద్యుత్ :

కల్పాక్కం మద్రాసుకు 60 మై. (97 కి.మీ.) దూరంలో ఉంది. 1966 ప్రాంతంలో ఇదొక పల్లెటూరు. తర్వాత పదేళ్ళకే న్యూక్లియర్ పవర్ స్టేషన్ నిర్మాణం ఇక్కడ చేపట్టబడటం వల్ల బాగా అభివృద్ధి చెందింది. ఈ విద్యు

త్కేంద్రం భారతదేశంలోనే మూడవదిగా భావించబడుచున్నది. వాటిలో మొద టిది తారాపూర్, రెండోది రాజస్థాన్‌లోని కోట.

విద్యుదుత్పత్తి మూడు రకాలు. హైడ్రో, థర్మల్, న్యూక్లియర్. అక్కడి కాంటీన్‌లో రోజుకి సుమారు మూడువేల మందిదాకా భోజనాలు చేస్తారట! భోజనం ఖరీదు ఒక రూపాయి. భోజనం బాగానే ఉన్నట్లు మాలతీ చందూర్‌గారు వ్రాశారు.

## iii) మధుర, కన్యాకుమారి :

మధుర అతి ప్రాచీన నగరం. సప్తపురాలలో ఇది ఒకటి. క్రీ.పూ. 305 న భారతదేశాన్ని సందర్శించిన మెగస్తనీసు ఈ నగరాన్ని గూర్చి పేర్కొన్నాడు.

అసలు పేరు మధురై. పాండ్యరాజు కులశేఖరుడు దీనికి నామకరణం చేశాడని ప్రతీతి. "శివ జటాజూటం నుంచి మధురామృత బిందువులు ఈ ప్రాంతాన కురువటం చేత" ఈ ప్రదేశానికి 'మధురై'— అనగా మధుర మైనది— అని స్ఫురించిందట రాజుగారికి.

ఇక్కడి మీనాక్షి దేవాలయం 500 ఏండ్ల క్రితం నిర్మింపబడినట్లుగా రచయిత్రి వ్రాశారు.

మధుర యూనివర్సిటీ ఆవరణలో కనుచూపు మేరా ఒక పచ్చని చెట్టు కూడ కనిపించలేదట! యూనివర్సిటీవాళ్ళు సంవత్సరాని కొక రచయితను ఆహ్వానించి, ఆయన రచనలపై రోజంతా ఆయన ఎదురుగానే సెమినార్స్, చర్చలు జరుపుతారు. ఆ సందర్భంలో రచయితను వారు చీల్చి చెండాడనూ వచ్చు, పొగడ్తలతో ముంచెత్తనూ వచ్చు. విద్యార్థుల సాహితీ పిపాసను, విమర్శనా దృష్టిని ఈ సెమినార్లు పెంపొందిస్తాయనవచ్చు.

ప్రాతూరి వారిలాగే మీనాక్షి దేవాలయంలో సప్తస్వరాలు పలికే స్తంభాలను చూశారు మాలతీ చందూర్ గారు.

మధుర నుండి కన్యాకుమారికి ఏడెనిమిది గంటల ప్రయాణం. దక్షిణాదిన రోడ్లన్నీ సిటీ రోడ్లలాగా నున్నగా ఉంటాయట. మధుర నుండి తిరునల్వేలి దాకా ఎక్కడా పచ్చటి నేలగాని, పొలాలు గాని కనిపించలేదు. అంతటా రాతి నేలా, బీడు భూములూను. తిరునల్వేలిలో కమ్మని నేతితో హల్వా తయారు చేస్తారు. అది బందరు హల్వాలాగా ప్రసిద్ధి చెందింది.

కన్యాకుమారి ఇందుకు భిన్నంగా ఉంది. ఇది ఒకప్పుడు కేరళ రాష్ట్రం లోనిది. భౌగోళికంగా దీనికి కేరళకూ చాలా పోలికలున్నాయి. నాగర్‌కోయిల్‌కి కన్యాకుమారి 15 కి.మీ. దూరం. ఇక్కడి తమిళం వింటూంటే మళయాళం లాగా ధ్వనిస్తుందట.

సాయంత్రం వేళ కన్యాకుమారి దగ్గరి దృశ్యం చూస్తూంటే ఎంతటి వాగుడుకాయలూ అవాక్కయి పోతారని రచయిత్రి అనుభవం.

కన్యాకుమారి ఆలయంలో అమ్మవారి సన్నిధికి పురుషులు పైచొక్కా విడిచి రావాలనే నిబంధన ఉన్నట్లుగా మాలతిగారు వ్రాశారు. పద్మనాభ స్వామి వారి ఆలయంలో ఈ నియమమున్నట్లుగా బులుసు వేంకట రమణయ్యగారు తమ దక్షిణదేశ యాత్రలలో తెలిపారు. అమ్మవారికి కొబ్బరికాయ కొట్టరనీ, కుంకుమ విభూదితో పూజ చేస్తారనీ, అదే ఇక్కడి ప్రసాదమనీ వారన్నారు.

## iv) SPIC[30] (స్పిక్) :

ట్యుటికోరిన్ పట్టణానికి 10 కి.మీ. దూరంలో ఉంది. ట్యుటికోరిన్ రామేశ్వరానికి కన్యాకుమారికీ దాదాపు మధ్యలో ఉంది. ఈ పట్టణం యాత్రాకాలం నాటికి పెద్ద రేవు పట్టణంగా రూపుదిద్దుకుంటున్నదట![31] వెనకబడిన జిల్లా ఐన తిరునల్వేలిని అభివృద్ధి పరచడానికి 'స్పిక్' అనే ఈ రసాయనిక ఎరువుల ప్లాంట్‌ని ప్రభుత్వం ఇక్కడ నిర్మించింది.

ఈ కర్మాగారంలో పొగ వదలడానికి ఉద్దేశించిన గొట్టం చాలా ఎత్తుంది, కలుషిత వాయువులు వాతావరణాన్ని చెడగొట్టకుండా. ఐతే ఈ పొగగొట్టం కుతుబ్‌మీనార్ కంటే రెండడుగులు చిన్నదట[32] అంటే 236 అడుగులన్నమాట!

---

30. Southetn Petro Chemical and Industries Corporation.
31. ఈ రేవు గురించి క్రీ.శ. 88లో గ్రీకులు ప్రస్తావించారు. గ్రీకు తత్వవేత్త టాలెమీ క్రీ.శ. 128లో ఈ రేవు ప్రాముఖ్యం గురించి ఇక్కడి ముత్యాల ప్రాశస్త్యాన్ని గురించి ఉదహరించారు. ఇదే పేజీ. 51.
32. కుతుబ్‌మీనార్ ఎత్తు 238 అని 'నా ఉత్తర దేశ యాత్రలు'లో బులుసు వేంకట రమణయ్యగారు. పేజీ. 53.

## v) తంజావూరు - మద్రాసు :

ఇక్కడ బృహదీశ్వరాలయం దర్శించారు శిఖరం ఎత్తు సుమారు 60 మీటర్లు. గోపుర శిఖరం ఏక శిలమీద చెక్కారనీ, ఆ శిల బరువు 80 టన్నులుంటుందనీ వ్రాశారు. ఈ గోపుర శిఖరాన్ని 'సారపల్లం' అనే చోటినుండి అంటే 6½ కి.మీ. దూరంనుండి - ఏటవాలుగా ఎక్కించుకుంటూ దేవాలయం శిఖరం పైకి చేర్చారట. ఇది పూర్వకాలంలో ఈజిప్షియనులు పిరమిడ్స్ నిర్మించిన పద్ధతి.

ఈ టూర్‌లో రచయితలకు ప్రజల మధ్య తిరిగే అవకాశం దొరకలేదు. అందువల్ల వారి సమస్యలను స్థితిగతులను అనుభవించి వ్రాసే సమయం చిక్కలేదు. ఈ యాత్ర నిర్దిష్టమైన ప్రదేశాలకే పరిమితం కావడంవల్ల 'టౌన్‌షిప్'కి వెళ్ళలేకపోయారు. వ్యక్తుల కనీసావసరాలకు పబ్లిక్ సెక్టర్ ఏం చేస్తుందో తెలుసుకోవాలన్న లక్ష్యంతో ఈ యాత్ర ప్రారంభమైంది. కాని పబ్లిక్ సెక్టర్‌లో మామూలు మనిషి ఎలా బతుకుతున్నాడో తెలుసుకోకుండానే టూర్ ముగిసినందుకు రచయిత్రి నిజాయితీగా విచారం వ్యక్తం చేశారు.

మద్రాస్ చేరుకున్న తర్వాతి రోజు 'కామన్ మాన్' గురించిన చర్చ జరిగింది. "మా టూర్‌లో ఎక్కడా కనిపించని కామన్ మాన్" గురించి అందరూ తమ తమ అభిప్రాయాలు వెలువరించడం మాలతీచందూర్ గారికి వ్యక్తిగతంగా, రచయిత్రిగా బాధనిపించింది, లోకరీతికి ఆశ్చర్యం కలిగించింది.

## 6. మల్లంపల్లి వారి "నెల్లూరు మండల యాత్ర*"

ప్రముఖ చరిత్ర పరిశోధకుడు, ప్రాచీనాంధ్ర భాషా శాసన శోధకుడు మల్లంపల్లి సోమశేఖర శర్మగారు శాసనాలకు ప్రతిబింబాలు సేకరించడం కోసం చేసిన యాత్ర ఇది. కాశీనాథుని నాగేశ్వరరావు గారి తోడ్పాటుతో, ప్రోత్సాహంతో ఈయన నెల్లూరి మండల పర్యటనకు బయలుదేరారు. ఆ పర్యటన విశేషాలను వరుసగా భారతి మాసపత్రికలో వ్యాసాల రూపంగా ప్రకటించారు. ఇది 1928లో కాలినడకన చేసిన యాత్ర. అక్కడక్కడ మోటారు బండిమీద, రైలుబండి మీద కూడ యాత్ర చేశారు.

---

* మల్లంపల్లి సోమశేఖర శర్మగారు.

నెల్లూరు జిల్లాలోని చాలా గ్రామాలలో ప్రాచీన విగ్రహాలు, శిలాఫలకాలూ ఉండేవి. వీటికి చాలచోట్ల ప్రజలు పూజా పునస్కారాలు చేస్తూ వచ్చారు. మరి కొన్ని చోట్ల ఆ శిలలను తవ్వడానికి, చివరకు దానిమీది అక్షరాలను కూడ చదవ డానికి అనుమతించకపోగా, దాన్ని తవ్విన ఫలానావాడు రక్తం కక్కుకుని చచ్చాడనీ, ఆ శిలాఫలకం కింద గుప్త నిధి ఉందనీ రచయితను భయపెట్టించారు కూడ. శర్మగారు అన్నిచోట్లా స్థానిక ప్రజలకు నమ్మకం కలిగేట్లుగా మాట్లాడి, శిలాశాసనాలను పెకలించడమే కాకుండా అక్కడి ప్రజల మూఢ నమ్మకాలను కూడ సడలించగలిగారని చెప్పవచ్చు.

వెంకన్నపాలెంలో శాసనశిలకూ, మహాలక్ష్మమ్మ ఉత్సవ విగ్రహానికీ పూజలు జరుపుతూండే ఆ శాసనశిలను తాను చదువుతానన్నారు రచయిత. దానికి వారు శిలను మంత్ర పూతంగా కడిగిన తర్వాత అనుమతించారు. ప్రతి బింబాలు కూడ తీసుకుంటానని చెప్పగా, అక్కడి సాధువర్తనుడైన అర్చకుడు 'ఈ యమ్మవారి మహత్తు వల్లనే ఈ గడ్డకు విషూచీ, మశూచీ యేవిన్నీ రావడము లేదనిన్నీ, ఆ శిలమీదవి బీజాక్షరాలని నమ్ముతున్నామనిన్నీ' తప్పని సరైతే మడికట్టుకొని ప్రతిబింబాలు తీసుకోవచ్చునన్నాడు. వారి మనస్సు నొప్పించడం ఇష్టంలేక వారు కోరిన ప్రకారమే స్నానం చేసి మడిబట్టలు కట్టుకొని ఆ శాస నాలకు ప్రతిబింబాలు తీశారు. అది పదమూడో శతాబ్దం నాటి శాసనం.

నెల్లూరు మండలంలో చెరువులు చాలా ఎక్కువ. చిన్నవీ, పెద్దవీ కలిపి మొత్తము మీద ఈ మండలంలో 784 చెరువులుండేవని శర్మగారు వ్రాశారు. వీటిలో చాలా భాగం విజయనగర రాజులు కట్టించినవే. విజయనగర రాజుల కాలంనాటి శాసనాలు తిరగవేస్తే వాటిలో 'చెరువు ధర్మ శాసనాలే' ఎక్కువగా కనబడతాయట! తటాక నిర్మాణం సప్తసంతానాలలో ఒకటి. పుణ్యం కలగడానికి పూర్వులు ధర్మచింతతో చెరువులు కట్టించేవారు. ఖిలపడిన చెరువులను బాగుపరిచేవారు.

ఆ కాలంలో ఇంకా దూరమానాన్ని 'పరుగుల'లోనే లెక్కగట్టేవారని తెలుస్తున్నది. "అయ్యవారి పల్లికి భైరవునికోన బరువుగా రెండు పరుగులుందనీ,

తేలికగా మూడు పరుగులుండనీ" అక్కడి వారన్నారట![33] ఆ ప్రాంత మంతా పరుగుల లెక్కే వాడుకలో ఉంది. కాని వీరికి రెండున్నర మైళ్ళు కాక పదమూడు, పద్నాలుగు మైళ్ళుగా ఉన్నట్టు తోచిందట. ఇంత దూరం ఉన్నా అక్కడి వాళ్ళకు తక్కువ అనిపించడానికి కారణం వారు ఎక్కువగా తిరగడం వల్ల లేదా పరిచయమైన ప్రదేశాలు కావడం వల్లనో కావచ్చునని రచయిత అభిప్రాయపడ్డారు.

ఉదయగిరి తాలూకాలో అవిద్యతో పాటు, జనసంఖ్య కూడ చాల తక్కువ అంటూ ఇక్కడ చదరపు మైలుకు 100 - 150 మంది ఉంటే ఎక్కువేనన్నారు. ఐతే గోదావరి డెల్టా తాలూకాలలో మాత్రం చదరపు మైలుకు 650 - 1000 దాకా ఉంటారన్నాడు. వర్షాధారం మీద ఆధారపడి ఉండే దేశం కాబట్టి ఈ వ్యత్యాస ముందని రచయిత సమాధానపడ్డారు.

పొన్నలూరి నుండి పాలేటి ఒడ్డున ఉన్న పచ్చవ గ్రామం వెళ్ళారు. ఇక్కడ రమారమి మూడు వందల పత్తి రాట్నాలు ఉన్నాయని తెలుసుకున్నారు. తర్వాత పేరాపురం, జాళ్ళ పాళెముల మీదుగా పెట్లూరు చేరుకున్నారు. ఇదంతా రేగుకంప రాజ్యము. ప్రతీ గ్రామానికి ఈ ప్రాంతాల చుట్టూ చింతతోపులో మామిడి తోపులో ఉంటాయి. గ్రామం దాటితే మళ్ళీ గ్రామం వెళ్ళేవరకు దారిలో చెట్టుకాదు కదా చివరకు పురుగు కూడ కనపడదన్నారు. సరియైన బాటలు లేవనీ, బండిత్రోవలున్నవి ఏ కొద్ది ఊళ్ళకో మాత్రమేనని శర్మగారు పేర్కొన్నారు.

శ్రీనాథుడు వ్రాసినట్లు రాగి సంకటి, కొఱ్ఱ సంకటి, సజ్జ సంకటి, అరికెలు, వరిగెలు తప్ప అక్కడ ఇంకేమీ లేవట. ఉద్యోగస్తుల కోసం కొందరు కొంచెంగా బియ్యం నిలవచేసుకొని ఉంచుకొంటారనీ, కోమటి దుకాణంలోనే దొరుకుతాయనీ అవి కూడ ఎఱ్ఱ బియ్యమే ననీ వ్రాశారు. వందల సంవత్సరాలు గడిచినా పరిస్థితిలో మార్పు రాలేదన్నమాట.

33. 'పరుగంటే రెండున్నర మైలు' : భారతి, 1928 సెప్టెంబరు.

దేశం చాలా దరిద్ర దేశమని పేర్కొంటూ, 'ఈ దేశ స్వభావాన్నీ, స్థితిని బట్టి అక్కడివాళ్ళు - ఇదంతా రావణాసురుడు చుప్పనాతికి అరణమిచ్చిన రాజ్యం - అని నవ్వుతూ అంటా'రని రచయిత తెల్పారు.[34]

ఒకసారి జగ్గరాజుపాలెం వచ్చేటప్పటికి రాత్రి తొమ్మిది గంటలయిందట! పక్క వూళ్ళలో ఎక్కడో కలరా వ్యాపించి వుంది. వీళ్ళు ఆ వూళ్ళనుండి వచ్చారనుకొని జగ్గరాజుపాలెం 'సంసారులు' వీళ్ళ దగ్గరకు గుంపులుగా వచ్చి 'అయ్యా! బిడ్డా పాపా ఉన్నవాళ్ళం. వూళ్ళోకి రాకండి. వూరవతలనుంచి తోవ వుంది, ఆ తోవ మీదుగా పోండి' అన్నారట![35]

కలరా దేవతను పక్కవూరి వారు తమ వూళ్ళో దిగబెట్టి పోతారన్న భయంతో ఎవరినీ తమ వూళ్ళోకి రానివ్వ కూడదనే ఈ అభ్యర్థన. ఐతే మొదట శర్మగారికి ఇది అర్థంకాకపోయినా తర్వాత తాము ఆ ప్రాంతం నుండి రాలేదని వారికి నమ్మకం పుట్టించేసరికి తలప్రాణం తోకకు వచ్చిందట!

## 7. శ్రీశైల యాత్రలు

శ్రీశైలం గొప్ప శైవ క్షేత్రం. త్రిలింగాల్లో ఒకటి. తెలుగుదేశానికి దక్షిణపు ఎల్లగా ప్రసిద్ధి కెక్కింది. మిగిలిన రెండు ఉత్తరాన కాళేశ్వరం, తూర్పున దాక్షారామం. ఈ మూడు శైవక్షేత్రాల మధ్యభాగమే త్రిలింగ లేదా తెలుగుదేశమని ప్రతీతి.

కర్నూలు జిల్లా నందికొట్కూరు తాలూకాలో నల్లమల కొండలపై వెలసిన క్షేత్రమిది.

"శ్రీ అనగా సంపద (Wealth). శైలమనగా పర్వతము (Mount). కనుక శ్రీ పర్వతము అనగా సంపదగల పర్వతమని (Mount of Wealth)" అర్థం చెప్తున్నారు [36]

---

34. నెల్లూరి మండల యాత్ర— నవంబరు, భారతి - 1928. పేజీ 795.
35. నెల్లూరు మండలంలో చతుర్థకులజులను (శూద్రులను) సంసారులంటారు— సెప్టెంబరు, భారతి— 1928. పేజీ 470.
36. చారిత్రక శ్రీశైలము — కొడాలి లక్ష్మీనారాయణ, పేజి. 2

క్రీ.శ. ఆరవ శతాబ్దంనాటి 'తాల్గుండి శాసనం'లో మొదటిసారిగా శ్రీశైలం పేరు కనిపిస్తున్నదట! దీనిని మైసూరులోని కదంబరాజులు వేయించారు.

విష్ణుకుండిన రాజుల్లో ఒకడైన గోవిందవర్మ (540 - 546) కాలంనాటి 'ఈపూరు శాసనం'లో శ్రీ పర్వత స్వామిని పేర్కొనడంవల్ల ఈ ప్రాంతంలో అప్పటికే ఈశ్వరుడు లింగాకారంగా, స్వయంభువుగా వెలసివున్నాడని భావిస్తారు. తర్వాత ఆరవ శతాబ్దం వాడైన చంద్రగుప్తుని కుమార్తె 'చంద్రవతి' స్వామిని మల్లికా పుష్పాలతో పూజించినందువల్ల 'మల్లికార్జునస్వామి' అని పేరు వచ్చిందని మరో ఐతిహ్యం.

క్రీ.శ. 815 ప్రాంతంలో శ్రీ శంకరాచార్యులు శ్రీశైలాన్ని దర్శించి, భ్రమరాంబా మల్లికార్జునులమీద 'శివానందలహరి', 'భ్రమరాంబాష్టకము'లను రచించారు. శివానంద లహరిలోని రెండు శ్లోకాలలో ఈ క్షేత్ర ప్రశంస ఉంది. మల్లికార్జున శివలింగాన్ని ఆలింగనం చేసుకోవడంవల్ల తనకు కలిగిన ఆనందానుభూతిని ఈ శ్లోకాలలో శ్రీ శంకరులు వ్యక్తం చేశారు.[37]

శ్రీనాథుడు తన ప్రభువైన పెదకోమటి వేమారెడ్డితో 'శ్రీశైలయాత్ర' చేసి, శివరాత్రి మాహాత్మ్యం అనే గ్రంథాన్ని రచించాడు.

1830లో ఏనుగుల వీరాస్వామయ్యగారు కాశీయాత్రకు బయల్దేరి మధ్యలో అనేక ప్రదేశాలు చూస్తూ జూన్ 16 వ తేదీ నాటికి శ్రీశైలం చేరుకున్నారు. శ్రీశైలం గుడిచుట్టూ ఒకప్పుడు గొప్ప పట్టణముండేదనీ, అక్కడ వేశ్యా స్త్రీల యిండ్లే 360 దాకా వుండేవని వీరాస్వామయ్య గారు వ్రాశారు. యాత్రాకాలం నాటికి కందనూరి నవాబుకు గుడి మూలకంగా సంవత్సరానికి పద్దెనిమిదివేల రూపాయల ఆదాయం వస్తున్నా, దాని బాగోగులు పట్టించుకోవడం లేదని తెల్పారు.

---

37. "సంధ్యారంభ విజృంభితం శ్రుతి శిరస్థానాంతరాధిష్ఠితం
సప్రేమ భ్రమరాభిరామమసకృత్ సద్వాసనాశోభితం
భోగీంద్రాభరణం సమస్త సుమనః పూజ్యం గుణావిష్కృతం
సేవే శ్రీగిరి మల్లికార్జున మహాలింగం శివాలింగితమ్."

## i) రవాణాసౌకర్యాలు లేనిరోజుల్లో యాత్రామార్గాలు :

ప్రాచీన కాలంలో చాలామంది యాత్రికులు శ్రీశైల క్షేత్రాన్ని దర్శించడం అపురూపంగా భావించేవారు. చాలామంద తమ జీవితకాలంలో అసాధ్యంగా కూడ తలచేవారు. ప్రయాణ సౌకర్యాలు, రోడ్లులేని ఆ కాలంలో (1930 దాకా ఇదే పరిస్థితి) వృద్ధులైన భక్తులు మాత్రమే ఈ యాత్ర చేయటానికి సాహసించే వారు. నిర్జన దుర్గమారణ్యంలో, దుష్టమృగ సంకీర్ణమైన అడవిలో నడవలేక పలురకాల కష్టాలను ఎదుర్కోవలసి వచ్చేది. అయినా 'జన్మకో శివరాత్రి' అన్న మోక్షాసక్తితో వేల సంఖ్యలో భక్తులు శివరాత్రి సందర్భంగా శ్రీశైల యాత్ర చేసేవారు. సొక్కుచు, సోలుచు, 'చేదుకో చెవిటి మల్లయ్యా' అని బిగ్గరగా అరుస్తూ అలసటతో ఒక్కొక్క మెట్టు ఎక్కేవారు. మార్గమధ్యంలో కలరా లాంటి అంటువ్యాధులు సోకి తోటి యాత్రికలు మరణించినా, మిగిలిన వారు పట్టుదలతో యాత్ర చేయడానికి వెనుకంజవేసేవారు కాదు. దీనికి 'శ్రీశైలస్య సమం క్షేత్రం నభూతో నభవిష్యతి' అన్న విశ్వాసమే ముఖ్య కారణంగా కనిపిస్తుంది.

బస్సు సౌకర్యాలు లేని రోజుల్లో దేశం నలుమూలల నుండి శ్రీశైలం రావడానికి మూడు మార్గాలుండేవని తెలుస్తున్నది.

1. తూర్పున గుంటూరు ప్రాంతం నుండి వచ్చేవారు రైలుబండిలో మార్కాపురం రోడ్డు స్టేషన్లో దిగేవారు. దీన్ని 'మార్కాపురం దారి' అంటారు. స్టేషను నుండి పర్వతబండ్లు అని పిలువబడే రెండెడ్ల బండ్లలో దాదాపు 24 మై (39 కి. మీ.) దూరాన ఉన్న దోరణాలకు వెళ్ళడానికి 12 గం॥ పట్టేది. ఇక్కడి నుండి 13 కి.మీ. దూరంలో ఉన్న చింతల అనే గ్రామానికి పైకప్పులేని ఎడ్ల బండ్లపై ప్రయాణించేవారు. ఈ గ్రామం నుండి శ్రీశైలం వెళ్ళడానికి ఏడు మజిలీ గ్రామాలు తగిలేవి. అవి వరుసగా : చింతల, జంగాల మిద్దె, పెద్ద ఆరుట్ల, శిఖరం, నగరం (శ్రీశైలం), దేవాలయం.

చింతల నుండి ఆలయం దాకా 35 కి. మీ. దూరం బండ్లు కూడ వెళ్ళే వీలు లేదు. ఎవరైనా నడిచి వెళ్ళవలసిందే. ధనవంతులు డోలీల మీద, గుర్రాల మీద వెళ్ళేవారు. మిగతా వారు తప్పనిసరిగా నడవవలసి వచ్చేది.

వినుకొండ నుండి వచ్చే యాత్రికులు కూడ ఎడ్లబండ్లమీద త్రిపురాంతకం, ఎర్రగొండపాలెం, వేంకటాద్రిపాలెం, దద్దనాల నగరు మీదుగా తెలుగు రాయని చెరువు చేరుకునేవారు. అక్కడనుండి కాలినడకన చుక్కల పర్వతం మీదుగా చిన్నారుట్ల, పెద్దారుట్ల చేరి, మాన్కాపురం దారిగుండా ఆలయం చేరుకునేవారు. ఐతే ఈ మార్గం చాల ప్రమాదకరమైంది.

2. ఇక రెండో మార్గం ఉత్తరం నుండి వచ్చేది. హైదరాబాదు, నాగర కర్నూలు, ఆమదాబాదు, తెలకపల్లి, వటర్లవల్లి మీదుగా పాదయాత్ర చేసి కృష్ణా నదిని దాటి శ్రీశైలం చేరుకునేవారు.

3. మూడోదారి దక్షిణ పశ్చిమాల నుండి వచ్చేది. నంద్యాల మార్గమన్న మాట! నంద్యాల, ఆత్మకూరు, నాగలూరు, పెద్దచెరువుదాకా బండ్లపై యాత్ర చేసి, ఇక్కడినుండి భీమునికొలనుద్వారా శ్రీశైలానికి కాలినడకన చేరుకునేవారు.

మార్గమధ్యంలో ఎన్నో అన్న సత్రాలు, గ్రామస్తుల సహాయం లభించేది. ముఖ్యంగా చెంచులు విల్లంబులు చేతబూని యాత్రికుల వెంట నడిచి, వారికి సహాయపడేవారు.

ఈ యాత్రా మార్గాల ప్రస్తావన నాటికి (1930) ఏనుగుల వీరాస్వామయ్య గారు యాత్ర చేసి వంద సంవత్సరాలు గడిచింది. ఐనా ఇరవయవ శతాబ్దం ప్రథమార్ధభాగంలో శ్రీశైల యాత్ర చేసి యాత్రాగ్రంథాలు రచించిన రచయితల అనుభవాలను పరికిస్తే యాత్రా మధ్యకాలంలో సౌకర్యాల్లో ఈ మెరుగు కనబడదు. పైన పేర్కొన్న మార్గాల్లోనే యాత్రికులు ప్రయాణించేవారని తెలుస్తున్నది.

లభిస్తున్న సమాచారాన్ని బట్టి 1930 తర్వాత యాత్ర చేసినవారు ప్రాతూరి వేంకట శివరామశర్మ, ఓరుగంటి వేంకట రమణయ్య, చివుకుల పెదవేంకటా చలపతి గార్లు.

## ii) ప్రొతూరి వారి 'నా యాత్ర'*

శివరామ శర్మగారు 1930 లో ఉత్తర దక్షిణ భారత దేశయాత్రలు పూర్తిచేశారు. ఒక్క శ్రీశైలం మాత్రం దర్శించలేదు. ఈ క్షేత్రానికి యాత్ర చాలా కష్టమైనదనీ, వయస్సులో మాత్రమే చేయవలసినదనీ ఈయన అభిప్రాయం. ఈ యాత్రాకాలంనాటికే రచయితకు వయస్సు పైబడింది. పైగా అనారోగ్యం. ఐనా తప్పనిసరిగా దర్శించవలసిన క్షేత్రం కాబట్టి నాలుగు సంవత్సరాల విశ్రాంతి తర్వాత 1934 లో శర్మగారు శ్రీశైల యాత్రకు పూనుకున్నారు.

శ్రీశైలం వెళ్ళడానికి రచయిత పైనపేర్కొనబడిన మార్కాపురంరోడ్డునే ఎన్నుకున్నారు. 6-2-1934 న బయలుదేరి 18-2-1934 న తిరిగి ఇల్లు చేరుకున్నారు. అంటే శ్రీశైలం వెళ్ళి రావడానికి 13 రోజులు పట్టినట్లు తెలుస్తున్నది.

**a) యాత్రా వివరాలు :**

రచయిత బాపట్ల నివాసి. కాబట్టి బాపట్ల నుండి 6-2-1934 నాడు యాత్రకు బయలుదేరి రైలుబండీ మీద గుంటూరు చేరుకున్నారు. అక్కడినుండి మళ్ళీ రైలుపై మార్కాపురం రోడ్డు స్టేషనుకు ఆరుగంటల ప్రయాణం. అప్పటికి బస్సు మార్గాలు వేయలేదు. కాబట్టి ఎవరైనా ఇక్కడి నుండి ముందుకు వెళ్ళాలంటే నడిచికాని, బండ్లపై కాని పోవలసిందే. ప్రొతూరి వారు చింతలవరకు రెండెండ్ల బండిని బాడుగకు తీసుకొని మార్కాపురం గ్రామానికి వెళ్ళారు.

మునుపల్లె హనుమంతరావు అనే సహయాత్రికుడు భార్యతోసహా యాత్ర చేశాడు. గుంటూరులో ఒక ముసలమ్మ కూడా వెంటపడింది. రచయిత, ఆయన భార్య - మొత్తం ఐదుగురు ఒక జట్టుగా యాత్ర చేశారు. అప్పట్లో

---

* ఈ యాత్రాగ్రంథంలో "దక్షిణాది యాత్ర" ద్వితీయ భాగము. దీనిలో భాగంగానే రచయిత శ్రీశైల యాత్ర చేశారు. రచయిత పూర్తిపేరు ప్రొతూరి వేంకట శివరామ శర్మగారు. వీరి పరిచయం ఇదివరకే చేయబడింది.

యాత్ర చేయడానికి తోడు కోరుకునేవారు. చిన్న గుడిపాడు గ్రామంనుండి పిళ్ళబండ్లు ఒక జట్టుగా బయలుదేరాయి.

వీరి యాత్రామార్గ మిట్లున్నది :

మార్కాపురం - తోకపల్లి (కర్నూలు జిల్లా) - చిన్న గుడిపాడు - దోరణాల - చింతల - జంగాల మిద్దె - పెద్దారిట్ల - చిన్నారిట్ల - శిఖరం - నగరం (తిరుగు ప్రయాణం) భీముని కొలను - పెద్ద చెరువు - దోరడ్లపెంట - పులుసు మామిళ్ళ - చిన మర్సు - పెద మర్సు - నేతవనం - బైనీడు - కృష్ణాపురం - వెలుగోడు - మోతుకూరు - లింగాపురం - శింగారం - వెంగలరెడ్డిపేట - మహానంది - గాజులపల్లి స్టేషను - నరసరావుపేట - బాపట్ల.

తోకపల్లి తర్వాత మజిలీగ్రామం దోరణాల. కాని శర్మగారి బండివాని స్వగ్రామం ఈ రెంటి మధ్యగ్రామం చిన్నగుడిపాడు కాబట్టి వాని కోరికపై ఆ ఊళ్ళో వీరు విడిది చేశారు. అందుకని వీరు దోరణాలలో ఆగకుండా ముందుకు సాగిపోయారు. దోరణాల నుండి చింతలకు 16 కి.మీ. దూరం. ఈ మాత్రం దూరాన్ని చేరుకోవడానికి దాదాపు తొమ్మిది గంటల సమయం పట్టింది. మార్గ మధ్యంలో ఉన్న కొండమీది రోడ్డు ఇరుకు దారి కావడమే దీనికి కారణం. బండ్లకు లాంతర్లు కట్టి ఆ వెలుతురులో రాత్రి ప్రయాణం చేశారు.

చింతల చెంచుల గ్రామం. ఇక్కడ పోలీసు ఇన్‌స్పెక్టర్, జవానులు గుడిసెలు వేసుకొని మకాం చేస్తారు. ఉదయం పూట బండ్లు చింతలకు రావలసినదనీ, సాయంత్రం తిరిగి వెళ్ళవలసినదనీ పోలీసుల ఉత్తర్వు. చింతలలో కులాల వారీ సత్రాలు మూడున్నాయట! ఒక చెట్టు క్రింద బ్రాహ్మణులకు, మరోచోట వైశ్యులకు, ప్రక్కగా శూద్రులకు. దాతలే ఈ విధంగా అన్న సత్రాలు నిర్వహించేవారని శివరామ శర్మ వ్రాశారు.[37]

చింతల నుండి బండ్ల బాటలేదు. ఇక్కడి నుండి స్వామివారి ఆలయం సుమారు 35 కి.మీ. (22 మైళ్ళు) బండ్లు నడువవు. అందుకే పోలీసువారు

---

37. "ఈ మార్గ మధ్యములో కులాలవారీగా కొంతమంది దాతలు అన్నసత్రాలు నిర్వహించడం జరిగేది" - అని ఓరుగంటి వెంకట రమణయ్యగారు కూడ తమ "శ్రీశైలమహాక్షేత్ర యాత్రాదర్శిని"లో పేర్కొన్నారు. పేజీ 6.

బండ్లను ఉదయం పూట ఇక్కడికి రావాలన్నది. ఉదయం బండ్లు విప్పుకొని, తిరుగు ప్రయాణంలో మళ్ళీ, ఇక్కడి నుండే బండ్ల మీద యాత్ర చేయాలన్న మాట!

చింతల నుండి స్వామివారి ఆలయం దాకా డోలీల సౌకర్యం కూడ ఉండేది.[38] కాని శివరామశర్మగారు నడవడానికే నిర్ణయించుకున్నారు. తమ వెంట సామానులు మోయటానికి మనుష్యుల నేర్పాటు చేసుకున్నారు. ఇక్కడి నుండి చెంచుల రాజ్యం. "చింతల నుండి శ్రీశైలము వరకు ఏడు మజిలీలు గలవు. యీ మజిలీలను మెట్టయని పిలుతురు."[39]

ఇదే మార్కాపుర మార్గమనీ, ఇలాగే తూర్పున వినుకొండ మార్గం, పడమరన 'నందియాల' (నంద్యాల) మార్గం ఉన్నాయని రచయిత పేర్కొన్నారు.

ఈ మెట్టలలో ప్రతి యాత్రికునికి అణా చొప్పున చెంచులు వసూలుచేసే వారు.[40] బహుశా వీళ్ళు యాత్రికులను సురక్షితంగా శ్రీశైలానికి చేర్చినందుకు ప్రత్యుపకృతి యేర్పాటు కావచ్చు.[41] యాత్రికుల మూటలను మోస్తూ, పాలు సరఫరా చేస్తూ చెంచులు యాత్రికుల వెంట సహాయంగా వెళ్ళేవారు. ఈ మెట్ట ఊళ్ళ మధ్య దూరాలను శర్మగారు తెలుపలేదు కాని చింతలనుండి జంగం

---

38. ఓరుగంటి వెంకట రమణయ్యగారి 'శ్రీశైలమహాక్షేత్ర యాత్రాదర్శిని' పేజి 4.
"స్థితిగతులుండిన మనుష్యుల నుండి డోలీలకు ముగ్గురు మనుష్యులకు రు. 1-00 నుండి 5-00 వరకు వసూలు చేసేవారు.
39. ప్రాతూరి వారి 'నా యాత్ర' - పేజి 206.
40. జంగాల మిద్దె, పెద్దారిట్ల, చిన్నారిట్ల, శిఖరం, నగరంలలో కూడ రచయిత అణా చొప్పున కప్పం చెల్లించారు.
41. ఓరుగంటి వారు తమ గ్రంథంలో, చెంచులు, "రాత్రిళ్ళు నెగళ్ళు వేసి తప్పెట్లు వాయించుకుంటూ, నృత్యం చేస్తూ, యాత్రికులను ఆనంద పరుస్తూ, దుష్టమృగాలబారినుండి, దొంగల భయంనుండి కాపాడేవాళ్ళు" అని వ్రాశారు. పేజీ 4.

మిద్దెలకు 5 కి.మీ., ఇక్కడినుండి పెద్దారిట్లకు 6½ కి. మీ., తర్వాత చిన్నారిట్లకు 4 కి.మీ. అని తెలుస్తున్నది.[42] ఎక్కడా ఆగకుండా 16 కి.మీ. దూరం నడవడానికి వీరికి పది గంటలు పట్టింది.

తర్వాత మజిలీ శిఖరం. వినుకొండ నుండి వచ్చే మార్గం మార్కాపురంలోగాని, చిన్నారిట్లలోగాని కలుస్తుంది. శిఖరంలో విభూతిగుండమనే పేరుగల కోనేరుంది. దీనికి దగ్గరే శిఖరేశ్వరనునే పేరుగల శివాలయముంది. కోనేటిలో స్నానం చేసి శర్మగారు ఈశ్వరదర్శనం చేసుకున్నారు. దేవాలయం పైకి మెట్లమీదుగా వెళ్ళి శ్రీశైల శిఖరం దర్శించారు. అక్కడ కలశం వంటి పెద్ద గుండ్రని రాయి రోలువంటి గుంటలో ఉంచబడింది. ఈ రాతిని చుట్టూ త్రిప్పుతూ "శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే" అనే మాటలను యాత్రికులు చెప్తారు. ఇక్కడినుండి చూస్తే పాతాళ గంగ, శ్రీశైలం దేవాలయం కనిపిస్తుంది.

ఇక్కడ శ్రీశైలాన్ని నగరమంటారు. నగర సమీపంలోని ఆటకేశ్వర దేవాలయంలో లింగాలు పేరకబడి రోటిలోని పొత్రాల వలె కనిపించినట్లు శర్మ పేర్కొన్నారు.[43] నగరద్వారంలో సాక్షిగణపతి ఆలయం ఉంది. శ్రీశైలానికి వచ్చే యాత్రికుల కీయన సాక్షి అట! అందుకే ఆ పేరు వచ్చింది. నంద్యాల మార్గం ఈ సమీపంలోనే కలుస్తుంది. నంద్యాల మార్గం గుండా వచ్చేవారికి శిఖరేశ్వరాలయం తగలదు.[44] అందుకని వారు నగరం నుండి శిఖరేశ్వర దర్శనం చేసుకొని తిరిగి వస్తారు.

---

42. 'శ్రీశైల మహాక్షేత్ర యాత్రాదర్శిని', పేజీ 6.
43. దీన్నే హాటకేశ్వరమని పేర్కొంటూ, ఇది శ్రీశైలానికి ఆగ్నేయమూలలో ఉన్నట్లు కొండాలి లక్ష్మీనారాయణగారు 'చారిత్రక శ్రీశైలము' పేజీ 84లో వ్రాశారు.
44. ఏనుగుల వీరాస్వామయ్యగారి 'కాశీయాత్ర చరిత్ర' - పేజి 19 లో కూడ ఇట్లాగే ఉంది. "ఆత్మకూరి దారిన వస్తే గుడిలో ప్రవేశించే వరకు శిఖర దర్శనం కానేరదు. నెల్లూరు కంభము మార్గముల వస్తే గుడికి మూడుకోసులు (10 కి. మీ.) దూరములో నున్న శిఖరేశ్వరమనే పేరు గలిగిన యున్నత ప్రదేశమునకు శిఖరము తెలియుచున్నది."

జాంద్రవారు (సాలెవారు) ఏడాదిపొడుగునా మూరెడు వెడల్పుతో వస్త్రాలను దీక్షతో నేసి, తెచ్చి శ్రీశైల ఆలయపు గోపుర శిఖరానికి చుట్టే ఆచార ముందట! ఆ విధంగా వీరు అక్కడున్న కాలంలో శివరాత్రినాడు కొంత మంది జాంద్రవారు ఈ దీక్షా వస్త్రాలను ఒక శిఖరం నుండి మరో శిఖరానికి తోరణాలుగా చుట్టినట్లు వ్రాశారు. "ఈ వస్త్రములను చుట్టునపుడు దిగంబరులుగా నుండి చుట్టెదరని చెప్పెదరు కాని అట్లా జరుగలేదని" శర్మగారు పేర్కొన్నారు.

మహాశివరాత్రి తర్వాతిరోజు రథోత్సవం. ఈ రోజు రచయిత దేవాలయ సమీపంలోని పంచమఠాలను చూశారు. శిథిలములైన ఈ మఠాలలో కొన్నిటిలో శ్రీచక్రం వేసిన రాతిపలకలున్నట్లు వ్రాశాడు. పూర్వం హిందూ చక్రవర్తులు ఈ క్షేత్రాన్ని పరిపాలించినప్పుడు వర్ధిల్లిన మఠాలట ఇవి. అయితే ఇవి ఆ కాలంలో కేవలం సన్యాసులకు ఉనికిపట్లుగానే కాక ఉచిత విద్యా బోధనకు ఉప యోగపడినట్లు తెలుస్తున్నది.[45]

శ్రీశైలపర్వతానికీ, తిరుపతికొండలకూ సామ్యాన్ని వర్ణించారు గ్రంథకర్త. శ్రీశైలం ఎక్కడానికి మూడు రోజులు పడితే, తిరుపతి కొండలకు మూడు గంటలు చాలునట! శ్రీశైల పర్వతపు కొండలు మూడు వరుసలుగా సున్నాలవంటి వలయాకృతులు గల కొండలతో నిండియున్నా యంటూ రచయిత మరింత వివరంగా ఇట్లా చెప్పారు: "శ్రీశైల దేవాలయము పర్వతము నొక పెద్ద రుద్రాక్ష కొలికి పూసగా నెంచుకొని ఆ కొలికి పూసకు ఏడు రుద్రాక్షలు

---

45. పాల్కురికి సోమనాథుడు 'పండితారాధ్య చరిత్ర'లో పంచమఠాలను "బసవమఠము, గణమఠము, అరసిమఠము, కలుమఠము, సారంగ మఠము" అని వ్రాయగా, మరికొందరు "ఘంటామఠము, నందన మఠము, మూలమఠము, సారంగమఠము, తీర్థమఠము" అని పేర్కొన్నారట. "పేర్ల భేదమే కాని స్వామివారి గుడికివి వాయవ్యదిశలో శిథి లావస్థలో బైరాగులకు వాసస్థానములై యున్నవి." అంటూ కొడాలి లక్ష్మీనారాయణగారు ఈ పంచమఠాలను "ఘంటామఠము (ఘంటాకర్ణ మఠము), విభూతిమఠము, రుద్రాక్షమఠము, సారంగమఠము, నందుల మఠము"లుగా తెలియజేశారు. - చారిత్రక శ్రీశైలము - పేజి 86-90.

గల మూడు వరుసలు వ్రేలాడునట్లు భావించినచో, శ్రీశైల పర్వతము యొక్క ఆకారము కొంతవరకు గోచరించును. ఒక రుద్రాక్షల వరుస వినుకొండ మార్గమునను, మధ్య రుద్రాక్షల వరుస దోరణాల వైపుగను, మూడవ రుద్రాక్షల వరుస పెద్ద చెరువు వైపుగను వ్యాపించి ఏకాకృతిగా ఒక పాము పడిగవలె నుండినటుల భావింపవచ్చును."46

శ్రీశైల పర్వతాల వరుస తిరుపతి దాకా వ్యాపించిందనీ, ఒక చివర తిరుపతి క్షేత్రముంటే మరో చివర శ్రీశైల క్షేత్రముందని వ్రాస్తూ, ఈ కొండల వరుసను "రెండు తలలు గల ఒక మహాసర్పము"తో పోల్చవచ్చునన్నారు.

ఈ పర్వతం మీది నీటివసతిని గురించి శివరామశర్మగారు సంక్షిప్తంగా వ్రాశారు. ఆలయం కోట గోడలలో ఐదారు దిగుడు బావులున్నాయి. గిలకల మీద కూడ నీళ్ళు తోడుకోవచ్చు. ఈ బావులచుట్టు ఒక ఆలయం మాదిరిగా రాతి డాబాను కట్టి తాళం వేసి వుంచుతారు. ఒకటి రెండుబావులు లోపల బసచేసే యాత్రికులకు వదలివేసి, మిగతావాటిని అర్చకులకు, మేనేజర్లకు, ఉద్యోగస్థులకు, గుడిలోని సత్రానికి వినియోగిస్తారు. దేవాలయం వెలుపల పడమటి దిక్కున ఒక కోనేరున్నది. ఈ కోనేటి ఒడ్డున ఐదారు సిమెంటు తొట్లు, వీటి అడుగున నీరు తీసుకోవడానికి మరలు నిర్మింపబడ్డాయి. తొట్లలోనికి రబ్బరుగొట్టాల ద్వారా కోనేటి నీటిని పంపు చేస్తారు. ఉత్సవ దినాల్లో యాత్రికులకి నీరు చాలదు. అందుకే శివరాత్రి వెళ్ళిన మరునాడే యాత్రికులను వెళ్ళిపోవలసినదిగా 'టమ టమా' కొట్టారని రచయిత వ్రాశారు.

ఇందుకేనేమో శర్మగారు మరోచోట "యాత్రికులు ఇచట మూడు రోజుల కంటె నుండరు" అన్నారు. కల్నల్ మెకంజీ 1810 లో తయారు చేయించిన కైఫీయతులో 'శ్రీశైలంలో మూడు రాత్రులు వాసము చేసిన చలిజ్వరము వచ్చు చుండెనని' వ్రాసిన విషయం కూడ దీన్ని సమర్థిస్తున్నది. దారిలో అక్కడక్కడ ఉన్న 'మన్యపు నీరు' త్రాగి ఇంటికి రాగానో, రాకముందో ముఖ్యంగా కలరా వ్యాధితో మరణించే వారు ఎక్కువట. రక్షిత మంచినీటి సరఫరా పథకాలప్పుడెక్కడివి? అదికాక అప్పటి యాత్రికులు ఆరుబయటనే బస చేయవలసి

---

46. 'నా యాత్ర' (దక్షిణాది యాత్ర) - పేజీ. 215.

రావడం వల్ల విపరీతమైన చలితో బాధపడేవారు. ఈ కారణాలవల్ల మూడు రోజులకు మించి ఉండే పరిస్థితి లేనేలేదు.

శర్మగారు కూడ ఇక్కడ మూడు రోజులే ఉండి (11-12-1984 నుండి 13-2-1984) నాలుగవనాడు శ్రీశైలాన్ని వదలిపెట్టారు.

b) తిరుగు ప్రయాణం :

మార్కాపురం మార్గం కంటె పెద్దచెరువు మార్గం సులభమైనదనీ, దగ్గరి దారి అనీ చెంచులు చెప్పగా రచయిత ఇదే మార్గంలో తిరుగు ప్రయాణం చేశారు. దీన్నే నంద్యాల మార్గమని కూడ పిలుస్తారు. చెంచుల వాడకంలో కోసులు లేవు. మైళ్ళే. మనమనుకునే కోసే వాళ్ళకు మైలు. అంటే వాళ్ళ ఒక మైలు మన రెండు మైళ్ళకు (కోసుకు) సమానం. ఈ విషయం మొదట తెలియక శర్మగారు పెద్ద చెరువు మార్గం పదిమైళ్ళని నమ్మాడు. తీరా లెక్కలు వేసి చూస్తే అది ఇరవై మైళ్ళని మించింది. ఐనా మార్కాపురం దారి కంటె (మార్కాపురం దారి 30 మైళ్ళకు మించింది) తక్కువేనని భావించి ఈయన తిరుగు ప్రయాణంలో నంద్యాల మార్గాన్నే ఎంచుకున్నారు.

ఈ మార్గంలో కొండదారులు కొన్ని చోట్ల 'స్లోపు'గా, కొన్ని చోట్ల నిచ్చెనవలె ఎక్కుడుగా ఉన్నాయని చెబుతూ, పెద్దచెరువు (నంద్యాల) మార్గంలో 'ఎక్కుడు మార్గాలే' ఎక్కువున్నాయన్నారు. ఐతే ఈ కొండదారులన్నీ పూర్వపు హిందూరాజులు ఏర్పరచినవే కాని ఇటీవలివి కావని వ్రాశారు. పెద్ద చెరువు దగ్గరి అప్పయ్య శాస్త్రిగారి సత్రం యాత్రికుల కోసం వారం రోజులు నడుస్తుందట! వలయాకృతులుగల పర్వతాలు ఇక్కడితో అంతమైనట్లు రచయిత వ్రాశారు పోతరాజు పెంటలో చెంచులు వెదురును కొట్టి, చీల్చి కట్టలు కట్టుకుంటున్న దృశ్యం కనిపించిందనీ, నేతవనంలో చెంచుల గుడిసెలకు వెదురు తడికెలతో గోడలను నిర్మించుకున్నారనీ తెల్పారు. వీరాస్వామయ్యగారికి కూడ పెద్ద చెరువు వద్ద వెదురు తడికెలతో గోడపెట్టిన చావిళ్ళు కనిపించాయట 47

---

47. "అక్కడి వెదురు తడికెలు మట్టిగోడలకంటే ద్విగుణమయిన బలము కలవి" - కాశీయాత్ర చరిత్ర. పేజీ. 16-17.

మహానందిలో లింగము లింగాకృతిలో లేదట! అనేక వంకరలు కలిగి మిట్టపల్లాలతో గోవు ఆకారంలో ఉంది. లింగం మధ్యలో ఈ వంకలగుండా క్రిందికి రంధ్రాలున్నట్లు రచయిత గమనించారు.

గాజులపల్లె స్టేషనుదాకా ఎడ్లబండిపై, తర్వాత రైలులో నరసరావుపేట ద్వారా బాపట్లకు చేరుకున్నారు. మార్గమధ్యంలో నీళ్ళ విరేచనాలతో ఆనారోగ్యం పాలైనాడు కాబట్టి ఇంటికి చేరిన వారం రోజులకు - అంటే ఒళ్ళు నిమ్మళించిన తర్వాత - శ్రీశైల సమారాధన చేశాడు.

## iii) చివుకుల వారి* 'నా శ్రీశైలయాత్ర'

ఇది పద్యకావ్యంలో వెలసిన యాత్రాగ్రంథం కృతికర్త చివుకుల పెద వేంకటాచలపతి-బ్రాహ్మణుడు. చిన గంజాం నివాసి, 1950లో ప్రథమ ముద్రణ పొందిన ఈ యాత్రా కావ్యం మొత్తం పుటలు 53. దీంట్లో 170 పద్యాలున్నాయి.

సర్వజిత్ సంవత్సరం మాఘమాసంలో అనగా 1948 వ సంవత్సరాంతంలో ఈయన శ్రీశైల యాత్ర పూర్తి చేసుకొని వచ్చారు. 1925 లోనే చిన్న గంజాం దగ్గర వెలసిన బాలకోటీశ్వర స్వామి గురించి ఒక పద్యకావ్యం వ్రాసి ప్రకటించారు కాబట్టి ఈయన ఇదివరకే కవిగా లబ్ధప్రతిష్ఠులు. స్వగ్రామానికి వచ్చిన తర్వాత శ్రీశైలయాత్రా వృత్తాంతాన్నికూడ పద్యరూపంలోనే వెలయించాలని భావించి నెల్లూరులో ముద్రింపించారు. వేళ్ళమీద లెక్కించ వలసిన పద్యరూప యాత్రా చరిత్రల్లో ఇదొకటి.

ఈ యాత్ర చేయుటకు ముఖ్య కారణం ధనకాంక్షాదికం కాదనీ 'పుత్రేషణ' నే ప్రధానమనీ రచయిత పేర్కొన్నారు. చివుకుల వారు చిన్నప్పటి నుండి భగవద్భక్తులే. ముగ్గురు కుమార్తెలు, ఒక్కొగానొక్క కుమారుడు మృత్యువాత పడటంవల్ల సంతానం కలిగి కూడ నిస్సంతు అయ్యారు. భార్య 'అన్నపూర్ణాంబను రోగార్త.' ఈ స్థితిలో కూడ పుత్రకాంక్షచే తీర్థయాత్రలు చేశారు, కాళహస్తిలో జ్ఞాన ప్రసూనాంబను, బెజవాడలో కనకదుర్గను సేవించారు. ఐనా మనోరథం

---

* చివుకుల పెద వేంకటా చలపతి గారు.

ఈడేరలేదు. పుత్రప్రాప్తికై మిత్రులనేక వ్రతాలు సూచించారు. చివరకు భ్రమ రాంబాదేవి దర్శనం కోరి శ్రీశైలం వచ్చాడు.

మల్లికార్జునస్వామిని సందర్శించాలనే కోరికకలగడానికి మరో కారణంకూడ చెప్పుకున్నాడు. మిత్రుడు కాకుమాని ఆంజనేయులు ద్వారా స్వామి వారి మహత్తును గురించిన గాథను విన్నారు 1930 ప్రాంతంలో బొమ్మలాపురి[48] జమీందారునికి పుష్పగిరి పీఠాధిపతి శ్రీశైలంలోని గుళ్ళమీద యాజమాన్యం అప్పగించాడు. శాసనంలోని వ్రాతలనుబట్టి లింగాలను పెకలిస్తే అడుగున నవ రత్నాలు లభిస్తాయనీ, ఐతే వీటిని త్రవ్వినవాడు నెత్తురు కక్కి చస్తాడనీ ప్రతీతి. ఐనా భయపడక జమీందారు, ఈశ్వరుని మహత్తు తెలియక అహంక రించి, ఆ ప్రయత్నంలో మృత్యువాత పడ్డాడు. ఈ గాథ నిజంగా జరిగిందని వేంకటాచలపతి నమ్మి, దేవునిపై అచంచల విశ్వాసంతో శ్రీశైల యాత్రకు పూనుకున్నారట!

## a) ప్రయాణ వివరాలు :

చివుకుల పెదవేంకటాచలపతి గారు చిన గంజాంనుండి రైలులో బయలు దేరి గుంటూరుకు చేరుకున్నారు.[49] యాత్రా మార్గమిట్లున్నది:

చినగంజాం - గుంటూరు - మార్కాపురం - మద్దల కట్ట - దోరణాల - చింతల - జంగముల మెట్ట - పెదారిట్ల - చినారిట్ల - శిఖరం - ఆలయం - (తిరుగు ప్రయాణం) భీముని కొలను - తిరుపతిరాయ పాలెం - ఆత్మకూరు - వెలుగోడు - సింగారం - మహానంది - గాజులపల్లె - చిన గంజాం.

రెండెడ్ల బండిని తీసుకొని మద్దల కట్టకు వెళ్ళి మజిలీ చేశారు. ఈ ఊరు మార్కాపురానికి పడమరగా ఉంది. దోరణాలలో రాత్రి విడిది చేసి, చీకటితోనే లేచి తెల్లవారేసరికి చింతలకు చేరుకున్నారు. పోలీసువారి వుత్తర్వు ప్రకారమే

---

48. కర్నూలు జిల్లాలోని దోరణాలకు సమీపంలో ఉన్న చిన్న జమీను
49. 'నా శ్రీశైలయాత్ర' పేజి-12 లో అధోజ్ఞాపికలో గుంట + ఊరు = గుంటూరు అని పేర్కొనబడింది. గుంటూరును రచయిత 'గర్తపురి' అన్నాడు. "గర్తపురి జేరి నా మొంటి గంట రాత్రి." పేజీ-8.

చేరుకోవడంవల్ల చింతలలో పోలీసు వారివల్ల ఏ చిక్కులూ ఎదురు కాలేదు. 'కులము సంగతి గంగలో కలిపి' అక్కడ కాఫీ సేవించి ఏడుగంటలకే కాలి నడకన పర్వతారోహణకు పూనుకున్నారు.

మొదటి 'ద్వారం'లోనే చెంచులు వీళ్ళను నిలిపి తలకొక అణా వంతున సుంకం వసూలు చేశారు[50] మొదటి ద్వారం పేరు చెప్పలేదు కాని ప్రారంభ స్థలం కనుక ఆ మజిలీని 'చింతల'గానే భావించాలి. మధ్యాహ్నానికల్లా 'జంగముల మెట్ట' చేరుకున్నారు.[51]

> "జంగమొకడట నూతి నుత్సాహమొప్ప
> బాటసారుల మేలును భావమందు
> దలచి త్రవ్వించె........."   (31)

అని ఇక్కడి నూతిని 'జంగము' కట్టించినట్లుగా వ్రాశారు. ఇంచుమించుగా రెండేండ్ల తర్వాత యాత్ర చేసిన (అనగా 1936 లో) ఓరుగంటి వెంకట రమణయ్య గారు కూడ ఇదే విషయాన్ని సమర్థించారు.[52]

"గర్భాశయావాస బాధ తీర్చి జనన మరణాది దుఃఖ విశ్రాంతి కలిగించే" శిఖర దర్శనం చేసుకుని, చలపతిగారు 'ప్రాజ్ఞులాడినట్టి పద్యమ్ము పఠియించి, శిఖరపాదం చేరుకున్నారట![53] వేల సంఖ్యలో వచ్చే బ్రాహ్మణులకు 'షడ్రసాన్న' మిచ్చే సత్ర మక్కడ ఉన్నప్పటికీ, వంటచేసికొని భోజనం చేసి

---

50.

51. శివరామశర్మ గారు ఇదే మార్గంలో యాత్రచేసి దీనిని 'జంగాల మిద్దె' అన్నారు. రమణయ్యగారు కూడ 'జంగం మిద్దెలు' అనే అన్నారు.

52. "జంగమ మహేశ్వర భక్తుడు ఒక మిద్దె కట్టించి బావి త్రవ్వించాడు." శ్రీశైల మహాక్షేత్ర యాత్రాదర్శిని - పేజి. 6

53. ఈ పద్యం (శ్లోకం) పూర్తి పాఠమిది :

> కేదారే ఉదకం పీత్వా - వారణస్యాం మృతస్యవా
> శ్రీశైల శిఖరం దృష్ట్వా - పునర్జన్మ న విద్యతే.

కేదార క్షేత్రంలో జలపానం చేసినా, కాశీలో మరణించినా, శ్రీశైల శిఖరాన్ని దర్శించినా పునర్జన్మ లేదని భావం

ముందుకు సాగినట్లు చెప్పుకొన్నారు. ఇదే బహుశా ప్రాతూరి వారు పేర్కొన్న 'కోనేరు దగ్గరి చెట్ల క్రింది సత్రము' కావచ్చు.

ఇక్కడినుండి కొండదిగుడు, ఆరోహణ తప్పింది గదా అని సంతోషంతో నడిచేసరికి తొట్రుపాటుతో మోకాలి కీళ్ళు సడలి, చలపతిగారికి కీళ్ళు కుంటుపడ్డాయట. ఈ బాధతో లోయలోని పంచధార, పాలధార అనే రెండు సెలయేటి ధారలను చూడాలనే కోరికను చంపుకొని, దూరం నుండే వాటికి నమస్కరించి ఆలయం దారి పట్టారు. బహుశా ఈ కారణం వల్లనే కావచ్చు సాక్షి గణపతి ఆలయాన్ని కూడ ఈయన దర్శించినట్టు లేదు. ఐతే ఇక్కడి నుండి ఆలయం దాకా ఉన్న 'రెండు చెంచు మెట్టులకు రెండు అణాలిచ్చి' ప్రొద్దుగ్రుంకే వేళకు ఆలయ ప్రవేశం చేసి ధూళి దర్శనం చేసుకున్నారు.

యాత్రకు ముందు చలపతిగారు మధుమేహవ్యాధితో బాధపడుతుండేవారు. వయస్సు పైబడిన కొద్ది శరీరంలో శక్తి ఉడుగుతుందేమోనన్న అనుమానంతో వెంటనే ప్రయాణానికి సమకట్టారు. యాత్ర సఫలమై భ్రమరాంబా మల్లికార్జునుల దివ్య దర్శనం కలిగినందుకు అమ్మవారిని పద్యాలలో ప్రస్తుతించారు.[54] మహా శివరాత్రినాడు మల్లికార్జున స్వామిని మూడు వృత్తాల్లో ముక్తసరిగా ప్రార్థించారు. "ఎక్కడ చోటు లేనటుల నేటికి మిన్నులు పడ్డ మూల నిట్లిక్కడ కాపురమ్ము వెలయింతువు" అంటూ, ఇదంతా నీ దర్శనానికి వచ్చే భక్తకోటికి చిక్కులుపెట్టి వారి భక్తిని పరీక్షించడానికే కదా? అని ప్రశ్నిస్తారు.

## b) తిరుగు ప్రయాణం :

చలపతిగారు శ్రీశైలానికి వచ్చిన దారిన తిరుగు ప్రయాణం చేయలేదు. అట్లాగని మొదట పేర్కొన్న మూడు మార్గాల్లో ఏ ఒక్కటీ అనుసరించలేదు. భ్రమరాంబ మల్లికార్జునుల వద్ద 'మహానందికి పోనెంచినాడ'నని సెలవు తీసుకొని బయలుదేరారు. కాలినడకన 'భీముని కొలను' దిక్కు తడబడే అడుగులతో,

---

54. మూడు సీస పద్యాలు, శ్రీగిరి భ్రమరాంబికా మకుటంతో నాలుగు మధ్యాక్కరలు, అపర్ణా మకుటంతో 15 కంద పద్యాలు, ఇంకా 14 కంద పద్యాలు మొత్తం 36 పద్యాలు దేవీ ప్రశంసతో ఉన్నాయి.

బడలిన దేహంతో ప్రయాణించారు[55] తిరుపతి రాయపాలెంలో భోజనం 'శ్రీరముగా' దొరికిందట.

ఇక్కడి నుండి ఎడ్లబండిపై ప్రయాణించాలనుకున్నారు. ఆ రాత్రి అక్కడే గడిపి, తెల్లవారి 'గిరి పంక్తులన్ గడిచి' వెళ్ళడానికి సిద్ధపడ్డారు. ఒక వైపు చూస్తే ఆకాశాన్నంటే కొండలు, మరోవైపు అధఃపాతాళాన్ని తాకే లోయ. గుప్పిట్లో ప్రాణాలు పెట్టుకొని ఎట్లో బండి ఎక్కారు. కాని వెంటనే భయపడి బండి దిగి 'పాదచారిత్వానికే' పూనుకున్నారు. వీరాస్వామయ్య గారి కాలం నాటికే ఈ కొండపై మెట్లు ఏర్పాటున్నది.[60] ఆయన బోయీల సాయంతో పల్లకిలో పయనించాడు ఈ ప్రదేశంలో ఎక్కేటప్పుడు, దిగేటప్పుడు 'వాడికె లేని వారికి' చుట్టూ చూస్తే కండ్లు తిరుగుతున్నా యన్నాడు. అందుకే చలపతి గారు-

"నడచునప్పుడు కూడ నా యెడద వడకె
నిట్రపుందారి యగుట............ " (105 - పద్యం)

అని అనవలసి వచ్చింది. ఈ నిట్రపు దారి వీరాస్వామయ్య గారు వ్రాసిన 'మిక్కిలి పొడుగునా ఎక్కవలసిన దారి.' చివరకు 'ఏడుచుట్ల దారి'నీ గడచి, ఆత్మకూరు గుండా వెలుగోడు చేరుకున్నారు. అక్కడ 'శ్యామలాంబ అన్న సత్రం'లో కమ్మని దోసకాయ పప్పుతో అన్నం తిని, సింగారం వెళ్ళారు. కాని ఈ ఊరిలో 'పాఋలు' లేకపోవడం వల్ల భోజనం చేయలేదట![61] చింతలలో కాఫీ త్రాగటానికి లేని కులం పట్టింపు, 'సింగారం'లో భోజనానికి అడ్డు వచ్చిందన్నమాట! అప్పటి ఆహార నియమా లట్లాంటివి. ఆ రాత్రి నిరాహారంగానే

---

55. ప్రాతూరివారు కూడ దీన్ని 'భీముని కొలను' (పేజి 219) అనే పేర్కొన్నారు. కాని వీరాస్వామయ్యగారు 'భీముని కొల్లము' (పేజి 17) అంటారు.

56, 57, 58, 59.

60. "కొండయేడు తిరుగుళ్ళు, రెండువేల మెట్లు పర్యంతము, మిక్కిలి పొడుగునా నెక్కవలసినది."-కాశీయాత్ర చరిత్ర. పేజి. 17.

61. పాఋలు అంటే బ్రాహ్మణులని అర్థం.

గడిపి మర్నాడు మహానంది ప్రవేశించాడు. అక్కడి స్వచ్ఛజలాన్ని తనివిదీరా త్రాగి, మార్గాయాసాన్ని పోగొట్టుకొన్నారు.

మహానందిలో ప్రాతూరి వారు చెప్పని స్థల విశేషాన్ని చలపతిగారు వెల్లడించారు.

"మామిడాకున పండ్లు తోమంగవలయు
శ్రీ మహానంది స్నానంబు చేయవలయు
నెవరికిది కల్గునో వారు శివుని వారె
యముని వారలు గారు యథార్థమిద్ది" (20 వ పద్యం)

ఆ ప్రకారంగానే చేసి 'అపర మార్కండేయులు'గా తనను తాను భావించుకొని గాజులపల్లె స్టేషను చేరుకున్నారు రైలులో దొనకొండ గుండా స్వగ్రామమైన చినగంజాం చేరుకున్నారు. తర్వాత 'భగవదనుగ్రహ సంప్రాప్త వర కవిత్వ శక్తి'తో ఈ శ్రీశైలయాత్రా గ్రంథం వ్రాసి బ్రాహ్మణులకు సంతర్పణ చేశాడు

## iv) ఓరుగంటి వారి 'శ్రీశైల మహాక్షేత్ర యాత్రాదర్శిని'*

మునుపటికన్నా శ్రీశైల యాత్ర సులభసాధ్యమే ఐనప్పటికీ భక్తులు కేవలం భ్రమరాంబా మల్లికార్జునులను మాత్రమే సందర్శించి వెళ్ళిపోతున్నారని భావించి రచయిత బాధ పడ్డారు. శ్రీశైలం మీద ఉన్న ఇతర దర్శనీయ స్థలాలను, విగ్రహాలను, వాటి విశేషాలను లోకానికి వెల్లడి చేయాలనే తలంపు కలిగింది. సమగ్ర క్షేత్ర దర్శనం చేయించాలంటే యాత్రికులకు మొదట సాహిత్యం ద్వారా సమగ్ర విజ్ఞానం అందించాలనుకున్నారు. దేవస్థానానికి కొంత కాలం ట్రస్టీగా పనిచేసిన అనుభవంతో, దాదాపు అర్థ శతాబ్దం పైగా క్షేత్రంతో తనకున్న పరిచయ జ్ఞానంతో 'శ్రీశైల మహాక్షేత్ర దర్శిని, నాడూ - నేడూ' అన్న పేరుతో ఒక యాత్రా గ్రంథాన్ని వ్రాశారు. ఇది ఒకరకంగా యాత్రా దర్శిని లాంటిది. 1978 లో ముద్రింపబడింది. దీనిలో దర్శనీయ స్థలాలు, శ్రీశైలం నాడు - నేడు (1936 నుండి 1976 వరకు) చెంచులు - చెంచుమెట్టలు శ్రీశైల యాత్రా మార్గాలు, రచనా కాలం (1976) నాటి శ్రీశైల యాత్రా

---

* ఓరుగంటి వెంకట రమణయ్య గారు.

వివరాలు పొందుపరచాడు ప్రసంగవశాత్తు తాము 1936 లో తన 14 వ యేట శ్రీశైల యాత్ర చేసిన విషయం కూడ గ్రంథస్థం చేశారు.

రమణయ్య గారు పత్రికా రచయిత. మార్కాపురం నివాసి నిడుదవోలు వారి మాటలలో వీరికి 'ఇక్కడి పరిసరములన్నియు కరతలామలకములు.'

మహాశివరాత్రి ఉత్సవాలకు వచ్చే యాత్రికుల కొరకు మార్కాపురం రోడ్డు స్టేషనుకు ఆ కాలంలో (1936) అన్ని వైపుల నుండి అదనపు రైళ్ళు నడిచేవట! ముఖ్యంగా తూర్పు కోస్తా జిల్లాలనుండి వచ్చే యాత్రికుల భాష, వారి ప్రసంగాలు అర్థం కానప్పటికీ వారి భాష తీరు నవ్వు పుట్టించేదని వ్రాశారు. పైగా శ్రీకాకుళం, విశాఖపట్నం స్త్రీలు కొందరు చుట్టలు కాల్చడం చూస్తే చాల విడ్డూరంగానే తోచేదన్నారు.

## యాత్రామార్గాలు :

ఆరోజుల్లో శ్రీశైలం వెళ్ళడానికి నాలుగు మార్గాలుండేవన్నారు. ఇందులో ముఖ్యంగా రద్దీగా ఉండే మార్గం మార్కాపురం - పెద్ద దోరణాల నుండి శ్రీశైలానికి ఉన్న మార్గమేనట! ఈమార్గంలో తగిలే గ్రామాలు: పెద దోరణాల-చింతల - జంగం మిద్దెలు - పెదారుట్ల - చిన్నారుట్ల - శిఖరేశ్వరం - ఆలయం.

రచయిత 1936 ఫిబ్రవరి నెలలో తన పద్నాలుగవ యేట ఈ 'రస్తా' మీదుగానే శ్రీశైలం సందర్శించానని చెప్పుకున్నారు. బంధువులు, పెద్దలతో కలిసి ఈ యాత్ర చేశారట. కాలినడకతో చుక్కల పర్వతంమీదుగా చిన్నారుట్లకు చేరుకుని అక్కడి నుండి ఆలయం చేరుకున్నారు.

ఇక రెండవది వినుకొండ మార్గం. వినుకొండ మీదుగా వచ్చే యాత్రికులు శ్రీశైల ప్రాగ్ద్వారమైన త్రిపురాంతక క్షేత్రాన్ని సందర్శించి ఎర్రగొండపాలెం-వెంకటాద్రిపాలెం - గుంజవారి పల్లి - దద్దనాలనగరు మీదుగ తెలుగు రాయని చెరువు దాకా ఎడ్లబండిలో వచ్చి అక్కడి నుండి చిన్నారుట్లకు కాలినడకన చేరే వారు. ఈ మార్గం చాల ప్రమాదకరమైనదట!

ఈ రెండు మార్గాలు కాక కొంతమంది ఆత్మకూరు నుండి భైర్లూటి వాగు దాటి పెచ్చెరువు (పెద్ద చెరువు) మీదుగా మెట్ల వెంట వచ్చి క్షేత్ర దర్శనం

చేసుకునేవారు. ఇక తెలంగాణా ప్రాంతం వారు జడ్చర్ల మీదుగా 'సిలిగంగ' (కృష్ణానది) ఆవలి వరకు నడిచి వచ్చి 'అరిగెల'పై కృష్ణను దాటి శ్రీశైలం చేరేవారు.

శ్రీశైల యాత్రికులకు శిఖరం దాటగానే సాక్షి గణపతి విగ్రహం తర్వాత మేకల బండ తగులుతుంది. ఈ బండ కొంత అనాచారాన్ని అరికట్టేదని రచయిత భావించారు. "నెలసరి సమీపంలో నుండి వచ్చిన స్త్రీలు ఈ బండను త్రొక్కే సరికి బహిష్టులయ్యేవారన్న" ప్రతీతిని పేర్కొంటూనే, అందుకే నెలసరి సమీపిస్తున్న వారు ఈ క్షేత్రాన్ని దర్శించేవారు కాదన్నారు.[62]

## v) శిఖరేశ్వర దర్శనం - వివిధాభిప్రాయాలు :

శిఖరేశ్వరం శ్రీశైల మహాక్షేత్రానికి సుమారు 10 కి. మీ. (6 మైళ్ళు) దూరంలో ఉంది. ఇక్కడ ఇష్టకామేశ్వరుని విభూతి గుండమున్నది. దీనిలో స్నాన మాచరించి, శిఖరేశ్వరంలోని ఇష్టకామేశ్వరుని దర్శించిన తర్వాత శిఖర దర్శనం చేయడం సంప్రదాయం.

'కాశిలో చచ్చినంగాని కలుగబోని
ముక్తి దర్శనమాత్రాన పుడమి జనుల'

కిచ్చు శిఖరేశ్వరాన్ని దర్శించిన తర్వాత చిదుకులవారు 'కొబ్బరియు నూవులును రోట రుబ్బి' తర్వాత ఆలయాన్ని దర్శించారు.

శిఖరం మీద ఒక పెద్ద రోలు, రుబ్బుడు పత్రం ఉన్నాయి. యాత్రికులు కొబ్బరి, నువ్వులు రోటిలో వేసి రుబ్బుతారు. అవి చింది తమ శరీరాలమీద పడ్డ తర్వాతనే శిఖర దర్శనం చేసుకోవాలన్నది పరంపరగా వచ్చే జనశ్రుతి అని చలపతిగారు తెల్పారు. ఈ విషయంలో రచయితలు భిన్నాభిప్రాయాలు వ్యక్తం చేశారు.

అక్కడ కలశం వంటి పెద్ద గుండ్రని రాయి రోలు వంటి గుంటలో ఉంచబడిందనీ, దీనిలో కొబ్బరి, నువ్వులు వేసి యీ రాతిని చుట్టూ త్రిప్పాలనీ

62. శ్రీశైల మహాక్షేత్ర యాత్రా దర్శిని (నాడూ-నేడూ)- పేజీ 12.

ప్రాతూరి శివరామ శర్మ వ్రాశారు. ఐతే శర్మగారు ఈ త్రిప్పటంలో 'కొబ్బరి నువ్వులు నలిగి పైకి వస్తాయి' అన్నారే కాని, శరీరాల మీద అవి చిందిన తర్వాతనే శిఖర దర్శనం చేసుకోవాలని వ్రాయలేదు.

ఓరుగంటి వెంకట రమణయ్య గారు నువ్వుల నట్లాగే ఉంచి, కొబ్బరికి బదులుగా బియ్యం, ప్రత్తి గింజలు, బెల్లంకూడ జత చేశారు. ఐతే రుబ్బురోలు మీదనే ఉన్న నంది విగ్రహం కొమ్ముల మధ్యనుండి మల్లికార్జున దేవాలయాన్ని దర్శించుకోవాలన్నారు. 1976లో వ్రాసిన యాత్రాదర్శినిలో అప్పటి వరకు కూడ "యాత్రికులీ సాంప్రదాయమును పాటించుచున్నారు" అన్నారు.[63]

చారిత్రక శిరోమణి కొడాలి లక్ష్మీనారాయణగారు శ్రీశైలంలోని దర్శనీయ స్థలాలకు వివరణ ఇస్తూ, "శిఖరేశ్వరాలయం పైన రుబ్బు గుండు కలదు. దీనిలో బెల్లము, నువ్వులు పోసి రుబ్బుచుందురు" అని వ్రాశారు[64] ఈయన కూడ నువ్వులను పేర్కొంటూ, కొబ్బరికి బదులు బెల్లాన్ని కలిపాడు. వీళ్ళంతా శ్రీశైలాన్ని స్వయంగా దర్శించినవారే. ఐనా అభిప్రాయాల్లో ఏకత్వం కుదరడం లేదు. అసలైన సంప్రదాయమేదో వెతకవలసే ఉంది.

---

63. శ్రీశైల మహాక్షేత్ర యాత్రా దర్శిని - పేజీ. 5.
64. చారిత్రక శ్రీశైలము - పేజీ. 84.

# పశ్చిమ భారతదేశ యాత్రలు

## 1. జొన్నలగడ్డవారి "నా మహారాష్ట్ర యాత్ర"*

శ్రీ సత్యనారాయణమూర్తి గారు విద్వత్ప్రకాండులూ, విమర్శకులూ, మహోపన్యాసకులూ, బహుభాషా వేత్తకూడ. ఈయన చాలాసార్లు భారతదేశ మంతటా పర్యటించి, తమ అనుభవాలన్నింటిని గ్రంథస్థం చెయ్యదలిచారు. వారి యాత్రలో మహారాష్ట్ర యాత్ర ఒకటి. మహారాష్ట్రలోని నాసిక, త్ర్యంబ కాలలో చూసిన విశేషాలు, స్వానుభవాలు, వివిధ మానవుల చిత్తవృత్తులు ఈ గ్రంథంలో వివరించబడ్డాయి. ఈ యాత్రలో రచయిత ఎట్లాంటి కష్టాలను అనుభవించిందీ, ఏ విధంగా ధైర్యసాహసాలను ప్రదర్శించిందీ వ్యక్తమవుతుంది.

ఈ పుస్తకంలోని భాష గ్రాంథికమైనా, వ్యవహారిక పదాలు నిరాఘాటంగా ఉపయోగించబడ్డాయి. ఇట్లాంటి గ్రంథాలు వ్యవహారిక భాషలో వుంటే మరింతగా ప్రచారం పొంది అందరికీ సులభ గ్రాహ్యంగా వుండేవి.

260 పుటలున్న ఈ యాత్రా గ్రంథం శ్రీ భాషోద్ధారక వావిళ్ళ వేంకటే శ్వర శాస్త్రులు గారికి అంకితమివ్వబడింది. వావిళ్ళ ప్రెస్సులో మొదటిసారి 1948 లో, రెండవసారి 1951 లో ముద్రణ పొందింది. యాత్రా వివరాలు మొదట 'భారతి'లో అచ్చయ్యాయి.

సత్యనారాయణ మూర్తి గారు ఆబాల్యం నిత్య పథికుడు. స్వగ్రామం పశ్చిమ గోదావరి జిల్లాలోని పేరవరం, కాని జన్మించింది పెదతల్లిగారి ఊరైన శెట్టిపేటలో, ఈ ఊరు నిడుదవోలుకు మూడు కి.మీ. దూరంలో ఉంది. మూర్తి గారి చిన్నతనంలోనే తల్లీ తండ్రీ ఒకరి తర్వాత ఒకరు మరణించారు. జ్ఞాతులు ఆస్తి చేజిక్కించుకుని తరిమివేశారు. నిరాశ్రయుడై తెగిన గాలిపటం లాగ దేశాలు

---

* జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి గారు.

తిరుగుతూ కలకత్తా చేరుకున్నాడు. అప్పుడతని వయస్సు 14 యేండ్లుండవచ్చునని తెలుస్తున్నది.[1]

ఈ సమయంలోనే ఆంధ్రదేశానికి చెందిన ఇద్దరు బ్రాహ్మణేతరుల ప్రాపకం లభించింది. వీరు: రేకపల్లి వీరాస్వామి, చోడిసెట్టి వీరరాఘవులు. కలకత్తాలో వర్తకులు. వీరి పరిచయ భాగ్యం వల్ల మూర్తిగారు కలకత్తాలో 'విద్యాజీవితమునందించుక భాగమును' గడిపి, తరువాతి చదువుకు ఇతరుల నాశ్రయించారట! ఈ ఇరువురి 'గురుగుణములు' ముఖ్యంగా ఉపవాస జాగరణలు మూర్తిగారికి చిన్నతనంలోనే అబ్బినంచున, తరువాతి దేశాటనాల్లో కష్టసహిష్ణుత అలవాటయింది.

## i) మహారాష్ట్ర యాత్రకు ప్రేరణ :

రచయితకు ఇదే మొదటి యాత్ర కాదు. 1917 లో మొట్ట మొదటిసారి కాశీయాత్ర చేశారు. తల్లిదండ్రుల ఆత్మశాంతికై ఆయా క్షేత్రాలలో శ్రాద్ధ విధులు నిర్వర్తించడానికై చేసిన తీర్థయాత్రలలో భాగంగా కాశీయాత్ర జరిగింది.

కలకత్తాలో ఉండగానే ఉత్తరదేశాన్ని అనేకసార్లు - ఒక్కొసారి ఒంటరిగ, మరొకప్పుడు సతీసమేతంగా - ప్రదక్షిణ చేశారు 1929 లో లాహోరులో జరిగిన కాంగ్రెసు సభకు వెళ్ళి అక్కడినుండే హిమాలయ యాత్రకు బయలుదేరి ఆ సందర్భంగానే శ్రీనగర్, కాశ్మీర్‌లను సందర్శించారు.

ఇది మహారాష్ట్ర యాత్ర చేయడానికి ముందు మూర్తిగారి జీవితంలోని యాత్రా నేపథ్యం.

---

1. "జగదీశుడు చిఱుతనమందె నా యాస్తిని దూరముగ నెట్టివేసినాడు ఎందుండియో నిప్పు నెరుసులు దెచ్చి నా గుండె యందుంచినాడు. గుండె యందీ యగ్ని రగులుచుండుట చేతనే పదునాల్గవ యేటనే యడలెఱుగక, దాని ధూపవేగము ననుసరించి దూరయాత్ర నారంభించితిని". - పేజి116

దాదాపు భారతదేశమంతా ఔరంగజేబుకు వశమైనప్పటికీ మహారాష్ట్ర దేశమొక్కటే ఆయనకు పక్కలో బల్లెమైంది. ఈ ఉద్యమానికి ఊపిరి పోసిన వాడు వీర శివాజీ. శివాజీని కన్నందుకు ఈ పుణ్యభూమి ప్రపంచ చరిత్రకారుల దృష్టి నాకట్టుకుంది. తిలక్, గోఖలే, గోవింద రనడే మొదలైన మహాపురుషుల జన్మభూమి కూడ ఇదే కృష్ణా గోదావరులకు మూలస్థానమై పవిత్రతను సంతరించుకుంది కూడ అందుకే అట్లాంటి పవిత్ర స్థలాన్ని సందర్శించాలని సత్యనారాయణగారు సంకల్పించారు.

## ii) రచనోద్దేశ్యం :

తెలుగులో యాత్రా గ్రంథాలు అంతగా లేకపోవడంవల్ల తన యాత్రానుభూతులను గ్రంథస్థం చేసి తెలుగువారికి అందించాలన్న కోరిక ఆయనకు కలిగింది.

"నా యీ యాత్రను గురించిన కథనము నాంధ్రావని కప్పన మొనరించుట తెలుగున యాత్రకు సంబంధించిన గ్రంథము లెవ్వియు లేవనియే కాక నిక్కంపు విజ్ఞానము లభించుతెన్నుల నెన్నో తోడి జిజ్ఞాసువులకు చూపజాలుదునని నమ్మి యవి వినీత భావమున పాఠక మహాశయుల కెఱిగించు చున్నాను."[2]

## iii) నాసిక్ యాత్ర :

బొంబాయిని కేంద్రంగా చేసుకొని మూర్తిగారు మహారాష్ట్ర యాత్రకు పూనుకున్నారు. ఇక్కడి నుండి 23-12-1935 నాడు నాసికకు వెళ్ళాలని నిర్ణయించుకుని 'బోరి బందరు' స్టేషనులో[3] పంజాబు మెయిల్ టిక్కెట్టు తెచ్చుకున్నారు. వేగంగా వెళ్ళే మన రైళ్ళలో అప్పుడిదే మొదటిది. ఈ విషయంలో గాంధీ గారి సర్టిఫికెట్ కూడ పొందిందిట.

---

2. ఈ గ్రంథ ప్రచురణ కాలంనాటికే మూడు ముద్రణలు పొందిన సుప్రసిద్ధ యాత్రాగ్రంథం 'కాశీయాత్ర చరిత్ర' రచయిత దృష్టికి వచ్చినట్లు లేదు. మదరాసులో బత్తుల కామాక్షమ్మగారి దేశాటనం గురించి, కాశీ మజిలీల గురించి మాత్రమే ప్రస్తావించి, ఇవి తప్ప 'మన భాష యందిట్టి గ్రంథములు లేనే లే'వన్నారు - పేజీ. 8.
3. ఇప్పటి విక్టోరియా టెర్మినస్.

పంజాబు మెయిలులో ప్రయాణిస్తున్నప్పుడు దాని వేగాన్ని స్వయంగా అనుభవించి 'తింటే గారెలు తినాలి, వింటే భారతమే వినాలి' అన్న మనప్రాచీన సామెతకు ఈ రైలుబండి వేగాన్ని కూడ జతచేశారు.[4]

రాత్రి 11-30 గంటలకు పంజాబు మెయిలులో బయలుదేరారు. నాసికకు వెళ్ళి వెంటనే తిరిగి రావాలనుకున్నందున స్నానానికి అవసరమైన బట్టలను, ఒక మరచెంబును మాత్రమే వెంట తీసికొని వెళ్ళాడు యాత్రా ప్రారంభంలో చలిలేదు కాని క్రమంగా పడమటి కొండల నెక్కేకొలది చలిని ఆపుకోవడం వశం కాలేదట; నాసిక చలిని గురించి ముందే ఆలోచించక ఉన్ని దుస్తులను బొంబాయిలోనే విడిచి వచ్చినందుకు పశ్చాత్తాప పడ్డారు.

పర్వత గుహలలో భయంకరంగా గర్జించే సింహంలాగ పంజాబ్ మెయిల్ కొండ సొరంగాల్లో (టన్నెల్స్) భీకర శబ్దం చేస్తూ ముందుకు సాగిందని రచయిత వ్రాశారు.

నాసిక స్టేషను నిడుదవోలు స్టేషన్ లాగే ఉందంటూ, ఇది పట్టణానికి 8 కి మీ. దూరంలోను, నాసికకు త్ర్యంబకం 30 కి.మీ. దూరంలోను ఉన్నాయని వ్రాశారు.

త్ర్యంబకాన్ని మొదట చూసి తర్వాత తిరుగు ప్రయాణంలో నాసిక రావాలనుకున్నారు. నాసిక పట్టణం దాకా బస్సులో వెళ్ళి, అక్కడి నుండి వేరొక బస్సులో త్ర్యంబకానికి వెళ్ళాలి. స్టేషన్ నుండి బస్సు బయలుదేర డానికి ఇంకా రెండుగంటల వ్యవధి ఉందనగా, లక్ష్మణ ఖాందవే అనే పేరుగల పండా తటస్థపడి నాసికలో చక్కగా యాత్ర జరిపిస్తాను రమ్మన్నాడు పండాల దౌష్ట్యాన్ని ఇదివరకే అనేక యాత్రలలో అనుభవించి ఉండడంవల్ల, అతన్ని ఎలాగో వదిలించుకున్నారు. యాత్రికులు పండాల బారిన పడకుండా ఉండా లంటే "తమ పురోహితుని వెంటనిడికొని, హిందీని కొంత వరకైన నేర్చుకొని,

---

4. "భేష్! రైలంటే ఇట్లుండవలెను. తింటే గారెలు తినవలెను, వింటే భార తము వినవలెను, ఎక్కితే పంజాబు మెయిలే ఎక్కవలెను అని అను కొంటిని" — పేజీ 14.

పరిభ్రమణమునకై పయనమైనచో దుర్వ్యయము నుండియు, దుష్టుల బారి నుండియు వీరు విడివడ జాలుదురని" మూర్తిగారు అనుభవపూర్వకంగా సలహా ఇచ్చారు.[5]

స్టేషన్ నుండి బస్సులో నాసికకు బయలుదేరారు. 'తూకముగల వ్యక్తులు' నలుగురు కూర్చుంటేనే ఎక్కడికక్కడ ముక్కలుగా విరిగిపోయేంత ప్రాచీనంగా ఉందట ఆ బస్సు. ఈ రకమైన బస్సులప్పుడు లాహోరు అమృతసర్‌ల మధ్య విరివిగా నడిచేవని తెలుస్తున్నది.

నాసికనుండి మెయిలు బస్సులో త్ర్యంబకం చేరడానికి మూడుగంటలు (8-00 నుండి 11-00) పట్టింది. బస్సులో ఒక 'రథము వంటి మనుజుడట'! అసలు పేరెక్కడా పేర్కొనకుండా ఈయనను 'గజాసురుండం'టారు. బస్సులో మరొక పండా ఎదురయ్యాడు కాని గజాసురుని అండ చూసుకొని వీని వెంట త్ర్యంబకానికి వెళ్ళడానికి ఒప్పుకున్నారు. వెంట వచ్చిన పండా వీరికి వెదుళ్ళతో నిర్మించిన ఇంట్లో బస ఏర్పాటు చేశాడు.

## iv) త్ర్యంబకంలో :

ఆ రోజు కుశావర్తంలో తీర్థ విధులొనర్చి, తర్వాత బ్రహ్మగిరిని ఎక్కుటకు నిశ్చయించుకున్నారు. కుశావర్తం దగ్గర ఒక దేవాలయమున్నది. భూగర్భం నుండి గంగ పొంగి అక్కడి శివలింగాన్ని అభిషేకిస్తుందని త్ర్యంబక వాసులు చెప్పగా, ఆ వింతను చూడాలని మూర్తిగారు ఉబలాట పడ్డారు. కాని ఆలయ ప్రవేశం బ్రాహ్మణేతరులకు లేదని తెలిసి, తన వెంట వచ్చిన గజాసురాదులకు ఈ అవకాశం లభించనందుకు చింతించారు. మిత్రులను వదలి గర్భాలయంలోకి ప్రవేశించడానికి మనసొప్పలేదు. కాని, తన మనస్తాపాన్ని ఈశ్వరుని ఎదుట వ్యక్తీకరించడానికా అన్నట్లు లోపల ప్రవేశించారు. పురవాసులు చెప్పినట్లుగానే గుడిలోపల మూడు మూలల నుండి నీరు పొంగి శివలింగాన్ని అభిషేకిస్తున్నట్లుగా ఉంది. పూజారి ఇచ్చిన గంధాన్ని లింగానికి పూసి, దేవుని ఎదుట ఇట్లా వేడుకున్నారు:

---

5 నా మహారాష్ట్ర యాత్ర — పేజి. 43.

"తండ్రీ! ఈ భాగ్య మెల్లరకు చేకూర్చుము. పూజారుల హృదయ మందలి మౌఢ్యమును ఛేదింపగలవాడవు నీవుగాని శాసన సభలు కావు."[6]

దేశాన్ని విస్తృతంగా పర్యటించడం వల్ల కలిగిన విశాల భావాలివి. అందుకే యాత్రా సందర్భంలో మూర్తిగారు బ్రాహ్మణుల యిండ్లలోనే బస చేయాలన్న నియమం పెట్టుకోలేదు.

దైవదర్శనం చేసుకునేసరికి పగలు రెండు గంటలైంది. అప్పటి దాకా నిరాహారంగానే ఉన్నారు. ఉత్తర దేశం వారు కొందరు యాత్రలకు పోయి నప్పుడు ఉపవాస దీక్షలు వహించకుండానే స్నానాలు చేస్తారట! హరిద్వారంలో కుంభమేళాకు వెళ్ళినప్పుడు పుణ్య ముహూర్తం స్నానవేళ కూడ ఒంటిగంటకే నిర్ణయం కాగా చాలామంది పదిగంటలకే పొట్టనిండా చపాతీలు నింపి, తర్వాత ముహూర్త సమయానికి స్నానం చేశారని పేర్కొన్నారు. అందుకే స్వభావంలో, శారీరక స్థితిలో మనకు సరిపడే వ్యక్తులతో యాత్ర చేయడం మంచిదని అభిప్రాయపడ్డారు. సహయాత్రికు డెట్లుండవలెనో క్రింద సూచించారు.

"కష్టనిష్ఠురముల నోర్చి, మహోత్సాహమున ముందటికి లంఘింప జాలువారే, పరిచర్య చేసి పరిచర్య చేయించుకొనగలవారే ఆ యవసరమున సన్నిహితులై యుండవలెను. ఈ నియమమునకు చెఱుపు వచ్చెనేని, భ్రమణో ద్దేశము భగ్నమై పోవుట తథ్యము. మనసునకు దురంత యాతన కలుగుట నిక్కము."[7]

## v) బ్రహ్మగిరి అధిరోహణం :

గజాసురుడు తనకు యాత్రలో సహాయంగా ఉంటాడని గ్రంథకర్త భావించారు. కాని తీరా బ్రహ్మగిరిని సమీపించగానే వాడు వెంట రావడానికి ఇష్టపడలేదు. ఐనా 'నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు' అన్నట్లుగా దృఢ నిశ్చయంతో మూర్తిగారు ఒంటరిగానే ఆ శిఖరాన్ని అధిరోహించడానికి పూను కున్నారు.

---

6. నా మహారాష్ట్ర యాత్ర - పేజీ. 89.
7. నా మహారాష్ట్ర యాత్ర - పేజీ. 98.

దారిలో ఇద్దరు బలిష్ఠులు డోలీలోనికి రమ్మని ఆహ్వానించారు. గోదావరీ జన్మస్థానాన్ని దర్శించి చీకటి పడే వరకు తిరిగి రావాలని ఖాళీ కడుపుతో బయలుదేరారు. డోలీలో వెళ్తే ఏ కష్టాలూ ఉండకపోయేవి. కాని మార్గాయాసం లేకుండా యాత్ర చేస్తే అందులో అందమేముంది? ఇదీ ఆయన ఉద్దేశ్యం.

దారిలో ఎదురుగా ఎత్తైన కొండ కొంతదూరం వెళ్ళేసరికి అదివరకున్న తలనొప్పి ఎక్కువయింది. మందు బిళ్ళలెక్కడో పోగొట్టుకున్నారు. చేతికర్ర పంజాబు పర్యటనలో అపహరింపబడింది. ఇన్ని కష్టాల నొక్కసారే మోస్తూ, మోకాలిపై చేయి మోపి అతి కష్టంపై ఎక్కడం ప్రారంభించారు. దానికి తోడు అపరిమితమైన దాహం.

ఎట్లాగైతేనేమి 'అరుగులు పోలు రాళ్ళు' గడిచారు, తర్వాత శిలలు మదించిన ఏనుగుల్లా ఎదురయ్యాయట! ఐనా జంకకుండా ఒక్కోసారి నడిచీ, మరోసారి ప్రాకుతూ, ఇంకోసారి దేకుతూ, మరొకప్పుడు వంగి వంగి యెక్కుతూ కొంత దూరం వెళ్ళారు. ఒకచోట జలధార కనిపించగానే దానికింద తల తడుపుకొని, కడుపునిండ నీళ్ళు త్రాగారు. దానితో తలనొప్పి కొంత ఉపశమించిందనీ, మనసు కుదుట పడిందనీ వ్రాసుకున్నారు. అక్కడొక పక్షి కనిపించగానే తాను కూడ పక్షినై ఉంటే హాయిగా సంచరించి ఉండేవాడినని భావించారు.

చివరకు సమయానుకూలంగా శరీరాన్ని ముందుకు నెడుతూ కొండ కొమ్ముకు చేరుకున్నారు. గోదావరీనది జన్మస్థానం కోసం నాలుగు దిక్కులా పరిశీలించి చూస్తే ఎక్కడా అది కనబడలేదు కాని, ఎదురుగా మరొక కొండ భీకరాకారంతో అడ్డుపడింది. అది దాటితే కాని గమ్యస్థానం రాదని గ్రహించారు. ఆ పరిస్థితిలో దాన్ని అధిరోహించడం అసాధ్యంగా తోచింది. అక్కడి నుండి ఎటు వెళ్ళినా ముప్పే. అక్కడ నిలవటం మరింత ప్రమాదకరంగా భావించారు.

నూతనోత్సాహం తెచ్చుకొని, అంగవస్త్రాన్ని నడుముకు చుట్టుకొని అనేక అవస్థలతో బ్రహ్మగిరి శిఖరాన్నధిరోహించారు. ఆపదలకు గురి కానిదే మానవుని సాహస సామర్థ్యాలు విజృంభించవని చెప్తూ, దానికి సమర్థకంగా ఈ క్రింది వాక్యం ఉదాహరించారు:

"వెక్కు నుండి వేటకాడు వాడి తూపులు వదలుచు, తఱుముకొని వచ్చుటచే గదా కురంగము జవోపేతముగ పర్వెత్తి తన పరుగున నాత్మశక్తిని గుర్తించినది."8

అప్పటికే చీకటి పడింది. గమ్యస్థానం తెలియరాలేదు. చుట్టూ దట్టమైన చీకటి. ఇంక ఆ రాత్రిని అక్కడే వేగించాలనుకొని చెట్ల నడిమికి చేరుకున్నారు. నిద్ర పోవడానికిగాని, కనీసం కండ్లు మూసుకోవడానికిగాని వీలులేదు. అపాయం ఏ రూపంలో వస్తుందో తెలియదు. ఏదైనా వన్య మృగమో, అపూర్వ జీవమో తన దిక్కు వస్తుందేమోనని నాలుగు దిక్కులా కలయ చూస్తున్నంతలో పకపకమని నవ్విన చప్పుడు వినిపించింది. తెల్లవారేసరికి ఏ నాలుగైదు సార్లో ఈ నవ్వును గుండెలు బిగబట్టుకొని వినవలసి వచ్చిందట!

తెల్లవారి నదీ జన్మస్థలంలో స్నానంచేసి, ప్రార్థన చేశారు. తర్వాత రాత్రి వినవచ్చిన నవ్వును ఆరా తీయడానికి బయలుదేరారు. ఒక గుహలో ఇద్దరు వ్యక్తులు - శతవృద్ధుడు, యువకుడు కనిపించారు. వారిద్దరికి నమస్కరించి కూర్చున్నంతలో యువక సన్యాసి పకపమని నవ్వారు. అదే నవ్వు, రాత్రి వినవచ్చింది. పిచ్చివాడుగా కనిపించే ఈ యువకున్ని తానే ఇక్కడికి తీసికొని వచ్చినట్లు మూర్తిగారికి వృద్ధ సన్యాసి చెప్పాడు.

తర్వాత స్వామీజీని దారి అడిగి ఆ మార్గంలోనే నడుస్తుండగా నిరుపేదయైన మరాటీకాపు ఒకడు కనిపించాడు. దారి వెదుక్కునే ప్రయాస లేకుండానే సేవకుడు ముందు నడుస్తుండగా, మూర్తిగారి చూపులు ప్రకృతి పరిశీలనలో నిమగ్నమయ్యాయి.

కొంతదూరం గడచిన తర్వాత మరాటీ వాడొకచోట గోదావరినది శివుని జడ నుండి వెడలుతున్న దృశ్యం చూపెట్టాడు. అక్కడి కొండనేల జడలు కట్టిన నేల లాగా ఉంది. దానిలోంచి నీరు ఉబుకుతున్నది. "గంగకు మున్ను గోదావరి ఈశ్వర శిఖనుండి వెడలినది. ఈ యంశమును వ్యక్తపఱచు దృశ్యము

8. నా మహారాష్ట్ర యాత్ర - పేజీ 128.

బ్రహ్మగిరిపై కలదు" అన్న మహారాష్ట్రీ విప్రుల మాటలు ఈ సందర్భంలో రచయితకు గుర్తుకు వచ్చాయి.

ఈ దారి ఎగుడు దారి లాగా కష్టాలమయం కాదు. గడచిన రోజు సాయంత్రం త్రోవ తప్పడంవల్ల ఇబ్బందుల పాలయ్యాడు. క్రమక్రమంగా క్రిందికి దిగేసరికి అక్కడక్కడ అబద్ధపు బైరాగులు, నిజమైన యోగులు, బిచ్చ మెత్తుకునే అభాగ్యులు, శెనగలమ్ముకునేవారు, దమ్మిడీల చిల్లర ఇచ్చేవారు, కోతిమూకలు కనిపించారు.

ఆశ్రయమిచ్చిన పండా కుమారుని అధ్వర్యంలో మూర్తిగారు మాతృశ్రీ తద్దిన కర్మ నిర్వహించారు. ఇంకా పితృదేవతల ప్రీత్యర్థం కుశావర్త క్షేత్రంలో పిండ తర్పణం చేశారు.

తర్వాత త్ర్యంబకం నుండి మరలి నాసిక చేరుకుని, 'పంచవటి' అని మహారాష్ట్రులచే విశ్వసింపబడే స్థానాన్ని దర్శించుకుని బొంబాయికి చేరుకున్నారు.

## vi) పండాల గురించి రచయిత అభిప్రాయాలు :

సత్యనారాయణ మూర్తిగారు భారతదేశ యాత్రలో అనేక చోట్ల పండా బ్రాహ్మణుల ఆగడాలను ఎదుర్కొన్నారు. అందుకు వారంటే ఆయనకు అంతు లేని కోపం. ప్రస్తుత గ్రంథంలో అక్కడక్కడ వీరిని 'పిశాచము'లని, 'పండా గ్రహము'లని, 'పండా దేగ'లని పేర్కొంటారు.

ఒకసారి ఒక పండా 'ఇది రామక్షేత్రమే కాదు, ఈశ్వరుడు తపస్సు చేసిన చోటు, బ్రహ్మ యజ్ఞము చేసిన స్థలము. నదికడ నావ యెట్లవసరమో తీర్థస్నానముకడ పండా యట్లే అవసరము' అని అదేపనిగా రొద పెట్టసాగాడు. అప్పుడు మూర్తిగారు 'బ్రహ్మవలె యజ్ఞము చేయుము. ఈశ్వరునివలె తపస్సు చేసికొనుము, యాత్రికులను పీడింపకుము' అని హెచ్చరించి వాని నోరు మూయించారట!

కేవలం మాటలకు విననప్పుడు కుస్తీపట్లకు కూడ వెనుదీయని సందర్భా లున్నాయి. అయితే పరిస్థితి అంతదాకా రాకుండానే, ఈయన మొండితనాన్ని చూసి పండాలే వెనుకడుగు వేసేవారని రచయిత వ్రాశారు.

## vii) 'సాక్షి' శైలి :

'మహారాష్ట్ర యాత్ర'లో ఒకచోట "గగన చుంబి మహా విశ్వవిద్యాలయ మున పెద్ద పరీక్షలందునెగ్గి, పెక్కు పసదనములంది ఎంతో జ్ఞానము పడసితి నని నేన్నెడును విశ్వసింపలేదు" అన్న మాటలనుబట్టి వీరు తను ఎం. ఏ, తదితర డిగ్రీలను కలకత్తా విశ్వవిద్యాలయంలో పొందినట్లు తెలుస్తున్నది. విద్యాధికుడై ఉండికూడ సామాన్య పాఠకునివలె నిరాడంబరంగా యాత్ర చేసిన విధానం ఆయన ఆధ్యాత్మిక సంపదకు తార్కాణగా నిలుస్తున్నది.

పాండిత్యానికి తగ్గట్టుగానే వీరి రచన గ్రాంథికంలోసాగింది. వీరి గ్రంథం లోని శైలి అక్కడక్కడ హాస్యరసస్ఫోరకంగా, సాక్షి వ్యాసాల మూసలో దర్శనమిస్తుంది.

హిమగిరి పల్లెలోని ఒక హోటల్‌లో కడుపు నిండా తిని పప్పు పెద్ది బొట్లు 'హిమగిరి గుహలు మారుమ్రోగు'నట్లు బేవ్‌మని త్రేన్చాడట! డబ్బులివ్వాలనేసరికి 'తాను పుట్టి యాభై యేళ్ళయినా ఒక్కపూట తిండికి ఒక రూపాయి ఎన్నడూ ఇవ్వలే'దని విసుకున్నాడట! ఇట్లాంటి పాత్రలు 'సాక్షి'లో మనకెన్నో కనిపిస్తాయి.

వ్యక్తుల రూపురేఖలనుబట్టి రచయిత మారుపేర్లు పెట్టి నవ్వు పుట్టిస్తారు. త్రిభుజాలను మనుష్యాకారంగా ఉంచితే ఎట్లుంటుందో అట్లాంటి 'కందగడ్డ వలె ఎఱ్ఱగా నున్న' మనిషిని చూసి "నిస్సంశయముగ వీడు రక్తమాంసాలతో నొప్పు దైమానురాజు" అనుకొన్నారు. ఆ పండా అసలు పేరు దీక్షిత్. ఈయనే త్ర్యంబకంలో వీరికి ఇల్లు అద్దెకిచ్చాడు. ఆయన కొడుకు 'కందిన శరీరం'తో ఉండటంవల్ల వానికి 'మిరపపండు' అని పేరు పెట్టారు. దీక్షిత్‌కు పోటీగా వచ్చిన మరో పండాను 'కళావర్ రాజు' అంటారు ఈ రూప చిత్రాలన్నీ సాక్షివే.

బ్రహ్మగిరిపై మూర్తిగారికి మంటవెలుతురులో ఒక వన్యమృగం కనిపించింది. వెంటనే చెట్టు వెనక్కు తప్పుకొని ఇట్లా తలపోశారు. "వెలుగు లేకున్ననేమి, ఆ యెలుగు తొంటి చిన్ని జంతువును తటుముకొని నిముసములో నేనున్న యెడనుఱికి, దానిని విడిచి నా పని పట్టునేమోయని యడలితిని.

తాత్విక భావగర్భితమైన మహోపన్యాసమపుడు నన్ను గాపాడునా? ప్రతిమాలిన యెడల నడవి మృగము కనికరించునా? తియ్యని పాట పాడినను దాని మనసు కలుగునా?"9

సాక్షి వ్యాసాలలోని 'స్వభాష'ను పోలివున్నది పై రచన. అంత అపాయకరమైన స్థితిలో కూడ ఈ హాస్య ధోరణి రచయిత ధీరగుణాన్ని, జీవితాన్ని తేలికగా తీసుకునే మనస్తత్వాన్ని చాటి చెబుతున్నది.

దైమాను రాజుకు, కళావరు రాజుకు యాత్రికుల పంపకంలో పోట్లాట రాగా, వీరి పోరాటాన్ని 'పందుకోతి'కి, 'కొండముచ్చు'కు జరిగిన పోట్లాటతో పోల్చారు.

"క్రోరచూపులూ, కారుకూతలూ, పండ్లు పటపటలూ, డబడబలూ చెల రేగినవి! కురుక్షేత్ర యుద్ధమందలి మహారాజుల ద్వంద యుద్ధములు దైమాను రాజు కళావరు రాజుల పోరుముందు చచ్చు ఉద్దమ్మలని చెప్పక తప్పదు... పండ్లును, గోళ్ళను అనిర్వచనీయ పరాక్రమముతో ప్రయోగింపబడినవి! ఇరువుర మహాకాయములను గీరుకొనిపోయినవి! ఈ మహావీరులపై దివినుండి దేవతలింకను పుష్పవర్షమేల కురియింపకుండిరో నాకు బోధపడలేదు. నింగినుండి కరతాళ ధ్వనులైనను వినవచ్చినవికావు. దుర్న్యయము! కలియుగములో నిలింపులు కూడ కఠినాత్ములైరని మిగుల వగచితిని."

రచయిత ఉత్తమ భావుకుడనటానికి ఈ కింది ఉదాహరణ సరిపోతుంది:

బ్రహ్మగిరిపై తూర్పున శుక్రతార రచయితకు 'గగన మహిళాగళమున మిగుల తేజోవంతమైన శమంతక మణి వ్రేలాడుచున్నట్లు' కనిపించింది. 'పూర్వ దిక్కామిని చెక్కిలిపై నిష్ఠుర భావమున ఎవరో చరిచినట్లు'గా వెంటనే తూర్పు

---

9. నా మహారాష్ట్ర యాత్ర — పేజీ 139.

దిక్కంతా కందిపోయింది, ఆకాశంలోని అరుణకాంతులు 'ఇక నెంత కాలముందు విసీయని ఎవ్వరో నిశీరమణి గుండియలో వాడి ఛురకను గ్రువ్వుటచే రుధిర ధారలు పెల్లుబికినట్లుగా' తోచిందట![10]

## 2. ప్రాతూరి వారి "నా యాత్ర"లో పదమటి యాత్ర

శివరామశర్మగారి 'నా యాత్ర' నుండి మహారాష్ట్ర యాత్రను వేరు చేయడమైనది.

మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని ఖాంహ్వానుండి మోటారుమీద నాసికకు ప్రయాణమయ్యారు. ఈ దారిలో మనిషి ఒక్కొంటికి నాలుగణాల వంతున యాత్రికుల వన్ను వసూలు చేశారు. నాసిక బస్తీలో గోదావరి చిన్న కాలువలాగ ప్రవహిస్తుందనీ, అక్కడి ప్రజలీ నదిని గొప్పదేవతగా పూజిస్తారనీ, వంతెన మీదినుండి నదిని దాటే సమయంలో ముచ్చలు వూడదీసి నడుస్తారనీ, నదిలో ఉమ్మి వేయరనీ శర్మగారి పరిశీలనలో తేలిన అంశాలు.[11] ఇక్కడ చెప్పే సంకల్పంలో ఈ దేశం (మహారాష్ట్ర) దండకారణ్యంలోని తపోవనంగా చెప్తారు.

త్ర్యంబకంలో గోదావరి తటమనే చిన్న కోనేరును చాల పవిత్రంగా చూస్తారు. కోనేటిలో కాళ్ళను ముంచనీయరనీ, నీటిని ఒడ్డుకు తెచ్చి స్నానం చేస్తారనీ శర్మగారు వ్రాశారు. ఇక్కడి త్ర్యంబకేశ్వరుని పానపట్టం మీద బెత్తెడు లోతున ఎప్పుడూ నీళ్ళు నిల్చి ఉంటాయనీ, తొలగించినా మళ్ళీ నీళ్ళు నిలుస్తాయనీ ఆయన గమనించి చెప్పారు.

ఇక్కడి వీధుల వెంట బిచ్చగాళ్ళవలె ఆవులు వెంటపడితే వాటికి గడ్డి కోసివేసి వదిలించుకున్నారట!

---

10. నా మహారాష్ట్ర యాత్ర. పేజీ. 77.
11. ముచ్చెలు అంటే చెప్పులు లేదా బూట్లు. చర్మ సంబంధమైన తొడుగు.

నాసికను వదలి బొంబాయికి రైలుపై వెళ్లారు. మద్రాసీయులంతా ఒకే జాతి మనుష్యులనే అభిప్రాయం ఉత్తర దేశస్థులది. అక్కడ తెలుగువారు, తమిళులు, మలయాళీలు అంతా కలిసి ఉంటారన్నది చాలమందికి తెలియదు. చెన్నపట్నం వారంటే వెంటనే వారికి ఒక ఆకారం కనులముందు నిలుస్తుంది, గూడకట్టు, పిలకజుట్టు, విభూతి రేఖలతో ఊహించుకుంటారు. అందుకే శర్మ గారిని కలవటానికి స్టేషనుకు వచ్చిన జమీందారు గారి గుమాస్తా వీరిని గుర్తు పట్టలేకపోయానని చెప్పుకున్నాడు.

ఇక్కడి మాధవబాగ్ అనే విశాలమైన ఆవరణలో భాగవత సప్తాహం నిర్వహింపబడటం శర్మగారి దృష్టికి వచ్చింది. దాదాపు 350 మంది బ్రాహ్మణులు ఈ సప్తాహంలో పాల్గొన్నారట. ధనికులు బీదలనే భేదం లేకుండా అన్ని వర్ణాల స్త్రీలు అలంకృతలై భాగవత గ్రంథాన్ని స్పృశించి కండ్ల కద్దుకుంటూ బ్రాహ్మణులకు దక్షిణలు సమర్పించారని వ్రాశారు.

తర్వాత బోలేశ్వరమనే ఉన్నత దేవాలయం పైకి వెళ్ళి చూడగా బొంబాయి పట్టణమంతా కనిపించిందంట! బొంబాయిలో కూడ గోవులు గుంపులు కట్టి మనుష్యులను రాచుకొని తిరుగుతాయనీ, ఏదైనా తినడానికిస్తే విడిచిపెడతాయనీ తెల్పారు.

బొంబాయి రేవులో ఇండియా ద్వారమును చూశారు. (Get way of India). వైస్రాయి మొదలగు పెద్ద ఉద్యోగస్తులు దిగినప్పుడు ఈ గేటు క్రింద తివాచీలు పరిచి అలంకరించి స్వాగతమిచ్చేవారని తెలుస్తున్నది.

బొంబాయిలోని ప్రజల వేషధారణ గురించి శివరామ శర్మగారు "ఖద్దరు వస్త్రములు ధరించిన వారు బహు నరుదుగా నుండిరి. నల్లని విదేశీ టోపీలు ప్రజలు వుపయోగింతురు. గాంధిటోపి పెట్టినవారిని చేతి వేళ్ళ మీద లెక్కించ వచ్చును" అని వ్రాశారు.[12]

---

12. నా యాత్ర - పేజీ. 39.

ఇదేకాలంలో అంటే 1930 లో బొంబాయిని సందర్శించిన హెచ్.యన్. బ్రెయిల్స్ ఫర్డు పరిశీలన మరోవిధంగా ఉంది. కాంగ్రెసు స్వయం సేవకుల గురించి ఆయన ఇట్లా వ్రాశాడు: "త్రివర్ణ పతాకంతో, కుంకుమ పువ్వు రంగు చీరలు కట్టుకొన్న స్త్రీలు, చేతితో వడికి నేయబడిన తెల్లని దుస్తులు ధరించిన పురుషులు నగర వీధులందు పోవుట జూడ కడు శోభావంతముగా నుండును."13

ఐతే వేషధారణలో దేశభక్తిని కనపరచని ఇక్కడి ప్రజలే కొద్దికాలానికి విదేశ వస్త్ర బహిష్కారము, స్వదేశీ వస్త్ర అభిమానమూ ప్రదర్శించి, దేశక్షేమం కోసం త్యాగనిరతిని ప్రదర్శించడం ప్రాతూరి వారికి ఆశ్చర్యాన్ని కలిగించింది. ఈ ఆశ్చర్యం యాత్రా కాలం నాటిది కాదు. యాత్రా గ్రంథ రచనా కాలం నాటిది.

## 3. బాపిరాజుగారి 'నా తీర్థయాత్ర'*

బాపిరాజుగారి యాత్రా గ్రంథం 29 పుటల చిన్న పుస్తకం. ఇది అణాగ్రంథమాల వారి 13 వ ప్రచురణ. 1941 లో మొదటిసారిగా ముద్రింపబడింది. పుస్తకంలో రచయిత ఎక్కడా యాత్రా కాలం గురించి పేర్కొనకున్నా ముద్రణా కాలాన్ని బట్టి వీరి 'ఎల్లోరా - అజంతా' యాత్ర 1941 కి ముందు జరిగి ఉండవచ్చునని ఊహించవచ్చు.

యాత్ర ఎక్కడి నుండి ప్రారంభమైందో ఎక్కడా వ్రాయలేదు కాని ఎడ్లబండీ కుదుర్చుకొని దౌలతాబాదు కోటనుండి ఎల్లోరాకు పయనమైనట్లు వ్రాసుకొన్న దాన్ని బట్టి ఈయన ఔరంగాబాద్ దాకా రైలులో వచ్చి అక్కడినుండి తీర్థయాత్ర సాగించినట్లు తెలుస్తున్నది.

---

13. నా భారతదేశ యాత్ర - మూలం : హెచ్.యన్. బ్రెయిల్స్ ఫర్డు. అనువాదం : కాశీనాథుని నారాయణరావు.

* అడవి బాపిరాజు గారు.

అక్కడి ఎండ్లబండ్లు పిల్లలాడుకునే బండ్లకన్న కొంచెం పెద్దవనీ, అందులో ముగ్గురు క్రిక్కిరిసి కూర్చోవడానికి సరిపోయినంత స్థలముంటుందనీ వ్రాశారు. ఎడ్లు పొట్టివైనా కొండజాతివి కనుక కొండలనెక్కడంలో ఎంత బరువునైనా సునాయాసంగా లాగుతూ మేకల్లా చరచరా ముందుకు సాగి పోతాయట!

బాపిరాజు గారు ప్రముఖ నవలాకారులు. ఎండ్లబండి వాన్ని ఆయన వర్ణించిన తీరు కనులకు కట్టినట్లుంటుంది. "ఎఱ్ఱ దుమ్ము కొట్టుకొనిన మొద్దు పంచయు, చినుగుమళ్ళ చిన్న చొక్కాయును ధరించి, కొండపీటి చేద్రాళ్ళంత పొడుగైన రెండు రంగుల ప్రాతగుడ్డ పీలికలు, గడ్డివాయికి వెంట్లు చుట్టినట్లుగ తలకు చుట్టుకున్నాడు."14 అర్ధశతాబ్దం గడచినా మహారాష్ట్ర దేశంలో పేదవాళ్ళ దుస్తుల్లో ఇప్పటికీ మార్పు లేదు.

బాపిరాజు గారు దారిలో దేవగిరి (దౌలతాబాదు కోట)ని దర్శించారు. నాల్గు రోజులు ఎల్లోరా గుహలలో గడిపి చివరకు విడువలేక అజంతాకు ప్రయాణ మయ్యారు.

దౌలతాబాదు నుండి రైలెక్కి మన్మాడు వెళ్ళి, బొంబాయి ఢిల్లీ రైలు మార్గంలో ప్రయాణమై పచోరా స్టేషన్లో దిగారు. అక్కడి నుండి చిన్న రైలు మార్గం ద్వారా 'పాహోరు' గ్రామం చేరుకున్నారు. మళ్ళీ బండ్ల మీద ప్రయాణం. మధ్యాహ్నం బయలుదేరి సాయంత్రం వరకు నెమ్మదిగ పదిమైళ్ళ దూరంలోని ఫైజాబాద్‌లోని నవాబుగారి బంగళా చేరుకున్నారు. ఇంకా అక్కడికి అజంతా గుహలు నాలుగు మైళ్ళ ($6\frac{1}{2}$ కి.మీ) దూరంలో ఉంటాయి. ఇక్కడి నుండి ఆ కాలంలో కాలిబాట తప్ప బండ్ల త్రోవలేదు. ఇప్పుడైతే గుహల దాకా రవాణా సౌకర్యముంది.

---

14. నా తీర్థయాత్ర - పేజి 1.

ఉదయం వంటలు చేసుకొని అజంతా గుహల దిక్కు పయనమయ్యారు. దారిలో మూడు సెలయేళ్ళున్నాయి. వాటిని ఒకరి నొకరు పట్టుకుని కర్రల సహాయంతో దాటారు. ఎప్పటికప్పుడు ఇంక దారి లేదన్న భ్రమ కల్పిస్తూ చుట్టూ ఎత్తైన పర్వత సానువులు. మెలిక దారుల్లో గుహాలు దగ్గరగా వచ్చినట్లే వచ్చి మరెక్కడో దూరంలో కనిపించేవి. చివరకు గుహాలు అకస్మాత్తుగా ఒక మలుపు తిరిగే సరికి ప్రత్యక్షమయ్యాయి. నూరడుగుల దిగువ నదీ ప్రవాహం. పైన కదలని శిఖరాలు. మధ్యలో అర్ధచంద్రాకృతిలో గోడలపై మనోహర రూపాలతో అజంతా గుహాలు. 'ఒక్కసారి సాక్షాత్కరింపగా చలనము లేని విగ్రహములవలె' అట్లాగే నిలిచిపోయినట్లు బాపిరాజుగారు పేర్కొన్నారు.

## 4. సూర్యాబత్తులవారి "కళ-ప్రకృతి" అనే 'అజంతా-ఎల్లోరా యాత్ర'*

సుబ్రహ్మణ్యంగారు విహారదళంతో చేసిన యాత్ర ఇ.వి.15 9-12-1950 నాడు సేవాగ్రాం నుండి బయలుదేరి కాలినడకన వార్ధా చేరి, అక్కడినుండి జలగాంకు రైలులో వెళ్ళారు. జలగాంనుండి ५8 కి. మీ. ప్రత్యేకమైన బస్సులలో 60 మంది ప్రయాణం చేశారు. ఒక్కొక్కరివద్ద అప్పుడు 30 రూ॥ ప్రయాణ ఖర్చుల క్రింద వసూలు చేశారు.

ఈ విహారదళం ఏర్పాటు చేసుకున్న నియమ నిబంధనలు ఇప్పటికీ గుంపుగా యాత్రలు చేసేవారికి ఆదర్శప్రాయమనే చెప్పవచ్చు. అరవైమంది ఐదు చిన్న దళాలుగా ప్రత్యేక నాయకుల అధికారం క్రింద విభజింపబడ్డారు. ఆ దళముల పేర్లు: కస్తూరిబా, రాజేంద్ర, మహదేవ, సతీష్, నేతాజీ. అందరిపై ప్రధానమంత్రి ఉంటాడు. కార్యనిర్వహణార్థం అయిదు సంఘాలుగా ఏర్పడింది విహారదళం. ఆహారసంఘం, ఆర్థికసంఘం, క్రమసంఘం, సంస్కృతి సంఘం, ప్రయాణ సౌకర్య సంఘం.

---

* విద్వాన్ సూరాబత్తుల సుబ్రహ్మణ్యముగారు.

15. రచయిత పరిచయం దక్షిణ భారతదేశ యాత్రల్లో చేయబడింది.

సంస్కృతి సంఘం ఎక్కడికక్కడ ఛాయాచిత్రాలు తీయడం, దర్శనీయ స్థలాల చరిత్రను సేకరించడం, ప్రయాణాల్లో రాత్రివేళ వినోదసభ లేర్పరచడం మొదలైన కార్యక్రమాలు చేపట్టాలి. ప్రతిరోజు ఉదయం సాయంకాలం సేవాగ్రాంలో వలెనే ప్రార్థనలు జరిగాక తర్వాత ఏయే దళం ఏయే పనులు చేయాలో ప్రధానమంత్రి సూచిస్తుంటాడు. అది సుగ్రీవాజ్ఞ.

వీరు ఎక్కడికక్కడ వంటలు చేసికొని యాత్ర చేశారు. ఎక్కడ విడిది చేసినా వెళ్ళిపోయేటప్పుడు ఆ ప్రదేశాన్ని శుభ్రంగా తుడిచి, తుక్కు దూరంగా పారబోసి ప్రయాణాన్ని కొనసాగించేవారు. వీలు, తీరిక ఉన్నప్పుడల్లా కొద్దో గొప్పో అందరూ తకిలీలమీద నూలు వడికేవారు.

అజంతా గుహలను దర్శించినప్పుడు రచయిత హృదయంలో ఉప్పొంగిన భావం ఆయన పాండిత్యాన్ని ప్రదర్శించేవిధంగా ఉంది.

"అట్టి కొండలా శిల్పుల చేతిలో వెన్నముద్దలుగా, మైనపుటుండలుగా ఎట్లు మారినవి?" అని ప్రశ్న వేసుకుని "శిల్పుల హృదయ కోమలత్వాని కవి కరిగినవి కాబోలు!"నని సమాధానం చెప్పుకున్నారు.

దౌలతాబాదు కోట ఔరంగాబాదుకు 14½ కి.మీ. (9 మైళ్ళు) దూరంలో ఉంది. సుబ్రహ్మణ్యంగారు ఈ కోటను ఎక్కి దిగడానికి రెండు గంటలు శ్రమ పడవలసి వచ్చింది. అందుకే ఆయన 'ఈ కోటలో చూడవలసినదంతగా ఏమీ లేదు. కోట దర్శనం ఆనందం కంటే ఆయాసాన్నే ఎక్కువ కలిగించింది' అన్నారు.

సుబ్రహ్మణ్యంగారు అజంతా, ఎల్లోరా గుహలకు చక్కని సామ్యం చెప్పారు. శిల్పంలో అజంతా ఒక తరంగమైతే ఎల్లోరా తరంగిణి అనీ, అజంతా నది ఐతే, ఎల్లోరా సముద్రమనీ వర్ణించాడు. అంటే ఎల్లోరా శిల్పం ముందు అజంతా శిల్పాలు దిగదుడుపేనని ఆయన అభిప్రాయం. ముఖ్యంగా సందర్శకులు ఎల్లోరాలోని 16వ గుహ (కైలాస గుహ)ను మొట్టమొదట సావకాశంగా, సొంతంగా దర్శించడం మేలనీ, అందులో చూడవలసిన విశేషాలెన్నో ఉన్నాయనీ

భావించారు. ఈ గుహకు మొదటి ప్రాధాన్యమివ్వకుంటే అలసటవల్ల తర్వాత దీన్ని చూడవలసినంతగా చూడలేరని అనుభవపూర్వకంగా చెప్పారు.

అజంతా గుహలవలె ఎల్లోరా గుహలు కూడ పశ్చిమ ముఖాలు కాబట్టి అస్తమయ సమయంలో "అస్తగిరి జేరు అహర్పతి రక్త చందనమీ పర్వతములపై నలది వీనిని మేరుగిరులొనర్చుచున్నవ"ని సుబ్రహ్మణ్యంగారు ఆ కమనీయ దృశ్యానంతరం పులకించి పలికిన మాటలు.

సుబ్రహ్మణ్యంగారు మైలు రాళ్ళను 'మార్గదర్శక స్తంభాలు' అంటారు. బస్సు ప్రయాణంలో ఒక్కొక్క రాయి వెనక్కిపోతుంటే 'అజంతా 14 మైళ్ళు, 10 మైళ్ళు, 6 మైళ్ళు అంటూ చెవులకింపుగా కేకలు వేస్తున్నట్లు' తోచినదట!

1819 వ సంవత్సరంలో కొందరు బ్రిటిషు సైనికులు దారి తప్పి సంచరిస్తూ ఈ కొండలను చేరుకుని గుహలను కనుగొన్నారట. అనుకోకుండా కొలంబసు అమెరికాను కనిపెట్టినట్లే. బ్రిటిష్ సైనికులు మనకు ఈ 'ఆధ్యాత్మిక రాజ్యాన్ని అలంకార రాజ్యాన్ని' కనిపెట్టి ఇచ్చారనీ, ఇవి అమెరికా రాజ్య సంపదకన్న ఐశ్వర్యవంతమైనదనీ సుబ్రహ్మణ్యంగారు పులకించి వ్రాశారు. పైరెండు సందర్భాల్లో ఒకటి ఈయన భావుకతకు, రెండోది దేశభక్తికి నిదర్శనాలుగా నిలుస్తాయి.

# ఉత్తర భారతదేశ యాత్రలు

## 1. ప్రాతూరివారి "నా యాత్ర"*

ప్రాతూరి వారి ఉత్తరదేశ యాత్ర 24-1-1930 నుండి 26-3-1930 దాకా సరిగ్గా రెండు నెలల యాత్ర. తెనాలి స్టేషన్లో నాగపూరు వరకే టిక్కెట్లు తీసుకొని ఢిల్లీ ఎక్స్‌ప్రెస్ ఎక్కారు. ఒకరోజంతా రాత్రింబవళ్ళు ప్రయాణం చేసి నాగపూరు చేరుకున్నారు.

శర్మగారు ప్రతిచోట అక్కడి ధర్మశాలల్లోనే విడిదిచేస్తూ వచ్చారు. ఒక్క భోపాల్‌లో మాత్రం బ్రాహ్మణుల యిండ్లు కనిపించకపోవడంవల్ల శూద్రుని యింట్లో బస చేసినట్లు చెప్పుకున్నారు.

నాగపూరు, ఇటార్సిల గుండా ప్రయాగకు చేరుకున్న శివరామశర్మగారు వెంటనే సమీపంలోని కాశీని దర్శించలేదు. శ్రీ బ్రహ్మానంద తీర్థస్వామి 'ఇదివరకు వదలివచ్చిన క్షేత్రములకు వెళ్ళి ప్రదక్షిణంగా హరిద్వారం నుంచి శ్రీ కాశికి చేరవలసిన'దని ఆజ్ఞాపించగా, ఆ విధంగానే చేశారు. ఈ ప్రదక్షిణ మార్గంలో రచయిత నాసికాత్ర్యంబకం, ద్వారక, మాతృగయ, మధుర, హరిద్వారం, ఋషీకేశం క్షేత్రాలను దర్శించుకున్నాడు. ఆయా క్షేత్రాల్లో సంప్రదాయబద్ధంగా శ్రాద్ధకర్మలు నిర్వర్తించారు. పుణ్యతీర్థాల్లో స్నానాదికాలు పూర్తి చేశారు.

మహారాష్ట్రలో ఎక్కువగా ఉన్న పెద్ద పట్టణం నాగపూరు.[1] నాగపూరు పాతబస్తీ, కొత్తబస్తీ అని విభజింపబడి ఉన్నట్లుగా శర్మగారికి కనిపించింది. నాగపూరులోని శ్రీరామ దేవాలయంలో ఆంధ్ర స్త్రీలే ఎక్కువగా కనిపించారట!

---

* ప్రాతూరి వేంకటశివరామశర్మగారు. గ్రంథ పరిచయం ఇదివరకే చేయబడింది.

1. 1956 అక్టోబరు చివరిదాకా మధ్యప్రదేశ్‌లో ఉన్న ఈ పట్టణం, రాష్ట్రాల పునర్విభజన కారణంగా బొంబాయి రాష్ట్రంలో కలిసింది.

శర్మగారికి హిందీభాష తెలియదు. తెలుగు, ఇంగ్లీషు భాషలు వచ్చు. 'హిందీ వచ్చిన యెడల ఇండియాలో సంచరించుటకు సులభమనే సంగతి నిజమాయెను' అన్న మాటలనుబట్టి అక్కడక్కడ యాత్రలో కొన్ని ఇబ్బందులను ఎదుర్కొన్నట్లు తెలుస్తుంది. తెలుగువారివలె కనిపించిన నాగపూరు, ఇటార్సీ ప్రజలతో మాట్లాడాలనిపించినా, భాషావరోధంతో చూపులతోటే సరిపెట్టుకోవలసి వచ్చిందని వ్రాశారు.

సహాయంగా ఉంటాడని వెంట తెచ్చుకున్న విద్యార్థికి కూడ హిందీ రాకపోవడం వల్లనేమో బహుశా ఆయన కూడ 'వుత్తర హిందూస్తాన ప్రయాణము నకుపకరించ లేదు' అన్నారు.[2] శ్రీ స్వామివారికి ఈ సమస్య నివేదించగా వారు వెంటనే హిందీ తెలిసిన శివరామ అయ్యరనే బ్రహ్మచారిని తోడుగా ఇచ్చారు.

ఇటార్సీ స్టేషన్ నుండి అలహాబాద్‌కు ఎక్స్‌ప్రెస్ ప్రయాణం 14½ గంటలు పట్టింది. అలహాబాదు (ప్రయాగ)లో ప్రయాణ కాలంనాటికి జట్కా బండ్లు లేవు. కోచీలున్నాయి. నాగపూరు నుండే ఇట్లాంటి బండ్లు కనిపిస్తాయట! మనవైపు ఒంటెద్దు బండ్లవలె ఇక్కడ కోచీబండ్లు దొరుకుతాయన్నారు. ఈ కోచీలలో రెండు రకాలున్నాయి రెండు చక్రాలవీ, నాలుగు చక్రాలవీ. రెండు చక్రాల కోచీలను అక్కడ 'ఎక్కా'లని పిలుస్తారని రచయిత పేర్కొన్నారు.[3] కుంభమేళా స్థలానికి రెండు కోచీబండ్లను కుదుర్చుకున్నారు కాని అవి బస్తీలో కొంతదూరమే ప్రయాణించి ఓ పెద్ద మైదానంలో ఆగిపోయాయి. మేళా వేళల్లో

---

2. నా యాత్ర పేజీ 16.
3. వీటిని గురించిన పూర్తి వివరాలు బులుసు వేంకట రమణయ్యగారు ఇచ్చారు: "ఉత్తర దేశమంతటా టాంగాలలాగే 'ఎక్కా' కూడా ప్రయాణసాధనమే. అది పూర్వకాలపు రథం మాదిరిగా ఉంది. స్థూలకాయులైతే ఒక్కరే కూర్చోవచ్చును. సామాన్యులైతే ముగ్గురు కూర్చోవచ్చును. అంటే మధ్యను ఒకరూ, చెరివక ప్రక్క ఇద్దరూ! ప్రక్క కూర్చున్న వారి కాళ్ళు చక్రాలమీద వ్రేలాడుతూ ఉంటాయి. కాబట్టి వారు కొంత భద్రంగా కూర్చోవలసి ఉంటుంది. మేమీ అవస్థ పడలేక వాటిని విడిచి పెట్టాము"— నా ఉత్తర దేశయాత్ర. పేజీ 103-104.

బస్తీ గుండా బండ్లు నడుపరాదన్న పోలీసు కమీషనరు ఉత్తర్వులే అందుకు కారణం. ఇంక తప్పనిసరై కూలీవాళ్ళచే సామానులు మోయించుకొని బసచేసే చోటికి వెళ్ళారు.

రెండు కోచీలకు బాడుగ రెండు రూపాయలే తీసుకోవాల్సి ఉండగా బండీ వాళ్ళు పది రూపాయలడిగారట. చివరకు పోలీసు వారికి చెప్పి శిక్ష వేయిస్తామని బెదిరించిన తర్వాత దారికి వచ్చారని రచయిత వ్రాశాడు. కొత్త ప్రదేశానికి వెళ్ళినప్పుడు ఇట్లాంటి మోసాలు తప్పవు మరి!

## i) మహంతుల ప్రవర్తన :

కుంభమేళాకు వచ్చిన మహంతుల అట్టహాసం గురించి శర్మగారు ఈ విధంగా తెల్పారు.

మహంతులు డేరాలు వేసికొని ఒంటెలు, ఏనుగులు, గుర్రాలు, శిష్యులు, మేళతాళాలతో విడిది చేశారు అన్ని రకాల ఆయుధాలున్న సిబ్బందిని కూడ వెంట ఉంచుకున్నారు. ఒక మహంతు ఏనుగు మీద స్నానాలకు వెళ్తున్నప్పుడు మరొక మహంతు అడ్డం రాకూడదు. ఎవరూ దారి తొలగడానికి ఇష్ట పడరు. ఇరుపక్షాల మధ్య యుద్ధం అనివార్య మవుతుంది. ఈ కలహాలను మాన్పడానికి ప్రభుత్వం రెండు వీధుల నేర్పాటు చేసింది. ఇప్పటి 'వన్‌వే ట్రాఫిక్'లాంటి దన్నమాట: ఒకదారి స్నానానికి వెళ్ళడానికి, మరొకటి స్నానం చేసి బసకు చేరుకోవడానికి. త్రివేణి రేవున ఒక మంచె, గుడారాల వద్ద ఒక మంచె ఎత్తైన ప్రదేశాల్లో అమరుస్తారు. రెండుచోట్ల పోలీసు జవానులుంటారు. స్నానాంతరం మహంతు పరివారంతో వీధిలో ప్రవేశించగానే అక్కడి జవాను జండా ఊపుతాడు. అప్పుడు డేరాల దగ్గర ఉన్న జవాను ఈ సౌంజ్ఞను గుర్తించి మరొక మహంతును స్నానానికి బయలుదేర దీస్తాడు. మహంతుల రాకపోకల సందర్భంగా వీధుల ప్రక్కన పోలీసులు గుర్రాలపై సవారీ చేస్తుంటారు.

ఈ దృశ్యాన్ని ప్రత్యక్షంగా చూసిన శర్మగారు మహంతుల ప్రవర్తన ఈ విధమైన ఏర్పాట్లకు అవకాశం కలిగించినందుకు విచారపడ్డారు. ఈ సందర్భంగా ఆయనన్న మాటలు :

"మత ప్రవర్తకులగు మహంతులను నడవి మృగముల వలె యీ విధిగా నీళ్ళకు తీసుకొని వచ్చి తీసుకొని పోవుట వారి బుద్ధులకెట్లున్నను నాకు వంచన కరముగా నున్నది."[4]

మహంతులకు ఒక్కొక్కరికి ఒక్కోరకం జెండాలున్నాయి. శివవతా కాలున్న మహంతుల ముందు వందల సంఖ్యలో స్త్రీ పురుషులు దిగంబరంగా నడిచారనీ, స్త్రీలు మానసంరక్షణార్థం 'అల్ప కాషాయి వస్త్రధారులు'గా ఉన్నారనీ రచయిత పేర్కొన్నారు.

ఇక్కడి నుండి సుబ్బరాయశర్మను బాపట్లకు పంపేసి శర్మగారు భార్యతో, శివరామ అయ్యరుతో కలిసి భావి ప్రయాణానికి పూనుకున్నారు. శ్రీ స్వామివారు నాసిక్, బొంబాయి, హరిద్వారం మొదలైన క్షేత్రాల్లోని తమ శిష్యుల కందరికీ ఉత్తరాలు వ్రాసి పంపడం వల్ల, ఆ ప్రాంతాల్లో శర్మగారికి సౌకర్యాలు కల్పించబడ్డాయి.

అలహాబాదులోని కోటలోపలికి చెప్పులు, చేతికర్రలతో రానివ్వరట! జవానులు వాటిని బయటనే సాధీనం చేసుకుంటారు. రాజకీయ చైతన్యం లేని కొన్ని గ్రామాల్లో నిన్నమొన్నటి దాకా దొరలముందు చెప్పులు చేత పట్టుకుని నడిచే పరిస్థితి అమల్లో ఉండేది.

అలహాబాదు నుండి కాన్పూరు మీదుగా భోపాలుకు చేరుకున్నారు. 18 గంటల రైలు ప్రయాణమిది. భోపాల్ రాజధానీ నగరం.[5] ప్రక్కనే గ్వాలియరు సంస్థానమున్నది. ఈ రెండు రాజ్యాలు స్వతంత్ర రాజ్యాలు. వీటికి సమీపంగా గవర్నమెంటు వారి ఏజెంట్లు వీటిని కాపాడడానికి సేనతో విడిది చేసి ఉన్నారని రచయిత పేర్కొన్నాడు.

---

4. నా యాత్ర పేజీ. 13.
5. రాష్ట్రాల పునర్విభజన తర్వాత నవంబరు, 1956 నుండి మధ్యప్రదేశ్‌కు రాజధానీ నగరమైంది.

ఈ ప్రాంతాల్లో ఒంటెలు, గుర్రాలు గుంపులు గుంపులుగా ఉన్నాయి. మద్రాసులో కంటె వందరెట్లెక్కువగా గుర్రాలు కనిపించాయన్నారు రచయిత. ఇక్కడి ప్రజల యిండ్లు కఠిన దారిద్ర్యాన్ని కనబరుస్తాయనీ, వీరు మోటుగా కనిపిస్తారనీ, మతాభిమానులనీ గ్రంథకర్త తెలిపారు.

తర్వాత మజిలీ ఉజ్జయినికి. ఇక్కడి గ్రామ దేవత పేరు అవంతిక. ఈమె పేరు మీదుగానే ఉజ్జయినిని పూర్వం అవంతి అనేవారు.[6] పితరులకు పిండ ప్రదానం చేయవలసిన సప్తమోక్ష నగరాలలో ఇదొకటి.[7] ఇక్కడి బ్రాహ్మణులు ద్రావిడులు కాదు, గౌడులు. మంత్రాన్ని స్పష్టంగా ఉచ్చరించ లేరు. మహారాష్ట్రతో పాటు ఉత్తర భారత దేశమంతటా బ్రాహ్మణులు ఎక్కువగా శుక్లయజుశ్శాఖకు చెందినవారు కాబట్టి వారు ఆ స్వరంతోటే మంత్రాలను చదువుతారట!

ఉజ్జయిని గ్వాలియర్ సంస్థానంలోనిది. ఇక్కడి మహారాజావారు యాత్రికుల వద్ద పన్నులు వసూలు చేయడం కాని, వారికి సౌకర్యాలు కల్పించడం కాని చేయడం లేదట! ఐతే వీధులవెంట విద్యుద్దీపాలు అలంకరింపబడి కనిపించాయన్నారు.

ఇక్కడి నుండి మోటారుటక్కా అనే గ్రామానికి రైలుమీద వెళ్ళి తర్వాత మోటారుమీద ఓంకారం వెళ్ళి నర్మదానదిలో స్నానం చేశారు. మళ్ళీ మోటారు టక్కాకు వచ్చి రైలుమీద ఖాండ్వాకు చేరుకున్నారు. ఇక్కడి పార్వతమ్మ

---

6. శ్రీ శంకరాచార్యుల కాలంలో సుధన్వుడనే రాజు అవంతికను పరిపాలిస్తుండేవాడు. అతడు వైదిక ధర్మాన్ని పరిత్యజించి, జైన ధర్మాన్ని స్వీకరించడం వల్ల అప్పటి నుండి అవంతికకు 'ఉజ్జయిని' అనే పేరు వచ్చిందని బులుసు సూర్య ప్రకాశ శాస్త్రి గారు తమ 'సుందర భారత యాత్ర'లో తెల్పారు. జైన ధర్మమున వుత్పత్తి స్థానమంటూ దాని వ్యుత్పత్తి కూడ ఇచ్చారు. 'ఉద్గతో జైన జైనధర్మః యస్యాస్యా ఉజ్జైనీ' పేజీ. 145.
7. అయోధ్యా, మధురా, మాయా, కాశీ, కాంచీ, అవన్తికా, పురీద్వారవతీ చైవ సప్తైతే మోక్ష దాయకాః అదే పేజీ. 133.

ధర్మశాలలో వసతి, నిర్వహణ బాగున్నాయట! బజార్లో శర్మగారు పాలు పెరుగు బేరం చేస్తూ హిందీభాష రాక ఇబ్బంది పడుతున్నప్పుడు, గొల్లస్త్రీ ఒకామె స్వచ్ఛమైన తెలుగులో మాట్లాడటం ఈయనకు ఆశ్చర్యం కలిగించింది. మాటల సందర్భంలో ఖాండ్వాలోని గొల్ల పల్లెలో ఉన్నవారంతా తెలుగుప్రాంతం నుండి వచ్చినవాళ్ళేనని తెలుసుకున్నారు.

ఇక్కడి నుండి నాసికకు మోటారుమీద ప్రయాణం.[8]

అహమ్మదాబాదులో రేవాబాయి ధర్మశాలలో బస చేశారు. ఇక్కడ స్వదేశ మిల్లులు చాలా ఉన్నాయనీ, మార్కెట్‌లో మిల్లు వస్త్రాల వ్యాపారమే కాని ఖద్దరు వ్యాపారం లేదని రచయిత పేర్కొన్నారు ఇక్కడి ఆడవాళ్ళు బండ్లు లాగడం ఒక విశేషం.

ఇక్కడినుండి ద్వారకకు వెళ్లే దారిలో వీరంగం, రాజాకోట, జామ్ నగర్, కాంబే (Cambaya) స్టేషన్లు వస్తాయి. ఇది సౌరాష్ట్ర దేశం.[9] వీరంగం దగ్గరి నుండి ద్వారకదాకా జామ్ నగరం రాజావారి రైలు ప్రత్యేకంగా నడుస్తుందట! శర్మగారక్కడ ఉన్నప్పుడే ద్వారక నుండి రాజాగారు స్పెషల్ ట్రెయిన్‌లో జామ్ నగరానికి రావడం చూశారు.

ద్వారక అప్పుడు బరోడా సంస్థానంలో ఉండేది.[10] బరోడా సర్కారు వారు యాత్రికుల సౌకర్యం చూడకున్నా అనేకవిధాల పన్నులు మాత్రం వసూలు చేస్తారు. పురోహిత పదవులకు పరీక్షలు నిర్వహిస్తున్నట్లుగా రచయిత పత్రికలలో చదివారట.

"బరోడా సంస్థానములో పురోహితులకు పరీక్షలు పెట్టినట్లున్ను పరీక్షల యందు తీర్ణులు గాని వారిని పురోహితులుగ నుండనివ్వరనిన్ని పత్రికలలో చదివియుంటిమి." (పేజీ 39)

---

8. పశ్చిమ భారత యాత్రా వివరాలు ఆ శీర్షిక క్రింద మరో అధ్యాయంలో వివరింపబడ్డాయి.
9. ఇప్పటి గుజరాత్ రాష్ట్రం.
10. ఇప్పుడు గుజరాత్ రాష్ట్రంలో ఉంది.

శర్మగారు ఇక్కడి పండాం వేధింపుకు గురైనట్టు తెలుస్తున్నది. పండాలు పితామహః ప్రపితామహః అనే మాటలను కూడ ఉచ్చరించలేని స్థితిలో ఉన్నారనీ, ఒక్క ద్వారకానాథ దేవాలయం తప్ప మిగతావన్నీ నిర్వహింపబడటం లేదనీ రచయిత ఆవేదన చెందారు.

మగవారు చాలమంది ఎక్కువగా చెవిగుంటకు రంధ్రం వేసి రంధ్రంలో 'బంగారపు పువ్వు' ధరించడం ఇక్కడి ప్రత్యేకత. ఇక్కడి ప్రజలు గుజరాతి భాష మాట్లాడతారు.

## ii) పుష్కర తీర్థం :

ఇక్కడి నుండి సిద్ధపూరు (మాతృగయ), ఆబూ స్టేషన్ల ద్వారా ఆజ్మీరుకు చేరుకున్నారు. ఇది అప్పుడు ఆంగ్లేయుల అధీనంలో వుంది. అజ్మీరు నుండి గుర్రపు టాంగా మీద 11 కి.మీ. (7 మైళ్ళు) దూరంలో ఉన్న పుష్కర తీర్థానికి వెళ్ళారు.[11] ఈ యాత్ర కొండల మీద అద్భుతంగా సాగిందట! ఒక కొండ కొననుండి మధ్య కొండ ప్రదేశానికి ప్రయాణిస్తూ, అక్కడి నుండి మరొక కొండ అడుగుకు, మళ్ళీ ఇంకో పర్వత శిఖరానికి ఎగుడు దిగుడుగా వలయాకారంలో రోడ్డు వేయబడింది. ఈ ప్రయాణం రచయిత మాటల్లో 'పద్మవ్యూహము గుండ నిమ్నోన్నతికి వక్రాకృతి ప్రయాణము.'[12] ఇట్లా ప్రయాణించి చివరకు ఒక విశాలమైన బహిరంగ ప్రదేశానికి చేరుకున్నారు. ఇక్కడే పుష్కరమనే గ్రామముంది దీని కానుకొని ఒక పెద్ద చెరువు. అవే పుష్కరిణీ తీర్థం. ఇక్కడి అధిష్టాన దేవత బ్రహ్మ. గుంటూరు జిల్లాలోని చేబ్రోలులో కూడ బ్రహ్మదేవాలయ ముంది కాని పుష్కరిణీ క్షేత్రంలో వలె నిత్యదీపారాధనలు లేవు. అందుకే పుష్కరంలోని బ్రహ్మ దేవాలయమే ముఖ్యమైనదని రచయిత పేర్కొన్నారు.

---

11.- స్వామి రామదాస్ 'ఈశ్వరాన్వేషణము'లో కొండలమీది ఈ ప్రయాణం సుమారు ఐదు మైళ్ళని (8 కి.మీ) తెలిపారు. పేజీ. 105.

12. నా యాత్ర. పేజీ. 45.

మరొక దేవాలయం దక్షిణాది జియ్యరుచే క్రొత్తగా నిర్మింపబడింది. ఒక పెద్ద జైన షాహుకారును వైష్ణవ మతంలో కలుపుకొని ఆయన ద్వారా జియ్యరు ఈ ఆలయం నిర్మింపచేశాడు. ఇక్కడి పూజారులంతా దక్షిణాది వారే, ముఖ్యంగా తంజావూరి జిల్లావారు. కాబట్టి దక్షిణ దేశాచారాలే ఈ గుడిలోను పాటింపబడ్డాయి. అంటే శూద్రులను లోపలికి రానివ్వరు. బ్రాహ్మణులను గర్భాలయంలోనికి ప్రవేశింపనీయరు. ఇది ఉత్తర భారతంలోని దేవాలయాలకు భిన్నమైన విషయం.

ఇక్కడి పుష్కరిణిలో మొసళ్ళు చేపల్లాగ స్వేచ్ఛగా తిరుగుతాయి. చెరువు నుండి మొసళ్ళను తీసివేస్తామని సర్కారువారు చెప్పినప్పటికీ, ఇక్కడి జైనులు సమ్మతించలేదట! ఐతే స్నానం చేసే సమయంలో యాత్రికుల భయ నివారణార్థం పండాలు పొడుగు వాసాలతో నీళ్ళల్లో పొడుస్తూ వుండటం శర్మగారి దృష్టికి వచ్చింది.

రాజస్థాన్‌లోని ఇతర సంస్థానాల కంటె జయపూరు సంస్థానం పెద్దది, అందమైంది కూడా. శర్మగారికి ఇక్కడి జ్యోతిర్మందిరం చూడాలనిపించి వచ్చారు ఈ బస్తీ కోట బస్తీ. రాత్రిపూట గేట్లు వేస్తారు. కోట గోడ చుట్టూ కొండలున్నాయి. కాబట్టి ఈ నగరానికి 'పెట్టినకోట, పెట్టనికోటలు' రెండూ ఉన్నాయి. కోట చుట్టు మురికిని ఎత్తివేసేందుకు చిన్న రైలుకూడ ఉంది. రైలు మీద తొట్టిబండ్లలో పాకీవాళ్ళు తెచ్చిన మురికి పదార్థాలు వేసి ఊరిబయట పారబోస్తారు.

ఈ బస్తీలో మరొక వైలక్షణ్యమున్నట్లు రచయిత గమనించారు. బ్రిటిష ఇండియాలో పట్టణాలన్నీ ఒకదానికి మరొకటి మారురూపాలు. కాని జయపూరు అట్లా కాదు. హిందూ రాజ్యపద్ధతుల క్రింద పరిపాలన, దాని కనుగుణంగా ప్రాచీన భారతదేశాన్ని గుర్తుకు తెచ్చే విధంగా ఉంది. జయపూరు బజారుల్లో విదేశీ వస్తువులు దొరకకపోవడం విశేషమే మరి.

తర్వాత ఆగ్రాకు చేరుకున్నారు. యమునా నదిలో తాబేళ్ళను తప్పించుకొని స్నానం చేసి తాజ్‌మహల్‌ను సందర్శించారు. తాజ్‌మహల్‌ను చూడగానే శర్మగారికి "తురక చక్రవర్తుల మెప్పుకు సమర్పించిన హిందువుల యొక్క కళానైపుణ్య పుంజం"గా తోచిందట![13]

---

13. నా యాత్ర - పేజీ. ౬౭.

షాజహాను చక్రవర్తి హిందూ శాస్త్రజ్ఞునిచే తాజ్‌మహల్ నిర్మింప చేశాడు. తర్వాత ఆయనను సత్కరిస్తానని దేవిడీకి రమ్మని ఆహ్వానించి, స్వయంగా ఆ శాస్త్రజ్ఞుని శిరస్సు ఖండించి, ఆయన కుమారునికి జాగీరు ఇచ్చినట్లుగా అక్కడి ప్రజలు చెప్పుకునే ఐతిహ్యాన్ని రచయిత ఉటంకించారు. ఈయన జీవించి వుంటే మరెక్కడైనా ఇట్లాంటి నిర్మాణం చేసి తన కీర్తికి కళంకం తెస్తాడనే అపనమ్మకంతో చక్రవర్తి ఈ పనికి పూనుకున్నాడట!

తాజ్‌మహలును గురించి "ఢిల్లీ చక్రవర్తి భార్య నూర్జహాను శవము యీ మందిరములో పూడ్చబడి ఆమె సమాధిమీద నొక యరుగును గోరీగా కట్టబడినది" అని గ్రంథకర్త వ్రాశారు[14]

## iii) మధుర రౌడీలు :

ఆగ్రానుండి మధురకు రెండుగంటల ప్రయాణం. రాత్రి ఒంటిగంటయింది. 80 సంవత్సరాల పండా ఒకడు సత్రం చూపిస్తానని చెప్పి తన యింటికే తీసుకొనిపోయి తన యింట్లో బస చేయకుంటే బజారులో సామానులు పెట్టుకోవలసి ఉంటుందని హెచ్చరించగా, అక్కడినుండి బలవంతంగా మళ్ళీ ఆ రాత్రి రైల్వేస్టేషన్‌కే రావలసి వచ్చిందట! ఈ చేదు అనుభవంతోనేనేమో శర్మగారు, "మధుర రవుడీల ప్రదేశమనీ, వీరి దుండగాల నాపునిమిత్తమే ఇక్కడ ఇంగ్లీషు వారి సైన్యము నుంచిరి" అని వ్రాయవలసి వచ్చింది.[15] ఐతే కేవలం వీళ్ళ ఆగడాలను అరికట్టడానికే ఇంగ్లీషువారు ఇక్కడ సైన్యాన్ని ఉంచారన్నది చారిత్రక అవగాహన లోపించిన మాట. ఒక కొత్త ఊరికి వెళ్ళినప్పుడు మనకు ఎదురైన అనుభవాల ఆధారంగా వాటిని విశ్లేషించబూనడం పాక్షిక సత్యమే అవుతుంది. కాబట్టి మధుర రౌడీల గురించి రచయిత అభిప్రాయాలు పూర్తిగా విశ్వసించడానికి వీలులేదు.

ఈ ప్రాంతంలోని గోవర్ధనగిరి, గోకులం, బృందావనం అన్నీ తిరిగి చూశారు. బృందావనం పేరునుబట్టి వనం కాదు, మునిసిపాలిటి, రైల్వే స్టేషన్లు

---

14. నా యాత్ర - పేజీ. 57. ఈమె 'నూర్జహాన్' కాదు-'ముంతాజ్ బేగం.'
15. నా యాత్ర - పేజీ. 60.

ఉన్న చిన్న బస్తీ, పుష్కర క్షేత్రంలోలాగ ఇక్కడ కూడ వైష్ణవ ద్రావిడ బ్రాహ్మణులు స్వంత దేవాలయం కట్టుకొని దక్షిణాది ఆచారాలతో నడుపుతున్నారు.

మధురనుండి ఢిల్లీకి 144 కి. మీ. దూరం. ఐదుగంటల ప్రయాణం. పాండవ ఖిల్లా సమీపంలో అనగా ఢిల్లీకోట దగ్గర కుంతీదేవి దేవాలయం ఉంది. ఇది చిన్న గుడి. దీని ఆవరణలోనే అర్చకుని ఇల్లు ఉంది. మహమ్మదీయులీగుడిని పడగొట్టాలని చేసిన ప్రయత్నాలు అక్కడి అర్చకుడు జారి జోరావరి వల్ల సాధ్యపడలేదు. మహమ్మదీయులతో జరిగిన పోరాటంలో ఈయన రెండు చేతులు నరికివేయబడ్డాయి ఐనా ఆలయంలోకి వాళ్ళను ప్రవేశింపనీయలేదు. ఈ సంఘటన 1920 లో జరిగినట్లుగా రచయిత వ్రాశారు.

శర్మగారు ఢిల్లీ నుండి కురుక్షేత్రం ద్వారా అంబాలాకు చేరుకున్నాడు. కురుక్షేత్రం నుండి అంబాలాకు ఐదు గంటల ప్రయాణం, అంబాలా మిలిటరీ స్టేషను. ఇంగ్లీషు సైన్యముంది. ఐనా శర్మగారి భుజం మీది పట్టు శాలువాను ఒక వ్యక్తి చూస్తుండగానే పట్టుకెళ్ళాడు. మొత్తం యాత్రలోనే ఎక్కడా ఇట్లాంటి దొంగతనం జరగలేదని వ్రాశారు.

తర్వాత హరిద్వారం, ఋషీకేశంలను సందర్శించారు. ఋషీకేశంలో భరతుని దేవాలయం ఒక ప్రత్యేకత.

ఋషీకేశం నుండి హరిద్వారానికి మళ్ళీ కారులోనే వచ్చారు. మాయాదేవి ఇక్కడి గ్రామదేవత. ఈ దేవత పేరు మీదుగానే హరిద్వారానికి 'మాయాపురి' అనే పేరు వచ్చింది. సప్తపురాలలో ఇది మూడోది.

హరిద్వారం నుండి రైలులో బాలాము స్టేషన్‌కు, అక్కడి నుండి నైమిశారణ్యం వెళ్ళారు. నైమిశారణ్యమంటే అడవి కాదు, పెద్ద మామిడి తోపు. ఇక్కడి చక్రతీర్థం ముఖ్యమైంది. నైమిశారణ్యం చుట్టుకొలత 150 మైళ్ళట.[16] మధురలో వలెనే ఇక్కడ కూడ రౌడీపండాలున్నారని రచయిత వ్రాశారు.

---

16. 'నైమిశము 84 మైళ్ళ చుట్టుకొలతగల క్షేత్రము' అని బులుసు సుందర ప్రకాశ శాస్త్రిగారు తమ 'సుందర భారత యాత్ర' పేజీ 283 లో వ్రాశారు.

బారాము స్టేషను నుండి లక్నో మీదుగా అయోధ్యకు ప్రయాణించారు. సరయూనదిలో గంగాస్నానాలు చేశారు. ఈ నదినిండా తాబేళ్ళున్నాయనీ, ముంచిన తలలమీదనుండి పెళ్ళిపోయారని గ్రంథకర్త అనుభవ పూర్వకంగా తెల్పారు.

అయోధ్యలోని పండాలు కూడ రౌడీలేనట! వీరి మాటలకు మోసపోకూడదనే ఉద్దేశ్యంతో సర్కారు వారు వీధి గోడలమీద పెద్ద పెద్ద అక్షరాలతో 'పండాలు, జాగ్రత్త' అని ఇంగ్లీషులో వ్రాయించిన వ్రాతలను ఈయన చూసినట్లు చెప్పారు.

రాజుగారి కోటలో రాజబంధువుతో తాను దారిలో చూసిన రైతులయొక్క దారిద్ర్యాన్ని గురించి ప్రస్తావించారు తాలూకాదారు వివాహాలు చేసినా, మేడలు కట్టినా, మోటారుకారు కొన్నా ఈ ఖర్చులన్నీ రైతుల వద్ద 'శిస్తుల' (పన్నుల) రూపంలో వసూలు చేస్తారనీ, ఈ విధంగా తాలూకాదార్లు రైతులను పీల్చి పిప్పి చేస్తారనీ ఆయన చెప్పాడట. రైతుల యొక్క దుస్థితికి శర్మగారికి సమాధానం దొరికింది.

అయోధ్యనిండా కోతులు గల్లీల గుండా పోనివ్వనంత ఎక్కువ సంఖ్యలో ఉన్నాయట! విక్టోరియా మహారాణి తోటలో వాటికి సమారాధన చేశారు వీళ్ళు. కొన్ని మానికెల శనగలు తెచ్చి వెదజల్లగా, గుంపులు కట్టి వచ్చి భక్షించాయని పేర్కొన్నారు [17]

కాశీయాత్రా విశేషాలు ప్రత్యేకంగా అదే ప్రకరణంలో 'ఇతర కాశీ యాత్రలు' కింద వివరింపబడ్డాయి.

కాశీనుండి రైలులో బుద్ధగయకు వెళ్ళారు ఫల్గుణీ నదిలో స్నానం చేసి విష్ణుపాదాలకు పూజ చేయించి అక్షయవట శ్రాద్ధము జరిపారు.[18] విష్ణుపాద

---

17. రెండు శేర్లు = 1 మానిక.

18. అలహాబాదు కోటలోపలి అక్షయవటమనే మర్రిచెట్టు మొదలు ప్రయాగలో, మధ్య భాగం కాశీలో, పైభాగం గయలో ఉన్నవని శర్మగారికి చెప్పారట. కాని కోట లోపలికి మాత్రం పోనివ్వలేదని వ్రాశారు.

దేవాలయాన్ని అహల్యాబాయి మెరుగుపెట్టని నల్లని మార్బుల్ రాయితో నిర్మింప జేసిందట! దేవాలయ మంటపంలో ఒకచోట ఏడాది పొడుగునా ప్రతి ఐదు నిమిషాలకు ఒక నీటి బిందువు పడుతుందనీ, గర్భాలయంలోకి యథేచ్ఛగా ఆవులు చొరబడి పాదాల మీది పిండాలను భక్షించి పోతాయనీ రచయిత వ్రాశారు.

## iv) జగన్నాథం:

శర్మగారు కలకత్తా నుండి పూరీ జగన్నాథం చేరుకున్నారు. ఇక్కడ గర్భాలయంలోకి పోలీసులు కూడ వచ్చి యాత్రికులను ప్రవేశపెట్టుట శర్మగారికి వింతగా తోచింది. ఈ దేవాలయానికీ దక్షిణాది దేవాలయాలకూ పోలికే లేదట! ఇక్కడి వంటవారు కుమ్మరివారు.[19] దెబ్బై కుటుంబాలకు మించి ఉన్నట్లుగా రచయిత తెలార్చు.

ఇక్కడ వంటచేసే విధానం కూడా చిత్రంగానే ఉంది. ఒక పెద్ద దాలి పొయ్యి, దాని చుట్టూ ఆరు పొయిగుంటలుంటాయి పెద్దపొయ్యి కింద మంట పెడితే మిగతావాటికి కూడ ఒకేసారి మంట తగులుతుంది. ఇట్లాంటి పొయిలు చాల ఉన్నా యక్కడ. కాబట్టి వందలమందికి సరిపడే పాకం కొద్దిసేపట్లోనే తయారవుతుంది. 'జగన్నాథములోని పురవాసులు వంట చేసుకొనవలసిన పని లేదు' అని వ్రాయడాన్ని బట్టి 'పురవాసులకు' బదులు 'యాత్రికులకు' అంటే బాగుండేదనిపిస్తుంది.

---

19. వేంకటాధ్వరి రచించిన 'విశ్వగుణాదర్శము'లో కూడ ఈ ప్రస్తావన ఉంది.

'నివేదితస్యాత్రరమా సఖాయ - నీచాహృతస్యాపి కిమోదనాదేః।
భక్త్యాశనం హంత భవార్జితానాం - మహాంహసాం నాశనమా మనంతి॥
(155)

తా॥ ఈ జగన్నాథక్షేత్రమందు జగన్నాథునకు నీచులు తెచ్చిన అన్నాదులను కూడ భక్తితో భక్షించుటయు మహాపాపములకు నాశకమని పెద్దలు తలచుచున్నారు.

చర్మంతో తయారుచేసిన టోపీ ధరించిన వాళ్ళను ఆలయంలోకి రానివ్వ రట! ఆ సమయంలో శర్మగారు టోపీ ధరించి ఉండటం వల్ల, పోలీసు జవానులు దాన్ని పరిశీలించిన తర్వాతే ఆయనను వెళ్ళనిచ్చారని పేర్కొన్నారు.

మెయిలు బండి మీద వాల్తేరు ద్వారా సింహాచలం వెళ్ళారు. ఇక్కడి గుడికి ధర్మకర్త విజయనగరం జమీందారు. "ఇక్కడ స్వామి వరహావతారము. నరసింహావతారములోనికి మార్చిరి. కారణము తెలియదు" అని ప్రాతూరి వారి సందేహం.[20] శతాబ్దం క్రితం సింహాచలం దర్శించిన వీరాస్వామయ్యగారు ఇక్కడి స్వామి పేరు వరాహ నరసింహమూర్తి అనే పేర్కొంటూ 'అనేక జలధారలు స్రవించే పర్వతము మీద వరాహాకృతిగా ఆ మూర్తి వొక మందిరములో వసించి వున్నాడు' అన్న మాటలు ఆలోచింపదగినవే.[21] వీరాస్వామయ్య గారు అప్పటికి 200 వైష్ణవుల యిండ్లున్నాయన్నారు కాని ఈ విషయాన్ని శర్మగారు తడవనే లేదు.

రాజమహేంద్రవరం నుండి బెజవాడకు చేసిన ప్రయాణం, ప్రయాగ నుండి కాన్పూరుకు చేసిన ప్రయాణాన్ని గుర్తుకు తెచ్చిందట! అక్కడ కుంభ మేళా కారణంగా అసంఖ్యాక జనం వస్తే, ఇక్కడ 'శారదాబిల్లు' భయంవల్ల రైళ్ళలో పట్టకాలని ప్రజలు ప్రయాణించారని, ఒకరిమీద మరొకరు కూర్చుని, నిల్చొని ప్రయాణం చేశారని శివరామ శర్మగారు వ్రాశారు.[21/1]

---

20. నా యాత్ర— పేజీ 139.
21. కాశీయాత్ర చరిత్ర—ఏనుగుల వీరాస్వామయ్యగారు. పేజీ 333.
21/1. హరవిలాస శారదాగారి బాల్య వివాహ నిషేధ చట్టము. పద్నాలుగేండ్లు నిండితేనె కాని ఆడపిల్లలకు పెండ్లిచేయరాదన్నది ఆ శాసన సారాంశం. ఐతే అన్నేండ్లు పెంచితే పిల్ల పెద్దమనిషవుతుందనీ, రజస్వలానంతరం పెండ్లి చేస్తే 'బ్రాహ్మణికం బండలైనట్టే'నని, శూద్రులతో కలిసినట్లేనని 'శారదలేఖలు' పేజీ 28లో సనాతన ధర్మపరుల ఆలోచనగా పేర్కొన బడింది. అందుకే తొందరపాటుతో ముందుగానే హడావిడిపడి అనేక అక్రమ వివాహాలు చేయించారు— 'శారద లేఖలు' — కనుపర్తి వర లక్ష్మమ్మ.

## 2. సుబ్బయ్య గారి "నవభారత సందర్శనం"*

ఇది కిసాన్ యాత్ర. ప్రజాస్వామ్య రైతుకూలీ ప్రజారాజ్య ఆశయ సాధనకు రైతాంగాన్ని, గ్రామీణ ప్రజానీకాన్ని సమాయత్త పరచడం ఈ యాత్రల ముఖ్యోద్దేశ్యం.

కర్షకోద్యమ సంధానకర్త ఆచార్య ఎన్ జి. రంగా నాయకత్వాన ఇచ్ఛాపురం నుండి చెన్నపట్టణం దాకా మొట్టమొదటి సారిగా చారిత్రాత్మకమైన రైతు యాత్ర నిర్వహింపబడింది. అదే ఈ రైతు యాత్రకు ప్రేరణ. అందుకే 'శ్రీ రంగా కిసాన్ యాత్ర' పేరుతో ఆంధ్రదేశం నుండి 300 మంది యువకులు ఉత్తర దేశపు యాత్రకు బయలుదేరారు వారిలో కె.వి. సుబ్బయ్య గారొకరు. 15-5-1956 నుండి 26.6-1956 దాకా 45 రాజులపాటు సాగిన ఈ కిసాన్ యాత్ర ఉత్తరాపథంలో ఆంధ్ర రైతు విజయ యాత్రగా వర్ణించబడింది. మొత్తం 6,000 మైళ్ళ (9,660 కి.మీ.) దూరం ప్రయాణించిన యాత్ర ఇది.

కె.వి. సుబ్బయ్యగారు యాత్రానంతరం తమ అనుభవాలను క్రోడీకరించి యాత్రా గ్రంథంగా రూపొందించారు. దాని పేరు 'నవభారత సందర్శనం.' 254 పుటలున్న ఈ పుస్తకం జూలై 1957 న ముద్రింపబడింది.ఆచార్య రంగాకు ఈ గ్రంథం సమర్పించబడింది.

రచయిత ఏ ప్రాంతాన్ని దర్శిస్తే ఆ ప్రాంతపు ఒకప్పటి వైభవాన్ని, గత చరిత్రను స్మరిస్తూ వచ్చారు.

### i) యాత్రామార్గాలు :

వీరు యాత్రా స్పెషల్‌లో దేశమంతా చుట్టివచ్చారు. వరుస క్రమంలో పేర్చితే యాత్రా మార్గమిట్లా ఉంపె :- ఒంగోలు - చీరాల - నిడుబ్రోలు - తెనాలి- విజయవాడ - పండరీపురం - పూనా - బొంబాయి - నాసిక్ - ఔరంగాబాద్ - ఎల్లోరా - సాంచీ - ఆగ్రా - మధుర - ఢిల్లీ - హిస్సార్ - పటాన్ కోట - శ్రీనగర్ - గుల్మార్గ - పహెల్ గావ్ (తిరుగు ప్రయాణం) పటాన్ కోట-

* కె వి. సుబ్బయ్య గారు.

అమృతసర్ - భాక్రానంగల్ ప్రాజెక్టు - గంగాయమునా లోయ - హరిద్వార్ - ఋషీకేశ్ - డెహ్రాడూన్ వ్యాలీ ప్రాజెక్టు-సింద్రీ ఎరువుల ఫ్యాక్టరీ-చిత్తరంజన్-జమ్‌షెడ్‌పూర్ - కలకత్తా - ఉత్కళ (కళింగదేశం) - కోణార్క్ - విశాఖ పట్టణం - వాల్తేరు - సింహాచలం - విజయవాడ.

## ii) యాత్రా వివరాలు :

విజయవాడ నుండి నేరుగా పండరీపురం వెళ్ళినట్లుగా సుబ్బయ్యగారు వ్రాశారు. పండరీపురంలో మహారాష్ట్ర స్త్రీలు - ముఖ్యంగా రైతు వనితల బిగువైన కట్టు, విశాల ఫాలభాగంలో వెడల్పయిన బొట్టు, నడకలోని హుందాతనం రచయితకు ముచ్చటగొలిపాయి. పురుషులకు మోకాళ్ళక్రిందికి పంచెకట్టు, పొట్టి చొక్కాలు, మనిషికి మించిన తలపాగాలు - వారిని చూస్తుంటే వారి పల్లెటూరి జీవితం కళ్ళకు కట్టినట్లుగా ఉంటుందనీ, దుస్తులు మురికిగా వున్నా శ్రమజీవులని వారి ముఖాలు చెప్పకచెప్తున్నాయని వ్రాశారు.

కాశ్మీరులోయలో సామాన్య జనుల విషయమే సుబ్బయ్యగారి మనస్సుకు కష్టంగా తోచింది. మురికి దుస్తులమధ్య కాశ్మీరు యువతుల సౌందర్యం, బురద నీళ్ళలో ముత్యంలాగా మెరుస్తుందని చెప్తూ, పరిశుభ్రమైన దుస్తులు ధరిస్తే వారు దేవతాకన్యలను మరపించగలరని ఆయన భావించారు.

ముస్సోరిలో ఉన్నంతసేపు విదేశంలో ఉన్న అనుభూతి కలిగిందట! అనేక వేషభాషలవల్ల నాగరికత ఒక అడుగు ముందుకు వేసినట్లనిపించింది. సిగ్గుతనం కలిగిన స్త్రీలు అరుదనీ, దారి చూపడంలో అక్కడ సంచరించే స్త్రీలే వీరికెంతో సహాయపడ్డారనీ, షాపుల్లో లావణ్య యువతులే గొప్ప ఆకర్షణ అనీ గ్రంథకర్త పేర్కొన్నారు.

హిందూ ముస్లిం ఐక్యతకు లక్నో నిదర్శనంగా ఉందంటూ, లక్నోలోని హజరత్‌గంజ్ వీథిలో సంచరించే స్త్రీ పురుషులను హిందువో, ముస్లిమో గుర్తించడం కష్టమన్నారు. ఆ నగరంలో రెండు మతాలవారు అన్నివిధాలా కలిసి పోయారట!

సుప్రసిద్ధ పారిశ్రామిక నగరమైన జమ్‌షెడ్‌పూర్ (టాటానగర్) బహు భాషా కూడలి. యావద్భారతదేశాన్ని ఇక్కడే చూసినట్లు రచయిత చెపారు. శ్రమజీవులంతా ఒకచేననీ, ఒకే మతస్థులనీ ఈ నగరం నిరూపిస్తున్నట్లుగా ఉందట!

కె.వి. సుబ్బయ్యగారు విజయవాడ నుండి బయలుదేరి పండరీపురం చేరే వరకు మధ్య దారిలో తమ బృందం ఎక్కడా మజిలీ చేసినట్లు వ్రాయకపోవడం వింతగా ఉంది. తెలంగాణా జిల్లాల గుండానే ప్రయాణించినప్పటికీ వాటి ఊసు ఎక్కడా ఎత్తనేలేదు.

ఈ పుస్తకానికి ముందుమాట వ్రాస్తూ 'వాహిని' పత్రిక సంపాదకులు ఉమా మహేశ్వర రావుగారు "ఈ పుస్తకం ఒక్కసారి చదివితే దేశం తిరిగి చూడలేక పోయామే అన్న దిగులు ఎవరికీ ఉండదు" అన్న మాటలు సత్యదూరం కాదని చెప్పవచ్చు.

ఇది తీర్థయాత్ర కాదు, కాబట్టి ఎక్కడా ఆలయదర్శనం చేసిన జాడలు కనిపించవు.

## 3. ఖులుసు వారి "నా ఉత్తర దేశయాత్ర"*

మద్రాసులోని కెల్లెట్ హైస్కూలు ఉపాధ్యాయుల ఉత్తర దేశయాత్ర ఇది.[22] 17-9-1956 నుండి 9-10-1956 దాకా మద్రాసు నుండి ప్రారంభమై ఉత్తర దేశమంతా తిరిగి మూడు వారాల్లో యాత్ర పూర్తి చేశారు. ఈ బృందంలో మొత్తం 52 మంది ఉన్నారు[23] ముఖ్యమైన స్థలాల్లో మాత్రమే ఆగే గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌కు వీరి టూరిస్టు కారు - అనగా ప్రత్యేక సదుపాయాలున్న రైలు పెట్టె తగిలించబడింది. ఈ పెట్టెలో 36 మంది సుఖంగా యాత్ర చేయడానికి అనుకూలంగా ఉంటుందట! కాని వీరు 52 మంది ప్రయాణించారు.

* ఖులుసు వేంకట రమణయ్య గారు.

22. మద్రాసులో ట్రిప్లికేన్‌లో ఉంది ఈ స్కూలు.

23. 40 మంది పురుషులు, 7గురు మహిళలు, ముగ్గురు వంటవారు, ఇద్దరు సేవకులు.

యాత్రానంతరం వేంకట రమణయ్యగారు తమ యాత్రానుభవాలను ఒక్కొక్క ప్రాంతం పేరు మీదుగా వ్యాసాలుగా రచించారు. ఇవి మొదట ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రికలో ప్రకటింపబడ్డాయి. తరువాత మిత్రుల కోరికతో రచయిత మే, 1956లో 'నా ఉత్తర దేశ యాత్ర' అన్న పేరుతో గ్రంథస్థం చేశారు. 181 పుటల గ్రంథమిది.

వేంకట రమణయ్య గారి బృందం యాత్ర చేస్తూ విడిది చేసిన ముఖ్య స్థలాలు: ఆగ్రా, మధురానగరి, ఢిల్లీ, హరిద్వారం, హృషీకేశం, అలహాబాదు (ప్రయాగ), త్రివేణీ సంగమం, వారణాసి, గయ, కలకత్తా, చివరగా మద్రాసు,

వేంకట రమణయ్యగారు ఈ యాత్రా గ్రంథాన్ని పై మజిలీల పేర పది శీర్షికలుగా విభజించారు. అక్కడి స్థలవిశేషాన్నిబట్టి సముచిత విశేషణాలతో వాటికా పేర్లు పెట్టారు. ఉదా॥ మనస్సును కదిల్చే మధురానగరి, కన్నుల పండువైన కలకత్తా.

ఈ ప్రసిద్ధ స్థలాల మధ్య తటస్థపడే స్టేషన్ల వివరాలను, అక్కడికి చేరుకునే వేళలను గురించి కూడ మరచిపోకుండా గుర్తు పెట్టుకున్నారు.

## i) యాత్రామార్గం :-

మద్రాసు - గూడూరు - నెల్లూరు - బిట్రగుంట - ఒంగోలు - బెజవాడ - డోర్నకల్లు - కాజీపేట - బలార్షా - చాందా - వార్థా - నాగపూరు - ఆమ్లా - ఇటార్సీ - భోపాల్ - బినా - ఝాన్సీ - గ్వాలియర్ - ఆగ్రా కంటోన్మెంటు - మధుర - న్యూఢిల్లీ - ఘాజియాబాదు - మీరట్ - సహరాన్‌పూర్ - లక్సార్ - హరిద్వారం - హృషీకేశం-లక్సార్ - వజీబాబాద్ - కోట్ ద్వారా - మురాదాబాద్ - బారైలీ - షాజహాన్ పూర్-బాలామావు - లక్నో - బారాబంకీ - ఫైజాబాద్ - సుల్తాన్ పురం - అలహాబాద్ - పీర్జాపూర్ - మొగల్ సరాయి - బనారస్ కంటోన్మెంటు - సాసారాం - డెహ్రి - సోన్ ఈస్ట్ బ్యాంక్ - గయ-హజారీ బాగ్ - గోమో - ధన్బాడ్ ఆసన్‌సోల్ - చిత్తరంజన్ - బర్ద్వాన్ - హౌరా - ఖరగ్‌పూర్ - టాటానగర్ - పూరీ - జగన్నాథం - విశాఖపట్నం - బెజవాడ - మద్రాసు.

భారతదేశంలోని ఒక్క పడమటి రైల్వేలో తప్ప మిగతా రైల్వే లన్నింటిలో దాదాపు నాలుగు వేల మైళ్ళు (6,450 కి.మీ) ప్రయాణం చేశారు. సౌకర్యమైన టూరిస్టు కారులో శ్రమలేకుండా యాత్రచేయడానికి మనిషికి ఒక్కంటికి 150 రూ॥ ఖర్చయిందట! ఈ యాత్రలో తమిళనాడు, ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్, బీహార్, పశ్చిమబెంగాల్, ఒరిస్సా రాష్ట్రాలు చుట్టివచ్చినట్లయింది.

## ii) యాత్రా విశేషాలు :-

తాము ప్రయాణించిన మార్గంలో ఎదురైన స్టేషన్లలో ప్లాట్‌ఫారాల పొడుగును బట్టి విజయవాడ పెద్దస్టేషననీ, ఝాన్సీ అంత ఆకర్షణీయంగా వున్న స్టేషనూ, విశాలంగా వున్న రైల్వే యార్డు మరెక్కడా కానరాలేదనీ రమణయ్యగారు వ్రాశారు.

మద్రాసు సెంట్రల్ స్టేషన్లో బయలుదేరిన ఉపాధ్యాయుల బృందం ఎక్కడా ఆగకుండా ఆగ్రా పట్టణంలో మొదటి మజిలీ చేసింది.

ఈ బృందం బస్సులో ప్రయాణించి ఫతేపూర్ సిక్రీ, సికంద్రా, అక్బరు కోట, దయాల్బాగ్, తాజ్‌మహల్ సందర్శించింది. ఆగ్రాలో రోజంతా బస్సులో తిరిగినందుకు బస్సు కిరాయి వందరూపాయలు కాగా న్యూఢిల్లీలో మరో ఇరవై రూపాయలు ఎక్కువే అయిందట! ఐతే ఎక్కువ దూరం తిరిగింది ఆగ్రాలోనే ననీ, ఈ వ్యత్యాసం బహుశా ఢిల్లీ రాజధానీనగరం కావటంవల్లనే కావచ్చుననీ రచయిత అభిప్రాయం వెలిబుచ్చారు.

హరిద్వారం వెళ్ళేవారు గంగాజలాన్ని అక్కడే పట్టుకోవడం మంచిదనీ, అక్కడిదాకా వెళ్ళలేనివారు ప్రయాగలో పరిశుద్ధమైన గంగాజలాన్ని పాత్రలలో నింపుకొని సీలు చేయించుకోవాలనీ, వెంకట రమణయ్యగారు సూచించారు. ప్రయాగవద్ద యమున కలవకముందే పట్టుకోవాలట! కాశీలోని గంగాజలం అసలు గంగాజలమే కాదు, దానిలో యమున నీరు కలిసి ఉంటుంది అన్నారు.

హరిద్వారం స్టేషన్ భవనానికి ముందుగా రోడ్లమధ్య శివుని శిలావిగ్రహం ప్రతిష్ఠించబడి ఉంది. ఎక్కడైనా వ్యక్తుల విగ్రహాలను ఇట్లాంటి స్థలాల్లో ప్రతిష్ఠించడం సామాన్యంగా జరుగుతుంది. కానీ ఇక్కడ దేవతా విగ్రహం రచయితకు వింతగానే తోచింది.

హరిద్వారంలో తీర్థ పురోహితులు వారికి కమీషను ఇచ్చే దుకాణాలకే యాత్రికులను తీసుకువెళ్తుంటారనీ, అందువల్ల బేరసారాలలో స్వబుద్ధిని వినియోగిస్తూ, తీర్థవిధులకు పురోహితుల నాశ్రయించడం మంచిదని గ్రంథకర్త స్వానుభవంతో హెచ్చరించారు.

లక్నోను లక్ష్మణపురి అంటారు. ఇది అనుక్షణమూ మారుతూ ఉండే నాగరికతకు కేంద్రం కాబట్టి ఆ ప్రాంతాలవారు దీన్ని 'ఇండియన్ పారిస్' అంటారట!

1936 లో రచయిత కలకత్తాకు వెళ్ళినప్పుడు హౌరా స్టేషన్‌కు దగ్గరలో ఒక బ్రిడ్జి ఉండేది. అది ఈ ప్రయాణంలో కానరాలేదు. అది పడవలమీద నిర్మింపబడి, స్టీమర్లువెళ్ళే సమయంలో మధ్యభాగం తొలగించడానికి అనుకూలంగా ఉండేది. ఈ యాత్రాకాలం నాటికి అంటే రెండు దశాబ్దాల తర్వాత కనిపిస్తున్న బ్రిడ్జి స్టేషన్‌కు కొంత ఎగువన ఉంది. ఇది సస్పెన్షన్ బ్రిడ్జి. దీనికి ఈ ఒడ్డున ఆ ఒడ్డున తప్ప మధ్యలో ఎక్కడా స్తంభాలు లేవు. ట్రాములకు వేరే లైను, మనుషుల రాకపోకలకు వేరే ఏర్పాట్లూ ఉన్నాయని రచయిత పేర్కొన్నారు.

ప్రయాణంలో తన అనుభవాలను గ్రంథస్థం చేశానని రచయిత మొదటే చెప్పుకున్నారు. కాని దీనిలో ఆయా స్థలాల చారిత్రక ప్రసిద్ధితో పాటు యాత్రీకులకు మార్గదర్శనం చేసే గుణం ఉంది తప్ప సాహిత్యపు విలువలకు కాని, అనుభూతులకు కాని ఆస్కారం తక్కువ. రమణయ్యగారు ఒకచోట చెప్పినట్లు వీరి యాత్రోద్దేశం 'దేశం చూడడం ప్రధానం, తీర్థవిధులు ముఖ్యం కాదు'- పేజీ. 82.

మొత్తమ్మీద ఇది ప్రణాళికా బద్ధమైన యాత్ర.

## 4. రామబ్రహ్మంగారి "మా విజ్ఞాన యాత్ర"*

ఇది పరిశీలక యాత్ర ఆంధ్రప్రదేశ్ భూమి తనఖా బ్యాంకు, హైదరాబాదువారు వారి పాలక వర్గ సభ్యులతోపాటు ఉత్తర దేశంలోని ఇతర బ్యాంకుల

* వేగుంట కనక రామబ్రహ్మంగారు.

పనితీరులను పరిశీలించడం కోసం చేసిన Study Tour. యాత్ర చేసిన సభ్యుల సంఖ్య 17. ఈ టూర్‌లో పంజాబు, హర్యానా, హిమాచలప్రదేశ్, కాశ్మీర్, ఢిల్లీ ప్రాంతాలలోని సహకార భూమి తనఖా బ్యాంకులను పరిశీలించి వచ్చారు. యాత్రానంతరం వాళ్ళలో సభ్యుడైన వేగుంట కనక రామబ్రహ్మం గారు తమ యాత్రాను భవాలను 'మా విజ్ఞాన యాత్ర' అన్న పేరుతో పుస్తకంగా ముద్రింపించారు. ఇది (7-8-1969 - 21-8-1969) 15 రోజుల యాత్ర [24]

దక్షిణ ఎక్స్‌ప్రెస్‌లో హైదరాబాదు నుండి బయలుదేరి మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్, పంజాబు రాష్ట్రాల గుండా ప్రయాణించి ఢిల్లీ చేరుకున్నారు.

ఢిల్లీకి 160 మైళ్ళ (260 కి మీ ) దూరంలోని పంజాబు రాజధాని చండీఘర్‌కు డీలక్స్ బస్సులో వెళ్ళారు. దారిలో పానిపట్, కురుక్షేత్రం, కర్నాల్, అంబాలా వంటి చరిత్ర ప్రసిద్ధి పట్టణాలు తగుల్తాయి.

తూర్పు పంజాబుకు చండీఘర్ కొత్తగా నిర్మించిన రాజధానీ నగరం కాబట్టి ఇక్కడ పెంకుటిళ్ళు, పూరిళ్ళు మచ్చుకైనా కనిపించవట! భారతదేశంలోనే కాక ప్రపంచంలోనే దీన్ని సుందర నగరంగా పేర్కొన్నారు రచయిత.

---

24. 'మా విజ్ఞాన యాత్ర' గ్రంథంలో ముందు పుటలు లేకపోవడంవల్ల, రచయిత పుస్తకంలో తేదీలు నెలలే తప్ప ప్రయాణించిన సంవత్సరం పేర్కొనకపోవడంవల్ల, ఖచ్చితంగా యాత్ర చేసిన సంవత్సరం తెలియడంలేదు. ఐతే పుస్తకంలోనే ఇచ్చిన కింది వివరం ప్రకారం ఆగస్టు 1969 లో వీరు యాత్ర చేసినట్లు తెలుస్తున్నది! "ఆగస్టు 15 వ తేది మధ్యాహ్నానికి మన భారత రాజధాని చేరుకున్నాం. అచ్చట రాష్ట్రపతి ఎన్నికల హడావుడి" (పేజీ 38) నెహ్రూగారి మరణానంతరం ఆగస్టు నెలలో జరిగిన రాష్ట్రపతి ఎన్నిక 1969 లోనే. ఈ ఎన్నికలో వరాహగిరి వెంకటగిరి స్వతంత్ర అభ్యర్థిగా పోటీచేసి గెలుపొందారు. ప్రధాన ప్రత్యర్థి నీలం సంజీవరెడ్డిగారు.

8 వ తేదీ ఉదయం భాక్రానంగల్ ప్రాజెక్టును సందర్శించడానికి చండీఘర్ నుండి ఐదు కార్లలో వెళ్ళారు భక్రాడామ్ ప్రపంచంలో కెల్లా ఎత్తయిన డామ్‌గా ప్రసిద్ధి చెందిందన్నది సామాన్యంగా అందరూ చెప్పేదే. రచయిత మరో విధంగా పోల్చి చూపారు: "మనదేశంలో కల్లా ఎత్తయిన కట్టడంగా పేరొందిన కుతుబ్ మినార్లు మూడింటిని ఒకదానిపై ఒకటి పేరిస్తే వచ్చే ఎత్తు వుంటుంది. ఒక లక్ష గదులతో 60 అంతస్తుల స్కై స్క్రేపర్ కున్నంత వైశాల్యముంది యీ డామ్"[25] "భక్రాడామ్ కుపయోగించిన సిమెంటు భూమధ్యరేఖ చుట్టూ 9 అడుగుల వెడల్పుగల సిమెంటు రోడ్డు నిర్మాణానికి సరిపోతుందట!"[26] దీన్ని బట్టి ప్రపంచంలో ఈ డామ్‌కు ఎంత విశిష్టస్థానం ఉందో ఊహించు కోవచ్చు.

చండీఘర్ కు 80 మైళ్ళ (130 కి.మీ) దూరంలో వున్న సిమ్లాకు హిమాలయాలపై ప్రయాణం. ఎనిమిది వేల అడుగుల ఎత్తున ఉన్న సిమ్లాకు రైలులో ప్రయాణం విచిత్రానుభవంగానే తోచిందట! రాత్రికి తిరుగు ప్రయాణం ఛండీఘర్ కు.

చండీఘర్ నుండి 150 మైళ్ళ (240 కి.మీ) దూరంలో వున్న అమృత్ సర్‌కు బయలుదేరారు. ఇక్కడి కోపరేటివ్ సెంట్రల్ బ్యాంకు ఐదంతస్తుల పెద్ద భవనం. ఇది బాంబు ప్రూఫ్ భవనమని రచయిత వ్రాశారు.

పంజాబు ప్రజల్లో నిజాయితీ ఎక్కువని, ఖాళీగా కూర్చోవడమంటే వారికి నచ్చదనీ, అందుకే అక్కడ 'అడుక్కునేవాళ్ళు కంచు కాగడా వేసినా కనిపించరు, భిక్షుక వృత్తిని చాలా నీచంగా పరిగణిస్తారు' అని పేర్కొన్నారు.[27]

పంజాబు, ఢిల్లీలలో స్త్రీ పురుషులలో పాశ్చాత్య అనుకరణ ఎక్కువట! లిప్‌స్టిక్, స్లీవ్‌లెస్ జాకెట్లు స్త్రీలకు సాధారణం అంటూ అక్కడ స్త్రీలు కార్లు, మోటారు సైకిళ్ళు నడిపే దృశ్యాల చూసి రచయిత ఆశ్చర్యపడ్డారు.

---

25. మా విజ్ఞాన యాత్ర. పేజీ. 11,
26. మా విజ్ఞాన యాత్ర. పేజీ. 15.
27. మా విజ్ఞాన యాత్ర. పేజీ. 27.

సహజం. కొంతమంది చారిత్రకాధారాలతో విప్పిచెప్తే, మరికొందరు కర్ణాకర్ణిగా విన్న విశేషాలను ఏకరువు పెడతారు. ఉత్తర భారత యాత్ర చేసిన నలుగురు యాత్రికుల అభిప్రాయాలు అనుభవాలు ఏ విధంగా ఉన్నాయో ఇక్కడ వివరించడం అవసరం.

తాజ్‌మహల్ నిర్మాణ వ్యయం గురించి యాత్రికులు భిన్నాభిప్రాయాలు వ్యక్తం చేశారు.

మే 1956లో తాజ్‌మహల్‌ను కె వి. సుబ్బయ్యగారు 400 కోట్ల రూపాయల వ్యయంతో ఇరవై వేలమంది కూలీలు ఇరవై సంవత్సరాల పాటు నిర్మించారనీ, ఖజానాలోని సొమ్మంతా రాళ్ళ క్రింద ఖర్చై పోయిందనీ వ్రాస్తూ 'ఒక్కొక్క కూలీకి లేదా కళాకారునకు నెలకు మూడు నాలుగు రూపాయల కంటే హెచ్చు కూలీ లభించడం దుర్లభమైనది' అన్నారు.[30] ఈ ప్రకారంగా లెక్కలు కట్టి చూస్తే కూలీ వ్యయం రెండు కోట్లకు మించడంలేదు.

బులుసు వేంకట రమణయ్య గారు అక్టోబర్ 1956లో అనగా మరి ఐదు నెలలకు ఉత్తరదేశ యాత్ర చేశారు. ప్రతిదినమూ ఇరవై వేలమంది కూలీలు 17 సంవత్సరాలు పనిచేశారని ఆయన పేర్కొన్నారు. ఇవి ఊహించి వ్రాసింది కాదని ఆయన వ్రాతలే తెలుపుతున్నాయి. 'తాజ్‌మహలు పెద్ద ద్వారం దగ్గర లభింపబడిన వివరాలను బట్టి నిర్మాణం 1631లో ప్రారంభమై 1648లో పూర్తి అయినట్టు తెలుస్తున్నది '[31] ఐతే ఈయన కూడ తాజ్‌మహల్ నిర్మాణ వ్యయం గురించి ఖచ్చితంగా చెప్పకుండా "నిర్మాణానికి ఆరుకోట్ల రూపాయలు ఖర్చాయినాయట" అని శ్రుత పాండిత్యాన్నే ప్రదర్శించారు.

హిందువుల గొప్పతనాన్ని చాటిచెప్పే ప్రతి చిహ్నాన్ని మొగలులు నాశనం చేశారు. వీలులేని చోట్ల మహమ్మదీయ నిర్మాణాల వలె మార్పులు చేశారు. దీనికి సజీవోదాహరణగా ప్రాతూరి వేంకట శివరామ శర్మగారు 'అశోకుని

30. నవభారత సందర్శనం - పేజీ 47.

31. నా ఉత్తర భారతయాత్ర - పేజి 37.

యినుప స్తంభము'ను, 'కుడ్బిమైనార్'ను పేర్కొన్నారు.[32] యాత్రా సందర్భంగా అశోకుని ఇనుప స్తంభాన్ని పగుల గొట్టడానికి చేసిన ప్రయత్నాలకు ఎరుకగా సుత్తి దెబ్బల గుర్తులు కనిపించినట్లు వ్రాశారు. ఈ స్తంభం మహమ్మదీయులదని తెలిపే శాసనాలను అరబ్బీ భాషలో చెక్కారట! పృథ్వీరాజు కుమార్తె 'బేలా' వినోదార్థం కట్టించుకున్నదే కుతుబ్ మీనార్, దాని చుట్టుపక్కల ఉన్న మంటపాలు అని వ్రాస్తూ, దీనికి సంబంధించిన శాసన ఫలకాలను ఊడబెరికి వాటి స్థానంలో అరబ్బీ శాసనాల రాళ్ళను బిగించినట్లు స్పష్టంగా గమనించినట్లు పేర్కొన్నారు. కాబట్టి 'బేలాగారి యొక్క గాలిగోపురం, కుడ్బిమైనార్ గాలి గోపురమైనది' అని నిర్ణయించారు.[33] పూర్వ చరిత్ర ఆధునిక చరిత్ర తెలిసిన హిందువు వీరికి విషయాలన్నీ ఎరుక పరచాడట!

వేంకట రమణయ్యగారు ఈ కథల జోలికి పోకుండా కుతుబ్ మీనార్ '13వ శతాబ్దంలో(ని) రెండవ భాగంలో కుతుబుద్దీన్ నిర్మించింది' అని వ్రాశారు. దీనికి దగ్గరలో ఉన్న అశోకస్తంభం పేరు చెప్పకుండా 'కుతుబ్ మీనార్‌కు సమీపంలో ఒక ఇనుపస్తంభం వున్నది. దాని ఎత్తు రమారమి ముప్పయి అడుగులు వుంటుంది. అంత పెద్ద స్తంభాన్ని — పూర్తిగా ఇనుముతో తయారైన దానిని ఆకాలంలో ఆవిధంగా నిలపడం మానవ శక్తికి అతీతంగా తోచక మానదు" అన్నారు.[34]

జర్మనీ యుద్ధంలో తాము పొందిన విజయానికి గుర్తుగా నాలుగు స్తంభాలను ఇంగ్లీషువారు కట్టించారనీ, ఇవి పూర్వపు రాజులు నిర్మింపజేసిన స్తంభాల వలెనే ఉన్నాయనీ శివరామశర్మగారు వ్రాశారు. ఈయన వీటి పేరు సూచించలేదు కాని బులుసు వారి యాత్రలో వర్ణించిన దాన్నిబట్టి ఇది 'ఇండియా గేటు'గా తెలుస్తున్నది. 1914 వ సంవత్సరంలో జరిగిన ప్రపంచ మహాయుద్ధంలో మిత్ర మండలి పక్షాన భారత సైనికులు పోరాడి విజయం సాధించి పెట్టగా 'ఆ వీరుల స్మృతి చిహ్నంగా ఈ గేటు నిర్మించబడినది. ఇండియా గేటు ఇదే' అని స్పష్టం చేశారు[35]

---

32. కుతుబ్ మీనార్ వీరి ఉచ్చారణలో 'కుడ్బిమైనార్' అయింది.
33. నా యాత్ర - పేజి 75.
34. నా ఉత్తరదేశ యాత్ర — పేజీ 54.
35. నా ఉత్తర దేశ యాత్ర. — పేజీ 67.

1956 ప్రాంతంలో సైకిల్ మీద ఇద్దరు ప్రయాణించడమే ఆంధ్ర దేశంలో నేరంగా పరిగణింపబడేది. అందుకే సైకిల్ తొక్కే విషయంలో ఢిల్లీలో వున్న నియమనిబంధనలకు వేంకట రమణయ్య గారు ఆశ్చర్యం వ్యక్తం చేశారు. 'ఇద్దరు ఒక సైకిలు మీద ప్రయాణం చెయ్యడం అక్కడ తప్పుకాదు. ఒక సైకిలు మీద ముగ్గురు కూడా ప్రయాణం చెయ్యడం చాల చోట్ల కానవచ్చింది. ఈ రీతిగా సైకిలుకు లైటు లేకున్నా తప్పుగా లెక్కకు రాదు.'[36]

పంజాబులో సైకిలు వెనకాల భార్యను, ముందు బిడ్డను కూర్చోబెట్టుకుని దొక్కుకుంటూ పోతూవుండడం ఎక్కువగా కనిపిస్తుందని రామబ్రహ్మంగారు పేర్కొన్నారు [37]

ప్రయాగలో త్రివేణీ సంగమ స్థానంలో ఇదివరకు భరద్వాజ మహర్షి ఆశ్రమం ఉండేది. ఇది సుప్రసిద్ధ క్షేత్రం. కె. వి. సుబ్బయ్యగారి యాత్రాకాలం నాటికి (జూన్ 1956) ఆశ్రమం స్థానంలో ఆలయమున్నదని వ్రాశారు. అక్కడ ఇంటికొక భరద్వాజుని బొమ్మ వుంటుందట. పూజారులేమో స్త్రీలు. పొరపాటున యాత్రికులు ఒక బొమ్మకు దక్షిణ చెల్లిస్తే మిగతా అన్ని బొమ్మలకూ సమర్పించవలసినదే. లేకపోతే చేయిబట్టి లాక్కొనిపోయి మరీ చెల్లింపుకుంటారని సుబ్బయ్యగారి అనుభవాన్నిబట్టి తెలుస్తున్నది.

అదే సంవత్సరం యాత్ర చేసిన రమణయ్యగారు ఇంత వివరంగా ఈ అనుభవాన్ని వ్రాయలేదు కాని, వారు కూడ బాధలకు గురైనట్లు తెలుస్తున్నది. 'అక్కడి పూజాపునస్కారాల విషయంలో స్త్రీలదే యాజమాన్యం! వివిధ దేవతల దర్శనంకోసం వాళ్ళు నిర్బంధించగా అక్కడి నుండి తప్పించుకురావడమే విశ్వ ప్రయత్నమైంది '[38] ఢిల్లీలో ఆనంద భవనానికి సమీపంలోనే ఈ ఆశ్రమం ఉన్నట్లు రమణయ్యగారు పేర్కొన్నారు!

---

36. నా ఉత్తర దేశ యాత్ర — పేజీ 53. ఐతే ఆటు తర్వాత కొన్నేళ్ళకు ఆంధ్రదేశంలో కూడ ఈ నియమాలు సడలింపబడ్డాయి. ఆ కాలంలో మన ప్రాంతంలో అలా ప్రయాణించడం నేరమే మరి!
37. మా విజ్ఞానయాత్ర. పేజీ. 19.
38. నా ఉత్తరదేశ యాత్ర, పేజీ. 106.

హరిద్వారం నుండి హృషీకేశం 20 మైళ్ళ దూరం ఇక్కడొక ధర్మశాల ఉన్నట్లు శివరామశర్మగారు చూశారు. ధర్మశాల నుండి యాత్రికులు హిమాలయ పర్వతాల మీది బదరీనాథ్, కేదారనాథ్ క్షేత్రాలకు యాత్ర చేస్తారు. ఇక్కడి ధర్మకర్త ప్రతి యాత్రికునికి నల్లని కంబళి, రానుపోను భోజన ఖర్చు ఇస్తాడు. కనుక అసలు పేరు మరచిపోయి ప్రజలు ఆయనను 'కాలీ కంబళీవాలా' అని స్మరించుకుంటారట!

వేంకటరమణయ్యగారు ఈ ధర్మశాలను 'స్వర్గాశ్రమం'గా పేర్కొన్నారు. అక్కడ తపస్సు చేసుకునే సాధుసన్యాసులకు కావలసిన భోజన సదుపాయం ఆశ్రమాధికారులే ఉచితంగా చేస్తారని ఆయన వ్రాశారు.

హృషీకేశానికి ఎగువన రెండు మైళ్ళ (3.2 కి.మీ) దూరంలో 'లక్ష్మణ ఝూలా' అనే వ్రేలాడే వంతెన ఉంది. ఇనుపమోకుల మీద నిర్మింపబడింది రామశర్మగారి యాత్రాకాలం (1930) నాటికి ఈ వంతెన మరమ్మతులో వుందట. ఐనా ఆ వంతెన మీదుగా భయం భయంగా గంగను దాటామని చెప్పుకున్నారు.

రామబ్రహ్మంగారు ఈ వంతెనను దాటిన ప్రయాణంలో వింత అనుభూతిని పొందారు. "లక్ష్మణ ఝూలా క్రింద ఏమీ స్తంభాలు లేకుండానే కేవలం ఇనుప తీగలతో ఫర్లాంగు పొడువున వ్రేలాడతీసిన అందమయిన బ్రిడ్జి. మనం అందులో వెళుతూ వుంటే వూగుతూ వింత అనుభవాన్నిస్తుంది."[39]

1966 లో ఉత్తర భారత యాత్ర చేసిన ముళ్ళపూడి కమలాదేవిగారు ఊగే వంతెనను స్ప్రింగులతో గట్టిగా కట్టారని వ్రాశారు. "లక్ష్మణ ఝూలా లోని ఇదివరకటి వంతెనను మార్చి ఇప్పటి ఇంజనీయర్లు స్ప్రింగులతో గట్టిగా కట్టారు. మునుపటి వంతెనపై నడవడానికే భయంగా ఉండేదట! ఇప్పుడు రోడ్డుపై నడిచినట్లే ఉంది."[40]

---

39. మా విజ్ఞాన యాత్ర పేజీ. 46.
40. మా ఉత్తర భారత యాత్ర పేజీ. 66.

మొగలుల పాలనలో అయోధ్య పేరు సరిగా పలకరాక 'ఔధ్'గా మార్పు చెందింది. కె.వి. సుబ్బయ్యగారికి ఇక్కడ నివాస గృహాలకంటె రామాలయాలే ఎక్కువ కనిపించాయట!

శివరామ శర్మగారు బసచేసిన కేశీరామ మందిరం కూడా రామాలయమే. ఈ మందిరంలో ఇంగ్లీషులో ఉన్న ఒక శాసనాన్ని రచయిత చూసి వ్రాసుకున్నారు. దాని తాత్పర్యమిది: దశరథుని కోటలో రాముడు పుట్టిన చోటని ప్రతీతిగల స్థలముంది. ఈ స్థలంలో ఒక ప్రసిద్ధమైన రామదేవాలయ నిర్మాణం జరిగింది. మహమ్మదీయులు దానిని నిర్మూలించి, రామవిగ్రహాన్ని సరయూ నదిలో పడవేసి, అక్కడ ఒక మశీదు నిర్మించి దాని చుట్టూ మృతుల సమాధులను కట్టారని వ్రాయబడింది. రాజా దర్శన్‌సింగ్ అయోధ్యకు రాజుగా ఉన్నప్పుడు ఆ రామ విగ్రహాన్ని సరయూ నదినుండి బయటకు తీయించి, కేశీ మందిరంలో విగ్రహ ప్రతిష్ట చేయించారట!

రామశర్మగారు శాసనం చదివి అక్కడికి వెళ్ళి చూస్తే అందులో వ్రాసినట్లుగానే ఉందట. ఆ స్థలంలో ఒక మసీదు ఉంది. దానికడ్డముగా శ్రీరామ దేవాలయం నిర్మింపబడి ఉంది కొంతకాలం క్రితమే (1930 క) హిందువులు ఈ స్థలాన్ని ఆక్రమించుకున్నారు. ఇరువర్గాల మధ్య జరిగిన పోట్లాటలో మహమ్మదీయులు చాలమంది అయోధ్యను వదలిపెట్టి లక్నోకు వెళ్ళిపోయారనీ, హిందువులు విజయ చిహ్నంగా ఈ గుడిని నిర్మించుకున్నారనీ, అప్పటి నుండి మశీదులోకి మహమ్మదీయులు రావడం లేదనీ ప్రాతూరి వారి పరిశీలనలో తెలిసిన విషయాలు.

1956 లో యాత్ర చేసిన సుబ్బయ్య గారు "ఒక ప్రసిద్ధ ఆలయాన్ని గురించి ఇప్పటికీ జగడం సాగుతూనే వున్నది. అది ఆలయంగానూ, మశీదుగానూ కనిపిస్తుంది."[41] అని స్పష్టాస్పష్టంగా వ్రాసిన ఆలయం ఈ రామాలయమే. ఇప్పటికీ 'రామజన్మభూమి' లేదా 'బాబ్రీ మసీదు' వివాదం అపరిష్కృతంగా రాజకీయాల నీడన రగులుతూనే ఉంది.[42]

---

41. నవభారత సందర్శనం - పేజీ. 156.

42. ధర్మ సంపద ఆదేశానుసారం విశ్వహిందూ పరిషత్ 9-11-1989 న అయోధ్యలోని శ్రీ రామజన్మభూమిలో మందిర నిర్మాణం చేపట్టింది.

కలకత్తాలోని హౌరా స్టేషను ఇండియాలో కెల్ల పెద్ద స్టేషననీ దీనికంటె పెద్ద రైల్వేస్టేషన్ చూచినట్లు లేదని శివరామశర్మగారు వ్రాశారు. 1956 లో కలకత్తా దర్శించిన వేంకట రమణయ్యగారు ఇదే అభిప్రాయం వెలిబుచ్చారు. ఐతే కలకత్తా స్టేషన్లో వేర్వేరుగా 13 ప్లాట్‌ఫారాలు ఉన్నాయి కాని ఇంతకంటె బొంబాయిలోని 'విక్టోరియా టెర్మినస్' పెద్దదనీ, దాన్ని తాను చూడలేదనీ తెల్పారు. ఇదే సంవత్సరం బొంబాయిని దర్శించిన వెంకట సుబ్బయ్యగారు మాత్రం ఇండియాలో అన్నిటికంటె పెద్ద స్టేషన్ బొంబాయిలోని 'విక్టోరియా టెర్మినస్' అనే పేర్కొన్నారు. ఎన్ని ప్లాట్‌ఫారాలున్నాయో తెలుపలేదు. శివరామ శర్మగారు యాత్ర చేసిన కాలం (1930) నాటికి బొంబాయి రైలు స్టేషను అభివృద్ధి చెంది ఉండకపోవచ్చునని ఊహించడానికి అవకాశముంది. ఎందుకంటే ఆయన బొంబాయి, కలకత్తా రెండు స్టేషన్‌లను చూసి ఉండికూడ కేవలం కలకత్తాలోని హౌరా స్టేషన్‌నే ఇండియాలో కెల్ల పెద్దదని పేర్కొన్నారు.

# హిమాలయ యాత్రలు

## 1. మనోహరరావుగారి-"బ్రహ్మమానససరోవర యాత్ర" *

భారతప్రభుత్వం కల్పించిన సదుపాయంతో ఈ పవిత్ర యాత్ర సాధ్య పడింది. సాహసోపేతమైన ఈ తీర్థయాత్రలో ఆయా రాష్ట్రాల నుండి 22 మంది యాత్రికులు ఈ సౌకర్యాన్ని వినియోగించుకున్నారు. ఆంధ్రప్రదేశ్ నుండి ప్రయాణించిన ముగ్గురిలో రచయితతో పాటు, శ్రీ జె. చొక్కారావుగారు కూడ ఉన్నారు. ఈ యాత్ర 19-7-88 నుండి 17-8-88 దాకా ముప్పైరోజులు సాగింది.

సులభ రవాణా సౌకర్యాలున్న ఈ రోజుల్లో కూడ కైలాసయాత్ర కఠి నాతికఠినమై, ప్రమాదాలకు నిలయంగా ఉంది. ఐతే పుణ్యతీర్థసందర్శన, ప్రకృతి సౌందర్య దిదృక్షాపరులైన భక్తిపరులు ఇట్లాంటి ఆటంకాలను లెక్క చేయరు. మిగతా యాత్రల్లో వలె కాక ఇందులో యాత్రికునికి తప్పనిసరిగా ఉండవలసినవి:- దేహదార్ఢ్యము, కార్యదీక్ష, ధనసంపత్తి, మనోధైర్యము.

రావుగారు చేసిన యాత్ర 'నియమితపంథా' గలది. నియమిత సమ యంలో ప్రతిదినం గమ్యస్థానం చేరుకోవాలి. అలాగే తిరుగు ప్రయాణం కూడ.

దారిలో ఏ ప్రమాదం సంభవించినా ప్రభుత్వబాధ్యత ఉండబోదనే నిబంధనా పత్రాలపై 10 రూ॥ స్టాంపు కాగితంపై సంతకాలు చేశారు.

యాత్రానంతరం రచయిత తన ప్రయాణానుభవాలను 'కైలాస దర్శనం' పేరుతో గ్రంథంగా రూపొందించారు. 576 పుటలున్న ఈ ఉద్గ్రంథం మార్చి 1986 న ప్రథమ ముద్రణ పొందింది.

---

* పి. వి. మనోహర రావుగారు.

## i) ప్రముఖుల అభిప్రాయాలు :

శ్రీశ్రీశ్రీ జగద్గురు శంకరా చార్యులు - తీర్థయాత్రలలో అత్యంత సాహస పూర్ణము కైలాస మానస సరోవర యాత్ర... ఈ గ్రంథము కేవలము మీ యాత్రానుభవములను ప్రతిపాదించుటయే గాక అనేక ప్రదేశముల చరిత్రలు, వేదాంత విషయములు, దేవతా స్తోత్రములు మున్నగు విషయములను కలిగి యుండి చదువరులకు ఆకర్షకముగ నున్నది... ముఖ్యముగా కైలాస మానస సరోవర యాత్ర చేయువారలకు (ఈ గ్రంథము) దారి దీపముగా నుండుగాక" అని ఆశీర్వదించారు. (పేజీ 25).

"ఎంతో ఉల్లాసంగా, సాక్షాత్కృత కైలాసంగా ఈ యాత్ర సాగిందని" డా. సి. నారాయణరెడ్డిగారు అభినందన తెలిపారు. (పేజీ 47)

"కైలాస మానస సరోవర యాత్ర చాలా దుర్గమమైంది. అతి క్లిష్టమైన మార్గాలలో, పర్వత సానువులలో, అడవులలో, నదీ మార్గాలలో కొనసాగ వలసింది. అత్యంత ప్రమాదభూయిష్టమైంది." —కోవెల సుప్రసన్నాచార్య. (పేజీ. 51).

"శ్రీ మనోహరరావు గారు భక్తి శ్రద్ధలతో నిరంతరం మానసిక పంచాక్షరీ జపంతో కైలాస మానస తీర్థయాత్ర చేసినారు...అనేక రాజకీయ దుస్థితుల మూలాన రెండు దశాబ్దాలుగా భారతీయులకు కైలాస మానస దర్శనం అసాధ్యమై అధ్యాత్మిక విదులకు మనస్తాపకారణమైంది. ఇంత కాలానికి తిరిగి సాధ్యపడటం పుణ్య విశేషం." —డా॥ ఎస్. లక్ష్మణమూర్తి. (పేజీ. 53).

రావుగారి యాత్ర నియమిత పంథాలో జరిగినది కావటంవల్ల అక్కడి ఆచార వ్యవహారాలు, సాంఘిక, చారిత్రక, భౌగోళిక విషయాలను సంపూర్ణంగా అధ్యయనం చేసి గ్రహించే వీలు కలగలేదు. అందుకే ఈ గ్రంథంలో కేవలం పౌరాణిక గాథలుకూడ సందర్భానుసారంగా పొందుపరచడం జరిగింది. రచయిత ఈ సందర్భంగా అనేక గ్రంథాలను పరిశీలించవలసి వచ్చిందని 'వినతి'లో చెప్పుకున్నారు. అందువల్ల ఈ గ్రంథం 45 అధ్యాయాలతో 576 పుటలు దాకా పెరిగింది.

## ii) ప్రయాణంలో ఎదుర్కొన్న ఇబ్బందులు : మార్గం :

1959 మార్చి 22న మనదేశం లామాకు ఆశ్రయమిచ్చిన తర్వాత 22 సంవత్సరాల దాకా చైనాదేశం కైలాస మానస సరోవర యాత్రా మార్గాలను మూసివేసింది. తర్వాత 1981వ సంవత్సరంలో ఈ యాత్రకు అవరోధాలు తొలగిపోయాయి. 1981 లో మొదటి యాత్రాబృందంవారికి ప్రతి గ్రామంలో స్వాగత సత్కారాలు లభించాయట! మనోహరరావుగారి బృందం ఈ వరుసలో నాల్గవది.

మొత్తం నెలరోజుల ప్రయాణానికి అయిన ఖర్చు రూ. 8000/-[1] కాగా వీటిలో రూ. 2750/- 'కుమాయూన్ మండల్ వికాస్ నిగమ్' వారికి చెల్లించాలి. ఇవి రానుపోను భోజన వసతి, బస్సు రవాణా ఖర్చుల గురించి పంపించవలసినవి రూ. 3500/- తక్లా కోట్ నుండి కైలాస సరోవరం దాకా బస్సు, గుర్రాలు, వంటపాత్రలు, పాలసరఫరా మొదలగు ఖర్చుల గురించీ, భోజనవసతి, కైలాస మానస పరిక్రమ ఎర్పాట్ల గురించీ చైనా వారికి వారి నాణాలలో (651 యువానులు) చెల్లించవలసి వచ్చింది[2] మిగిలినవి ఖర్చులకుంచుకున్నారు. 1 యువాను దాదాపు 5 రూ॥కు సమానం.

19-7-1988 నాటి ఉదయం 7 గంటలకు ఢిల్లీలోని 'చంద్రలోక భవనం' నుండి బస్సులో ప్రయాణం ప్రారంభమైంది. ఆ రోజు సాయంత్రం 6-45 గంటలకు 1638 మీ. ఎత్తున ఉన్న 'చంపావతి' పర్వత ప్రాంతం చేరుకుని అక్కడి బంగళాలో విశ్రాంతి తీసుకున్నారు. ప్రయాణ దూరం 455 కి.మీ. 'చంపావతి' చంద్రవంశీయుల ప్రాచీన రాజధానిగా ఉండేది. ప్రస్తుతం ఇక్కడ 6000 జనాభా ఉన్నట్లుగా రావుగారు వ్రాశారు. మార్గమధ్యంలో మురాదా

---

1. 1949 లో ఈ ఖర్చు 250 - 600 రూ॥వరకు ఉండగా, 1981 లో నాలుగు వేల రూపాయలు.
2. ప్రకాశ శాస్త్రిగారు తమ గ్రంథంలో ఇదే విషయాన్ని తెలిపారు "యాత్రికులొక దుభాషియాను వెంట నుంచుకోవటం, మన రూపాయలను టిబెట్టు వారి డబ్బులోనికి మార్చుకోవటం" అన్న రెండు పనులు 'తక్లాకోట్' చేరిన తర్వాత చేయవచ్చును. - సుందర భారత యాత్ర-2 పేజి 689.

బాద్, రాంపూర్, రుద్రపూర్, టనక్‌పూర్‌లు తగుల్తాయి. టనక్‌పూర్ నుండి చంపావతికి మధ్య 75 కి.మీ. దూరం ఘాటు రోడ్డుపైన బస్సు ప్రయాణించింది.

చంపావతి నుండి ధార్చులా 175 కి.మీ. దూరం. దారిలో తటస్థపడే గ్రామాలు: మంగ్రోలి, గార్టిల్, ధల్, సండిప్, గుర్నా, పిథోరాగడ్, నైనితాల్, కనాలిఛీనా, అస్కోట్, కాళిగంగానది, జల్జిబి, బల్వాకోట్, కాళికా, ధార్చులా.

పిథోరాగడ్ ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ఒక జిల్లా కేంద్రం. ఢిల్లీకి 555 కి.మీ. దూరంలో ఉంది. కాళిగంగానది భారత నేపాల్ సరిహద్దులను విభజించే జలరేఖ.

ధార్చులా 804 మీ. ఎత్తున ఉంది. పెద్ద వ్యాపార కేంద్రం. భారత-చైనా సరిహద్దు 'లిపుపాస్' దాకా అన్ని వస్తువులను ఇక్కడి నుండే కొనుక్కుపోవాలి. ఇక్కడ రావుగారి బృందం 10/- రూ॥ ఒకటి చొప్పున చేతికర్రలు ఖరీదు చేశారు. యాత్రానంతరం పీటిని భద్రంగా దాచిపెట్టి "తనువు చాలించిన తర్వాత కాష్టములతో పాటు దహన సంస్కారమున ఉపయోగింపవలసి యుండునట!"3

ధార్చులా నుండి 19 కి.మీ దూరంలో ఉన్న 'తవాఘాట్' వరకు ఆఖరి బస్సు ప్రయాణం. అంటే మొత్తం ఢిల్లీ నుండి బస్సులో చేసిన దూరం దాదాపు 650 కి.మీ.

తవాఘాట్‌లో బస్సునుండి సామాను దింపగానే ఉత్తర ప్రదేశ్ 'కుమాయూన్ మండల్ వికాస్ నిగమ్' వారి గుర్రాలు, గాడిదలు - వాటి యజమానులు సిద్ధంగా ఉన్నారు. ఈ సామానులు 'లిపుపాస్' (భారత చైనా సరిహద్దు భాగము) వరకు చేర్పించి, తర్వాత ఎవరివి వారికి అప్పగించడం 'నిగమ్' వారి బాధ్యత.

తవాఘాట్ నుండి దాదాపు పది రోజులు మిట్టలెక్కుతూ 110 కి మీ. ప్రయాణించి మానస సరోవరాన్ని చేరుకున్నారు. సగటున రోజూ 11 కి మీ దుర్గమ యాత్ర చేశారన్నమాట!

---

3. కైలాస దర్శనం - పేజి 29.

పర్వతారోహణలో వీరివెంట నిగంవారు ఇద్దరు, స్పెషల్ పోలీసు ఫోర్సు (SPF) వారు నలుగురు, తుపాకులతో 'వాకీ టాకీ యుక్తముగా' ఇద్దరు జవానులు తవాఘాట్ నుండి నియోగింపబడ్డారు.

మొదటి రోజు పర్వతారోహణ యాత్రచేసే వారికి అగ్ని పరీక్షలాంటిది. ఇక్కడే యాత్రికుని ఓర్పు, మనోబలము, సాహసము పరీక్షింపబడతాయి. దారిలో మెట్లు నిటారుగా 'Z' ఆకారంగా ఉన్నాయి. ఒక ప్రక్క పర్వతం, మరో ప్రక్క నది. సుమారు 5 గంటలలో 6 కి.మీ. ప్రయాణం చేసి 11 కి మీ. ఎత్తుకు చేరుకోగలిగారు.

ఇక్కడి నుండి కాలినడకన దారిలో తటస్థించే మజిలీల వివరాలు, వాటి మధ్య దూరాలు :

| | | |
|---|---|---|
| తవాఘాట్—'పంగు' విశ్రాంతి భవనం | = | 9 కి.మీ. దూరం. |
| నారాయణాశ్రమం ద్వారా 'సిర్ఖా' క్యాంపు. | = | 16 కి.మీ. దూరం. |
| సిర్ఖా క్యాంపు నుండి సమూరి, సర్కే, కుటియా, జంగల్‌చట్టి, రుంగ్గింగ్ టాప్‌ల ద్వారా 'జిప్తి' క్యాంపుకు. | = | 18 కి మీ. దూరం. |
| క్యాంపు నుండి సిజంగ్ జలపాతం, భోలాపాస్ పర్వతాగ్రం గుండా 'మాల్పా' విడిదికి. | = | 9 కి.మీ. దూరం. |
| బహెలిథా, ధక్తిథా జలపాతాలను చూస్తూ 'బుద్ధి' క్యాంపుకు. | = | 9 కి.మీ. దూరం. |
| ఛయలెక్ టాప్ ద్వారా దార్చ్యాంగ్ గ్రామం, తర్వాత 'గుంజి' క్యాంపుకు. | = | 18 కి మీ. దూరం. |
| క్యాంపునుండి వ్యాస మందిరం, కాళికాలయం దర్శిస్తూ కాలాపానీ. | = | 10 కి.మీ. |
| భయంకర లోయ నభీడాంగ్ ద్వారా తెలిపు పాస్ (లిప్ కనుమ)కు. | = | 20 కి.మీ. |
| మొత్తం కాలినడకన : | | 89 కి.మీ. |

ఈ పర్వత ప్రదేశాలపై రెండు మూడు ఇండ్లున్నా వాటిని ఒక గ్రామం గానే పేర్కొంటారు ఈ గృహాలు కూడ ఒకదానికొకటి 2 ఫర్లాంగుల దూరం నుండి కిలోమీటరు దాకా ఉంటాయి 2745 మీ ఎత్తున్న 'జంగల్ చట్టి' అనే గ్రామం అట్లాంటిదే.

మాల్పా విడిచి తర్వాత దారిలో వీరికి 'బహెలిథా' జలపాతం ఎదురైంది. 'థా' అంటే టిబెట్టు భాషలో జలపాతమని అర్థమట. బహుశా ఈ పదం 'పహేలీ' నుండి వచ్చి మొదటి జలపాతమని వ్యవహరింపబడింది కావచ్చు.

గార్బ్యాంగ్ లేదా దార్బ్యాంగ్ అనే గ్రామాన్ని 'పాతుకు పోతున్న గ్రామం' అంటారని చెప్తూ, 50 సంవత్సరాల పూర్వమున్న రెండువేల జనాభా యాత్రాకాలం నాటికి 500 మాత్రమే మిగిలిందని వ్రాశారు. ఇక్కడి మట్టి పసుపు రంగుది. బంకమన్నులాగా జారుతుంది. పూర్వం ఇదే మనదేశపు చివరి గ్రామం. కానీ ఇప్పుడు కాలాపానీ ప్రదేశం భారతదేశపు చివరి మజిలీ. 'గుంజి' క్యాంపేమో మనదేశపు చివరి పోస్టాఫీసున్న గ్రామం.

కాలాపానీ స్థలం సముద్రమట్టానికి 3,600 మీ. ఎత్తులో ఉంది. ఇక్కడే Indo Tibetan Boarder Police వారి పెద్ద క్యాంపు ఉంది. ఇక్కడి నుండి లిపు పాస్ (లిప్ కనుమ) 20 కి.మీ దూర ముంటుంది. ఈ మధ్య దూరం No man area అంటే నిస్సంచార ప్రదేశం. కాబట్టి సంవత్సరమంతా కాపలా జవాన్లు మన భూభాగాన్ని కాపలా కాస్తుంటారు. లిపు పాస్ మనదేశపు సరిహద్దు భూభాగము. కాలాపానీ వద్ద 'హెలీ ప్యాడ్' సౌకర్యం కూడ ఉంది. SPF జవానులు ఇక్కడిదాకావచ్చి ఆగిపోతారు. తర్వాత లిపుపాస్‌దాకా ITBP వారే యాత్రికులను తీసికొనిపోతారు. తిరిగి వచ్చేటప్పుడు వీరికంటె ముందు వెళ్ళిన బృందాన్ని తీసుకువస్తారు.

చైనా భూభాగంలో ప్రవేశించిన తర్వాత 20 మీ. దిగుడు పూర్తిగా నిటారుగా చాల ప్రమాదకరంగా ఉంది. సహయాత్రికుడు రంగాచారి అకస్మాత్తుగా కాలుజారి తలక్రిందులుగా 400 అడుగుల క్రిందికి జారి పడిపోయాడు. ఆయన 'కైలాసవాసునికి అర్పితమైనట్లు'గానే యాత్రికులంతా భావించారు కాని, విచిత్రంగా గాయాలేం తగులకుండా ప్రాణాలతో బయటపడ్డాడు.

ఐతే ఈ సంతోషం ఎంతోసేపు నిలవలేదు. మహాబలశాలి రామకృష్ణన్ మార్గమధ్యంలో నాలుగు మీటర్ల ఎత్తునుండి క్రిందికి దొర్లిపడి హఠాన్మరణం పొందాడు. ఎంతో ఉల్లాసంగా సాగిన ఈ కైలాసయాత్రలో రామకృష్ణన్‌గారి మృతి 'పరమ విషాద శ్రుతి'గా పరిణమించింది.

ఈ రెండు సంఘటనలకు మధ్య రచయిత దైవబలాన్ని గూర్చి రావణుడు అవసానదశలో పలికిన వాక్యాలను సందర్భోచితంగా ఉదాహరించారు. 'కాలం వక్రించినపుడు జరగకూడనివి జరుగుతాయి. జరుగవలసినవి జరుగకుండా పోతాయి' అని వాటి సారాంశం.

తక్లాకోట్ నుండి ఉదయం 4 గంటలకు (బీజింగ్‌లో అప్పుడు 6½ గంటలు) బస్సులో మానస సరోవరం దిక్కుగా ప్రయాణం సాగించారు. దారిలో 'బల్‌డక్' అనే ఎత్తుప్రదేశం చేరగానే కైలాసశిఖర ప్రథమ దర్శనం కలిగింది. ఇంకా ముందుకుపోగా 120 చ.కి.మీ. వైశాల్యంతో నీలినీటి సదస్సు కనిపిస్తుంది. అదే 'రాక్షసతాల్' సరస్సు. ఇది మానస సరోవరానికి ఎడమవైపున 10 కి.మీ. దూరంలో ఉంది.4,5 ప్రకృతిశోభలో ఇది ఏమాత్రం తీసిపోదు కాని, దీనిలోని నీరు పానయోగ్యం కాదు. ఈ సరోవరాన్ని ఎవ్వరూ పరిక్రమించరు కూడ.

## iii) మానస సరోవర పరిక్రమ :

'ధార్చెన్' అనబడే కైలాస్ బేస్ క్యాంపులో బస చేసి అక్కడి నుండి మానస సరోవర పరిక్రమ చేయాలని సంకల్పించారు. సరోవరం చుట్టుకొలత

---

4. సత్యనారాయణగారు తమ 'కైలాసయాత్ర'లో ఈ రెండు సరోవరాల మధ్య దూరము 3 మై అనీ (5 కి మీ.) ఇవి పన్నెండు సంవత్సరములకు ఒకసారి కలుస్తాయనీ వ్రాశారు. పేజీ. 37.

5. 'మానస సరోవరానికి పశ్చిమమున 4 మై.లో [6⅖ కి.మీ.) రావణ సరస్సు ఉందని సూర్యప్రకాశశాస్త్రిగారు తమ సుందర భారతయాత్ర-2. పేజీ. 639 లో.

105 కి.మీ.[6] లోతు 300 అడుగులు. వైశాల్యం సుమారు 150 చ.కి మీ. ఇది దాదాపు వలయాకారంగా ఉంది.

మానస సరోవర మధ్యభాగంలో ఉన్న వృక్షం నుండి ఫలాలు రాలిన శబ్దంవల్ల ఈ ప్రాంతానికి 'జంబూ ద్వీప'మనే పేరు వచ్చిందని రచయిత పేర్కొన్నారు. "వృక్ష రాజము యొక్క పెద్ద పెద ఫలములు సరోవరములో రాలుచుండగా 'జం' అనే శబ్దము వచ్చుటచే ఈ ప్రాంతమునకు 'జంబూ లింగ్' లేక 'జంబూ ద్వీపమ'ని నామకరణము జరిగినట్లుగ హిందూ పురాణగాథలు గలవు.''[7]

సరోవర పరిక్రమలో 8 నదులను[8] దాటవలసి ఉంటుంది. ఐతే ఈ నదుల లోని నీరు 'మంచు ముద్దను పిండుచున్నట్లే' ఉన్నదని మనోహరరావుగారు వ్రాశారు. ఈ నదులలో పదిసెకన్ల కన్న ఎక్కువసేపు నిలబడితే కాళ్ళు బిగిసి కొనిపోతాయంటూ "నిప్పును చేతబట్ట వచ్చును కాని నీటిని కారుతో పట్టుకొన వలె"ననే ఈ ప్రదేశపు సామెతను ఉదాహరించారు.[9]

కొంతసేపు గుర్రాలమీద, మరికొంతసేపు నడకద్వారా మొదటిరోజు పరిక్రమలో 45 కి.మీ. దూరం ప్రయాణించారు రెండవరోజు 40 కి మీ. దూరం ప్రయాణించి పరిక్రమను పూర్తి చేశారు. ఐతే ఒకేరోజు పరిక్రమను పూర్తి చేయగల బౌద్ధ'లామా'లు కూడ ఉన్నారు. కొంత మంది టిబెట్ దేశస్థులు మాత్రం సాష్టాంగ ప్రణామాలు చేస్తూ 28 రోజుల్లో ఒక పరిక్రమను పూర్తి చేస్తారట!

---

6. సత్యనారాయణగారు తమ 'కైలాస యాత్ర'లో దీని చు. కొ. 70 మై. అని పేర్కొన్నారు. ఐతే 118 కి మీ. అవుతుంది. పేజీ. 87.

7. కైలాస దర్శనం - 199

8 ఆ నదులపేర్లు : 1. కగుమాఛూ, 2. లంగ్‌నర్‌ఛూ, 3. పాల్చెన్‌ఛూ, 4 ఛర్‌ఛర్‌గంగ్, 5. దుంగగ్ ఛెండాంగుఛూ, 6. డాగ్‌ట్సంపో, 7. నిమాపెండిఛూ, 8. రిలిజంగ్‌ఛూ - పేజీ 186.

9. అదే - పేజీ. 175.

1928 నుండి 1949 దాకా ఏటా మానస సరోవరం దర్శించిన వారు శ్రీ ప్రణవనంద స్వామివారు. ఈయన చేసినంత పరిక్రమలు టిబెట్ దేశస్థులు కూడ చేయలేదట! ఏ భారతీయుడు కూడ చేయలేని కైలాస ఉత్తర దక్షిణ పీఠ భాగాలలో 'ఖాండో సంగ్లమ్ పాస్' ద్వారా ఏకాంత పరిక్రమ చేశారు. అంతేకాక ఇంకా మూడు పాస్ (కనుమ) లను కూడ పరిశోధించి, వాటి ద్వారా పద్దెనిమిది వేల అడుగుల ఎత్తైన భూభాగంపై ప్రయాణించడం ఎంతో సాహసభరిత ప్రమాద చర్య. స్వామిగారు 'జన్మభూమి' 'జ్ఞాననౌక' అనే పడవల్లో మానస సరోవర, రాక్షసతాళ్, గౌరీ కుండ్‌లలో పర్యటించి పలురకాల పరిశోధనలు జరిపి, వాటి లోతుపాతులు, చుట్టుకొలతలను నిర్ధారించిన ప్రథమ పరిశోధక యాత్రికులు. కైలాస పర్వతాలోహణకు సంబంధించిన కష్టనష్టాలను, అక్కడి ప్రకృతి దృశ్యాలను, యాత్రలో తీసుకోవలసిన ముందు జాగ్రత్తలను పేర్కొంటూ ప్రణవానంద 1949లో 'కైలాస్ అండ్ మానసరోవర్' అనే పుస్తకం వ్రాశారు.

భారతీయులు కాశీ మరణాన్ని కాంక్షించి వారణాసిలో స్థిరనివాస మేర్పరచుకొనే విధంగానే బౌద్ధలామాలు, టిబెట్ దేశస్థులు మానస సరోవర తీరంలో మరణాన్ని మోక్షప్రదంగా భావిస్తారు. ఈ విశ్వాసాలకు మూలకారణం ఆయా క్షేత్రాల మాహాత్మ్యమే అనవచ్చు.

యాత్రికులీ మానస సరోవర జలాన్ని డబ్బాలలో నింపుకొని 10-50 లీ. వరకు వెంట తెచ్చుకుంటారు. గంగాజలం కంటె కూడ మధురమైన ఈ నీరు కొన్ని సంతతుల దాకా అమృతం లాగా భద్రపరచుకోవటం అనాదిగా వస్తున్న విశేషాచారం. ఒక్కమాటలో చెప్పాలంటే "వందకోట్ల జనాభా గల హైందవుల, బౌద్ధుల, జైనుల అతి పవిత్రమైన దర్శనీయ పుణ్యక్షేత్రమే ఈ కైలాస మానస సరోవరములు."10

## iv) కైలాస పరిక్రమ :

'ధార్చెన్' అనే కైలాస బేస్ క్యాంపు ఎత్తు సముద్ర మట్టానికి 4190 మీ. ఎత్తులో ఉంది. ఇక్కడి నుండి యాకులపై ప్రయాణించి 'డెరిబుక్' అనే 8వ

10. కైలాస దర్శనము - పేజీ. 211.

రానికి చేరుకున్నారు. ఇది 5,000 మీ. ఎత్తున ఉన్న ప్రదేశం. ఇక్కడి ఎముకలు కొరికే చలికి ఒకదాని మీద మరొకటిగా ఆరు దుస్తులు ధరించామని రచయిత పేర్కొన్నారు. 55 కి.మీ. ప్రదక్షిణంలో ఈ రోజు 25 కి.మీ దూరం పూర్తయింది.

సత్యనారాయణ గారు తమ 'కైలాస యాత్ర'లో కైలాస ప్రదక్షిణము 33 మై. (53 కి. మీ.) అనీ, మూడు నుండి ఏడు దినాలు పడుతుందనీ తెల్పారు.[11]

రెండవరోజు మధ్యరాత్రి లేచి 'యాకుల'పై సామాను వేసి కాలినడకన బయలుదేరారు. కీళ్ళను కూడ కొరికివేసే విపరీతమైన చలి. చీకటి కావడం వల్ల యాకుల నధిరోహించే వీలులేదు. మొత్తం ప్రయాణంలోనే ఇంతటి భరించలేని చలిని ఎక్కడా అనుభవించలేదని మనోహరరావుగారు వ్రాసుకున్నారు.

ఇట్లే దాదాపు రెండు కి మీ. దూరం నడవగా పూర్తిగా తెల్లవారి ధీరాపుక్' అనే గొంపా (బౌద్ధమఠం) చేరుకున్నారు. ఇది 5,800 మీ. ఎత్తు ప్రదేశం. ఇక్కడి నుండి కైలాస పర్వతం పూర్తిగా కనిపించిందట! తర్వాత రచయిత అందరిలాగే యాకు (జడల బర్రె)పై ప్రయాణించాలని ప్రయత్నించారు కాని ఎంతోసేపు నిలబడలేకపోయారు. అప్పటి అవస్థను ఇట్లా వర్ణించారు.

"యాకులు పర్వతములపై కెక్కునపుడు వాటి వీపుల మీదగల మేము వెనుకకు జారుచుండుట - ఆ జారుట నాపుకొనుటకై గట్టిగా తొడలతో యాకు వీపును పట్టుకొన ప్రయత్నించుట - దానితో తొడలలో బాధ కలుగుట - భరించ లేక మరల దిగి నేను కాలినడకను ప్రయాణము సాగించితిని."[12]

---

11. హిమాలయ వైభవము - కైలాస యాత్ర - కొ. సత్యనారాయణ. పేజీ. 36. భారతి. జూలై. 1938. దాగం వెంకటేశ్వర్లు ఈ పరిక్రమ 32 మై. (52. కి.మీ.) అని పేజీ. 415 లో తెల్పారు.
12. కైలాస దర్శనము - పేజీ 238.

'శివచల్ తుఘప్' అనే ప్రదేశం ఇంతదాకా తటస్థించని ఎత్తైన ప్రదేశం. ఎత్తు సముద్ర మట్టానికి ౕ,800 మీ. ఈ పర్వత ప్రాంతంలో ధ్వని బాగా వినబడదనీ, 20 మీ. దూరంలో ఉన్న మనిషి పిలుపు కూడ వినరాదనీ, కారణం ఆమ్లజని లోపం, ఇంకా విపరీతమైన గాలులని రచయిత వ్రాశారు.

ఇక్కడ విశ్రాంతి తీసుకొని మళ్ళీ నడక ప్రారంభించి 500 మీ. దూరం సమతలంలో నడిచేసరికి దాదాపు 400 మీ. లోతు లోయలో ఒక అండాకారపు నీలిరంగు సరస్సు కన్పించింది. అదే 'గౌరీ కుండ్' (తుకిజింబో) అనే సరస్సు. దీని ఎత్తు 18,400'లు. ఇది ప్రపంచంలోనే అన్నిటికన్న ఎత్తైన సరస్సు.

కైలాస పరిక్రమపట్ల భారతీయులకన్న టిబెటన్లకే ఎక్కువ భక్తి శ్రద్ధ లున్నాయని వినటమే కాక రచయిత ప్రత్యక్షంగా చూశారు కూడ. "వారు (ఇరువురు స్త్రీలు, ఇరువురు పురుషులు) బోర్లాగా పడుకొని, చేతులు ముందుకు చాచి, ఆ చేతులున్న స్థలమువరకు అడుగులు వేసి, మరల బోర్లా పడుకొని సాష్టాంగ నమస్కారములతో పోవుట", దీన్నే సాష్టాంగ పరిక్రమగా చెపుతారు[13] ఈ విధంగా వీరు 15 దినాలకు ఈ కైలాస పరిక్రమ పూర్తి చేస్తారు. ఐతే ఈ పరిక్రమ కైలాస పర్వతానికి కుడినుండి ఎడమకు (Anti-Clock Wise) సాగుతుంది. మామూలు పరిక్రమను మనవలె ఎడమనుండి కుడికి నడక ద్వారా ఒక్కరోజులోనే పూర్తి చేస్తారు ఈ 15 రోజుల ప్రత్యేక పరిక్రమలో వీరు 'సత్తు'ను మాత్రమే ఆహారంగా భుజిస్తారట![14]

రెండవ రోజు పరిక్రమలో 30 కి మీ. అతి ప్రమాదభరితమైన ప్రయాణం పూర్తయింది. ఈ కైలాస పరిక్రమ 15 వేల అడుగుల ఎత్తు నుండి 19 వేల అడుగుల ఎత్తు దాకా పర్వతాల మీద సాగుతూ 'రుద్రమాల' పరిక్రమ జరుప

---

13. కైలాస దర్శనము - పేజీ 240.

14. 'సత్తు' అంటే వేయించిన మొక్కజొన్న పిండి. తెలంగాణాలో బతుకమ్మ పండుగనాడు, శివరాత్రినాడు ఫలహారంగా ఉపయోగిస్తారు. కాని వేపుడు చేసిన బార్లీ గింజల పొడిని సత్తుగా పేజీ 271 లో రచయిత పేర్కొన్నారు.

వలసి వస్తుంది.[15] కైలాస శిఖరం ఎత్తు 22,050 అడుగులు (4,800 మీటర్లు). ఇది ఎప్పుడూ మంచుతో ఆవరింపబడి ఉండడంవల్ల ఇంతవరకు అంత ఎత్తుకు ఎవరూ చేరుకోలేదు.

రుద్రమాల' పరిక్రమ ఒకసారి చేస్తే ఈ జన్మలోని పాపాలు హరిస్తాయనీ, పదిసార్లుచేస్తే ఒక కల్పంలో చేసిన దురితాలు నశిస్తాయనీ, 108 సార్లు చేయగల్గితే ఈ జన్మలోనే ముక్తి లభిస్తుందనీ పురాణ గాథలవల్ల తెలుస్తున్నదని మనోహరరావుగారు వ్రాశారు.

కైలాస పర్వతారోహణకు 13 రోజులు, అవరోహణలో తిరుగు ప్రయాణానికి 12 రోజులు, మిగిలిన ఐదురోజులు కైలాస మానస సరోవర పరిక్రమలకు పట్టింది. దార్చెన్ సమీపంలోని సువిశాల మైదానంలో ఒక ఏరోడ్రోం నిర్మిస్తే యాత్రికుల కష్టాలు చాలవరకు తగ్గిపోతాయని రచయిత అభిప్రాయపడ్డారు. ఢిల్లీనుండి ఒకే ఒక గంటలో ఇక్కడ దిగే అవకాశం ఏర్పడుతుందట!

ఈ కైలాస పర్వతం ప్రస్తుతం చైనా దేశంలోని టిబెట్ రాష్ట్రంలో హిమాలయ పర్వతశ్రేణిలో కైలాష్ జస్కర్ పర్వతశ్రేణుల్లో ఉంది. దీన్నే వెండికొండ, రజతాద్రి, మేరుపర్వతం - అని రకరకాలుగా భావిస్తారు. భూమండలం యొక్క గరిమనాభి ఇక్కడనే ఉన్నట్లు, భూభారమంతా ఇక్కడి నుండే కేంద్రీకరింపబడి మోయబడుతున్నట్లుగా పూర్వశాస్త్ర గాథలేకాక నవీన శాస్త్రజ్ఞుల నమ్మకం కూడ.

యాత్రామార్గంలో ఎదురైన ఇబ్బందులు ఈ గ్రంథంలో ఎక్కువగా పేర్కొనబడటంవల్ల ఈ పుస్తకంలో ప్రధానంగా బాహిరమైన యాత్ర గురించిన వర్ణన జరిగినట్లుగా భావించవచ్చు.

---

15. కైలాస పర్వతంతో కలిసిన ఇతర పర్వతాలను కూడ కలుపుకొని భక్తులు చేసే పూర్తి పరిక్రమను 'రుద్రమాల' పరిక్రమ అంటారట. పేజీ 246.

## 2. ఇతరుల కైలాస యాత్రలు - మార్గాలు :

1948 లోనే సంపూర్ణ భారత యాత్రచేసి 'సుందర భారతయాత్ర' అనే గ్రంథాన్ని రచించిన విద్వాన్ బులుసు సూర్యప్రకాశ శాస్త్రిగారు మానస సరోవర కైలాసాలకు నాలుగు మార్గాలను సూచించారు. సత్‌లజ్ నది తీరమునుండి ఒకటి, గంగోత్తరికి మైలున్నర దూరమునుండి ఒకటి, బదరీ నారాయణం నుండి ఇంకొకటి అల్‌మోడా నుండి మరొకటి. దీనిలో మొదటి మార్గము అన్నిటికంటె పెద్దది, శ్రమతో కూడుకొన్నది చివరిది అన్నిటికంటె సుఖకరమైనది. యాత్రికులు ఎక్కువగా ఈ మార్గంగుండానే వెళుతుంటారని వ్రాశారు.

ఐతే ఆల్మోరా నుండి మానస సరోవరానికి మార్గం మూడు భాగాలుగా ఉంటుందన్నారు. ఆల్మోడా నుండి ధార్చులా వరకు కూలీలను కుదుర్చుకోవాలి. మధ్య దూరం 90 మై. (145 కి.మీ) ధార్చులా నుండి 'గర్వియా' దాకా గుర్రాలు, డాండీల మీద ప్రయాణించాలి.[16] ఇది దుర్గమ మార్గం. స్త్రీలు, వృద్ధులను ఇక్కడి నుండి వెదురుకు గుడ్డ జోలీలు కట్టి తీసుకువెళ్తారు. దారిలో 'నీరపానీ' లిపుపాన్' అనే ప్రదేశాలను దాటాలి. దీని తర్వాత గుర్రాలమీద లేదా 'ఝబ్బూ' అనే గేదెలాంటి 'పర్వత పశువు' మీద ప్రయాణం చెయ్యవచ్చు[17] ఈ గేదెనే మనోహర రావుగారు తమ యాత్రాగ్రంథంలో 'యాకు' అన్నారు. బహుశా ప్రకాశ శాస్త్రిగారు వాడిన పదం స్థానికమైనదై ఉంటుంది. గర్వియా దాటిన తర్వాత టిబెట్టుకు చెందిన ప్రదేశం. తకలాకోట్ నుండి మానస సరోవరం చేరడానికి నాలుగు రోజులు పడుతుందట. ఐతే మనోహర రావు గారు బస్సులో రెండు రోజుల్లోనే చేరుకున్నారు.

సత్యనారాయణ గారు కైలాసానికి పలు మార్గాలున్నాయని చెప్తూ అవన్నీ 'దుర్గమ కాంతారాల' గుండాను, 'దుస్తరమగు కనుమల' మీదుగాను ఉన్నాయన్నారు. ఈయన కూడ 'కైలాసము కాల్మోరా నుండి పోవు మార్గమే తేలిక'

---

16. ఆల్మోరా, ఆల్మోడా అని రెండు రకాల పేర్కొనబడింది. డాండీని 'దండీ' అని ఇదే రచయిత బదరీ యాత్రలో తెల్పారు. మనుష్యులను మోయుటకు ఉపయోగించే సాధనము.

17. ఈ పశువుకు శరీరం మీద చాలా పొడవైన వెంట్రుకలుంటాయి. జడల బర్రె కావచ్చు.

అన్నారు [18] ఆ మార్గమిట్లా ఉంది: ఆల్మోరా-వాగేశ్వరం - తాకులా - కాప్‌కోట-శ్యామాధురం-మనశ్యారీ-తేజము ఇదంతా 105 కి.మీ. (59 మై) ప్రయాణం. తేజము నుండి కైలాసానికి ప్రథమ ద్వారం కుమాయూన్ పర్వత పంక్తి మొదలు. తర్వాత గిర్గాం-మీలం-కుంగరీ బింగరీ శిఖరాలు-గుణవంతీ దమయంతీ నదులు- గ్యాదిమా మండీ వర్తక స్థానం - తీర్థపురి. తీర్థపురి నుండి కైలాసం చేరుకోవడానికి మూడు రోజులు పడుతుంది.

1955 మే నెలలో రాగం వేంకటేశ్వర్లు గారు ఉత్తర భారత క్షేత్రాలను సందర్శించారు. ఆయన కైలాస శిఖరానికి 8 మార్గాలున్నాయని పేర్కొన్నారు. అన్నిటికన్న సులువైనది ఆల్మోరా మార్గమే నన్నారు. కష్టమైనది జోషీ మఠం మీదుగా వెళ్ళేదనీ, పొడవైన మార్గం కాశ్మీర మార్గమనీ తెల్పారు. ఐతే కేవలం ఆల్మోరా మార్గం గురించే తమ గ్రంథంలో వివరించారు.[19] ఆ మార్గమిట్లా ఉంది :

హరిద్వారం నుండి లక్నో వెళ్ళే దారిలో బెరలీ (Barreilly) స్టేషన్‌లో బండి మారి, కాథ్ గోదాము వెళ్ళే లైనులో పోవాలి. లక్నో నుండి బెరెలీ 350 కి.మీ (199 మై.) బెరేలీ నుండ కాథ్ గోదాము 100 కి. మీ. (62 మై.) ఇవి నార్త్ ఈస్టర్న్ వెయిన్ లైనులో ఉన్నాయి. కాథ్ గోదాముతో రైలు మార్గము ఆఖరు తర్వాత ఆల్మోరాదాకా 132 కి.మీ. (82 మై.) చక్కని బస్సు రోడ్డుంది. ఆల్మోరా నుండి 301 కి.మీ. (187 మై) కాలినడకన మానస సరోవరం చేరుకోవచ్చు. ఇక్కడినుండి 58 కి.మీ. (34 మై.)లో కైలాసగిరి ఉంది.[20]

## 3. బులుసు వారి "బదరీ యాత్ర"*

విద్వాన్ బులుసు సూర్యప్రకాశ శాస్త్రిగారు గొప్ప పండితులు, సహృదయులు. భారత ధర్మప్రచారానికై వీరు చేసిన సేవ అమోఘము. తెనాలిలో

---

18. హిమాలయ వైభవము : కైలాస యాత్ర. — కౌ. సత్యనారాయణ. భారతి. జూలై 1938.
19. యాత్రా మార్గదర్శి (ఉత్తర భారత - హిమాచల ప్రాంతములు) - రాగం వెంకటేశ్వర్లు, 1955. పేజీ. 496.
20. ఈ విషయం ఇదే పుస్తకం (యాత్రా మార్గదర్శి) లో 'కైలాస మానస సరోవరముల యాత్ర' అన్న శీర్షిక క్రింద పేజీ. 415 లో వివరింపబడింది.

* బులుసు సూర్యప్రకాశ శాస్త్రిగారు.

'సాధన గ్రంథమండలి'ని స్థాపించి, తద్వారా శాస్త్రిగారు ఆధ్యాత్మిక జ్ఞానానికీ, పారలౌకిక సుఖానికి సాధన చేయడానికి అనుకూలమైన గ్రంథాలను ప్రకటించారు. ధర్మజిజ్ఞాసలో వెనుకబడియున్న తెలుగునాడు పురోగమించడానికి దోహదం చేశారు. వీరు బహు తీర్థ క్షేత్ర దేశాటనంచే బహుగ్రంథ పరిశోధనచే సంపాదించిన తమ అనుభూతి విజ్ఞాన విశేషాలను 'సుందర భారత యాత్ర' అనే గ్రంథ రూపంలో ప్రచురించారు. సాధన గ్రంథమండలి 1953లో సమర్పించిన 63వ పుస్తకమిది. ఇందులో ఆరు ఖండాలలో భారతదేశంలోని పుణ్యక్షేత్రాల వృత్తాంతం సమగ్రంగా వివరింపబడింది. యాత్రార్థులకిది ఎంతో ఉపయుక్తంగా ఉంటుంది. ఈ గ్రంథం ఒకవిధంగా తీర్థయాత్రాపరులకు 'కరదీపిక' లాంటిది.

పుస్తకం ముద్రణా సౌకర్యం కొరకు రెండు భాగాలుగా విభజింపబడింది. మొత్తం 750 పుటల గ్రంథం. 1948వ సంవత్సరంలో శాస్త్రిగారు సంపూర్ణ భారత యాత్ర పూర్తి చేశారు. ఇందలి మొదటి ఖండంలో సర్వక్షేత్ర సామాన్యమైన 'తీర్థ స్వరూపం, తీర్థ భేదాలు, యాత్రా ప్రయోజనం, తీర్థ విధులు, యాత్రా వస్తు సామగ్రి, రైల్వే సమాచారం, పండాలు' మొదలగు విషయాలు వివరింపబడ్డాయి.

ఐతే యాత్ర చేసి వచ్చిన తర్వాత దాదాపు ఏడాదికి అనగా మార్చి 1949 లోనే, 'బదరీ యాత్ర' అన్న పేరుతో శాస్త్రిగారు యాత్రా గ్రంథాన్ని ప్రకటించారు. ఇది 138 పుటల పుస్తకం.

## i) బదరీనాథ్‌కు వెళ్ళవలసిన ప్రయాణ మార్గాలు :

మనదేశంలో తీర్థయాత్రా క్షేత్రాలు అనేకమున్నాయి. వీటిలో నాలుగు ఉత్తమ క్షేత్రాలని చెప్పబడ్డాయి. భగవచ్ఛక్తి అత్యధికంగా వ్యక్తమయ్యే ఈ నాలుగు ప్రదేశాలను హిందీలో 'చార్ ధామ్' అంటారు. అనగా నాలుగు ధామములని అర్థం. అవి : ఉత్తరాన శ్రీ బదరీ నారాయణ క్షేత్రం, తూర్పున శ్రీ జగన్నాథం, దక్షిణాన శ్రీ రామేశ్వరం, పడమరన శ్రీ ద్వారకాపురి. ఈ నాల్గింటిలో బదరీ నారాయణ క్షేత్రం ముఖ్యమైనది హృషీకేశం మొదలుగా ఉత్తర దేశ యాత్రలని పేరు పొందిన యాత్రలన్నీ హిమాలయాల్లోనే ఉన్నాయి. వాటిలో ప్రధాన క్షేత్రాలు 1. గంగోత్రి, 2. యమునోత్రి, 3. కేదారము. 4 బదరీ నారాయణము, 5. కైలాస పర్వతము. వీటిలో కైలాస గిరికి తప్ప మిగతా క్షేత్రాలకు వెళ్ళే మార్గం హరిద్వారం నుండే ప్రారంభం చేయాలి. కేదారనాథున్ని దర్శించటానికి ఇక్కడి నుండే వెళ్ళాలి కాబట్టి దీనికి 'హరద్వారమ'నీ,

బదరీనాథుని దర్శింప బోవటం వల్ల 'హరిద్వారమ'నీ వ్యవహరిస్తున్నారు. ఇంకా హరిద్వారానికి ప్రాచీన నామాలు 'మాయాపురి, గంగాద్వారమ'ని కూడ ఉన్నాయి.

హరిద్వారం నుండి హృషీకేశానికి రెండు మార్గాలున్నాయి. ఒకటి రైలుమార్గం. 23 మై (37 కి. మీ.) దూరం. రెండవది కార్లు, బండ్లు వెళ్ళే కంకర రోడ్డు 15. (24 కి.మీ.).

పై యాత్రలు చేయడానికి నాలుగు మార్గాలున్నాయి: 1. హృషీకేశం నుండి దేవప్రయాగ, యమునోత్రి, గంగోత్రి, కేదారముల మీదుగా బదరీక్షేత్ర దర్శనం చేసుకొని తిరిగి హృషీకేశం చేరుకోవడం. 2. హృషీకేశం నుండి దేవప్రయాగ మీదుగ రుద్రప్రయాగ, కేదారం, బదరి చూసుకొని మరల హృషీకేశం చేరటం. 3. హృషీకేశం నుండి దేవ, రుద్ర ప్రయాగల మీదుగ బదరీక్షేత్రం చేరుకుని హృషీకేశం తిరిగి రావటం. 4. హరిద్వారం నుండి డెహ్రాడూన్ రైలులో వచ్చి, అక్కడి నుండి యమునోత్రి, గంగోత్రుల గుండా కేదార బదరీనాథ్‌లు చూసి హృషీకేశం వెళ్ళడం.

యమునోత్రి, గంగోత్రి యాత్రలు బహు కష్టతరములనీ, కైలాసగిరి యాత్ర కష్టతమమనీ చెప్తారు. వీటికంటె తక్కువ కష్టమైంది కేదారయాత్ర. "బదరికి కేదార నాథం గుండా పోయినచో యింకా సుమారు 70 మైళ్ళు యెక్కువ యుండును "[21]

సుందర ప్రకాశ శాస్త్రిగారు తమ గ్రంథంలో యిచ్చిన దూరాలు కూడ ఈ విషయాన్నే సమర్థిస్తున్నాయి [22]

| | |
|---|---|
| హృషీకేశము నుండి కేదారనాథ్ | - 134 మై. (216 కి.మీ.) |
| కేదారం నుండి బదరీకి | - 101 మై. (163 కి.మీ.) |
| | 235 మై. (379 కి.మీ ) |

బదరీ నుండి నేరుగా హృషీకేశానికి - 168 మై. (270 కి.మీ.)

21. శ్రీ మంత్రిప్రగడ నరసింహంగారి 'బదరీ నారాయణ యాత్ర' భారతి. ఫిబ్రవరి 1940. 70 మైళ్ళంటే 113 కి.మీ. (పేజీ 187)
22. బదరీ యాత్ర - పేజీ 23.

దూరమైన కేదారం నుండే బదరీ నారాయణం వెళ్ళడం సులభమైన మార్గమనీ, అట్లు యాత్ర చేయడమే ప్రశస్తమైనదిగా పురాణాల్లో ప్రసక్తమైందని శాస్త్రిగారు పేర్కొన్నారు.

బదరీ యాత్రకు మొదట బెజవాడ నుండి ఢిల్లీ ఎక్స్‌ప్రెస్‌లో నాగపూరు మీదుగా ఢిల్లీ చేరి అక్కడి నుండి హరిద్వారం వెళ్ళాలి.

హరిద్వారం నుండి బదరికి 295 కి.మీ. (183 మై.) హృషీకేశం వరకు 24 కి.మీ. (15 మై.) దూరం మంచి రోడ్డుంది. అక్కడి నుండి దేవ ప్రయాగ వరకు కూడ 71 కి.మీ. (44 మై.) రోడ్డుంది కాని ఇది క్రొత్తగా వేయబడిన కొండమార్గమగుటచే యేకదిశా మార్గమని (one way road) నరసింహంగారు వ్రాశారు.[23] అయితే ఆ కాలంలో ఈ రోడ్డు గుండా ఐదు మోటారు బస్సులున్నా నాలుగు టాక్సీలున్నా మాత్రమే లయిసెన్సు పొంది తిరుగుతున్నట్లు ఆయన తెల్పారు.

యాత్రికులు సామాన్యంగా హరిద్వారం నుండి దేవ ప్రయాగ దాకా 95 కి. మీ. (59 మై.) మోటారు మీద పోయి, అక్కడి నుండి సుమారు 201 కి.మీ. (125 మై.) కాలినడకన వెళ్తారు. ఇంకా నిరుపేదలు, బైరాగులైతే హరిద్వారం నుండే కాలినడకన బయలుదేరతారు. నడచిపోవటమే ఎక్కువ సౌఖ్యంగా, ఆరోగ్యంగా ఉంటుందట! కాలినడకన యాత్ర చేసేవారు ఉదయం 5 గంటలకే లేచి 9 గంటల దాకా నడిచి ఏదైనా ఒక బస చేరుకుంటారు. అక్కడ భోజనాదికాలు ముగించుకొని, విశ్రాంతి పొంది సాయంత్రం 4 గంటలకు నడక ప్రారంభించి రాత్రి ఇంకొక బసకు చేరుకుంటారు. ఈ విధంగా అనాయాసంగా ప్రతిరోజు "సామాన్య గృహస్థులు, స్త్రీలు ఉదయము 8 లేదా 10 మైళ్ళున్నూ, సాయంకాలము 4 లేదా 6 మైళ్ళున్నూ నడవ వచ్చును" అని అనుభవపూర్వకంగా చెప్పారు నరసింహంగారు.[24] శీతోష్ణాలను లక్ష్యపెట్టని సాధులైతే ప్రతిదినం 32 కి.మీ. (20 మై.) అవలీలగా నడుస్తారట!

---

23. బదరీ నారాయణ యాత్ర. - భారతి. ఫిబ్రవరి, 1940. - మంత్రిప్రగడ నరసింహం (పేజీ 196).
24. బదరీ నారాయణ యాత్ర. — మంత్రిప్రగడ నరసింహం. భారతి. ఫిబ్రవరి, 1940. (పేజీ. 197)

దారిలో గ్రామా లెక్కువగా లేవు. కాని 2 లేదా 3 మైళ్ళకు ఒక చట్టీ చొప్పున ఉన్నాయి. చట్టీ అంటే యాత్రికులు బస చేయడానికి వసతు లేర్పాటు చేయబడిన అనేక దుకాణాల కూటమి. దుకాణాల్లో మోసం చేయడం చాల తక్కువనీ, ఈ యాత్రలో దొంగతనం ఎక్కడా జరుగదని ప్రకాశ శాస్త్రిగారు వ్రాశారు [25]

బదరీ క్షేత్రం హిమవత్పర్వతాల మధ్య సముద్రమట్టానికి 10,244 అడుగుల ఎత్తున ఉంది. ఇంత ఎత్తు ఎక్కలేని వారికి మూడు యేర్పాట్లున్నాయి. 1. దండీ లేదా డోలీ, 2. ఖండీ, 3. పోనీ (గుర్రము).

దండీ అనేది పడక కుర్చీవలె ఉంటుంది. దీనికి అడ్డంగా కట్టెలు కట్టి, ముందు వెనక ఇద్దరేసి చొప్పున నలుగురు కూలీలు మోస్తారు. 200 పౌన్ల (91 కి.) బరువు గలవారు మాత్రం మరి ఇద్దరు కూలీలను అదనంగా పెట్టు కుంటే, సౌకర్యంగా ఉంటుంది. దండీ ఖరీదు సుమారు 15/- రూ. ఉందట! దీన్ని మొదటే ఖరీదు చేసుకొని, పని పూర్తయిన తర్వాత స్వల్ప ధరకు అమ్ముకోవచ్చు. అంతేకాని ఈ డోలీలు సప్లయి చేయబడవు.

కూలీలను రిజిష్టరు చేసే ఏజన్సీల వద్ద (శ్రీనగర్, కీర్తినగర్, దేవ ప్రయాగలు) రిజిష్టరు చేసినట్లైతే నమ్మకంగా కూలీలు దొరుకుతారు. మోసం జరిగినచో రిపోర్టు చేయవచ్చు కూడ. దండీ (డోలీ)కి కావలసిన నలుగురు కూలీలకు దాదాపు 100/- రూ. ఖర్చయ్యేది. 45 రోజుల వ్యవధిలో యాత్ర పూర్తి చేసుకోవచ్చు. దేవ ప్రయాగ నుండి బయలుదేరక ముందే డోలీల అవస రాన్ని గురించి ఆలోచించాలి. కావాలంటే కూలీలు దొరుకుతారు కాని, మార్గ మధ్యంలో మరెక్కడా డోలీలు దొరకవు.

ఒక మనిషి మాత్రమే మోయగలిగే పేముకుర్చీ ఆకృతిగల బుట్టను ఖండీ (కండీ) అంటారు. యాత్రికుని దానిలో కూర్చోబెట్టి కూలి దాన్ని వీపున గట్టుకొని మోస్తాడు నడువలేని నిరుపేదలు తప్పనిసరిగా వెదకవలసిన ఉపా యాంతరమే కాని దీనివల్ల సౌఖ్యం లేదు. ఖండీకి రానుపోను ఒక రూపాయి నుండి రూపాయి పావలా వరకు వసూలు చేసేవారు.

---

25. బదరీ యాత్ర. — పేజీ. 27

పోనీలు (చిన్న గుర్రాలు) బాడుగకు దొరకుతాయి. ఈ గుర్రాలకు ఒక రూపాయి నుండి రూపాయిన్నర వరకు తీసుకుంటారు. ఐతే ముందుగానే మాట మాట్లాడుకోవటం మంచిది. వీటిపై స్త్రీలు కూడ నిష్ప్రమాదంగా సవారీ చేయవచ్చు. వీటి బాడుగ దేవ ప్రయాగ నుండి బదరికిపోయి రావడానికి 30 - 40 రూ. దాకా ఉంటుంది.

సామానులు మోయటానికి కూడ కూలీలు అవసరమే. వీళ్ళకు సామాన్యపు రేటు మణుగు బరువుగల సామాను ఒక్కంటికి మైలుకు రెండణాలు. ఈ లెక్కన దేవ ప్రయాగ నుండి బదరికి రానుపోనూ ఒక కూలి మనిషికి రూ. 31/- అవుతాయి. యాత్రికులు తక్కువ సంఖ్యలో ఉన్నట్లయితే ఇంకా తక్కువకే దొరుకుతారట కూలీలు. నరసింహంగారు తమ యాత్రలో కూలీకి 26/- రూ.లే. చెల్లించినట్లు వ్రాసుకున్నారు. అదనంగా ఏమీ చెల్లించనవసరం లేకుండానే ఈ కూలీలు మధ్య మకాముల్లో అంట్లు తోమటం, బట్టలుతకటం, నీళ్ళు తెచ్చిపెట్టటం లాంటి పనులు చేసి పెడతారు. వారి భోజనం ఏర్పాట్లు వారే చూసుకుంటారు.

## ii) వెంట తీసుకొని పోవలసిన వస్తువులు :

బదరీ యాత్ర చేయవలసిన వారు వెంట తీసికొని పోవలసిన వస్తువులు లిస్టు వందదాకా ఇచ్చారు ప్రకాశ శాస్త్రిగారు. కాని అందులో ముఖ్యమైనవి, బదరీ మార్గంలో అలభ్యమైనవి: అమృతాంజనం, యూకలిప్టస్ ఆయిల్, దూది, గాజుగుడ్డ, బోరిక్ యాసిడ్, సూదులు, దారపుండలు, చింతపండు, నెయ్యి, పచ్చళ్ళు, పొడులు, ఒరుగు కూరలు, అప్పడాలు, వడియాలు, కొబ్బరినూనె పోపు సామాను.

ముఖ్యంగా సూదులు, దారపుటుండలు కొండవాసులకు దుర్లభములుకాబట్టి యాత్రికులను వారు ఇవి అడుగుతారు. ధన మిచ్చిన దానికన్న మిన్నగా ఈ దానంతో అక్కడి ప్రజలు సంతోషిస్తారు. ఇదే ఇక్కడి ముఖ్యమైన ధర్మం. ప్రతి చట్టిలో 'టీ' దొరుకుతుంది. మజ్జిగగాని, కాఫీ కాని అక్కడ వారికి తెలియదు. కొండ ఎక్కేప్పుడు, దిగేప్పుడు, మనిషి నిలువెత్తు కట్టె అవసరం. ఇవి

26. బదరీ నారాయణ యాత్ర - భారతి. ఫిబ్రవరి, 1940 (పేజీ. 189).

కూడ దారిలో దొరకవు. హరిద్వారంలో కాని, హృషికేశంలో కాని తీసికొని పోవాలి. దాహం తీర్చుకోవటానికి నీళ్ళు త్రాగేకన్న, పటికబెల్లం ముక్క గాని, ఖర్జూరపు ముక్క గాని బుగ్గనుంచుకుంటే ఆయాసం తగ్గుతుంది.

బదరీ నాథంలో సుమారు 300 ఇండ్లుండవచ్చునని సూర్యప్రకాశ శాస్త్రి గారు వ్రాశారు.[27] చాల భాగం రెండంతస్థులేనట. అన్నీ రాతి కట్టడాలే. వస్తువుల ధరలు ప్రియంగా ఉంటాయి. కొండపైకి వస్తువులను తేవడంలో ధరల్లో మార్పు సహజంగానే ఉంటుంది. ఆ శ్రమకు తగ్గ విలువ ఉంటుంది కాదా!

ఆలయంలో బదరీనాథునికి ఎడమ వైపున లక్ష్మి, నర, నారాయణులు, కుడి ప్రక్కన కుబేరుడు, గణపతి, గరుడుడు, క్రింద నారద ఉద్ధవులు ఉన్నారు. ప్రాతః కాలంలో నిర్వాణ దర్శనమవుతుంది. ఈ వేళ "ఏయే మతస్థులు యెట్టి రూపముగ భావించి చూచిన. వారల కాయా రూపముగ స్వామి కనిపించు"నని అక్కడి 'ప్రధానులు' చెప్పగా విన్నారట శాస్త్రిగారు.

బదరీలో విపరీతమైన చలి, రాత్రి మంచు కురుస్తుంది. చలిబాధకు యాత్రికులు సామాన్యంగా వంట చేసుకోరు. రెండు రూపాయలు చెల్లిస్తే ఆలయంలో 'దేవతా ప్రసాదం' ఇచ్చేవారట. అది ఇద్దరు మనుష్యులకు సరిపోయేంత ఉంటుంది.

## iii) యాత్రా ఫలం :

బదరీ క్షేత్రం వెళ్ళేవారు హరిద్వారం గుండానే పోవలసి ఉంది. కాబట్టి మోక్షాన్నిచ్చే సప్తపురులలో నొకటైన హరిద్వారంలో పుణ్యం మూట గట్టుకుంటారు. వెయ్యి కార్తీక స్నానాలు, నూరు మాఘ స్నానాలు, కోటి నర్మదా స్నానాలు చేసిన కలిగే ఫలం కుంభమాసంలో హరిద్వారం వద్ద ఒకసారి స్నానం చేయటం వల్ల కలుగుతుందనీ; వెయ్యి అశ్వమేధాలు, నూరు వాజపేయాలు, లక్ష భూప్రదక్షిణాలు చేసిన ఫలం ఇక్కడ కుంభమాసంలో ఒకసారి స్నానం చేసిన దాన్తో సమానమనీ శాస్త్రిగారు తమ గ్రంథంలో పేర్కొన్నారు.[28]

---

27. బదరీ యాత్ర - పేజీ. 106.
28. సుందర భారత యాత్ర - పేజీ. 39.

# రష్యా యాత్రలు

భారతదేశానికి రష్యా మంచి మిత్రదేశం. రష్యాతో మనకున్న సాంస్కృతిక సంబంధాలు ఈనాటివి కావు. ప్రముఖ చలనచిత్ర నటుడు రాజ్‌కపూర్ మన కెంత తెలుసో వారికీ అంతే తెలుసు. 1952 మార్చి 14 వ తేదీన భారత సోవియట్ సాంస్కృతిక సంఘం (ఇస్కస్) ఆవిర్భావం జరిగిన నాటి నుండి ఇరు దేశాల మధ్య స్నేహ సంబంధాలు మరింత మెరుగయ్యాయి. ఈ సంస్థ కృషివల్ల రష్యాలోని ఒక్కొక్క రిపబ్లిక్‌కూ మన దేశంలోని ఒక్కొక్క రాష్ట్రానికీ బంధుత్వాన్ని ఏర్పరచింది. అలా యేర్పడ్డ చుట్టరికమే ఆంధ్రప్రదేశ్ - ఆర్మీనియా సంబంధం.

భారతదేశం ఆపదలో ఉన్నప్పుడల్లా రష్యా అండగా నిల్చింది. 1947 లో కాశ్మీరు సమస్య మీద, 1965 లో పాకిస్తాన్ దాడి సమయంలో, 1971 లో బంగ్లాదేశ్ విముక్తి పోరాట సందర్భంలో పరీక్షకు నిల్చి నెగ్గిన స్నేహం ఈ రెండు దేశాలది. భారత - రష్యాల మధ్య సుమారు 18 సంవత్సరాల క్రింద జరిగిన శాంతి స్నేహ - సహకార ఒప్పందం రెండు దేశాల మైత్రి అభివృద్ధి పొందడానికి దోహదపడింది. ఉభయ దేశాల మధ్య రాజకీయ, ఆర్థిక, సాంకేతిక, సాంస్కృతిక సహకారం పెంపొందటం ఈ రెండు దేశాల ప్రయోజనాలకే కాక ప్రపంచ శాంతి ప్రయోజనాలకే దోహదం చేసింది.

వీటన్నిటి కంటే ముఖ్యంగా రక్షణపాటవాన్ని పెంపొందించే మన రక్షణ పరిశ్రమలకు రష్యా యిచ్చే సహాయానికి ప్రత్యేక విలువ వుంది.

1917 లో రష్యా విప్లవం తర్వాత ఉభయ దేశాల మధ్య రాకపోకలు ఎక్కువయ్యాయి. 1927 లో సోవియట్ రష్యా పదవ విప్లవ వార్షికోత్సవాలకు హాజరయ్యాడు నెహ్రూ. అదే ఆయన తొలి పర్యటన కూడ. ఇక్కడి పరిణామాలను చూసి ముగ్ధుడై తన సంతోషాన్ని ప్రపంచానికిలా తెలియచేశాడు: "యూరప్ ఆసియా ఖండాలకు విస్తరించిన పవిత్రమైన దేశం రష్యా...ఒకప్పుడు మహాబల

సంపన్నులు కొలువు దీర్చిన సింహాసనాలపై ఇప్పుడు కార్మికులు కర్షకులూ కూచుని ఉన్న దేశం అలా కూచున్నవారు, చిట్టెలుకలూ, మనుషులూ, ఎంతో చాకచక్యంగా పన్నుతున్న సమస్త పథకాలను నిర్వీర్యం చేస్తున్న దేశమిది... రష్యా దేశం సమ్మోహనకరమైనదన్న విషయాన్ని ఎవరూ కాదనలేరు." (ఇనుప తెర వెనుక...డా॥ రావూరి భరద్వాజ పేజీ 168).

తర్వాత 1937 లో నిత్యనారాయణ బెనర్జీ, ఉప్పల లక్ష్మణరావు గారలు రష్యాయాత్ర చేశారు. 1950 లో చండ్ర రాజేశ్వరరావుగారు వెళ్ళివచ్చారు. కాని వీరు వ్రాసిన యాత్రాగ్రంథాలు ఇంగ్లీషులో ఉన్నాయి కాబట్టి ఇక్కడ వాటి గురించి చర్చించలేదు.

పైడి లక్ష్మయ్యగారు అనంతపూర్ జిల్లావారు. రష్యాలోని వ్యవసాయ ప్రదర్శనను చూసిరావడానికి భారత ప్రభుత్వ బృందంతో ఒకరుగా 1956 లో యాత్ర చేశారు. ఆయన పార్లమెంటు సభ్యులుకూడ.

ఢిల్లీలో బయలుదేరిన విమానం బొంబాయికి వచ్చి అరేబియా సముద్రం, ఈజిప్టు రాజధాని కెయిరో, రోమ్, జెకొస్లవేకియా ముఖ్యపట్టణం ప్రేగ్, పోలండ్ ముఖ్యపట్టణం వార్సాల మీదుగా మాస్కో చేరుకుంది. తిరుగు ప్రయాణంలో కూడ లక్ష్మయ్యగారు ఇదేమార్గంద్వారా వచ్చారు. ఆ కాలంలో ఇప్పటి మాదిరిగా అమృతసర్, శ్రీనగర్‌ల మీదుగా నేరుగా తాస్కెంట్, మాస్కో నగరాలకు వెళ్ళే విమానమార్గం లేదు లక్ష్మయ్యగారు రష్యాలో తాస్కెంట్, ఉజ్బెకిస్తాన్, లెనిన్ గ్రాడ్‌లను సందర్శించారు.

లక్ష్మయ్యగారి రష్యా యాత్ర వివరాలు ఆయన 'జ్ఞాపకాలు-వ్యాపకాలు అన్న స్వీయచరిత్రలో 'విదేశ పర్యటన' అన్న శీర్షికకింద ఉన్నాయి.

ఆధునిక కాలంలో రష్యాకు దగ్గరిదారి ఏర్పడ్డాక విమానయానం ద్వారా రాకపోకలు ఎక్కువయ్యాయి. 1976 నుండి జరిగిన యాత్రాల వివరాలు యాత్రా గ్రంథాల ద్వారా తెలుస్తున్నవి.

రష్యా వివరాలు ఇతర ప్రపంచానికి కొత్త కాకపోవచ్చు కాని అవి విభిన్న మనస్తత్వాలుగల యాత్రికుల అనుభవాల ద్వారా చెప్పబడటమే ఇక్కడి

విశిష్టత. ఇవి పత్రికల్లో చదివిన ఒక వార్తకు ప్రత్యక్షంగా చూసిన అనుభవానికి మధ్య తేడా.

1976 నుండి తెలుగువారు రష్యాకు యాత్రచేసి తమ అనుభవాలను గ్రంథస్థం చేసిన వివరాలు ఇక్కడ ఇవ్వబడ్డాయి.

## 1. నెక్కొండవారి 'నా రష్యా పర్యటన'

నెక్కొండ వేంకట జనార్దనరావుగారు 1976 లో రష్యాను సందర్శించారు. యాత్రానంతరం తమ పర్యటనానుభవాలను గ్రంథస్థం చేసి అందరికీ అందిస్తే మరింత లాభదాయకంగా ఉంటుందని భావించి 1977 లో యాత్రా గ్రంథంగా అచ్చొత్తించారు. దీనిపేరు 'నా రష్యా పర్యటన'. రష్యా గురించి తెలుగులో మొట్టమొదట రచింపబడ్డ 'యాత్రా గ్రంథం'గా పేర్కొనవచ్చు. ఆదివరకు మహాకవి శ్రీశ్రీ సోవియట్ రష్యాను 1954-67ల మధ్య సందర్శించి వచ్చినప్పటికీ ఆ యాత్రా వివరాలు వ్యాస రూపంలోనే వెలువడ్డాయి కాని పుస్తకరూపం దాల్చలేదు.

జనార్దనరావుగారు సంపన్న కుటుంబంలో జన్మించారు. లా చదువుతూ మధ్యలో మానేసి వ్యవసాయం చేపట్టారు. ఉద్యోగం చేయాలనే ఆలోచన మానేసి, గ్రామ ప్రజలకు సేవ చేయాలనే తలంపుతో సహకార రంగంలో విశేషమైన కృషి చేశారు. వీరు నిర్వహించిన సహకార సంస్థ గోదావరి జిల్లాలోనే ఉత్తమంగా ఎన్నికైనది.

### i) యాత్ర - ఉద్దేశ్యం :

రష్యాలో సహకార వినియోగదారుల వ్యవస్థ పనితీరును పరిశీలించేందుకు భారత ప్రభుత్వం ఒక యాత్రా బృందాన్ని పంపింది. దక్షిణ భారతదేశానికి ఏకైక ప్రతినిధిగా జనార్దనరావుగారు ఆ బృందంతోపాటు రష్యా పర్యటించారు. దాదాపు రెండున్నర దశాబ్దాల పాటు సహకార రంగంలో విశేషమైన కృషిచేసిన జనార్దనరావుగారి సేవలను మరింతగా వినియోగించుకోవాలనే ఉద్దేశ్యంతో ప్రభుత్వం వీరిని ప్రతినిధిగా పంపించింది.

ఈ యాత్రా బృందం 25-7-1976 న బయలుదేరి 5-8-1976 న తిరిగి భారతదేశం చేరుకుంది. పర్యటన మొత్తం 12 రోజులు సాగింది.

## ii) మాస్కోకు ప్రయాణం :

హైదరాబాద్ బేగంపేట విమానాశ్రయంలో వినియోగదారుల సహకార సంఘాల సమాఖ్య సిబ్బంది ఆదర పూర్వకమైన వీడ్కోలు స్వీకరించి రచయిత ఢిల్లీకి చేరుకున్నారు.

మర్నాడు జాతీయ సహకార వినియోగదారుల సంఘాల సమాఖ్య సిబ్బంది బృందంలో చేరిపోయి, వారితో పాటు విమానంలో రష్యాకు ప్రయాణమయ్యారు.

ఢిల్లీలో విమానం ఎక్కిన తర్వాత రావుగారిలో ఆనందరేఖలు వెల్లివిరిశాయని వ్రాశారు కాని అది విమానయానం వల్ల కలిగిన అనుభూతి కాదు. త్వరలో దర్శించబోయే రష్యా గురించిన ఆలోచన వల్ల కలిగింది. అక్కడి ప్రజలు రష్యాను సోషలిస్టు దేశంగా ఎట్లా రూపొందించుకున్నారనే ఆలోచన వేడి చల్లారకుండానే మాస్కో వచ్చేసింది.

సెంట్రో సూయిజ్ ప్రతినిధులతో పరిచయాల అనంతరం విమానాశ్రయం నుండి కారులో హోటల్‌కు బయలుదేరారు. మాస్కో రాజధానీ నగరం. పాత కొత్తల మేలుకలయిక ఈ నగరం. పాత భవనాల ప్రక్కనే నూతన భవనాల నిర్మాణం జరిగింది. పెట్టుబడిదారీ దేశాలలో వలె ఒకే చోట అందం ముద్దగట్టినట్లుగా సుందర దృశ్యాలూ, మరొక చోట మురికివాడలూ ఇక్కడ లేవు. అంతటా ఒకే రకమైన అభివృద్ధి జరిగిన చోటిది.

## iii) సెంట్రో సూయిజ్ కార్యకలాపాలు :

మొదటి రోజున సెంట్రో సూయిజ్ ఆఫీసును సందర్శించి. ఆ సంస్థ ఉపాధ్యక్షులతో చర్చించి, ఇది నిర్వహించే కార్యకలాపాల గురించి ఆసక్తికరమైన విషయాలెన్నో తెలుసుకున్నారు.

'సెంట్రో సూయిజ్' సోవియట్ రష్యాలో జాతీయ స్థాయి వినియోగదారుల సంఘాల సంస్థ. ఈ సంస్థకు 80 విదేశాల జాతీయ వినియోగదారుల సంఘం సమాఖ్యలతో స్నేహ వాణిజ్య సంబంధాలున్నాయి. వర్ధమాన దేశాలతో

సోషలిస్టు దేశాల సహకార సంస్థలతో సంబంధాలు పెట్టుకుంది. దిగువస్థాయి సంస్థలకు కావలసిన కొనుగోళ్ళకు అధిపత్యం వహిస్తున్నది. ఈ సంస్థ ఎక్ఛేంజ్ పథకం కిందనే ఈ ప్రతినిధి బృందం సోవియట్ పర్యటనకు పూనుకొన్నది.

సోవియట్ రష్యాలో సగం జనాభాకు కావలసిన నిత్యజీవితావసర వస్తువులను ఈ వినియోగదారుల సంస్థలే అందజేస్తాయి. దేశం మొత్తంమీద వ్యవసాయోత్పత్తుల ముడి పదార్థాల కొనుగోలు విషయంలో కీలక పాత్ర వహిస్తాయి ఈ సంస్థలు.

రష్యాలో వినియోగదారుల సహకార సంఘాల ఆధ్వర్యంలో వివిధ రకాలైన చిల్లర మల్లర వ్యాపార కేంద్రాలు 1976 నాటికి 3,70,000 ఉన్నాయట. వీటిలో వివిధ రకాల వస్తువులు-కార్లు టి వి. సెట్లు, రిఫ్రిజిరేటర్లు, బట్టలుతుక్కునే యంత్రాలు, రేడియోలు మొదలగునవి అమ్ముతూంటారు. 76 వేల రెస్టారెంట్లు, భోజన శాలలు, కాఫీ హోటళ్ళు కూడ నడుస్తున్నట్లు రావుగారు వ్రాశారు. సోవియట్ రష్యాలో జరిగే వ్యాపారంలో మూడోవంతు వ్యాపారం ఈ చిల్లర దుకాణాల ద్వారానే జరుగుతుందట!

వ్యవసాయం, పరిశ్రమ రంగాలతో చక్కని సంబంధాలు కలిగి ఉంటుంది ఈ సంస్థ. ఈ విధమైన ఒప్పందం వల్ల సమష్టి క్షేత్ర పద్ధతి బలపడే అవకాశముంది. గ్రామ సీమలలో వ్యాపారాభివృద్ధికై వివిధరకాల వినియోగ వస్తువులు కావాలి. వ్యవసాయోత్పత్తులు కూడ కావాలి. వినియోగదారుల సంఘాలకు ఈ రెంటితో సంబంధం వల్ల రెండురకాల లాభాలున్నాయి. సమష్టి వ్యవసాయ క్షేత్రాలు తమ ఉత్పత్తులను అమ్ముకునేందుకై దూరప్రాంతాలకు తీసుకు వెళ్ళవలసిన అవసరం లేదు. దానితో రవాణా ఖర్చులు చెయ్యవలసిన పనీ ఉండదు. రెండోది : తమకు కావలసిన సరుకులకు గాను గ్రామాలను విడిచిపెట్టి మరెక్కడికో వెళ్ళవలసిన పనిలేదు. ఈ విధంగా ఖర్చు తగ్గి, సమయం ఆదా కావటం వల్ల కార్మిక ఉత్పాదక శక్తి పెరుగుతుంది.

## iv) వినియోగదారులకు వివిధ సేవలు :

వ్యవసాయదారులకు సమయం వృధా కాకుండా ఉండేందుకు ఈ సంస్థ కొన్ని కార్యక్రమాలను ప్రారంభించింది. అందులో ఒకటి 'స్వయంసేవ' పద్ధతిపై సరుకులను విక్రయించడం. ఇదివరకైతే పురుషులకు, స్త్రీలకు, బాలురకు వేర్వేరుగా దుకాణాలుండేవి. ఆయా దుకాణాల్లో వారివారికి సంబంధించిన సరుకులే దొరికేవి. ఈ పద్ధతి వల్ల వినియోగదారులు అనేక ఇబ్బందులకు గురయ్యేవారు. పర్యటన కాలంనాటికి ఈ పద్ధతికి స్వస్తి చెప్పి అన్ని రకాల వస్తువులు ఒకేచోట లభించేలా వినియోగదారుల సహకార సంఘాల ఆధ్వర్యంలో దుకాణాలు నెలకొల్పబడుతున్నాయి. సెల్ఫ్ సర్వీస్ పద్ధతిపై సరుకులను విక్రయించే దుకాణాలు 1976 నాటికే 85 వేల వరకు రష్యాలో ఉన్నట్లు జనార్దనరావుగారు పేర్కొన్నారు.

వినియోగదారులు ఇచ్చిన ఆర్డర్ల ప్రకారం సరుకులను ఇంటి దగ్గర అప్పగిస్తాయి ఈ సంఘాలు. పచ్చిక బీళ్ళ దగ్గర కాపలాదారులకు, పశువుల పెంపకం క్షేత్రాల దగ్గర ఉన్నవారికి కూడ సరుకులను డెలివరీ చేసే పద్ధతిని ప్రవేశపెట్టాయి. వినియోగదారులకు కావలిస్తే పట్టణాల్లో సరుకులను కొనుక్కొని తిరిగి రావడానికి ప్రత్యేక షాపింగ్ రవాణా సౌకర్యాన్ని కూడ కలుగజేస్తున్నాయి. అంతేకాకుండా వస్తువుల యొక్క నాణ్యతలకు సంబంధించిన విషయాల్లోకూడ ఉచిత సలహా లిస్తాయి.

వినియోగదారుల సంస్థలు ఈ విధంగా ప్రజలు వివిధ రకాల దోపిడీల నుంచి విముక్తం కావటానికి దోహదపడుతున్నాయి. ఐతే ఇదంతా సెంట్రో సూయిజ్ సంస్థ తెలియజేయగా విన్న విషయాలు మాత్రమే. ఈ కార్యక్రమాలన్నీ ఇదే విధంగా అమలు జరుగుతున్నాయా! అన్నది పరిశీలనలో తేలవలసిన అంశం. అందుగ్గాను రష్యాలో ఏఏ ప్రాంతాలను, సంస్థలను పర్యటించాలో ఒక కార్యక్రమం రూపొందించబడింది. ఈ పర్యటనలో భాగంగా క్రాసనోడార్ ప్రాంతాన్ని మూడు రోజుల్లో దర్శించడానికి బయలుదేరారు.

## v) క్రాసనోడార్ ప్రాంత పర్యటన :

క్రాసనోడార్ నల్ల సముద్ర ప్రాంతంలో ఉంది. ఈ ప్రాంతంలో నాజీ నియంతల దురాగతాలకు బలైపోయిన ప్రదేశాల్లో నెవస్టపూల్, క్రెచ్ అనే ఊళ్ళు ముఖ్యమైనవి. ఇక్కడి విప్లవ సైనికుల ఉత్తేజకరమైన చరిత్ర పూర్తిగా తెలుసుకునేసరికే క్రాసనోడార్ చేరుకున్నారు.

భారతీయ బృందానికి వివిధరకాల షాపులు చూపబడ్డాయి. షాపింగ్ కేంద్రాల్లో ఒక డిపార్టుమెంటల్ స్టోరు, పిల్లల దుకాణం, మాంసం కూరగాయల దుకాణాలే కాక రెస్టారెంట్, కేఫ్‌లు కూడ ఉంటాయి. అన్నీ 'స్వయంసేవ' పద్ధతిలోనే నిర్వహింపబడతాయి. షాపింగ్ కేంద్రం సైజు వస్తువుల గిరాకీనిబట్టి, ఆ ప్రాంతం జనాభానుబట్టి ఒక భవనంలోగాని, నాలుగైదు భవనాల్లోగాని ఉంటుంది.

చిన్న చిన్న గ్రామాలకు ఉపయోగపడేవిధంగా నిత్య జీవితావసర వస్తువులనమ్మే దుకాణాల రూపకల్పన జరిగింది. ఇవి బహుళ జనాదరణ పొందిన వాణిజ్య సంస్థలు. ఈ దుకాణాలలో లేని వస్తువులు కావాలంటే ఆర్డరు ప్రకారం ప్రక్కనున్న షాపింగ్ కేంద్రాలనుండి తెప్పించి అందజేస్తారు. ఐతే విశాలమైన సోవియట్ యూనియన్‌లో ప్రతిచోట ఒక దుకాణం ఏర్పాటు చేయడంకూడ కష్టమైన పనే. అందుకని సంచార దుకాణాల ద్వారా మారుమూల ప్రాంతాలకు సరుకులు రవాణా చేస్తుంటారని రావుగారు వ్రాశారు.

## vi) సేకరణ కేంద్రాలు/కొనుగోలు సంస్థలు :

ఒకరోజు జనార్ధనరావుగారు తన బృందంతోపాటు సేకరణ కేంద్రానికి వెళ్ళారు.

సేకరణ కేంద్రాలు రహదారీమార్గం దాపున ఉంటాయి. ఎక్కువగా వ్యవసాయోత్పత్తులు దొరికే ప్రాంతాల్లో నెలకొల్పబడతాయి. రష్యా ప్రభుత్వం కొన్ని రకాల వస్తువులనే కొనుగోలు చేస్తుంది. కాని ప్రభుత్వం ఇచ్చిన ప్రణాళిక ప్రకారం సహకార సంఘాలు దాదాపు 60 రకాల వ్యవసాయ ఉత్పత్తులను కొంటాయి.

కొనుగోలు సంస్థలకు కొన్ని నియమాలు, ఆస్తులు, నిధులు ఉంటాయి. వస్తువుల ప్రమాణాలకు బాధ్యత వహిస్తాయి. ప్రతీ సంస్థకు సరుకుల సేకరణకు అవసరమైన గిడ్డంగులు, రిసెప్షన్ కేంద్రాలు, డిపోలు, ప్రాసెసింగ్ కేంద్రాలు ఉంటాయి.

సమష్టిక్షేత్రాంలో, ప్రభుత్వ క్షేత్రాలలో వినియోగదారుల సహకార సంఘాలు, ఐదేళ్ళపాటు అమలులో ఉండే విధంగా దీర్ఘకాలిక ఒప్పందాలను కుదుర్చుకుంటాయి. దీనివల్ల సంఘాలకు నాణ్యమైన సరుకులు దొరుకుతాయి.

## vii) రొట్టెల ఫ్యాక్టరీ :

సహకార సంఘాల యూనియన్ నిర్వహించే ఒక రొట్టెల ఫ్యాక్టరీని సందర్శించింది బృందం. శాస్త్ర విజ్ఞానంతో ఆధునిక యంత్రాలతో రొట్టెలు, బన్నులు తయారవుతున్నాయి. ఇళ్ళ దగ్గర కూడ రొట్టెలు తయారుచేసే పద్ధతికి స్వస్తిచెప్పి, ఈ ఫ్యాక్టరీలలో తయారయ్యే 'రొట్టెలనే సంఘాల ద్వారా ప్రజలు పొందుతున్నారు. యంత్రాల సహాయంతో నడిచే ఒక్కో కంటైనర్ 24 గంటల్లో ఐదు టన్నుల రొట్టెలను తయారు చేస్తున్నాయట!

## viii) లెనిన్‌గ్రాడ్ ప్రయాణం :

జనార్ధనరావు గారు బృందంతో పాటు విమానంలో లెనిన్‌గ్రాడ్‌కు ప్రయాణమయ్యారు. ఇది క్రాసనోడార్ ప్రాంతానికి ఉత్తరంవైపు ఉంది.

లెనిన్‌గ్రాడ్ పేరు మొదట సెంట్ పీటర్స్‌బర్గ్. ఇదే పెట్రోగ్రాడ్ అని కూడ పిలువబడేది. రష్యా విప్లవ నిర్మాత ఇక్కడ కొన్నాళ్ళు అజ్ఞాత జీవితం గడపడంవల్ల ఆ మహానాయకుని స్మృతిచిహ్నంగా పెట్రోగ్రాడ్‌ను 'లెనిన్ గ్రాడ్'గా మార్చుకున్నారు. 1924 లో ఈ పేరు మార్పు జరిగింది.

## xi) అంతర్‌రాష్ట్ర టోకు వ్యాపారం డిపో :

రష్యాలో 1976 నాటికి 500 పైగా డిపోలున్నాయట. మానవ శక్తిని ఎక్కువగా వినియోగించకుండా, గిడ్డంగిలో దాచిన ఏ వస్తువునైనా యంత్రాల సాయంతోనే తీసి ఎగుమతి చేస్తారు.

చిల్లర మల్లర వ్యాపారం వినియోగదారులకు ప్రయోజనకారిగా ఉండాలంటే టోకు వ్యాపారం కట్టుదిట్టంగా చేయాలి. టోకు వ్యాపారం బాగా అభివృద్ధి చెందితే వినియోగదారుల సహకార సంఘాలు మంచి లాభసాటిగా పనిచేస్తాయి.

చిల్లర వ్యాపార సంస్థల వ్యాపార సామర్థ్యం దెబ్బ తగలకుండా తగు శ్రద్ధ వహిస్తాయి ఈ టోకు వ్యాపార కేంద్రాలు. అంతకు ముందు గిరాకీ లేని సరుకులను అందజేస్తే వాటిని తీసుకొని, గిరాకీ వున్న వస్తువులను విడుదల చేస్తాయి.

## x) లెనిన్‌గ్రాడ్‌లో దర్శనీయ స్థలాలు :

లెనిన్‌గ్రాడ్ పర్యాటకులకు ఎంతో ఉత్తేజాన్ని కలిగిస్తుంది. చరిత్రకు సంబంధించిన స్మృతిచిహ్నాలు అక్కడ భద్రంగా పదిలపరచబడ్డాయి. మృత వీరుల స్మారకవాటిక, జార్ చక్రవర్తి నివాస భవనం, పుష్కిన్ ఉద్యానవనం, లెనిన్ నివాస గృహం, లెనిన్ పయనించిన రైలు, రష్యా సైనికులు ఉపయోగించిన ఓడ, ఆర్ట్‌గ్యాలరీ, వస్తు ప్రదర్శనశాలలను రావుగారు బృందంతోపాటు సందర్శించారు. "లెనిన్ గ్రాడ్ విప్లవకారులకే కాదు, కళాకారులకు కూడ పుట్టినిల్లు" అని ఆ ప్రాంతం దర్శించిన తర్వాత రావుగారికి కలిగిన అభిప్రాయం.

రెండో ప్రపంచ యుద్ధ కాలంలో ఎంతగానో సర్వనాశనం అయిన లెనిన్ గ్రాడ్ నగరం తొందరలోనే అపురూప సుందర నగరంగా పునర్నిర్మింపబడింది.

## xi) మాస్కోలో సహకార శిక్షణా కేంద్రం :

లెనిన్‌గ్రాడ్ నుండి మాస్కోకు వచ్చిన తర్వాత సెంట్రో సూయిజ్ సంస్థ నిర్వహించే 'సహకార శిక్షణ కేంద్రాన్ని' సందర్శించారు. కొనుగోళ్ళు, అమ్మకాల విషయంలో సంపూర్ణ విజ్ఞానం కల నిపుణులుగా తయారుచేయవలసిన బాధ్యత సహకార శిక్షణా సంస్థలపై ఉంది. ప్రతి సంవత్సరం 1,80,000 మంది షాపు అసిస్టెంట్లు, వంటపనివారు, కొనుగోలుదారులు, ఇతర కార్మికులకు ఈ సంస్థల్లో శిక్షణ లభిస్తుంది. వీరిలో 50 వేల మంది ఉద్యోగాల్లో చేరిపోతారు.

షాపు అసిస్టెంట్లకు దుకాణాల నిర్వహణ విషయమే కాకుండా ఇవి వినియోగదారునికి ఉత్తమ సలహాదారునిగా పనిచేసే విధంగా శిక్షణనిస్తాయి.

## xii) మాస్కో నగర సందర్శనం :

మాస్కో రష్యా సంస్కృతికి కీలక కేంద్రం. ఇక్కడ యాత్రా ప్రదేశాలు అసంఖ్యాకం. రావుగారు దర్శించిన వాటిలో లెనిన్ ముసోలియం ముఖ్యమైనది. ఇందులో లెనిన్ మృతదేహం భద్రపరచబడి ఉంది. క్యూలో నాలుగు గంటలైనా నిలబడితేగాని మృతదేహం సందర్శించటానికి వీలు కాలేదు. రావుగారు లెనిన్ మృతదేహానికి శ్రద్ధాంజలి ఘటించారు. రెడ్ స్క్వేర్, క్రెమ్లిన్ భవనం, రష్యన్ సర్కస్, రష్యా బ్యాలడ్ - ఇవన్నీ చూసిన తర్వాత రావుగారు మాస్కోను "ప్రదర్శన నగరం" అన్నారు. ఐతే ఇది నిర్జీవ వస్తువుల ప్రదర్శనశాలగా కాక సజీవమూర్తుల ప్రదర్శనశాలగా ఆయనకు తోచిందట!

తర్వాత వాణిజ్య విషయాల చర్చల్లో పాల్గొన్నారు.

సోవియట్ రష్యాలో ప్రైవేట్ వ్యాపారం లేదు. వనరులన్నీ ప్రభుత్వ అధిపత్యంలోనే ఉన్నాయి. ఉత్పత్తి ప్రభుత్వాధీనంలో ఉండటంవల్ల చిల్లర మల్లర వ్యాపారం ఎక్కువగా చేయటానికి సహకార సంఘాలు దోహదం చేస్తున్నాయి. ఐతే మన దేశంలో ప్రైవేటు వ్యాపారముంది. సహకార వినియోగ దారుల సంఘాలు వీళ్ళ పోటీకి తట్టుకొని పనిచేయాలి.

వాణిజ్య విషయాల గురించి బృందం జరిపిన చర్చలు ఉభయ దేశాల వినియోగదారులకు ఎంతగానో ప్రయోజనం కలిగించేవి. మనదేశంలో ఉత్పత్తి అయ్యే నూలు, ఉన్ని వస్తువులు, పాదరక్షలు, రెడీమేడ్ వస్తువులకు, సుగంధ ద్రవ్యాలకు సోవియట్ రష్యాలో మంచి గిరాకీ ఉంది. "జాతీయ వినియోగదారుల సమాఖ్య, నేఫెడ్, సెంట్రో సూయిజ్ సంస్థతో పటిష్టమైన సంబంధాలు పెంపొందించుకుంటే ఉభయ దేశాల వినియోగదారులకు వ్యాపారం ద్వారా ఎంతో లాభం కలుగుతుం"దన్న విశ్వాసం రావుగారికి ఈ పర్యటన ద్వారా కలిగిందట!

ఈ గ్రంథంలో యాత్రానుభవాలకంటే యాత్ర ఉద్దేశ వర్ణన ఎక్కువగా ఉంది. లెనిన్‌గ్రాడ్, మాస్కోలలోని జనజీవనాన్ని గురించి చెప్పడం దీని

ధ్యేయం కాదు. కేవలం వినియోగదారుల సమాఖ్య ప్రతినిధిగా ఆ రంగానికి సంబంధించిన అభివృద్ధిని పరిశీలించడానికే, దానికి సంబంధించిన విజ్ఞానాన్ని సంపాదించుకోవడానికె చేసిన 'ఔపయోగిక పర్యటన' ఇది. సోవియట్ రష్యాలోని 'సెంట్రో సూయిజ్' సంస్థ నిర్వహించే కార్యక్రమాల సమీక్షాత్మక రచన కాబట్టి దీనిలో యాత్రా చరిత్ర లక్షణాలకంటే నివేదిక లక్షణాలే ఎక్కువ.

## 2. పిచ్చయ్యగారి 'ప్రథమ సోషలిస్టుదేశంలో పర్యటన-పరిశీలన'

చుక్కపల్లి పిచ్చయ్యగారు రచించిన ఈ యాత్రాగ్రంథం 40 పుటల చిన్న పుస్తకం. మొదటి ముద్రణ అక్టోబర్ 1980 లో. అభిమానుల ఆదరణ వల్ల మరి మూడు నెలల కాలంలోనే అంటే జనవరి 1981 నాటికి నాలుగు ముద్రణలు పొంది లక్షప్రతుల దాకా అమ్ముడయ్యాయి.

ఇది చిన్న పుస్తకమే ఐనా విస్తారమైన వ్యాప్తిని పొంది సోవియట్ రష్యా పట్ల తెలుగు వారికి ఆదరాభిమానాలు పెంపొందటానికి తోడ్పడిందని వెంట వెంట ముద్రించిన ప్రతుల సంఖ్యే చెబుతున్నది.

ఈ పుస్తక రచయిత చుక్కపల్లి పిచ్చయ్యగారు. పాపులర్ షూమార్ట్ గ్రూపు సంస్థలకు ఈయన మార్గదర్శకుడు. 1970లో మొదటి సారి, 1979లో రెండవసారి రష్యాను సందర్శించి వచ్చారు. రెండవ యాత్ర కుటుంబ సభ్యులతో చేశారు.

8-12-1980 నాటి విశాలాంధ్ర దినపత్రిక ఈయన శైలి గురించి ఇట్లా మెచ్చుకుంది: "అనుభవజ్ఞులైన పాత్రికేయులు మాత్రమే వర్ణించగల రీతిలో యాత్రా విశేషాలను ఆకర్షవంతంగా చెప్పిన రచయిత కృషి ప్రశంసనీయం."

సోవియట్ పర్యటనను 'వినోదయాత్రగా కాక విజ్ఞాన యాత్రగా భావించాలని' భావి పర్యాటకులను హెచ్చరించడంలో వీరికి సోషలిజంపట్ల ఉన్న అభినివేశం స్పష్టమౌతుంది.

## i) రచనోద్దేశ్యం :

తమ పర్యటనలో పరిశీలించిన విషయాలను ప్రజలకు తెలియజేయాలన్న సంకల్పంతో రచయిత ఈ పుస్తకాన్ని రచించారు. ఆశించిన దానికన్నా ఎక్కువ ఫలితాన్ని పొందారు కూడ.

ప్రథమ సోషలిస్టు దేశమైన సోవియట్ యూనియన్‌లో 28-4-79 నుండి 17-5-79 దాకా పిచ్చయ్య గారు పర్యటించి వచ్చారు. 17 మంది సభ్యులు గల భారత బృందానికి నాయకు డీయన. ఈ 19 రోజుల పర్యటన ఫలితంగా వీరికి కలిగిన అభిప్రాయాలు, పరిశీలనకు అందిన వాస్తవ విషయాలు ఈ గ్రంథంలో వివరింపబడ్డాయి.

## ii) యాత్రా సన్నాహం :

కేంద్ర ఇస్కాసు ఆఫీసు (ఢిల్లీ)లో వీసాల కోసం అప్లికేషన్‌లు పెట్టుకున్నారు. రిజర్వు బ్యాంకు యాత్రికులకిచ్చే 160 డాలర్లకు, డాలరుకు 8-45 రూపాయల చొప్పున చెల్లించారు. యాత్రికులంతా ఇక్కడే కలుసుకున్నారు. మొత్తం 17 మందిలో ఆంధ్రప్రదేశ్ నుండి 12 మంది, తమిళనాడు నుండి 5 గురు. వీళ్ళల్లో వృత్తిరీత్యా వ్యాపారులు, కాంట్రాక్టర్లు, కళాకారులు, డాక్టర్లు, విద్యార్థులు, భూస్వాములు, నలుగురు స్త్రీలు ఉన్నారు.

సోవియట్ రాయబార కల్చరల్ వింగ్ వద్ద వీడ్కోలు సమావేశంలో గ్రూప్ లీడర్ ఎన్నిక జరిగింది. రష్యా గురించి వివరణ కూడ ఇచ్చారు.

28 వ తేదీ ఉదయం 9-30 గంటలకు ఢిల్లీ విమానాశ్రయం నుండి రష్యన్ విమానం 'ఏరోఫ్లోట్'లో ప్రయాణం. దీనిలో 178 సీట్లున్నాయి. హిమాలయ శిఖరాలు చూస్తూండగానే తాష్కెంటు విమానాశ్రయం వచ్చేసింది. రెండున్నర గంటల ప్రయాణం. మన కాలమానం ప్రకారమైతే 12 గంటలు కావాలి. కాని తాష్కెంటులో 12-30 అయింది.

## iii) తాష్కెంటులో :

ఎయిర్‌పోర్టులో వీసాలు, సూట్‌కేసుల చెకింగ్, పాకెట్‌మనీ డిక్లరేషన్ లాంటి తతంగం పూర్తయే సరికి సాయంత్రం నాలుగు గంటలైంది, గైడ్

లియోనిద్‌కు 28 సంవత్సరాలు ఇన్టూరిస్ట్ బస్సులో దాదాపు 20 కి.మీ. ప్రయాణం చేసి 'ఉజ్బెకిస్తాన్' హోటల్ చేరుకున్నారు 340 డాలర్ల చొప్పున (2900రూ॥) ఢిల్లీ నుండి పంపబడిన చెక్కులను ఇన్‌టూరిస్ట్ డిపార్టుమెంటు వారికి అందజేశారు. పాస్‌పోర్టులు దగ్గరుంచుకొని వీరికి హోటల్ గదులు కేటాయించారు. ఆ హోటల్ 16 అంతస్తులది. 550 గదులతో అర్ధ చంద్రాకృతిలో ఉంది. 3 పెద్ద డైనింగ్ హాల్సు ఉన్నాయి.

రాత్రి డిన్నర్‌లో వడ్డించిన పదార్థాల లిస్టు : బ్రౌన్ బ్రెడ్, వైట్ బ్రెడ్, బన్, జామ్, బటర్, వరి అన్నము (అర్ధరు మీదనే), టమోటో, చికెన్ సూప్స్, చేప, మాంసము, వండిన బంగాళా దుంప, ఉడకబెట్టిన కోడిగ్రుడ్లు, అట్టు, కాఫీ, టీ, మీగడ క్రీమ్, అయిస్, కోకోకోలా, మినరల్ వాటర్, టమాటో దోసకాయ పచ్చి ముక్కలు - తర్వాతి రోజుల్లో లంచ్‌లోకూడ ఇవే వడ్డించారట.

సిటీ టూర్ నైట్ సీయింగ్‌లో 50' ఎత్తుగల లెనిన్ బొమ్మ, లాల్‌బహదూర్‌శాస్త్రి గారి పేరుమీద నడుపబడుతున్న సెకండరీ స్కూలు మొదలగునవి చూశారు. ఈ స్కూలులో పిల్లలకు హిందీ నేర్పుతున్నారు.

రాత్రి సర్కసు చూశారు. 3,000 మంది కూర్చొనుటకు అవకాశమున్న పర్మనెంటు హాలు ఇది.

సోవియట్ రష్యాలో మూడవ పెద్ద నగరం తాష్కెంట్. ఇక్కడి జనాభా 1976 లోనే 18 లక్షలు.

## iv) మాస్కోలో :

30-4-79 ఉదయం 9-30 గంటలకు ఏరోఫ్లాట్ విమానంలో 3000 కి.మీ దూరం నాలుగు గంటలు ప్రయాణించి, అదే టైముకు (9.30 ఎ.ఎమ్.) మాస్కో ప్రాంతీయ విమానాశ్రయంలో దిగారు. ఇన్‌టూరిస్ట్ బస్‌లో 30 కి.మీ. ప్రయాణం. దారిలో 10 అంతస్తుల భవనా లనేకం కనిపించాయి. నగరం మధ్యలో ఉన్న 'హోటల్ రష్యా'లో బస. దీనిలో 3000 గదులు, 21 అంతస్తులు, ఆరువేల పడకలున్నాయి. రూములలో టి.వి., ఫోను, హీటర్, ఫ్రిజ్, స్నానాల టబ్, అన్ని వేళల్లో వేడి నీటి సౌకర్యం ఉంది. హోటల్ అంతా స్త్రీల చేతనే నిర్వహింపబడుతున్నట్లు కనిపించిందట,

మాస్కోలో జనాభా 70 లక్షలు. మే డే ఉత్సవంలో శాంతి, ఐక్యతల గురించి మైకులో చెబుతూ చివరగా 'ఉర్రా' అని నినాదం ఇవ్వగా, లక్షలాది జనం ఏక కంఠంతో 'ఉర్రా' అని నినాదాలిస్తూ, జెండాలు ఊపుతూ సాగి పోయారట! ఆరోజు రాత్రి 9 గంటలకు ప్రజలు అనేక మంది వచ్చి రెడ్ స్క్వేర్‌లో టపాకాయలు పేల్చి ఆనందోత్సాహాలు వెల్లడించడం ఆచారం!

టి.వి.లో మే డే ప్రదర్శకుల సంఖ్య సుమారు 10 లక్షలు ఉండవచ్చుననీ, చూడటానికి వచ్చిన ప్రజలు మరో 10 లక్షల పైగా ఉండవచ్చుననీ అంచనా వేయబడింది.

అదే రాత్రి లెనిన్ ముసోలియం వద్ద పది గంటలు మోగేసరికి అక్కడి సంప్రదాయ దృశ్యం చూడటానికి అనేకమంది హాజరవుతారు, క్రెమ్లిన్ గంటలు మోగగానే, కొత్తవారు మార్చింగ్‌లో వచ్చి ముఖద్వారం వద్ద అదివరకే డ్యూటీ చేస్తున్న ఇద్దరు గార్డులను డ్యూటీనుండి మార్చుతారు. యంత్రాల వలె మనుషులు మారటాన్ని తిలకించటం ఇక్కడ పరిపాటి.

ఈ దేశంలో చారిత్రక ప్రాముఖ్యం గల ప్రతి కట్టడాన్ని చాలా జాగ్రత్తగా భద్రపరుస్తారు, కాపాడతారు. రోడ్డును విస్తృతపరచడంలో భాగంగా అడ్డంవచ్చిన ఒక చారిత్రక భవనంలో సగం విడదీసి జరిపారట. మిగిలిన సగం ఇంకా జరపవలసి ఉందట. ఈ విషయం తమ ప్రయాణంలో పిచ్చయ్య గారు గమనించారు.

ఆ రోజు 805 హెక్టార్ల ఏరియాలో రిపబ్లిక్కుల యొక్క ప్రత్యేక శాలలలో 80 రంగాలలో రష్యాలో సాధించిన ప్రగతిని ట్రాంబండీలో ప్రయాణించి చూశారు. స్క్వేర్ ఆఫ్ ఫ్రండ్ షిప్‌లో 16 రిపబ్లిక్కుల సంస్కృతీ చిహ్నలుగా 16 స్త్రీ ప్రతిమలను ఫౌంటెన్ చుట్టూ అమర్చిన వాటిని చూశారు. సినోరమ, టి.వి. టవర్, మాస్కో యూనివర్సిటీ, లెనిన్ స్టేడియం చూశారు.

తర్వాత లెనిన్ చివరి రోజుల్లో నివసించిన (1918-1924) గోర్కి లెనిన్ స్వియర్ అనే గ్రామానికి వెళ్లారు. ఇది మాస్కోకు 30 కి.మీ దూరం. ఇక్కడ లెనిన్ ఉపయోగించిన వస్తువులు, కోటు, బూటు, ఉత్తరాలు, పేపర్ కటింగ్స్, ప్రతిరోజు కూర్చునే అనుడుబల్ల అన్నీ వున్నాయి. వీటిని చాలా జాగ్రత్తగా భద్రపరిచారు.

పనోరమ పెయింట్స్ ఆర్ట్ గ్యాలరీలో 1812 నాటి నెపోలియన్ దండ యాత్ర దృశ్యం కనుల యెదురుగా జరుగుతున్నట్లే చిత్రింపబడింది.

మే 9 వ తేదీ ఫాసిజం లొంగిపోయిన రోజు. ఆ సందర్భంగా కొన్ని రోజుల ముందునుండే అన్ని థియేటర్లలో జర్మనీ ఓడిపోయిన సినిమా ప్రదర్శిస్తున్నారట. పిచ్చయ్యగారు హాలు మధ్యలో కూర్చుని ఆ సినిమా చూశారట. థియేటరు మధ్యలో కూర్చుంటే 80, ముందు వెనకాల ఐతే 40 కోపెక్కులు చెల్లించాలి అన్నారు.

పిదప లెనిన్ ముసోలియం చూడటానికి వెళ్ళారు. అక్కడ సుమారు కిలోమీటరు పొడవు క్యూ ఉంది. రెడ్‌స్క్వేర్ మధ్యవున్న లెనిన్ ముసోలియం చేరేసరికి గంటన్నర పట్టింది. రెడ్ స్క్వేర్ అంటే వాళ్ళ భాషలో 'అందమైన ప్రదేశమని' అర్థమట. కెమెరాలు, వస్తువులు క్యూలో తీసుకుపోనివ్వరు. అనేక మెట్లు క్రిందికి దిగిన తర్వాత మధ్యలో ఒక ఎత్తైన పాన్పు మీద లెనిన్ భౌతిక దేహాన్ని గాజుపెట్టెలో భద్రపరచారు. అంతా నిశ్శబ్దంగా చూసి వెళ్ళిపోతున్నారనీ, భద్రతా ఏర్పాట్లు కట్టుదిట్టంగా ఉన్నాయనీ పిచ్చయ్యగారు వ్రాశారు.

లెనిన్ భౌతిక కాయం చూస్తుంటే పిచ్చయ్యగారికి ఆ మహానుభావుడు **'అలసి విశ్రాంతి తీసుకుంటున్న'** భావన కలిగిందట. లెనిన్ మరణించి అప్పటికి ౬౯ సంవత్సరములు గడిచిపోయినా ఇంకా విశ్రాంతి తీసుకుంటున్న రీతిలోనే కనిపించటం ఆశ్చర్యమే మరి. రష్యనులు తమకు అపురూపమైన వాటిని అంత భద్రంగా ఉంచగలరన్నమాట! ప్రపంచంలోని మానవ దేహాన్ని భద్రపరచిన మొట్టమొదటి దేశం రష్యా. తర్వాత హోచిమిన్, మావో భౌతిక కాయాలను కూడ వారి దేశాలలో భద్రపరిచారట.

ఒకప్పుడు ప్రసిద్ధి చెందిన క్రెమ్లిన్ కోట ఇప్పుడు పార్లమెంటు భవనంగా ఉపయోగపడుతున్నది. అక్కడ పూర్వపు రాజులు ఉపయోగించిన వస్తువులతో కూడిన మ్యూజియం ఉంది. **ప్రపంచంలో కెల్ల పెద్ద గంట 200 టన్నుల బరువుగల కంచుగంట ఇక్కడే ఉంది. దీని ఎత్తు 6 మీటర్లు.**

మెట్రో భూగర్భ రైల్వేలో 5 కోపెక్కుల ఛార్జీతో ఎంత దూరమైనా ప్రయాణించవచ్చు ఇక్కడి మార్కెట్టును 'బూమ్' అంటారు. క్వాలిటీ ఎన్నిక గురించిగాని, రేటు సమస్యగాని లేకుండా వెంటనే వస్తువును సెలెక్టు చేసుకో గలుగుతాము. ఎందుకంటే అక్కడి ప్రతి వస్తువుకు రేటు నిర్ణయించి బోర్డుకట్టి వుంచుతారు.

డాలర్లను అమ్మే షాపుల పేరు 'బెరి యొస్కా'. 35 డాలర్లకు ఎలక్ట్రా నిక్‌వాచ్, 15 డాలర్లకు ఆడవారి వాచీ కొన్నారు. మాస్కోలో బిచ్చగాళ్ళు, అంధులు, వికలాంగులు మచ్చుకైనా కనిపించలేదట!

## v) లెనిన్‌గ్రాడ్‌లో :

మాస్కోనుండి లెనిన్‌గ్రాడ్‌కు 600 కి. మీ. ఈ దూరాన్ని విమానంలో ఒక గంటలో చేరుకున్నారు. విప్లవానికి ముందు రష్యాకు రాజధాని పీటర్‌గ్రాడ్. అదే ఇప్పుడు లెనిన్‌గ్రాడ్ అయింది. ఇక్కడ ఈదురుగాలిలో కూడ 4 డిగ్రీల సెంటిగ్రేడు టెంపరేచరున్నదట.

లెనిన్ గ్రాడ్‌కు నూటొక్క దీవుల నగరంగా పేరుంది. నీవానది నగరం గుండా అనేక పాయలుగా ప్రవహిస్తూంటుంది. ప్రధానమైన పాయగుండా లాంచీలు, స్టీమర్లు వెళ్తుంటాయి.

హిట్లర్ ఈ నగరాన్ని ముట్టడించిన సందర్భంగా 5 లక్షలమంది మర ణించారు. అనేక భవనాలు, ఫ్యాక్టరీలు ధ్వంసం చేయబడ్డాయి. ఐతే వంతెనలు, రోడ్లు, ఫ్యాక్టరీలు ఉన్నవి ఉన్నట్లుగా మళ్ళీ రూపొందించుకున్నారు.

లెనిన్ గ్రాడ్‌లో 3 గంటలకే తెల్లవారుతుంది. రాత్రి 9 గంటలకుగాని చీకటి పడదు. జూన్ 22వ తేదీన అసలక్కడ చీకటే పడదట! అంటే 24 గంటలు పగలే. ప్రపంచానికి ఉత్తరం దిక్కున్న నగరం కాబట్టి ఇక్కడి వాతా వరణం ప్రత్యేకంగా ఉంటుంది.

జారు చక్రవర్తులనాటి రాజప్రాసాదం వింటర్ ప్యాలెస్. 1000 గదు లున్నాయి. అనేక వస్తువులు, పెయింటింగులు, రాజుల, సైన్యాధిపతుల బొమ్మలు ప్రదర్శింపబడ్డాయి. **ఒక్కొక్క వస్తువు అరనిమిషం చొప్పున చూస్తూపోతే అక్కడే మూడు సంవత్సరాలు పడుతుందని** పిచ్చయ్యగారు వ్రాసిన విషయం

ఆలోచింపదగ్గదే. నీవానది మధ్యలో ఉన్న రాజకీయ జైలులో డాన్సింగు, ఫీల్డు, చిత్రహింసల గది చూశారు. సూదుల్లా చెక్క మేకులు పాతి, రాజకీయ ఖైదీలను వీటిపై నడిపించి హింసించేవారు. ఈ స్థలాన్ని డాన్సింగు ఫీల్డు అనేవారు.

ప్రజలకు సమయం తెల్పడానికి ఇక్కడ ప్రతి రోజు 12 గంటలకు పేల్చే ఫిరంగి ఉన్నది. ఇది జారుకాలం నాటిది. ఇప్పటికీ ఈ సాంప్రదాయం అమలులో ఉందట. హైదరాబాద్‌లోని సాలార్‌జంగ్ మ్యూజియంలో మధ్యాహ్నం 12 గంటలు కొట్టే సన్నివేశం కూడ ఇట్లాంటిదే.

సాయంత్రం 'బాలె' నృత్యం చూశారు. ప్రముఖ కళాకారులతో సంగీతాని కనుగుణంగా బొటనవ్రేలి మీద నాట్యం చేయడం దీని ప్రత్యేకత. మాటమాట అసలే ఉండదు. కేవలం సంగీత పరంగా ప్రదర్శించడం ఇందులో ప్రత్యేకత. చాలాసార్లు ప్రేక్షకులు మిన్నుముట్టే హర్షధ్వానాలు చేశారు. ఈ నాట్య ప్రదర్శన ప్రతిరోజూ ఉంటుంది.

లెనిన్ గ్రాడ్ రష్యాలో రెండో పెద్ద నగరం. 30 లక్షల జనాభా. ఇది సముద్రం ప్రక్కన ఉంది. నగరంపైన నీవానది, అడుగున చాల లోతున మెట్రో రైల్వే లైన్లు ఉన్నాయి. తర్వాత మృతవీరుల మెమోరియల్ సిమెట్రికి వెళ్ళారు. రష్యాలో అడుగడుగునా సంస్కృతీ పరిరక్షణ సందర్శకులను ముగ్ధుల్ని చేస్తుంది. ఇక్కడ అమరవీరుల త్యాగాలను కొనియాడుతూ ఏర్పరచిన ప్రత్యేక మ్యూజియంలను దర్శించారు. ప్రత్యేకంగా ఒక కుటుంబం ఎలా చనిపోయిందీ డైరీగా వ్రాయబడింది. 11 సంవత్సరముల వయస్సు గల టానియా మొదటి రోజున తండ్రి, రెండో రోజున అక్క, మూడో రోజున మామ, నాల్గో రోజున తల్లి మరణించారని డైరీలో వ్రాసి, ఆమె కూడ మరణించింది. తర్వాత ఆమె పేరును కూడ ఈ డైరీలో ఆఖరున వ్రాసి భద్రపరిచారు.

## vi) సోచీలో :

లెనిన్ గ్రాడ్‌లో ఉదయం 10 గంటలకు బయలుదేరిన విమానం ఒంటిగంట పదినిమిషాలకు 'సోచి' చేరుకుంది. మధ్య దూరం 3045 కి మీ. ఆ రోజు మే 9 ఫాసిజంపైన విజయం సాధించినందుకు ఆ రోజు అందరూ

పండుగ చేసుకుంటారు. రెండవ ప్రపంచ యుద్ధం ముగిసిన రోజు కూడ ఇదే. విమానాశ్రయం నుండి 95 కి.మీ. దూరంలో ఉన్న 'జెంచుజినా' హోటల్‌కు బస్సులో ప్రయాణించారు. బస్సు ప్రయాణం ఎత్తు పల్లాలతో వంపులు తిరుగుతూ సుఖంగా సాగిందట. గాలిలో తేలిపోతున్న అనుభూతి కలిగిందట!

సోచీ చాలా అందమైన నగరం. నల్ల సముద్రం ఒడ్డున 125 కి. మీ. విస్తరించి ఉన్న అందమైన పట్టణం ప్రపంచంలోకెల్లా పొడవైన సముద్రతీర పట్టణం. విశ్రాంతి కేంద్రం కూడా. 1932 లో వెనుకబడిన ప్రాంతంగా క్రిమి కీటకాలకు నిలయంగా ఉండేదట. అప్పటి జనాభా 600 మంది మాత్రమే. ప్రజలు తరచుగా మలేరియాతో బాధపడుతుండేవారు. విప్లవానంతరం ఆరోగ్య నిపుణుల బృందం ఇక్కడికి వచ్చి ఇది చాల ఆరోగ్యవంతమైన ప్రదేశమని నిర్ధారణ చేసి 1979 నుండి అభివృద్ధి పరుస్తూ వచ్చారట! ప్రస్తుతమిక్కడ స్థానికంగా మూడు లక్షల మంది నివసిస్తుండగా వారిలో 2 500 మంది డాక్టర్లేనట! 53 శానిటోరియంలు నిర్మించబడ్డాయి.

సోచీలో ఒక కిండర్ గార్డెన్ పాఠశాల వివరాలు పరిశీలిస్తే నిజంగా ఒక ఆదర్శ పాఠకులకు ఇన్ని వనరులు అవసరమేమో అనిపిస్తుంది.

రెండున్నర సంవత్సరములనుండి 6 సంవత్సరముల వరకున్న 180 మంది పిల్లలకు నలభై మంది సంరక్షకులు. వీళ్ళల్లో ఐగురు డాక్టర్లు, 12 మంది నర్సులు, వార్డెన్, మిగతా వాళ్ళు టీచర్లు. అంటే 180 మందికి 22 మంది టీచర్లన్నమాట! ప్రతి 8 మంది పిల్లలకు ఒక టీచరు. ఎంత శ్రద్ధ వుంటుంది ఇట్లా వుంటే.

మరో విశేషమేమిటంటే 11 గంటలకు నుండి 3 గంటల దాకా నిద్ర, ఐదు వేళలా భోజనం. మధ్యమధ్యే పాఠాలు చెప్పటం. సాయంత్రం 7 గంటలకు వాళ్ళ తల్లిదండ్రులు వచ్చి తమ వెంట తీసుకుపోతారు, తెల్లవారి పనులకు వెళ్ళేప్పుడు వదలిపోతారు. ఈ సేవలకు వాళ్ళు ఒక్కొక్కరికి 10-12 రూబుల్స్ దాకా చెల్లిస్తారట.

ఇంకో రోజు 'అహూ' కొండకు. 600 మీ. ఎత్తున్నది. అనేక వంపులు తిరుగుతూ అంత ఎత్తైన ప్రదేశం మీదికి బస్సులు ఎక్కుతూ దిగుతూ వున్నా

ఒక్క హారన్ మోత కూడా వినిపించనందుకు పిచ్చయ్యగారు ఆశ్చర్యం వెలిబుచ్చారు.

సాయంత్రం 'సోచీ'లో త్రీడైమెన్షన్ సినిమా చూశారు. మన దేశీయులకప్పటికిది వింత విషయమే సినిమా ప్రదర్శన సమయం ఒక గంట. దీనికి 90 క్యూపెక్కులు చెల్లించవలసి వచ్చిందట! మాస్కోలో చూసిన సినిమా టిక్కెట్టుకు మూడింతలు ఉంటుందన్నారు.

## vii) తిరుగు ప్రయాణం :

సోచీలో రాత్రి 10 గంటలకు బయలుదేరి తాష్కెంట్‌కు చేరుకునేసరికి తెల్లవారుజామున 4 గంటలయింది. పడమర నుండి తూర్పుకు ప్రయాణం చేసి రావడం వలన సమయంలో ఆ తేడా వచ్చింది.

మధ్యాహ్నం తాష్కెట్ విమానాశ్రయం నుండి కాబూల్ (ఆఫ్ఘనిస్తాన్ రాజధాని)కు చేరారు ఇక్కడ 'ఎయిర్ ఇండియా' వారి అతిథులుగా 'హోటల్ హుమాయూన్'లో ఉన్నారు. కాబూల్‌కు 80 కి. మీ దూరంలో ఉన్న మొగల్ గార్డెన్స్ చూశారు. ఇండియా రూపాయికి 4.80 ఆఫ్ఘన్ రూపాయలు. ఇక్కడినుండి ఇండియన్ ఎయిర్‌లైన్స్ విమానంలో ఢిల్లీకి చేరుకున్నారు (5 పి యమ్ 7 పి.యమ్.) రెండు గంటల ప్రయాణం.

సోవియట్ రష్యాలో ఆర్థికంగా బాధపడే స్త్రీలు లేనందున వ్యభిచార వృత్తికి దిగే అవకాశం లేదు. కట్న కానుకలు, ఆస్తి తగాదాలు లేవు. నైట్ క్లబ్బులు, జూదగృహాలు, లాటరీ నిర్వాహణ అసలు లేనే లేవు. దొంగతనాలు, దోపిడీలు, హత్యలు, మానభంగాలు, ఆత్మహతులు జరగవు. మాతృత్వానికి ఎంతో విలువ నిస్తారు.

ఇంకా సోషలిస్టు వ్యవస్థ విశిష్టత అన్న శీర్షికకింద వ్యవసాయం, పరిశ్రమలు, విద్యావిధానం, ఆరోగ్యం, సంఘజీవనం, గృహనిర్మాణం, కళారంగం వృద్ధ జీవితం, క్రమశిక్షణ అన్న అంశాల గురించి రచయిత తన పరిశీలనలోని అభిప్రాయాలను వ్యక్తపరచారు.

## viii) రష్యాలో భారత యాత్రికుల ప్రవర్తన :

సోవియట్ రష్యా పర్యటన సందర్భంగా మన యాత్రికుల గురించి రచయితకు కలిగిన అభిప్రాయాలను ఆవేదనతో వ్యక్తం చేశారు.

బాధ్యతారహితంగా ప్రవర్తిస్తూ, సమయోల్లంఘనం చేస్తూ, అటు నిర్వాహకులనూ ఇటు తోటి ప్రయాణికులనూ మనవాళ్ళు తమ ప్రవర్తనతో ఇబ్బంది పెట్టేవాళ్ళు. మృతవీరుల సమాధుల వద్ద మౌనంగా ఉండటానికి బదులు పెద్దగా మాట్లాడుకోవడం అన్నిటికంటె అభ్యంతరంగా తోచే విషయం. ప్రోగ్రాం ప్రకారం చూపించే ప్రదేశాల మీద శ్రద్ధ కనబరచకుండా, ప్రోగ్రాంలో లేనివి కూడా చూపించాలని టూరిస్టువారితో బాడుగకు వచ్చిన వారితో వ్యవహరించినట్లు ప్రవర్తించటం రచయితకు ఎబ్బెట్టుగా తోచింది.

ఇక భోజన శాలలో మన ప్రక్క ఉండే విదేశీయుల పద్ధతి సక్రమంగా ఉండేది. మన వాళ్ళు భోజనాల గదిలో కూడ నిశ్శబ్దాన్ని భగ్నం చేస్తూ మన ప్రత్యేకతను ప్రదర్శించడం బాగనిపించలేదు.

ఆ దేశంలో ప్రతిరోజు వివిధ దేశాల నుండి వేలమంది యాత్రికులు వస్తూంటారు. ఒక ప్రణాళిక అంటూ లేకపోతే కార్యక్రమ నిర్వహణ కష్టసాధ్యమవుతుంది. కనుక కొంతకాలం ముందుగానే మనం వెళ్ళే రోజు, టైము వారికి తెలియాలి. ఉదా: ఒక స్కూలుకు వెళ్ళాలనుకుంటే, అంతకు ముందునుండే యే దేశస్థులు వెళతారో ఆ దేశస్థుల వేషభాషలు నేర్పిస్తారు. సాంస్కృతిక ప్రదర్శనలిప్పిస్తారు. ఉపాధ్యాయులు పాఠ్యాంశాలను బోధించక ఈ కార్యక్రమాల నిర్వహణకే పిల్లలను సిద్ధం చేస్తుంటారు. కాబట్టి ప్రోగ్రాం లేని ప్రదేశాలను చూపించాలని పట్టుబట్టడం సంస్కారమనిపించుకోకపోగా, రిహార్సల్సు లేని డ్రామాలాగా పోయినచోట వాళ్ళను ఇబ్బందిలో ఉంచవలసివస్తుంది.

## ix) ప్రయాణానికయ్యే ఖర్చులు :

మన టూరిస్టులు మొత్తం చెల్లించవలసిన డబ్బు 8500 రూపాయలు. ఈ మొత్తం మనకు ఎక్కువ అనిపించి కోరినవల్లా చూపడంలేదనే అసంతృప్తితో వేగిపోతుంటారు మనవాళ్ళు. కాని నిజంగా ఈ డబ్బులో రష్యాలో మనకారకయ్యే

ఖర్చు కేవలం 2900 రూ॥ అన్నది గమనించాల్సిన విషయం అని పిచ్చయ్య గారు వ్రాశారు.

ఆ వివరాలిట్లా ఉన్నాయి :

3950 రూ॥ ఢిల్లీ నుండి తాష్కెంటుకు - మళ్ళీ ఢిల్లీకి విమాన ఖర్చులు.
2900 రూ॥ ఆ దేశ టూరిస్టు డిపార్టుమెంటుకు.
1650 రూ॥ ఏర్పాట్లు చేసిన టూరిస్టు ఏజెంట్లకు.

8500 మొత్తం.

అంటే 2900 రూ॥ ఖర్చులో 15 రోజులు రష్యాలో వివిధ నగరాలకు విమాన ప్రయాణం, మొదటి తరగతి హోటల్సులో నివాసం, ఉత్తమ ప్రమాణం గల భోజన ఫలహారాలు, ప్రత్యేక బస్సులు, గైడ్సు, వారి ఖర్చులు, వివిధ ఎగ్జిబిషన్లు చూడడానికయ్యే ఖర్చులు - ఇన్ని సౌకర్యాలు సమకూర్చాలి. ఇవన్నీ లెక్కకు తీసుకోకుండా మనం ఎంతో చెల్లించామన్న అహంకారం ప్రదర్శిస్తుంటాం. సంపూర్ణమయిన అవగాహనకొరకే ఈ లెక్కల వివరాలు రచయిత ఇచ్చారు.

జీవితంలో ఇట్లాంటి అవకాశాలు చాల అరుదుగా లభిస్తాయి. దొరికిన అవకాశాన్ని సద్వినియోగపరచుకొని ఆ దేశ సామాజిక పరిస్థితులను అవగాహన చేసుకోవడానికి ప్రయత్నించాలి. రష్యా యాత్రను కేవలం వినోదయాత్రగా కాక విజ్ఞానయాత్రగా భావించాలని భావి యాత్రికులకు విజ్ఞప్తి చేశారు పిచ్చయ్య గారు.

## 3. సినారె 'సోవియట్ రష్యాలో పది రోజులు'*

సోవియట్ రష్యా పర్యటన ముగించుకొని వచ్చిన తర్వాత డా॥ సి.నారాయణ రెడ్డిగారు తాము పొందిన అనుభూతులను మూటగట్టి సుదీర్ఘ వ్యాసంగా అందించారు. అది ఆంధ్రప్రభ వారపత్రికలో ఐదు వారాలు ప్రచురింపబడింది.

---

* డా. సి. నారాయణరెడ్డిగారు.

తర్వాత లెనిన్ 110 వ జయంతి సందర్భంగా ఆంధ్రప్రదేశ్ ఇస్కాస్ శాఖ 1980 లో పుస్తక రూపంగా ప్రచురించింది.[1] దీనిలో మొత్తం పుటలు 56.

1979వ సంవత్సరంలో రష్యాలోని ఆర్మీనియా రిపబ్లిక్ అవతరణ షష్టి పూర్తి ఉత్సవ సందర్భాన్ని పురస్కరించుకొని ప్రతినిధి వర్గాన్ని పంపించాల్సిందిగా ఆర్మీనియా నుండి ఆహ్వానం అందింది. ఆంధ్రప్రదేశ్‌కు, ఆర్మీనియాకు మధ్య ప్రతినిధి వర్గాలు, సాంస్కృతిక బృందాలు రాక పోకలు సాగించడం ఈనాటిది కాదు. 1968 నుండి అలా సాగుతూనే ఉంది. ఐతే 1979 లో ఆంధ్రప్రదేశ్ ఇస్కాస్ శాఖ ప్రముఖ సాహితీ వేత్త, మహాకవి డా॥ సి. నారాయణ రెడ్డి గారిని ప్రతినిధిగా ఎంపిక చేసింది. ఆయనతో పాటు వృత్తి రీత్యా వైద్యులు డా॥ గోర్కీగారు కూడ పంపబడ్డారు. ఈయన ఖమ్మం శాఖ ఇస్కాస్ అధ్యక్షులు.

ఈ సుహృద్భావ పర్యటన 11 రోజులపాటు (25-8-1979—4-9-79) సాగింది. నారాయణరెడ్డి గారు రష్యాను సందర్శించడం ఇదే మొదటిసారి ఐనా విదేశ యాత్రానుభవం ఇదివరకే ఉంది. మూడేళ్ళ క్రితమే 'ముచ్చటగా మూడు వారాలు' మలేషియా, సింగపూర్‌లలో పర్యటించి వచ్చారు.

యాత్ర చేసే సమయంలో కవుల దృష్టికీ, మామూలు వ్యక్తుల దృష్టికీ చాలా తేడా ఉంటుంది. అట్లాగే చూసిన దానిని ఇతరులకు చెప్పే విధానంలో కూడ అంతరముంటుంది. సామాన్యుడు చాల నిర్వికారంగా దర్శించిన వస్తువునే కవి తన ప్రతిభచే, భావుకతచే ఆ వస్తువుకు విశిష్టతను కలుగజేస్తాడు. కవుల దృష్టి కేవలం వస్తు సందర్శనమే కాదు, వస్తుతత్వ సందర్శన సముద్భూతమైన అనుభూతి నాశ్రయించుకొని ఉంటుంది.

నారాయణ రెడ్డిగారు అంతర్జాతీయ కవి. 'జ్ఞానపీఠ' అవార్డు గ్రహీత. అతి తక్కువ వ్యవధిలో రష్యాను సందర్శించినా, సూక్ష్మేక్షికతో ప్రతి విషయాన్ని పరిశీలించి, శ్రోతల హృదయాలకు హత్తుకునేట్లు వర్ణించారు.

---

1. ఇండో సోవియట్ కల్చరల్ అసోసియేషన్ (ఇస్కాస్).

## i) తాష్కెంటుకు :

ఆగస్టు 25 న ఉదయం 7-00 గంటలను ఢిల్లీ విమానాశ్రయం నుండి 'ఏరోఫ్లాట్' విమానంలో బయలుదేరి మధ్యాహ్నం ఒంటిగంటకు తాష్కెంటుకు చేరుకున్నారు. హోటల్ 'ఉబ్బెక్'లో బస ఏర్పాటు చేయబడింది.

ఆరోజు సాయంత్రం 'ఆర్థికాభివృద్ధి ప్రదర్శన శాల'కు వెళ్ళి గులాబీ తోట (గుల్లర్ షో)ను దర్శించారు. తర్వాత లెనిన్ స్ట్రీట్‌లో రాతిలో మలచిన 'చెట్టెత్తు విగ్రహం' చూశారు. 1966 లో తాష్కెంట్ నగరం ఘోరమైన భూకంపానికి గురైన తర్వాత వజ్ర సంకల్పంతో రష్యా ప్రజలచే పునర్నవీకరింపబడింది. 'తాష్కెంట్ ప్రజల సంకల్పసిద్ధికి సంకేతం'గా ఈ విగ్రహం నిర్మింపబడింది. నారాయణ రెడ్డిగారికి లెనిన్ స్క్వేర్‌లో ఆప్యాయంగా ఆహ్వానం పలికినవి దట్టంగా నీటిని పైకి చిమ్మే ఫౌంటెన్స్.

శాంతిదూతగా వెళ్ళి, తాష్కెంట్‌లో అకాలమృత్యువాత పడిన లాల్ బహదూర్ శాస్త్రిగారి శిలా విగ్రహాన్ని పరవశంతో దర్శించారు. రష్యన్ ప్రజలు స్మృతి చిహ్నంగా శాస్త్రీజీ స్మృతి చిహ్నంగా ఆయన విగ్రహాన్ని చిన్న పార్కులో నెలకొల్పుకున్నారు. ఆ చుట్టుపక్కల వీధికి 'శాస్త్రీ స్ట్రీట్' అని పేరు పెట్టడమే కాకుండా, నగరంలో 'శాస్త్రీ స్కూల్' అని, 'శాస్త్రీ మ్యూజియం' అనీ ఒక పాఠశాల, ఒక ప్రదర్శనశాల ఆ మహనీయుని జ్ఞాపక చిహ్నంగా స్థాపించుకున్నారు.

## ii) ఆర్మీనియాలో :

ఆగస్టు 26 నాడు ఆర్మీనియా రిపబ్లిక్ రాజధాని ఎరెవాన్‌కు విమానంలో బయలుదేరారు. ఎరెవాన్ నగర సమీపంలో ఉన్న సెవాన్ సరస్సు పెద్ద అద్దంలా "ఆకాశం తన ముఖాన్ని చూసుకోవడానికి అమర్చినంత అందంగా" అగుపించిందట! హోటల్ 'అనీ'లో బస.

సాయంత్రం "మెమోరియల్ టు ది విక్టిమ్స్ ఆఫ్ ది 1915 జెనొసైడ్" చూడడానికి వెళ్ళారు. ఇది 1965 లో నిర్మింపబడిన 60 మీ. ఎత్తైన కట్టడం.

టర్కీ ఆర్మీనియాకు పొరుగుదేశం. సుల్తాన్ అహ్మద్ నాయకత్వంలో తుర్కులు (Turks) రెండులక్షల మంది ఆర్మీనియన్లను దారుణంగా హత్య చేశారు. వారి స్మృతిచిహ్నంగా ఈ నిర్మాణం జరిగింది.

28 నాడు ఎరెవాన్ లోని 'మతెవ దరాన్' అనే పాత వ్రాతప్రతుల గ్రంథాలయం దర్శించారు. దీనిలో 5 వ శతాబ్దికి చెందిన అముద్రిత గ్రంథ ప్రతులతో పాటు 12 వ శతాబ్దంలో భారతీయ నగరాలను గురించిన చరిత్ర గ్రంథం కూడ ఉందని రెడ్డిగారు వ్రాశారు.

ఇక్కడి నుండి తొమాన్యాన్ మహాకవి మ్యూజియం చూడడానికి వెళ్ళారు. మనకు మహాకవి గురజాడలాగా, ఈయన 'ఆధునిక ఆర్మీనియన్ కవితా వైతాళికుడు.' ఈ మ్యూజియం తొమన్యాన్ చివరి రోజుల్లో నివసించిన ఇంటి నమూనాలో నిర్మించబడింది.

తర్వాత ఆర్మీనియాలోనే అతి పెద్దదైన ప్రభుత్వ వ్యవసాయ కేంద్రానికి వెళ్ళారు. ఇక్కడ శ్రామికుని నెలసరి సగటు జీతం 170 రూబుల్సు. 29 నాటి మధ్యాహ్నం కారులో కిరోవాకాట్ నగరం చేరుకున్నారు. అక్టోబర్ విప్లవంలో లెనిన్‌కు సహచరుడుగా సాగిన విప్లవ వీరుడు 'కిరోవ్.' ఈయన పేరు మీదుగా నిర్మించబడిన ఈనగరం ఆర్మీనియా నగరాలలో మూడవది. వాన్ సరస్సుకూ, కిరోవాకాన్‌కూ మధ్య పర్వత ప్రాంతాన్ని 'దిలీజాన్' అంటారు. ఈ కొండ మలుపులు నారాయణరెడ్డి గారికి తిరుపతి కొండలను తలపింపజేశాయట!

30 నాటి రాత్రి ఆర్మీనియా మైత్రీ సంఘం ఏర్పాటు చేసిన విందులో పాల్గొని, ఆర్మీనియాలో తమ పర్యటన సుఖప్రదంగా సాగిందన్నారు. "ఈ అయిదు రోజులుగా ఆర్మీనియాలోని చారిత్రక ప్రదేశాలనూ, సాంకేతిక నిలయాలనూ, సాంస్కృతిక సంస్థలనూ చూశాం. కవులనూ, కార్మికులనూ కలుసుకున్నాము... ఎక్కడికి వెళ్ళినా మాకు లభించిన ఆదరణ అమూల్యం. వల్లకాటిలోంచి మొలకెత్తిన ఆర్మీనియా మహావృక్షం ఈనాడు పల్లవ, కుసుమ, ఫలాలతో ప్రవర్థమానంగా ఉంది."[2]

---

2. సోవియట్ రష్యాలో పదిరోజులు - పేజీ 81.

## ii) లెనిన్‌గ్రాడ్‌కు :

31 న రాత్రి 8 గంటలకు విమానంలో బయలుదేరి ఆ రాత్రి 12 గంటలకు లెనిన్ గ్రాడ్ చేరుకున్నారు. హోటల్ యూరవ్‌లో బస. 4 గంటల ప్రయాణం.

తెల్లవారి 'సమ్మర్ ప్యాలెస్' ఆవరణలోని ట్రిక్ ఫౌంటెన్లనుచూసి రెడ్డిగారు ఆశ్చర్యం చెందారు. ఈ ప్యాలెస్ లెనిన్‌గ్రాడ్ నగరానికి 40 కి.మీ. దూరంలో ఉంది. దీన్ని పీటర్ ది గ్రేట్ అనే రాజు నిర్మింపజేశాడు. 'మై ప్లెజర్ ప్యాలెస్' అన్నది ఈ రాజు తన కోసం కట్టించుకున్నది. ఇక్కడున్న ఒక పెద్ద గాజు పాత్రకు "గుక్క పట్టేటంతటి ప్రత్యేకత" ఉందని చెప్తూ దానికి సంబంధించిన కథ నొకదాన్ని రెడ్డిగారు సేకరించి వ్రాశారు.

"పీటర్ ది గ్రేట్ గొప్ప భోగి, సౌందర్య భాగి. విందారగించేటప్పుడు ఎవరైనా ఆ ఆరగింపులో ఏమాత్రం అనుచితంగా వ్యవహరించినా, ఆ గాజు పాత్రలో 1250 గ్రాముల డ్రైవోడ్కా నింపి, ఒక్క గుక్కతో తాగించేవాడు. ఇదీ అతడు విధించే శిక్షావిధానం."[3]

లెనిన్ గ్రాడ్‌లో ఏ పెద్ద వీధికెళ్ళినా ఏదో ఒక నది ఎదురవుతుందంటూ, ఇక్కడ నీవానదితోపాటు 42 నదులూ, 500 వంతెనలూ ఉన్నాయన్నారు.

ఇక్కడి మ్యూజియంలో 3 మిలియన్‌ల దర్శనీయ వస్తువులున్నాయట. ఒకనెల రోజులు తిరిగ్గా చూస్తేగానీ ఈ మ్యూజియంను సమగ్రంగా చూడలేమని, కానీ తాము చూసింది రెండు గంటలసేపు మాత్రమేననీ వ్రాశారు.

'వింటర్ ప్యాలెస్'లో పీటర్ ఉపయోగించిన వస్తువులన్నీ భద్రంగా ఉంచబడ్డాయి. జార్ చక్రవర్తులు వాడిన బంగారు సింహాసనం కూడా చెక్కు చెదరకుండా అలాగే వుంది. చక్రవర్తులపై తిరుగుబాటు చేసిన ప్రజలు మళ్ళీ వారి చిహ్నాల నెందుకు భద్రపరిచారన్న దానికి సమాధానంగా రెడ్డిగారు – "ఒకనాటి సామ్రాట్టుల వైభవాన్ని స్మరింపజేయడం కోసం కాదిది. గతం ఇలా ఉండేదని అద్దం పట్టి చూపడానికే" – అని అభిప్రాయపడ్డారు.[4]

---

3. సోవియట్ రష్యాలో పదిరోజులు. పేజీ. 38.
4. సోవియట్ రష్యాలో పదిరోజులు. పేజీ. 39.

రష్యాలో రైలు ప్రయాణం కూడా చేస్తే బాగుంటుందన్న వీరి ఉద్దేశాన్ని గ్రహించి ఇన్టూరిస్ట్‌వారు లెనిన్ గ్రాడ్‌నుంచి, మాస్కోకు వెళ్ళే ఎలక్ట్రిక్ ట్రెయిన్‌లో ప్రయాణపు ఏర్పాట్లు చేశారు.

## iv) మాస్కో పర్యటన :

రాత్రి 11-30 గంటలకు బయలుదేరి తెల్లవారి (2-9-79) 7-30 గంటలకు మాస్కో చేరుకున్నారు. ఎ.సి. కంపార్టుమెంటు, అందులో రెండు బెర్తులు. రేడియో, టవల్, సబ్బు, బెడ్, రగ్గులు కూడ అమర్చబడి ఉన్నాయి. హోటల్ 'సోవియస్కా'లో బస.

1912లో నెపోలియన్‌తో జరిగిన దారుణ రణ దృశ్యాలను మ్యూజియంగా నిర్మించారు. ఇదే పెనోరమా మ్యూజియం. ఈ థియేటర్లో రణస్థలి చిత్రాలు ప్రత్యక్షంగా భయంకర యుద్ధాన్ని చూస్తున్న భ్రాంతిని కలగజేశాయని రెడ్డిగారు స్వానుభవంతో చెప్పారు ఈ మ్యూజియంకు ఎదురుగా 'హోటల్ కాస్మస్' ఉంది. 28 అంతస్తుల ఉన్నత భవనం.

తర్వాత ప్రపంచంలోనే మహోన్నతమైనదని చెప్పబడుతున్న టి.వి. టవర్ చూశారు. ఎత్తు 351 మీ.

3 వ తేదీనాడు యు.యస్ యస్.ఆర్. ఆర్థిక ప్రగతి ప్రదర్శన శాలను దర్శించారు. లోనికి ప్రవేశించగానే 'ఫ్రెండ్ షిప్ ఫౌంటెన్' కనిపించింది. "15 మంది సుందరాంగుల కంచు విగ్రహాలున్నాయి— బంగారు వన్నెలో పొదగబడి. ఇవి సోవియట్ యూనియన్‌లోని 15 రిపబ్లిక్‌లకు ప్రతీకలు." (పేజీ 48)

ఆ రోజు రాత్రి కాలినడకన, ట్రామ్ బస్సులో, ఎలక్ట్రిక్ ట్రెయిన్‌లో ప్రయాణించి అన్ని వాహనాల్లో తిరిగిన తృప్తిని పొందారు. మొత్తమ్మీద రెడ్డిగారి పదిరోజుల ప్రయాణం "నిద్రావేళల్లో తప్ప ఎప్పుడూ చక్రాల మీదో, గాలి రెక్కల మీదో జరిగింది" అని చెప్పుకున్నారు.

రెడ్ స్క్వేర్‌లోని లెనిన్ 'మసోలియం'లో క్యూ ద్వారా ప్రవేశించారు. రెడ్డిగారికి శాశ్వత నిద్రలో ఉన్న లెనిన్ ముఖ "స్ఫటికంలా మెరుస్తున్నట్లుగా జీవకాంతి వెల్లివిరుస్తున్నట్లు" కనిపించిందట.

రష్యాలో కొన్ని మర్యాదను సూచించే మాటలివి :-

| | | |
|---|---|---|
| దశ్వీ దానియా | — | గుడ్ బై |
| స్పెసిబా | — | థ్యాంక్స్ |
| ఆయో, ఆయో | — | మంచిది, మంచిది. |
| దూబ్రే ఉత్రా | — | గుడ్‌మార్నింగ్. |
| రహ్మత్ | — | కృతజ్ఞతలు. |

ఉజ్బెక్ భాషపైన ఫారసీ, అరబ్బీ భాషల ప్రభావం అమితంగా ఉందంటూ ఈ భాషలో 'మొహబ్బత్, వఫా, ఇష్క్, దిల్' లాంటి పదాలు చోటుచేసుకున్నాయని పేర్కొన్నారు. ఇంకా జువారా (జవార్ = జొన్నలు). మక్కా (మక్కై = మొక్కజొన్న), ప్యాజ్ (ఉల్లి), కిష్మిష్ (దాక్ష), మైనా (పక్షి) - ఇవన్నీ ఉజ్బెక్ భాషలోని పేర్లేనట.

కిరోవాకాన్ నగరంలోని వాతావరణం గురించి నారాయణరెడ్డిగారు 'ఇక్కడి రాత్రులు తల్లి స్పర్శలా చల్లగా ఉన్నాయనీ, పగళ్ళు ప్రేయసి స్పర్శలా వెచ్చగా ఉన్నాయనీ' వర్ణించారు. అక్కడ వేసవి కాలం పగలు 32 డిగ్రీల ఉష్ణోగ్రత కాగా, రాత్రి రగ్గులు కోరుకునే చలి ఉందన్నారు.

లెనిన్‌గ్రాడ్‌లో ప్రొద్దున నీరెండలో నడుస్తున్నప్పుడు నులివెచ్చగానే ఉంది కాని, రాత్రి చలి 'ఉన్నిబంటి'గా ఉందట! ఇది సరికొత్త ఉపమానం. సీశ్నకు మోతాలిబంటి, మొలబంటి అని వాడినవారున్నారు కాని, చలిని కూడ కొలమానంగా వాడటం అనిదంపూర్వం. కొత్త పదాలకు ఊపిరి పోయటమే నారాయణరెడ్డిగారి రచనలో ప్రత్యేకత.

## v) సోవియట్ యూనియన్‌లో మరోసారి :

మళ్ళీ మూడేండ్లకు సామ్యవాద దేశాన్ని దర్శించే అవకాశం కలిగింది డా॥ సి. నారాయణరెడ్డి గారికి. ఈసారి సోవియట్ ల్యాండ్ నెహ్రూ అవార్డు విజేతగా 15 రోజులు రష్యాలో పర్యటించడానికి ఆహ్వానం లభించింది.

ఐతే మొదటిసారి పర్యటనలో రష్యా సాధించిన అపూర్వ విజయాల పట్ల రచయితకు ఆశ్చర్యం, ఆనందం కలుగగా, రెండోసారి వాటి స్థానంలో

ఆలోచనలు చోటు చేసుకున్నాయి. మలి పర్యటనలో ఎన్నుకున్న నగరాలన్నీ ఫాసిస్టు జర్మనీ దురాగతాలకు తునాతునకలై పోయినవే. రెడ్డిగారి మాటల్లో చెప్పాలంటే "నా సోవియట్ యాత్ర ద్వితీయ ప్రపంచ యుద్ధ బీభత్సాన్ని కళ్ళకు కట్టించిన రక్తసిక్త చరిత్ర."

ఐదు నగరాల్లోని ఈ మైత్రీ యాత్రానుభవ వివరాలు ఆంధ్రప్రభ వారపత్రికలో 31-8-88 నుండి నాలుగు వారాలపాటు వ్యాసాలుగా ప్రచురింపబడ్డాయి.

ఈ పర్యటనలో రెడ్డిగారు వార్ వెటరన్స్ (సమర వీరులు)తో, ప్రముఖ రచయితలతో ఇష్టాగోష్ఠి జరపటం విశేషం. వచన కవితా ప్రక్రియ రష్యన్ భాషకు పొసగదనీ, ఇప్పటికీ (1988) ప్రముఖ కవులు ఛందోబద్ధమైన రచనలే చేస్తున్నారని యూరీ రిఫ్ హెల్‌తో జరిగిన ఇష్టాగోష్ఠిలో వెల్లడైన విషయాలు. కవిత్వం బాగానే అమ్ముడు పోతుందట కాని ఏమైనా నవల తర్వాతనే దాని స్థానమని కూడ తెలుస్తున్నది.

బైలో రష్యా రిపబ్లిక్‌లోని చిన్న నగరం బ్రెస్ట్ నగరం. బైలో అంటే తెల్లన. ఈ రాష్ట్రంలోని స్త్రీల శిరోజాలు, ఒంటి వన్నె, ధరించే దుస్తులు - అన్నీ తెల్లనివే కావడం వల్ల ఈ రాష్ట్రానికి ఆ పేరు వచ్చిందట!

రష్యాలో నారాయణరెడ్డి గారికి బాగా నచ్చిన అంశం "త్రికాలాలకు వేసిన సేతు దృష్టి." యుద్ధంలో నేలమట్టమైపోయిన శిథిలాల్లోంచి జీవసౌధాలను నిర్మించుకోవటాన్ని 'గత వైభవ పునః స్థాపన దృష్టి'గా, ప్రజోపయోగం కాని ప్రార్థనా మందిరాలను (చర్చిలు, మసీదులు) మ్యూజియంలుగా మలచుకోవడాన్ని 'వర్తమానోపయోగ దృష్టి'గా, వినూత్న వైజ్ఞానిక సాంస్కృతిక కేంద్రాలను నెలకొల్పడాన్ని 'భవిష్యద్దర్శన దృష్టి'గా అభివర్ణించారు.

నారాయణరెడ్డి గారు నగరం నడిబొడ్డులోనైనా సరే పొద్దు పొడవక ముందే నడిచే 'వాక్‌జీవి.' వారి ఇటీవలి కవితాసంపుటి పేరు "నడక నా తల్లి." మినిస్క్ నగరంలో, లెనిన్‌గ్రాడ్‌లో కూడ ఈ అలవాటును నాగా పెట్టకుండా సాగించారు.

ప్రగతి ప్రచురణాలయంలో 'అల్లరి గోపి అద్భుతయాత్ర' అనే వాస మూర్తి రచించిన తెలుగు పిల్లల పుస్తకం రష్యన్ భాషలోకి అనువదింపబడింది. ఐతే రెండు సంవత్సరాల్లోనే ఒకటిన్నర మిలియన్ల (15 లక్షలు) ప్రతులు అమ్ముడు పోయాయట! అలాగే గురజాడ కన్యాశుల్కము, శ్రీశ్రీ కవితలూ రష్యన్ భాషలోకి చాలా రోజుల క్రితమే వెలువడ్డాయి. భారతీయ కవుల కవిత లను రష్యన్ భాషలోకి అనువదించి సంపుటీకరించారు. దీనిలో విశ్వనాథ, పురిపండ, తిలక్‌లతో పాటు నారాయణరెడ్డి గారి రచనలను కూడా చేర్చారని వ్రాశారు.

ఈ విధంగా సినారె రెండు దఫాలుగా చేసిన రష్యాయాత్ర సాంస్కృతిక, విజ్ఞాన, సుహృద్భావ యాత్రగా పరిణమించి సార్థకమైంది.

## 4. కాంచనపల్లి వారి 'మధుర స్మృతులు' అనే రష్యా యాత్ర *

కాంచనపల్లి వెంకట రామారావుగారు రష్యాకు చేసిన యాత్రానుభవాల వర్ణన దీనిలో ఉంది. 61 పుటల ఈ పుస్తకం ప్రథమ ముద్రణ 1983 లో జరిగింది. నల్లగొండ జిల్లా ఇస్కస్ ప్రచురణ ఇది. రచయిత దీనికి 'మధుర స్మృతులు' అని పేరు పెట్టారు.

### i) యాత్రోద్దేశం :

మరో ప్రపంచాన్ని చూసి రావాలన్న కుతూహలం, ఆకాంక్ష వీరికి మొదటి నుండే ఉంది. అది వృద్ధి పొందడానికి వీరు 'నా మాట'లో ఒక కారణం చెప్పారు. "కొందరు కమ్యూనిస్టు నామధేయులే రష్యాలో పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందుతుందని, అది సోషల్ సామ్రాజ్యవాద దేశంగా మారిందని కాకిగోల చేస్తున్న పరిస్థితుల్లో ఈ ఆకాంక్ష మరీ పెరిగి వాస్తవాన్ని కళ్ళారా చూచి రావాలనుకున్నాను. చూచి వచ్చాను."[5]

---

* కాంచనపల్లి వెంకట రామారావుగారు నల్లగొండ.

5. నా మాట - పేజి iv.

తర్వాత ఆ ఉత్తేజమే గోల చేసేవారి కళ్ళు తెరిపించడానికి తోడ్పడి, యాత్రానంతరం పుస్తక రచన చేయడానికి పురికొల్పిందని వ్రాసుకున్నారు.

కాంచనపల్లి వెంకట రామారావుగారు నల్లగొండ పట్టణంలో పేరున్న న్యాయవాది. శ్రామిక వర్గ రాజకీయాలతోపాటు మార్క్సిస్టు గ్రంథాలలోని అంశాలను ఒంటబట్టించుకున్నవారు.

తెలంగాణా విముక్తి పోరాటంలో కమ్యూనిస్టుగా నిజాం ప్రభుత్వాన్ని ఎదిరించారు. 'అరసం'లో ముఖ్య పాత్ర వహించారు. రాష్ట్ర పౌర హక్కుల కమిటీ సభ్యులు. జిల్లా ఇస్కన్ కమిటీ ఉపాధ్యక్షులు. సోవియట్ చరిత్ర తెలిసిన వ్యక్తిగా అక్కడ ఏయే ప్రదేశాలకు ఎంత ప్రాధాన్యత ఉందో గుర్తించి, తక్కువ వ్యవధిలో (15 రోజులు 25-4-82 నుండి 10-5-82 వరకు) ఎక్కువ ఉత్తేజాన్ని పొందగలిగారు.

మొత్తం 32 మందితో కూడిన బృందంలో దాదాపు అందరికీ విమాన యానం ప్రథమానుభవమే. రష్యాలోని స్పుత్నిక్ సంస్థ వీరి ప్రయాణ ఏర్పాట్లకు బాధ్యత వహించింది.

## ii) మాస్కో ప్రయాణం :

25-4-1982న ఢిల్లీలోని విశ్వయువక కేంద్రానికి వీడ్కోలు చెప్పి పాలం విమానాశ్రయంలో ప్రవేశించారు. ఉదయం 10-30 గంటలకు పాలం విమానాశ్రయంలో బయలుదేరిన విమానం 11-15 నిముషాలకు అమృతసర్‌లో దిగింది గంట విరామం తర్వాత మళ్ళీ ప్రయాణం సాగించి ఎక్కడా ఆగకుండ సాయంత్రం 6 గంటలకు మాస్కో విమానాశ్రయం చేరింది. ఐతే అప్పుడు మాస్కోలో సాయంత్రం 4-30 ఐంది. గడియారాలు వెనక్కి తిప్పుకున్నారు.

వీరు అక్కడికి చేరుకోకముందే టూరు కార్యక్రమం అంతా నిర్ణయింపబడింది. 'యారీ' అనే పేరుగల గైడు వీరి పర్యటన నిమిత్త నియమింపబడ్డాడు. ఈయన స్పుత్నిక్ సంస్థ ప్రతినిధి.

అంతర్జాతీయ దినోత్సవమైన మేడే దినోత్సవ కార్యక్రమాలను తిలకించే అదృష్టం ఈ బృందానికి దక్కలేదు. కేవలం 4 రోజుల పర్యటన మాత్రమే మాస్కోలో కాబట్టి. ఐనా మే 9 నాటి ఫాసిస్టు వ్యతిరేక విజయోత్సవంలో పాల్గొనే అవకాశముందన్న వార్త విన్న తర్వాత రామారావు గారికి కొంత ఊరట కలిగింది.

## iii) మాస్కో సందర్శన :

కార్లు, బస్సులు రోడ్డు సిగ్నల్స్ ప్రకారం సాగిపోతున్నాయి కాని హారన్స్ ప్రయోగించటం లేదు విద్యుచ్ఛక్తితో బస్సులు నడుపబడుతున్నాయి. రిక్షా మచ్చుకైనా కనిపించలేదు. అన్నీ టాక్సీలు లేదా స్వంత కార్లు ఉన్నాయట.

యువజన కేంద్రం వారి హోటల్లో భోజనం. లెనిన్ గ్రాడ్ రైల్వే స్టేషనుకు వీరిని చేర్చటానికి బస్సు వచ్చింది. మాస్కో, లెనిన్ గ్రాడ్ రెండు నగరాలూ మాస్కో రిపబ్లిక్ లోనివే. కాని ఇక్కడో విశేషముంది. మాస్కోలోని రైల్వే స్టేషనును లెనిన్ గ్రాడ్ స్టేషననీ, లెనిన్ గ్రాడ్‌లోని స్టేషన్‌ను మాస్కో రైల్వేస్టేషననీ పిలుచుకోవడం ఇక్కడి సంప్రదాయం. అది ఈ యాత్రా కాలం నాటికీ కొనసాగుతూనే ఉందట. బైటి వాతావరణం 10 డిగ్రీల పరిమాణంలో వున్నా రైల్లో వెచ్చగా హాయిగా ఉందట. ఇది ఎయిర్ కండిషన్ చేయబడింది. బెర్తులు సోఫాలలాగే ఉంటాయి. ఇంకా వాటిపై పరుచుకోవడానికి పరుపులు, దిండ్లు, బ్లాంకెట్లు ఉంటాయి. తొక్కిసలాటలు, త్రోసుకోవడాలు ఉండవు, సీట్లకు సరిపడా టిక్కెట్లు ఇవ్వబడతాయి కాబట్టి ఆందోళనకు ఆస్కారమే ఉండదు. ఇలాంటి రవాణా వ్యవస్థ దేశమంతా ఉండడమనేది సామ్యవాద వ్యవస్థ యొక్క విశిష్ట లక్షణంగా చెప్పవలసి ఉంటుంది.

## iv) లెనిన్‌గ్రాడ్‌లో :

రాత్రి ఒంటిగంటకు రైల్లో ప్రయాణం 26-4-82 ఉదయం 9 గంటలకు లెనిన్ గ్రాడ్‌లోని మాస్కో రైల్వేస్టేషన్‌కు చేరుకున్నారు. లెనిన్ గ్రాడ్ చలి మరీ ఎక్కువ. ఉత్తర ధ్రువానికిది ఇంకా సమీపంలో ఉండడమే దీనికి కారణం. హోటల్లో బస చేశారు.

బస్సులో మధ్యాహ్న భోజనానికి ముందే లెనిన్ గ్రాడ్ నగర వీధుల సందర్శనం చేశారు. యూనివర్సిటీ ప్రాంతాన్ని సందర్శించారు. తెలుగు విభాగంలో వీరి పర్యటనకు ముందు శ్రీమతి డి. ఆదిలక్ష్మిగారు తెలుగు, తమిళ భాషలకు బాధ్యత వహించేవారని తెలుసుకున్నారు ఆమె అప్పటికే కీర్తిశేషురాలు.

లెనిన్ మహాశయుడు రహస్యమయ జీవితాన్ని గడిపిన 'స్మోల్నీ' భవనానికి తీసుకు వెళ్లారు. ఆయన ఉపయోగించిన ప్రతి వస్తువు యథాతథంగా అట్టిపెట్టి ఉంచారు. సెంట్రల్ కమిటీ సభ్యులు, ముఖ్య నాయకులు కూడ ఆయనను కలుసుకోవాలంటే ద్వారంపై కొన్ని సాంకేతిక శబ్దాలు చేస్తే తప్ప ద్వారం తెరిచేవారు కారట! ఇక్కడున్నవి మూడే మూడు గదులు. కాని ఇప్పుడవే రష్యాదేశపు భవితవ్యాన్ని తీర్చిదిద్దిన, ప్రపంచాన్ని కుదిపివేసిన పవిత్ర స్థలాలు.

కవులు, కళాకారులు, వీరయోధులు, రాజులు - వీరందరి స్మృతులను శాశ్వతంగా నిలిపి ఉంచడానికి సోవియట్ ప్రభుత్వం ఎన్నో చర్యలు తీసుకుంది. చివరకు జారు చక్రవర్తుల భవనాలతోసహా వారి కుటుంబీకుల సమాధులను కూడ భద్రపరిచింది.

27-4-82 ఉదయం లెనిన్‌గ్రాడ్‌కు 40 కి.మీ. దూరంలో ఉన్న లెనిన్ గ్రామానికి బస్సులో వెళ్లారు. సోషలిస్టు విప్లవానికి ముందు ఫిన్‌లాండ్ దేశానికి దాపున ఉన్న ఒక గడ్డి కోత కార్మికుని ఇంట్లో రహస్యంగా ఉన్నాడట లెనిన్. ఎవరికీ అనుమానం కలుగకుండా గడ్డి కోతపని చేస్తూ రహస్యంగా విప్లవ నిర్వహణకు సూచనలిస్తూండేవాడట.

## v) హెర్మిటేజ్, మ్యూజియంల సందర్శన :

జార్ చక్రవర్తుల నివాస భవనాన్ని హెర్మిటేజ్ అంటారు. మానవుడు సాధించిన వివిధ యుగాల విజ్ఞాన సంచయాన్ని ముందు తరాలకు అందజేయాలన్న స్ఫూర్తితో దీన్ని నెలకొల్పారు. కొందరు కుహనా ఉగ్రవాదులు జారు కాలంనాటి చక్రవర్తుల భవనాలను, కళాసంపదను రూపుమాపాలని వాదించినా, లెనిన్ వాళ్ళ అజ్ఞానాన్ని అవహేళన చేశాడు. కళాసంపద జార్ చక్రవర్తుల

కాలందే ఐనా ఆ కళాఖండాల నిర్మాతలు కార్మికవర్గమే కాబట్టి వాటిని కాపాడట మంటే ఒక విధంగా కార్మికవర్గాన్ని గౌరవించడమేనని వివరించాడు. ఈ దృష్టి తోనే అమూల్యమైన చిత్రపటాలను, కళాఖండాలను, వేల విలువైన వస్తు సముదాయాన్ని వివిధ గదుల్లో భద్రపరిచారు. **"ఒక్కొక్క కళాఖండాన్ని అర నిముషం చొప్పున చూస్తూపోతే మొత్తం పరిశీలన పూర్తి చేయటానికి పది సంవత్సరాల కాలం పడుతుందట!"**[6] ఐతే చాలా హడావుడిగా ఒక గంటలోనే వీళ్ళ బృందం ఈ కళానిలయాన్ని దర్శించుకున్నారు.

పురాతత్వ సంపదను కాపాడుకోవడంలో, నిలుపుకోవడంలో సోషలిస్టు ప్రభుత్వం యొక్క శ్రద్ధాసక్తులు గొప్పవి.

లెనిన్‌గ్రాడ్ మహానగరం రెండవ ప్రపంచయుద్ధ కాలంలో ముట్టడికి గురైనప్పుడు 900 రోజులు ప్రాణాలకు తెగించి పోరాడారు ఎర్రసైనికులు, విప్లవ గెరిల్లాలు. ఈ సందర్భంగా వివిధ భవనాలు, కట్టడాలు ధ్వంసానికి గురి కాగా, తర్వాత వాటిని పునరుద్ధరించుకున్నారు.

ఒకప్పటి బోల్షివిక్ పార్టీ కేంద్ర కమిటీ కార్యాలయంలో ప్రస్తుతం విప్లవ స్మృతులను గుర్తుచేసే మ్యూజియం ఏర్పరచుకున్నారు.

తర్వాత అమరవీరుల స్మారక చిహ్నాన్ని దర్శించారు. 'అమరవీరుల స్మృతిచిహ్నం'గా స్ఫటికపు శిలాఖండం నిర్మింపబడింది. రెండవ ప్రపంచ యుద్ధంలో ఒకరో ఇద్దరో బలికాని కుటుంబం లేదంటే అతిశయోక్తి కాదు. పిచ్చయ్యగారిలాగా డైరీ వివరాల జోలికి పోలేదు కాని, రామారావుగారు 'టానియా' గురించి ఒక వాక్యం వ్రాశారు: "మన ఆంధ్రదేశంలో పేరుగాంచిన 'టానియా' ఈ ప్రాంతపు అమ్మాయే. బహుశా తర్వాతి కాలంలో మనదేశంవారు ఈమె గాథను విని తమ పిల్లలకు ఈ అమ్మాయి పేరు పెట్టుకొని ఉంటారు" అన్నారు.

---

6. అరనిముషం చొప్పున చూస్తూపోతే 8 సంవత్సరాలు పడుతుందని చుక్కపల్లి పిచ్చయ్యగారు తమ గ్రంథం (పేజీ. 15) లో తెలిపారు.

లెనిన్‌గ్రాడ్ ఉత్తర ధ్రువానికి దగ్గరలో ఉండటంవల్ల జూన్ 20 నుండి ఆగస్టు వరకు తెల్లటి రాత్రులు (White Nights) ఉంటాయట. అంటే అక్కడ చీకటి ఉండదన్నమాట! అట్లాగే మరో మూడు నెలలు రాత్రి ఉంటుందట! రాత్రి 7-30 గంటలకు లాట్వియా సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్ రాజధాని నగరం 'రీగా'కు రైలులో బయలుదేరారు. ఉదయం సరిగ్గా 6 గంటలకు 'తెల్లటి రాత్రుల రీగా పట్టణం' చేరుకున్నారు. ఇక్కడ రైలు ప్లాట్‌ఫారాలు ప్రశాంతంగా ఉంటాయి. రణగొణ ధ్వనులు, అరుపులు వినరావు.

రీగా పట్టణంలో రెండో ప్రపంచయుద్ధంలో నాజీ మూకలు ఏర్పాటు చేసిన Concentration Camp ను (ఖైదీలను ప్రత్యేకంగా వుంచే ఖైదు) చూశారు. శాంతి వనాలతో నిండివున్న ఇక్కడి మైదానపు భాగంలో ఒకచోట వేల శవాలను పూడ్చిపెట్టారు. ఆ ప్రదేశంలో నల్లపాలరాతితో ఒక స్మృతి చిహ్నం ఏర్పరచారు. దానిలోనుండి "టిక్ టిక్" మని వచ్చే ధ్వనిని మృత వీరుల గుండె చప్పుడుకు ప్రతీకగా ఏర్పాటు చేశారు.

తర్వాత 50 నెంబరు సెకండరీ స్కూలు దర్శనానికి ఏర్పాట్లు జరిగాయి. 1914 లో ప్రాథమిక పాఠశాలగా ప్రారంభింపబడింది.[7] యాత్రాకాలం నాటికి సెకండరీ స్కూలు. ఈ స్కూలులో ఇంగ్లీషు, రష్యను, లాట్వియా భాషలను విధిగా బోధిస్తారు. 6 వ తరగతిదాకా లాట్వియా భాషను, లింకు భాషయైన రష్యన్ భాషను బోధిస్తారు. 7 వ తరగతినుండి ఇంగ్లీషు భాషను బోధిస్తారు ఈ భాషాసూత్రం మనదేశానికి కూడ ఆదర్శప్రాయం కావాల్సి ఉంది.

## iv) విల్నిసస్ నగర శోభ :

రీగా పట్టణంనుండి లిథుయేనియా రాజధాని విల్నిసస్ నగరానికి చేరుకున్నారు. ఆ రోజు మే 1. ప్రపంచ కార్మిక దినోత్సవం. ఆనాటి పరేడ్‌లో లిథుయేనియా రిపబ్లిక్ ప్రభుత్వాధినేత తన సందేశాన్ని లిథుయేనియన్ భాషలో ఇచ్చారు. బాలబాలికలు, వివిధ దళాలు తమ తమ జాతీయ దుస్తుల్లో నృత్యం చేశారు.

---

7. చుక్కపల్లి వారు 47 నెంబరు. స్కూలు సందర్శించారు. (పేజీ 18) ఐతే ఇది 1961 లో నిర్మించబడింది.

ఒుథివేనియా రిపబ్లిక్ దర్శించటానికి వచ్చిన మొట్టమొదటి ఇండో-సోవియట్ మైత్రీ సంఘ ప్రతినిధివర్గం ఇదేనట! అందుకే రేడియో కేంద్రం, టెలివిజన్ యూనిట్, డాక్యుమెంటరీ ఫిలింలవారు వేర్వేరుగా వచ్చి బృందానికి కృతజ్ఞతలు తెలుపుతూ స్వాగతం పలికారు.

వీరి పర్యటనలో చాలాచోట్ల బాలబాలికలు కానుకలను ఇచ్చి పుచ్చుకున్నారు. మనవాళ్ళు ముఖ్యంగా బొమ్మలు, నాణాలు బహూకరించారు.

2-5-82న 'తరభాయి' అనే గ్రామానికి వెళ్ళి రైతుల ఇండ్లను చూశారు. రెండు మూడు గదుల ఇండ్లే అన్నీ, గోడలకు, ఇంటి కప్పుకు రంగులు వేశారు. డ్రాయింగు రూము టి. వి. సెట్టు, పిల్లల చదువుకు కేటాయించిన కార్నరీ అల మారాలు ఉన్నాయి. పడక గది వేరే ఉంది. వంటగదిలోనే డైనింగ్ టేబుల్, వంట చేసుకునే స్టాండు వుంది. వాళ్ళ 'టీ' టైము అయ్యాక వచ్చారని వీళ్ళకు టీ ఇవ్వలేకపోయినందుకు చాలా బాధ పడ్డారట! వందలు, వేల ఎకరాలతో సమష్టి వ్యవసాయ క్షేత్రాలు వెలసినాయి. వ్యవసాయం అన్నది ఇక్కడ ఫ్యాక్టరీగా మారుతున్నది.

## vii) మినిస్క్ పట్టణంలో : (MINSK)

బైలో రష్యా రిపబ్లిక్ యొక్క రాజధానీ నగరమిది. అదే రోజు సాయంత్రం 7-30 గంటలకు బయలుదేరి రైలులో రాత్రి 1 గంటకు మినిస్క్ చేరుకున్నారు. మూడు సంవత్సరాల ముట్టడిలో 70 పాళ్ళు ఈ నగరం విధ్వంసానికి గురైందట. ఐతే విముక్తి తర్వాత ఏడాదిలోగానే తిరిగి నిర్మించుకున్నారట! బైలో రష్యాలోనే మొత్తం 20 లక్షల మంది నాజీలతో జరిగిన పోరాటంలో ఆహుతయ్యారని తెలిపారు.

3 నాడు నాజీలచే పూర్తిగా తుడిచిపెట్టబడ్డ గ్రామాన్ని మృతవీరుల స్మృతి చిహ్నంగా దర్శించారు.

4 నాడు బైలో రష్యన్ల వీరోచితమైన విముక్తి పోరాటాలను చిత్రించే మ్యూజియంను దర్శించారు. ఆనాడు సాయంత్రం (Comsomal) కాంసోమాల్ యువజన సంఘం వారు భారత ప్రతినిధి వర్గానికి స్వాగతం చెప్పి అభినందనలు తెలిపారు. విందులు ఏర్పాటు చేశారు.

5-5-82 నాడు ఉదయం 6 గంటలకు క్రెమ్లిన్ భవనం చేరుకున్నారు. ఆనాటి కార్యక్రమం కేవలం లెనిన్ మునోలియం చూడటమే కాబట్టి పార్లమెంటు భవనాలు చూడలేదు. ఒక మైలు క్యూ దాటిన తర్వాత 10-30 గంటలకు సమాధిని చేరుకున్నారు.

లెనిన్ భౌతిక కాయం వుంచిన మందిరం 1930 లో చలువరాళ్ళతో నిర్మించారు. ప్రపంచంలో కెల్లా మొదటిసారి భౌతిక కాయాన్ని యధాతథంగా వుంచటం జరిగిందిక్కడ. రష్యన్ ప్రజలు సాధించిన శాస్త్ర విజ్ఞాన విజయానికిది ప్రతీక. దీని తర్వాతనే వియత్నాంలో హోచిమిన్, బల్గేరియాలో డిమిట్రోవ్, చైనాలో మావో భౌతిక కాయాన్ని ఇదే పద్ధతిలో భద్రపరచారని రామారావు గారు పేర్కొన్నారు.

పూర్తి సూటుతో, కాలరు, టైలతో సహా ఏదో దీర్ఘాలోచనలో నిమగ్నమై లెనిన్ భౌతికకాయం శయనించినట్లుగా చూపరులకు అనిపిస్తుంది. ఒక సభలో ప్రసంగిస్తుండగా సోషలిస్టు రివల్యూషనరీ పార్టీకి చెందిన ఒక మహిళ లెనిన్‌ను తుపాకీతో కాల్చిందట. లెనిన్‌ను హతమార్చితే సోషలిస్టు సమాజ నిర్మాణం ఆగి పోతుందన్న ఆలోచనతో చేసిన ఘాతుక చర్య అది. ఐతే గాయపడిన లెనిన్ ఇంకో రెండేండ్లు జీవించి, అదే బాధతో కీర్తిశేషుడైనాడు. శ్రద్ధాంజలి ఘటించారు రామారావు బృందం.

లెనిన్ సమాధివద్ద ఎప్పుడూ మిలిటరీ పహరా ఉంటుంది. గంట గంటకూ పహరా మారుతుంది. ఈ గంట సమయంలో పహరా జవాన్లు నిశ్చలంగా విగ్రహాల్లా నిలిచి ఉంటారు. తర్వాత మిగతా దేశాధినేతల సమాధులను సందర్శించారు.

క్రెమ్లిన్ భవన ద్వారం వద్దనే 'క్యూ' దారిలో వీరుల స్మారక చిహ్నం. దాని ముందు అఖండ జ్యోతి వెలుగుతూ ఉంటుంది.[8] నూతన వధూవరులు తప్పనిసరిగా అఖండ జ్యోతి వద్ద పుష్పగుచ్ఛాలు సమర్పించి శ్రద్ధాంజలి ఘటించిన తర్వాతనే ఇంటికి వెళ్ళి విందులు, వినోదాల్లో పాల్గొంటారట. దేశం కోసం ప్రాణాలర్పించిన దేశ భక్తుల యెడ సోవియట్ ప్రజల భక్తి గౌరవాలు, శ్రద్ధ ఎంతైనా ప్రశంసనీయాలు.

8. ఈ అఖండజ్యోతి 1960 లో నూతనంగా నిర్మితం. పేజీ. 37.

6-5-82 నాడు సోవియట్ దేశపు ఆర్థిక, వ్యవసాయిక, సాంఘిక, పారిశ్రామిక, సాంస్కృతిక విషయాల్లో తీర్చిదిద్దిన మ్యూజియం ఆవరణకు వెళ్ళారు. ఈ ఆవరణ 350 హెక్టార్ల భూమిలో విస్తరించి ఉందట.[9] 15 రిపబ్లిక్కులకు ప్రాతినిధ్యం వహిస్తున్న సుందరమైన మహిళా విగ్రహాలతో కూడిన జలధారలను దర్శించారు [10]

1980లో మాస్కోలో జరిగిన అంతర్జాతీయ ఒలింపిక్ పోటీల సందర్భంగా నిర్మించిన స్టేడియం ఒకదాన్ని చూశారు పుష్కిన్ ప్రదర్శన శాలను సందర్శించారు.

## viii) క్రెమ్లిన్ భవనం :

5-5-82 నాడు చూడవలసిన క్రెమ్లిన్ కోటను 8-5-82 నాడు చూశారు. ఇది 12 శతాబ్దంనాటి దుర్గం. ఈ కోటను కేంద్రంగా చేసుకొని చుట్టూ నగరం పెరిగిపోయింది కాబట్టి ఇప్పుడది మాస్కో నగర మధ్యంలో ఉంది. 800 కి.మీ. చ. వైశాల్యంతో 80 లక్షల జనాభాతో విస్తరింది ఉంది మాస్కో. ఆనాటి చక్రవర్తుల ఆభరణాల ప్రదర్శన ఏడాదికి రెండుసార్లు ప్రదర్శిస్తారట! చర్చిలను కూడా అనాటి (12 వ శతాబ్ది) శిఖరాలతో, శిల్పసంపదతో సహా చెక్కు చెదరకుండా నేటికీ నిల్పి ఉంచారు. ఆరాధన మాత్రం కోసైంటిలో జరుగుతూ వుంటుంది. అప్పటి మతాధికారుల ప్రాబల్యం గొప్పది. ఒక రాజుగారు నలుగురిని మించి పెండ్లాడినందుకు ఆయనను చర్చి పాలకవర్గం వెలివేయగా, ఆయన చర్చి ద్వారం వద్ద వేరే గది నిర్మించుకొని అక్కడి నుండి దర్శనం చేసుకునేవాడట. ఆ చాంబరును ఇప్పటికీ చూడవచ్చు. యూరప్‌లో పెద్దదైన జార్ కాలపు ఫిరంగి, బ్రహ్మాండమైన కంచుగంట మొదలగునవి ప్రత్యేకంగా భద్రపరచి ఉంటారు.

బోల్షాయ్ థియేటర్‌లో నాటక ప్రదర్శన చూసిన తర్వాత తమ పర్యటన నిజంగా ఫలించినట్లుగా రామారావుగారు భావించారు.

---

9. పిచ్చయ్యగారు దీనిని 305 హెక్టార్లన్నారు. ఏది అచ్చుతప్పు? పేజీ 8.
10. పిచ్చయ్య గారి కవి 16గా కనిపించాయి. పేజీ. 9.

మే 9 నాజీ వ్యతిరేక విజయోత్సవ దినం. ఇది సోవియట్ ప్రజలు అంతా కలిసి చేసుకునే జాతీయ పర్వదినం. ఐతే ఈ ఉత్సవ కార్యకలాపాలకు - ప్రభుత్వ యంత్రాంగంతో ఎలాంటి సంబంధమూ ఉండదు. సైనిక యోధులు - (ఎక్కువగా పదవీ విరమణ చేసినవారే) ప్రజలు పరస్పరం అభినందించు కున్నారు. స్పుత్నిక్ సంస్థవారి వీడ్కోలు సమావేశం జరిగింది.

## ix) తిరుగు ప్రయాణం :

స్పుత్నిక్ సంస్థ ప్రతినిధులు విమానాశ్రయంలో 'దస్వి దానియా' (వీడ్కోలు) చెప్పారు. బరువెక్కిన గుండెలతో మాస్కో మహా నగరానికి వీడ్కోలు చెప్పి Air India లో బయలుదేరారు. తాష్కెంటు, ఆఫ్గనిస్తాన్, పాకిస్తాన్, అమృతసర్‌ల మీదుగా ఢిల్లీ చేరుకున్నారు.

## x) సోవియట్ సందర్శన - కొన్ని అనుభవాలు :

రష్యాలో కుటుంబ సంఖ్యను బట్టి, అవసరాలను బట్టి ఇండ్ల కేటాయింపు జరుగుతుంది. ఆదాయంలో ఐదోవంతు నామమాత్రపు అద్దె చెల్లించాలి. 50 ఏళ్ళ నాటి అద్దెలే ఇంకా స్థిరంగా ఉన్నాయి. అన్ని సౌకర్యాలూ దీనిలోనే కలిసి ఉంటాయి. ప్రతి ఇంటికీ రేడియో, ఫ్రిజ్, టి.వి, టెలిఫోను తప్పనిసరి. ఈ సౌకర్యాలు మనదేశంలో ఏ లక్షాధికారికో తప్ప వేరేవారికి అందుబాటులో ఉండవు కదా!

భూగర్భ రైల్వేలలో 5 కోపెక్కుల ఛార్జితో 85 మై. వైశాల్యం గల మాస్కో నగరంలో ఎక్కడికైనా వెళ్ళవచ్చు. (100 కోపెక్కులు =1 రూబులు) అంటే మన 5 పైసలతో సమానమన్నమాట! పదే పదే బస్సు ఛార్జీలు పెంచడం జరుగదు. కండక్టరు లేకున్నా టిక్కెట్టు కౌంటర్లో తీసుకుని ప్రయాణించే సామాజిక నైతిక స్థాయి అక్కడి పౌరులకుంది.

రష్యాలోని వీధులు మన దేవాలయాల కంటె శుభ్రంగా ఉంటాయట! చెత్తను కుండీలలో వేసి మూత వేస్తారు. ప్రయాణ సాధనాల్లో, మ్యూజియంలలో, స్మారక చిహ్నాల వద్ద, ప్రార్థనా మందిరాల వద్ద పౌరులెవ్వరూ సిగరెట్లు కాల్చరు. ఎనలేని భక్తి శ్రద్ధలు పాటిస్తారు.

ప్రయాణాల్లో పెద్దల యెడ, అశక్తుల యెడ మానవతా గౌరవాలు ప్రదర్శిస్తారు. కాలం వృధా చేయరు. కరెంటు పోవడం అన్నది ఉండదు ఉత్పత్తి ఆగిపోతే సమాజానికే నష్టమన్న ధ్యాస, చైతన్యం వారికుంది.

ప్రతి వస్తువుకూ దాని ధరను తెలియచేసే చీటీ ఉంటుంది. బేర సారాలుండవు. నాణ్యతలో మోసముండదు. ఎందుకంటే లాభాలనార్జించే వర్గం ఆ సమాజంలో లేనేలేదు.

చలివేంద్రాల లాగా మినరల్ వాటర్ (మన సోడా లాంటిది), పండ్ల రసాల కేంద్రాలు పట్టణాల్లో ప్రతి వీధిలో ఉంటాయి. అక్కడి కౌంటర్ రంధ్రంలో ఒక కోపెక్ వేస్తే మినరల్ వాటర్, మూడు కోపెక్కులు వేస్తే గ్లాసు నిండా పండ్ల రసం వస్తుంది. గ్లాసులు కూడా అక్కడే ఉంటాయి. దారినపోయే వాళ్ళెవరైనా దీన్ని ఉపయోగించుకోవచ్చునట. మన దగ్గర అట్లాంటివి ఉంటే పళ్ళరసం కాదు కదా గ్లాసులే మాయమౌతాయి.

## xi) రష్యాలో ముగ్గురు అదృష్టవంతులు :

సోవియట్ సమాజంలో స్త్రీలు, బాలలు, వృద్ధులు - వీరు ముగ్గురే అదృష్ట వంతులు వీరి అభ్యుదయానికి ప్రభుత్వం చూపే శ్రద్ధ అపారం.

స్త్రీలకు ఆర్థిక స్వాతంత్ర్యం ఉంది. మాతృత్వానికి సాంఘిక హోదా గౌరవం ఇవ్వబడింది. గర్భవతులకు పూర్తి వేతనంపై సెలవులు, వైద్య సదుపాయాలున్నాయి. విద్య వైద్య రంగాలలో, ట్రాములు నడపడంలో, రైళ్ళ యాజమాన్య నిర్వహణలో, పాల ఉత్పత్తి, కోళ్ళ ఫారాలలో అంతటా మహిళలే పని చేస్తూంటారు.

క్యూలో ఎంతమంది ఉన్నా బాలలకు మొదట అవకాశం ఇస్తారు.

వృద్ధులు 60 వ యేట విశ్రాంతి పొందవచ్చును. జీవితంలో $\frac{2}{3}$ నుండి $\frac{3}{4}$ వరకు పెన్షన్ దొరుకుతుంది. పెన్షన్ పొందిన వాళ్ళు కూడ ఓపిక ఉంటే ఏదైనా పని చేయవచ్చు. పెన్షన్ కాకుండా ఈ పనికి పూర్తి జీతం ఇస్తారు. పని అంటే సాంఘిక గౌరవం ఉంది రష్యాలో.

సోవియట్‌లో అవిద్య ఏనాడో నశించిపోయింది. స్వదేశ, విదేశ సాహిత్య వ్యాప్తికి శ్రద్ధ వహించడం సోషలిస్టు సమాజ విశిష్టత. గురజాడ కవితలు, కన్యాశుల్కం నాటకం, శ్రీశ్రీ సాహిత్యం, సుప్రసిద్ధ కథకుల కథలు - అన్నీ వారికి అందుబాటులో ఉన్నాయి.

## 5. పోశెట్టిగారి 'రష్యాలో ఏముంది?' *

రష్యా గురించి వ్రాసిన యాత్రా గ్రంథాల్లో మొదట తమ ప్రయాణ వివరాలు తెలిపి తర్వాత టూకీగా తమ పరిశీలనలో వెల్లడైన అంశాలను గ్రంథాంతంలో ఇవ్వడం జరుగుతుంది. ఈ పద్ధతి రచన పిచయ్యగారు, రామారావుగారు చేశారు. ఐతే పోశెట్టిగారు అట్లా కాకుండా ముందే రష్యా గురించిన పరిచయంతోపాటు తన పరిశీలనా వివరాలను కూడ జోడించి ఆ తర్వాతనే తన యాత్రా వృత్తాంతాన్ని తెలియజేశారు. దీని పేరు "రష్యాలో ఏముంది?" 52 పుటలున్న ఈ పుస్తకాన్ని 1986 లో ప్రజారాజ్యం పబ్లికేషన్స్ వారు ప్రచురించారు.

### i) యాత్రోద్దేశం :

పోశెట్టిగారు విద్యార్థి దశనుండి మన దేశంలో ఉన్న అసమానతలను చూసి నొచ్చుకుని సోషలిస్టు వ్యవస్థ గురించి తెలుసుకోవడానికి చాల పుస్తకాలు చదివారు. అట్లాంటి దేశాన్ని ఒకసారి చూడాలన్న వీరి కోరిక సుదూర స్వప్నం కాకుండానే 1983 లో ఇస్కస్ ఆధ్వర్యాన రష్యాకు వెళ్ళే అవకాశం లభించింది.

ఏ.ఎస్. పోశెట్టి వృత్తి రీత్యా న్యాయవాది. కవి, రచయిత, కార్మిక నాయకుడు కూడ. ఎన్నో కార్మిక సంఘాలకు నాయకత్వం వహించి, ఎన్నో సార్లు అరెస్టయ్యారు. న్యాయసంఘర్ష్ సమితి స్థాపకులు. నిజామాబాద్ జిల్లా ఇస్కస్ సభ్యులు కూడ 15 రోజుల పర్యటనలో (8-7-1983 - 23-7-1983) తనతోపాటు ఎవరెవరు యాత్ర చేశారో ఎక్కడా చెప్పకపోగా, తానొక్కడే యాత్ర చేసినట్లుగా రచన సాగుతుంది. ఈ రచన భారతదేశంలోని కోట్లాది పీడిత ప్రజలకు హృదయపూర్వకంగా అంకితమివ్వబడింది.

---

* ఏ. ఎస్. పోశెట్టిగారు.

చుక్కపల్లి పిచ్చయ్యగారి లాగే ఈయన కూడ ఇస్కాన్ అధ్వర్యాన రష్యా పర్యటన చేసేందుకై వెళ్ళారు. కాని పిచ్చయ్యగారికి ప్రయాణ ఛార్జీలు 8500 రూపాయలు కాగా, పోశెట్టిగారికి 10,500 ఖర్చయింది. నాలుగేళ్ళలోనే ప్రయాణపు ఖర్చులు రెండు వేలదాకా పెరిగాయన్నమాట.[11]

## ii) తాష్కెంటుకు ప్రయాణం :

ఎయిర్ ఇండియా విమానం 'అన్నపూర్ణ'లో ప్రయాణం. విమానం కొంచెం సేపు అమృతసర్‌లో ఆగి, పాకిస్తాన్, ఆఫ్ఘనిస్తాన్‌ల మీదుగా 'విధ్వంసంలో నుండి ఉదయించిన ఉజ్బెక్ రాజధాని తాష్కెంటు'కు చేరుకుంది. విమానాశ్రయంలో వీసాల తనిఖీ, దగ్గర ఉన్న డబ్బుల వివరాలు వ్రాసి డిక్లరేషన్లు దాఖలు చేసి 'సామ్యవాద పురిటిగడ్డ'పై కాలు మోపారు. ఇంటూరిస్టు బస్సులో ఒక పొడుగాటి రష్యన్ తనపేరు 'స్లావా'గా పరిచయం చేసుకొని వీళ్ళ వెంటే పర్యటనాంతరం వరకు ఉంటానని చెప్పి స్వాగతం పలికాడు. 20 కి.మీ. ప్రయాణం తర్వాత బస్సు 'ఉజ్బెకిస్తాన్ హోటల్' ముందాగింది. ఇది 18 అంతస్తుల ఎత్తయిన ప్రదేశంలో కట్టబడిన భవనం. 550 గదులు, 8 భోజన హాళ్ళు. 980 మందికి వసతి ఇందులో ఉంది.

తాష్కెంటు మన ఆంధ్రప్రదేశ్‌కు దాదాపు 28 డిగ్రీల తూర్పు రేఖాంశాల తేడాతో ముందున్నది. కాబట్టి గడియారాలు $1\frac{1}{2}$ గంటల ముందు జరుపుకోవలసి వచ్చింది. ఆ రోజు రాత్రి జరిగిన సమావేశంలో సాంబశివరావుగారిని నాయకుడిగా, పోశెట్టిగారిని ఉపనాయకునిగా ఎన్నుకున్నారు.

రాత్రి హోటల్‌లో జరిగిన విందు భోజనంలో పిచ్చయ్యగారు డిన్నర్‌లో వర్ణించిన ఆహార పదార్థాలకుతోడు పోశెట్టిగారు అదనంగా కోడి, బీర్లను కూడ చేర్చారు.

తెల్లవారి అనగా 10-7-88 నాడు పట్టణ సందర్శనకై బయలుదేరారు. తాష్కెంటు జనాభా 20 లక్షలు. దాదాపు సగంమంది ఇక్కడ పళ్ళకు బంగారు

---

11. పిచ్చయ్యగారు 1979 లో, పోశెట్టిగారు 1988 లో పర్యటనలు చేశారు.

**పూత** పూయించుకున్నారట! ఇది ఫ్యాషనా? లేక ఆరోగ్య సంబంధమైందా అని ప్రశ్న వేసుకుని, బహుశా బంగారు పళ్ళు కట్టించుకుని వుంటారని పోశెట్టిగారు తనకు తానే సమాధానం చెప్పుకున్నారు.

1966 లో వచ్చిన పెద్ద భూకంపంలో తాష్కెంటు పట్టణం పూర్తిగా ధ్వంసమైపోయింది ఐనా రెండు మూడు సంవత్సరాలలోనే మళ్ళీ అందంగా తీర్చిదిద్దబడింది. ఇప్పుడిది గొప్ప సాంస్కృతిక కేంద్రం కూడా. తాష్కెంట్ లోని ప్రధాన కూడలి 'లెనిన్ స్క్వేర్'లో వున్నప్పుడు 'స్వర్గంలో వున్నామా' అని అనిపించిందట!

## iii) మాస్కో మహానగరానికి :

తాష్కెంటు నుండి మాస్కో 3,000 కి.మీ. దూరం ఏరోఫ్లాట్ విమానంలో ఎక్కి "దోపిడీ వ్యవస్థపై విప్లవ పోరాటానికి బాట చూపిన రష్యా రాజధాని మాస్కో మహానగరానికి" చేరుకున్నారు విమానాశ్రయానికి మాస్కో పట్టణం 30 కి.మీ. ఇంటూరిస్టు బస్సు **'హోటల్ కాస్మాస్'** ముందు ఆగింది. మాస్కోలోని ప్రఖ్యాత ఆధునాతనమైన హోటల్ ఇది. 20 అంతస్తులు, 2500 మందికి వసతి సౌకర్యముంది. ఈ హోటల్‌ను 1980లో జరిగిన ఒలింపిక్స్ కోసం నిర్మించారట! ఇది స్టార్ హోటల్. ఇందులో పెద్దపెద్ద భోజన హోటళ్ళు బార్‌లు, పోస్టాఫీసు, డిపార్ట్‌మెంటల్ స్టోర్స్, ఒక ఇండోర్ స్విమ్మింగ్‌పూల్ వున్నాయి.

మాస్కో మహానగరం జనాభా 80 లక్షలు. పట్టణం క్రింద 119 భూగర్భ మెట్రో రైల్వేస్టేషన్లున్నాయట! 1935 లో వున్న రైల్వేచార్జీనే ఇంకా వసూలు చేస్తున్నారట!

మాస్కోలోని క్రెమ్లిన్ భవనాన్ని దర్శించారు. ఈ భవనాన్ని గురించి వెంకటరామారావుగారు వర్ణించిన ధోరణిలోనే పోశెట్టిగారి రచన సాగింది. ఒక్క మతాధికారుల ప్రాబల్యం గురించిన వివరం తప్ప. ఐతే కంచుగంట గురించి ఎక్కువ వివరాలను పోశెట్టిగారు పేర్కొన్నారు. ఈ గంట 1733 లో తయారయిందనీ, బరువు 216 టన్నులు, చుట్టుకొలత 22'8''. ఎత్తు 19' అనీ

తెల్పుతూ ప్రస్తుతం 11 టన్నుల బరువుచేసే ఓ ముక్క పగిలిపోయి ఉందని వ్రాశారు.[12]

అక్కడి ఇతర భవనాలను దూరంనుండి చూశారు. తర్వాత లెనిన్ భౌతికకాయాన్ని దర్శించడానికి 'క్యూ'లో నిలబడ్డారు. 2 కి.మీ క్యూ ఉందట. క్యూ దారిలోనే అమరవీరుల స్మారక శిలాఫలకం, అఖండజ్యోతి వెలుగుతూ ంటుంది. "ఓ సైనికుడా! నీ పేరు నాకు తెలియదు. అయినా నిన్నెప్పటికీ మరువ లేము" అని రష్యన్ భాషలో వ్రాసికొన్న ఫలకం పోశెట్టిగారికి కనిపించిందట!

ఐతే నూతన వధూవరులు మాత్రం ఈ అఖండజ్యోతికి శ్రద్ధాంజలి ఘటించడానికి క్యూలో నిల్చోవాల్సిన అవసరం లేదు. నేరుగా వెళ్ళి పుష్పగుచ్ఛా లుంచి మౌనంగా శ్రద్ధాంజలి ఘటించి వెళ్ళిపోవచ్చు.

లెనిన్ భౌతికకాయం వుంచిన సమాధి (Lenin Mausc leum) సింపుల్‌గా, అందంగా ఉందట. పిచ్చయ్య రామారావుగార్లకంటే, పో శెట్టిగారు సమాధుల విషయంలో ఒక ఆకు ఎక్కువే చదవినట్లున్నది. లెనిన్ భౌతికకాయమే మొట్టమొదటిసారిగా ఈ పద్ధతిలో సమాధి చేయబడిందని వాళ్ళిద్దరు వ్రాయగా, పోశెట్టిగారు లెనిన్‌కు ముందే మనదేశంలోని గోవాలో ఒక చర్చిలో 'సేయింట్ జేవియర్' భౌతిక కాయాన్ని యథాతథంగా ఉంచినట్లుగా విన్నానని పేర్కొన్నారు. లెనిన్ భౌతిక కాయం నిద్రిస్తున్నట్లుగా, ప్రశాంతంగా కనిపించింది ఈయనకు కూడా.

లెనిన్ సమాధివద్ద మిలిటరీ పహరా ఎప్పుడూ వుంటుంది. పహరావారు నిశ్చలంగా బొమ్మల్లాగా నిలబడతారు.

వీరు బసచేసిన హోటల్ కెదురుగా ఉన్న 15 రిపబ్లిక్కులు సాధించిన విజయాన్ని చూపే మ్యూజియం ఆవరణకు వెళ్ళారు. ఇక్కడ పోశెట్టిగారు వివరించిన విశేషాలు రామారావుగారి వివరాలతో పూర్తిగా ఏకీభవిస్తున్నాయి. ఐతే పిచ్చయ్యగారిలాగా ట్రాములో ఎక్కి మ్యూజియాన్ని దర్శించారు.

తర్వాత 'పెనోరమా' సినిమాహాలు. దీనిలోపల 12 వెండి తెరలు (Screens) ఉన్నాయి. ఇంకా అంతరిక్షరంగం, లెనిన్ స్టేట్ లైబ్రరీ,

12. పిచ్చయ్యగారు 200 టన్నుల బరువు, 6 మీ. ఎత్తు అని. పేజీ. 12.

బోల్షాయ్ థియేటర్, తర్వాత రష్యన్ సర్కస్ చూశారు. ఈ రష్యన్ సర్కస్ చూస్తే కలిగే అనుభూతి మాటల్లో చెప్పలేనిదట!

14-7-83 నాటి రాత్రి మాస్కోకు వీడ్కోలిచ్చి మాస్కోలోని లెనిన్‌గ్రాడ్ రైల్వేస్టేషనుకు చేరుకున్నారు.[13] ప్రపంచఖ్యాతి చెందిన 'ఎర్ర బాణం' (Red Arrow) ఎక్స్‌ప్రెస్ రైలెక్కి బయలుదేరారు. పోశెట్టిగారు వ్రాసిన రైలు సౌకర్యాలు రామారావుగారి 'మధుర స్మృతుల'ను యథాతథంగా గుర్తుకు తెస్తాయి. ఐతే 25 సంవత్సరముల క్రితం (1958లో) నెహ్రూగారు ఇదే రైలులో ప్రయాణించిన అపురూప విషయం పోశెట్టిగారు తెలుసుకొని చెప్పారు. రైల్లో టీ త్రాగారు. ఇది మన టీ లాంటిదికాదు. అందులో పాలుండవు. డికాషన్‌లో చక్కెర బిళ్ళలు కలుపుతారంతే.

మాస్కోనుండి లెనిన్‌గ్రాడ్ 600 కి. మీ. తెల్లవారేసరికి లెనిన్‌గ్రాడ్ గడ్డపై కాలుమోపారు.[14] బాల్టిక్ సముద్రం ఒడ్డునగల "ప్రిబాల్టియస్కాయా హోటల్''లో బస ఏర్పాటు చేయబడింది.

లెనిన్‌గాడ్‌లో నదులు, కాలువలు కల్సి 64 ఈ పట్టణంగుండా ప్రవహించడంతో ఈ నగరం 42 దీవులుగా, 360 వంతెనలతో కలపబడి ఉంది.[15] వీధులలో రచయితల విగ్రహాలు, పీటర్ ది గ్రేట్, లెనిన్ విగ్రహాలు చాలా అందంగా అమర్చి పట్టణానికి వన్నె తెచ్చారు.

లెనిన్‌గ్రాడ్ మహానగరం రెండవ ప్రపంచ యుద్ధంలో నాజీసేనల చక్రబంధంలో 900 రోజులు ప్రాణనష్టాన్ని లెక్కచేయకుండా నిలదొక్కుకుంది. ఈ యుద్ధంలో 10 లక్షల మంది రష్యన్లు మరణించారు. రెండువారాల్లో లెనిన్‌గ్రాడ్‌ని జయిస్తానని విర్రవీగి, ప్రసిద్ధిచెందిన 'ఎస్టోనియా' హోటల్‌లో విజయోత్సవ విందుకు స్వర్ణాక్షరాలతో ఆహ్వానాలను సిద్ధం చేసుకొన్నాడు కాని, హిట్లర్ కోరిక తీరనేలేదు.

---

13 లెనిన్‌గ్రాడ్, మాస్కో రైల్వేస్టేషన్ల పేర్ల గురించి పోశెట్టిగారు కూడ పేర్కొన్నారు. పేజీ 34.

14 నాలుగేళ్ళక్రితం పిచ్చయ్యగారు ఈ ప్రయాణాన్ని విమానంలో చేశారు.

15. వంతెన వివరాలు సరిగ్గానే ఉన్నాయి కాని దీవులలెక్క 101 అన్ని పిచ్చయ్యగారు. పేజీ. 14.

తర్వాత హెర్మిటేజ్‌ను దర్శించారు రామారావు గారిలాగే అరనిమిషం చొప్పున ఇక్కడి వస్తువులను చూడటానికి పది సంవత్సరాలు పడుతుందని వ్రాశారు, పోశెట్టిగారు. మిగతా వివరాలు యథాతథంగానే ఉన్నాయి.

తర్వాత 'అమర వీరుల స్మారక చిహ్నాన్ని' సందర్శించారు. అక్కడ అఖండజ్యోతి ఎప్పుడూ వెలుగుతూనే ఉంటుంది. ఎల్లవేళలా విషాద సంగీతం వినిపిస్తుంటుంది. అక్కడి వాతావరణం చూసిన తర్వాత యుద్ధం ఎంత రాక్షసమైందో, ఎంత చెడ్డదో అన్న భావం కలుగుతుందట.

లెనిన్‌గ్రాడ్‌లో రాత్రి పదిగంటలకైనా చీకటి పడలేదు. రాత్రి ఒంటి గంటయింది. తర్వాత గంటకే సూర్యోదయమైంది. అంటే రాత్రి (15-7-88) కేవలం ఒక గంట మాత్రమే నన్నమాట! తెల్లటి రాత్రుల గురించి రామారావు గారిలాంటి వివరణే ఇచ్చారు పోశెట్టిగారు.

లెనిన్‌గ్రాడ్‌లోని పీటర్ ది గ్రేట్ నిర్మించిన దుర్గం చూశారు. ఇది చూడగానే దౌలతాబాదు కోట గుర్తుకు వచ్చిందనీ, ఐతే వ్యూహాత్మకంగా చూస్తే దౌలతాబాద్ కోటనే గొప్పగా ఉందనిపించిందనీ పోశెట్టిగారు తెలిపారు.

## iv) కీవ్ నగరానికి :[16]

ఏరోఫ్లాట్ విమానంలో కీవ్ ఏర్‌పోర్టుకు, తర్వాత బస్సులో ఎత్తైన కొండలను ఎక్కుతూ, లోతైన లోయల్లోకి దిగుతూన్నప్పుడు ఊయలలూగుతున్న అనుభూతి కలిగిందట. 'రస్ హోటల్'లో బస. 20 అంతస్తులు. 1979 లో నిర్మితం. 480 గదులు 896 మందికి వసతి ఉంది.

కీవ్ నగరాన్ని "The Mother of Russian cities" అంటారు. దీనికి 1,500 సంవత్సరముల ప్రాచీన చరిత్ర ఉంది. రష్యా రాజ్యంలో మొట్టమొదట ప్రారంభమైన పట్టణం కీవ్. 1988 లో ఈ పట్టణ జనాభా 28 లక్షలు. నైపర్ (Dnieper) నది పొడవునా ఈ పట్టణం 50 కి.మీ. వరకు వ్యాపించి వుంది. ఈ నది ఒడ్డున కొండలో తొలచబడ్డ గుహలు ప్రపంచంలోని అతి ప్రాచీన

---

16. కీవ్ నగరాన్ని భారతదేశం నుండి వెళ్ళిన ప్రతినిధి బృందంలో మొదటిసారిగా దర్శించిన బృందం వీరిదే.

మైన గుహలుగా ప్రసిద్ధి చెందాయి. వీటిలో 70కి పైగా మమ్మీలు భద్రపరచ బడ్డాయి. రష్యాలో 1980లో జరిగిన ఒలింపిక్స్ ఫుట్‌బాల్ పోటీలు ఇక్కడి సెంట్రల్ స్టేడియంలో జరిగాయి.

రెండవ ప్రపంచ యుద్ధంలో బాగా నష్టపోయిన నగరాలలో కీవ్ నగరం ఒకటి. 89,80,000 జనాభాలో యుద్ధం తర్వాత 1,80,000 మంది మాత్రమే మిగిలారట! ఈ పట్టణానికి రష్యన్లు 'హీరో సిటీ' అని గౌరవ బిరుదు నిచ్చారు. దీనికే 'గార్డెన్ సిటీ' అనే పేరు కూడ ఉంది.

ఇంటూరిస్ట్ బస్‌లో అమెరికన్ మహిళ నవ్వుతూ పలకరించి ఓ డన్‌హిల్స్ సిగరెట్ అందిస్తే అలవాటు లేకున్నా పోశెట్టిగారు కాదనలేకపోయారు. ఐతే ఇంటూరిస్ట్ బస్సు గైడ్ రష్యన్‌కు ఆమె సిగరెట్ ఇవ్వబోతే ఆయన థ్యాంక్స్ చెప్పి రష్యన్ సిగరెట్‌నే వెలిగించుకున్నారు!

కీవ్ విశ్వవిద్యాలయం రష్యాలోని ప్రముఖ విశ్వవిద్యాలయాల్లో ఒకటి మన ప్రధాని స్వర్గీయ శ్రీమతి ఇందిరాగాంధీ గారికి ఈ విశ్వవిద్యాలయం వారు గౌరవ డాక్టరేట్ బిరుదు ఇచ్చి సత్కరించారు.

## v) సోచీ బీచికి :

రష్యాలోని ప్రధాన టూరిస్ట్ కేంద్రాల్లో సోచీ ముఖ్యమైనది. సోచీ అంతర్జాతీయ విమానాశ్రయం నుండి డగోమీస్ పట్టణానికి బస్సులో సుమారు 50 కి. మీ. హోటల్ డగోమిస్‌లో బసచేశారు.[17] 80 అంతస్తుల అధునాతన సౌక ర్యాల కొత్త భవనం ఇది. దీనికి ఎదురుగా 'ఒలంపియా స్క్వాయా' అనే హోటల్ స్టేడియం లాగా గుండ్రంగా, అందంగా ఉందట.

సోచీ గొప్ప విశ్రాంతి కేంద్రం కూడా. వేలాది మంది విదేశీ యాత్రికులు నల్ల సముద్రపు బీచిలో సూర్యస్నానాలు చేస్తుంటారు. రష్యాలో ఎక్కడైనా అశ్లీలం, విచ్చలవిడితనం ఉన్నాయంటే అవి ఇక్కడేనట యూరప్, అమెరికా దేశాల యాత్రికులే ఎక్కువగా ఇటువంటి అసహ్యమైన చేష్టలకు పాల్పడతారు

---

17. పిచ్చయ్యగారు దీన్నే 'థాగామిన్' అన్నారు. పేజీ. 22.

కాని రష్యన్లు కాదు. నల్ల సముద్రం ఒడ్డున 150 కి.మీ. విస్తీర్ణంలో ఉందట సోచీ.[18] పిచ్చయ్యగారి పర్యటన కాలం నాటికి (1979లో) ఉన్న జనాభానే ఇప్పటికీ ఉందట (3 లక్షలు) కాని శానిటోరియంలు మాత్రం రెండు పెరిగాయి (53 నుండి 55 వరకు) డాక్టర్ల సంఖ్య కూడ 2,500 నుండి 3,000 వరకు పెరిగింది.

తర్వాత బొటానికల్ గార్డెన్స్‌కు వెళ్ళారు. ఇక్కడ రెండులక్షల మొక్కలున్నాయని పిచ్చయ్యగారు కూడ వ్రాశారు. ప్రపంచంలో కెల్లా పెద్దదైన టెలిస్కోపు ఇక్కడి కాకసస్ పర్వతాల మీద అమర్చబడి ఉంది.

## vi) మాతృభూమికి తిరుగు ప్రయాణం... :

సోచీ నుంచి మాస్కోకి వచ్చి కొన్ని గంటలసేపు మాస్కో ఇంటర్నేషనల్ ఎయిర్ పోర్టులో ట్రాన్సిట్ ప్యాసింజర్లలా గడిపిన తర్వాత మాస్కో నుండి ఎయిరో ఫ్లాట్ విమానంలో తాష్కెంటుకు వచ్చారు. తర్వాత ఎయిరిండియా విమానంలో ఆఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్‌ల మీదుగా ఢిల్లీ చేరుకున్నారు.

## vii) రచయిత అనుభవాలు మరికొన్ని...

పోశెట్టి గారొక చోట తాను 'కమ్యూనిస్టును' కాకున్నా రష్యా సందర్శన తర్వాత కమ్యూనిస్టు వ్యవస్థ ఎంత గొప్పదో, మంచిదో అర్థం చేసుకున్నానని వ్రాసుకున్నాడు. 'రష్యాలో పౌరజీవనాన్ని చూసి ముగ్ధుడైన ఒక భారతీయ పౌరునిగానే' రష్యా సంగతులను వివరించాడు.

రష్యాలో స్వేచ్ఛలేదని, పరిమిత స్థలాల్లోనే తిరుగనిస్తారని, ఒకవేళ ఎక్కడైనాపోతే సి.ఐ.డీలు నీడలా వెన్నాడుతారని మనవారు చెప్పుకునే విషయాలు నిజం కావని అనుభవపూర్వకంగా పోశెట్టిగారు చెప్పారు.

రష్యా పర్యటనలో చుక్కపల్లి పిచ్చయ్యగారికి ఎదురైన చేదు అనుభవమే పోశెట్టిగారికీ ఎదురైంది. అది రష్యా ప్రజల గురించి కాదు, మన యాత్రికుల

---

18. పిచ్చయ్యగారు 125 కి.మీ. అని వ్రాశారు. పేజీ 18.

విపరీత ప్రవర్తన అందులో మొదటిది సమయాన్ని ఖచ్చితంగా పాటించక పోవడం వగైరా అంతా పిచ్చయ్యగారు వివరించినట్లుగానే. పోశెట్టిగారు ఎదుర్కొన్న కొత్త అనుభవం: భారత - రష్యా మిత్రమండలి సమావేశాల్లో రష్యన్లు చక్కని హిందీలో మాట్లాడుతుంటే అభినందించడం పోయి 'మాకు, హిందీ అర్థం కాదు, తెలుగులో లేదా ఇంగ్లీషులో మాట్లాడ'మని అనడం ఇది సిగ్గు చేటుగా తోచిందట!

ఎక్కువ మంది పిల్లల్ని కన్న తల్లిదండ్రులకు రష్యాలో 'హీరో మదర్' 'హీరో ఫాదర్' లాంటి బిరుదులివ్వడమే గాక ఇంక్రిమెంట్లు కూడా ఇచ్చి ప్రోత్స హిస్తున్నారని తెలిసి రచయిత ఆశ్చర్యం వ్యక్తం చేశారు. మన దగ్గరైతే ఇందుకు వ్యతిరేకం.

మొత్తం రష్యాలో కిళ్లీ దుకాణాలు కాని, బురఖా ధరించిన ముస్లిం స్త్రీ కాని కనిపించలేదట! రోడ్లపై కుడివైపున నడుస్తారు, వాహనాలు కూడ అంతే. సైకిళ్ళను వ్యాయామంలో భాగంగా తొక్కుతారంతే. చదువునుబట్టికాకుండా చేసే పని, శ్రమ, రిస్కును బట్టి జీతమిస్తారు. ప్రతి శనాదివారాలు సెలవు దినాలు.

ఈ విధంగా పోశెట్టిగారు కార్మిక నాయకునిగా రష్యా పర్యటనానుభ వాలను గ్రంథస్థం చేసి రచయితగా తన బాధ్యతను నిర్వహించారు.

## 6. భరద్వాజ గారి 'ఇనుప తెర వెనుక...' అనే రష్యా యాత్ర*

డా॥ రావూరి భరద్వాజ గారు 30 రోజుల రష్యా పర్యటన అనుభవా లను "ఇనుపతెర వెనుక..." అన్న యాత్రా గ్రంథంగా రూపొందించారు. 172 పుటల ఈ గ్రంథం విశాలాంధ్ర పబ్లికేషన్స్ వారి ప్రచురణ. 1985లో మొదటిసారిగా ముద్రింపబడింది

భరద్వాజ గారు రష్యా బయలుదేరింది మొదలు ప్రతిరోజు దినచర్యగా వ్రాసుకున్న పొడిపొడి వివరాలను తర్వాత తీరిగ్గా విస్తరించి విషయాన్ని బట్టి విభజన చేశారు భరద్వాజ గారు బహుగ్రంథకర్త. తల పండిన రచయిత కాబట్టి

* డా. రావూరి భరద్వాజగారు.

పాఠకులకు ఆసక్తికరంగా రష్యా వివరాలను అందించాలని ఒక ప్రణాళికతో ఈ రచనకు పూనుకున్నట్లు తెలుస్తుంది.

ఇది పుస్తక రూపం ధరించక ముందు అనేక వ్యాసాల రూపంలో ప్రముఖ పత్రికల్లో ప్రచురింపబడింది. అట్టడుగు జీవిత వాస్తవాలను దర్శిస్తూ అనుభవించినవారు కాబట్టి ఈయన ఏం చెప్పినా బతుకులోంచి వచ్చిన అనుభూతి పాఠకులకు లభిస్తుంది. భరద్వాజగారి రచనల్లో ప్రత్యేకతంతా ఆయన ఆత్మీయతాంశం ద్యోతకమవుతూ ఉండడమే.

## i) యాత్రకు ప్రేరణ - ఉద్దేశ్యం :

భరద్వాజ గారికి 15 వ యేడు వచ్చేసరికే ఆకలితో, పేదతనంతో బాధలననుభవించారు. కష్టాల కడలిలో ఈదులాడుతున్న రోజులవి. పై చదువులు చదివే ఆర్థికస్తోమత లేదు. ఆ సమయంలో ఒక హిందీ మేష్టారు పరిచయమై ఉచితంగా విద్యాబోధ చేస్తానన్నారు. ఆయన పేరు చిర్రా రామకోటిరెడ్డి గారు. మొదటిసారిగా ఆయన నోటర ష్యా పేరు విన్నారట! ఆ దేశంలో ఆకలి, పేదతనం, నిరుద్యోగం ఉండవని విన్నప్పుడు ప్రాణం లేచివచ్చిందని వ్రాశారు.

1927 లో రష్యా పదవ విప్లవ వార్షికోత్సవాలకు హాజరై వచ్చిన నెహ్రూజీ రష్యా గురించి ఇలా అన్నారు: "మహత్తరమైన ఈ దేశాన్ని ప్రేమించేవారూ, విమర్శించే వారూ కూడా, అతిశయోక్తుల జోలికి పోకుండా వుండలేరు. అలా వుండగలగడం దాదాపుగా అసంభవం."

ఈ విషయం కూడా భరద్వాజ గారికి రష్యాపై ఆసక్తి కలగడానికి ప్రేరణ అయింది.

1958 ప్రాంతాల్లో రష్యా వెళ్ళివచ్చిన పరిచయస్థుడు ఆంజనేయులుగారు ఒక రోజంతా "పళ్ళు పులిసిపోయేలాగా" రష్యాకబుర్లు చెప్పారట వారు చెప్పిన విశేషాలివి : "ఆ దేశంలో ఆకలితో బాధపడేవారు లేరు. ఇళ్ళులేక బాధపడేవారు లేరు. ఉద్యోగం లేకా, ఉద్యోగం దొరక్కా ఆత్మహత్యలు చేసుకునేవారు లేరు."

1942-58 సంవత్సరాల మధ్య రచయిత రష్యాకు సంబంధించిన సమాచారమంతా తరచుగా చదువుతూండేవారు. వారికప్పుడు ఆ పుస్తకాల్లో రెండు విభిన్న ధోరణులు కనిపించాయి: ఒకటి - రష్యా శ్రమజీవుల రాజ్యం, అక్కడ ఆర్థిక అసమానతలు లేవు. కూడు, గూడు, గుడ్డ - వీటికి కొదవలేదు. రెండోది: రష్యాలో స్వేచ్ఛ లేదు. రైతులంతా సమిష్టి వ్యవసాయక్షేత్రాల్లో బానిసలు. అస్వతంత్రులు. చాలమంది చాలీచాలని తిండితో బాధపడుతుంటారు.

పై రెండు ధోరణుల్లో మొదటి దానికన్నా రెండో ధోరణికే వ్యాప్తి ఎక్కువ. వైవిధ్యాలతో కూడుకున్న ఈ ధోరణులే భరద్వాజగారికి రష్యాపట్ల ఉన్న ఆసక్తిని పెంపొందించాయి. ఎన్నో ఏళ్ళనుండి రష్యాను పర్యటించాలన్న కోరిక అంతరాంతరాల్లో ఉన్నప్పటికీ ఆ మహదవకాశం 57వ యేట 1984లో కలిగింది. ఐతే ఈ ప్రయాణం అతి ప్రయత్నం మీద సాధించిందీ కాదు, అనుకోని విధంగా తటస్థపడిందీ కాదు. ఎందరో భారతీయ మిత్రుల కృషి, సహకారం వల్ల రష్యా పర్యటన సాధ్యమైందని రచయిత ఒకచోట చెప్పుకున్నారు

## ii) యాత్రా రచనకు ప్రేరణ :

రష్యాను గురించిన అబద్ధపు ప్రచారాలను విని విసుగెత్తి భరద్వాజగారు రష్యాకు వెళ్ళి అక్కడి నిజానిజాలను తెలుసుకొని బైటి ప్రపంచానికి రష్యామీద ఉన్న అపోహలను తొలగించడానికి ప్రయత్నించారు. సత్యం కంటే అసత్యమే ఎక్కువ ప్రియంగా ఉంటుంది. రష్యాను గురించిన అసత్యాలు అందుకే బహుళ ప్రచారంలోకి వచ్చాయి. నిజాలు మరుగున పడ్డాయి. ఈ అసత్యాలు రణగొణ ధ్వనుల్లోంచి సత్యవాక్కును వెలికితీయడానికి రచయితగా భరద్వాజగారు పూనుకున్నారు.

## iii) రష్యా ప్రయాణం :

7-8-1984 నాడు భరద్వాజగారు పాలం విమానాశ్రయానికి చేరుకున్నారు. గంటన్నరలో అక్కడి చెకింగ్ కార్యక్రమాలన్నీ పూర్తయ్యాయి. ఉదయం 11 15 లకు విమానం ఢిల్లీనుండి బయలుదేరి దాదాపు 6 గంటల తర్వాత మాస్కో చేరింది.

రష్యాలోని వివిధ రిపబ్లిక్కులకు సంబంధించిన చిన్న చిన్న పుస్తకాలూ, కరపత్రాలూ చదివిన తర్వాత తాను ఏయే ప్రాంతాలు చూడదల్చుకున్నదీ వివరించారు భరద్వాజగారు. ఆయా నగరాల వివరాలను తెలియజేసే సాహిత్యం తగినంత ముందుగా అందజేయడంవల్ల చూడదలచుకున్న ప్రాంతాలను స్థూలంగా నిర్ణయించుకో/ లిగారు ఆ ప్రదేశాలు వారి మాటల్లోనే - "రెండు సంవత్సరాలు ఫాసిస్టు మూకల చేతుల్లో ఉన్న **కీవ్ నగరం.** తైలప్రవాహాలమీద తేలియాడుతున్న 'జ్వలితధాత్రి' **బాకు నగరం,** ఇస్లాం సంస్కృతీ సుసంపన్నమైన తాష్కెంట్ సైబీరియా మంచుముత్యం **నొవొసిబిర్స్క్ నగరం.** 900 రోజుల పాటు నాజీ సైనికుల దిగ్బంధంలో ఉండికూడా లొంగిపోని **లెనిన్‌గ్రాడ్ నగరం."**

ఇవిగాక అనుకోకుండా వెళ్ళిన ప్రదేశాలు, స్థలాలు అనేకమున్నాయి. ఐతే చాలామంది అపోహపడుతున్నట్లుగా ముందు అనుమతిలేని ఈ ప్రాంతాలను పర్యటించడంలో ఈయనకు ఎలాంటి 'విధినిషేధాలు' ఎదురుకాలేదని భరద్వాజ గారు వ్రాసుకున్నారు.

ఈ పర్యటన సందర్భంగా ఎంతో సమాచారాన్ని సేకరించగలిగినా, ఆ వివరాలన్నిటినీ పుస్తకంలో పొందుపరచలేకపోయానని విచారించారు.

## iv) మాస్కోలో...

'వాలెంటినా' అన్న అమ్మాయి భరద్వాజ గారికి అనువాదకురాలిగా నియమించబడింది. లెనిన్ ముసోలియం చూడబోయే ముందు ఈయనకు లెనిన్‌గురించి కొంత అవగాహన ఏర్పరచాలన్న దృష్టితో ఒకనాటి సంఘటన చెప్పింది. అక్టోబరు విప్లవం తర్వాత ఉత్పత్తులు బాగా పడిపోయాయి. అన్ని వస్తువులకూ రేషన్ పెట్టాల్సివచ్చింది. ఒకసారి లెనిన్‌కు మామూలుకన్నా ఎక్కువ చక్కెర వస్తే కోపగించి, మిగిలిన పౌరులందరూ ఎంత వాడుకున్నారో అంతే చక్కెర వాడుకొని అదనపు కోటాను వాపసు ఇచ్చేశాడట!

లెనిన్ మృతదేహ సందర్శనార్థం ఎందరో దేశ విదేశీయులు బారులుతీరి ఉన్నారు. లోపల వెల్లకిలా పరుండి ప్రశాంతంగా నిదురపోతున్నట్టున్నాడట

లెనిన్! ముసోలియంకు ఆనుకొనివున్న క్రెమ్లిన్ భవనంలో సమాధి చేయబడడం గొప్ప గౌరవంగా భావిస్తారు. అలాంటి గౌరవం రష్యన్ రచయితలలో ఒక్క మక్సిమ్ గోర్కీకి మాత్రమే లభించింది.

## v) కీవ్ నగరంలో...

కీవ్ నగరానికి 20-25 కి. మీ. దూరంలో ఉన్న ఆస్పత్రికి వెళ్ళి అందులోని వృద్ధులనూ, రెండవ ప్రపంచ యుద్ధంలో పాల్గొన్న యోధులనూ కలిసి మాట్లాడారు. ఆ ఆస్పత్రి విశ్రాంతి కేంద్రం కూడా. ఇళ్ళల్లో భార్యాభర్తలు ఎవరి పనుల్లోకి వారు వెళ్ళిపోగా మిగిలేది వృద్ధులే. వారి బాగోగులను చూడడానికి ఈ విశ్రాంతి కేంద్రాల ఏర్పాటు జరిగింది. ఇక్కడి సదుపాయాలకు ప్రతిగా ఏమీ చెల్లించాల్సిన అవసరం లేదు.

కీవ్ నగరంలో గోర్కీ మెషిన్‌టూల్ ఫ్యాక్టరీకి వెళ్ళారు. ఈ ఫ్యాక్టరీ మహారచయిత మక్సిం గోర్కీ స్మృతి చిహ్నంగా 1948 లో నెలకొల్పబడింది. ఇక్కడ పని చేస్తున్న ఏడువేల కార్మికుల్లో 2,500 మంది మహిళలే ఉన్నారట! మహిళా కార్మికుల కిక్కడ అదనపు సౌకర్యాలను కల్పిస్తున్నారు. ప్రసవానికి 56 రోజుల ముందు నుండి, తర్వాత 270 రోజులదాకా అంటే దాదాపు 11 నెలల దాకా పూర్తి జీతం మీద సెలవు యిస్తారు. అవసరమైతే ఇంకో 9 నెలల దాకా సగం జీతంలో సెలవు ఇస్తారు. మొదటి బిడ్డ పుట్టినప్పుడు వేయి రూబుళ్ళ నగదు చెల్లిస్తారు. ఎక్కువమంది బిడ్డలను కన్న తల్లులకు నగదు బహుమతులే కాకుండా పనిలో కూడ రాయితీలు కల్పిస్తారు.

నొవొసిబిరిస్క్‌లోని 'సైబ్ ఎలక్ట్రో థెరమ్' అనే పేరుగల కర్మాగారాన్ని కూడ దర్శించారు. అట్లాగే తాష్కెంటులోకూడ వ్యవసాయానికి అవసరమైన యంత్రాలను తయారు చేసే కర్మాగారం చూశారు.

ఇక్కడి పని గంటలు, జీతం, ఇళ్ళ కేటాయింపు గురించి ఆ ఫ్యాక్టరీ డిప్యూటీ చైర్మన్ చెప్పిన వివరాలిట్లా ఉన్నాయి:

వారానికి ఐదు రోజులపని. రోజుకు 8 గంటలు పని చేయాలి. మహిళలకూ, మగవారికీ జీతాలలో తేడా ఉండదు. ఒక రకమైన పనికి ఒకే రకమైన జీతం. ఇళ్ళకేటాయింపు ఉద్యోగస్తుల అవసరాన్ని బట్టి ఉంటుందికాని హోదాను బట్టి కాదు.

ఇక్కడి సరాసరి జీతం నెలకు 180 రూబుళ్ళు. కనీస జీతం నెలకు 90 రూబుళ్ళు. గరిష్ఠ జీతం 850 రూబుళ్ళు వరుసగా 12 నెలలు పనిచేస్తే 18 నెలల జీతం చెల్లిస్తారు.

## vi) రచయితలకు ప్రోత్సాహం :

ప్రగతి ప్రచురణాలయంలో రచయితలను కలిసి ముచ్చటించిన తర్వాత రష్యాలో సారస్వతోపాసకులకు ఎట్లాంటి ఆదరణ లభిస్తున్నదో భరద్వాజగారికి తెలిసింది. ఆ వివరాలివి: కొత్తగా ఒక నవలనో, నాటకాన్నో, విమర్శనా గ్రంథాన్నో వ్రాయాలనుకున్న రచయిత ఆ రచన కోసం దేశంలో ఎక్కడికైనా వెళ్ళవచ్చు. ఆరు నెలల పాటు ఆయన ఖర్చు లన్నింటినీ రచయితల సంఘమే భరిస్తుంది. ఆయన తన రచనను పుస్తకంగా వేస్తే దానికి కూడ అదనంగా డబ్బు చెల్లిస్తుంది. ఆ పుస్తకాన్ని రేడియో కాని టెలివిజన్ కాని ఉపయోగించుకున్నా, సినిమాగా తీసినా ప్రతి సందర్భంలోనూ ప్రతిఫలం ముడుతూనే ఉంటుంది. దాదాపు రచయిత(త్రి)లందరికీ ఈ సదుపాయం ఉంటుంది. ఐదారు పుస్తకాలు వ్రాసిన రచయిత ఇంకో పని చేయవలసిన అవసరం లేదట! ఆ పుస్తకాల మీద వచ్చే ఆదాయమే అతనికి లాభిస్తుంది. అది గాక ఆయన రిటైరయ్యాక పింఛను కూడ లభిస్తుంది.

ప్రసిద్ధ రష్యన్ రచయితలు పుష్కిన్, గోర్కీ, టాల్‌స్టాయ్, డాస్టోవస్కీ, చెఖోవ్‌ల పేర్లమీద మ్యూజియంలనూ, నగరాలనూ, ఫ్యాక్టరీలను నెలకొల్పి, వారి పట్ల తమకున్న గౌరవాన్ని రష్యన్ ప్రజలు చాటుకుంటారు. మ్యూజియంలలో వారు నివసించిన గృహాలను, పరికరాలను, ఇతర వస్తువులనూ సేకరించి ఉంచుతారు.

నొవొసిబిర్‌స్క్‌లోని విశ్వవిద్యాలయం దర్శించి అక్కడి విద్యావిధానాన్ని గురించి తెలుసుకున్నారు.

## vii) వివాహ వ్యవస్థ :

రష్యాలోని వివాహ వ్యవస్థ గురించి వాలెంటీనాను అడుగగా ఆమె ఇలా చెప్పిందట : విప్లవానికి పూర్వం ఎట్లా ఉన్నా ఇప్పుడు మాత్రం పెద్దల జోక్యం

లేకుండా, అడ్డుతగలడం లాంటివి లేకుండా వివాహం చేసుకునేవారి ఇష్టప్రకారమే జరుగుతున్నది. అబ్బాయి అమ్మాయి, ఒకరినొకరు అర్థం చేసుకోవడానికి కొంత కాలం స్నేహంగా ఉంటారు. తర్వాత అభిరుచులు నచ్చితే వివాహం చేసుకుంటారు.

ఐతే ఈమె చెప్పినదంతా నిజం కూడా కాదనీ, విడాకుల సంఖ్య 40 శాతం దాకా ఉందనీ, తెలిసీ తెలియని వయసులో జరిగే వివాహాలే ఎక్కువగా విడాకులకు దారితీస్తున్నాయనీ భరద్వాజ గారు తెలుసుకున్నారు.

నోవాసిబిర్‌స్క్ నుండి ఉదయం 9-15 గంటలకు బయలుదేరిన విమానం 3-45 గంటల ప్రయాణం తర్వాత ఒంటిగంటకు మాస్కో చేరింది. కానీ మాస్కో కాలమానం ప్రకారం అప్పుడు ఉదయం 9 గంటలే అయిందట! అంటే ప్రయాణం చేసిన 3-45 గంటల తర్వాత మళ్ళీ అదే టైముకు చేరుకోవడం ఎంత విచిత్రం 19

మాస్కోలో 9-8-84 నాటి రాత్రి 9-50 గంటలకు రష్యన్ సర్కస్ చూసిన తర్వాత రోడ్డుమీద కొచ్చి చూస్తే పేపరు చదవడాని కింకా సరిపడే వెలుతురున్నదట!

1930లో విశ్వకవి రవీంద్రనాథ టాగూరు రష్యా దేశాన్ని సందర్శించిన విషయం ఈ గ్రంథం చివరలో రచయిత పేర్కొన్నారు. తరతమ భేదాలు చూపకుండా రష్యా ప్రభుత్వం ప్రజలందరికీ సమానావకాశాలు కల్పించినందుకు ముగ్ధుడై ఆయన అన్న మాటలివి: "సోవియట్ యూనియన్ను నేను చూడక పోయినట్లయితే, నా జీవిత యాత్ర అసంపూర్ణంగానే ఉండేది." ఈ గొప్ప దేశాన్ని గురించి తనకున్న అభిప్రాయాన్నే భరద్వాజగారు మహాకవి మాటలలో చెప్పారనిపిస్తుంది

---

19. చక్కపల్లి పిచ్చయ్యగారు కూడ తాష్కెంటు నుండి 3000 కి.మీ. దూరంలో ఉన్న మాస్కోకు ఉదయం 9-30 గంటలకు బయలుదేరి 4 గంటల ప్రయాణం తర్వాత మళ్ళీ అదే టైముకు చేరుకున్నానని వ్రాశారు. పేజి. 5.

భరద్వాజ గారి "ఇనుపతెర వెనుక..." అనే గ్రంథం ఇంటర్వ్యూల రూపంలో, రచయిత అనుభవాల రూపంలో రష్యాలోని యథార్థ విషయాలను వెల్లడిచేసే ఉద్దేశ్యంతో గత చరిత్రను జోడించి వ్రాయబడింది. ఇది ఆ దేశాన్ని గురించిన పరిచయాత్మక రచన అనవచ్చు. కాబట్టి దీన్ని యాత్రా చరిత్ర అనడం కంటె ఒకరకంగా 'యాత్రానుభవాల వర్గీకృత ప్రదర్శన' అని చెప్పవచ్చు.

## 7. ప్రభావతిగారి 'రష్యాలో స్నేహ యాత్ర' *

డా॥ వాసాప్రభావతిగారు 1987 నవంబర్‌లో 15 రోజులపాటు రష్యా పర్యటన చేసి యాత్రానంతరం తమ పర్యటనానుభవాలను ఒక గ్రంథంగా ప్రకటించారు. దానిపేరు 'రష్యాలో స్నేహ యాత్ర.' 111 పుటలున్న ఈ పుస్తకం 1988లో అచ్చయింది.

ఈమె పండిత వంశంలో జన్మించారు. "ఆంధ్ర సాహిత్యంలో హరిశ్చంద్రోపాఖ్యానము"పై డాక్టరేట్ పట్టా పుచ్చుకున్నారు. ప్రస్తుతం ఉపన్యాసకురాలిగా పని చేస్తున్నారు.

### i) యాత్రకు ప్రేరణ : ఉద్దేశ్యం :

1917 విప్లవానంతరం రష్యా స్వాతంత్ర్యాన్ని పొందింది. తర్వాత రెండు ప్రపంచ యుద్ధాల్లో బాగా నష్టపోయింది. ఐనా త్వరలోనే అన్ని రంగాల్లో అభివృద్ధి చెంది ప్రపంచ దేశాల్లోనే అగ్రగామిగా, ఆదర్శవంతమైన సోషలిస్టు దేశంగా రూపుదిద్దుకుంది. రచయిత్రికి ఈ దేశాన్ని దర్శించాలన్న ప్రగాఢమైన వాంఛ ఎంతో కాలంనుండీ ఉందట! ఐతే కిన్నెర ఆర్ట్ థియేటర్స్‌వారి సాంస్కృతిక బృందంతోపాటు ఇస్కస్ తరఫున ఈ యాత్ర రచయిత్రికి సాధ్యపడింది.

ఢిల్లీ విజ్ఞాన యువ కేంద్రం నుండి 30-10-87 న ప్రారంభమైన యాత్ర 15 రోజుల పర్యటన తర్వాత మళ్ళీ 13-11-87 న ఢిల్లీకి చేరుకోవడంతో ముగిసింది.

---

* డా॥ వాసా ప్రభావతిగారు.

## ii) ప్రయాణం :

ఇండియా ప్రతినిధుల కోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన ఏర్ బస్ ఎస్.యు.ఎస్. 86. దీన్లో 264 సీట్లున్నాయి. మధ్యాహ్నం రెండు గంటలకు బయలుదేరింది. కొంతసేపటికి 26 వేల అడుగుల ఎత్తులో 1000 మై. వేగంతో (ఇంకా మైళ్ళేమిటి?) పోతోందని ఎనౌన్సుమెంటు ద్వారా తెలిసింది. ఎడారి మీదుగా విమానం పోతున్నది. **వయసు వస్తున్న ఆడపిల్లలు నేర్చుకుంటున్న ముగ్గుల్లా వంకర టింకరగా ఇసుక బీటలు వారి కనిపించిందట.** కొద్దిసేపు చూసేసరికే వికారం మొదలై బెల్టులు సర్దుకున్నారు. 'విమానంలో అంతవరకు హడావిడిగా తిరుగుతున్న రష్యన్ ఎయిర్ హోస్టెస్‌లు అందించిన కూల్ డ్రింక్‌తో అలసటంతా తీరిపోయింది' అని వ్రాశారు.

విమానం కరాచీలో ఆగింది. తర్వాత బయలుదేరి రాత్రి 7-15 గంటలకు ఉజ్‌బెకిస్తాన్‌కు రాజధానియైన తాష్కెంటుకు చేరుకుంది. ఇది పగలు 8 గంటలకే చేరుకోవాల్సిందట. ఐతే తాష్కెంటులో వీరు దిగేసరికి వీళ్ళ వాచీలలో 9-45 గంటలు అయింది. మాస్కో కాలమానం ప్రకారం తమ వాచీలను సరిచేసుకున్నారు.

## iii) తాష్కెండులో :

ఎత్తైన కొండమీద ఉజ్‌బెకిస్తాన్ హోటల్లో బస చేశారు. ఇక్కడి అతి ఖరీదైన హోటళ్ళలో ఇది ఒకటి. ఇందులో 16 అంతస్తులున్నాయి అంతస్తుకు 100 గదులున్నాయట![20] (కౌంటర్లో అంతా ఆడవాళ్ళే ఉన్నారు). ఈమెకు కేటాయించిన రూము 14వ అంతస్తులో 1450వ నెంబరు గల సింగిల్ రూము.[21]

డైనింగ్‌హాలు రాజాంతఃపుర వైభవాన్ని గుర్తుకు తెచ్చిందట! కమ్యూనిస్టు దేశవాసులు చాలా నిరాడంబరంగా ఉంటారనుకున్న ప్రభావతి గారు ఇక్కడి

---

20. రచయిత్రి 'తాష్కెంటు'ను ప్రతిసారి 'తాష్కెండు' అని వ్రాస్తున్నారు.
21. చుక్కపల్లి పిచ్చయ్యగారు మొత్తమ్మీద 550 గదులున్నాయని వ్రాశారు. పేజీ 3. పోశెట్టి గారు కూడ ఇందులోనే 18 అంతస్తులన్నారు.

ఖరీదైన సామాను చూసి ఆశ్చర్యపోయారు. శాకాహార, మాంసాహార భోజన బేబుళ్ళు విడివిడిగా ఉన్నాయి. ఇతరుల ఆచారాలపై సోవియట్ల కున్న శ్రద్ధకు నిజంగానే వారి యెడల మనసుతో గౌరవభావం ఏర్పరచుకుంది.

డైనింగ్ టేబుల్ మీద గాజు ప్లేట్లలో బ్రెడ్, బన్, బటర్, జామ్, జున్ను కాకుండా టమాటా, కారెట్, క్యాబేజి మొదలగు పచ్చికూరలు, సాల్టు, జింజర్ బాటిల్స్, ఓ పక్కగా మినరల్ వాటర్, మరేదో సీసా ఉంది. అది 'కోకోకోలా'గా తెలుసుకొన్న తర్వాత రచయిత్రికి అనుమానం తీరిందట.

చాలామంది రైస్ అడుగగా అప్పటికప్పుడే వండించి వడ్డించారు. రష్యన్లు కాఫీ, టీలలో పాలు లేకుండానే తాగుతారు. ఐతే వీళ్ళు పాలు కావాలని అడుగగానే అందరికీ ఇచ్చారట. ఐస్ క్రీములు రుచిగా ఉన్నాయి. ఈ అనుభవంతో రెండోసారి భోజనాల టేబుల్స్ పై పాలు, మంచినీళ్ళు కూడ సర్ది ఉంచారు.

ఉజ్ బెక్ అంటే **'అయామ్ మై ఓన్ మాస్టర్'** అని అర్థమట. ఇక్కడ ఎక్కువ ఎండ కాయటం వల్ల దీనికి 'సన్నీ రిపబ్లిక్' అనే పేరుంది. ఇక్కడి జనాభా 20 లక్షలు (2 మిలియనులు).

రష్యాలో ప్రాచీన కాలం నుండి కూడ స్త్రీలు రెండు జడలు వేసుకున్నట్లుగా అక్కడక్కడ చిత్రాల ద్వారా కనిపించింది. ప్రత్యక్షంగా కూడ రెండు జడలు వేసుకుని రిబ్బన్లు కట్టుకున్న అమ్మాయిలు కనిపించారని ఈమె వ్రాశారు. నవంబర్ 7 రివల్యూషనరీ డే సందర్భంగా పెరేడ్ గ్రౌండ్‌లో ఈ దృశ్యం కనిపించిందట. వాళ్ళు బబుల్ గమ్స్ అడిగారట. ఐతే వీళ్ళ దగ్గరవి లేకపోవడం వల్ల చాక్లెట్లిచ్చామని తెలిపారు, రచయిత్రి.

రష్యాలోని 15 రిపబ్లిక్‌లలో 5 ఎక్కువగా ముస్లిం తెగలు నివసించేవే. వాటిలో ఉజ్‌బెకిస్తాన్ ఒకటి.[52] వీళ్ళు మాట్లాడే భాషలో ఉర్దూ పదాలు ఎక్కువేనని రచయిత్రి ఒక ఉదాహరణ చూపారు. శక్యార్ (షుగర్). ఇది మనం వాడే 'చక్కెర'కు సమీపంగా ఉంది.

---

52. ఐతే ఇక్కడి "ముస్లింలంతా ఎవ్వరు ఉర్దూ, అరబ్బీ, ఫారసీ లాంటి భాషలు మాట్లాడరు. వీరంతా రష్యన్ భాషతోపాటు తమ ప్రాంతీయ భాషనే మాట్లాడుతారని" పోశెట్టిగారు తమ గ్రంథంలో వ్రాశారు. పేజీ. 12.

రష్యాలో భారతీయ విద్యార్థులకు నెలకు 90 రూబుల్సు స్కాలర్‌షిప్‌గా ఇస్తున్నారు. పాలిటెక్నిక్, మెడికల్ ఇన్‌స్టిట్యూట్‌లలో వీళ్ళు చదువుతున్నారు. ఐతే ఇక్కడి వంటలు వీరికి అలవాటు లేకపోవడం వల్ల బియ్యం వగైరా కొను క్కొని స్వయంపాకంతో కొంత డబ్బు మిగుల్చుకుంటారట! యంత్రాలు కోసుకు రాగా మిగిలిన ప్రతిని వీరినందుకు గాను ప్రభుత్వం వీరికి తగిన పారితోషికం ఇస్తుందని ప్రభావతి గారు చెప్పారు. విదేశీయులకు విద్యావకాశాలు కల్పిస్తారు కాని ఉద్యోగాలివ్వరు.

100 డాలర్స్ చెక్కు మార్చగా 66 రూబుళ్ళపైన కొంత చిల్లర కోపె క్కులు వచ్చాయట.

సినిమా టిక్కెట్టు 1-40 రూబుల్సు మాత్రమే. విశ్వనాథ్‌గారి 'సాగర సంగమం' అక్కడ డబ్బింగ్‌లో విడుదలయింది. పేరు "Photoghaphy of Marriage Album" కథంతా రష్యన్ భాషలోనే ఉంది కాని పాటలు మాత్రం యథాతథంగా తెలుగులోనే ఉంచారన్నారు.

తాష్కెంటులో ఒక వీధికి, స్కూలుకు లాల్ బహదూర్ శాస్త్రిగారి పేరు పెట్టారు. ఆయన స్మృతి చిహ్నంగా విగ్రహ ప్రతిష్ఠాపన చేశారు. ఎందరో విదేశీయులు ఆ విగ్రహం ప్రక్కన నిలబడి అభిమానంతో ఫొటోలు తీయించు కోవటం రచయిత్రి చూశానని వ్రాశారు.

పూల దుకాణాల్లో చేమంతులు, ఎర్రని దానిమ్మ పూగుత్తులు, తెల్ల లిల్లీ పూలు రాసులు పోసి ఉంచారు. పూలమ్మే వారంతా ఆడవాళ్ళేనట.

సూపర్ బజార్‌లో సరుకులకు బేరాలు చేయవలసిన పనిలేదు. ప్రతీ సరుకుకు ధరలు చీటీలలో వేసి ఉంటాయి.

అండర్ గ్రౌండ్‌లోని మెట్రో రైల్వేస్టేషన్ గురించి ఇది వరకటి యాత్రికుల కంటె ఇంకా వివరాలెక్కువగా ఇచ్చారు ప్రభావతి గారు. 5 కోపెక్సు వేస్తే టిక్కెట్టు వస్తుందనీ, ఆ టిక్కెట్టును తిరిగి స్టేషన్ మెట్ల మీద ఉండే కౌంటర్లో వేస్తే గేటు దానంతటదే తెరుచుకుంటుందనీ వీరు వ్రాశారు. తర్వాత కన్ను మూసి తెరిచేలోగా తలుపులు మూసుకోవడం, బండి కదిలి వేగం పుంజుకోవడం జరుగుతుంది.

## vi) లెనిన్‌గ్రాడ్‌లో :

తాష్కెంటు నుండి రెండో పెద్ద నగరమైన లెనిన్ గ్రాడ్‌కు ప్రయాణం. 3800 మైళ్ళు 1-11-87న రాత్రి 1.50 ని॥ లకు ఏర్‌బస్‌లో బయలుదేరి 5.25 గంటలకు చేరుకున్నారు.

ఎటు వెళ్ళినా నిర్మలమైన నీవానది దర్శనమిస్తుందట. సుమారు 42 నదులు, ఆ నదులపై 500 వరకు వంతెనలున్నాయని వ్రాశారు.[23] ప్రభావతి గారు లెనిన్ గ్రాడ్‌ను 'నదుల ఒడిలో వికసించిన పద్మం'గా అభివర్ణించారు.

మతం అక్కడ వ్యక్తిగతం. మత ప్రచారం చెయ్యడానికి వీలులేదు. మతపరమైన పండుగలు అసలు లేవు.

ఒక జానపద సంగీత రూపకం మన బాలచంద్రుని కథను గుర్తుకు తెచ్చిందట. ఐతే నవవధువు యుద్ధానికి పోకూడదని ఏడుస్తూ భర్త పాదాలు పట్టుకోవడం రచయిత్రికి ఆశ్చర్యం కలిగింపజేసింది. రష్యాలాంటి సోషలిస్టు దేశంలో కూడ ఒకప్పుడు ఇటువంటి సాంప్రదాయం ఉండేదన్న విషయం ఆమెకు విస్మయం కలుగచేసింది.

అక్కడ అర్ధరాత్రి ఐనా ఆడపడచులు నిర్భయంగా రౌడీల భయం లేకుండా తిరగడం చూసి ప్రపంచదేశాలన్నీ గర్వించదగిన విషయంగా భావించారు.

మామూలు క్లర్కుకి 90 రూబుల్సు, గైడుకు 130 రూబుల్సు జీతం ఉంటుంది క్లర్కు కంటె రోడ్డు తుడిచేవారికే ఎక్కువ జీతాలిచ్చి ఆ పనికి గౌరవ భావం కలిగిస్తున్నారట. స్త్రీలకు 55 సంవత్సరాలు, పురుషులకు 60 సంవత్సరాలు ఉద్యోగ విరమణ వయస్సు.

---

23. నీవానదే అనేక పాయలుగా ప్రవహిస్తున్నదని పిచ్చయ్య గారు వ్రాస్తూ 101 దీవులను ఈ నది కల్పించిందన్నారు. పోశెట్టి గారు అనేక నదులు, కాలువలు కల్సి 64 ఈ పట్టణం గుండా ప్రవహించడంతో 42 దీవు లేర్పడ్డా యన్నారు. వీరిరువురు వంతెనల సంఖ్య 360 గానే పేర్కొన్నారు. డా॥ ప్రభావతి గారు ఈ వంతెనల సంఖ్యను500 అనీ, నదులు 42 ప్రవహిస్తున్నాయని వ్రాశారు.

బస్సులో ఎక్కడా చెకింగ్ లేదు. ఐనా జనం టిక్కెట్లుకొని పంచ్ చేసు కుని జేబులో పెట్టుకుంటున్నారట. క్రమశిక్షణ తప్పి పట్టుపడితే శిక్షకూడ కఠి నంగానే ఉంటుంది కాని సాధారణంగా అక్కడివాళ్ళు అట్లా చేయరు. మనకూ వారికీ ఎంత తేడా!

లెనిన్ గ్రాడ్‌లో 50 లక్షల (5 మిలియన్లు) జనాభా. లీటరు పెట్రోలుకు 1 రూబులు మాత్రమే. అందువల్ల టాక్సీ చార్జీలు తక్కువే. ఇక్కడ టాక్సీ డ్రైవర్లంతా ఆడవాళ్ళే. ఈ టాక్సీలు ప్రభుత్వానివి. డ్రైవర్లకు జీతాలుంటాయి.

రష్యన్ల వంటకాల్లో కారం మసాలాలుండవు. ఎక్కువ తీపికాని, ఎక్కువ పులుపుకాని వాడరు.

వస్తు ప్రదర్శన శాలలో 11వ శతాబ్దినాటి నుండి వారి నాగరికతా విశే షాలకు సంబంధించిన వస్తువులు 30 లక్షల (3 మిలియన్లు) దాకా ఉన్నాయి. ఐతే అన్నిటిని పరిశీలనగా చూడడానికి సుమారు ఒక నెల రాత్రి, పగలు పట్ట వచ్చునట! (పేజీ 73).

ఒకచోట ఒక చిత్రం రచయిత్రికి చాలా ఆశ్చర్యం కలిగించింది. పెళ్ళి కొడుకు తల్లి, తండ్రి కుర్చీలో కూర్చుని ఉండగా, వారికెదురుగా వధువు, ఆమె పక్కగా ఆమె అన్న నిలబడి పెళ్ళి సంబంధం గురించీ, కట్నకానుకల గురించీ మాట్లాడుకుంటున్న చిత్రమది. ఐతే ఈనాడీ ఆచారం అంతరించిపోయిం దక్కడ.

## v) మాస్కో :

లెనిన్ గ్రాడ్ నుండి మాస్కోకు రైలు ప్రయాణం. రైలు సౌకర్యాలు షరా మామూలే. రాత్రి 11 గంటలకు బయలుదేరిన రైలు ఉదయం 6-30 గంట లకు మాస్కో స్టేషన్లో ఆగింది. 7-30 గంటల ప్రయాణం.[24] రచయిత్రి మాస్కోలోని స్టేషన్ 'లెనిన్‌గ్రాడ్ స్టేషన్' అన్న పేరున్నట్టుగా పేర్కొనలేదు.

'బెల్‌గ్రేడ్'లో బస ఏర్పాటు చేశారు. ఇది మాస్కో నగరంలోని పెద్ద హోటల్ భవనాల్లో ఒకటి. 18 అంతస్తుల భవనం.

---

24. 1982లో రైల్లో ప్రయాణించిన రామారావుగారికి ఈ దూరానికి 8 గంటలు పట్టింది.

## vi) లెనిన్ ముసోలియం :

లెనిన్ పవిత్ర దేహాన్ని దర్శించడానికి క్రెమ్లిన్‌కి బయలుదేరారు. పెద్ద క్యూ కదులుతూన్నా కొండచిలువలా కదులుతున్నట్లే అనిపించలేదు. దారిలో అమరవీరుల అమర జ్యోతి. ముసోలియంలో ప్రవేశించగానే 'నో స్మోకింగ్' అన్న బోర్డులు అడుగడుగునా కనిపించాయి. పోలీసులు బూట్లు చప్పుడు కూడా కారాదని హెచ్చరిక చేస్తున్నారట! తెల్లని శరీరచ్ఛాయతో, కళకళలాడే జీవ కళతో ప్రశాంతంగా నిద్రిస్తున్న లెనిన్ దేహం 'నిజంగా పడుకుని నిద్రిస్తున్న ఆకార విశేషంగా' కనిపించింది డాక్టర్ గారికి.

మధ్యాహ్నం షాపింగ్‌కు వెళ్ళినప్పుడు విపరీతంగా దాహం వేసిందట. షాపుల మధ్యలో వాటర్ కూలర్ ఉంది 5 కోపెక్సు వేసి టాపు తిప్పితే నీరు వస్తుంది. తాగగానే మామూలు నీరుకాదనీ, జింజర్ వాటరనీ తెలిసింది.25

ప్రగతి ప్రచురణాలయంలో పనిచేస్తున్న నిడమర్తి ఉమా రాజేశ్వరరావు గారి ఇంట్లో గోంగూర పచ్చడి, సాంబారుతో తెలుగు భోజనం చేశారు.

రష్యన్ కవితల్లో శృంగారం, హాస్యం, వ్యంగ్యం ఎక్కువ, నవలల్లో క్రైం, సెక్సు ఇంకా ప్రవేశించలేదట!

ఈ దేశంలో అన్నీ ప్రేమ వివాహాలే అని చెబుతూ అక్కడి రిజిష్ట్రరు మ్యారేజీల పద్ధతి గురించి వివరించారు. విడాకుల కేసులు కూడ భరద్వాజ గారి లాగే ఈమెకు ఎక్కువే కనిపించాయి కాని, అలాంటి వారు సాధారణంగా తల్లి దగ్గరే ఉంటున్నారట. ప్రతీ వ్యవస్థలో ఏదో ఒక లోపం ఉంటూనే ఉంది.

## vii) కీవ్ నగరానికి :

రాత్రంతా రైల్లో ప్రయాణించి ఉదయం 10 గంటలకు కీవ్ స్టేషన్ చేరుకున్నారు. చాలా అందమైన ఈ హిల్ స్టేషన్ ఉక్రేనియన్ రాజధాని. 25

25. ఒక కోపెక్కుకే మినరల్ వాటర్ దొరుకుతుందని 1982 లో పర్యటించిన రామారావు గారు. పేజీ. 54.

లక్షల జనాభా. అధునాతన 'రస్' హోటల్లో బస. 1980 లో జరిగిన ఒలింపిక్ గేమ్స్ కొరకు ఈ హోటల్ నిర్మించబడింది.

## viii) అందాలరాసి సోచి :

విమానంలో సోచి నగరానికి వెళ్ళారు. 'నల్లసముద్రం ఒడిలో కూర్చున్న కుందనపు బొమ్మ'లా ఉందట సోచీ నగరం!

రుచికి సోచీ ప్రసిద్ధి. అన్ని నగరాల్లోకంటే ఇక్కడ పాలు, పెరుగు చాల రుచిగా ఉన్నాయనీ, బార్లి గింజలతో చేసిన చక్కెరలేని పాయసం, కమలా పండ్లు పుష్కలంగా ఉన్నాయనీ రచయిత్రి వ్రాశారు.

## ix) స్వదేశానికి :

సోచీకి 1600 కి.మీ. దూరంలో ఉంది తాష్కెండు. విమానం నల్ల సముద్రం దాటి నైఖాన్ పర్వతశ్రేణి, బుకారా ఎడారి మీదుగా ప్రయాణించి తాష్కెండు చేరుకుంది.

ఇక్కడ మళ్ళీ విమానం మారి ఇంటర్నేషనల్ ప్లేన్‌లో ఢిల్లీ చేరుకున్నారు. రెండు గంటల ప్రయాణం.

## 8. శ్రీశ్రీ "అనంతం"లో రష్యా యాత్ర :

ఈ రోజుల్లో రష్యా యాత్ర అంటే పక్క ఊరికి వెళ్ళి వచ్చేంత తేలిక అయింది కాని, 1954 లో సోవియట్ యాత్ర చంద్రమండలానికి వెళ్ళడమంత అసంభవంగా తోచినట్లు 'అనంతం'లో శ్రీశ్రీ వ్రాసుకున్నారు. అప్పటి రాజకీయ నాయకుల కమ్యూనిస్టు వ్యతిరేకతే ఇందుకు కారణమని ఆయన ఆరోపించారు. అందుకే సిరిసిరి మువ్వ శతకంలో:-

మాస్కోకు వెళ్ళగలిగే
అస్కారం లేకపోయినప్పటికైనన్
విస్కీ సేవిస్తూనే
శ్రీ స్కీనై బ్రతుకగలను సిరిసిరి మువ్వా!

అని నిరాశపడవలసివచ్చింది.

## i) *రష్యాకు తొలి పర్యటన :

ఐతే 1954 లో స్టాక్ హోంలో జరుగబోయే ప్రపంచ శాంతి సమితి సమావేశానికి ఆహ్వానం రాగా భారతదేశ ప్రతినిధి బృందం సభ్యుడుగా వెళ్లారు. అక్కడ ఉండగానే సోవియట్ శాంతి సంఘం వీరిని రష్యాకు ఆహ్వానించింది. వారంరోజుల పర్యటన అని తెలిసిన తర్వాత, తాను కలలుగన్న మరో ప్రపంచం చూడబోతున్నందుకు, 'మాస్కోకు వెళ్ళగలిగే అస్కారం' లభించినందుకు శ్రీశ్రీ సంతోషించారు.

మాస్కోలో మొట్టమొదట చేసిన పని క్రెమ్లిన్ భవనంలో లెనిన్ సమాధి సందర్శనం. సమాధిని చూడగానే శ్రీశ్రీకి 'చిన్నప్పుడు తిరుపతిలో వేంకటేశ్వర స్వామిని చూసినప్పటి మహోత్సాహం' కలిగిందన్నారు.[26]

అణుయుద్ధ ప్రమాదపు భయం వెన్నంటి ఉన్నప్పుడు అంతస్తుల మీద అంతస్తులు కడుతూ పోవడం తెలివిహీనతే ఐనా రష్యన్లు ఆ అమెరికన్లకన్న తామేమీ తక్కువ కాదన్న దృష్టితోనే మాస్కో విశ్వవిద్యాలయాన్ని 25 అంతస్తులుగా రూపొందించారట. యాత్రాకాలం నాటికి ఇదొక్కటే మాస్కోలో ఉన్న స్కైస్క్రేపర్ కట్టడమని శ్రీశ్రీ వ్రాశారు. ఈ విషయమే స్వదేశానికి తిరిగి వచ్చిన తర్వాత విశాలాంధ్ర ఆఫీసులో చెప్పినప్పుడు 'ఒకానొక కమ్యూనిస్టు వ్యతిరేకి' ఒక ఆంధ్ర పత్రికలో 'శ్రీశ్రీ గోలకొండ మిరియాలు తాటికాయలంతేసి చేసి అంటున్నాడని' వ్రాశాడట! నిజాన్ని నమ్మేంత గుండెధైర్యం అందరికీ ఉండదు మరి.

---

* 13-11-1954 న బొంబాయిలోని శాంతాక్రజ్ విమానాశ్రయం నుండి బయలుదేరి 21-12-1954 న మళ్ళీ అక్కడే దిగాడు. ఇది ఐదువారాల పర్యటన. ఐతే దీనిలో లండన్, స్టాక్‌హోం, రష్యా యాత్రలు మిళితమయ్యాయి.

26. శ్రీశ్రీ 'అనంతం' - పేజి 195.

## ii) రెండోసారి రష్యా యాత్ర :

1966 వ సంవత్సరం సోవియట్ లాండ్ నెహ్రూ బహుమతి లభించింది శ్రీశ్రీకి. ఈ అవార్డు ఆయన వ్రాసిన 'ఖడ్గసృష్టి'కి వచ్చింది.[27] కాబట్టి ఈ బహుమతిని స్వీకరించడానికి పాలం విమానాశ్రయం నుండి 10-5-1967 న బయలుదేరి, 25-5-67 న అదే విమానాశ్రయంలో దిగారు. ఇది 16 రోజుల పర్యటన.

ఇదే సంవత్సరం రష్యా అంతటా రష్యా విప్లవపు 50 వ వార్షికోత్సవం జరుగుతూంది. ఆనవాయితీ ప్రకారం మొదట లెనిన్ సమాధిని సందర్శించారు. తర్వాత టాల్‌స్టాయి సమాధి. అన్ని సోవియట్ నిర్మాణాలలాగే టాల్‌స్టాయి సమాధి కూడ ఎంతో గొప్పగా ఉంటుందనుకున్న శ్రీశ్రీ కి దాన్ని చూడగానే అమితాశ్చర్యం కలిగిందట. కేవలం ఆరడుగుల నేలలో నిరాడంబరంగా ఉన్న ఆయన సమాధి శ్రీశ్రీ కి 'ఒక సాహితీ పరుని కోసం అతని దేశ ప్రజలు నిర్మించిన తాజ్‌మహల్' గా అనిపించింది.[28]

రెండోసారి మాస్కో పర్యటనలో పది అంతస్తుల లోపు భవనాలే కనబడలేదన్నారు. అణుయుద్ధ ప్రమాదం తొలగిపోయిందన్న నిశ్చింతే దీనికి కారణంగా శ్రీ శ్రీ ఊహించారు. 1954 లో తాష్కెంటు పాత ఢిల్లీ మాదిరిగా ఉంటే, 1967 లో ఆ నగర స్వరూపమే మారిపోయిందని వ్రాశారు. 1966 లో తాష్కెంటులో భూకంపం వచ్చి పాత మట్టి కట్టడాలను నేలమట్టం చేయడం వల్ల ఒక్కో రిపబ్లిక్ ఒక్కో పేటను పంచుకుని తాష్కెంట్ నగరాన్ని యుద్ధ ప్రాతిపదిక మీద పునర్నిర్మించాయట.

తిరుగు ప్రయాణం తాష్కెంట్ నుండి సరాసరి ఢిల్లీకి కాకుండా కాబూల్ మీదుగా జరిగింది.

---

27. ఇదే సంవత్సరం శుద్ధానంద భారతి అనే స్వామీజీ తమిళంలో వ్రాసిన 'సోవియట్ గీతాంజలి' కావ్యానికీ, హిందీలో కిషన్‌చందర్‌కూ సోవియట్ లాండ్ బహుమతి వచ్చింది. శ్రీశ్రీ వీరి ప్రస్తావన 'అనంతం' - పేజీ. 210-212 లలో చేశారు.
28. శ్రీశ్రీ 'అనంతం' - పేజీ. 213.

## 9. పురాణం వారి 'నా రష్యా యాత్ర':*

పురాణం సుబ్రహ్మణ్య శర్మగారు 1987 జూన్ నెలలో నోవస్తి ప్రెస్ ఏజెన్సీ వారి ఆహ్వానాన్ని పురస్కరించుకొని సోవియట్ రష్యాను సందర్శించారు. తర్వాత వెంటనే తన అనుభవాలను 'నా రష్యా యాత్ర' అన్న శీర్షికతో ప్రచురించారు ఆంధ్రజ్యోతి సచిత్ర వార పత్రికలో 17-7-1987 నుండి 9-10-1987 దాకా ఈ యాత్రానుభవాలు వరుసగా ప్రకటితమయ్యాయి.

పాత టిబిలిసీ నగరంలోని ఇళ్ళన్నీ చెక్క బాల్కనీలతో నిర్మితమయ్యాయట. అక్కడి ఇళ్ళమీది పెంకులు మన దేశంలోని ఇళ్ళ పెంకులు మాదిరే శర్మగారికి కనిపించాయి. మార్క్స్ గ్రంథాలయంలో డబ్బు తీసుకోకుండా ఉచితంగానే పుస్తకాలిస్తారట కాని, పోగొడితే మాత్రం పుస్తకం ధరకు పదిరెట్లు వసూలు చేస్తారన్నారు. ఇది మనదేశంలో అమలుచేస్తే గ్రంథాలయ సేవలు మరింత మెరుగయ్యేవి. అపురూప గ్రంథాల అపహరణ ఆగిపోయేది.

శర్మగారు రష్యా, అమెరికా దేశాల్లో ప్రయాణిస్తే కలిగే సాధకబాధకాలను మూడు ముక్కల్లో తేల్చి చెప్పారు: "రష్యాలో ఎక్కడకు వెళ్ళినా బయట మనుషులు కనిపిస్తారు. ప్రాణం లేచివస్తుంది. అమెరికాలో కారులు, కారులు, కారులు. అక్కడ ఇంగ్లీషు వచ్చినా పలకరిద్దామంటే మనుషులు దొరకరు. ఇక్కడ మనుషులు దొరుకుతారు-పలకరిద్దామంటే భాష రాదు."[29]

లెనిన్‌గ్రాడ్‌లో నీవానది మీద 42 వంతెనలున్నట్లు డా॥ సి. నారాయణ రెడ్డిగారు తెల్పారు. కాని శర్మగారి గైడ్ లెనిన్‌గ్రాడ్ నిండా ఎన్ని నదులు, వంతెనలు ఉన్నాయో చెప్పడం కష్టమన్నాడట! ఐతే ఈ వంతెనలు తెరుచుకునే దృశ్యం ఒక 'కేళీ విలాసం' అంటూ, అర్ధరాత్రి ఒంటిగంట దాటాక అవి ఒక పక్కకి తెరుచుకుని ఇటూ అటూ తిరిగే ఓడలకు త్రోవనిస్తాయన్నారు. అప్పటి

---

* పురాణం సుబ్రహ్మణ్య శర్మగారు యాత్రాకాలం నాటికి ఆంధ్రజ్యోతి సచిత్ర వార పత్రిక సంపాదకులు. ప్రస్తుతం ఉదయం వీక్లీ సంపాదకులుగా ఉన్నారు.

29. 'నా రష్యా యాత్ర' - ఆంధ్రజ్యోతి వార పత్రిక. 4-9-87

కోలాహలం చూడడానికి లెనిన్‌గ్రాడ్ సౌందర్యాన్ని 'శ్వేతరాత్రుల'లోనే చవి చూడాలట! లెనిన్‌గ్రాడ్ ఉత్తర ధ్రువ ప్రాంతానికి దగ్గరగా ఉండడంవల్ల సాయంత్రం సూర్యకిరణాలు పరావర్తనం చెంది శ్వేతరాత్రులు ఏర్పడతాయి. దాదాపు తెల్లవారుజాము మూడు, మూడున్నర మధ్య సూర్యాస్తమయం, సూర్యోదయం జరిగిపోతాయనీ, రోజంతా పట్టపగలే అన్నట్టుగా ఉంటుందనీ శర్మగారు వ్రాశాడు. రాత్రి పేవ్‌మెంట్ల మీద నడుస్తూ పుస్తకం చదువవచ్చునన్నాడు. జనం రోడ్డుమీద ఆ తెల్లని కాంతిలో గుంపులు గుంపులుగా సంచరించడం రచయిత గమనించారు.

ఢిల్లీకి వచ్చినవారు రాజ్‌ఘాట్ సందర్శించి శ్రద్ధాంజలి ఘటించినట్లు, లెనిన్‌గ్రాడ్‌కు వెళ్ళిన ప్రతివారు మృతవీరుల సమాధులను అట్లాగే దర్శిస్తారు. అక్కడ ఉంచబడిన పుష్పగుచ్ఛాలను చూడగానే శర్మగారికి, "ఆ సమాధులున్న చోట పచ్చగా గడ్డి మొలచి వాటిపై సూర్యకిరణాలు ప్రతిఫలించగా గడ్డి చివరల్లోని ప్రతి నీటి బిందువులో ఇంద్ర ధనుస్సులు వెలిసి, అవి తోరణాలై మృతవీరుల మెడలో హారాలా అని అనిపింపచేశాయి."30

శర్మగారు లెనిన్ గ్రాడ్‌లో హెర్మిటాన్ (హెర్మిటేజ్ అనాలట ఇంగ్లీషులో) అనే ప్రపంచంలోనే పెద్దదైన మ్యూజియంను సందర్శించారు. ఇందులో ఒక్కొక్క బొమ్మ దగ్గర ఒక నిమిషం నిలబడుతూ పోతే అంతా చూడడానికి 650 రోజులు పడుతుందని అక్కడివారు చెప్పారట కాని ఎంతవరకు విశ్వసించవచ్చో తెలియదన్నారు. ఇదివరకు యాత్రచేసిన వారి విషయంలో విభిన్నాభిప్రాయాలను వెలిబుచ్చారు కూడా.

మాస్కోలోని హోటల్ రష్యాలో 6,500 గదులు వున్నాయంటూ, ఇది ఎంత పెద్దదంటే "మాస్కోలో ఎక్కడకు వెళ్ళినా తప్పిపోయే అవకాశం లేదు కాని, ఈ హోటళ్ళో మాత్రం ఎవరైనా తప్పిపోవడం ఖాయం" అన్నారు.31

తర్వాత లెనిన్ మసోలియంలో ఆయన భౌతిక కాయాన్ని సందర్శించారు. దీన్తో రష్యా యాత్ర పరిసమాప్తమయింది.

---

30. 'నా రష్యాయాత్ర'— ఆంధ్రజ్యోతి వారపత్రిక. 25-9-1987 సంచిక.
31. 'నా రష్యా యాత్ర'— ఆంధ్రజ్యోతి వారపత్రిక 25-9-1987 సంఛిక.

# అమెరికా యాత్రలు

యాత్రానుభవాల్ని స్వీయచరిత్ర, స్మృతులు మొదలైన ప్రక్రియా రూపాల్లో వెలువరించడం కనిపిస్తుంది. లేఖా రూపంలో కూడ యాత్రలను గూర్చి రోజువారీ తాజా అనుభవాల్ని వెంటవెంట వ్రాయడం కొన్ని యాత్రా చరిత్రల్లో కనిపిస్తుంది. ఇట్లాంటి యాత్రల్లో ఆత్మీయులకు వ్రాసే లేఖలవల్ల యాత్రల్లోని ఒంటరితనాన్ని జయించడం, చేయబోయే యాత్రకు ఉత్సాహాన్ని సంతరించుకోవడం కనిపిస్తుంది. అట్లాంటి యాత్రల్లో 'భూప్రదక్షకుడు భార్యకు వ్రాసిన లేఖలు' మంచి ఉదాహరణగా నిలుస్తుంది.

## 1. 'భూ ప్రదక్షకుడు భార్యకు వ్రాసిన లేఖలు' అనే అమెరికా యాత్ర

నరసింహ మూర్తిగారు* 1929 లో ఆమెరికాలో విద్యాభ్యాసం చేయాలనే మిషతో భూప్రదక్షిణం చేయడానికి పూనుకున్నారు. అప్పటికింకా విదేశాలకు విమాన మార్గం పడలేదు. ఓడలలోనే ప్రయాణం చేయాల్సి ఉంది. మూర్తిగారు తన ప్రయాణానుభవాలను, ఆయా దేశాలలోని విశేషాలను భారతదేశంలో ఉన్న తన భార్యకు లేఖల రూపంలో వ్రాస్తూ వచ్చారు. అవే తర్వాత గ్రంథ రూపం ధరించాయి. ఆ గ్రంథం పేరు "భూ ప్రదక్షకుడు భార్యకు వ్రాసిన లేఖలు." 1935 లో మొదటి ముద్రణ జరిగింది.

మూర్తిగారు ప్రముఖ వర్తక వంశంలో జన్మించారు. స్వస్థలం పాలకొల్లు. భీమవరానికిది 20 కి.మీ. దూరంలో ఉంది. స్వదేశంలో బి. ఏ. పూర్తిచేసుకొని న్యూయార్కులోని సిన్సినాటి విశ్వవిద్యాలయంలో ఎం. ఏ. చదువుకై బయలుదేరారు. విదేశాలకు వెళ్ళేవారికి ప్రయోజనకరంగా ఉంటుందని మిత్రులు ఒత్తిడి చేయడం వల్ల తన యాత్రానుభవాలను పుస్తకంగా ముద్రించవలసి వచ్చిందని వ్రాసుకున్నారు.

---

* అత్యం నరసింహమూర్తి, ఎం.ఏ. (న్యూయార్కు).

నరసింహమూర్తిగారు కేవలం విద్యాభ్యాసం కొరకేకాక మరికొన్ని కారణాలవల్ల కూడ తానీ యాత్రకు నిశ్చయించినట్లు 'పరిచయ వాక్యాల'లో పేర్కొన్నారు. లోకాన్ని రెండు కండ్లతో చూసి విజ్ఞానం సంపాదించుకోవాలనీ, అమెరికాలోని విద్యా సంస్థలలో వ్యాపార విద్య నేర్చుకోవాలనీ, జీడిపప్పు ఎగుమతిని దృష్టిలో ఉంచుకొని అమెరికాలో దాన్ని కొనే వర్తక శిఖామణుల స్నేహాన్ని సంపాదించాలనీ, అమెరికాలోని స్వేచ్ఛా వాయువులను పీల్చాలనీ-ఇలా అనేక ధ్యేయాలతో చేసిన యాత్ర ఈయనది. ఇవే మూర్తిగారి భూప్రదక్షిణానికీ, అమెరికాలో నివసించడానికీ ముఖ్య కారణాలు.

129 పేజీలున్న ఈ గ్రంథంలో అమెరికాను గురించిన యాత్ర వృత్తాంతం, అమెరికాలోని విశేషాలు 55 పుటలలో వర్ణింపబడ్డాయి. మిగతావి ఐరోపాదేశ వర్ణనకు సంబంధించినవి.

14-4-1929 న కలకత్తా రేవులో ప్రారంభమైన యాత్ర మధ్య మధ్య ప్రసిద్ధమైన రేవు పట్టణాల్లో మజిలీలు చేస్తూ 10-7-1929 న న్యూయార్కు ప్రవేశించడంతో ముగిసింది. అంటే ఓడ ప్రయాణం దాదాపు మూడు నెలలు పట్టింది. ఇప్పుడైతే విమానంలో ఒక రోజు చాలు.

## i) ప్రయాణ మార్గం :

కలకత్తా ఓడరేవు-బర్మా -మలయా - చైనా - జపాను-హవాయి - సాన్ ఫ్రాన్సిస్కో - న్యూయార్కు-(తిరుగు ప్రయాణం) అట్లాంటిక్ మహాసముద్రం-ఇంగ్లండు-ఫ్రాన్సు - మధ్యధరా సముద్రం - ఆఫ్రికా - అరేబియా సముద్రం - బొంబాయి.

సాన్ ఫ్రాన్సిస్కోలోని లింకన్స్ పార్కు మొదటి ప్రపంచ మహాయుద్ధంలో వీరమరణం పొందిన అమెరికన్ సిపాయిల స్మృతిచిహ్నంగా నిర్మించబడింది. దీనిలోని మూజియంలో అన్నీ బాగున్నాయట కాని చాలచోట్ల వచ్చి బూతుబొమ్మలుండటం రచయితకు సిగ్గనిపించింది. 'సర్వ మర్మావయవములు కనపరచుచు స్త్రీ పురుషుల కామక్రీడను నిరూపించుచున్నట్టి బొమ్మలను' అమెరికను దొరలు, దొరసానులు మాత్రం చాల జాగ్రత్తగా నిర్లజ్జగా చూసిపోతున్నారని వ్రాశారు.

ఇక్కడ ట్రాములను స్ట్రీట్‌కార్లంటారు. మొదట రైలులో న్యూయార్కుకు వెళ్ళాలనుకున్నారు. అది నిశ్రమాదకరమైన యాత్రేనట కాని రచయిత కట్లా వెళ్ళటం ఇష్టంలేదు. అమెరికాలోని ప్రజా జీవితం ఎట్లున్నదో తెలుసుకోవటానికి, త్రోవలో పల్లెలను, పట్నాలను సావకాశంగా చూస్తూ వెళ్ళడానికి రైలుకంటె మోటారు బస్సులు, 'ప్లెజర్ కార్లే' నయమని భావించారు. థామస్ కుక్ కంపెనీ ద్వారా సామానులు న్యూయార్కుకు చేరేటట్లు ఏర్పాటు చేసుకొని ప్లెజరు కారుమీద చికాగో నగరం దాకా టికెట్టు తీసుకున్నారు. ఆ కాలంలో డాలరుకు మూడు రూపాయలు చొప్పున 40 డాలర్లు ట్రావెల్ సర్వీస్ కంపెనీకి ఈ ప్రయాణానికయ్యే ఖర్చునిమిత్తం చెల్లించారు.

వందల మైళ్ళ పర్యంతం రోడ్డు 'దిట్టంగా', కుదుపులు లేకుండా ఉండటట! ఏదైనా చర్చిగాని, స్కూలుగాని ఇంకొంత దూరంలో ఉందనగా 'చర్చి/స్కూలు సమీపిస్తున్నది. అనవసరంగా హారన్ నొక్కకు' మని బోర్డులపై వ్రాసి ఉంచినట్లు ఆయనకు కనిపించిందన్నారు.

పగలు కారు ఆగినచోటల్లా దిగి 'కొకాకోలా' అనే చల్లని పానీయం త్రాగుతూ వచ్చారు. దీని ఖరీదు పావలా. భారతదేశంలో ఇట్లాంటి లైమ్ జ్యూస్ అప్పుడు అణామాత్రమే ఉండేదట. దారిలో రెండు గుర్రపు బగ్గీలు కనిపించగా, ఈ మోటారు యుగంలో కూడ వీటి వాడకాన్ని గురించి రచయిత ఆశ్చర్యం వ్యక్తంచేశారు.

కాలిఫోర్నియా, నెవాడాల తర్వాత యూటా రాష్ట్రం. ఈ రాష్ట్రంలో సాల్ట్ లేక్ సిటీ మార్గంలో వెళ్తున్నప్పుడు ఉప్పునీటి సరస్సు 'అప్పుడే యుతికిన తెల్లదుప్పటి పరిచినట్లుగా' కనిపించింది. ఇది పేరుకు సరస్సే కాని దీనిలోని నీరు సముద్రపు నీటి కంటె ఆరు రెట్లెక్కువ ఉప్పు కషాయమట! 160 కి.మీ. పొడవు, 100 కి.మీ. వెడల్పున్న ఈ సరస్సు ప్రయాణకాలంలో (జూన్ మాసాంతం) ఎండిపోయి ఉందని మూర్తి గారు వ్రాశారు.

ఇక్కడి ప్రజలు ముద్దుపెట్టుకునే పద్ధతిని బట్టి ఆ వ్యక్తుల మధ్య సంబంధాలను గుర్తింపవచ్చునని వ్రాశారు. పురుషుని కరస్పర్శనం చేసి ఫాలభాగం మీద ముద్దు పెట్టుకున్న వనిత అతనికి చెల్లెలో, తల్లోఐ ఉటుందనీ, పెదవుల మీద ముద్దుపెట్టుకున్న స్త్రీ తప్పనిసరిగా భార్యే అవుతుందనీ ఈయన పరిశీలన ద్వారా తెలుస్తుంది.

వయోమింగు రాష్ట్రంలో స్వభావానికి, శక్తికి గౌరవమిస్తారు కాని వృత్తికి కాదన్నారు. చాలమంది విద్యార్థులు వేసవి సెలవుల్లో మనం హీనంగా భావించే వృత్తులు కూడ చేసి, డబ్బు కూడబెట్టుకొని విద్యాభ్యాసం చేస్తారు. భారతదేశంలో ఈ 'డిగ్నిటీ అఫ్ లేబర్' లేదు.

షికాగో నగరంలో అనేక అంతస్తులు కలిగి, ఆకాశాన్ని అంటేంత ఎత్తులో ఉండే మేడలెన్నో ఉన్నాయట. వీటిని 'స్కై స్క్రేపర్లు' అంటారనీ, వీటి పునాది భూమిలో వంద అడుగుల దాకా ఉంటుందనీ రచయిత వ్రాశారు. యాత్రాకాలం నాటికి వంద సంవత్సరాల క్రితం (1829 లో) ఈ నగరం స్థానంలో అడవి ఉండేదంటే, ఎంత త్వరగా అభివృద్ధి చెందిందో దీనివల్ల స్పష్టమవుతుంది. 1929 నాటికే ఈ నగరం ప్రపంచంలోనే నాల్గవ అతి పెద్ద నగరంగా (జనాభా 25 లక్షలు) రూపొందింది.

## ii) నయాగరా జలపాతం :

బుఫెలో స్టేషన్ నుండి నయాగరాకు రైల్లో ప్రయాణించారు. అమెరికాలో రైళ్ళలో కూడ టిక్కెట్లివ్వడం రచయితకు ఆశ్చర్యం కలిగించింది. నయాగరా జలపాతాన్ని దూరం నుండే చూసి మూర్తిగారు నిశ్చేష్టితులై "ఇట్టి తరి ఎవ్వడిట్టి దృశ్యమును వర్ణింపగలడు? కొన్ని చూచి యానందింపదగినవె కాని వర్ణింపనలవి కాదని" భార్యకు వ్రాసిన లేఖలో పేర్కొన్నారు. నయాగరా జలపాతం నుండి పుట్టే విద్యుచ్ఛక్తిని అమెరికావాళ్ళు వినియోగించుకోవడం చూసి, మన దేశంలో కూడ జలపాతాలను చూసి ఆనందించడమే కాక విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేసుకొన్నచో బాగుంటుందని రచయిత అభిప్రాయపడ్డారు. దీన్నిబట్టి చూస్తే 1929 నాటికి ఇంకా మనదేశంలో విద్యుచ్ఛక్తి వాడకం లేనట్లనిపిస్తున్నది. బెంజమిన్ ఫ్రాంక్లిన్ ఫిలడెల్ఫియాలో గాలి పడగను ఎగురవేస్తూ విద్యుచ్ఛక్తి యొక్క తత్వాన్ని తెలుసుకున్నాడట!

## iii) న్యూయార్క్ విశేషాలు :

న్యూయార్క్‌లో మోటారు బస్సు పై అంతస్థులో ప్రయాణం చేశారు. ఇక్కడి బస్సుల్లో పై అంతస్థులకు ఆకాశమే పై కప్పట! సాయంకాలం ఈ అంతస్థులో ప్రయాణం గంధర్వలోక పర్యటన లాగ ఉంటుందని రచయిత వ్రాశారు. నల్లటోపీ పెట్టుకున్న కండక్టరు చేతిలోని చిన్న మెషీన్‌లో ఒక 'డైమ్' (10 సెంట్లు) పడేయగానే ఆ మెషిన్ టిక్‌మని చప్పుడు చేస్తుందనీ, తర్వాత ముందుకు సాగి కుషన్ సీట్లలో కూర్చోవాలనీ తెల్పారు.

న్యూయార్క్‌లో మనుషుల కన్న కార్లే ఎక్కువ. జనం గుమికూడడం గాని, ఒకచోట ఆగి సంభాషించడంగానీ ఉండదనీ, ఒకరినొకరు తగులకుండానే ప్రయాణిస్తారనీ వ్రాస్తూ ఇక్కడ అంతా మనుషులు, వాహనాలు-కుడి ప్రక్కగా నడుస్తారన్నారు.

న్యూయార్క్ నగరంలో సింహళ దేశీయుడు నడిపే, 'సిలోన్ ఇండియా ఇన్' అనే పేరుతో ఉన్న హిందూ భోజన హోటల్‌ను సందర్శించారు. ఈ హోటల్‌లో అన్నం,, పప్పు సాంబరు, కూర, అప్పడం, పచ్చడి భోజనం ఖరీదు ఒక డాలరు (అప్పటి మన మూడు రూపాయలు). కాగా, ఇదే రకం భోజనం మనదేశంలో మూడణాలకే పెట్టేవారని తెల్పారు. ఎంగిళ్ళెత్తేవారి కోసం టిప్ రూపంలో పళ్ళెం కింద ఒక డైమ్ (10 సెంట్లు) ఉంచాల్సి వచ్చిందనీ, అది అక్కడి సంప్రదాయమనీ వ్రాశారు!

ఈ హోటల్ తర్వాత ఇక్కడున్న మరో హిందూ రెస్టారెంట్ 'రాజా రెస్టారెంట్'. ఈ యాత్రా కాలంలోనే అక్కడొక విందు ఏర్పాటుచేయబడిందట. లక్నో నివాసి అనుగ్రహ హరినారాయణ్ కొలంబియా విశ్వవిద్యాలయంలో ఎం. ఏ. పరీక్షలో నెగ్గి స్వదేశానికి వెళ్ళిపోతున్న సందర్భంలో ఏర్పాటైన వీడ్కోలు విందు ఇది ఆహ్వాన పత్రంలోనే కవరు ఒక్కింటికి డాలరున్నర అని ఉందట! అక్కడి ఆచారం ప్రకారం భోజనం ప్లేట్లో పెట్టి దానిమీద చక్కని గుడ్డ కవరు వేస్తారు అందుకే భోజనం ఒక్కంటికి అనకుండా కవరు ఒక్కంటికి అనే వ్యవహారం వచ్చింది. విందుకు పిలువబడ్డ ప్రతివారు తమ బిల్లుతోపాటు అతిథి భోజన ఖరీదు కూడ సమానంగా పంచుకొని చెల్లించే పద్ధతి ఉన్నట్లు తెల్పారు.

మూర్తి గారు కోమటి బిడ్డ కావడం వల్ల 'వూల్వర్తు వాణిజ్య సౌధం' దర్శించి గ్రంథాంతంలోదానిగురించి సుదీర్ఘంగా ఎనిమిది పుటల వివరణ ఇచ్చారు, టూకీగా : ఈ సౌధం వైశాల్యం 30 ఎకరాలు. గదుల మధ్య వరండాలు మన పట్టణాల్లోని ప్రధాన వీధులంత వెడల్పుంటాయి. దీనిలోనివన్నీ అమెరికాలో ఉన్న అతి పెద్ద పారిశ్రామిక సంస్థల కార్యాలయాలే. అద్దెకున్న ఉద్యోగుల సంఖ్య పద్నాలుగు వేలుకాగా భవనం ఎత్తు ఆరు ఫర్లాంగులట! (అంటే దాదాపు 792 అడుగులు).

## iv) అమెరికన్ల సంబోధనలు :

మూడో వ్యక్తిని గూర్చి మాట్లాడేటప్పుడు అమెరికన్లు 'దట్ ఫెలో' అంటారు. యువకులను 'జెంటిల్మన్' అని కాని 'యంగ్ మన్' అని కాని సంబోధించకుండా 'బాయ్ లేదా బాయిస్' అనేపిలుస్తారట! ఉపన్యాస ప్రారంభంలో ఛైర్మన్, లేడీస్ అండ్ జెంటిల్మన్ అని మనదేశంలోలాగ పేరుపేరునా పిలువకుండా 'హలో ఎవరిబడీ' అని సంబోధిస్తారన్నారు. ఎవరైనా తలుపు తట్టినప్పుడు 'జస్ట్ ఎ సెకండ్' అని జవాబు చెబుతూ, తలుపు దగ్గరకు రావడం అమెరికా సంప్రదాయమని మూర్తిగారు పేర్కొన్నారు.

## 2. 'మా మహారాజుతో దూరతీరాలు' అనే అమెరికా యాత్ర*

ఇదివరకు ధనికులు, జమీందారులు యాత్రలకు బయలుదేరేటప్పుడు బాగా చదివిన సంస్కృత పండితులను వెంటబెట్టుకొని వెళ్ళి, తాము చేసిన యాత్ర గురించిన వివరాలను విపులంగా వ్రాయించేవారు. మిగతా వారికి యాత్ర చేయాలనే అభిలాష కలగడానికి ఈ యాత్రా చరిత్రలు ఎక్కువగా దోహదపడతాయి అట్లాంటి యాత్ర గ్రంథమే కురుమెళ్ళ వెంకటరావు గారు రచించిన 'మా మహారాజుతో దూరతీరాలు' అన్నది. పాశ్చాత్య దేశాలు కొన్నిటిని చూసి అక్కడి విశేషాలను తమ మిత్రునికి వ్రాసిన లేఖా సముచ్చయమే ఈ పుస్తకం.

---

* కురుమెళ్ళ వెంకటరావుగారు, బ్రహ్మసమాజ అనుయాయి.

పిఠాపురం మహారాజా శ్రీ రాజా రావు వేంకట కుమార మహీపతి సూర్యా రావు బహదూర్ వారు కుటుంబంతో విదేశ యాత్ర చేస్తూ వెంట కురుమెళ్ళ వెంకటరావుగారిని కూడ తీసుకొని వెళ్ళారు మహారాజావారు మజిలీ చేసిన ప్రతి స్థలం నుండి పిఠాపురంలోని తన ప్రియమిత్రులు పెమ్మరాజు వెంకటరావుకు ఎప్పటి కప్పుడు లేఖ వ్రాస్తూ వచ్చారు. ఇట్లా యాత్రాకాలంలో మొత్తం 80 లేఖలు వ్రాశారు. 1930లో చేసిన యాత్రా విశేషాలను 1956లో దాదాపు 35 సంవత్సరాల తర్వాత ముద్రింపించారు. మహారాజావారికే ఈ గ్రంథం అంకితం చేయబడింది.

ఈ గ్రంథంలో 38 పేజీల గ్రంథ పరిచయం, పీఠిక కాకుండా 166 పుటలున్నాయి. వీటిలో అమెరికా యాత్రకు సంబంధించి దాదాపు 40 పుటలు కేటాయించారు. ఈ వ్యాసంలో అమెరికా యాత్ర గురించిన అనుభవ విశేషాలను పేర్కొనడం జరిగింది. మిగతావి ఆయా అధ్యాయాల్లో తెలుపబడతాయి.

వీరి విదేశ యాత్ర 2-5-1930 న ప్రారంభమై 22-11-1930 న బొంబాయి చేరుకోవడంతో ముగిసింది. ఈ మధ్యమార్గంలో వీరు దర్శించిన దేశాలు: సూయజ్ కాలువగుండా ఇంగ్లండు, స్కాట్లండు, ఐర్లండు, అమెరికా, జర్మనీ, ఆస్ట్రియా, స్విట్జర్లాండు, ఇటలీ, ఫ్రాన్సు, మార్సెల్సు, చివరగా బొంబాయి.

## i) సముద్రయానంలో అనుభవాలు: ప్రయాణ మార్గం:

బొంబాయి రేవు నుండి 3-5-1930 న 'ఎస్. ఎస్. వైస్‌రాయ్ ఆఫ్ ఇండియా' అనే పేరుగల స్టీమరులో ప్రయాణం ప్రారంభమైంది. మొదటి రెండు రోజులు వేంకటరావుగారికి సముద్ర ప్రయాణం పడలేదు. ఈ 'సీ సిక్‌నెస్'లోని అవస్థనంతా రచయిత 'మగవాళ్ళు వేవిళ్ళు పడడం లాంటిది'గా ఒక్క మాటలో తేల్చి చెప్పాడు [2]

---

'మా మహారాజుతో దూరతీరాలు' - పేజీ. 2.

ఏడెన్ నుండి బేబిల్ మాండబ్ జలసంధి ద్వారా ఎర్ర సముద్రంలో ప్రవేశించింది ఓడ. పదకొండవ నాటి ఉపయానికల్లా సూయజ్ కాలువలో ఉంది. సముద్రంలో ప్రయాణిస్తున్నప్పుడు సూర్యాస్తమయ సమయంలో డెక్కు మీదికి వెళ్ళి అప్పటి ప్రకృతి దృశ్యాన్ని అనుభవించడం రచయితకు అలవాటుగా మారింది.[3] మధ్యధరా సముద్రంలో ప్రయాణిస్తున్నప్పటి వర్ణన : "నల్లటి నీటి నుంచి లేచి తెల్లగా విరిగి పడే కెరటాల మీద సూర్య కిరణాలు పడితే బంగారం పొంగినట్లుండేదనీ," చుట్టూ ఆకాశం వంగిపోయి సముద్రంలో దూరంగా కలిసి పోవడం రావుగారికి "విశాలమైన సముద్రం మీద బ్రహ్మాండమైన ఒక వెండి కప్పు బోర్లించినట్లు" కనిపించిందట.[4]

అమెరికా చేరుకునే సరికి నాలుగు సముద్రాలు దాటవలసి వచ్చింది. అరేబియా సముద్రం, ఎర్ర సముద్రం, మధ్యధరా సముద్రం, అట్లాంటిక్ మహా సముద్రం. ఎక్కడా భూమి అనేదే లేకుండా ఒక్క అట్లాంటిక్ మహా సముద్రం లోనే దాదాపు ఐదువేల కిలోమీటర్లు (మూడువేల మైళ్ళు) ప్రయాణించినట్లు వ్రాశారు. ఏడు రోజుల పాటు నీళ్ళూ, అలలు తప్ప ఇంకేం కనపడలేదట! వెంకటరావు గారు ఈ మహా సముద్రాన్ని ఒక 'పెద్ద నీటి ఎడారి' అను కొమ్మంటారు.

ఇంగ్లండుకు దక్షిణాన ఉన్న రేవు పట్టణం 'సౌథాంప్టన్' నుండి 'ఎస్. ఎస్. మెజస్టిక్' అనే పేరుగల స్టీమరులో న్యూయార్కుకు ప్రయాణమయ్యారు. ఆ కాలంలో ప్రపంచంలోనే దీనంత పెద్ద స్టీమరు లేదనీ, ఇది ఒకప్పటి జర్మనీ వారి యుద్ధ నౌక కాగా ప్రపంచ యుద్ధంలో ఇంగ్లీషువారు దీన్ని చేజిక్కించుకొని ప్రయాణ నౌకగా తయారు చేసి వాడుకుంటున్నట్లు రచయిత తెల్పారు.[5]

---

3. మేడలకు చుట్టు వసారాలున్నట్లుగానే పడవ పై అంతస్తులకు విశాలమైన ఖాళీ స్థలాలుంటాయి. వీటినే డెక్కులంటారు.

4. అదే పుట. 9.

5. మెజిస్టిక్ స్టీమరు యాభై ఆరువేల టన్నుల బరువు మోస్తుందని, వైస్ రాయ్ ఆఫ్ ఇండియా స్టీమరు కేవలం 19 వేల టన్నుల బరువు మాత్రమే మోస్తుందని రచయిత తెల్పారు. పేజీ 56.

## ii) న్యూయార్కు నగరం విశేషాలు :

వీరు బస చేసిన మెకాల్బిన్ హోటల్ 24 అంతస్తులది. ఈ మేడ కిటికీ లోంచి చూస్తే రోడ్డు మీది నుండి నడుస్తున్న వాళ్ళు 'మనుష్యులో, చీమలో' తెలియడం లేదన్నారు. మన దేశంలో ఇప్పుడున్నంత ఎత్తైన మేడలు ఆ కాలంలో లేకపోవడమే ఈ ఆశ్చర్యానికి కారణం. జనం పేవ్‌మెంట్ల మీద పరుగులు తీయడమే కాని సావకాశంగా నడవరని వ్రాశాడు.

పెద్ద పెద్ద షాపుల్లో ఎప్పుడూ తిరిగే మెట్లు 'ఎస్కలేటర్లు' రచయితకు ఆశ్చర్యం గొలుపగా, ఏర్ కండిషనింగ్ హాళ్ళు అమెరికా వాళ్ళు ప్రకృతినే మార్చివేసిన అద్భుతంగా వెంకటరావు గారికి స్ఫురించింది.

ఇక్కడి రెస్టోరెంట్లను 'డ్రగ్ స్టోర్స్' అంటారట! ఇవికాక ఎన్నో ఆటోమేట్లున్నాయన్నారు. ఒక ఐదు సెంట్ల నాణెం పడేస్తే రొట్టో కేకో ఏది కావాలంటే అది దానంతటదే వస్తుందని వ్రాశారు. ఐతే ఇది రచయితకు మరీ కొత్త అనుభవం కాదు. మద్రాసులోని స్టేషన్‌లో ఒక 'అణా కాసు' పడేస్తే ప్లాట్‌ఫారం టిక్కెట్టు వచ్చినట్లుగా ఊహించుకొమ్మని మిత్రునికి లేఖలో తెల్పారు.

అమెరికాలో ఏం చూశావన్నదానికి వెంకటరావుగారి జవాబొక్కటే: 'అడ్వర్టయిజుమెంట్లు' ఇక్కడ అడ్వర్టయిజుమెంటును ఓ గొప్ప కళగా మలిచారు ప్రతి న్యూస్ పేపర్లో మూడొంతులకు పైగా ప్రకటనలే ఉంటాయి. అమెరికాలో అడుగడుగున ప్రకటనలు కనిపిస్తాయంటూ, ఆకాశం మీద విమానాలు కూడ పొగలతో అక్షరాలను రచిస్తాయన్నారు. అడ్వర్టయిజుమెంట్లు లేని అమెరికా 'బోడి విధవ', 'స్మశానం' లాంటిదట!

న్యూయార్కుగురించి వ్రాయాల్సి వస్తే అది భారత మంత గ్రంథమవుతుందంటూ- "ఏమైనా న్యూయార్కు ఒక తుఫాను లాంటిది. ఉరుముతుంది మెరుస్తుంది, హింస పెడుతుంది, చూడడానికి కళ్ళు నొప్పి పెడతాయి. అయినా చూడకుండా ఉండలేం, అసాధ్యం"- అని మహా నగరాన్ని గురించి మూడు ముక్కల్లో తేల్చిచెప్పారు 6

---

6. 'మా మహారాజుతో దూర తీరాలు' - పేజీ. 67.

### iii) షికాగోలో ఆతపస్నానాలు :

న్యూయార్కు తర్వాత పెద్ద పట్టణం షికాగో అంటూ ఇక్కడ జనాభా 33 లక్షలని వ్రాశాడు. మిషిగాన్ సరస్తీరంలో అతపస్నానాలు (సన్‌బాత్) చేసే అర్ధనగ్న శరీరాలను చూస్తే ముఖ్యంగా భారతీయులకు జుగుప్స కలుగుతుందంటూ తాను చూసిన దృశ్యాన్నిలా వర్ణించారు: "పగలంతా రహస్య అవయవాలు మాత్రమే సగం సగం కప్పుకుని సూర్య కిరణ స్నానాలు వేలకొలది దొరలూ, దొరసానులూ చేస్తారు... నల్ల కళ్ళజోళ్ళు పెట్టుకొని ఇసుకలో వెల్లకిలా పడుకుని సూర్యకిరణాల వేడికి శరీరమంతా నల్లగా మాడిపోయేలాగ వొళ్ళు కాల్చుకోడం ఇక్కడి ప్రజల వెర్రి సరదా.8" ఐతే ఈ సరదాలో కూడ కాస్తంత ఆరోగ్య దృష్టి ఉండడం గమనించతగ్గది.

### iv) శాన్‌ఫ్రాన్సిస్కో చేరడానికి ముందు ఓ విచిత్రం :

షికాగో నుండి రైల్లో శాన్‌ఫ్రాన్సిస్కో చేరడానికి మూడు రాత్రులు, రెండు పగళ్ళు ప్రయాణం కాగా, న్యూయార్కు నుండి నాలుగు రాత్రులు, నాలుగు పగళ్ళు పడుతుందట!

పసిఫిక్ మహాసముద్రం భూమిలోకి చొచ్చుకువచ్చి గల్ఫ్ ఏర్పడింది. దానికి ఉత్తరంవైపు ఓక్‌లాండ్ అనే ఊరు, దక్షిణంవైపు శాన్‌ఫ్రాన్సిస్కో ఉన్నాయి. వీళ్ళు ప్రయాణించిన రైలుమార్గం ఓక్‌లాండ్‌తో పూర్తయింది. ఇంక అవతలి గట్టుకు చేరాలి. ఇక్కడ ఒక విచిత్రం జరిగిందట! రైలుబండి అవతలి గట్టున ఉన్న స్టీమరు మీదికి ఎక్కించి, దానిమీది నుండి చక్కగా భూమ్మీది రైలు పట్టాల మీదికి ఎక్కేసింది. ఇది తెల్లవాడి అనేకానేక 'మాయ'ల్లో ఒకటిగా రావుగారికి తోచి ఆశ్చర్యపడ్డారు. శాన్‌ఫ్రాన్సిస్కో రచయితకు నీలగిరి లాగా ప్రశాంతంగా కనిపించిందట! కొండలమీద నిర్మింపబడ్డ నగరమిది.

---

7. సంవత్సరం క్రితం అత్యం నరసింహమూర్తిగారు ఈ పట్టణ జనాభా 25 లక్షలని తెల్పారు. ఒక్క సంవత్సరంలోనే 8 లక్షల జనాభా పెరిగిందా?

8. 'మా మహారాజుతో దూరతీరాలు' - పేజీ. 71.

హాలీవుడ్ లాస్ఏంజిల్సుకు పక్కనే ఉంది. ఇక్కడ బివర్లీహిల్సు హైద రాబాద్‌లోని జూబ్లీహిల్సు లాంటిది. ఎత్తైన ప్రదేశం. ఇక్కడ తెగడబ్బు గడిం చిన సినీతారలు భోగాల ననుభవించడానికి గొప్ప గొప్ప భవనాలు నిర్మించు కున్నారు. హెరాల్డ్ లాయిడ్, గ్రిటా గార్బో లాంటి సుప్రసిద్ధ నటుల ఇండ్లను రచయిత చూశానని వ్రాశారు.

ఇక్కడ ఆడవాళ్ళు తమ సౌందర్యం ఇనుమడింపచేసుకోవడానికి విశేష ప్రయత్నాలు చేస్తారు. ఒకసారి గోళ్ళు కత్తిరించి 'సాపు' చేసి పాలిష్ చేసినం దుకు 'మేనిక్యూర్‌షాపు'ల్లో పది పదిహేను డాలర్లు వసూలు చేస్తారని రావుగారు తెలుసుకున్నారు.

యాత్రాకాలంనాటికి మనదేశానికి స్వాతంత్ర్యం సుదూరస్వప్నంగానే ఉంది. అమెరికా జాతీయ జెండా కనపడగానే అక్కడి వాళ్ళంతా టోపీలు తీసి, తమ జాతీయ పతాకాన్ని గౌరవించడం చూసి మనకు కూడ జాతీయ పతాకం ఉంటే ఎంత బాగుండేది! అనుకొన్నారు. ఆయన జాతీయాభిమానం అట్లాంటిది. అప్పటికే గాంధీగారి కాంగ్రెసు జెండా చలామణీలో ఉంది. ఈ జెండా ఎప్పటి కైనా మన జాతీయ జెండాగా మారకపోతుందా! అని ఆశించారు.

వెంకటరావుగారి యాత్రాకాలం నాటికి అమెరికా అధ్యక్షుడు హెర్బర్టు హూవర్ (1929 - 33).

## 3. ఎల్.ఎన్. రావుగారి 'గాలిమేడల అమెరికాలో'

లక్ష్మీనారాయణరావు గారు అనంతపురం జిల్లా నివాసి. ఇంగ్లీషు విద్యా భ్యాసంతోపాటు భారతీయ తత్వశాస్త్రాన్ని బాగా ఆకళింపుకొన్న వ్యక్తి. సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీలో సభ్యుడుగా ఉండి దీన జనులకు సేవ లందించారు.

1952లో అమెరికావారి అంతర్జాతీయ శాఖ నుండి లీడర్ స్పెషలిస్టు గ్రాంటు పొంది ఐదు నెలలు అమెరికాలో పర్యటించారు. ఏప్రిల్ 1953 లో అమె రికాకు బయలుదేరి సెప్టెంబరు దాకా యాత్ర చేశారు. ఐతే అక్కడ తాను

చూసిన వివరాలను మామూలు అనంతపురం భాషలోనే లేఖలుగా వ్రాసి పంపారు' ఇవి మొత్తం 20 లేఖలు. అనంతపురం నుండి వెలువడే 'శ్రీ సాధన పత్రిక. ఈ లేఖలను వరుసగా ప్రచురించింది. ఇవే 1954 లో 'గాలి మేడల అమెరికాలో" అన్న పుస్తకంగా ప్రచురింపబడ్డాయి రచయిత 'తొలిపలుకు'లో దీన్ని గురించి ఇట్లా వ్రాశారు : "ఇది ఒక ట్రావెల్ గైడ్ కాదు. ఇందు విదేశయాత్రలు చేయువారి కుపయోగపడు విషయము లెన్నియో యున్నను, ఈ పుస్తకము అమెరికన్ జీవితమును చూచి, ఆనందించి వ్రాసిన ఒక వ్యక్తి గాథ. అందుచే ఈ లేఖల కొక ప్రత్యేకత గలదు."[9]

"అమెరికనులు భౌతికంగా గొప్ప ప్రగతిని సాధించినా, మానవత్వంలో వెనుకపడ్డారనీ, వారి అభివృద్ధి ఆకాశాన్ని అంటినా, అది నిరుపయోగమనీ 'గాలి మేడల అమెరికా' అనే అర్థవంతమైన పేరుతో స్ఫురింపచేశారు." అని ఘట్టమరాజుగారు ఒక వ్యాసంలో ఈ గ్రంథ నామౌచిత్యాన్ని వివరించారు.[10]

ఇది విమాన యాత్ర. రావుగారు బొంబాయి లోని శాంతాక్రుజ్ విమానాశ్రయం నుండి బయలుదేరి సౌదీ అరేబియా, కైరో, రోము, జ్యూరిచ్, జినీవా, లండన్‌లగుండా న్యూయార్కు చేరుకున్నారు.

అత్యం నరసింహమూర్తి న్యూయార్కులోని ఎత్తైన భవనాలను స్కై-స్క్రేపర్లంటే, ఈయన గాలిమేడలన్నాడు. న్యూయార్కులోని 102 అంతస్తుల గాలిమేడ 'ఎంపైర్ స్టేట్ బిల్డింగ్' ఆ కాలంలో ప్రపంచంలోని భవనాలన్నిటి కంటె ఎత్తైనదని వ్రాశారు.

## i) ప్రయాణ సౌకర్యాలు :

ఇక్కడ ప్రజలు స్వంత కార్లలోనే ఎక్కువగా ప్రయాణం చేస్తారు కాబట్టి రైళ్ళల్లో మనదేశంలో వలె జనం క్రిక్కిరిసి ప్రయాణం చేయరు.

---

9. గాలి మేడల అమెరికాలో - తొలిపలుకు.
10. మూడు అజ్ఞాత యాత్రా చరిత్రలు - ఘట్టమరాజు విశాలాంధ్ర ఆదివారం. 18-8-1982.

ఇక్కడి రైళ్ళలో అన్నిటికంటె కింది తరగతిలో కూడ మనదేశపు ఫస్టుక్లాసు బండ్లలో వలె మంచి సీట్లుంటాయట కాని పడుకోవడానికి వీలుండదన్నారు. ఐనా కుర్చీని వెనుకకు వంచి హాయిగా నిద్రపోవచ్చునట!

ఇక్కడ సామానులను లాగే వాళ్ళను 'రెడ్ క్యాపు' లంటారు. ఈ కూలీలు నీగ్రోలే కాని తెల్లవారుండరు. వీరు ఎర్ర టోపీలు పెట్టుకోవడం వల్ల వీరికి పేరు వచ్చింది. ముసలివాళ్ళు, కొత్తగా వచ్చిన వాళ్ళు మాత్రమే రెడ్ క్యాపుల సహాయాన్ని అర్థిస్తారు కాని అమెరికాలో ఎవరి పనులు వారే చేసుకుంటారు. కోటీశ్వరులు తప్ప ఎవరు కూడ ఇంటిపనుల కోసం నౌకర్లను పెట్టుకోరనీ, హోటళ్ళలో మాత్రం నౌకర్లుంటారనీ వ్రాశారు.

పెట్రోలును ఇక్కడ గ్యాస్ అంటారు. పెట్రోలు ధర లీటరుకు ఇండియాలో రూపాయి పావలా ఉండగా అమెరికాలో మూడు రూపాయలుందంటూ "పెట్రో లొక్కటి మాత్రమే యీ దేశమున మన దేశములో కంటె చౌకగా లభించునది" అన్నారు.

పెద్ద నగరాలలో తప్ప బయట ఎక్కడ కూడ తంతి స్తంభాలు లోహపువి ఉండవట! అన్నీ కర్ర స్తంభాలే. ఇవి కనీసం 20, 25 సంవత్సరాలు మన్నిక కలిగి ఉంటాయి. దీని వల్ల మనదేశంలో ఏవిధంగా అనవసరమైన వ్యయ భారం మోస్తున్నామో అర్థమవుతుంది. స్వాతంత్ర్యానంతరం కూడ విదేశీ వస్తువులకే మార్కెట్టు సృష్టించే పరాధీనత మనల్ని వదలలేదు.

## ii) అమెరికా ఇండియాల సామ్యం :

అమెరికన్లు మనలాగే చల్లని నీటిని ఎక్కువగా తాగుతారు. కాఫీ త్రాగడానికి హోటల్‌కు వెళ్ళినా ముందుగా చల్లని నీళ్ళగ్లాసు మనముందుంచిన తర్వాతే ఏం కావాలని అడుగుతారట. ముఖ్యంగా న్యూమెక్సికోలోని గ్రామాలు మట్టి గోడలతో నిర్మింపబడి ఉంటాయి. వీధులు, ఇండ్లు అన్నీ అచ్చంగా మన పల్లెల వలెనే ఉంటాయి. మిరపకాయల పంట ఎక్కువ. ఇక్కడి వారి లాగే మెక్సికో జనులు కారం ఎక్కువగా తింటారు అరిజోనా రాష్ట్ర రాజధాని ఫినిక్స్ సరిగ్గా అనంతపురం లాగే ఉన్నదంటూ ఇక్కడ కూడ ఎండలు ఎక్కువే నన్నారు.

అమెరికాలో ఫ్యాషన్లు త్వరత్వరగా మారుతుంటాయి. పాత గుడ్డలను సగం ధరకే బేసుమెంటులో అమ్మివేస్తారు. అట్లా చేయకపోతే వస్తువులు నిలవ ఉండి చెడిపోతాయని వారి అభిప్రాయం. అందుకేనేమో పెద్ద డిపార్టుమెంటు స్టోర్లలో క్రింది అంతస్థులో గుడ్డలు ఒక్కొక్క దానికి మూడు డాలర్లైతే పైఅంతస్థులో ఆరు డాలర్లట!

అమెరికాలోని సెలూన్లలో మంగలి తలను షాంపూ చేస్తుండగా నటీమణుల్లాంటి అందగత్తెలు మెల్లగా గోళ్ళు తీస్తూ వ్రేళ్ళను శుభ్రపరుస్తారు. ఇది అరగంట పని. గోళ్ళు గుండ్రంగా సరిచేయబడినవా లేవా అని ఎలక్ట్రిక్ దీపాలతో పరీక్షించి చూస్తారు రచయిత తన ప్రక్కనున్న అమెరికన్లు తలలను షాంపూ చేయించుకోవడాన్ని చూసి 'మన దేశములో పాతిక యేండ్లకు ముందు (అంటే 1928లో) మన పల్లెలలో మంగలి వాండ్లు తలంటు దృశ్యమును జ్ఞప్తికి తెచ్చినది' అన్నారు.

## iii) చిరునవ్వుకు వెల :

అమెరికాలో ఎక్కడ చూసినా, ఎప్పుడు చూసినా చిరునవ్వులే. వారు దాన్నొక విద్యగా పట్టుదలతో అభ్యసించినట్లు అనిపించేట్టుగా ఉంటుందట. భోజనం వడ్డించే స్త్రీలు డ్రగ్ స్టోరలో ఎవరు వెళ్ళినా చక్కగా మాట్లాడుతూ, నవ్వుతూ ఆహ్వానిస్తారు. పూర్వపరిచయం లేకున్నా సరే, 'ఈ దినమున కులాసాగా నున్నారా' అని పలకరిస్తారనీ, అది అక్కడి సదాచారమనీ రావుగారు పేర్కొన్నారు.

అమెరికన్లకు చిరునవ్వులోను వ్యాపారమే. రచయితకు ఒక డ్రగ్ స్టోరు వద్ద కాఫీ తీసుకుంటుండగా గోడ మీద పెద్ద అక్షరాలతో వ్రాయబడిన గేయం కనిపించిందట అది చిరునవ్వును గురించిన పద్యం. దాని సారాంశమిట్లా ఉంది: "బేరము బిర బిర సాగిపోవు తొందరలో మా అంగడి పని వారెవరైనను అలసటచే మీకొక చిరునవ్వుయినను ఈ యజాలకపోయినచో మీ చిరునవ్వయిన నొకటిచ్చి వెళ్ళవలయునని మేము ప్రార్థింపవచ్చునా? ఎందుకందురా? ఎవరు చిరునవ్వియకపోయిరో వారికే అది అత్యవసరము.'

చిరునవ్వులోనే కాదు వారి జీవితమంతా అమ్మకుడు బ్రతుకేనని రావుగారు అనుభవ పూర్వకంగా ఒక సంఘటనను ఉదాహరించారు రచయిత, ఆయన మిత్రుడు, మరొకామె భోజనం చేసిన తర్వాత భోజనం వెల ఈయన మిత్రుడు ఇస్తాననగా, ఆమె 'నేనిస్తాను' అనే భావంతో "లెట్ మీ బై యువర్ డిన్నర్" అందిట. 'నీ భోజనం నన్ను కొననీయవా' అని దాని అర్థం ఏ మాటలోనూ కొనడమూ, అమ్మడమేనని అమెరికనుల జీవన విధానానికి విసిగెత్తి పోయారు రచయిత.

అమెరికాలో కార్లను పార్కు చేయడం చాలా కష్టం. ప్రయాణీకులకు విడిది చేయడానికి హోటళ్ళలో స్థలం దొరుకుతుంది కాని వీటికి పార్కింగ్ ప్లేస్ దొరకదు. కాబట్టి వీరికి అనుకూలంగా నగరం వెలుపల మోటెళ్ళు నిర్మిస్తారు. ఒక్కొక్క గదిముందు ఒక్కొక్క కారు నిలిపేంత స్థలముంటుంది. మోటారు, హోటలు అనే పదాలతో క్రొత్తగా సృష్టించబడ్డ మాట మోటెల్ (Motel) అనేది.

## iv) అమెరికా బాల బాలికలు :

హైస్కూళ్ళలో బాలికలకు గృహకార్య నిర్వహణ అంటే 'హోమ్ ఎకనామిక్స్' అంతా చక్కగా నేర్పుతారు. ఇల్లు చక్కబెట్టుకోవడం వంట చేయడం, పడకలు పరచడం, బట్టలు కుట్టడం మొదలగునవి బాగా నేర్పుతారు. ఇన్ని సదవకాశాలున్నా అమెరికన్ బాలబాలికలు చెడిపోవడానికి రావుగారు తమ అనుభవంద్వారా ఈ క్రింది కారణాలు పేర్కొన్నారు: తల్లి దండ్రులు కార్మిక సంస్థలో పనిచేస్తూ తగినంత శ్రద్ధ చూపకపోవడం, సాధారణ పరిస్థితిలో ఉన్న స్త్రీ పురుషులు తమ విలాసాలకే ఎక్కువ శ్రద్ధ చూపడం, తమ ఆనందంకోసం బిడ్డల నేసినిమా హాలులోనో దిగపెట్టి వేరే చోటికి వెళ్ళిపోవడం, టి.వి. లోని అసభ్యకరమైన ప్రోగ్రాములు.

మానవ జీవితాలన్నీ సాధారణంగా ఒకే రీతిగా ఉంటాయని చెప్పడానికి రచయిత ఒక సంఘటనను ఉదహరించారు: అమెరికాలో సంచరిస్తున్నప్పుడు ఒకచోట సుడిగాలి లేస్తే ఈయన కారు నడుపుతున్న వనిత 'అదియొక దుమ్ము దయ్యము" (Dust Devil) అన్నదట. సుడిగాలిని దయ్యంతో పోల్చే విశ్వాసం మన పల్లెల్లో ఉన్న విషయమే.

## 4. అక్కినేని "నేను చూసిన అమెరికా"

తెలుగువారి చలన చిత్ర మహానటుడు అక్కినేని నాగేశ్వరరావు గారు 1963లో అమెరికా పర్యటించారు. అమెరికా-భారతదేశాల మధ్య సాంస్కృతిక సంబంధాలు పెంపొందించుకోవడానికి అమెరికా విదేశాంగ శాఖ ఏర్పాటు చేసిన పథకంలో భాగంగా అక్కినేనికి ఆహ్వానం అందింది. అమెరికాలో పర్యటించిన రెండు నెలలూ ఆయన ప్రతిరోజు డైరీ వ్రాసుకున్నారు. ఆ డైరీలోని విశేషాల ఆధారంగా తర్వాత పుస్తకంగా పెంచి రచించారు. "ఈ పుస్తకం రెండు గొప్ప ప్రజాస్వామ్య దేశాల మధ్య, గొప్ప జాతుల మధ్య విరిసిన మంచి మనస్సుల ఇంద్రధనుస్సు" అని ఈ గ్రంథాన్ని 1965 లో ప్రచురించిన జ్యోతి బుక్స్ వారి అభిప్రాయం.

ఇది విలాస యాత్ర కాదు, ఉల్లాస యాత్ర అంతకంటే కాదు. ఆధునిక కాలంలో ఆకాశయానం మొదలైన తర్వాత అమెరికాలాంటి విదేశాలకు వెళ్ళి రావడం స్వదేశంలో గొప్పగా ఉండేవి. నాగేశ్వరరావు గారు నట జీవితంలో ఉక్కిరి బిక్కిరై ప్రశాంతత కోసం చేసిన మాత్ర కాదిది, బాధ్యతతో కూడు కున్న యాత్ర. అప్పటి నాలుగు కోట్ల ఆంధ్రుల పక్షాన, ముఖ్యంగా - లలిత కళారాధకుల పక్షాన చేసిన పర్యటన. నలభై కోట్లమంది భారతీయుల తరపున గొప్ప ప్రజాస్వామిక దేశాన్ని దర్శించే అవకాశం కలిగినందుకు ఆయన అదృష్టంగా భావించారు.

### i) ప్రయాణంలో విశేషాలు :

నాగేశ్వరరావు గారు జూన్ 19, 1963 న తెల్లవారు జాము నాలుగ్గంట లకు విమానంలో బయలుదేరారు విమానం మూడున్నర గంటలు ప్రయాణించి టెహరాన్‌లో ఆగింది. ఐతే విమానం దిగి ఏరోడ్రోమ్‌లోకి వెళ్ళి చూస్తే 7 30 గంటలకు బదులు 6 గంటలు అయింది. కాల మానంలో గంటన్నర భేదం ఉంది. అక్కడి పర్షియన్ యువతులు సన్నగా, నజూగ్గా ఉండి, వాళ్ళు ధరించిన దుస్తుల మేలిముసుగుల్లాగ పల్చగా, పారదర్శకంగా కనిపించారని వ్రాశారు. తర్వాత గ్రీకు రాజధాని ఏథెన్సు వచ్చింది. మన టైము రెండున్నరైతే అక్కడ పద కొండు గంటలే చూపిస్తున్నదట. ఈ విధంగా ప్రయాణంలో ముందుకు సాగిన

కొద్దీ ఆయా దేశాల్లోని వేళలు వెనక్కి వెళుతూ వచ్చాయి. అక్కినేని వారి గడియారంలో సాయంత్రం ఐదయేసరికి రోమ్‌లో మధ్యాహ్నం 12.30 గంటలయిందని వ్రాశారు. ఇది అమెరికా దారిలో ఆఖరి మజిలీ తర్వాత అట్లాంటిక్ మహా సముద్రంపై మరో ఎనిమిది గంటలు ప్రయాణిస్తే కాని న్యూయార్కు చేరుకోలేరు.

న్యూయార్కులో విమానం దిగుతూంటే 'ఆకాశ భవనాల తెర తమాషాగా పైకి లేచినట్లు' అనిపించిందట!

అక్కినేని అమెరికాలో చూడదలచిన ప్రదేశాలివి :- విశ్వవిద్యాలయాలు, వాటిలో నాటకరంగ స్థలాలు, వ్యాపార స్థాయిలో నడిచే నాటక కళాక్షేత్రాలు, వ్యవసాయ పారిశ్రామిక క్షేత్రాలు అన్నిటికంటె-ముఖ్యంగా అమెరికన్ ప్రజల రీతిని తెలుసుకోవడం, గవర్నమెంటల్ ఎఫైర్స్ ఇన్‌స్టిట్యూట్‌కు వెళ్ళి ఆ కార్యక్రమ నిర్వహణాధికారితో చర్చించి, నాగేశ్వరరావు గారు తన పర్యటన కార్యక్రమాన్ని నిర్ధారించుకున్నారు.

శని ఆదివారాలు దేశమంతా సెలవు రోజులే కాబట్టి అందరూ కలిసి ఆ రెండు రోజుల్లో వీకెండ్ (weekend) పార్టీలు చేసుకుంటారు. ఎక్కువగా దూర ప్రాంతాలకే వెళ్తుంటారు ఈ ఐదు రోజులూ పడ్డ శ్రమనంతా పోగొట్టుకోవడానికి సంతోషంతో కాలక్షేపం చేసి, సోమవారం ఉదయానికల్లా మళ్ళీ 'జెట్ విమాన వేగంతో' పోటీ మనస్తత్వంతో పనిలో చేరిపోతారట!

## ii) మధ్యాహ్న భోజనాల ప్రత్యేకత :

అమెరికాలో భోజనం చేయడమంటే ఏదో చెత్తంతా పొట్టలో నింపడం కాదు. పుష్టినిచ్చే విటమిన్లతో కూడుకున్న బలమైన ఆహారం వాళ్ళది. నాగేశ్వరరావు గారు అక్కడ గమనించిన బ్రేక్‌ఫాస్టు ఇట్లా ఉంది:

ముందుగా నారింజ, ద్రాక్ష, ఆపిల్, టొమాటోలలో ఏదో ఒక పళ్ళరసం సేవించి తర్వాత చపాతీ, ఉడకబెట్టిన గ్రుడ్డు, ఆమ్లెట్, మరో జత రొట్టెల మధ్య ఏ టొమాటోనో వేసుకొని సాండ్‌విచ్‌లాగా తీసుకుంటారు. తరువాత రెండు కప్పుల టీ త్రాగుతారు.

పట్టణాల్లో నివసించేవారు మధ్యాహ్న భోజనాలు ఇళ్ళదగ్గర చేయరు. ఆఫీసు నుండి ఇంటికి వెళ్ళి రావడం కాలయాపనగా భావిస్తారు. అదిగాక అక్కడ మధ్యాహ్న భోజన సమయాల్లో ఎన్నో వ్యాపార వ్యవహారాలు పరిష్కారమవుతూ వుంటాయనీ, అక్కడదో మర్యాద, పద్ధతి అనీ నాగేశ్వరరావు గారు పరిశీలించి వ్రాశారు.

## iii) న్యూయార్కు మహా నగరం :

న్యూయార్కు ఐదు బస్తీల సమ్మేళనమట. అవి : మాన్‌హాటన్, బ్రూక్లిన్, బ్రాంక్స్, క్వీన్స్, రిచ్మండ్. 1898 లో ఈ ఐదింటినీ కలిపి న్యూయార్కు అని పిలిచారు. ఇది అమెరికాకు 'వ్యాపార' రాజధాని అనీ, 'రంగస్థల' రాజధాని అనీ తెలుస్తున్నది. ప్రపంచంలోనే డెబ్బయ్ లక్షల పైగా జన సంఖ్య ఉన్న మూడు ముఖ్య నగరాల్లో ఇదొకటి కాగా మిగతావి టోక్యో, కలకత్తాలట! న్యూయార్కు మహా నగరాన్ని సక్రమంగా సంపూర్ణంగా చూడలంటే రెండు జీవిత కాలాలైతే గాని సరిపోవని అక్కినేని వారి అభిప్రాయం.

న్యూయార్కు నగరంలో మనుషులకన్న కార్లే ఎక్కువ కనిపించాయి రచయితకు. తక్కువ స్పీడులో కార్లు నడపడం ఇక్కడ తప్పుగా భావిస్తారట! ఒకరిని మించి మరొకరు కార్లను పెద్దగా, అధునాతనంగా రూపొందించుకోవడం వల్ల ఒక దశలో కార్ల పార్కింగ్‌కూడ చాల పెద్ద సమస్య అయింది. ఎంత పెద్దవీ అంటే ఇంకొన్నాళ్ళుపోతే కార్లలోనే డ్రాయింగు రూములూ, బార్, సినిమాహాళ్ళు అమరుస్తారేమోనని నాగేశ్వరరావుగారు ఆశ్చర్యం వ్యక్తం చేశారు. 1960 ప్రాంతాలనుండి యూరప్‌నుండి చిన్నకార్ల దాడి ప్రారంభమై పార్కింగ్ దృష్ట్యా చాలమంది వీటికోసం ఎగబడుతున్నారన్నారు.

లక్ష్మీనారాయణ రావుగారు 1952 లో అమెరికా వెళ్ళినప్పటినుండి అక్కినేనిగారు 1963 లో పర్యటించినప్పటిదాకా డాలరు ధర నిలకడగానే ఉన్నట్లు తెలుస్తున్నది. రావుగారు డాలరు ధర దాదాపు ఐదు రూపాయలని తెల్పగా, 1963 లో కూడ డాలరు ధర నాలుగు రూపాయల పదమూడు అణాలుంది. (రూ. 4-13-0) అంటే నాలుగు రూపాయల ఎనభై పైసలు. దాదాపు ఐదు రూపాయలు. అక్కినేని యాత్రాకాలం నాటికి నయాపైసలు మనదేశంలో చలామణి అవుతున్నప్పటికి ఇంకా పాత వాసనలు వదల్చుకోకుండా అణాలలోనే

లెక్కలు చూపారు. ఈయన ప్రయాణ ఖర్చులు కాకుండా అమెరికాలో ఉన్నన్ని రోజులు దినవెచ్చానికి రోజుకు ఇరవై డాలర్లు (దాదాపు 90 రూ॥) మంజూరు అయినాయట! హోటలు ఖర్చు మొదలైనవన్నీ ఇందులోంచే సరిపెట్టుకోవలసి ఉంటుంది. అందులో చాలమంది విదేశీయులు ఇక్కడవు రెండుజతల పెర్లిన్ డెకరాన్‌లలో వస్తారని వ్రాశారు. వెంటనే ఆరిపోయే సుగుణం ఉండడంవల్లా, ఉతుకోవడంలో అంతగా శ్రమపడవలసిన అవసరం లేనందువల్లా, లాండ్రీ ఖర్చు తగ్గించుకోవడానికి ఇక్కడ బట్టలు స్వయంగా ఉతుక్కుంటారు కూడ. ఇక్కడ ఇలాంటి పనులు చేసుకోవడం నామోషీకాదనీ, డిగ్నిటీ ఆఫ్ లేబర్ ఇక్కడ పాటించినంతగా మరెక్కడా ఉండదనీ నాగేశ్వరరావుగారి అభిప్రాయం.

## iv) అమెరికాలో 'మాలపేట' :

హార్లెమ్ అనేది నీగ్రోపేట ఈ పేటగుండా నాగేశ్వరరావుగారి ప్రయాణం సంభవించింది. అచ్చతెలుగులో చెప్పాలంటే మాలపేటకూ దీనికీ తేడా ఏమీ లేదంటూ ఇంకా అంతకన్న దుర్భరంగానే ఉందన్నాడు "ఆర్థికంగా సాంస్కృతికంగా అభివృద్ధి సాధించిన అమెరికాకు మాయని మచ్చ. అందరి అసహాయతకు ఒక నిదర్శనం, న్యూయార్కు మహానగరం నడిబొడ్డున ఉన్న దుష్టవ్రణం" అని ఈ పేటను గురించి నాగేశ్వరరావుగారు ఆవేదనతో అన్నమాటలు. హార్లెమ్ చూసిన తర్వాత ఎత్తైన మేడలను చూసేందుకు తల పైకెత్తలేకపోయారట! ఇది ఆయన వ్యక్తిత్వానికి నిదర్శనంగా నిలుస్తుంది.

ప్రపంచంలో కెల్ల పెద్ద డోమ్ 'సివిక్ ఎరీనా'. ఆదిమ మానవుడినుండి నేటిదాకా సృష్టి పరిణామాన్ని తెలిపే క్లీవ్‌లాండ్ మ్యూజియం, ప్రపంచంలో కెల్లా ఎత్తైన భవనం ఎంపైర్ స్టేట్ బిల్డింగ్ (దీని ఎత్తు 1472 అడుగులు, మొత్తం 104 అంతస్తులు), షికాగోలోని పెద్దబజారు వీధి, వదివేల సరస్సుల రాష్ట్రం మినియా పొలిస్ - ఇవీ నాగేశ్వరరావుగారు సందర్శించిన ప్రధాన ప్రదేశాలు.[11]

---

11. వీధి పొడవు 48 కి.మీ. (30 మైళ్ళు) అని పేజీ 69 లో.

డిస్నిలాండ్‌ను ప్రపంచపు వింతల్లో 'ఒకటి'గా పేర్కొనడం అనుచిత మంటూ నాగేశ్వరరావుగారు, ప్రపంచపు వింతలన్నీ దీనిలోనే ఉన్నాయి కాబట్టి దీన్ని 'వింతల తల మానికం' అనాలట.[12]

అమెరికాలో రైతుల జనాభా 9 శాతం మాత్రమేనంటూ, దేశం ఇంత అభివృద్ధి చెందినా అమాయకత్వంలో మనదేశంవాళ్ళకు ఏమాత్రం తీసిపో రన్నారు. పట్నం వచ్చిన రైతులు మన పల్లెటూరివాళ్ళ లాగే కార్లు, మేడలు చూసి ఆశ్చర్యంతో నోళ్ళు వెళ్ళబెట్టడం వ్యంగ్యంగా గమనించినట్లు వ్రాశారు. ఇంకా వింత నమ్మకాలు,వారాలు, శకునాలు చూడటం కూడ చేస్తారని నాగేశ్వర రావుగారు పేర్కొన్నారు.

## 5. ఎ.జి.కె. గారి 'నా అమెరికా పర్యటన'*

గోపాలకృష్ణమూర్తి గారు ప్రముఖ న్యాయవాది, పత్రికా రచయిత, వక్త, హ్యూమనిస్టు. అమెరికా ప్రభుత్వ ఆహ్వానంపై దాదాపు రెండు నెలలు అమెరికాలో పర్యటించి వచ్చారు. రచయిత కిది మొట్టమొదటి విదేశ పర్యటన. దేశాల తారతమ్యాలను, ప్రజల్లోని వ్యత్యాసాలను చూసిన తర్వాత ఈ సందారం రచయితకు కనువిప్పు కలిగించి. ఎట్లాగైనా తన అనుభవాలకు గ్రంథరూపమివ్వాలని తలచారు.[13] అందుకే యాత్రానంతరం మూడుసంవత్సరాలకు అంటే ఏప్రిల్ 1966లో 'నా అమెరికా పర్యటన' పేరుతో గ్రంథాన్ని ప్రచురింప చేశారు.

అమెరికాకు 15-8-1963 న బయలుదేరి 31-11-1963 న స్వదేశానికి మరలివచ్చారు. అమెరికాలో 14-10-1963 దాకా రెండునెలలు పర్యటించి,

---

12. వాల్ట్ డిస్కి ఈ వండర్ లాండ్‌ను 1955లో స్థాపించాడు

* ఆవుల గోపాల కృష్ణమూర్తి గారు.

13. "లోకాన్ని గ్రంథాల్లోనే చూచిన నాకు, ప్రత్యక్ష ప్రమాణంగా యీ పర్యటన చూపి, చెప్పించి, గ్రంథావలోకనకూ, దృశ్యావలోకనకూ వున్న వ్యత్యాసాన్ని చూపింది. దాని ప్రభావమే ఈ రచనకు పురికొల్పింది." ముందు మాట.

మిగతా మూడు వారాలు తిరుగు ప్రయాణంలో ఇతర దేశాల సందర్శనానికి కేటాయించారు. అవి : ఇంగ్లండు, హాలెండు, జర్మనీ, ఫ్రాన్సు దేశాలు.[14]

అమెరికా ప్రభుత్వం పంపిన ఆహ్వాన సారాంశం చదివితే రచయిత అమెరికాలో దర్శించి పరిశీలించిన అంశాల పరిధి తెలుస్తుంది: "మా దేశంలో అరవై రోజులు పర్యటించి వార్తాపత్రికలు, పత్రికారచన, న్యాయస్థానాలు, ఇంకా మీ అభిరుచికి అనుగుణమైన ఇతర అంశాలు పరిశీలించి, ఇష్టం వచ్చిన చోట్లు చూసి, నచ్చిన వాళ్ళను కలిసికొని రావచ్చు."

రెండు కోట్లకు తక్కువ కాని ఖరీదైన జెట్ బోయింగ్ విమానంలో (గాలి జంతువట!) ప్రయాణం మొదలైంది. బొంబాయిలో ఉదయం 4.45 గంటలకు బయలుదేరిన విమానం ఆరేడు వందల మైళ్ళ వేగంతో ప్రయాణించి న్యూయార్కును చేరుకునేసరికి అదే రోజు రాత్రి 7.15 గంటలు ఐంది. మొత్తం పదకొండువేల మైళ్ళ ప్రయాణం (17½ వేల కి.మీ.) పై లెక్కల ప్రకారం ఈ ప్రయాణం14½ గంటల ప్రయాణంగా అనిపించినా, నిజానికి యాత్రలో పట్టిన కాలం 27 గంటలు. భారతదేశానికి ప్రపంచదేశాలకూ మధ్యవున్న కాల వ్యత్యాసం దీనికి కారణం.

యాత్రా మార్గం : బొంబాయి - సౌదీ అరేబియాలోని 'దర్ హమ్' విమానాశ్రయం - కైరో - ఏథెన్సు - రోమ్ - ఫ్రాన్సు - అట్లాంటిక్ మహాసముద్రం - న్యూయార్క్.

అమెరికాలోని 50 రాష్ట్రాలు చూడాలని మనసులో ఉన్నా ఈ కొద్ది కాలంలో వీలు కాదని ముందుగానే ప్రణాళిక వేసుకొని కొన్నినగరాలే సందర్శించారు అవి: న్యూయార్కు, ఒహాయో, ఇల్లినాయిస్, విస్కాన్సన్, మిన్నెసోట, ఎరిజోనా, టెక్సాస్, టెన్నెసీ, ఆర్కాన్‌సాన్‌సాస్ రాష్ట్రాలు. మొత్తం 16 వేల కి మీ.ల పర్యటన.

---

14. ఇంగ్లండులో 11 రోజులు, హాలెండు, జర్మనీ, ఫ్రాన్సులలో నాలుగేసి రోజులు.

## i) నగరాల సందర్శన :

వాషింగ్టన్‌లో కేపిటల్ (పార్లమెంటు భవనం) కన్న ఎత్తుగా మరే భవనం నిర్మించకూడదన్న నిబంధన ఉందట. ఐతే ఇదే పుస్తకంలో మరోచోట అంతకన్న ఎత్తైన భవనాలు రెండు తన పర్యటన కాలంనాటికి కడుతున్నారని, అవి పూర్తైతే ఈ లోకోన్నత భవనం వెనకపడుతుందనీ మూర్తిగారు వ్రాశారు.

యాత్రాకాలంనాటికి అమెరికా అధ్యక్షుడు జాన్ ఎఫ్. కెన్నెడీ. వాషింగ్టన్‌లో సగం మంది నీగ్రోలేనట. ఆగస్టు 28 నాడు నీగ్రోలంతా గుంపుగా బయలుదేరి లింకన్ విగ్రహంవద్ద చేరి, ఆయన పాదాలవద్ద తమ 'హక్కుల పిటిషన్'ను వుంచి '1863లో ఇదే రోజు మీరు నీగ్రోవిమోచనను ప్రకటించారు. యింకా మేము విముక్తి పొందలేదు' అని గద్గద కంఠాలతో విన్నవించి, ఆ పిటిషన్‌ను వైట్‌హౌస్‌లోని కెనడీకి సమర్పించారట!

చికాగో నగరాన్ని చిలిపి నగరమంటారు రచయిత.అట్లాగే న్యూయార్క్ చిత్రనగరమట! చికాగోలో ఒక్కక్షణంలో వాతావరణంలో మార్పులు కన్పిస్తాయనీ, ఎండగా వుండి చటాలున వర్షం రావడం, మళ్ళీ అప్పుడే అనుకోకుండా చలిగాలి రివ్వున వీచటం అక్కడి ప్రకృతి చేసే చిలిపి చేష్టలుగా మూర్తిగారు అభివర్ణించారు.

శాన్‌ఫ్రాన్సిస్కోను 'అమెరికా నగర రాణి' అన్నారు. ఇది పశ్చిమ పట్టణమట! ఆసియా నుండి వస్తే శాన్‌ఫ్రాన్సిస్కో అమెరికాకు ద్వారం కాగా, యూరప్ నుండి వచ్చిన వాళ్ళకు న్యూయార్క్ ద్వారమవుతుందన్నారు. రోమ్ నగరం ఏడు కొండల మీద ఉంటే, శాన్‌ఫ్రాన్సిస్కో 32 కొండలమీద ఉంది. ఇక్కడ ఎండ, చలి రెండూ ఎక్కువేనని మూర్తిగారు వ్రాశారు. వ్యవసాయ క్షేత్రాలకు ప్రధాన కేంద్రమైన ఫ్రెజ్నో అందమైన చిన్న పట్టణం. కాలిఫోర్నియాకు కూడలి. ఆంధ్రదేశానికి తెనాలి ఎట్లో, కాలిఫోర్నియాకు ఈ పట్టణం అట్లాంటిదని తెల్పారు [15]

15. తెనాలిని ఆంధ్రా ప్యారిస్ అంటారు.

అమెరికా అంటేనే హడావిడికి పేరు ఈ దేశాన్ని సందర్శించిన యాత్రికులందరిదీ ఇదే అభిప్రాయం. అమెరికన్లు కాలం వృధాపుచ్చరు. వాళ్ళ నడక మన పరుగులాగ ఉంటుంది. ఐతే వారి స్వభావాలు మాత్రం 'శాలా వృతాలు' అని కృష్ణమూర్తిగారి అభిప్రాయం. లాస్ఏంజిల్సు ఈ వేగంలో, హడావిడిలో పైచేయిగా కనిపించింది[16] ప్రాచ్య సంపర్కంతో (చైనా, జపాను వాసనలతో) మురికివాసనకొట్టే పెద్ద నగరంగా లాస్ఏంజిల్సు రచయితకు దర్శనమిచ్చింది

## ii) నయాగరా జలపాతం :

రచయిత దీన్ని 'మెయిడ్ అఫ్ ది మిస్ట్'గా వర్ణించారు. మంచుబాల, అందాల రాణి, విద్యుత్ రాజు అని ఇతరులు వర్ణించిన సందర్భాలను గుర్తు చేశారు. ఐతే నయాగరా జలపాతం వర్ణించడానికంటే అనుభవించడానికే అనువుగా వుందని వ్రాశారు.

## iii) డిస్నీలాండ్ :

లోకవృత్తాన్ని యావత్తు సృష్టించాలని పనిబూని అమూల్యమైన ధనాన్ని వెచ్చించి వాల్టు డిస్నీ ఈ లాండ్‌ను నెలకొల్పాడు. రచయిత మాటల్లో డిస్నీ లాండ్ "పిల్లలకు చదువుల పంట, ఆనందడోలిక, వినోదసీమ, విహారక్షేత్రం, విశ్రాంతి కేంద్రం." వివిధ రకాల పాములు, జంతువులు, పక్షులు కదిలినట్లుగానే ఉండి, సజీవప్రాణులుగా కనిపిస్తాయట. కాని పరిశీలించి చూస్తే అంతా ప్లాస్టిక్ సరుకే కాబట్టి మూర్తి గారికి "ఓరి డిస్నీ! యెంత మోసం చేశావురా భాయ్!" అని అనాలనిపించిందని వ్రాశారు.

## iv) చికాగో సరస్సులు :

వీటి పరిమాణాన్ని బట్టి రచయిత వీటిని సరస్సులనడంలో అర్థం లేదంటూ అవి 'సరస్సులు కాని సముద్రాలు, సముద్రాలు కాని సరస్సులు' అని

---

16. మరోచోట మూర్తిగారు ఇక్కడి ప్రజల గురించి ముక్తసరిగా మూడు ముక్కల్లో చెప్పారు: "నడక వేగం, కారెక్కితే దౌడు, మాట్లాడితే నెమ్మది - యివీ వారి సంగతులు." పేజి 226.

చమత్కరించవలసి వచ్చింది. ఇది మూడు సరస్సుల కొలికి, కాబట్టి మూర్తి గారికి వీటి రూపు "మామిడి కాయల గుత్తిలా ప్రకృతిలో వ్రేలాడుతూ, దివి సీమల నుండి దిగివచ్చి, చికాగో ప్రాంతంలో మజిలీ కట్టినట్లు" అగుపించిందట!17

## v) మరికొన్ని అనుభవాలు :

ఇంగ్లీషు వారిలాగా గ్రాంథికలక్షణం కాదు అమెరికన్లది. ఉన్నది ఉన్నట్లు పలకాలన్న ధోరణి వీరిది. ఇంగ్లీషు వారు 'షెడ్యూలు' (Schedule) అని ఉచ్చరించే పదాన్ని అమెరికాలో 'స్కెడ్యూల్' అనటమే దీనికి ప్రత్యక్ష ఉదాహరణ.

అమెరికన్ సాంఘిక జీవనంలో 'డేటింగ్' అనేది ఒకటి. ఇది వారి ఆచారం. యుక్త వయస్సు వచ్చిన అమ్మాయి మరో యువకునితో సంబంధం పెట్టుకునే సమయంలో అబ్బాయి, అమ్మాయి ఇంటికి వెళ్ళి ఆమె తల్లిదండ్రుల అనుజ్ఞ కోరతాడు. వాళ్ళు అతన్ని పరిశీలించిన మీదట అతని వెంట అమ్మాయిని పంపడానికి అనుమతిస్తారు. వారిద్దరు కొన్నాళ్ళు షికార్లు కొట్టి, తర్వాత భార్యాభర్తలవుతారు.

అమెరికాలో నౌకర్లూ, యజమాని అన్న భావం కనపడదు. అక్కడ ప్రాయికంగా ఉన్న భావం 'మిస్టర్, మిస్టర్' సంబంధ బంధమని కృష్ణమూర్తి గారు వ్రాశారు.

50 రాష్ట్రాల ప్రజలందరి మాతృభాషలు వేర్వేరైనా అంతా అమెరికన్లమని భావిస్తూ ఇంగ్లీషు భాషనే మాట్లాడతారు. భిన్నత్వంలో ఏకత్వం అంటే ఇదే. అమెరికాలో ఒక మూలనుండి మరో మూలకు వేలాది కిలోమీటర్ల దూరం ఉన్నా వారి వేషధారణలో, ఆహార పానీయాల్లో మార్పు లేకపోవడం రచయితకు ఆశ్చర్యం కలిగించింది.

---

17. నా అమెరికా పర్యటన - పేజీ 228.

## vi) యాత్రా ధ్యేయం :

మూర్తి గారి ప్రయాణంలో గాని, పరిశీలనలో గాని ఉన్న ధ్యేయం ఒక్కటే: "నాకు తెలిసిన చెడుగులను వ్రాయలేదు. అది నా సంకల్పం కాదు. వారిని పొగడటం కాని, తెగడటం కాని నా చేయు పని కాదు " అన్నారు.[18]

అమెరికా అంతా సుందరవనం కాదు. ఎవరి లోటుపాట్లు వారివి. కాని మూర్తిగారు అక్కడ వున్న మంచినే గ్రహించి వ్రాయడానికి పూనుకున్నారు. దీనివల్ల పాఠపాఠకులకు ఏదైనా ప్రయోజనం కలగాలని ఆశించారు.

## 6. కొడాలి వారి 'అంతా కలిస్తే అమెరికా'*

అక్కినేని నాగేశ్వరరావుగారు వీలు చేసుకొని విశ్రాంతికోసం అమెరికాకు వెళ్ళాలనుకొని, ఆయనవెంట రచయితని రమ్మని ప్రత్యేకంగా ఆహ్వానించడం వల్ల కొడాలి వారికి అమెరికాను దర్శించే అవకాశం చిక్కింది. యాత్రానంతరం వెంకటేశ్వరరావుగారు తమ పర్యటనానుభవాలను నలుగురికి ఎరుక పరచాలనే ఉద్దేశ్యంతో గ్రంథస్థం చేశారు. 1974 లో ఈ పర్యటన జరుగగా, కొడాలివారు దీన్ని జూలై 1877లో ముద్రింపించారు. నవోదయ పబ్లిషర్స్ వారి ముద్రణ ఇది. ఈ గ్రంథంలో 176 పుటలున్నాయి.

కొడాలి వారికిది మొదటి విదేశానుభవం కాదు. 1966 లోనే 'హంగరీ వెళ్ళివచ్చి, ఆ అనుభవాలను తనవాళ్ళకు పంచియిచ్చానని వ్రాశారు కాని, అది గ్రంథరూపం ధరించిందీ లేనిదీ ఎక్కడా పేర్కొనలేదు.

అనుమోలు వెంకట సుబ్బారావు గారు కూడ వీరిద్దరితోపాటు యాత్ర చేశారు. 28-9-1974 నుండి 11-12-1974 దాకా రెండున్నర నెలల పర్యటన ఇది.

---

18. నా అమెరికా పర్యటన - పేజీ. 236.

* కొడాలి వెంకటేశ్వరరావు గారు.

## i) యాత్రా మార్గం-కాలమాన వ్యత్యాసం :

28-9-1974న రాత్రి 10-40 గంటలకు ఎయిర్ ఫ్రాన్స్ వారి జంబో జెట్ విమానంలో ఢిల్లీ నుండి ప్రయాణం. అబూదాబి, ఏథెన్స్‌ల గుండా ప్యారిస్ చేరుకునేసరికి వీళ్ళ గడియారాల్లో మధ్యాహ్నం సరిగ్గా 12 గంటలయిందట. కాని ప్యారిస్‌లో మాత్రం ఇంకా ఉదయం ఏడున్నర గంటలే అయిందన్నాడు. గడియారాలను నాలుగున్నర గంటలు వెనక్కి తిప్పుకున్నారు. తర్వాత లండన్, జెనీవాలలో మజిలీలు చేసి మళ్ళీ ప్యారిస్‌కే వచ్చి 30-9-74 న న్యూయార్కుకు బయలుదేరారు. ప్యారిస్ నుండి ఉదయం పది గంటలకు బయలుదేరి ప్యారిస్ కాలమానం ప్రకారం రాత్రి ఏడు గంటలకు న్యూయార్కు చేరుకున్నారు. ఐతే న్యూయార్కులో అప్పుడు పగలు రెండు గంటలే. ఐదు గంటల కాలం వెనక్కి తిప్పుకున్నారు. మొత్తమ్మీద ఈనాటి ప్రయాణంలో (ఉదయం 10 గంటలనుండి రాత్రి 8-30 గంటలవరకు) షికాగో చేరుకునే సరికి కాలమాన వత్యాసం మూలంగా మూడుసార్లు భోజనం చేయవలసి వచ్చిందని కొడాలివారు పేర్కొనారు. ఈ లెక్క ప్రకారం ఇండియాలో ఉదయం ఆరు గంటలైతే షికాగోలో సాయంకాలం 4-30 గంటలవుతుందట!

అమెరికాలో ఒక్క తపాలా సర్వీసు తప్ప మిగతావన్నీ ప్రైవేటు రంగంలోనే వున్నాయని వ్రాశాడు.

## ii) డిపార్టుమెంటల్ స్టోర్సు :

డిపార్టుమెంటల్ స్టోర్సు రెండువిధాలుగా ఉంటాయిక్కడ. ఒక్కటి 'మాల్స్' పద్ధతి. దీనిలో వివిధ రకాల వ్యాపార సంస్థలు ఒకే గొడుగు క్రింద ఉంటాయి రెండోది 'స్టోర్స్ పద్ధతి.' దీనిలో కొన్ని రకాల వస్తువులే దొరుకుతాయి. ఇలాంటి స్టోర్సుకు 'Pick and Pay' అనీ, 'Save and store' అనీ రకరకాల పేర్లు పెడతారట.

ఒక వస్తువుకు కొరత ఏర్పడ్డప్పుడు ఆ వస్తువు వాడకాన్ని తగ్గించడమే మంచి పద్ధతి. అలా సర్దుబాటు చేసుకోలేనివారు దాని స్థానంలో మరో వస్తువును ఉపయోగించుకొని తృప్తిపడాలి. ఇలా చేసినప్పుడే వస్తువుల ధరలను అదుపులో పెట్టవచ్చునన్నది అమెరికన్ల ఆలోచనా విధానం. ఐతే ఇట్లాంటి సూచనలు,

సంపాలు పత్రికలద్వారా ప్రజలకు అందుతూంటాయి. ప్రజలు చైతన్య స్ఫూర్తితో, వివేచనాశక్తితో ఆచరిస్తారు కూడ.

రచయిత 'వ్యాపారం మా ఊపిరి' అన్న శీర్షిక కింద పత్రికల ప్రచారానికి సంబంధించిన ఒక ఉదంతాన్ని ఉదహరించారు: "గత రెండు సంవత్సరాలుగా కార్ల ధర పెరుగుతూనే వుందట. అందుకని దాని అదుపు కోసం కార్లు కొనవద్దని విధిగా ఒక ప్రచారం జరిగింది. అంతే! కార్లు ఉత్పత్తి స్థానంలోను, పంపిణీ కేంద్రంలోను కుప్పలు కుప్పలుగా వుండి పోయాయి. చెలామణీ లేక ఉత్పత్తినే నిలిపి వేయవలసిన స్థితి కలిగింది వారికి. అంతటి జాగరూకత, వివేచనాశక్తి అమెరికన్‌లలో వుంది."

## iii) బేబి సిట్టింగ్ :

ప్రసవానంతరం కొన్ని నెలలపాటు బిడ్డల ఆలన పాలనలో సమయ పాలన చేయడం అమెరికన్ల జీవన పద్ధతికి అనుకూలమైంది కాదు. ఐదారు కుటుంబాల వారు తమ పిల్లలను ఒక స్త్రీకి అప్పగించి, తమ తమ పనుల్లోకి వెళ్ళి తిరిగి వచ్చేటప్పుడు బిడ్డలను తమ వెంట తెచ్చుకుంటారు. ఆ స్త్రీకి ఈ సేవలగ్గాను కొంత ప్రతిఫలం ముడుతుంది. ఈ విధమైన ఏర్పాటుకే 'బేబీ సిటింగ్' అని పేరు పెట్టుకున్నారు. చిన్నప్పటి నుండే పిల్లలకు స్వతంత్రంగా జీవించే అలవాటు చేస్తూ యుక్త వయస్సు వచ్చేదాకా వారి బాధ్యతను వహిస్తారు. ఆ తర్వాత 'ఎవరికి వారే అమెరికా తీరే' అని కొడాలి వ్రాశారు.

క్లీవ్ లాండ్‌లో అక్కినేని నాగేశ్వరరావు గారికి 'ఓపెన్ హార్ట్ సర్జరీ' జరిగింది.[19] ఆయనకు నాలుగు వారాల విశ్రాంతి అవసరం అన్నారు కాబట్టి తర్వాతి పర్యటనలో ఆయన ప్రస్తావన కనపడదు.

## v) మెక్సికన్ రెస్టారెంట్లు :

లాస్ ఏంజిల్స్ శాన్ ఫ్రాన్సిస్కోకు 750 కి. మీ. (470 మైళ్ళు) ఈ దూరాన్ని రచయిత అద్దెకారులో అధిగమించారు. మెక్సికన్ లంచ్ ఎలా వుంటుందో

19. క్లీవ్ ల్యాండ్ షికాగోకు 565 కి. మీ. (350 మైళ్ళు).

చూడాలని ఒక మెక్సికన్ 'రెస్టారెంటు'కు ప్రత్యేకించివెళ్ళారు. మెక్సికన్లు అమెరికన్ల లాగ గోధుమలు తినరు. ఎక్కువగా జొన్నరవ్వతో చేసిన జావ, జొన్న రొట్టెలు తింటారు. ఐతే వీళ్ళు మనకన్నా ఎక్కువ కారం తింటారట!

సెయింట్ లూయిస్‌ను లింకన్ మెట్టినభూమి (Land of Lincoln) అంటారట! ఇక్కడ పెట్రోలు గాలను ధర 50 సెంట్లు. మన కరెన్సీ విలువలో చెప్పాలంటే 3-75 రూ॥లు. కాని ఇదే సమయంలో (1974 లో) ఇండియాలోని ధర 16/- రూ. అని రావుగారు పేర్కొన్నారు.

## v) పోలీసుల నిజాయితీ :

సెయింట్ లూయిస్‌లో పోలీసులు చట్టాన్ని అమలు చేయడానికే రాత్రిళ్ళు గస్తీ తిరుగుతారట! ఇక్కడ చట్టం పూర్తిగా అమలుపరచబడుతుంది. రాత్రి 11 గంటల తర్వాత తిరగడం, మద్యం సేవించి వాహనాలు నడపడం, చిన్న పిల్లలు త్రాగడం లాంటివన్నీ నేరాలే. పోలీసు కంట్రోలు రూములోని టి.వి.లో పోలీసులు ఏ ప్రాంతంలో ఉన్నదీ తెలుసుకొని అధికారులు, అవసరాన్నిబట్టి సమీపంలోని విధి నిర్వహణాధికారులచే పోలీసులకు 'వైర్‌లెస్' ఇప్పిస్తారు. అందుకే పోలీసుల రక్షణ ప్రజలకు వెంటనే అందుతుంది. గంటకు 88 కి. మీ. (55 మైళ్ళు) వేగం దాటితే పోలీసులు జరిమానా విధిస్తారు. కారున్నవాళ్ళు ఇట్లాంటి తప్పులు సంవత్సరంలో 12కు మించి చేయరాదు. నెలలో రెండుసార్లకు మించరాదు. దీనిలో ఏ ఒక్కటి జరిగినా తాత్కాలికంగా లైసెన్సు రద్దు చేస్తారు. కొన్ని సందర్భాల్లో లైసెన్సు రద్దు భీమాప్రీమియం పెరుగుదలకు కారణమౌతుంది.

వెంకటేశ్వరరావు తమ పర్యటనలో తటస్థించిన ప్రాంతాలకు వ్యవహారంలో ఉన్న పేర్లనుకూడ తెలిసినంతవరకు ఎరుకపరిచారు.

నెవాడా రాష్ట్రంలోని లాస్ వెగాస్‌కు జూదం అని అర్థమట! అరిజోనా రాష్ట్రానికి ముఖ్యపట్టణమైన ఫీనిక్స్‌కు 'సూర్యలోయ' అనీ, మిచిగన్ రాష్ట్రంలోని 'డెట్రాయిట్' నగరానికి 'ప్రవహించే కార్లు' అనీ, సిన్‌సినాటి (Tri-state)కి ఏడుకొండల పట్టణం' (City of seven Hills) అనే పేరున్నట్లు తెల్పాడు. నయాగరా అంటే 'జలగర్జనం' అనికూడ ఈయనే వ్రాశారు.

అమెరికా పర్యటన తర్వాత వెంకటేశ్వరరావుగారికి కలిగిన అభిప్రాయాలివి: "వారు (అమెరికన్లు) నిజం గ్రహించి వెలుగు (మన సంస్కృతి) వైపుకు అడుగువేస్తున్నారు, మనం నిజాన్ని విస్మరించి చీకటివైపుగా ప్రయాణం చేస్తున్నాము. వారు మన సంస్కృతీ సంస్కారాలకు ఆశపడుతున్నారు. మనం వారి భేషజ నాగరికతకు వ్యామోహపడుతున్నాము."

నిష్పక్షపాత ధోరణితో వ్రాసిన యాత్రికుల రచనలవల్ల 'దూరపు కొండలు నునుపు' అనే ఆకర్షణ తగ్గి, అమెరికా వ్యాపార సంస్కృతి కంటే మన ఆధ్యాత్మిక సంస్కృతే గొప్పదన్న భావం భారతీయులకు కలగాలని ఆశించడంలో తప్పులేదు.

## 7. రుక్మిణమ్మగారి 'నా అమెరికా యాత్ర' :*

శ్రీమతి పి. రుక్మిణమ్మగారు 1975లో అమెరికా యాత్ర చేసి, తన అనుభవాలను వ్యాసంగా వ్రాశారు. శ్రీకాళహస్తి తాలూకా రచయితల సంఘం వారు అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో మహిళలచే వ్రాయబడిన వ్యాసాల కింద ఈమె వ్యాసాన్ని పరిగణిస్తూ, 1976లో ఈ వ్యాసాన్ని పుస్తకంగా ప్రచురించారు. 27 పుటల చిన్న పుస్తకమిది.

రచయిత్రి శ్రీకాళహస్తి రచయితల సంఘంలో సభ్యురాలు. భర్త డా॥ పి. వెంకట్రామయ్యగారు సుప్రసిద్ధ వైద్యులు. ఈమె మద్రాసులోని లేడీ వెల్లింగ్టన్ ట్రైనింగ్ కళాశాలలో విద్యాభ్యాసం చేశారు. ఈమె కుమారుడు అమెరికాలో డాక్టరు. కాబట్టి ఈ విధంగానైనా అమెరికాను సందర్శించాలన్న కోరికతో ఒంటరిగా ప్రయాణించారు ప్రయాణ మధ్యంలో ఒక అరవ అమ్మాయి, తెలుగు అమ్మాయి కలిశారు. రుక్మిణమ్మగారు తమ 61వ యేట ఈ యాత్ర తలపెట్టారు. ఈమెకిది మొట్టమొదటి విదేశీ యాత్ర.

### i) ప్రయాణమార్గం :

మద్రాసులో 17-4-1975వ తేదిన ఉదయం 10-15 గంటలకు బయలుదేరి గంటన్నరలో బొంబాయికి చేరుకున్నారు. అక్కడి నుండి ఎయిరిండియా ప్లేన్‌లో ప్రయాణమై కువైట్, జర్మనీ, ప్యారిస్, లండన్‌లగుండా అట్లాంటిక్ మహాసముద్రం మీదుగా న్యూయార్కుకు చేరుకున్నారు. మధ్యలో పేర్కొనబడిన విమానాశ్రయాలలో విమానం కొంతసేపు ఆగిందట.

---

* శ్రీమతి పరమాత్మని రుక్మిణమ్మగారు.

నయాగరా జలపాతం, ఫ్లోరిడా, డిస్నీలాండ్స్, వాషింగ్టన్‌లో కెన్నెడీ సమాధి-రచయిత్రి అమెరికాలో దర్శించిన ముఖ్యమైన ప్రదేశాలు.

## ii) అమెరికా విశేషాలు :

అమెరికాలో రెస్ట్ ఏరియాలో లేదా పిక్నిక్ ఏరియాలో తప్ప ఎక్కడపడితే అక్కడ భోజనం చేయకూడదట. హైవే మీద ఈ స్థలాలు ఎక్కడ ఉండేదీ బోర్డులు పెట్టి సూచిస్తారు.

వాషింగ్టన్‌లో కెన్నెడీ సమాధి వద్ద గంట గంటకు గార్డు మారుతూ ఉంటాడు. మారేముందు కొత్తగా డ్యూటీలోకి వచ్చేవాడు మార్చింగ్ చేసి సెల్యూట్ కొడతాడు. సమాధి దగ్గర ఎప్పుడూ జ్యోతి ప్రకాశిస్తూ ఉంటుంది. ఇది లెనిన్ సమాధి గురించిన ఏర్పాట్లలాగే అనిపిస్తుంది.

ఇండియా సామానులమ్మే (పప్పులు, మిరపకాయలు మొదలగునవి) అంగళ్ళు న్యూయార్కులో తప్ప ఎక్కడా కనిపించలేదని రచయిత్రి పరిశీలనలో తేలింది. అక్కడి మద్రాసు వుడ్ లాండ్స్ హోటల్లో ఒక మసాలా దోసెకు రెండు డాలర్లట. అంటే అప్పటి కరెన్సీలో 17 రూపాయలన్న మాట!

జార్జి వాషింగ్టన్ బ్రిడ్జి దగ్గరి టోల్‌గేట్ పన్ను చెల్లించే విధానం మనకు ఆశ్చర్యం కలిగిస్తుంద. కారులోనుండి దిగే అవసరం లేకుండానే బ్రిడ్జి స్తంభాల దగ్గరి బూత్‌లలో టోల్‌గేట్ పన్ను కట్టవచ్చు. ఇంకా కొన్ని చోట్ల బుట్లలాంటి వుంటాయి పన్ను వసూలుకు. ఎప్పుడూ ఎర్రలైటు వెలుగుతూంటుంది. సరిపడే డబ్బు దానిలో వేయగానే 'థాంక్యూ' అని పచ్చలైటు వెలుగుతుంది. కారు దాటి పోగానే మళ్ళీ ఎర్రలైటు మామూలే. ఐతే ఒకవేళ టోలు పన్ను వేయడం మరచినా, వేసేటప్పుడు కింద పడిపోయినా సైరన్ వినపడుతుంది. వెంటనే కారు నెంబరు ఆటోమేటిగ్గా ఫోటో తీయబడుతుంది.20 అప్పుడు కారు ఆసామీలకు పెనాల్టీ కట్టాల్సిందిగా పోస్టులో కాగితాలు వస్తాయి.

---

20. డాక్టర్ కొల్లి శ్రీకృష్ణకుమారి గారు భర్తతో కలిసి 1988లో ఆస్ట్రేలియా పర్యటించి వనితాజ్యోతిలో కొన్ని వారాలపాటు వ్యాసాలు రచించారు. ఆ శీర్షిక పేరు "నేను చూసిన ఆస్ట్రేలియా." ఈ వ్యాసాల్లో కార్ల పార్కింగ్ గురించి వ్రాస్తూ నిర్ణీత స్థలంలో కారు పార్కింగ్‌కి అక్కడే ఉండే బాక్స్‌లో రేటు ప్రకారం డాలర్లు వేయాలనీ, ఒక్క గంటకు ఒక డాలర్‌వేసి రెండు మూడు గంటలసేపు ఉంచినట్లయితే నిర్ణీతకాలం కాగానే పోలీసులు వచ్చి కారుకి ఓ స్టిక్కర్ అంటించి పోతారనీ, అప్పుడు చచ్చినట్లు ఫైన్ కట్టుకోవాలనీ పేర్కొన్నారు. - వనితాజ్యోతి, డిసెంబరు, 1988 సంచిక.

### iii) అమెరికాలో 'అంగళ్ళు' :

ఇక్కడి అంగళ్ళ పద్ధతులు గమనింపదగ్గవి: సామాన్లన్నీ వేర్వేరు అంగళ్ళలో ఉంటాయి. ఒక తోపుడుబండీ తీసుకొని కావలసిన సరుకులన్నీ దాన్లో వేసుకొని కౌంటర్ దగ్గరికి పోవాలి. వాళ్ళు బిల్లు ఇస్తారు డబ్బు చెల్లించి అదే బండీలో సామాను కారుదాకా తెచ్చుకొని బండీని అక్కడే వదలివేయవచ్చునట.

అంగళ్ళలోకి చెప్పులు వేసుకొని రావాలని బోర్డులు కట్టి ఉంచుతారు. కాళ్ళకేదైనా గుచ్చుకుంటే అంగడి యజమానుల మీద కేసుపెట్టే వీలుండడమే దీనికి కారణం. అందుకని చెప్పులు లేని వారికి అక్కడ ప్రవేశం లేదని రుక్మిణమ్మ గారు తెల్పారు.

ఉపలబ్ధ సమాచారాన్ని బట్టి అమెరికా గురించి యాత్రా గ్రంథం వ్రాసిన మొట్టమెదటి తెలుగు మహిళ శ్రీమతి పి రుక్మిణమ్మ ఇదొక్కటే ఈ యాత్రలోని ప్రత్యేకత. అంతకు మించి విశేష వివరాలేవీ దీనిలో లేవు.

అమెరికా యాత్ర చేసి వచ్చిన తర్వాత అక్కడి వివరాలతో, తమ యాత్రానుభవాలను జోడించి రచయితలు కొందరు పుస్తకరూపంలో అచ్చొత్తించారు. అందువల్ల వాటిని ప్రత్యేకంగా పేర్కొనడం జరిగింది. మరి కొంత మంది కేవలం వ్యాసాల రూపంలో రచించారు. వారి యాత్రావిశేషాలను ఈ శీర్షిక క్రింద విడిగా వివరించడం జరుగుతుంది.

## 8. డా. దాశరథి 'అమెరికా సందర్శనం'*

యు. కె. ఆంధ్ర సాంస్కృతిక సంఘం అధ్యక్షులు డా. గూటాల కృష్ణమూర్తి గారి ఆహ్వానం మీద దాశరథి గారు ఇంగ్లండుకు వెళ్ళారు. ఇక్కడ ఉండగానే అమెరికా, కెనడా పర్యటన కార్యక్రమం తేదీలు ఖాయపరచడం జరిగిందనీ, వీలైనంత త్వరలో బయలుదేరి రమ్మనీ దాశరథికి న్యూయార్కు నుండి డా కాకర్ల సుబ్బారావు గారు ఫోను చేసి ఆహ్వానించారు.[21] ఈ రెండు దేశాల పర్యటన వివరాలను దాశరథి 'విపులాచ పృథ్వీ' (నా విదేశయాత్రా విశేషాలు) పేరుతో తమ 'వ్యాసపీఠం'లో వివరించారు. 28-9-1978 నుండి 19-10-1978 వరకు అమెరికాలో పర్యటించారు.

---

* డా. దాశరథి కృష్ణమాచార్యులు, డి.లిట్.

21. సుబ్బారావు గారు న్యూయార్కులోని హిందూ టెంపుల్ సొసైటీకి, ఉత్తర అమెరికా తెలుగు అసోయేషన్‌కు అధ్యక్షులు.

లండన్ నుండి అట్లాంటిక్ మహా సముద్రం మీద ఎనిమిది గంటలు ప్రయాణం చేసి విమానం న్యూయార్కులోని జాన్ ఎఫ్ కెనడీ విమానాశ్రయంలో దిగింది.

నయాగరా జలపాతాన్ని దగ్గర నుండి చూస్తే గుర్రపు నాడా వంటి ఆకారంలో (ముఖ్యంగా కెనడా వైపు నుండి చూస్తే) చాలా బాగుంటుందట. ఇక్కడ ఒంటరిగా వచ్చినవాళ్ళు జత కలుపుకుంటారనీ, జంటగా వచ్చినవారు ప్రేమగీతం పాడుకుంటారనీ, 'చలి నెదిరించుట కోసం చెలిని మనసు వెతుకుతుంది' అని కవిత నాలపించారు దాశరథి గారు.

పిట్స్ బర్గులో పెన్‌హిల్ మీద శ్రీ వెంకటేశ్వరస్వామి ఆలయంలో అక్టోబర్ 2 నుండి 10 దాకా బ్రహ్మోత్సవాలు జరపడం మనకెంతో ఆశ్చర్యాన్ని కలిగించే విషయం. అక్కడి తెలుగువాళ్ళ కొరకు ఏర్పడ్డ 'అమెరికా తిరుపతి' అది.

వాషింగ్టన్‌లో తెలుగు కల్చరల్ సొసైటీ అధ్యక్షులు జేమ్సు ప్రసాదరావు గారికి దాశరథి గారు స్పానిష్ లాగా కనిపించారట! ఆ నడక, ఆ చామనచాయ, ఆ దుస్తులు- ఇవన్నీ ప్రసాదరావుగారికి అట్లా అనిపింపజేశాయని ఆయనే చెప్పుకున్నారు.

దాశరథి గారు యాత్రాకాలం నాటికి ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి కాబట్టి మన రాష్ట్రంలో తెలుగు భాష అధికార భాషగా రూపొందించడానికి ప్రభుత్వం చేస్తున్న కృషిని గురించి వాషింగ్టన్‌లో తెలుగు సోదరులకు వివరించారు.

విదేశాలకు వెళ్ళి స్థిరపడిన తెలుగు వారు తమ తమ రంగాల్లో స్థానికులతో సమానంగాను, కొన్ని సందర్భాల్లో పైచేయిగా కూడ ఉంటున్నారట. అమెరికాలో స్థిరపడి పోయిన వారి పిల్లల భవిష్యత్తు గురించి కొంత ఆలోచించాలన్నారు దాశరథిగారు. వారిలో కొద్దిమంది మాత్రమే తల్లిదండ్రుల ప్రోత్సాహం వల్ల తెలుగు మాట్లాడుతున్నారట చాలా ఇళ్ళలో పెద్దలు తెలుగులో ప్రశ్నిస్తే పిల్లలు ఇంగ్లీషులో జవాబు చెపుతారట. ఇది అక్కడి వాతావరణ ప్రభావం. ఇంగ్లండు, అమెరికా లాంటి పాశ్చాత్య దేశాలకు ఈ తరంలోనే మనవాళ్ళు వెళ్ళడం వల్ల పెద్దవాళ్ళు ఇంకా తెలుగుదేశంతో సంబంధాలు పోగొట్టుకోలేదు అందుకే దాశరథి గారికి చాలా చోట్ల సభలూ, సమావేశాలు ఏర్పాటు చేసి సన్మానాలు చేశారు. ఇంకా కొన్ని తరాలు గడిస్తే ఆగ్నేయాసియా దేశాల్లో స్థిరపడ్డ వాళ్ళ లాగే ఆచార సంప్రదాయాల్లో, భాషోచ్చారణలో మార్పు వస్తుందేమోనని దాశరథి గారు ఆందోళన చెందారు.

తిరుగు ప్రయాణంలో న్యూయార్కు నుండి సరాసరి లండన్ మీదుగా ఢిల్లీ చేరుకున్నారు.

## 9. సినారె 'పాశ్చాత్య దేశాల్లో 50 రోజులు'*

నారాయణరెడ్డిగారు 1981 లో నాలుగు వారాలపాటు అమెరికాలోని 15 నగరాలను సందర్శించి, తమ పర్యటనానుభవాలను 'దిన దిన జ్ఞాపికలు'గా వ్రాసుకొని యాత్రానంతరం వ్యాసాలుగా ప్రకటించారు. 19-8-1981 సంచిక నుండి ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో వరుసగా ఆరువారాలపాటు ధారావాహికంగా ప్రచురింపబడ్డాయి 1976 లో మలేషియాకు, 1979 లో రష్యాకు పర్యటించినప్పుడు కూడ ఇట్లాగే డైరీలలో క్లుప్తంగా సందర్శన విశేషాలు వ్రాసుకొని ప్రకటించారు తెలుగులో యాత్రాకథన వాఙ్మయ శాఖను (ట్రావెలోగ్) పరిపుష్టం చేయాలనే దృష్టితో చేసిన ప్రయత్నంగా దీన్ని పేర్కొన్నారు.

19 5-1981 నాడు బొంబాయి నుండి ఎయిర్ ఇండియా విమానంలో బయలుదేరి కువైట్, లండన్‌లలో విరామాలతో న్యూయార్కు చేరుకున్నారు. అమెరికాలో సినారె సందర్శించిన నగరాలివి : చికాగో, పిట్స్‌బర్గ్, లాస్‌ఏంజిల్స్, లాస్ వేగాస్, డెట్రాయిట్, నయాగరా, హ్యూస్టన్, న్యూయార్కు, వాషింగ్టన్, బోస్టన్. తిరుగు ప్రయాణంలో ప్యారిస్, లండన్‌లను సందర్శించారు. ఆ వివరాలు వేరే ప్రకరణంలో ఉంటాయి.

వాల్ట్ డిస్నీ కళాభిరుచికి, వినూత్న విషయసంకలన సంకల్పానికి వేయి ముఖాలుగా కనిపించే విచిత్ర జగత్తుగా డిస్నీ లాండ్‌ను అభివర్ణించారు. అయితే అప్పుడు రెడ్డిగారికి విస్మయం, విభీతి, గగుర్పాటు, విన్నపాటు - ఈ అవస్థలన్నీ ఒకదాని వెంట ఒకటి స్ఫురించాయి. ఆ అనుభవాలను అక్షరాల్లోకి ఎక్కించాలని చూస్తే 'జిలుగు ముత్యాల్లాగ' జారిపోతున్నాయని పేర్కొన్నారు.

లాస్ వెగాస్‌లో రాత్రి 11 గంటలకు లిడో హోటల్‌కు వెళ్ళారు. కొందరు యువతులు అక్కడ అర్ధ నగ్నంగా నటిస్తున్నా అశ్లీలంగా తోచలేదంటూ 'కదిలే పాలరాతి బొమ్మల్ని, నాట్యం చేసే కమనీయ శిల్పాల్ని చూస్తున్నట్టే' అనిపించిందన్నారు! నల్లని రాళ్ళలో కూడ గుండెల మ్రోతలు వినగలిగిన మహా కవికి ఆ యువతులు కదిలే పాలరాతి 'బొమ్మలు'గా కనిపించడంలో ఆశ్చర్యమేమీ లేదు.

* జ్ఞాన పీఠ అవార్డు గ్రహీత డా. సింగిరెడ్డి నారాయణరెడ్డిగారు.

అమెరికాలో అనేక జాతులవారు నివసిస్తున్నా వారు ప్రధానంగా మాట్లాడేది ఇంగ్లీషే. నారాయణరెడ్డి గారు ఒక ముస్లిం అమ్మాయిని ఉర్దూలో మాట్లాడిస్తే ఆమె ఆంగ్లీములో జవాబు చెప్పిందట. తెలుగు వాళ్ళ పిల్లలు కూడ దీనికేమీ అపవాదం కాదంటూ "ఇంగ్లీషు మహానది. తెలుగేమో పిల్ల కాలువ ఇక్కడున్నప్పుడు తప్పదు కదా ఆ మహానదిని అనుసరింపక" అని వారిని వెనుకేసుకొచ్చారు.

శాన్‌ఫ్రాన్సిస్కో కాస్మోపాలిటన్ నగరం. ఈ నగరం పేరు స్పానిష్ భాషాపదమట. అందుకేనేమో 'ఇక్కడ స్పానిష్ ప్రభావమెక్కువ' అని వ్రాశారు.

లాస్‌వేగాస్ నుండి నార్త్‌వెస్ట్ ఏర్‌లైన్స్ వారి విమానంలో శాన్‌ఫ్రాన్సిస్కోకు వెళుతూ పసిఫిక్ మహాసముద్రం మీద అస్తమయ సూర్యున్ని చూస్తూ పొందిన అనుభూతి రెడ్డిగారి సునిశిత పరిశీలనకు, కవితా హృదయానికి నిదర్శనంగా నిలుస్తుంది: "అస్తమయ సూర్యబింబం మొదట మండుతున్న హారతి పళ్ళెంలా సముద్రం నీటి అంచుమీద నిలిచి పోయింది. క్రమంగా సైజుతగ్గి కుంగిపోయి చివరికి క్షణాన ఒక చిన్న నిప్పుగీతలా కనిపించింది. ఆ తదుపరి ఆవరించింది ఒకే నీలిమ. ఆకాశానికీ సముద్రానికీ మధ్యనున్న ఎల్లలు ఒట్టి కల్ల అనీ, చీకట్లో లోకం సరిహద్దులన్నీ తల్లి కోడి రెక్కల మాటున ఒదిగే పిల్లల్లా ఒదిగిపడి ఉంటాయనీ మరోసారి నా మనసు పలికింది."[22]

'కర్పూర వసంతరాయలు' కావ్యగానం రికార్డింగు అమెరికా పర్యటనలో రెడ్డిగారు ఊహించని 'సుమధుర సంఘటన.'

## 10. ఆరుద్ర 'అమెరికా పర్యటన అనుభవాలు'

ఆగస్టు 1987 నుండి నాలుగు నెలలపాటు డా. ఆరుద్రగారు అమెరికాలో పర్యటించి వారి అనుభవాలను వ్యాసరూపంలో ప్రకటించారు. ఆ వ్యాసం పేరు 'నా అమెరికా పర్యటన అనుభవాలు.' ఇది విజయచిత్ర మాసపత్రిక ఫిబ్రవరి - 1988 సంచికలో ప్రకటింపబడింది.

అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో న్యూజెర్సీ ఒకటి. అక్కడ ఆరుద్రగారి కూతురు ఉంది. ఆరుద్రగారు ఈ పర్యటన చేయడానికి ప్రధాన కారణం : అక్కడ కొన్నాళ్ళు విశ్రాంతి తీసుకుందామని. ఐతే అమెరికాలోని విశ్వవిద్యాలయాల్లో పనిచేసే ప్రొఫెసర్లు కొంతమంది ఆయాసందర్భాల్లో వీరిని ఉపన్య

---

22. ఆంధ్రప్రభ సచిత్రవార పత్రిక. 26-8-1981 సంచిక.

సించవలసినదిగా ఆహ్వానించారట ఆ విధంగానే ఆరుద్రగారి రాక గురించి ముందుగా ఆ ప్రొఫెసర్లకు డా॥ పప్పు వేణుగోపాలరావుగారు తెలియజేశారు. ఆరుద్రగారు దాదాపు 25 నగరాల్లో తెలుగువారి సభలలో, సమావేశాల్లో ప్రసంగించి, స్వదేశంపట్ల, స్వీయ సంస్కృతి పట్ల అక్కడి తెలుగువారి మమకారానికి పులకించిపోయారు.

ఆగస్టు నెలలో అమెరికాలోని విశ్వవిద్యాలయాలకు సెలవు దినాలు కాబట్టి ఈ నెలలో విహారయాత్రచేసి, పరిశోధన కూడ కొనసాగించారు.

న్యూయార్కు నగరానికి కారులో వెళితే పార్కింగ్ చోటును వెతుక్కోవటానికే చాల టైం పడుతుందని భావించి బస్సులోనే వెళ్ళారు. అమెరికాలో అందరూ దూరాన్ని కాలంతో కొలుస్తారంటూ 'న్యూజెర్సీకి న్యూయార్కు నగరం అరగంట ముప్పావుగంట దూరంలో వుంద'న్నారు.[23]

ఆధునిక కాలంలో రెండు గంటలు దాటకుండా నాటకాలు ప్రదర్శింపబడాలన్న నియమం ఉన్నా, అమెరికాలో మహాభారత రూపకాన్ని తొమ్మిది గంటలు ప్రదర్శించడం అపూర్వ సంఘటనగా ఆరుద్రగారు భావించారు. ఈ భారతీయ ఇతిహాస ప్రదర్శనలో ద్రౌపదివేషం వేసిన శారాబాయి తప్ప మిగతా వారంతా అంతర్జాతీయ దేశాలకు చెందిన నటీనటులేనట! 'హాలులో వెయ్యిన్నర పైచిలుకు తెలుగువారు ఎంతో శ్రద్ధతో తెల్లవార్లూ కూచుని నాటకాన్ని దర్శించడం చూస్తే అమెరికాలోని తెలుగు ప్రజలు ఇంకా తమ సంస్కృతీ విలువల పట్ల గౌరవాన్ని వీడనట్లు తోస్తుంది' అని వ్రాశారు.

అమెరికాలో వారానికి ఐదు రోజులే పని. మిగతా శనాదివారాలు వారికి విశ్రాంతి. ఐతే అక్కడి తెలుగువారు ఈ రెండు రోజులను స్వస్థాన వేషభాషా సంస్కృతుల కోసం వెచ్చిస్తారంటూ, ఆంధ్రదేశం నుండి కవిగాని కళాకారుడు కాని ఎవరు వచ్చినా వారిని ఆదరాభిమానాలతో ఆహ్వానిస్తూ, తెలుగు సంస్కృతీ పరిరక్షణకు సర్వవిధాల కృషిచేస్తారని వారి ప్రయత్నాలను ఆరుద్రగారు ప్రశంసించారు.

---

23. ఏనుగుల వీరాస్వామయ్యగారి యాత్రా కాలం నాడు కూడ ఇదే పద్ధతి ఉంది. ఆయన దూరాన్ని గడియలలో లెక్కగట్టాడు.

## 11. కామేశ్వరిగారి 'నా విదేశ యాత్రానుభవాలు'*

డి. కామేశ్వరిగారు జూలై 5, 1987 న బొంబాయి నుండి విమానంలో బయలుదేరి లండన్, యూరప్ దేశాలు పర్యటించి అమెరికాను సందర్శించారు. యాత్రానంతరం తమ పర్యటన అనుభవాలను 'నా విదేశ యాత్రానుభవాలు' పేరుతో వ్యాసాలుగా రచించారు. ఇవి 'వనిత' మాసపత్రికలో జనవరి, 1988 నుండి సెప్టెంబరు 1988 సంచికదాకా వరుసగా ప్రకటింపబడ్డాయి.

కామేశ్వరిగారు తాను చూసిన స్థలాలకు ఎక్కువ ప్రాముఖ్యమివ్వకుండా అక్కడి ప్రజల గురించి, వారి పురోభివృద్ధి గురించి, విదేశాలు చూడాలనుకున్న వారికి ఎలా వెళితే సౌకర్యమో, డబ్బు ఆదా అవుతుందో - వీటి గురించి రచించడానికి పూనుకున్నారు.

ఒంటరిగా వెళితే డబ్బు బాగా ఖర్చవుతుందనీ, భద్రత కూడా ఉండదనీ భావించి వీరు యూరప్ టి.సి.ఐ గ్రూపు ఆర్గనైజ్‌డ్ టూర్‌లో ప్రయాణించారు. జూన్ నుండి సెప్టెంబరు వరకు యూరప్, అమెరికాలో ఎండాకాలం. అది టూరిస్ట్ సీజన్ కూడా. అందుకే చాలమంది ఈ నెలల్లోనే ప్రయాణం చేయడానికి ఇష్టపడతారట. ఐతే బస వసతి, భోజన సౌకర్యం, రానుపోను ప్లేను టిక్కెట్లు అన్నింటికీ కలిపి యూరప్, అమెరికాల్లో యాత్ర చేస్తే దాదాపు నలభై వేలు ఖర్చవుతుందన్నారు. అది కూడ వెళ్ళిన చోటల్లా బంధువులుండి, వాళ్ళ యింట్లో వుంచుకొని, ఎక్కడికి వెళ్ళినా వారి కార్లలో తీసికెళ్తేనే అంత అవుతుందట! లేకపోతే ఒక్క అమెరికా ట్రిప్పుకే యాభై వేలవుతుందన్నారు.

అమెరికాలో వీళ్ళు చూసిన ప్రదేశాలు: లాస్‌ఏంజిల్సు, శాన్‌ఫ్రాన్సిస్కో బోస్టన్, న్యూయార్కు, వాషింగ్టన్, హూస్టన్, మియామీ, ఓర్లండ్, నయాగరా.

ఈ దేశాలు చూశాక ప్రతిచోటా, ప్రతిదశలో వారితో పోల్చుకుని మనం ఎప్పటికలా అవుతాం అన్న ఆవేదన పెరిగిందట రచయిత్రికి. ముఖ్యంగా ఈ దేశాలన్నిటిలో వీరిని బాగా ఆకర్షించింది - "ఆ మనుష్యులలో పంక్చువాలిటీ, టైమ్ సెన్స్, నిజాయితీ, డిగ్నిటీ ఆఫ్ లేబర్, సివిక్ సెన్స్, కృషి, పట్టుదల, పరిశుభ్రత."

మనకి సైకిలంటే బీదవాడి వాహనం. అమెరికాలో ఎక్సర్‌సైజు సాధనంగా వాడతారు. చాలమంది ఈ దృష్టితో మార్కెటింగ్‌కి, ఊరిబయట షికార్లకు సైకిల్‌ను ఉపయోగిస్తారు అక్కడి సైకిళ్ళు చాలా తేలికగా ఉంటాయి కాబట్టి ముసలివాళ్ళు కూడ చకచక తొక్కడం రచయిత్రి కంటబడింది. సైకిల్ టూర్స్ మీద చాలమంది వేసవి కాలంలో వెళ్తుంటారట.

---

* ప్రసిద్ధ నవలా రచయిత్రి శ్రీమతి డి. కామేశ్వరి.

# ఐరోపా యాత్రలు

## 1. కురుమెళ్లవారి 'మా మహారాజుతో దూరతీరాలు'*

కురుమెళ్ళ వెంకటరావుగారు విదేశాలకు చేసిన యాత్ర గురించి గత ప్రకరణంలో తెలుపబడింది. ఆయన యాత్రానంతరం రచించిన 'మా మహారాజుతో దూరతీరాలు' అన్న యాత్రా గ్రంథంలోంచి అమెరికా, ఇంగ్లండు యాత్రా విశేషాలను వేర్వేరు అధ్యాయాల్లో విడదీసి మిగతా ఐరోపా దేశాల పర్యటనకు సంబంధించిన వివరాలను ఇక్కడ ఇవ్వడం జరిగింది. ఆయన సందర్శించిన ఐరోపా దేశాలు : జర్మనీ, స్వీడన్, ఆస్ట్రియా, స్విట్జర్లాండ్, ఇటలీ, ఫ్రాన్సు.

### i) జర్మనీ యాత్ర :

వెంకటరావుగారు మొదట లండన్ నగరాన్ని దర్శించి తర్వాత అమెరికా అంతా పర్యటించారు. న్యూయార్కు నుండి సరాసరి జర్మనీలోని బ్రిమెన్ రేవుకు 12-9-1930 న చేరుకుంది వీరు ప్రయాణించిన బ్రిమెన్ స్టీమరు. అక్కడి నుండి ముఖ్యపట్టణాలకు సంచరించారు. ఒకప్పటి జర్మనీ ప్రాభవం ప్రయాణ కాలంనాటికి లేదు. అటు అమెరికాలో లాగ బ్రహ్మాండమైన భవనాలు కాని, ఇటు ఇంగ్లండులో లాగ చక్కని అందమైన బంగళాలు కానీ లేవట! ఎక్కడ చూసినా గోడౌన్లలాంటి పెద్ద పెద్ద ఇండ్లు అందవిహీనంగా కనిపించాయన్నారు.

ఇక్కడ బీరు తయారు చేసే ఫ్యాక్టరీలు ఎక్కువట. అందుకేనేమో మంచి నీళ్ళలాగా ఇక్కడివారు బీరు త్రాగడం కనిపించిందన్నారు. బీరే ఆహారమా అన్నంతగా ఎక్కడ, ఎప్పుడు చూసినా బీరు తాగే దృశ్యాలే. హార్బరులో, రైళ్ళల్లో, చివరకు సినిమాలో నటించే దృశ్యాలు కూడ బీరు త్రాగుతున్నవేనట!

---

* కురుమెళ్ళ వెంకటరావుగారు,

ఇక్కడి బీర్ ఎక్కువ మత్తు ఎక్కించి తూలకొట్టకుండా శరీరానికి సత్తువ నిస్తుందని రచయిత తెలుసుకున్నారు.[1]

బెర్లిన్‌లో నైతే ఎవరితో మాట్లాడుతున్నా, స్త్రీలవద్ద కూడ బీరు వాసన గుప్పున కొడుతుందట! హిందూస్థాన్ రెస్టారెంటులో భారతీయ విద్యార్థుల అసభ్య చేష్టలు రచయితను కించపరిచాయి. మద్రాసునుండి వచ్చాననగానే, సాంబారు దొరకదు, బీరు త్రాగుమని వేళాకోళం చేస్తూ "What a fool you are. To have come to Germany and not drinking beer. ½ without Beer what is Germany" అని కేకలేయటం వెంకట్రావు గారికి మనస్తాపం కలిగించింది.

ఇక్కడికి వచ్చిన రోజు రాత్రే ఒక సినిమాకు వెళ్తే అది సోషల్ పిక్చరైనా దానిలో చాలమంది మిలిటరీ డ్రెస్సులతో ఉన్నారని వ్రాశాడు. మొదటి ప్రపంచ యుద్ధానికీ, రెండవ ప్రపంచ యుద్ధానికీ మధ్య కాలంలో చేసిన యాత్ర ఇది. అందుకే ఇంకా జర్మనీలో యుద్ధ వాతావరణం కనపడింది. అప్పటికే మొదటి ప్రపంచయుద్ధంలో చక్రవర్తి రాజ్యభ్రష్టుడై 1930 కాలం నాటికి జర్మనీలో రిపబ్లిక్ రాజ్యాంగం నడుస్తున్నదట! సేనా నాయకుడు వాన్ హిండెన్‌బర్గ్ అప్పటి ప్రెసిడెంటని తెల్పారు.

## ii) స్వీడన్ యాత్ర :

14-9-1930 నాడు హాంబర్గ (జర్మనీ) నుండి రైలు మీద ప్రయాణమై డెన్మార్క్ దేశం గుండా స్టాక్ హోమ్ చేరడానికి సరిగ్గా 24 గంటలు పట్టింది.

---

1. సతీష్‌కుమార్ కూడ తమ 'కానీ లేకుండా కాలినడకన ప్రపంచ యాత్ర' అన్న గ్రంథంలో ఇదే అభిప్రాయం వెలిబుచ్చారు. "కేరళ ప్రాంత ప్రజలు కొబ్బరి నీళ్ళను ఎంత సంతోషంతో త్రాగుతూ వుంటారో, అంతకంటె ఎక్కువ సంతోషంతో జర్మన్ ప్రజలు బీరు త్రాగుతూ ఉంటారు. అయినా వాళ్ళకు మత్తెక్కదు." పేజీ. 209. ఈ పుస్తకం యొక్క హిందీ వ్రాతప్రతిని మొదటిసారిగా 1968లో వేమూరి రాధాకృష్ణ మూర్తిగారు తెలుగులోకి అనువదించి ప్రకటించారు.

మార్గ మధ్యంలో వీరు ప్రయాణించిన రైలు బోగి స్టీమరు పైకి ఎక్కించబడింది. సముద్రం దాటిం తర్వాత అదే విధంగా స్టీమరు నుండి భూమ్మీదకి వచ్చేసింది. స్వీడన్ దేశపు దక్షిణ తీరంలో ఉన్న ట్రెల్లెబోర్గ్ నుండి స్టాక్‌హోమ్ దాదాపు 480 కి.మీ. దూరం. ఈ ప్రయాణంలో సన్నగా పొడుగ్గా ఆకాశాన్నంటిన చెట్లను చూస్తే 'అమెరికాలో సైస్క్రేపర్స్ ఎత్తా ఈ వృక్షాలు ఎత్తా' అన్న మీమాంసలో పడ్డారట రచయిత. అట్లాగే పచ్చని గడ్డితో నిండిన కొండలపై తెగ బారెడు పొడవున్న తెల్లని గొర్రెలు మందలుగా మేస్తుంటే 'తెల్లని మేఘ శకలాలు ఈ పచ్చని కొండల మీదికి విహారం చేయడానికి దిగాయా' అన్నట్లు తోచిందట.

నోబెల్ బహుమానం ఇచ్చే సంస్థ స్టాక్ హోంలోనే ఉంది. ఇది స్వీడన్ దేశానికి ముఖ్య పట్టణం. ఇక్కడ కూడ వెనిస్‌లో మాదిరి ఎక్కడ పడితే అక్కడ నీళ్ళు ఉండడం వల్ల ఈ నగరాన్ని 'వెనిస్ ఆఫ్ ది నార్త్' అంటారట.

అమెరికా, ఇంగ్లండులో ఉన్న తెలుపు రంగుతో పాటు ఇక్కడి స్త్రీలు కొంచెం ఎరుపు వర్ణం కూడా కలిగి వుంటారనడానికి రచయిత 'వీళ్ళు తెల్లగా వుంటూ లోపలి రక్తం గులాబీ రంగుల్ని పైకి ప్రసారంచేస్తూ వుంటా'రని వర్ణించారు. దాదాపు ఇక్కడి ఇల్లాళ్ళందరూ అసూర్యంపశ్యలే నంటూ చివరకు పనికత్తెలుకూడ 'పాలరాతి బొమ్మల్లా' చాలా అందంగా ఉంటారన్నారు. రచయిత స్వీడన్‌లో ఉన్నది రెండురోజులే ఐనా దేశంలోని స్త్రీలందరి తరపునా అందంగురించి వకాల్తా పుచ్చుకున్నారు.

## iii) ఆస్ట్రియా పర్యటన :

స్వీడన్‌నుండి బెర్లిన్‌కు మరలిపోయి అక్కడినుండి జెకొస్లొవేకియా మీదుగా ప్రయాణించి ఆస్ట్రియా ముఖ్యపట్టణం వియన్నా చేరుకున్నారు. రచయితకు ఇక్కడి జెయంట్ వీల్ (రంగులరాట్నం) గొప్పగా ఆకర్షించింది. బహుశా అప్పటికి మనదేశంలో వీటిని ఇంకా ప్రవేశపెట్టినట్లు లేదు. అందుకే 'మన తీర్థాలలో రాట్నాలకి గుర్రాలు అమర్చివుంటే వాటిమీద కూర్చుని గుండ్రంగా తిరుగుతామేకాని ఆకాశంలోకి వెళ్ళం, ఇదొక పెద్దవింత' అన్నారు.[2]

---

2. మా మహారాజుతో దూరతీరాలు - పేజీ 111.

కుర్చీలో కూర్చుంటే ఆకాశంలోకిపోయి మళ్ళీ క్రిందికివచ్చే విధంగా ఉండే రంగులరాట్నాలు ఇప్పుడు మనదేశంలో ప్రతి ఎగ్జిబిషన్‌లో చోటుచేసుకుంటున్నాయి.

మొత్తమ్మీద వియన్నాలో సరదాగా గడిచిపోయినా స్త్రీల విషయంలో మాత్రం ఈ పట్టణం ఏహ్యభావాన్ని కలిగిస్తుందన్నారు. ప్రొద్దుపోయాక రోడ్డు మీద నడవడానికే పురుషులకు భయమనీ, యువతులు సిగ్గువిడిచి దారివెంట పోతూవున్న పురుషుల వెంటపడి బలవంతంగా తమ గృహాలకు లాక్కుపోవడానికి ప్రయత్నిస్తారనీ చెప్తూ, తనకు కలిగిన ఒక అనుభవాన్ని వివరించారు. ఇంగ్లీషు వచ్చిన అమ్మాయి తటస్థపడి "ఎక్కడికైనా తీసుకెళ్ళమనీ, ఒక పెగ్గు విస్కీ ఇప్పించమనీ, తన గదిలోకిరమ్మనీ, ఆడవాళ్ళంటే నీకు ఇష్టంలేదా అనీ, సుఖించడం తెలియదా" అని మాటలతోనే కాకుండా, నడుంచుట్టూ చెయివేసీ ఇంకా 'పంట్లాంజేబు'లో చెయ్యి పెట్టడానికి ప్రయత్నించి నానాగొడవ చేసిందట.[3] కొంత చిల్లర ఇచ్చి పీడ వదలించుకున్నట్లు రచయిత తెల్పాడు. ఈ రకం స్త్రీలు జనంలో నడుస్తూనే వుంటారనీ, షాపు విండోస్‌లో ఏదో చూస్తున్నట్లే నటిస్తారనీ, 'వీధి మొగను' కాచుకుని కూడా వుంటారనీ, ఒక పెగ్గు విస్కీ కోసం ఎంతో నిర్లజ్జగా ప్రవర్తిస్తారనీ వ్రాస్తూ ఇంగ్లండు, అమెరికా దేశాల్లో కూడా ఇట్లాంటి దాడి ఎక్కడా జరగలేదన్నారు.

## iv) స్విట్జర్లాండ్‌లో నాలుగు రోజులు :

వియన్నా నుండి బయలుదేరి స్విట్జర్లాండ్‌లోని లూసర్న్ నగరం చేరుకున్నారు. ఆల్ప్స్ కొండలమీది ఎత్తైన ప్రదేశంలో స్విట్జర్లాండు ఉంది. భారత దేశానికి కాశ్మీరులాగా, ఐరోపా దేశస్థులకు స్విట్జర్లాండు భూతల స్వర్గం. స్వర్గంతో సామ్యాన్ని చూపిస్తూ "స్వర్గంలో నందనవనం ఉంది. వాడని పువ్వులు ఉంటాయి. ఇక్కడ కూడా అంతే. స్వర్గంలో కామధేనువు ఉంది. ఇక్కడ పాడికి లోటులేదు. కోరినవన్నీ ఇచ్చే చింతామణి అక్కడ - ఏ కొరతా లేని సమృద్ధి ఇక్కడ" అంటూ అక్కడ అప్సరసలున్నారు, కానీ ఇక్కడో ఇంకా

3. మా మహారాజుతో దూరతీరాలు - పేజీ. 111.

చూడాలి అన్నారు [4] కాని స్విట్జర్లాండ్‌లో ఆయనకు అప్సరసలు కనిపించినట్లు లేదు. ఇక్కడున్నదంతా ప్రకృతి రామణీయకత. ఏ కాలంలోనైనా ఒకేరీతిగా ఉండే సమశీతోష్ణస్థితి. అందుకే ప్రపంచ యాత్రికులకు విహార కేంద్రమైంది. పూరంతా గడియారాల షాపులే. రచయిత తాను దర్శించిన షాపులో ఒక్కొ అమ్మాయి రోజుకు ఇరవై, ముప్పై వాచీలు బిగించడం తెలుసుకున్నాడు.

మొదటి ప్రపంచ యుద్ధంలో స్విట్జర్లాండు ఏ పక్షమూ వహించకుండా తాటస్థ్యాన్ని వహించింది. యుద్ధంలో పాల్గొన్న ప్రధాన రాజ్యాల మధ్య ఉన్నప్పటికీ యుద్ధం పేరు మీదుగా ఈ దేశం 'ఒక్క అకైనా రాల్చలేదట.' పట్టణం కూడ చెక్కుచెదరకుండా సహజ సౌందర్యంతో అట్లాగే నిలిచి ఉన్నదని వ్రాశారు.

## v) ఇటలీ ప్రయాణం :

జెనీవా (స్విట్జర్లాండు) నుండి కారులో ఇటలీ ముఖ్యపట్టణమైన రోము నగరానికి వచ్చారు. ఒకప్పటి వైభవానికి చిహ్నంగా ఈ నగరానికి 'ఆల్ రోడ్స్‌టు రోమ్' అన్న సామెత వచ్చిందట! వెనీసు నగరంలో రోడ్లన్నీ కాలువల మయమే. ఎదురుగా ఉన్న ఇంట్లోకి వెళ్ళాలన్నా 'గండోలా' అనే తెప్పమీద పోవాల్సిందే [5]

---

4. మా మహారాజుతో దూరతీరాలు - పేజీ 113
5. డాక్టర్ శివరాంగారు లక్నో విశ్వవిద్యాలయంలో రాజకీయ అంతర్జాతీయ న్యాయశాస్త్రంలో ప్రొఫెసర్. వీరికి అంతర్జాతీయ న్యాయశాస్త్రంలో కార్నిజీ బహుమానం ఇవ్వబడినందున ఆ సందర్భంలో కొంత కాలం యూరప్‌కు వెళ్ళాల్సి వచ్చింది. వెంట ఆయన భార్య వంగల వాణిబాయి గారు వెళ్ళారు. ఆమె యాత్రా విశేషాలు 'నా ఐరోపాఖండ యాత్ర' అన్న పేరుతో భారతి, ఏప్రిల్ 1930 వ సంచికలో ప్రచురిత మయ్యాయి.

    బొంబాయిలో 'అలెగ్జాండ్రా డాక్స్' రేవులో ఇటలీ దేశపు 'లాయిడ్ ట్రీస్టినో' కంపెనీ వారి స్టీమరులో 8-7-1929 న ప్రయాణమై 16 రోజుల తర్వాత వేనీసు నగరం చేరారు. ఈ సందర్భంలో 'ఒక చోటు నుండి మరియొక చోటునకు పోవలెనన్నచో గండోలాలు అను పడవలపై నెక్కి ఆ కాల్వలపైన పోవలయును' అని వ్రాశారు.

ఐతే నగరంలో భూభాగమున్న చోటు 'పైజా' ఒక్కటే నన్నారు "మొత్తమ్మీద వెనిస్ అనే ఈ ఫ్లోటింగ్-సిటీ ప్రపంచంలోని నగరాలకి చాలా విభిన్నంగా ఉంది. సముద్రంలో మేడలు కట్టడం, నీటిమీద నడకలు సాగించడం చాలా చిత్రంగా ఉంది" అని వ్రాశారు.[6]

ప్రయాణకాలంనాటికి ఇటలీని ముసోలినీ అనే నియంత పరిపాలిస్తున్నాడు. ఆయన ఫోటో ప్రతి హోటల్లో, ఇంట్లో ఉంటుంది కాని ఆయన పేరును మాత్రం ఎవరూ ఉచ్చరింపకూడదట. గూఢచారులెప్పుడూ తిరుగుతూనే ఉంటారు కాబట్టి ఈ విషయంలో అక్కడి ప్రజలు చాలా జాగ్రత్తగా ఉంటారని రచయిత తెల్పారు.

'సీ నేపుల్స్ అండ్ డై' అన్నది పాత సామెత. ఒకప్పటి పురావైభవానికి ప్రతీక. వెసూవియస్ పర్వతాన్ని సందర్శించాలనే కుతూహలంతో గ్రంథకర్త నేపుల్స్‌ను పర్యటించారు. ఇక్కడి కొండ శిఖరాలు 'తెల్లని చల్లని మంచు కిరీటాలు ధరించి ఉండడం' చూస్తుంటే హాయిగా ఉందనీ, మరోవైపు వెసూవియస్ అగ్నిపర్వత శిఖరం 'ఎర్రగా కోపంతో బుసలుకొడుతూ నిప్పులు కక్కుతూ ఉండడం' చూస్తుంటే భయం వేస్తుందనీ రావుగారు పేర్కొన్నారు.

ఇటలీ దేశంలోని అన్ని పట్నాలలో 'మేకరోని' అనే సేమ్యాలాంటి పదార్థం తయారవుతుంది. అలవాటులేని వారికిది తినడం కష్టం. జారిపోతూ వుంటుంది. స్పూన్‌లు, ఫోర్కులకు లొంగదు. అందుకే సన్నటి రెండు పుల్లలకు చుట్టబెట్టి ఈ సేమ్యాను సేవించాలని రచయిత రాశారు.

తర్వాత ఇటలీమధ్య ఉన్న ఫ్లారెన్సు నగరం సందర్శించారు. దీన్ని 'సిటీ ఆఫ్ ఫ్లవర్స్' అంటారు. ఇక్కడి కెతీడ్రల్సూ, చర్చిలు, శిల్పాలు, స్మారక చిహ్నాలూ చూసి వెంకటరావుగారు పరమాశ్చర్యంతో ఈ నగరం 'యూరపు ఖండానికేకాక యావత్ ప్రపంచానికే 'శిల్పకళా ఖజానాగా' భావించారు.[7]

---

ఇక్కడి నుండి వీరు స్విట్జర్లాండు లోని 'లూజా', 'జినీవా' పట్టణాలను, పారిస్, లండన్, హాలెండ్, జర్మనీ, బెల్జియం, స్కాట్లండు, ఐర్లండు, చివరకు 21-1-1930 న బొంబాయికి చేరుకుని అక్కడి నుండి 26 న మద్రాసు వెళ్ళారు.

6. మా మహారాజుతో దూరతీరాలు. పేజీ. 129.
7. మా మహారాజుతో దూరతీరాలు - పేజీ. 129.

వెంకటరావుగారి తర్వాత 28 సంవత్సరాలకు అంటే రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత నేపుల్స్‌ను సందర్శించిన శర్మగారికి ఏ బజారులో నడిచినా, ఎవరితో మాట్లాడినా యుద్ధం సంగతులే వినిపించాయన్నారు.[8] ఇటాలియన్లు అనేక విషయాలలో - మనస్తత్వంలో, మాటతీరులో, మానసికోద్రేకంలో - ఆంధ్రులను పోలి ఉంటారన్న శర్మగారి అభిప్రాయానికి ఇటలీని దర్శించిన గ్రహ అనుభవాలు కూడ సమర్థకంగా ఉన్నాయి [9] 'పగ తీర్చుకొను నావేగము ఇటలీవారిలో మెండు' అంటూనే నరముల బలహీనత వారి కధికమనీ, వ్యక్తిగతంగా ధైర్యశాలురే ఐనా గుంపులో దిగులు పడతారనీ 'గ్రహ' అభిప్రాయం. ఇటాలియనులు వీర రోమను క్యాథలిక్ మతానుయాయులు కావడం వల్ల వారి మతాచారం ప్రకారం కనుబొమలను దిద్దుకోవడం కాని తల వెంట్రుకలను కత్తిరించుకోవటం గాని చేయకూడదనీ, కుటుంబ నియంత్రణకు వారి మతం అంగీకరించదనీ గ్రహ' పేర్కొన్నారు.

## vi) ప్యారిస్ వింతలు - విశేషాలు :

ఫ్రాన్సు దేశానికి ముఖ్య పట్టణం పారిస్. 'సీ నేపుల్స్ అండ్ డై' అన్నది పాత మాటైతే 'సీ పారిస్ అండ్ డై' అన్నది కొత్త పాట అని వెంకటరావు గారు తెల్పారు.

---

8 డాక్టర్ వి. యన్. శర్మగారు యూరప్‌లో ఆరునెలలుండి అమెరికాకు వెళ్ళాలనుకున్నారు. కాని యూరప్‌లోని ఇటలీ, స్విట్జర్లాండు, జర్మనీ, స్కాండినేవియా, పోలండు, ఫ్రాన్సు దేశాల సంచారానికే సంవత్సరం పట్టింది. 1953 లో ఆ యేడాదంతా ఐరోపా దేశాలు పర్యటించి స్వదేశానికి వచ్చారు. తర్వాత ఆయన వ్రాసిన 'నా ప్రయాణానుభవములు' అన్న వ్యాసం కిన్నెర మాసపత్రికలో జనవరి 1954 వ సంవత్సరం ముద్రింపబడింది. ఇది వ్యాసం కాబట్టి సందర్భానుసారంగా ఆయా ప్రదేశాల వివరాలు ఇక్కడ పొందుపరచడం జరిగింది.

9. 'నానాదేశ సందర్శనము' చేసి 'గ్రహ' వీక్షణము అన్న కలంపేరుతో అజ్ఞాతయాత్రికుడు చేసిన యాత్రా విశేషాలు భారతి సాహిత్య మాస పత్రిక, నవంబర్ 1986 వ సంచికలో ఉన్నాయి.

ఫ్రాన్సు ఫ్యాషన్లకు పుట్టిల్లట, నాగరికత. సంస్కృతి ఫ్రాన్సు పరమోద్దేశ్యాలనీ, ఇది లలిత కళలకు పట్టుకొమ్మగా, అందాల బరిణగా విలసిల్లినట్లు 'గ్రహ' పేర్కొన్నాడు.

వెంకట్రావు గారు స్థానికులు ఫ్యాషన్ల గురించి చెప్పుకునే కథల్లో ఒక దాన్ని ఈ విధంగా చెప్పారు: "ఇంటికి పోతున్న ఒకాయనని మిత్రుడు ఒకడు ఆపుచేసి మాట్లాడుతుంటే తాను వెంటనే వెళ్ళిపోవాలనీ, తన భార్యకి వెంటనే గౌను అందించాలనీ, ఆలస్యం చేస్తే ఫాషను మారిపోతుంది గనుక మళ్ళీ కుట్టించవలసి వస్తుందనీ అన్నాడని కథలు చెబుతారు."[10]

యాత్రా కాలం నాటికి భారతదేశంలో ఫ్రెంచికట్ మీసాలు ఫ్యాషనైతే, ఫ్రాన్సులో రచయితకు మచ్చుకు కూడా కనిపించలేదట! అంటే అక్కడ ఆ ఫాషన్ ఎప్పుడో మారిపోయిందన్నమాట!

కేసినో అనే జూదగృహాలకు వచ్చే స్త్రీలు ఎన్నో రకాల జంతువుల కోట్లు ధరించి వస్తారనీ, ప్రతి దానికి ఒక్కో ప్రత్యేకత ఉందంటూ "ముక్కురంధ్రాల్లోంచి వచ్చే ఉచ్ఛ్వాసానికే గజగజ వణికి పోయే అతి సన్నని, అతి మెత్తని బొచ్చు కోట్లు - ఫర్సు అంటారు"- వీటిని ధరించీ, మెడకు చుట్టబెట్టుకునీ అక్కడికి వచ్చినట్లు గమనించారు.[11] ఐతే రాత్రి డిన్నర్లకి వచ్చే మగవాళ్ళు ఎప్పుడూ ఒకేరకం సూటు ధరించి వస్తారట! "ఒక్కొక్కప్పుడు ఫేషనబుల్ జెంటిల్మన్‌కీ బట్లరుకీ బట్టల్లో తేడా కనబడదు. ఎటొచ్చీ బట్లరు చేతిమీద ఒక తువాలు లాంటిది ఉంటుంది. అంతే తేడా" అని వ్రాశాడు.[12]

పారిస్‌లో వ్యభిచారం చేసేవారికి ప్రభుత్వమే లైసెన్సులు ఇచ్చి వారి శుభ్రత కోసం, ఆరోగ్యం కోసం క్లినిక్‌లు ఏర్పాటు చేసిందని తెల్పాడు. హెల్త్ డిపార్ట్‌మెంటు వాళ్ళ సర్టిఫికెట్లను (దీన్నే వియన్నా పర్యటనలో రచయిత

---

10. మా మహారాజుతో దూర తీరాలు - పేజీ. 149.

11. మా మహారాజుతో దూర తీరాలు - పేజీ. 148.

12.

'ఫ్రెంచి లెటర్' అన్నారు) చేతి సంచులలో ఉంచుకొని, దారి వెంట వెళ్ళేవారిని ఎదుర్కొని, బలవంతంచేసే 'సిగ్గుమాలిన స్త్రీలు' ఎందరో ఉన్నారట ఇక్కడ కూడ. వీధుల్లో విచ్చలవిడిగా తిరిగే యువతులు కాక వేం సంఖ్యలో వేశ్యా గృహా లుంటాయట.[13] ఈ గుమ్మాల ముందు సంకేతంగా ఎర్రదీపాలు వెలుగుతూ ఉంటాయి. ఇంతేకాక బహిరంగ ప్రదేశాల్లో, పార్కుల్లో, ఆవెన్యూలలో, దారి పక్క చలువరాతి బెంచీల మీద కూడ 'యువకుల సరదాలు తీర్చే స్త్రీలు' వున్నట్లుగా రావుగారు గమనించారు.

శాంతియాత్ర చేస్తూ పారిస్ నగరానికి వచ్చిన సతీష్‌కుమార్‌గారి దృష్టిని కూడ ఈ స్వేచ్ఛా ప్రణయం తప్పించుకోలేదు. "పార్కుల్లో చూచినా, రోడ్డు మీద చూచినా, బెంచీల మీద చూచినా, నదీ తీరాల చూచినా ఎక్కడ చూచినా యువతీ యువకులు పరస్పరం గట్టిగా కౌగిలించుకొని ముద్దుల వర్షం కురిపించు కుంటూ వుంటారు. ఎవరైనా చూస్తారేమోననే బిడియం వారికి లేదు."[14]

ఇక్కడ కెఫేలన్నీ పేవ్‌మెంటు మీదనే ఉంటాయి. ఒంటరిగా వెళ్ళి కుర్చీలో కూర్చుంటే చాలు, వెంటనే ఎక్కడి నుండో ఒక అమ్మాయి వచ్చి సరసాలాడుతూ కబుర్లకు పూనుకుంటుందని వెంకట్రావుగారి స్వానుభవం.

---

13. "ఈ వ్యభిచార దుర్నయాన్ని తొలగించడానికి ప్రభుత్వమెంత తీవ్రంగా ప్రయత్నించినా కాస్త తగ్గినట్లు కనపడుతుందే కాని పూర్తిగా తొలగి పోదు. ఇది పరిశీలించిన పారిస్ మొదలైన నగరములందలి ప్రభుత్వాల వారు దీనిని కొన్ని ఆరోగ్య నియమములకు లోబడచేసి లైసెన్స్‌డ్ గృహములందు జరుపుటకు అనుజ్ఞ నిచ్చినారు." అవే ఈ వేశ్యా గృహాలు.
—కురుమెళ్ళ వెంకటరావుగారి 'మా మహారాజుతో దూర తీరాలు' గ్రంథానికి కళాప్రపూర్ణ డా॥ గిడుగు వేంకట సీతాపతిగారు వ్రాసిన పీఠికలోని మాటలివి. పేజీ 23.

14. 'కానీ లేకుండా కాలినడకన ప్రపంచ యాత్ర' - సతీష్ కుమార్. పేజీ 225.

పారిస్ నగరంలో ప్యాషన్ మేగజైనులు గుట్టలు గుట్టలుగా పడి వుంటాయనీ, సెక్సు గురించిన కథల పుస్తకాలు, విగత వస్త్రాలతో ఉన్నవాళ్ళ ఫొటోలూ, బొమ్మలూ అంతులేకుండా వుంటాయనీ రావుగారు వ్రాశారు.

ప్రపంచంలోని అందచందాలన్నిటినీ ప్రదర్శించడం ఫ్రెంచి వాళ్ళ వరవడి. కనురెప్పలకు ఉండే వెంట్రుకలు పొడవుగా, కుచ్చులుగా కనపడడానికి 'మస్కారా' అనే కాటుక పూస్తారంటూ, ఇదంతా "కనుగుడ్డు తళుక్కుమని మెరిసేటట్టు కనపడడానికి చేసే హంగామా" అన్నారు.[15]

వెంకటరావుగారికి ఊళ్ళో ఎక్కడ నిలబడి చూసినా దూరంగా కనిపించింది ఐఫిల్‌టవరేనట! దీన్ని బ్రహ్మాండమైన కట్టడంగా అభివర్ణించారు. ౯౮౫ అడుగుల ఎత్తుంటుందనీ, అంత ఎత్తునుండి చూస్తే పారిస్ నగరమంతా కనిపిస్తుందనీ వ్రాశారు. ఐతే ఇదే సంవత్సరం ఈ టవర్‌ను ఎలక్ట్రిక్ లిఫ్ట్‌లో ఎక్కినట్టు వంగల వాణీబాయిగారు వ్రాశారు, కాని రావుగారు దీని గురించి ప్రస్తావించలేదు.

ప్యారిస్‌లో రావుగారికి ఆశ్చర్యాన్ని గొల్పిన నాటక ప్రదర్శన 'ఫాలీస్ బెర్‌జేర్ ప్రదర్శన.' ప్రపంచ ప్రసిద్ధిపొందిన ఈ నాటక దర్శనానికి పశ్చిమ దేశాలనుండి ప్రత్యేకంగా ఈ నగరానికి వస్తారన్నారు. ఈ ప్రదర్శనలో అన్నిటికంటే మహాద్భుతంగా తోచింది "స్టేజిమీద నిజం సముద్రంలో ప్రళయం వస్తే ఎట్లా ఉంటుందో అట్లాంటి తుఫాను సీను, పెద్ద పెద్ద అలలతో" ప్రదర్శించారట.

అందుకే సతీష్‌కుమార్ ఫ్రాన్సు దేశానికి "సంగీత, సాహిత్య, శృంగార కూడలి" అని పేరు పెట్టారు.

డా॥ సి. నారాయణరెడ్డిగారు తమ యాత్రా సందర్భంగా ఫ్రెంచి వారిని ఇంగ్లీషులో మాట్లాడిస్తే ఇంగ్లీషు వచ్చినప్పటికీ ఫ్రెంచిలోనే బదులిస్తారని పేర్కొంటూ, వారికి స్వభాష మీద ఆసక్తి 'ఆధిక్య దృష్టి' ఎక్కువే నన్నారు.

---

15. 'మా మహారాజుతో దూర తీరాలు' - పేజీ. 156.

ప్యారిస్‌లో సంచరిస్తున్నప్పుడు ఏదైనా ప్రశ్న ఇంగ్లీషులో వేస్తే ఫ్రెంచి వారు 'ఒయ్' అంటుంటారని చెపుతూ ఈ పదానికి అర్థం 'సరే' నని తెల్పారు. దీన్నే జపాన్‌లో 'హై' అంటారనీ, ఇంగ్లీషులో 'యాం' లేదా 'యా' అనీ, అమెరికాలో 'యా' అనీ ఉదాహరణలిస్తూ 'ఒయన్' అన్నదే 'ఒయ్' గా మారిందని చెప్పారు.

వెంకటరావు గారికి పాశ్చాత్య దేశాల పర్యటన చేసి వచ్చిన తర్వాత కలిగిన అభిప్రాయాలివి: ఇంగ్లండు వాళ్ళు ఆర్థికంగా మనకంటే హెచ్చుస్థాయిలో ఉన్నా మూఢాచార విషయాల్లో మనవాళ్ళ కంటే రెండాకులు ఎక్కువే చదివారు. ఐతే ఇతర దేశాలవారికంటె వీరు మంచివారట.

అమెరికాలో అన్ని రంగాల్లోను వేగమెక్కువ. చివరకు వివాహం ఎంత తొందరగా చేసుకుంటారో విడాకులు కూడ అంత తొందరపాటు తనంగానే పుచ్చుకుంటారన్నారు.

యూరప్‌లో స్వీడన్, స్విట్జర్లాండు దేశాల్లో ప్రజలు శాంతంగా, సుఖంగా జీవితాలు గడుపుకుంటుంటే జర్మనీ ఇటలీ ఫ్రాన్సు దేశాలు యుద్ధాల్లో చిక్కుకుని, నష్టాలపాలై దేశాలపునర్నిర్మాణంలో ఒకరికొకరు పోటీపడటం కనిపించింది.

ఏది ఏమైనా మన సాంప్రదాయాలూ, సంస్కృతులూ, సంస్కారాలూ ఉత్తమమైనవనే అభిప్రాయం అపార దేశ సంచారం వల్ల రచయితకు కలగడానికి ఆయన స్వదేశాభిమానమే ముఖ్య కారణం. ఐతే యూరప్ దేశాల నుండి నేర్చుకోవాల్సినవి చాలా వున్నాయంటూ, ''వాళ్ళు కాలం వృధా పుచ్చరు. ఎవరి పనులు వాళ్ళు చేసుకుంటారు వ్యాపారంలో మోసం తక్కువ. స్వదేశాభిమానం మిక్కుటం'' అని ముక్తసరిగా పర్యటనానుభవాన్ని క్రోడీకరించి, స్వదేశీయులు అనుసరించవలసిన పద్ధతులను సూచించారు.

## 2. జర్మనీ యాత్రలు

### i) పువ్వాల 'బతుకు పుస్తకం' లో జర్మనీ యాత్ర :

పువ్వాల లక్ష్మణరావుగారు 'బతుకు పుస్తకం' లో తాను జర్మనీలో యూనివర్శిటీ విద్యార్థిగా ఉన్నప్పుడు (1922 ప్రాంతంలో) అక్కడి యాత్రానుభవా

లను వివరించాడు. ఈ పుస్తకం 1983 లో విశాలాంధ్ర వారి ప్రచురణ పొందింది. పుటలు 246.

ఐతే ఈ గ్రంథంలో ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం జర్మనీలో నెలకొని ఉన్న ఆర్థిక పరిస్థితిని గురించి ప్రముఖంగా 'ద్రవ్యోల్బణం' పేర సోదాహరణగా వివరించారు.

యాత్రాకాలం నాటికి హిట్లర్ సంపూర్ణాధికారాన్ని చేజిక్కించుకొని నాలుగేళ్ళయిందంటూ, ఎక్కడ చూసినా బ్రౌన్ షర్టులే, ఎక్కడ చూసినా స్వస్తిక్ గుర్తులే కనిపించా యన్నారు.

1922 లో అక్కడ ద్రవ్యోల్బణం బాగా పెరిగిపోయి 'మార్కు' విలువ బాగా పడిపోయిందట. ఇంగ్లీషు పౌండ్లు, అమెరికన్ డాలర్లు, స్విస్ ఫ్రాంకులూ ఉన్నవాళ్ళకు ఏమీ ఇబ్బంది లేదు కాని కేవలం జర్మన్ 'మార్కు'లమీదే ఆధారపడ్డవాళ్ళకు జీవితం దుర్భరంగా వున్నట్లు గమనించారు. సినిమా టిక్కెట్ల ధర డబ్బులలో కాకుండా వస్తువులలో అమ్మే వారనడానికి ఒక దృష్టాంతం కూడ చూపారు. ఒక టిక్కెట్టుకు రెండు కోడిగ్రుడ్లు, లేదా పావుకిలో వెన్న లేదా పావుకిలో పంచదారగా నిర్ణయమైందట.

"యూనివర్సిటీ ప్రొఫెసర్లు సహితం తమ తమ మిలిటరీ యూనిఫారాలని మార్పు చేయించి, మాసికలు చేయించి తొడుక్కునేవారు" అని వ్రాశారు 16 ఈ దుర్భరస్థితి జీతాలు నిలకడగా లేనందువల్ల, మార్కు విలువ నిమిష నిమిషానికీ పడిపోతుండడం వల్ల కలిగిందనీ, ఇక సామాన్యులైతే అర్ధాకలితో, పస్తులతో బతుకులను 'ఈడుస్తూ' గడిపారనీ తెల్పారు. జర్మన్ స్త్రీ ఒక సిగరెట్టు కోసం అమెరికన్ సోల్జరుతో ఒక రాత్రి గడపడం కోసం ఒప్పందం కుదుర్చుకున్న సంభాషణ ఒక హోటల్‌లో ఉండి విన్నట్లుగా రచయిత చెప్పారు. ఈ సంఘటన ఒకటి చాలు - జర్మనీలో అప్పటి ఆర్థిక వ్యవస్థ ఎంత ఛిన్నాభిన్నమైందో తెలుపడానికి.

---

16. బతుకు పుస్తకం - డా. పుచ్చల లక్ష్మణరావు. పేజీ 96.

## ii) ప్రకాశం పంతులుగారి 'నా జీవిత యాత్ర'లో జర్మనీ యాత్ర :

ప్రపంచ యుద్ధానికి ముందే 1906 లో ప్రకాశం పంతులు గారు తొట్టి వైద్యంలో ప్రసిద్ధుడైన లూయీఖాన్‌ను చూడాలన్న కోరికతో జర్మనీని సందర్శించారు. ఈ యాత్రా విశేషాలను తన 'జీవిత యాత్ర'లో పేర్కొన్నారు.

జర్మనీ శుద్ధ మిలిటరీ దేశమనీ, అక్కడ మిలిటరీ అధికారులకు జరిగే గౌరవం అపారమని వ్రాస్తూ "ట్రాఫిక్ పోలీసులు ఎవరైనా పెద్ద మిలిటరీ అధికారులు వస్తూంటే వారి దగ్గర ఉండే ఢంకాలు మోగిస్తూ ఉండేవారు. ఆ ఢంకా బజాయించేసరికి బాటల మీద నడిచే జనం పక్కకి ఒత్తిగిలి వాళ్ళకు దారి ఇవ్వవలసిందే" అని పేర్కొన్నారు.[17] ఐతే తాను రెండుసార్లు తప్పిపోయినప్పుడు సరియైన చోటికి చేర్చిన సందర్భంగా అక్కడి ప్రజలలో మాత్రం సుహృద్భావం చాలా ఎక్కువని అభిప్రాయపడ్డారు.

## iii) వి. యస్. శర్మగారి 'నా ప్రయాణానుభవములు'లో జర్మనీ యాత్ర :

1958 లో జర్మనీ సందర్శించిన వి.యస్. శర్మగారు కూడ ప్రజల విషయంలో ఇదే అభిప్రాయం వ్యక్తం చేశారు. యుద్ధం పూర్తయి ఎన్నో యేండ్లు గడిచినా ఎక్కడ చూసినా రాళ్ళకుప్పలూ, బూడిద పోగులూ ప్రత్యక్షమయ్యాయన్నారు. ఏపూట కాపూట గడవడమే దుర్లభంగా ఉందంటూ, అక్కడి ప్రజలకు డబ్బుకొరత ఏర్పడిందని వ్రాశారు. ఇంకా ఆయన 'జర్మనులు శాంతమూర్తులు. నిదానములో, ఓపికలో వారిని మించినవారు ఈ లోకంలో ఎవరూ లేరని చెప్పిన ఒక ఆశ్చర్యం కాదు' అని అభిప్రాయపడ్డారు. ఇది బహుశా వారి దురవస్థను గమనించి సానుభూతితో అన్నమాట అయ్యుంటుంది.

---

17. నా జీవిత యాత్ర - ప్రథమ ఖండము. పేజీ 155.

## iv) గండికోట లక్ష్మీనరసింగరావుగారి 'నేను చూసిన జర్మనీ' :

జర్మన్ ప్రొఫెసర్ల ఆహ్వానంమీద తూర్పు పశ్చిమ జర్మనీ దేశాలను సందర్శించి వచ్చారు డా. గండికోట లక్ష్మీనరసింగరావు. ఆయన యాత్రానుభవాలను 'నేను చూసిన జర్మనీ' అనే వ్యాసరూపంలో ఆంధ్రప్రభ వారపత్రిక 24-7-1985 సంచికలో ప్రచురింపచేశారు. దానిలో జర్మనీలో 'ప్రతివ్యక్తి కొన్ని సంవత్సరాలు మిలిటరీలో పనిచేసిన తర్వాతే మిగిలిన వృత్తులు చేపట్టాలి' అనడాన్నిబట్టి అక్కడి ప్రభుత్వంలో ఇంకా మిలిటరీ వ్యవస్థ తాలూకు ఛాయలు నిలిచిఉన్నాయనిపిస్తుంది.

## v) ఎ. బి. కె 'పశ్చిమ జర్మనీ యాత్రా విశేషాలు' :

పత్రికా ప్రతినిధుల బృందం 1988లో చేసిన యాత్ర ఇది. రెండవ ప్రపంచ యుద్ధానంతరం గడచిన 43 సంవత్సరాలలో జర్మనీదేశం పునర్నిర్మాణంలో సాధించిన ప్రగతిని సమీక్షించడానికి పశ్చిమ జర్మనీ ప్రభుత్వం ఆహ్వానం పంపింది. అందులో భాగంగానే ఆసియా, పసిఫిక్‌లలోని ఐదు దేశాల నుంచి - ఇండియా, బంగ్లాదేశ్, వియత్నాం, బ్రూనై, పాపువా న్యూగినీ - ఏడుగురు పత్రికా ప్రతినిధులకు అవకాశమిచ్చారు. ఇండియానుండి పత్రికా ప్రతినిధిగా ప్రముఖ పాత్రికేయుడు ఎ. బి. కె. ప్రసాద్‌గారు వెళ్ళివచ్చారు.

వీరు సందర్శించిన స్థలాలు - మ్యూనిక్, బాన్, కొలోన్, బెర్లిన్, హేంబర్గ్, ఫ్రాంక్‌ఫుట్‌లు. ఈ యాత్ర దక్షిణ జర్మనీలోని మ్యూనిక్‌నుండి ప్రారంభమై ఉత్తర జర్మనీలోని ఫ్రాంక్‌ఫుట్‌తో అంతమైంది.

అక్టోబరు రెండున ప్రారంభమై 15 రోజులపాటు జరిగిన ఈ యాత్రను రచయిత ఈ నెలలోనే సంభవించిన వివిధ చారిత్రక ఘట్టాలతో - అక్టోబర్ రెండు గాంధీజయంతి, అదేరోజు సియోల్ ఉత్సవాల ముగింపుకూడ-జోడించారు.

హిట్లర్ నడిపిన యుద్ధతంత్రంలో భాగంగా జర్మనీ పశ్చిమ, తూర్పు జర్మనీలుగా విడిపోయి పడమటి జర్మనీ, అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సు దేశాల (కాపిటలిస్టు) ఆధిపత్యంలోకిరాగా, తూర్పు జర్మనీ (సోషలిస్టు) అజమాయిషీలో ఉంది. నలభై ఐదు కిలోమీటర్ల బెర్లిన్‌గోడ బెర్లిన్‌ను నిలువునా చీల్చివేసింది.

---

* ఎ.బి.కె. ప్రసాద్. ప్రస్తుతం 'సుప్రభాతం' పక్షపత్రికకు సంపాదకులు.

ఐనా "ఉభయదేశాల ప్రజలలోనూ ఒక జాతిగా వారిమధ్య పరస్పర ప్రేమానురాగాలు తొలగలేదు. యుద్ధ కాలంనాటి బాధలు పంచుకున్న ఉభయ జర్మనీల ప్రజలు ఆ గాయాలు మరువలేకపోవడమే. కాదు, చెల్లాచెదురై పోయిన తమ కుటుంబాల పునస్సమాగమం కోసం వారు ఎదురు చూస్తున్నారు'[18] అని రచయిత ఆ ఉభయ దేశాలను సందర్శించినప్పుడు ప్రజల్లో వ్యక్తమైన అభిప్రాయాలను తెలియజేశారు. నలభై మూడేళ్ళ వ్యవధిలో మొత్తం జర్మనీ సాధించిన అభివృద్ధి 'కళ్ళు మిరుమిట్లు గొలిపేది'గా వుందన్నారు.

తమ దేశాన్ని, ప్రపంచాన్ని అగ్నిగుండంలోకి నెట్టిన హిట్లర్‌ను గురించిన ప్రస్తావన తేవడానికి అక్కడి ప్రజ లెవరికీ ఇష్టంలేదంటూ, జర్మన్‌లు యుద్ధమంటే అసహ్యించుకుంటున్నారనీ, మళ్ళీ యుద్ధం రాకూడదనీ, రానివ్వవద్దనీ కోరుకుంటున్నారనీ ఎ బి కె అభిప్రాయం.

యుద్ధంలో పూర్తిగా చితికిపోయిన పశ్చిమజర్మనీ అనతికాలంలోనే సాధించిన అభివృద్ధిని ప్రపంచమంతా 'జర్మన్ అద్భుతం'గా కొనియాడడానికి

---

18. ప్రాక్పశ్చిమాల మధ్య 28 సంవత్సరాలుగా అడ్డుగోడగా నిల్చిన బెర్లిన్ గోడ గత నవంబరు నెలలో కూలిపోయింది. దీని పూర్వరంగం ఇట్లా ఉంది: హంగేరీ ప్రభుత్వం తన వినూత్న పాశ్చాత్య సరళికి నాందిగా ప్రయాణ ఆంక్షలను తొలగిస్తూ, తన ఆస్ట్రియన్ సరిహద్దులోని ముండ్ల కంచెను తొలగించింది. అదివరకే తూర్పుజర్మనీలో కమ్యూనిస్టు నాయకుడు ఎరిక్ హోనెకర్ పాలనపట్ల ప్రజలు అసంతృప్తి చెంది వేల సంఖ్యలో ఆస్ట్రియా నుండి పశ్చిమ జర్మనీకి వలస వెళ్ళారు. తర్వాత 18-10-89 న నిరసన ప్రదర్శనలు ప్రారంభించారు. తర్వాత దాదాపు 30 లక్షల మందికి వీసాలు ఇవ్వడంతో 12-11-1989 న కుప్పకూలిపోయింది. రెండవ ప్రపంచయుద్ధానంతరం ఎన్నడూ ఇంత పెద్ద ఎత్తున ప్రజల వలస సంభవించలేదు. తూర్పు జర్మన్లు ఇంకా వలస వచ్చినట్లయితే వారికి స్థానం కల్పించలేమని పశ్చిమజర్మనీ ప్రకటించింది కూడ. పశ్చిమ జర్మనీలోని విలాస జీవితాన్ని అనుభవించాలన్న తహతహ తోటే తూర్పు జర్మన్లు, వలస వస్తున్నట్లు తెలుస్తున్నది. —"ప్రాక్ పశ్చిమాల మధ్య కూలుతున్న గోడలు" - (ఈ వ్యాస సారాంశమిది). ఎ. కె. దాస్ గుప్తా. ఈనాడు 6-12-1989.

కారణం కేవలం అగ్ర రాజ్యాలు అందించిన ఆర్థిక సహాయమే కాదు; కుటుంబ నియంత్రణలో వారు సాధించిన అభివృద్ధిని ప్రధానంగా పేర్కొనవచ్చునంటూ ఎబికె ఇలా అన్నారు. "చదరపు కిలోమీటరుకు 248 మంది నివసిస్తున్న జర్మనీలో 1974 నుండి జనాభా పెరుగుదల బాగా తగ్గిపోయింది. ప్రతి వెయ్యిమందికి సంవత్సరానికి సుమారు పది జననాలు. ఒక్కో జంటకు సగటున ఇద్దరు పిల్లలు పరిమితమయ్యారు." ఐతే ఈ పాలసీని అమలుపరచడంలో స్వపరభేదం చూపక పోవడం వల్ల నియంత్రణ నూటికి నూరుపాళ్ళు విజయవంతమైందట.

పశ్చిమ జర్మనీలో ఎగుమతి, దిగుమతి వ్యాపారం సమతుల్యంగా ఉండడం వల్లా, విదేశీ రుణాల బాధ లేకపోవడంవల్ల దాని కరెన్సీ విలువ పెరిగిపోతున్నట్లు భావించాల్సి వస్తుంది. ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం ద్రవ్యోల్బణంతో అష్టకష్టాలు పడిన జర్మనీ యాత్రాకాలం నాటికి (1988) అమెరికన్ డాలర్‌తో దాదాపు పోటీపడటం ఆర్థికాభివృద్ధిలో గణనీయమైన మార్పునే సూచిస్తున్నది. "ఐదేళ్ళనాడు ఒక మార్క్‌కు మనం సుమారు నాలుగు రూపాయలు చెల్లిస్తే, ఈ రోజున మనం అదే మార్క్‌కు సుమారు ఎనిమిది రూపాయలు చెల్లించుకోవలసి వస్తోంది. అలాగే కొన్నాళ్ళ క్రితం ఒక డాలర్‌కు నాలుగైదు మార్క్‌లు చెల్లించవలసి రాగా అదే డాలర్‌కు ఇప్పుడు 170 మార్కులు చెల్లిస్తే సరిపోతోంది."[19]

జర్మనీలో పత్రికలకు టి.వి.లతో పోటీ లేదట. జ్ఞాపక శక్తికి సంబంధించినంత వరకు ప్రింట్ మీడియా చేసినంతగా ఎలక్ట్రిక్ మీడియా ప్రభావితం చేయజాలదన్నది వారి అభిప్రాయంగా ప్రతినిధి గ్రహించారు. వార్తా సమాచారాలతోపాటు, విద్యా సాంస్కృతిక వినోద కార్యక్రమాలకే ఎక్కువ ప్రాధాన్యమంటూ 'నాయకుల వ్యక్తిగతమైన ప్రొజెక్షన్ ఈ సాధనాలలో మనకు కన్పించదు' అని వ్రాశారు.

## 3. కృష్ణమాచార్యుల గారి 'ప్రాక్ - పశ్చిమములు'

ఐరోపా ఖండంలో తాత్త్వికమైన ఆధ్యాత్మిక ప్రబోధంకొరకు కృష్ణమాచార్య (మాస్టర్)గారిని పాశ్చాత్య శిష్యులు ఆహ్వానింపగా, వారు రెండు నెలలు (22-4-1972 నుండి 22-6-1972) ఆ ఖండంలో పర్యటించి, కొన్ని ఆధ్యా

19. 'పశ్చిమ జర్మనీ యాత్రా విశేషాలు (2)' - ఈనాడు 24-10-1988.

త్మిక కేంద్రాలను కూడ స్థాపించి వచ్చారు సార్థకమైన ఈ పర్యటనకు సంబంధించిన ఆచార్యులు డైరీలోని ముఖ్యాంశాలే తరువాత గ్రంథరచనకు పురికొల్పాయి. పుస్తకం పేరు 'ప్రాక్ - పశ్చిమములు.' 341 పుటలున్న ఈ ఆధ్యాత్మిక యాత్రా గ్రంథం జనవరి 1982 లో ముద్రణ పొందింది. ఇది యాత్రానంతరం పది సంవత్సరాల తర్వాత మొదటి ముద్రణ. వరల్డ్ టీచర్ ట్రస్టు ప్రచురణ.

రచయిత గుంటూరు జిల్లాలోని బాపట్ల గ్రామవాసి, వైద్యులు. తెనాలి రామకృష్ణుని కావ్యాలపై సిద్ధాంతగ్రంథం వ్రాసి పాఠాలు చెప్పే డాక్టరుగా కూడ లబ్ధ ప్రతిష్ఠులయ్యారు. మాస్టరు సి.వి.వి ఒకసారి ప్రార్థన సమయంలో దర్శనమిచ్చి ఈయనను శిష్యునిగా స్వీకరించాడు. అప్పటికి రచయిత హిందూ కళాశాలలో ఉపన్యాసకుడు. 'మాస్టరు'గా మారిన తర్వాత ఒక విస్తృతమైన విశ్వ ప్రణాళికను అమలు పరిచే నిమిత్తం అధ్యాపక వృత్తికి స్వస్తి చెప్పవలసి వచ్చింది. ఆ ప్రణాళికే 'ప్రాక్ - పశ్చిమ సమన్వయం.'

పుస్తకానికి పీఠిక (ఓంకారము) వ్రాసిన చివుకుల రవిశర్మగారు ఈ ప్రణాళికా స్వరూపాన్ని ఈ విధంగా వివరించారు :

"ఓం పుట్టినది ఈ తూర్పున! ఇది పశ్చిమాన వ్యాపించాలి. వారిని అనుకరించినట్టి భారతీయుడు మళ్ళీ 'ఓం'గా జీవించగలగడం నేర్చుకోవాలి. అందుకే మాస్టరు గారు 'ప్రాక్ - పశ్చిమ సమన్వయము' అనే ప్రణాళిక స్వీకరించారు. ఇది మాస్టరుగారి ప్రణాళిక మాత్రం కాదు, పరమ గురువుల ప్రణాళిక."[20]

1968 లో ఐరోపా ఖండానికి చెందిన ఆల్బర్ట్ శశీ అనే వ్యక్తి కృష్ణమాచార్యను కలిసి సహచరుడు కావడం వల్ల మాస్టరుగారి సందేశం పాశ్చాత్య దేశాలకు విస్తృతంగా వ్యాపించడానికి మూలహేతువైంది. వీరిద్దరి ప్రథమ సమావేశం నీలగిరి కొండలలోని కోటగిరిలో జరిగిందట!

అప్పటి నుండి కృష్ణమాచార్య గారి ఆధ్వర్యంలో ఐరోపా దేశాల్లో వరల్డ్ టీచర్ ట్రస్ట్ (జగద్గురు పీఠం) శాఖలు నెలకొల్పబడ్డాయి. ఈ పీఠం ప్రధాన కేంద్రం 1972 లో విశాఖపట్టణంలో స్థాపింపబడింది. మానవ జీవితానికి కావలసిన తత్వశాస్త్రాన్ని, వైద్య శాస్త్రాన్ని సమన్వయించి సమగ్రంగా అందించ

20. 'ప్రాక్ - పశ్చిమములు' - ఓంకారము. పేజి

డానికి జెనీవా నగరంలో ఈ ప్రాతిపదక పైనే మోరియా విశ్వవిద్యాలయం స్థాపించబడి రూపుదిద్దుకుంది.

మాస్టరుగారు సనాతన ధర్మ ప్రచారంలో భాగంగా మొదటిసారిగా 1972 లో ఐదు యూరప్ దేశాల్లో (బెల్జియం, హాలెండు, ఫ్రాన్సు, స్విట్జర్లాండు, ఇటలీ) ఆధ్యాత్మిక యాత్ర చేశారు.

విశాఖపట్టణం, హైద్రాబాద్, బొంబాయి విమానాశ్రయాల గుండా విమానంలో ప్రయాణించి మొదట జెనీవాలో కాలు మోపారు. వెంట పి.యన్.యన్. వర్మ అనుచరుడుగా ప్రయాణించాడు. రాత్రి 1-30 గంటలకు బయలుదేరి తెల్లవారి 7-30 గంటలకు ఆల్ప్సు పర్వత ప్రాంతానికి చేరుకున్నారు.

వరల్డ్ టీచర్ ట్రస్టు పక్షాన 'ప్రేమ జలములకై దప్పికతో' తిరిగిన ఈ యాత్రికుడు ఐరోపా దేశాల్లో ఈ కింది విషయాలపై ఆధ్యాత్మికప్రసంగాలు చేశారు: శ్రీకృష్ణుని యోగ మార్గము, జ్యోతిషము, ఆత్మవిద్య, వేదము-ఆధ్యాత్మ విద్య, కులభేదము, వృత్తులు, గాయత్రి మంత్రోపదేశము, యోగధర్మ కేంద్రము, ప్రాణాపానములు - ప్రాణాయామము.

దివ్యజ్ఞాన శిక్షణ పొందిన వారు, యోగశిక్షణా కేంద్రాల్లోని సాధకులు యూరపు దేశాల్లో క్రమశిక్షణతో ప్రార్థనలు చేయుట, అందరూ ముక్తకంఠంతో శ్రావ్యంగా ఓంకారాన్ని మూడుసార్లు ఉచ్చరించుట, భారతదేశంలో జనుల నిత్య జీవితాన్ని గురించి భక్తుల సందేహాలకు మాస్టరు గారి సమాధానాలు మొదలైనవి ప్రాక్-పశ్చిమ సమన్వయానికి ఉదాహరణప్రాయంగా నిలుస్తాయి.[21]

---

21. మాస్టరుగారు 1984 లో నిర్యాణం చెందినప్పటికీ ఆయన నాటిన ఆధ్యాత్మిక భావాలు ఇప్పటికీ చెక్కు-చెదరలేదు. ఈ మధ్య ఓంకార నినాదాన్ని గురించిన వార్త ఒక దినపత్రికలో వచ్చింది. దాని సారాంశమిది:- అతీంద్రియ ధ్యానాన్ని సాధికారంగా ఆమోదించిన అమెరికా వైద్య శాస్త్రాలు మానసిక ప్రశాంతతకు ధ్యానం ఒక సాధనమని ఇదివరకే అంగీకరించాయి. అంతేకాక మాదకద్రవ్యాల బారినుండి బయట పడడానికి ఓంకారాన్ని సిఫారసు చేస్తూ ఈ మధ్య 'దిన్ సైడ్ అప్' అనే పుస్తకాన్ని ప్రభుత్వమే ప్రచురించింది.

ఈ ప్రకటనతో ప్రజల్లో ఒక వర్గంనుంచి పెద్ద పెట్టున నిరసన వ్యక్తమై, ఓంకారవాదం ఇప్పుడు అమెరికాలో పెద్ద వివాదంగా పరిణ

## 1) మాస్టరుగారి పరిశీలనలో పాశ్చాత్యుల సంస్కృతి :

### i) ఆహార పానీయాలు :

పాశ్చాతుల్లో భోజనాల వద్ద వింత ఆచారం కనిపిస్తుందట. భోజన సమయంలో కనీసం రెండు మూడు గంటలైనా గడుపుతారు. ఎక్కువగా కబుర్లతో కాలక్షేపాలతో సామూహికంగా భోజనం చేస్తారు. వీరి దినచర్య అంతా ఆయాసంగా, 'గుండె దడ'లాగా ఉరుకులు పరుగులతో 'కాల పరిక్షప్తమై ఉరిపెట్టుకొనుచున్నట్లుగా' గడవటమే భోజనాల దగ్గరి నెమ్మది తనానికి కారణమని మాస్టరుగారి అభిప్రాయం. బెల్జియంలో మంచి నీటికి బదులుగా మద్యాన్ని లేదా పండ్ల రసాన్ని పుచ్చుకుంటారు. పంపుల్లో నీళ్ళుంటాయి కాని అవి స్నానాదికాలకే వినియోగిస్తారు. త్రాగడానికి మినరల్ వాటర్ ఉంటుంది. భోజనం మధ్యలో నీళ్ళు త్రాగినప్పుడల్లా అక్కడి ప్రజలు మొదట వింతగా చూసి, తర్వాత మంచి నీటి బుడ్లను తెప్పించి మాస్టరుగారితోపాటు త్రాగుతూ 'పండుగ చేసికొన్నట్లు' సంతోషించారట.

ఆ దేశాల వారికి ఎంగిలి అంటే తెలియదనీ, అసలా పట్టింపే వారికి లేదని వ్రాస్తూ రచయిత ఇలా పేర్కొన్నారు: "మాటాడుచు చేతులు నోటిలో పెట్టుకొనుట, భోజన పదార్థములు వడ్డించునపుడు వ్రేలికంటినచో చీకుకొనుట, కడుగకుండ మరల వడ్డించుకొనుట సర్వసామాన్యము."[22] భారతదేశంలో వడ్డించువారు వేరు, తినేవారు వేరుగా ఉంటారు కాని యిక్కడ ఎవరికి వారే వడ్డించుకుంటూ తింటారు కాబట్టి ఈ పద్ధతి. మనకు మజ్జిగ లాగ ఇక్కడి వారికి ఐస్‌క్రీమ్. ఐస్‌క్రీమ్ తిన్న తర్వాత వెంటనే కాఫీ త్రాగితే దంతాలకు అరిష్టమని మన వాళ్ళ అభిప్రాయమైతే వాళ్ళకది తప్పనిసరి అలవాటు.

చిన్నా పెద్దా కలిసి బాహాటంగా మద్యం సేవించే ఫ్రాన్సు దేశంలో కొన్ని ప్రాంతాల్లో వక్కపొడి పేరు చెబితే వెంటనే పోలీసులు అరెస్ట్ చేస్తారు. అది ఘోరమైన మాదక ద్రవ్యమని వారి విశ్వాసమట!

---

మించింది. ధ్యానానికి మంత్రోచ్చారణ చాలా సులువైన పద్ధతిని ఓంకార మంత్రాన్ని ఉచ్చరిస్తూ 20 నిమిషాలపాటు మనస్సును కేంద్రీకరించాలని, తద్వారా గొప్ప అనుభూతిని పొందవచ్చునని ఆ పుస్తకం పేర్కొంది. ఇందులో అభ్యంతరకరమైనవేమీ లేకున్నా, ఓంకారం హిందూమత ప్రతిపాదితం కాబట్టి ఒక వర్గంలో నిరసన చోటు చేసుకొంది - ఓంకార వివాదం - ఆంధ్రజ్యోతి డైలీ, 15-9-1989.

భారతదేశంలోని కులభేదాల గురించి యథేచ్ఛగా ప్రసంగించే పాశ్చాత్యుల్లో ధనవంతు లెవరు కూడ పేదలతో పంక్తి భోజనం చేయరట! వంటవారు కాని, వారి పిల్లలు కాని యజమానులు భుజిస్తుండగా చూడరాదన్న నియమమున్నట్లుగా మాస్టరుగారి అనుభవంలో తేలింది.

## ii) శుచి - శుభ్రత :

తెల్లజాతిలో ఎక్కువమంది నిత్య స్నానాలు కాని దంతధావనం కాని చేయరు. చాల ఇండ్లలో స్నానాల గదులే లేవంటూ భారతీయ యోగ సంప్రదాయాన్ననుసరించి జీవించేవారు మాత్రం నిత్యస్నానాలతో పరిశుభ్రతను పాటిస్తున్నారని వ్రాశారు. ఇంకా వీధులను పాడు చేయడం, కార్లు, సైకిళ్ళు, స్కూటర్లు బాటసారుల కడ్డంగా ఉంచకం, భారతీయుల లాగ వీధుల్లోనే మల మూత్ర విసర్జనం చేయడం, చివరకు త్రోవ కడ్డంగా నిలబడి మాట్లాడుకునే అనాగరిక లక్షణాలు ఏ కోశానా కనిపించకపోవడం అన్నవి వారినుండి మన వాళ్ళు నేర్చుకోవలసిన సుగుణాలుగా రచయిత పేర్కొన్నారు.

## iii) మత విశ్వాసాలు :

పాశ్చాత్య దేశాల్లో అపర కర్మలకు కావలసిన ఖర్చు ఆ వ్యక్తి జీవించి నప్పుడు కావలసిన దానికంటె ఎక్కువే అవుతుందిట. మత సంబంధి వాహనాలలో మాత్రమే పెద్ద మొత్తం చెల్లించి మృత శరీరాన్ని సమాధి స్థలానికి తీసికొనిపోవాలని ఇక్కడి శాసనం. అందుకే ఈ దేశాల్లో జీవనంకంటె చావు చాల ఖరీదైనదిగా తోస్తుంది.

మూఢ విశ్వాసాల్లో పాశ్చాత్యులు కూడ మన వారికంటె ఏమి తీసిపోనట్లు అనిపిస్తుంది. సమాధి చేసిన తర్వాత తిరిగి వచ్చేటప్పుడు గోరీల దొడ్డికి దగ్గరలో ఉండే నల్లరాతి మేరీ మాతను దర్శించిన తర్వాతనే యింటికి వెళతారనీ, అట్లా వెళ్ళకపోతే వారి ఇంట్లో ఎవరో ఒకరు చనిపోవడం ఖాయమనీ వారి నమ్మకంగా తెల్పారు రచయిత.

గాంధీమహాత్ముని, అరవిందయోగి విగ్రహాలను ప్రతిష్ఠించి నిత్య పూజలు చేసే మందిరాలను ఫ్రాన్సులో చూసినట్లు రచయిత చెప్పుకున్నారు. మేన్లీ పి. హాల్ అనే 'సిద్ధ పురుషుడు' రచించిన 'ఫోనిక్స్' అనే పుస్తకంలో గాంధీ మహాత్ముడు నారాయణుని పదవ అవతారంగా వర్ణింపబడటమేకాక, పార్కిన్సన్

వైద్యశాలలో (లియాన్ నగరం) గాంధీమహాత్ముని పవిత్ర దేవాలయం కూడ ఉన్నట్లు తెల్పారు. గర్భాలయంలో 'దేవుని పదియవ అవతారము' అని చెక్కబడి ఉన్నట్లు గమనించారు.

## iv) ఆచార సంప్రదాయాలు :

ఫ్రాన్సులో ప్రజలంతా ఆచార వ్యవహారాలకు దాసులంటూ "ప్రతి చిన్న విషయమునకు కృతజ్ఞత వాచ్యముగా (థాంక్యూ) చెప్పవలసివచ్చును. భార్య అన్నము వడ్డించినచో భర్త 'థాంక్యూ డియర్' అనును "అని వారి అతి మర్యాదకు రచయిత ఆశ్చర్యం చెందారు. వీరి కృత్రిమ మర్యాద పూర్వకమైన మాటలకు విసుగెత్తి రావుగారు ఒక సందర్భంలో "లఘుశంక తరువాత ఆ బేసినుకు థ్యాంక్యూ అని చెప్పకపోయినచో మరొకసారి పోయనీయదేమో అను అనుమానము నాకు వచ్చెను" అని చమత్కరించారు.[23]

యూరోపులోని ఆడువారందరికి కన్నుకొట్టే అలవాటుందట. ఐతే అక్కడది ఫ్యాషనే కాని మనదేశంలోలాగ తప్పుకాదని రచయిత తెల్పాడు. ఇక్కడ ముఖ్యంగా ఉపన్యాసాల్లో శ్రోతలు కన్నుకొట్టుట - వక్తను మెచ్చుకొని గౌరవించుటకు చిహ్నంగా భావిస్తారు.[24] తిరిగి కన్ను కొట్టినట్లయితే వారి మెప్పుదలను వక్త గౌరవించినట్టవుతుందట।

ఫ్రాన్సులో బాటవెంట నడుస్తూకూడ భార్యాభర్తలే కాక విద్యార్థినీ విద్యార్థులుకూడ గాఢాలింగనాలతో వెళ్తుంటారట. బాహాటంగానే ముద్దులు పెట్టుకోవడం ముఖ్యంగా ఇద్దరు వ్యక్తులు కలుసుకున్నప్పుడు, విడిపోతున్నప్పుడు కరచాలనంతో బాటు పరస్పర చుంబనం ఆప్యాయతకు చిహ్నంగా తలుస్తారని రచయిత వ్రాశారు.

తల్లిదండ్రులు తమ పిల్లలకు మందులు తీసుకునేటప్పుడు 'అవివాహితలైనను గర్భ నిరోధక మాత్రలు వాడవచ్చునా' అని అడిగి తెలుసుకోవడం ప్రత్యక్షంగా చూసి పవిత్రతకు వారిచ్చే స్వల్ప ప్రాధాన్యానికి మాస్టరుగారు అమితాశ్చర్యం చెందారు.

---

22. "ప్రసంగమునుగాని, చలోక్తినిగాని వారు మెచ్చుకొన్నప్పుడు తమ సంతోషమును వ్యక్తము చేయుటకు కన్నుకొట్టెదరు."—'ప్రాక్ పశ్చిమములు' పేజీ. 155.

బెల్జియంలో మోసానికి అవకాశం తక్కువ. ఒకవేళ ఏదైనా మోసం జరిగినా వెంటనే పోలీసులువచ్చి, చిరునవ్వుతో అపరాధివద్ద జరిమానా వసూలు చేసికొని పోతారట!

ఐరోపా దేశంలో ఇంగ్లండు వారికి తప్ప ఎవరికీ ఇంగ్లీషు రాదు. చివరకు విశ్వవిద్యాలయ ప్రొఫెసర్లకు కూడ చాలమందికి ఇంగ్లీషు రాదనీ, బెల్జియం, ఫ్రాన్సు, స్విట్జర్లాండు, హాలెండు దేశాల్లో ఫ్రెంచి మాట్లాడువారే ఎక్కువన్నారు.

## 2) మాస్టరు గారి భావ వ్యక్తీకరణం :

కృష్ణమాచార్య గారు 'మాస్టరు'గా మారకముందు గుంటూరులోని హిందూ కళాశాలలో లెక్చరర్‌గా పని చేశారు. తెలుగు సాహిత్యంలో పరిశోధన వ్యాసాన్ని సమర్పించారు. కాబట్టి భావాభివ్యక్తీకరణకు లోటులేదు. ఈయన చాలాచోట్ల ప్రకృతి వర్ణన సందర్భంగా ఉపమాలంకారాలను ఉపయోగించారు.

జెనీవా చేరడానికి ముందు విమానంలోంచి చూస్తే ఆల్ప్స్ పర్వతశ్రేణి సూర్యరశ్మిలో 'వెలుగుచున్న మంచుకిరీటములను ధరించిన శిఖరములతో మనోహరమై' తోచిందట.[25]

హాలెండులో ఒకనాటి ప్రభాతాకాశం మాస్టరుగారికి ఇట్లా కనిపించింది : "మబ్బు ముసుగుతో నాన్పుడు వర్షముతో ప్రభాతాకాశము పాలిపోయినట్లు కళావిహీనమై, చెట్ల నడుమ నుండి ఆకాశము జలుబు భారము చేసినట్లు కనిపించెను."[26]

హాలెండు నుండి ఫ్రాన్సుకు వెళ్ళేదారిలో దూరాన పర్వతశ్రేణుల సానువులు పైన్ మహారణ్యాలతో నిండి కనిపించగా "ఆ పర్వత శిఖరములు గొంగళ్ళు కప్పుకొని కూర్చున్న వృద్ధుల వలె" మాస్టరుగారి మనసుకు తట్టింది[27]

మాస్టరు గారి రచన అంతా సరళ గ్రాంథికంలోనే సాగింది.

---

23. 'ప్రాక్-పశ్చిమములు' - పేజీ 5.
24. 'ప్రాక్-పశ్చిమములు' - పేజీ 102.
25. 'ప్రాక్-పశ్చిమములు' - పేజీ 145.

# ఇంగ్లండు యాత్రలు

## 1. డి.వి. సుబ్బారెడ్డిగారి 'సీమకు స్టీమరులో'*

దండా వెంకట సుబ్బారెడ్డి గారు నెల్లూరి నివాసి. వైద్య విద్య పూర్తి చేసుకొని పై చదువులకొరకు ఇంగ్లండుకు వెళ్ళారు. 5-4-1928 నుండి 26-4-1928 దాకా 22 రోజులపాటు నిరంతరంగా సాగింది ఈ యాత్ర. దారి పొడుగునా తాను చూసిన వింతలు, వేడుకలను ఇంటివద్ద ఉన్న ఆప్తమిత్రులకు 'సాహితీ బంధువులకు' లేఖా రూపంలో వ్రాసి పంపారు.[1] అట్లాగే డైరీలో కూడ వ్రాస్తూ వచ్చారు. తర్వాత 40 సంవత్సరాలకు అంటే 1968లో ఈ డైరీల లేఖల ఆధారంగా 'సీమకు స్టీమరులో' అన్న గ్రంథాన్ని ముద్రింపచేశారు. ఇది పీఠికతో కలుసుకొని 98 పుటల యాత్రా గ్రంథం. 'బారిష్టరు పార్వతీశం' వ్రాసి ప్రకటించిన మొక్కపాటి నరసింహశాస్త్రి గారు ఈ పుస్తకానికి పరిచయ వాక్యాలు వ్రాయడం ఎంతో సమంజసంగా ఉంది.

### i) యాత్రా మార్గం :

సుబ్బారెడ్డిగారు కొలంబో నగరం నుండి స్టీమరులో బయలుదేరారు. జలమార్గంలో తటస్థించిన సముద్రాలు, నగరాలు ఇట్లా ఉన్నాయి: హిందూ మహా సముద్రం, అరేబియా ఎర్ర సముద్రాల జలసంధి, ఎర్ర సముద్రం, సూయజ్ గల్ఫ్ గట్టుద్వారా సూయజ్ కాలువ ప్రవేశం, పోర్టు సైదు, మధ్యధరా సముద్రం, పాంపీ నగరం, నెపోలియన్ జన్మభూమి 'కార్సికో', టులాన్ హార్బరు, జిబ్రాల్టరు జలసంధి, అట్లాంటిక్ మహాసముద్రం, బిస్కే అఖాతం, సౌథాంప్టన్ రేవు పట్టణం, ఈ రేవు విడిచి దక్షిణ తీరాన్నే ప్రదక్షిణం చేస్తూ

---

1. చిన్ననాటి నుండి ఆంధ్రభాషలో సంప్రదాయ బద్ధమైన విద్యా సంస్థలలో చదువుకొని, గ్రాంథిక భాషలో వ్రాయనేర్చుకొన్న వాడననీ, 1925-28 వరకు సాహితీ సమితి సభ్యుల రచనలు చదివాననీ రచయిత 'ప్రస్తావన' (P. XIV) లో చెప్పుతున్నారు. ఈ సందర్భంలో పరిచయమైన ఆప్తులే సాహితీ బంధువులు కావచ్చు.

డోవరు జలసంధి తరణం, ఇంగ్లీషు ఛానల్ - చివరగా లండన్ నగరం. ఈ ప్రయాణానికి మూడు వారాలు పట్టిందట.

ఐతే ఈ పుస్తకంలో లండన్ నగరానికి చేరుకునేంతవరకు రచయిత పొందిన అనుభూతి వర్ణన ఉంది. లండన్ నగరంలో పర్యటించి చెప్పిన అనుభవాలు తక్కువ. అసలు రెడ్డిగారు ఇంగ్లాండులో ఒకరోజు గడిపిన అనుభవంతోటే ఈ పుస్తకరచన పూర్తవుతుంది. కాబట్టి ఇది ముఖ్యంగా యాత్రామార్గ వర్ణనేకాని నగరవర్ణన కాదు. అందుకే రచయిత దీనికి 'సీమకు స్టీమరులో' అని పేరుపెట్టారు.

గ్రంథకర్తకు కవి హృదయమూ, కళా హృదయమే కాకుండా అదుగదుగునా హాస్యధోరణికూడ ఉన్నట్లు రచనవల్ల స్పష్టమౌతుంది.

## ii) సముద్రదృశ్య వర్ణన :

సుదీర్ఘమైన సముద్రయాత్రలో తీరిక చిక్కినప్పుడల్లా రెడ్డిగారు డెక్కుమీదికి వచ్చి జలధి చిత్రాలను దర్శిస్తూ వచ్చారు. సముద్రం ధగధగా మెరుస్తూ ఒక్కో నిముషంలో ఒక్కో వన్నె కలిగి ఉండట. ప్రొద్దువ తెల్లదుప్పటి వలె, మధ్యాహ్నం ఊదారంగు గోటు కాగితం వలె, సాయంత్రం వెండి పోత పోసినట్లు కనిపించిందన్నారు. సూర్యరశ్మిలో సముద్ర మొక పెద్ద వెండిపళ్ళెరంలా ఒకప్పుడు, భూదేవి కట్టుకొన్న సరిగకోకలా తళతళ లాడుతూ ఇంకోసారి, సూర్యాస్తమయంలో తూర్పు దిక్కున వెండిజరీ వలె, చంద్రోదయం తర్వాత పాదరసం కోనేరు వలె మెరుస్తూ మరొకప్పుడు సముద్రం అనంత రూపాలతో దర్శనమిచ్చినట్లు అనుభూతి చెందారు.

స్టీమర్లు రాత్రిళ్ళు సందేశాలు పంపుకునేటప్పుడు వాటిపై భాగంలో చిన్న లైట్లు వెలుగుతూ, ఆరిపోతూ ఉంటాయి. ఈ సంకేతాలు రచయితకు 'స్టీమర్లు దీపాల నాలుకలతో మాట్లాడుకుంటున్నట్లు'గా తోచిందట.[2]

అరేబియా, ఎర్ర సముద్రం కలిసే ఇరుకైన జలసంధిలో ప్రయాణిస్తున్నప్పుడు స్టీమరు అతలాకుతలమయింది. విపరీతమైన ఊగిసలాటలో 24 గంటలు ప్రాణాలు బిగపట్టుకొని రెడ్డిగారు దిగులుపడ్డారు.

---

2. సీమకు స్టీమరులో - పేజీ 12.

సూర్యుడు గడియారంలో ముల్లువలె ఆకాశంలోకి ఎగబ్రాకడం, దూరాన సముద్రంపై నురుగులు ఆవుల మందలు పరుగెత్తినట్లుగా తోచడం, సూర్యోదయ కాలంలో అరుణుడు ఎర్రగా పిడకనిప్పువలె, ఆకాశం వేయించిన యిసుక వలె పచ్చగా కనిపించడం- ఇవన్నీ రెడ్డిగారి కవితాత్మకు, భావనా బలానికి ప్రతీకలు.

ఒకనాటి సాయంత్రం సూర్యగోళం పూర్తిగా నీళ్ళల్లోకి మునిగిపోగానే "చలి కుంపటి ఆరిపోతే ఏనాదివాళ్ళు గుడిసెలోకి పరుగెత్తేట్లు" వీళ్ళు లోపలికి వచ్చి పడుకున్నారట. స్వదేశంలో ఉన్నప్పుడు దాని విలువ తెలియలేదు. కాని, ఇప్పుడు ఈ సముద్రయానంలో ఎండ విలువ తెలిసి వచ్చి, మాతృదేశం మీద ప్రేమ తెలిసి వచ్చిందని వ్రాశారు. దూరమైననాడే ఎవరైనా చేరువయ్యేది.

లండన్‌లో 'ఇంగ్లీష రైలు'లో బస్సుల్లో ఒకనాడు చేసిన ప్రయాణంలో విశేష విషయాలేమీ లేవు.

## 2. వెంకటరావుగారి 'మా మహారాజుతో దూరతీరాలు'* అనే ఇంగ్లండు యాత్ర

కురుమెళ్ళ వెంకటరావుగారు మహారాజావారితో విదేశ యాత్ర చేశారు బొంబాయి రేవునుండి ఓడలో యాత్ర ప్రారంభమైంది. అరేబియా సముద్రం గుండా ఏడెన్ హార్బర్, బేబిల్ మాండబ్ జల సంధి గుండా ఎర్ర సముద్రం, సూయజ్ కాలువ ప్రవేశం, తర్వాత పోర్టు సెడ్, మధ్యధరా సముద్రం, మాల్టా ద్వీపం, మార్సెల్సు హార్బర్- ఇక్కడి నుండి ఫ్రెంచి తీరాన ఉన్న కెలే దాకా పి. అండ్ ఓ. వారి ట్రెయిన్ పారిస్‌గుండా బ్రిటిష్ ఛానల్ దగ్గరికి- చిన్న స్టీమర్లో బ్రిటిష్ ఛానల్ దాటి అవతలి ఒడ్డున ఉన్న రైల్లో లండన్‌కు- ఇది ఇంగ్లాండు యాత్రా మార్గం.

లండన్‌లో మకాం పెట్టి, రోజూ పరిసరపట్టణాలను సందర్శించడానికి మహారాజావారి బృందం కార్లలో వెళ్ళేవారు. లండన్‌నగరాన్ని రచయిత 'దరీ దాపూ లేని పెద్ద సముద్రం'గా వర్ణించారు.

---

* 'అమెరికా యాత్రలు' అన్న ప్రకరణంలో రచయిత పరిచయం జరిగింది. పూర్తి పేరు కురుమెళ్ళ వెంకటరావు.

చెల్టెన్ హోమ్‌లో పూల దుకాణం ఎదురుగా నిలబడ్డప్పుడు వీళ్ళ బృందం లోని వారు ధరించిన చీరెలూ, ముసుగులూ చూడడానికి దాదాపు వందకుపైగా జనం గుమిగూడారట! ఈ ఊరు చిన్నది కావడం వల్లా, మన వస్త్రధారణ వాళ్ళకు కొత్త కాబట్టి వింతగా చూశారే కాని మరొకందుకు కాదని వెంకట్రావుగారు అప్పటి వారి ప్రవర్తనను సరిపెట్టుకున్నారు. ఐతే చాలా కాలం కిందట లండన్‌లో మనవాళ్ళు కనిపిస్తే జంతువుల లాగే వింతగా చూసేవాళ్ళన్న దానికి తాను విన్న సంఘటనను ఇలా వివరించారు:

"లండన్ పట్టణంలో ఇద్దరు ఇండియనులు నడిచి వెళుతుంటే ఇలాగే జనం మూగి వింతగా చూడడం మొదలు పెట్టారట. మనవాళ్ళు ఇదేమిటి ఇంత అజ్ఞానం వీళ్ళకి అని ఒకరితో ఒకరు చెప్పుకుంటుంటే జనంలో ఒకామె భర్త చెయ్యి పట్టుకులాగి, 'Look! Look! It speaks! It speaks' అందట!"[4] ఇందులో ఎంతవరకు నిజముందో రచయితకే తెలియాలి.

నగర మధ్యంలో ఉన్న హైడ్ పార్కును నందనవనమంటూ ఇది 'లండన్ కట్టుకున్న పువ్వుల చీర' అని వర్ణించారు. దీనిలోనే 'లవర్స్ కార్నర్' ఉందనీ, అక్కడ పచ్చగడ్డి మీద ప్రపంచం మాటే మరచి యువతీ యువకుల జంటలు ఒకరి ఒళ్ళో ఒకరు కాలక్షేపం చేస్తారనీ వ్రాశారు. అలింగనాలు, చుంబనాలు బాహాటంగా నిర్భయంగా జరుగుతుంటాయట!

లండన్‌కు 80 కి. మీ. దూరంలోని వండ్సర్ పార్కులో జరిగిన 'డాగ్ షో'కు రచయిత వెళ్ళారు. జేబులో పెట్టుకునేంత చిన్నవీ, గాడిదంత పెద్దవీ ఎన్నో రకాల వేల కొద్ది కుక్కలను వాటి యజమానురాండ్రు ప్రదర్శనకై తేగా, ఇక్కడ ఆయనకు ఎవరిని చూడాలో తోచింది కాదు. అందుకే "కుక్కల యజమానులే స్వయంగా కుక్కలను పట్టుకు నిలబడితే కుక్కలనే చూడనా? దొరసానుల్నే చూడనా?" అని ఊగిసలాటలో పడ్డారు.[5]

ఇంగ్లాండులో ఎక్కడికి వెళ్ళినా 'టిప్'లు (సంభావన) ఇవ్వడం గొప్ప ఆచారమట. అందుకే వెంకట్రావు గారు "ఈ దేశాలకి వచ్చే వాళ్ళు ముందుగా బడ్జెట్టు వేసుకుంటే టిప్పులకు కూడా కొంత సొమ్ము కేటాయించా"లన్నారు.[6]

---

4. 'మా మహారాజుతో దూర తీరాలు' - పేజీ-18.
5. 'మా మహారాజుతో దూర తీరాలు' - పేజీ-33.
6. 'మా మహా రాజుతో దూర తీరాలు.' - పేజీ. 18.

ఐతే ప్రతిఫలానికి అక్కడి వాళ్ళు అర్హులేనంటూ వారు చూపే ఆదరణ అంతు లేనిదన్నారు.

## i) రైట్ ఆనరబుల్ శ్రీనివాస శాస్త్రితో పరిచయం :

శ్రీనివాస శాస్త్రిగారి ఆంగ్ల ధోరణికి ముగ్ధులై బ్రిటిషువారు లండన్ పౌర సత్వాన్నిచ్చి గౌరవించారు భారతీయులకిది సాధారణంగా లభ్యం కాని విశేష గౌరవం. లండన్ సిటీలోని ఒక పెద్ద హోటల్లో 'పెద్ద లాంగ్ కోటూ, తెల్లటి పెద్ద తలపాగా' చుట్టుకున్న శాస్త్రిగారిని రావుగారు గుర్తించి, నమస్కారం చేసి పరిచయం చేసుకున్నారు. రావుగారి కోరికపై ఆటోగ్రాఫ్ పుస్తకంలో సంతకం చేస్తూ శ్రీనివాస శాస్త్రి ఈ విధంగా వ్రాశారట:

"మన దేశంలో ఎవరైనా పెద్దవారు ఎదురైనప్పుడు చెయ్యెత్తి నమస్కరించడమో, 'సలాం' కొట్టడమో చేస్తే మనం ఇతరులకు మర్యాద చూపినట్లు లెక్క. అదే లండన్‌లోనైతే చాలా తప్పట! అక్కడ నమస్కరించడమంటే 'నెత్తిమీది టోపీ కొంచెం పైకి ఎత్తితే చాలు'. ఆడవాళ్ళు ఎదురైనా ఇదే పద్ధతి. ఐతే వీళ్ళు తెలిసినవాళ్ళే ఐఉండాలన్న రూలేమీ లేదు".7

## ii) సొగసుకత్తెల వేషాలంకరణ :

ఏవైనా క్రొత్త మార్పులు, డిజైన్లూ కనిపెట్టేది వేసవి కాలంలోనట. మన వాళ్ళకి ఎవరైనా చూస్తారేమోనన్న సిగ్గు ఎక్కువ అయితే ఇక్కడి స్త్రీలకు అట్లా కాదు. 'వేనిటీ' ఎక్కువ. ఎంతమంది తమని తేరిపార చూస్తే అంత గొప్పగా భావిస్తారు. బొత్తిగా 'అన్యాయం' ఐన బాడీఙ లాంటివి కూడా వేసుకొని బయట తిరిగే సొగసుకత్తెలను అక్కడక్కడ రచయిత చూసి వారి నాగరికతా వ్యామోహానికి ఆశ్చర్య పడ్డారు. ఆభరణాల మీది కంటె ఖరీదైన అందమైన బట్టలం టేనే వీళ్ళకు ఎక్కువిష్టం. ముసలివాళ్ళు కూడ అందంగా కనపడడానికి 'అలవి కాని షోకు' చేసుకుంటారట. వీళ్ళ వికారపు అలంకారాలను చూసి ఏవగింపుతో రచయిత ఇలా అన్నారు:

---

7. డి.వి. సుబ్బారెడ్డి గారు థామస్ కుక్స్ అనే బ్యాంకుకు వెళ్ళారు. తల మీద టోపీ పెట్టుకొని గదిలోకి పోతున్నప్పుడు ఆయన మిత్రుడు మెల్లగా చెవిలో ఊదాడట 'టోపీ తీసివేయాలని.' - సీమకు స్టీమరులో. పేజీ. 77.

"ముసలి ముండలు కూడా పెదవులకీ, బుగ్గలకీ, కనుబొమలకీ రంగులు పూసుకుని తాము కూడా ఇతరులచేత ఆకర్షింపబడాలని చూస్తుంటే, ఇంక కుర్రాళ్ళ సంగతి చెప్పాలా? సౌందర్యం వెర్రి తలలెత్తదూ?"8

ఇంగ్లాండుకు దక్షిణాతీరాన ఉన్న 'ఫాల్ మత్' అనే ఊళ్ళో ఒక బోట్ రేస్ జరిగింది. వందలకొద్ది చిన్న చిన్న బోట్లు సముద్రంలో నల్లని నీటి మీద తెల్లని తెరచాపలెత్తుకుని రివ్వున పోతున్న దృశ్యం రచయితకు 'అప్పుడు సముద్రం అంతా తెల్లరెక్కల సీతాకోక చిలుకలు వాలాయా' అన్నట్టు కనిపింప జేసింది. ఈ గ్రామాన్ని సందర్శించడంతో వెంకట్రావుగారి ఇంగ్లాండు పర్యటన పూర్తయింది.

## 3. సోమసుందర్ గారి 'ఆంగ్ల సీమలో ఆమని పీణలు'*

ఇంగ్లాండు గురించి చేసిన యాత్రా మార్గ వృత్తాంతం, అక్కడి జనుల ఆచార వ్యవహారాలు తెలిపే యాత్రా గ్రంథాలు పైన పరిచయమయ్యాయి. ఇవి వచనంలో వ్రాయబడ్డాయి. ఐతే ఈ వివరాలను చర్విత చర్వణం చేయకుండా ఇంగ్లండు దేశ యాత్రలో తాను పొందిన అనుభూతులను కవితామయంగా చిత్రించారు ప్రసిద్ధకవి ఆవంత్స సోమసుందర్ గారు. ఇంతకు ముందు పద్యాల్లో శ్రీశైల, కాశీయాత్రల గురించి యాత్రాకావ్యాలు వెలువడగా ఇది వచన కవితా రూపంలో వెలువరించిన రచన. ఇంగ్లండు యాత్రా కవితలకు రచయిత 'ఆంగ్ల సీమలో ఆమని పీణలు' అని నామకరణం చేశారు.

19-8-1983 నుండి 19-11-83 ల మధ్య మూడు నెలలు ఇంగ్లండులో ప్రయాణిస్తూ వెంట వెంట వ్రాస్తూ వచ్చిన 26 కవితల సంపుటి ఈ పుస్తకం. 1986 లో ప్రచురణ పొందిన ఈ గ్రంథంలో 112 పుటలున్నాయి.

డా. బాబూరావుగారు ఇంగ్లండులో నివసించే భావసమన్వయం ఉన్న డాక్టర్లను కొందరిని ఒకచోట చేర్చి తెలుగు క్లబ్‌ను స్థాపించారు. ఆ సంస్థ ద్వారా ఆయన ఆహ్వానాన్ని మన్నించి డా. ఆరుద్ర గారితో పాటు సోమ సుందర్‌గారు ఇంగ్లండ్‌కు యాత్ర చేశారు.

---

8. మా మహారాజుతో దూరతీరాలు - పేజి. 43.

* ఆవంత్స సోమసుందర్ గారు.

బర్మింగ్‌హామ్‌లో మకాం ఏర్పాటు చేసుకొని ఆయా ప్రదేశాలు చూస్తూ ప్రతి రోజు రాత్రికి తిరిగి వచ్చే విధంగా ప్రణాళికను రచించుకున్నారు. కారులో ప్రయాణం. కారులోనే ఎప్పటికప్పుడు తోచిన భావాలకు కవితా రూపమిస్తూ బర్మింగ్‌హామ్ మకాంలో శుద్ధప్రతులను పూర్తి చేసేవారు.

ఇంగ్లండులో రచయిత చూసిన స్థలాలు, కేంబ్రిడ్జి, ఆక్స్‌ఫర్డు యూనివర్శిటీలు, లేక డిస్ట్రిక్టు, చెడ్డార్ కేవ్స్, స్కాట్లండు కొలనులు, బ్రిష్టల్ నగరం, లివర్‌పూల్, హెవర్త ఏవన్ నది, లండన్ లోని ట్రిఫాల్గర్ స్క్వేర్, బకింగ్ హేమ్ పాలెస్, డౌనింగ్ స్ట్రీట్, పార్లమెంటు హౌస్, బ్రిటిష్ మ్యూజియమ్.

డా. బాబురావు గారు తమను ఇంగ్లండు ఆహ్వానించినందుకు కృతజ్ఞతలు తెలుపుతూ భారతదేశపు విశేషాలను కూడ అదే కవితలో జోడించారు. దానిపేరు 'ఎడ్జిబాస్టన్ సౌంధాతర కర్మసాక్షి.'

> 'ఎన్నిటికని కృతలు చెప్పుకోను బాబూరావుగారూ
> జనాంతర సుహృత్సంబంధాలపై
> కాళిదాసుకు మల్లే నమ్మకమున్న వాడినైతే
> ఎంత బావుణ్ణు!' (పేజీ. 49)

ఇలా మొదలవుతుంది కవిత.

సోమసుందర్ గారు పిఠాపురం వాస్తవ్యులు కాబట్టి కోస్తా ప్రాంతంలో వరదలు వచ్చినప్పుడు, తుపాను బీభత్సంలో ప్రజల బాధలను కూడ ఏకరువు పెడుతూ అదే కవితలో ఇలా వ్రాశారు:

> "ఏం చెప్పమంటారు మనదేశం విశేషాలు?
> అశేష బాధా సర్ప సహస్రాలు?.........
> తప్పట్లు చరుస్తూ పిలిచే ఈదురు గాలులకు
> గర్జిస్తూ పొంగి వస్తుంది సముద్రం.......
> కంచంలో మిగిలిన నాలుగు మెతుకుల్నీ
> తుడిచి పెట్టుకు పోతుంది పెను దుఃఖం...
> చరిత్ర హీనులైన మనవాళ్ళ బ్రతుకుల అఖాతాలకు సాయం
> మహిమల మౌఢ్యం హిమాలయాలంతటి సమున్నతం."
> (పేజీ. 51)

పరదేశంలో సంచరిస్తూ కూడ తెలుగు దేశపు కవులను గురించి స్మరించు కోవడం ఈయన దేశీయాభిమానానికి ప్రతీక. చెడ్డార్ కేవ్స్‌లో తనను విడిచి వెళ్ళిపోయిన సోదర కవులు అనిసెట్టి, కుందుర్తి, పురిపండాలను, మిల్టన్‌కీన్స్‌లో తిలక్‌నూ స్మరిస్తూ కవితలు వ్రాశారు.

"ఏ పురాతన మద్యమున మురిగెనో కాని
మత్తు లందించేను స్కాట్లండు పెనుగాలి"

అంటూ స్కాట్లండులోని పెనుగాలి పేరు 'స్కాచ్' అన్నారు.

ఆంగ్ల సీమలో తమకెక్కడా కష్టాలు, కన్నీళ్ళు కానరాలేదని ఫేర్కొంటూ-

"ఎంత వెదికినా రవంత గ్లాని కానరాని భూమి
ఏది ఏది అని వెదకిన ఓహో అను ఆంగ్ల సీమ."

గ్లాని లేని సీమ ఈ ప్రపంచంలోనే లేదు. ఐనా కవి ఇలా భావించడానికి అప్పటి ఆయన మానసిక స్థితే కారణం. 'ఎన్నగ మనసే కారణమన్నిటికిని' అన్నదిందుకే.

రాజా రామమోహనరాయలు బ్రిస్టల్ నగరంలో తుది శ్వాస విడిచిన తర్వాత ఆయన శరీరాన్ని ఇక్కడే సమాధి చేశారు. ఆ సమాధిని చూసి రచయిత శ్రద్ధాంజలి ఘటించి, రాయల తలపోతలతో వ్రాసిన కవిత 'సెప్టెంబరు ఇరవైఏడు.'

నలభై నాటి నరకాన్ని తిరిగి దరి చేరనివ్వవద్దనీ, మానవ విధ్వంస కాంక్షకు ఇదివరకులా సీమలలో చేతులు కలపవద్దనీ వేడుకుంటూ లండన్ నగరాన్ని వీడ్కోలు చెప్పే సందర్భంలో 'థేమ్సు ఒడిలో లండన్' అనే కవిత వ్రాశారు. 'నా వేడుకలు మన్నించడమే నీవు నా కిచ్చే వీడుకోలు!' అని హృదయపూర్వకంగా మానవ జాతి మనుగడకై ప్రాకులాడతారు.

మాదిరాజు రంగారావుగారి మాటల్లో చెప్పాలంటే "సోమసుందర్ విశిష్ట వ్యక్తిత్వాన్ని, సీమల్ని సంకుచిత భావాల్ని అధిగమించి పరిమళింపజేసే ఉత్తమ కృతి ఆంగ్ల సీమలో ఆమని వీణలు."[9]

మొత్తం విమాన ప్రయాణానికి రానుపోను నలభై వేల రూపాయలు ఖర్చయిందట.

---

9. సోమసుందర్ - యాత్రా కవిత 'ఆంగ్ల సీమలో ఆమని వీణలు.'
డా॥ మాదిరాజు రంగారావు. స్రవంతి - ఆగస్టు 1989.

# మలేషియా యాత్రలు

ఆగ్నేయాసియాలో నందన వనం లాంటి సుందర దేశం మలేషియా. ఒకప్పటి మలయా ద్వీపకల్పమే నేడు మలేషియా గా మారింది. ఈ మార్పు జరిగింది 1963 లో అప్పటిదాకా ఈ ప్రాంతాన్ని 'ఫెడరేషన్ ఆఫ్ మలయా' అనేవారు సింగపూరు, సారవాక్, ఉత్తర బోర్నియో, మలయా ద్వీపకల్పం కలిసి మలేషియా అయింది. ఐతే అభిప్రాయ భేదాల వల్ల 1965 లో సింగపూరు రాష్ట్రం విడిపోయి 'రిపబ్లిక్ ఆఫ్ సింగపూరు' అనే పేరు మీదుగా స్వతంత్ర రాజ్యం అయింది.

మలేషియా జనాభాలో సగానికి పైగా 'మలే'లు ఉన్నారు. వీరిని భూమి పుత్రులంటారు. దక్షిణ చైనా నుండి వలస వచ్చిన చైనీయులు 35 శాతం, భారతీయులు 11 శాతం ఉన్నారు. వీరిలో తమిళుల తర్వాత తెలుగు వారి సంఖ్య హెచ్చు మలేషియాలో భారతీయులంటె దక్షిణాత్యులే. తమిళులు, తెలుగువారు, కొంతమంది మలయాళీలు. డా॥ దాశరథి గారు పర్యటించినప్పుడు మలేషియాలో తెలుగువారి జనాభా సుమారు లక్షన్నర మంది. విశాఖ, శ్రీకాకుళం, చిత్తూరు, విజయనగరం ప్రాంతాలనుంచి ఏనాడో వలస వచ్చి మలేషియా పౌరసత్వం పొందిన తెలుగువారు ఎందరో ఉన్నారు.

## 1. కాంగ్రెసు వైద్య దళము-మలయా యాత్ర*

ద్వితీయ ప్రపంచ మహా సంగ్రామంలో మలయాలోని భారతీయులు పోరాడి భారతదేశం కోసం తమ సర్వస్వాన్ని ధారపోశారు. చాలమంది వ్యాధి పీడితులయ్యారు. దానికితోడు 1942 - 46 ల మధ్య విపరీతంగా మందుల కరువు ఏర్పడింది. అందుచేత అక్కడి ప్రజలు వైద్య సహాయం కొరకు భారత దేశాన్ని అర్థించారు. వారి అభ్యర్థన విన్న తర్వాత కాంగ్రెసు వైద్య దళమును

---

* రచయిత చింతలపాటి శివరామశాస్త్రి గారు.

పంపడానికి ఏకగ్రీవంగా తీర్మానించబడింది. ఈ బృందంలో 11 మంది డాక్టర్లు, 2 డ్రైవర్లు, 8 మెడికల్ అసిస్టెంట్లు, ఒక కార్యదర్శి - మొత్తం 17 మంది ఉన్నారు.

ఈ యాత్రా వృత్తాంతాన్ని "కాంగ్రెసు వైద్య దళము మలయా యాత్ర" అన్న పేరుతో చింతలపాటి శివరామశాస్త్రి రచించారు. 1947 లో తెనాలిలో ముద్రింపబడ్డ ఈ గ్రంథంలో 88 పుటలున్నాయి.

వైద్య దళం ఒక "ఆస్ట్రేలియన్ సీ-ప్లేను" లో (ఓడలో) 14-4-1946 న ఉదయం 8.00 గంటలకు హౌరా నది (కలకత్తా) నుండి ప్రయాణమై మధ్యాహ్నం 12. గం. కు రంగూన్ చేరుకుంది. తర్వాతి రోజు బాంకాక్ (సయాందేశం) నగరానికి. అటనుండి 16-4-46 న మలయా చేరుకుంది.

ఐతే బర్మా, బాంకాక్‌లలో తనకు కనిపించిన వింతలను కొన్నిటిని శాస్త్రీజీ పేర్కొన్నారు. రంగూన్‌లో పసిపిల్లలు కూడ రంగూన్ షెరూట్‌లనే ఆరంగుళాల చుట్టల్ని కాలుస్తూ కనిపించారట. బర్మావాళ్ళు గుళ్లల్లో కూడ చుట్టలు కాల్చడం గ్రంథకర్త చూశారు.

సయాం వాస్తవ్యులంతా బౌద్ధులే ఐనప్పటికీ ప్రాచీన హైందవ పద్ధతినే ఎక్కువగా అనుకరిస్తారనీ, ప్రతి నిత్యం రామాయణ పారాయణ చేస్తారనీ వ్రాస్తూ హనుమంతుని లాకెట్లు సర్వసామాన్యంగా అందరూ ధరిస్తారన్నారు. ఈ దేశంలో భార్యాభర్తలు ఒకే సైకిల్ మీద వెళ్ళడం రచయిత గమనించారు.

మన దేశంలో కాఫీ హోటళ్ళని పిలిచేవాటిని మలయాలో 'తినే దుకాణాలు' (Eating shops) అంటారు.

మలేలు మొదట సుమిత్రా, బోర్నియో ద్వీప వాసులు. వీరిది మహమ్మదీయ మతం ఐనా ఘోషా పద్ధతి లేదు. ప్రాచీన హైందవాచారాలు కొన్ని నేటికీ వీళ్ళల్లో నిలిపిస్తూనే ఉంటాయి. మనం పేర్లకు ముందు గౌరవ సూచకంగా 'శ్రీ'ని వాడినట్లే మలేలు కూడ ఉపయోగిస్తారు. సలాము కంటే నమస్కారమంటేనే ఎక్కువ మక్కువ చూపిస్తారు.

కాంగ్రెసు వైద్య దళం మలయా చేరుకునేటప్పటికి మిలిటరీ చేతుల్లో నుండి సివిలు ప్రభుత్వం దేశాన్ని స్వాధీనం చేసుకుంటున్నది. మలేలు ట్రాపికల్ అల్సర్సుతో అమితంగా బాధల ననుభవిస్తున్నారు. దేశమంతా మందుల కరువు.

ఈ విధంగా ఉపలబ్ధసమాచారం ఆధారంగా మలేషియాకు మొదటిసారిగా యాత్ర చేసి వచ్చిన ఘనత కాంగ్రెసు వైద్య దళానికే దక్కింది.

## 2. ప్రపంచ తెలుగు మహా సభలకు పూర్వరంగ యాత్ర

మలేషియాలోని 11 శాతం భారతీయుల్లో తెలుగు వారు నాలుగు శాతం మంది. తమ వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవాలనే సంకల్పంతో 1955 లో వీళ్ళు 'మలేషియా ఆంధ్ర సంఘం' ఏర్పరచుకున్నారు. ప్రథమప్రపంచతెలుగు మహా సభలకు వచ్చిన ఆంధ్ర ప్రతినిధి వర్గం, 1978 లో ద్వితీయ ప్రపంచ తెలుగు మహా సభలను మలేషియాలో నిర్వహిస్తామనే కోరికను వెల్లడించగా తెలుగు జాతి అందుకు హర్షామోదం తెలిపింది. మలేషియా రాజధాని కౌలాలం పూరులో ఆంధ్ర భవనం నిర్మించే ఉద్దేశ్యంతో చందాల వసూలు కార్యక్రమం ప్రారంభించారు. 1977 లో ఆంధ్ర భవన నిర్మాణం జరగాలన్నది వారి లక్ష్యం. మలేషియాలోని తెలుగు వారిని ఉత్తేజపరచడానికి మలేషియా ఆంధ్ర సంఘం డా॥ దాశరథి, డా॥ సి. నారాయణరెడ్డి గార్లను ఆహ్వానించింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కూడా అంతర్జాతీయ తెలుగు సంస్థ ద్వారా వీరిద్దరినీ మలేషియా పంపడానికి సమ్మతించింది.

'మలేషియాలో జరుగనున్న తెలుగు మహా సభలకు తొలి మజిలీ' వీరి పర్యటన. ఈ పర్యటన వివరాలను - యాత్రికులిద్దరూ వ్రాశారు. నారాయణ రెడ్డి గారి "ముచ్చటగా మూడు వారాలు మలేషియాలో తెలుగు వాణి" అన్న యాత్రావ్యాసం ఆంధ్రప్రభ వారపత్రికలో రెండు వారాలపాటు ప్రచురింప బడింది.[1] "మలేషియాలో తెలుగు వెలుగు" అన్న పేరుమీద డా॥ దాశరథి గారి యాత్రానుభూతుల వ్యాసం వారి 'వ్యాసం పీఠం'లో చోటుచేసుకుంది.[2]

విమాన యానం ఇద్దరికీ మామూలే ఐనా విదేశయానం మాత్రం ఇదే మొదలు. మద్రాసు నుండి ఎయిర్ ఇండియా బోయింగ్‌లో 30-6-76 న బయలు దేరి, మూడువేల మైళ్ళ దూరంలో (4800 కి.మీ) ఉన్న కౌలాలంపూర్‌కు 3½ గంటల్లో చేరుకున్నారు. అప్పుడు మన సమయం 12.15 సాయంత్రం కాగా, అక్కడి సమయం 2.15 సాయంత్రం.

---

1. 8-9-76, 15-9-76 సంచికల్లో తేదీల వారీగా ప్రకటింపబడ్డాయి ఈ సాహితీ యాత్రా విశేషాలు.
2. 1985 లో ప్రచురింపబడింది.

అప్పటి ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు మలేషియా ఆంధ్ర సంఘానికి బహూమతిగా ఇచ్చిన 'తెలుగు తల్లి' చిత్రాన్ని దాశరథి గారు మలేషియా ఆంధ్ర సంఘం అధ్యక్షులు డా॥ సి. అప్పారావుగారికి అందజేశారు. అంతర్జాతీయ తెలుగు సంస్థ వారు కొన్ని చక్కని తెలుగు పాటలు రికార్డు చేయించి ఇచ్చారు.

మలేషియా ఆంధ్ర సంఘం వారు ఉత్తర దక్షిణ మలేషియాలోని 15 ముఖ్య కేంద్రాల్లో వీరి ఉపన్యాసాలు ఏర్పాటు చేశారు. ఆ పట్టణాల్లో కొన్ని:- బాగోడ్ దత్తో పట్టణం (బాగన్ దత్తో అని సి.నా.రె), సెబాక్ బెర్ణం పట్టణం, సింపాంగ్ అంపాట్, నిత్యవాన్, గోపింగ్, సుంగై సుపుట్ (సుంగై సిపుట్ ఇపో - అని సి.నా.రె), పెనాంగ్, పెరాక్, తంజమాలిం, సెగమత్, క్లువాంగ్, బహోవ్, సుంగై పట్టాణి, కూలిం మొదలగునవి[8]. ఇక్కడున్న మూడు వారాల్లో (30-6-76 - 20-7-76) దాదాపు రోజూ ప్రయాణమే. ప్రతిరోజు తెలుగు భాషలోని తీయదనాన్ని గురించి, తెలుగు జాతి పూర్వ చరిత్రను గురించి, తెలుగు సాహిత్యంలోని సొగసులను గురించి, ఆంధ్రప్రదేశ్‌లో అప్పుడు జరుగుతున్న ప్రగతిని గురించి ప్రసంగించామని డా॥ దాశరథి వ్రాశారు.

మలేభాషకు స్వంత లిపి ఏదీ లేదు. రోమన్ లిపిలోనే ఇంతదాకా వ్రాస్తూ వచ్చిన మలేభాషకు క్రమంగా అరబ్బీ లిపిని వాడడానికి ప్రయత్నాలు జరుగుతున్నట్లు దాశరథి గమనించారు.

పర్యటన సందర్భంలో తాము విన్న కన్న మలేభాషా పదాల - వాటి వ్యుత్పత్తుల తీరు తెన్నులనుగూర్చి డా॥ సి. నారాయణరెడ్డి గారు వివరించారు.

9-7-76 నాటి సర్వసభ్య సమావేశంలో అందరికి పంచి పెట్టబడ్డ కార్యదర్శి నివేదికలో ఒక పంక్తి రెడ్డి గారిని పరవశింప చేసిందట. అది "బహాసా జీవ బంగ్సా' అన్నది. తెలుగులో 'భాషయే జాతికి ప్రాణం' అని అర్థం. శబ్ద దృష్టితో వ్యుత్పత్తుల గురించి వేటాడగా ఆ పంక్తి మూలం ఇట్లా సాక్షాత్కరించిందట. మన భాషా (బాస) శబ్దమే 'బహాసా' అనీ, జీవనమే 'జీవ' అని గుర్తించారు. ఇక బంగ్సా సంగతి. "మలేలో వంగభాషలో వలెనే వకారాది శబ్దాలు

---

8. వ్యాసపీఠం పేజీ. 93-94 మరియు డా॥ తిరుమల శ్రీనివాసాచార్య 'నారాయణరెడ్డి సాహితీమూర్తి' పేజీ. 320.

బకారాదులవుతాలు"[4] అని డా. దాశరథిగారు 'వంశ' ను మలేలో 'బంగ్స' గా, 'వాయు' ను 'బాయు' గా ఉచ్చరిస్తారని ఉదహరించారు. కాబట్టి 'వంశ' 'బంగ్సా' గా రంగు మార్చుకున్నదని తెలుపుతూ, నారాయణ రెడ్డిగారు 'వంశం' అంటే జాతి, రేస్, పీపుల్ అనే అర్థాలను మలే నిఘంటువు బలపరిచినట్లు పేర్కొన్నారు.[5]

మొదటి రోజు నగర విహారం చేస్తుంటే ఒకచోట చెక్‌పోస్టు దగ్గర 'పెరాక్సా' అన్న పదం వింత గొలిపిందనీ, చెక్కింగు అంటే పరీక్ష కాబట్టి 'పెరెక్సా' అన్నది 'పరీక్ష'కు తద్భవంగా ఊహించారు రెడ్డిగారు.

డాక్టర్ దాశరథి గారు మరో అడుగుముందుకు వేసి మలే శబ్దోచ్చారణ, వాక్య నిర్మాణం, మలేభాషలోని అరబ్బీ, ఫారసీ పదాలు, క్రియాపదాల ప్రత్యేకతను గురించి సోదాహరణంగా పేర్కొన్నారు.

ఉదా :-

| | | |
|---|---|---|
| 'బుకు' (Buku) | — | ఇది Book అన్న ఆంగ్లశబ్దభవం. |
| 'జుంలా' (Jumlah) | — | అరబ్బీ పదం - మొత్తం అని అర్థం. |
| 'సిస్వ' (Siswa) | — | సంస్కృత భవం - విశ్వవిద్యాలయ విద్యార్థి |
| 'సిస్వి' (Siswi) | — | సంస్కృత భవం - శిష్యురాలు. |
| 'మెంతెరి' (Menteri) | — | సంస్కృత భవం - మంత్రి. |

రామ రావణ పేర్లలో మార్పు లేదు కాని విభీషణుని 'బబూసనం' అని పిలుస్తారట. మలేభాషలో భార్యను 'ఇస్త్రీ' అని, భర్తను 'స్వామి' అనీ అంటారట. గురువు, వనితలు మారలేదు.

నామవాచకం తర్వాత విశేషణం సర్వే సర్వత్రా మలేభాషలో కన్పిస్తుందని దాశరథి ఈ క్రింది ఉదాహరణలిచ్చారు.

'నిపిస్' అంటే పలచని అని అర్థం. పలచని పుస్తకం అనటానికి 'బుకు నిపిస్' అంటారు.

---

4. వ్యాస పీఠం - పేజీ. 108.
5. ముచ్చటగా మూడు వారాలు-ఆంధ్రప్రభ వారపత్రిక 15-9-76 సంచిక.

మలే భాషలో ప్రధానిని 'పెర్దాన' అని పిలుస్తారు. అందుకే ప్రధాన వార్త అనడానికి 'బెరితా పెర్దాన' (వార్తా ప్రధాన) అంటారు.

బహు వచనానికి ఏక వచన శబ్దాన్నే రెండు సార్లు పలకడం మలే భాష లేని ప్రత్యేకత.

పుస్తకాలు అనడానికి 'బుకు బుకు' అంటారట.

భారతదేశం నుండి తరాలనాడే భారతీయు లిక్కడికి తరలి వచ్చినప్పటికీ కొన్ని ప్రాచీన సంప్రదాయాల నట్లాగే నిలుపుకుంటూ వస్తున్నారనడానికి నారాయణరెడ్డి గారొక ఉదాహరణ నిచ్చారు:

"డాలర్‌ని ఇక్కడి మన వారు వెండి అంటారు. పది డాలర్లు అనడానికి పది వెండులు అంటారు. ఇండ్లను ఇల్లులు అంటూ విలక్షణ గ్రాంథికంగా అనడం ఇక్కడే విన్నాము. మన తెలుగు వాళ్ళు అలనాడు ఈ దేశానికి వచ్చిన నాడు భారత దేశంలో కాగితం నోట్లు పుట్టలేదు. రూపాయలంటే అప్పుడు వెండి నాణెమే."[6]

## 3. త్రిపురనేని 'సువర్ణ సుందర మలేషియా'

ప్రముఖ హేతువాది, అభ్యుదయ కవి డా॥ త్రిపురనేని వేంకటేశ్వరరావు గారు అంతర్జాతీయ సాంస్కృతిక సంస్థ నుండి వచ్చిన ఆహ్వానాన్ని పురస్కరించుకొని రెండవ ప్రపంచ తెలుగు మహా సభలలో పాల్గొనడానికి మలేషియా వెళ్ళారు. ఈ పర్యటన ఏప్రిల్ 1981 లో జరిగింది. తర్వాత తమ యాత్రానుభవాలను 'సువర్ణ సుందర మలేషియా' అన్న పేరుతో రచయిత ప్రకటించారు. ఇది 84 పుటలు పుస్తకం. 1981 లోనే ముద్రింపబడిన ఈ పుస్తకం ఆవుల సాంబశివరావు దంపతులకు అంకిత మివ్వబడింది.

---

6. ముచ్చటగా మూడు వారాలు - మలేషియాలో తెలుగు వాణి. ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రిక. 15-9-1976 సంచిక.

ఈయననివి 'సాహిత్య సాంస్కృతిక పర్యటన' ! "కొద్ది రోజులు ప్రయాణం చేసి, అన్నీ చూసినట్లు సర్వం తెలిసినట్లు వ్రాసిన, మాట్లాడిన మంచిదికాదు" అని అంటూ తొందర ప్రయాణంలో అస్సలు కుదరదని నిజాయితీగా ఒప్పుకున్నారుకూడా.7

పేరు సుందర సువర్ణ మలేషియా అని పెట్టినంతమాత్రాన మలేషియాలో లోపాలు లేవనడం పొరపాటు అనీ, ఆ దేశంతో తాను చూసిన చెడుల గురించి చెప్పడం సభ్యత కాదని భావించి మంచినే వ్రాశానన్నారు. ఐతే వారు వ్రాసిన మాటలే వారి మాటల్లో ఎంత నిజాయితీ ఉందో తెలుపుతూనే ఉన్నాయి.

"జూద గృహాలమాట ఎత్తలేదు. ఆ అద్భుత సౌందర్య భవనముల యందలి నాగరిక వేశ్యా శృంగార నాట్యముల గురించి నేను వర్ణించలేదు. ఎలక్ట్రానిక్ గేమ్సును గురించి పొరపాటున ఎక్కడ నా గ్రంథంలో వ్రాయలేదు. ...ఆరోగ్య కేంద్రము పేర్లతో, బాడీ మసాజ్ పార్లర్స్‌లో జరిగే దుర్భర, దుస్తంత్ర, దురితోగ్ర శృంగార వర్ణనల గురించి నేనెచ్చటను నివేదించలేదు."8 ఇదీ ధోరణి. అతి రహస్యం అంటూనే అన్ని విషయాలు నివేదించారు.

9-4-1981 న ఉదయం పది గంటలకు పెద్ద 'గాలి ఓడ'లో మద్రాసు నుండి యాత్ర ప్రారంభమైంది. బంగాళాఖాతం మీదుగా విమానం గంటకు 700 మైళ్ళ వేగంలో 'శబ్దాతీతం'గా ప్రయాణించగా సాయంకాలం మన కాలమానం ప్రకారం 4 గంటలు అయింది. ఐతే అప్పుడక్కడ సమయం ఆరు గంటలు. అంటే మొత్తం ప్రయాణానికి ఆరు గంటలు పట్టిందన్న మాట!

## మలేషియా విశేషాలు :

పెనాంగ్ పట్టణంలోని 'గామా' అనే సూపర్ బజారులో అంతా మనుష్లాగే వ్యవహరించే మరమనుషులు కనిపించారన్నారు.

తెలుగు మరిచిపోకుండా వుండానికి మలయాలోని తెలుగు ప్రజలు చాల తాపత్రయ పడుతున్నారనీ. వారి కృషి ఫలితమే ఈ ప్రపంచ తెలుగు మహా

7. సువర్ణ సుందర మలేషియా - తొలిపలుకులు. పేజీ. (ii)
8. సువర్ణ సుందర మలేషియా - తొలిపలుకులు. పేజీ. (iii)

సభలనీ డాక్టరు గారు వ్రాశారు. సభానంతరం శంకరాభరణం సినిమా ప్రదర్శన జరిగినట్లు తెల్పారు.

మలేషియాలో కనిపించనివి రిక్షాలు, ఆటోరిక్షాలు. సేల్సు టాక్సులేదు. అందువల్ల ప్రతి వస్తువు చాల చౌకగా లభిస్తుంది. ఐతే చిన్న కార్ల వాడకం ఎక్కువకాబట్టి పెట్రోలు ధర చాల తక్కువగా ఉంటుందట! ఇంకా మెడికల్, ఇంజనీరింగ్ కాలేజీలు లేవు. డాక్టర్లను, ఇంజనీర్లను విదేశాలనుండి రప్పించుకోవడం వినహా వేరు గత్యంతరం లేదు.

కుటుంబ నియంత్రణ విషయంలో మలేషియా రష్యాకు చుక్కెదురు. ఇక్కడ కుటుంబ నియంత్రణ ఖచ్చితంగా అమలు చేస్తారు. ఈ విషయంలో డాక్టరు గారి పరిశీలన ఇట్లా ఉంది: "తొలిబిడ్డకు సుంకములేదు. మలిబిడ్డకు 500 డాలర్లు చెల్లించుకోవాలి. ముగ్గురి కన్న ఎక్కువ కన్న వారికి కఠినమైన శిక్షలు విధిస్తారు."9

చైనాలో లాగే మలేషియాలో కూడ పాలూ చక్కెర లేని 'బ్లాక్ టీ'నే వాడతారు. మలేషియా మంత్రి శ్రీ వి.వి. సామయేలు తన ఉపన్యాసంలో "మా సంస్కృతి ఒక బ్లాకు కాఫీ. దానికి చేదు ఎక్కువ. కాని ఈ తెలుగు సంస్కృతి తియ్యని చక్కెరలాంటిది. అది ఎంతో మధురంగా ఉంటుంది!" అన్నాడట10.

మలేషియాలో నిజమైన న్యాయం పాటింపబడుతుంది. సివిల్, క్రిమినల్ దావాలు కూడ వెంటనే పరిష్కారమవుతాయి. రోడ్ల మీద ట్రాఫిక్ పోలీసులు ఎక్కువగా కనిపించరు. టి. వి. సెట్లు, వాటికి కెమెరాలు మాత్రం అమర్చబడి వుంటాయి. "ఎవరైనా రోడ్డుమీద సిగరెట్టు పారవేస్తే టి.వి. ద్వారా ట్రాఫిక్‌ను పర్యవేక్షిస్తున్న పోలీసు అధికారి వెంటనే నేరస్తున్ని పట్టుకొని న్యాయస్థానంలో కేసు పెడతారు. కేసు ఐదు నిమిషాల్లో పరిష్కారమగును."11 టి.వి. ఫోటో కెమేరాలే ప్రత్యక్ష సాక్షాలు కాబట్టి నేరస్తులు బుకాయించడానికి అవకాశముండదు.

---

9. సువర్ణ సుందర మలేషియా - పేజీ. 88.
10. సువర్ణ సుందర మలేషియా - పేజీ. 78.
11. సువర్ణ సుందర మలేషియా - పేజీ. 27.

# చైనా యాత్రలు

## శ్రీశ్రీ చైనా యానం

శ్రీరంగం శ్రీనివాసరావు 1976 లో చైనా ప్రభుత్వం ఆహ్వానంమీద అక్కడ పర్యటించి నోట్సుగాను, దినచర్య రూపంలోను యాత్రానుభవాలను వ్రాసుకున్నారు. 'ఒక పెద్ద పుస్తకం రాయడానికి తగినంత సామాగ్రితో వచ్చా' నని యాత్రానంతరం చెప్పుకున్నారు కూడ. మరి నాలుగేళ్ల తర్వాత ఆయన సప్తతి సందర్భంగా స్వాతి పబ్లికేషన్స్ వారు ఈ వివరాలను యాత్రా గ్రంథంగా ప్రచురించారు. దానిపేరు 'చైనాయానం.' 102 పుటల పుస్తకం.

1921 లో చైనాలో స్థాపించబడిన కమ్యూనిస్టు పార్టీ 1949 లో జాతి విమోచనను సాధించడమేగాక అనతి కాలంలోనే అంటే 1977 నాటికి చైనాను ప్రపంచ దేశాల్లోనే మూడవ అగ్రగామి దేశంగా నిలబెట్టగలిగింది. కమ్యూనిస్టు దేశాల అభివృద్ధిని ఓర్వలేని పెట్టుబడిదార్లు శ్రీశ్రీ పర్యటన కాలంనాటికి చైనా, రష్యాల గురించి అనేక ఊహాగానాలు, పుకార్లను వ్యాప్తి చేశారు. ముఖ్యంగా మావో రూపొందించిన నవ చైనాను గురించి అనేక కట్టుకథలు అల్లుకున్నారు. మావో మరణానంతరం ఆయనతోటే ఆయన సిద్ధాంతాలన్నీ రూపుమాసిపోతా యని దురాశ పడ్డారు. అట్లా జరుగకపోగా, కొత్త నాయకత్వం మావో సిద్ధాంతాలకు నూతన వ్యాఖ్యానాలు చెపుతున్నదనీ, చైనాలో అంతర్యుద్ధం జరుగుతున్నదనీ పనిగట్టుకుని ప్రచారం చేశారు. నిజానికి చైనాలో ఏం జరుగుతుందన్నది అభిమానులకు మనశ్శల్యంగా మారింది. అయితే ఏ విషయమైనా ప్రత్యక్షంగా చూడనిది చెప్పడానికి వీలులేదు. అందుకే శ్రీశ్రీ ఈ పర్యటనను అవకాశంగా తీసుకుని 'చైనా యానం' పుస్తకం ద్వారా చైనాలోని వాస్తవ పరిస్థితుల చిత్రీకరణకు ప్రయత్నించారు.

సమసమాజ స్థాపనలో మన దేశంలో కొరవడిన చిత్తశుద్ధి చైనా, రష్యా దేశాలవాళ్ళల్లో చూసి, ఆ దేశాలు స్వాతంత్ర్యానంతరం అనతికాలంలో త్వరిత

గతిని అన్ని రంగాల్లో అభివృద్ధి చెందడం ఒక అద్భుతంగా భావించాడు శ్రీశ్రీ. ఆ మరో ప్రపంచాన్ని ప్రత్యక్షంగా చూసి, మన దేశం కూడ ఆ స్థితికి ఎప్పుడు ఎదుగుతుందో అని ఆరాటపడ్డారు. 'చైనా యానం' చదివిన తర్వాత చైనాలో వచ్చిన ప్రజోపయోగకరమైన ప్రతి చిన్న మార్పు మనదేశంలో ఎందుకిలావుంది, మనం ఎప్పుడు బాగుపడతాం అనే బాధతో కూడిన జిజ్ఞాసను ప్రతి పాఠకుడిలో రేకెత్తిస్తుంది.

శ్రీశ్రీ 20 వ శతాబ్దం ఉత్తరార్ధంలో తెలుగులో వచ్చిన ప్రతి సాహిత్యోద్యమంలో కీలకపాత్ర వహించారు. తాను కలలుగన్న మరో ప్రపంచం వైపు, జాతి జనులను మహా ప్రస్థానం చేయించడానికి కృషి చేశారు. సాహిత్యంలోనే కాక, సామాజిక జీవితంతో, రాజకీయ రంగంతో, ప్రజా ఉద్యమాలతో అత్యంత సన్నిహితంగా మెలుగుతూ వచ్చారు.

శ్రీశ్రీ కి 1953 లోనే మొదటిసారి చైనా వెళ్ళే అవకాశం వచ్చింది. అప్పుడాయన ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడు. చక్రవర్తుల రాజగోపాలాచార్యులు అప్పటి ముఖ్యమంత్రి. ప్యాసు పోర్టు కోసం ఆయనను కలవగా తప్పకుండా సిఫారసు చేస్తానని చెప్పి 'లోపాయి కారిగా' ఇవ్వకూడదని వ్రాశాడట![1] ఆవిధంగా శ్రీశ్రీ కి రాక రాక వచ్చిన మొదటి విదేశ యాత్రావకాశం రాజగోపాలా చార్యులు నీరు కార్పించాడు. ఇది కేవలం ఆయనకు కమ్యూనిష్టులపై, వారి దేశంపై ఉన్న కినుక వల్లనే జరిగిందని శ్రీశ్రీ గ్రహించారు.

ఇట్లాంటి అవకాశం మళ్ళీ 23 సంవత్సరాలకుగాని కలుగలేదు. భారతీయ మిత్రుడు డాక్టర్ డి. యన్. కోట్నీస్. స్మారక భవనం ఆవిష్కరణోత్సవ సభకు హాజరు కావలసినదిగా చైనా ప్రభుత్వం 1976 లో పది మంది భారత ప్రతినిధులను ఆహ్వానించింది.[2] వాళ్ళల్లో శ్రీశ్రీ ఒకరు. విదేశాలతో స్నేహ

---

1. శ్రీశ్రీ ఈ విషయం 'అనంతం' (పేజీ. 191)లో వ్రాసుకున్నారు.
2. జపాన్ సామ్రాజ్య వాదుల దురాక్రమణను ఎదిరించి పోరాడుతున్న కాలంలో కోట్నీస్ చైనా వెళ్ళాడు. చైనా సైనికులకు వైద్య సహాయం

సంబంధాలను పటిష్టం చేసుకోవడానికి ఒక సుహృద్భావ సంఘం ఏర్పడింది. దాని పేరు Chinese peoples Assoiation for friendship with foreign countries ఈ సంస్థ ఆహ్వానం మీదే శ్రీశ్రీ చైనా పర్యటన చేసి వచ్చారు.

శ్రీశ్రీ చైనాలో పర్యటించింది 21 రోజులు.[3] అసలీ పర్యటన నెలరోజులు చేయాల్సిందిగా చైనా ప్రభుత్వం ఆహ్వానం. కాని ప్రయాణ ప్రారంభంలోనే "రవిరాజ్ సినిమా సంస్థ కిచ్చిన మాటను నిలబెట్టుకోవడం కోసమని" అందర్నీ కాదని వారం రోజులు ముందుగానే ఒంటరిగా తిరుగు ముఖం పట్టారు.[4]

## i) ప్రయాణ మార్గం :

మద్రాసు మీనంబాకం విమానాశ్రయం నుండి బయలుదేరి హైదరాబాదు మీదుగా ఢిల్లీ చేరుకున్నారు 6-12-1976 న ఢిల్లీ నుండి విమానంలో బొంబాయికి వచ్చారు. అక్కడి శాంతక్రుజ్ విమానాశ్రయం నుండి స్విస్ ఎయిర్ విమానం "డిసి - ఒ - 62 జెట్ విమానం"లో బయల్దేరారు. చైనా రాజధాని పీకింగుకు బొంబాయినుండి సరాసరి ప్రయాణం 6 గంటల 40 నిమిషాలు పట్టిందని వ్రాశారు.

---

చేస్తూ ఉత్తర చైనాలోని యేనాన్, తదితర ప్రాంతాల్లో ఐదు సంవత్సరాల పాటు ఆ అకుంఠిత దీక్షతో రేయింబగళ్ళు సేవ చేశాడు. నిరంతర సేవలో ఆరోగ్యాన్ని సైతం లెక్క చేయక 9-12-1942 లో తన 34 వ యేట మరణించాడు డాక్టరు గారి సేవలను గుర్తించిన చైనా ప్రజలు, ఆయనను తమ అభిమాన భారతీయ మిత్రునిగా గుర్తించి, ఆయనకు స్మారక మందిరం నిర్మించారు. డాక్టరు గారు మరణించిన 34 వ యేట అదేరోజు ఆవిష్కరణ సభ ఏర్పాటు చేశారు.

3. 7-12-1976 నుండి 27-12-1976 వరకు.

4. 'చైనా యానం' పేజీ. 90.

## ii) చైనా ముఖ్య పట్టణం పికింగ్‌లో :

7-12-1976 వ తేదీన మధ్యాహ్న భోజనం తర్వాత చైనా చక్రవర్తుల భవనాలు చూశారు. అవి మ్యూజియంల లాగా ఉన్నాయనీ, తీరికగా చూడాలంటే ఐదారు రోజులైనా పడుతుందనీ అనిపించిందట! అందుకే కొన్ని ముఖ్యమైన భవనాలను మాత్రం చూసి వచ్చామని చెప్పుకున్నారు.

పికింగ్ ఫ్యాక్టరీల్లో 75 శాతం స్త్రీలే ఉంటారు. చేసే పనినిబట్టేకాని వేతనాల నిర్ణయంలో స్త్రీ పురుష వివక్ష అక్కడ లేదు. రోజుకు 8 గంటల పని. అతి తక్కువ జీతం 40 యెన్నులైతే, ఎక్కువ జీతం 100 యెన్నులు,[5] అంటే దాదాపు మన దేశపు మారకంలో పోలిస్తే తక్కువ జీతం 160-180 రూపాయల మధ్య, ఎక్కువ జీతం 400-450 రూపాయల మధ్య ఉంటుంది. దీన్ని బట్టి అక్కడ అధిక వేతనం పొందే కార్మికుడు మన రాష్ట్రంలో అప్పుడు కళాశాల ఉపాధ్యాయుని వేతన మంత పొందగలిగాడని తెలుస్తుంది.

## iii) షిఖియా చువాంగ్‌లో :

చైనాలో హోప్ ఒక రాష్ట్రం. దీని ముఖ్య పట్టణం షిఖియాచువాంగ్. భారతీయ ప్రతినిధి బృందం అక్కడికి రైలుబండిలో బయలుదేరింది. పికింగ్ నగరానికి దక్షిణంగా 250 కి. మీ. దూరంలో వున్న పట్టణం ఇది. అక్కడే డాక్టర్ కోట్నిస్ స్మారక భవన ప్రారంభోత్సవం జరిగింది.

10-12-1976 నాడు బృందంతో పాటు శ్రీశ్రీ డా॥ కోట్నిస్ స్మారక వైద్యశాలను దర్శించారు. అతి ప్రాచీనమైన ఆక్యుపంక్చర్ విధానంతో అతి నవీనమైన శస్త్రవైద్యం చేస్తారు చైనా వారు. ఇది వారి వైద్య విధానంలో ప్రత్యేకత. ఇట్లాంటి అద్భుతాలు పెట్టుబడి దారీ దేశాల్లోనూ జరుగుతాయి, కాని ఉన్న తేడా అంతా వైద్య సదుపాయంలో ఉంది. ఆ దేశాల్లో రోగి వైద్యున్ని వెదుక్కుంటూ పోతే, చైనాలో వైద్యులే రోగి వద్దకు వెళ్తారు. ఈ సందర్భంగా శ్రీశ్రీ

---

5. యెన్ (Yuan) అంటే చీనా వారి నాణెం. 1 యెన్ 1976 లో మన 4 రూ॥లకు సమానమని (పేజీ. 49 లో), 4.50 లకు సమానమని (పే. 74)లో శ్రీశ్రీ పేర్కొన్నారు. ఇందులో ఏదో ఒకటి నిజమై ఉంటుంది.

"వైద్యుడు రోగివద్దకు వెళ్ళాలి గాని, రోగి వైద్యుడిదగ్గరకు వెళకూడదు" అన్న బెతూన్ సుభాషితాన్ని ఉదాహరించారు.[6]

చైనాలో ప్రతి వ్యక్తికి మరణ పర్యంతం వైద్య సదుపాయం ఉచితం. అంతేకాక నిర్బంధం కూడ. మారుమూల గ్రామాలకు కూడ Bare Foot Doctors ఇంటింటికీ వెళ్ళి వైద్య పరీక్షలు జరుపుతారు.[7]

చైనాలో తొలిరోజుల్లో సహకార వ్యవసాయం అమల్లో ఉండేది కాని తర్వాత రష్యాలో వలెనే సమష్టి వ్యవసాయం సాగులోకి వచ్చింది. దీని ద్వారా వచ్చిన ఆదాయమంతా ఆ గ్రామంలోనే ప్రజోపయోగ కార్యక్రమాలకూ, అభివృద్ధి కార్యక్రమాలకూ వినియోగిస్తారని శ్రీశ్రీ వ్రాశారు.

చైనాలో ఎక్కడా ఆదాయ పన్ను లేక పోవడం విశేషం, ద్రవ్యోల్బణం, ధరల పెరుగుదల అసలే లేవని చెపుతూ, మన దేశం సాధించిన 'అభివృద్ధి'ని దీనితో వ్యంగ్యంగా పోల్చారు శ్రీశ్రీ.

''పాతికేళ్ళ కింద చైనాలో ఒక కోడిగుడ్డు ఖరీదు ఎంతో నేడూ అంతే. ఇలాంటి విషయాల్లో మన దేశం సాధించిన 'అభివృద్ధి'ని చూసి చీనావాళ్ళు సిగ్గుతో తలవంచుకోవలసిందే.'[8]

ఇక్కడ తలవంచుకోవాల్సింది చైనావాళ్ళు కాదు మన దేశమే నన్నది స్పష్టంగా తెలుస్తూనే ఉంది. అందుకే వాళ్ళు స్వాతంత్ర్యానంతరం మూడు దశా

---

6. డాక్టర్ నార్మన్ బెతూన్ కెనడా నివాసి. డా॥ కోట్నీస్ లాగే ఈయన కూడ చైనాకు యుద్ధ సమయంలో వచ్చి చాలా సేవలు చేశాడు. ఈయన పేర కూడ ఒక స్మారక మందిరమూ, ఒక అంతర్జాతీయ శాంతి వైద్య శాలా ఉన్నాయి. ఈ వైద్యశాలకు మొట్టమొదటి డైరెక్టర్ డా॥ కోట్నీస్ పేజీ. 85.
7. వీరిని శ్రీశ్రీ జోళ్ళులేని (చెప్పులు లేని) డాక్టర్లుగా తర్జుమా చేసుకున్నారు. (పేజీ. 45 మరియు పేజీ. 79)
8. చైనా యానం. పేజీ. 49.

ద్దాల్లో మూడో అగ్రగామి దేశంగా నిలబడితే, మన దేశం మూడు దశాబ్దాలు మరింత వెనక్కి వెళ్ళిందని ఒక చోట శ్రీశ్రీ వ్రాయవలసి వచ్చింది. ఇది ఆవేదనతో అన్నమాటేకాని, స్వదేశం మీద అభిమానం లేక కాదన్నది తెలుసుకోవాలి.

చైనా ఆర్థిక వ్యవస్థ ఇంత సుదృఢమైంది. కాబట్టే కార్మికులెప్పుడూ తమ సమ్మె హక్కును అమలు చేసే అవసరమే కలుగలేదట!

## iv) మళ్ళీ పీకింగుకు :

13 వ తేదీ నాటి ఉదయక 8 45 గంటలకు షీబియా చువాంగ్ స్టేషన్ నుండి ట్రెయిన్‌లో బయలుదేరి 12.45 గంటలకు పీకింగు చేరుకున్నారు. అంటే 4 గంటలలో 250 కి. మీ దూరం ప్రయాణించారు.

అణుయుద్ధ ప్రమాదం నుండి ప్రజలను రక్షించుకోవడానికి చైనా వాళ్ళు భూగర్భ శిబిరాలు నిర్మించుకున్నారు. ఇవి పీకింగ్ నగరం అట్టడుగున అనేకం ఉన్నాయి. విమానాల్లోంచి బాంబుల దాడి జరిగితే నగరంలో ఆబాల వృద్ధులు అందరూ అక్కడ రక్షణ పొందవచ్చు.

దేవుడనే భావాన్ని చైనా వారు ఎప్పుడో మనసులోంచి తుడిచేశారు. అంత మాత్రాన యే దేవుని గుళ్ళనూ వీరు నాశనం చేయడం లేదు. మానవుని ఈతి బాధలన్నిటికీ మానవాతీతమైన శక్తి (కారణం) ఉందనే భావాన్ని మాత్రం నాశనం చేశారని శ్రీశ్రీ వ్రాశారు. పూర్వకాలపు గుడిగోపురాల్లో ఇప్పుడు పూజా పునస్కారాలేవీ జరగడం లేదనీ, వాటిని ప్రాచీనా చైనా శిల్ప సంపదకు తార్కాణాలుగా ఉంచారనీ పేర్కొన్నారు.

చైనాలో వచ్చిన సాంస్కృతిక విప్లవం వల్ల ప్రజల మనస్తత్వంలో, ఆలోచనా విధానంలో ఆరోగ్యకరమైన మార్పు వచ్చింది. ఒకప్పుడు "భోగలాలసత్వంతో కూడిన రాచరిక వైభవ జీవితాలొక వైపూ, నిత్య దారిద్ర్యంతో కూడిన నికృష్ట జీవితాలొకవైపూ" ఉండేవి. అది గతం. ఇప్పటి చైనా ప్రజలు 'ధనిక వర్గ వర్గోత్కర్ష'ను అంగీకరించరు. బూజు పట్టిన భావాలను పట్టుకుని వేలాడే కవులను కూడ వారు క్షమించరని చెప్పడానికి శ్రీశ్రీ కన్‌ఫ్యూషియస్‌ను ఉదాహ

రించారు ఈయన వర్గ వివక్షను ప్రకటించే సూక్తులెన్నో చెప్పాడట! వాటిల్లో ఒకటి "ధనవంతులు నేరాలు చెయ్యరు, నేరాలు చేసే వారెప్పుడూ దరిద్రులే" అన్నది. అందుకే సాంస్కృతిక విప్లవం ఈయనను వెలివేసినట్టు శ్రీశ్రీ గ్రహించారు.

పికింగ్ భూగర్భ రైలు మార్గం మాస్కో మెట్రో మార్గం కన్నా చాలా చిన్నది. ఇది సరళరేఖలో నిర్మించబడింది. మాస్కోలో లాగ సర్క్యులర్ రైలు మార్గం శ్రీశ్రీ పర్యటన కాలం నాటికి నిర్మాణ దశలో ఉందని వ్రాశారు.

## v) నాన్ కింగులు :

16-12-1976 నాడు రాత్రి 6.30 గంటలకు పికింగ్ రైల్వే స్టేషన్ నుండి బయలుద్దేరి 17 వ తేదినాడు ఉదయం 11.30 గంటలకు నాన్‌కింగ్ స్టేషన్‌కు చేరుకున్నారు.[9] చైనా భాషలో 'పే' అంటే ఉత్తరం, 'నాన్' అంటే దక్షిణమని అర్థం. నాన్‌కింగ్ ఒకప్పటి చైనా రాజధానీ నగరం.

భారత బృందం 19 నాడు నాన్‌కింగ్‌లోని ఒక చారిత్రక స్థలాన్ని దర్శించింది. అదే 1946 - 47 లో చౌ-ఎన్-లై నివసించిన ఇల్లు. ఈయన పడగ్గదిలో ఒక ర్యాక్‌కు తగిలించిన టోపీ ఒకటి ప్రదర్శింపబడి ఉంది. ఈ టోపీ కొంతకాలం చౌ, కొంతకాలం మావో ధరిస్తూ ఉండేవారట! ఇద్దరూ చెరో టోపీ కొనుక్కునే స్థితిలో వారప్పుడు లేకపోవడమే అందుకు కారణం. చలి ప్రాంతానికి ఎవరు వెళ్తే వారు దాన్ని ధరించేవారు.

చైనాలో కమ్యూనిస్టు పార్టీ 1921 లో స్థాపింపబడింది. ఈ పార్టీ జన్మస్థలం షాంఘై నగరానికి భారత బృందం 19 నాడు రాత్రి 7.00 గంటలకు ట్రెయిన్‌లో చేరుకుంది. బయలుదేరిన సమయం పగలు 2.30 గంటలు.

---

9. ఉత్తర చైనాలో చలి తీవ్రంగా ఉండటం వల్ల కార్యక్రమంలో కొద్దిగా మార్పులు చేసి, అక్కడి ప్రాంతాలకు బదులు దక్షిణ చైనాలోని కొన్ని ప్రాంతాలకు పర్యటనను మార్చారట.

## vi) షాంఘై నగరంలో :

ఇక్కడ బస చేసిన హోటల్ పేరు షిన్ కియాంగ్ హోటల్. షిన్ అంటే కొత్త, కియాంగ్ అంటే నది అని అర్థమట.

మొదటిసారిగా చైనీస్ విమానంలో షాంఘై నుండి కున్మింగ్‌కు ప్రయాణం చేశారు.10 మధ్యలో 45 నిమిషాలసేపు చాంగ్‌పై విమానాశ్రయంలో ఆగారు.

అదేరోజు 'నా చైనా ఓ నా చైనా' అనే గేయాన్ని సగం ఇంగ్లీషు, సగం తెలుగులో వ్రాసి పఠించారు శ్రీశ్రీ. విమాన ప్రయాణంలో చైనాదేశం భారతదేశాన్ని కౌగిలించుకోబోతున్నట్లుగా ఉందని ఈ గీతంలో వర్ణించారు.

"విమానం మీద గగనంలో పయనిస్తూ
ఈ విశాల భూమిని చూస్తూ వుంటే
చీనా మాత తన సుదీర్ఘ బాహువులను చాచి
తన కవల చెల్లెలు భారత మాతను
పరిరంభంలోకి తీసుకోబోతోన్నట్టుంది."11

చైనా భాషలో 'నీహా' అంటే 'బాగున్నారా!' అనీ, 'సెబియాన్' అంటే 'మళ్లీ కలుద్దాం' అనీ చెపుతూ, ఇది మన భారతీయ సంప్రదాయానికి ఎంతో సన్నిహితంగా ఉందని పేర్కొన్నాడు.

తర్వాత పీకింగ్‌కు వచ్చి, అక్కడినుండి 27 న బొంబాయికి చేరుకోవడంతో చైనా పర్యటన ముగిసింది.

ఇండియా చైనాల మధ్య స్నేహం ఎంత బలం పుంజుకుంటే అంత మేరకు ప్రపంచం మొత్తంలోనే శాంతి సౌభాగ్యాలు నెలకొనగలుగుతాయన్న ఇదివరకటి విశ్వాసం మరింత బలపడిందని యాత్రానంతరం శ్రీశ్రీ పేర్కొన్నారు.

---

10. కున్మింగ్ అంటే 'వసంత నగరం' అని అర్థం. ఈ నగరానికి చలి కాలం లేదు. చలికాలంలో వెచ్చగాను, ఎండాకాలంలో చల్లగానూ ఉంటుందని పేజీ. 91 లో శ్రీశ్రీ వ్రాశారు.
11. చైనా యానం. పేజీ. 89.

# వింగతా విదేశీ యాత్రలు

## 1. మూర్తి రాజుగారి 'నవవన్నెల మధ్యధరా'*

(లిబియా ప్రయాణానుభవాలు)

మూర్తి రాజుగారు వరంగల్ నివాసి. హైదరాబాద్ లోని భారత హెవీ ఎలక్ట్రికల్స్ లిమిటెడ్ (భెల్) లో టర్బో ఆల్టర్నేటర్స్ డిపార్టుమెంటులో సీనియర్ ఆర్టిజాన్ ఫిట్టర్.

ఉత్తర ఆఫ్రికా ఖండంలోని 'లిబియా' దేశ ప్రభుత్వంతో B.H.E L. ఒక ఒప్పందం చేసుకుంది. అందుకోసం లిబియాలోని థర్మల్ పవర్ స్టేషన్ లలో టర్బైన్స్ మెయింటెనెన్స్ మరియు ఆపరేషన్ టెక్నీషియన్స్‌గా ప్రభుత్వం డిప్యుటేషన్‌మీద 15 మంది ఉద్యోగులను ఎంపిక చేసి పంపింది. వాళ్ళల్లో పి. వి. మూర్తి రాజు గారొకరు. ఇంతమందిలో భార్యాపిల్లలతో బయలుదేరింది ఈయనొక్కడే.

19-4-1977 లో ప్రయాణమై లిబియాలో రెండేండ్లు ఔద్యోగిక ధర్మాలు నిర్వర్తించి తిరిగి 8-5-1979 న ఇండియాకు తిరిగివచ్చాడు లిబియాకు ఇప్పటి పేరు S P L. A.J. అంటే The Socialist Peoples 'Libyan Arab Jamahiriya' అని.

లిబియాలో మధ్యధరాసముద్ర తీరంలో (కొన్నాళ్ళు ట్రిపోలీలో, మరి కొన్నాళ్ళు తుబ్రుక్‌లో - ఇవి రెండూ సముద్ర తీరాన్ని అంటి పెట్టుకునే ఉన్నాయి) పదవీ బాధ్యతలు నిర్వహిస్తూనే ఆ సముద్రాన్ని 'ప్రేయసిగ' భావిస్తూ అనేక కవితలు రచించారు.[1] తొలిసారి విదేశయాత్ర చేసినప్పుడు-

---

* పి. వి. మూర్తి రాజుగారు.

1. అందుకే రచయిత దీని పేరు 'నవ వన్నెల మధ్యధరా' అని పేరు పెట్టుకున్నారు. సెప్టెంబరు 1979 లో ముద్రింపబడ్డ ఈ పుస్తకం మొత్తం పుటలు 146.

అందులో విమానయానం చేసినప్పుడు - కలిగిన విచిత్రానుభవాలకు 'కొంచెం హాస్యం, మరి కొంచెం స్వంత కవిత్వం, ఇంకొంచెం కల్పనలు' జోడించి ఈ రచన చేసినట్లు రచయిత 'నా మాట' లో చెప్పుకున్నారు. మూర్తి రాజుగారు లిబియాలో ఉన్న రెండు సంవత్సరాల్లో అక్కడి ప్రజల ఆచార వ్యవహారాలను ప్రత్యక్షంగా చూసి, ఇంకా తనకు కలిగిన అనుభవాలను మేళవించి ఈ పుస్తకాన్ని 'వ్యాస కావ్యం' గాతీర్చిదిద్దారు. ఇది ఈయన 'మలికాన్పు.' మొదటి రచన 'తొలికాన్పు' అనే పేర వ్రాసిన కవితాసంపుటి.

## i) ప్రయాణం :

19-4-1979 నాడు బేగంపేట (హైదరా బాద్) విమానాశ్రయంలో Indian Airlines వారి 125 నం. డకోటా విమానంలో బయలుదేరారు. రెండు గంటల్లో బొంబాయికి చేరుకున్నారు.

20 నాటి ఉదయం 9.30 గం.కు Air India వారి బోయింగ్ 707 విమానంలో బయలుదేరారు. ఈ విమానం కైరో వరకే వెళుతుంది. ఆరున్నర గంటల సుదీర్ఘ ప్రయాణం తర్వాత సాయంత్రం 4 గం. కు కైరోలో దిగారు. అప్పుడక్కడి సమయం పగలు 1.20. గడియారాలను వెనక్కి తిప్పుకున్నారు.

రాజుగారికి ప్రయాణ ప్రారంభంలో ఒకటి రెండు నిమిషాలు కొంచెం 'కడుపులో దేవినట్లయి' మళ్ళీ సర్దుకుంది. కాని ఈయన శ్రీమతితో పాటు మరో నలుగురైదుగురు ప్రయాణికులు కాగితపు సంచులలో అదే పనిగా వాంతి చేసుకొన్నారట.

కైరో విమానాశ్రయంలో తగిన ఆదరణ లభించలేదు. అలసిపోయి, ఆకలితో పగలు 2 గంట. నుండి రాత్రి 8 గం. దాకా ట్రాన్సిట్ లాంజ్‌లోనే కూర్చున్నారు. అంత ప్రఖ్యాతిగాంచిన కైరో ఏరోడ్రోమ్‌లో మూత్రశాలకని వెళ్ళివచ్చిన ప్రతిసారీ అక్కడున్న వారు డబ్బులివ్వమని చేయి చాపటం పరమ 'ఛండాలంగా' తోచింది మూర్తిరాజుగారికి.

కైరో టైం ప్రకారం రాత్రి 8 గం. కు Libyan Airways వారి 205 నం ప్లేనులో ప్రయాణించి రాత్రి 11 గం కు ట్రిపోలీ చేరుకున్నారు. ఇది

వరకటి వాటికన్నా ఈ ప్లేను చాలా 'స్మూత్'గా కుదుపులు లేకుండా ఉంది. ప్లేనులోనే భోజన సదుపాయం ఉంది.

ట్రిపోలికి చేర్చబడ్డ లగేజిలో ఎందరివో కొత్త సూట్ కేసులు, ఏర్ బ్యాగులు చాల వరకు విరిగి, పగిలిపోయి చేరాయి. 15 రూ. పెట్టికొన్న రక రకాల తెలుగు ప్రతికలను కూడ లగేజి అధికారులు వెంట తీసికొనిపోనీయ లేదట. ఫుల్ టికెట్టుకు 20 కి. అరటికెట్టుకు 10 కి. లగేజి తీసుకుపోవచ్చు. రాజుగారు తీసుకుపోయిన 55 కి. లగేజిలో చింతపండు, కారప్పొడి, కొబ్బరి నూనె, పప్పులు, జీలకర్ర, వెల్లుల్లి, ధనియాలు, లవంగాలు, బట్టలు, సాహిత్య పుస్తకాలు ఉన్నాయట.

29 నాడు వెస్ట్ ట్రిపోలీ పవర్ స్టేషన్‌కు పోస్టింగు చేస్తూ అక్కడికి మంచి డీలక్స్ బస్సులో పంపించారు. అద్దె ఇంటి కొరకు చాలా ప్రయాసపడ్డారు. చివరికి రెండు రూములు, పెద్ద వరండా, కిచన్, బాత్‌రూమ్, లవేటరీ గల ఇల్లు దొరికింది. 45 దీనార్ల అద్దె (దీనార్‌కు 29-30 రూ. మధ్య) అంటే దాదాపు మన రూపాయల్లో 1350/- అన్నమాట.

లిబియాలో కార్యాలయాల్లో రోజుకు 7 గం. పని. ప్రొద్దున 7.30 నుండి పగలు 2.30 గం. దాకా ఉంటుంది. ప్రతి శుక్రవారం సెలవుదినం. రంజాన్ ('రమదాన్' అంటారు) పర్వదినాల్లో 9 గం. నుండి 2 గం. దాకా రోజు 5 గం. పని చేస్తారు. రంజాన్ నెలాఖర్లో 4 రోజులు సెలవులిస్తారు.

ఈ దేశంలో 'బాసిజం'లేదు. స్టేషన్ మేనేజర్ వచ్చినా టెక్నీషియన్‌లు హాయిగా సిగరెట్లు తాగుతూ కూర్చునే ఉంటారట. ఆయనతో షేక్‌హాండ్ ఇస్తూ నవ్వుతూ పలకరిస్తారట కూడ. అక్కడ చాలమంది వర్కర్లకు కార్లుంటాయి. బతే ఎవరికారు వారే నడుపుకోవడం ఇక్కడ మామూలు. డ్రైవరున్నవాడు చాల గొప్పవాడన్నమాటే. పనిమనుషుల కొరతవల్ల ఎవరిపనులు వారే చేసుకోవలసి ఉంటుంది.

లిబియాలోని ప్రజలు మధ్యధరా సమశీతోష్ణ ప్రభావంవల్ల ఆరోగ్యంతో మిసమిసలాడుతూ, ఎర్రని దేహకాంతితో, చక్కని కనుముక్కు తీరుతో, ఎంతో

ఉత్సాహంగా, అందంగా ఉంటారట. ఇక్కడి పురుషులు హాస్యప్రియులు, ఎక్కువగా సిగరెట్లు తాగుతారు. తమలపాకులు ఇక్కడ దొరకనందున వీరికి తాంబూలం గురించి తెలియదట.

అంతా రెడీమేడ్ దుస్తులే ధరించడంవల్ల టైలర్‌షాపులు రెండు మూడు కంటె ఎక్కువలేవట. కుటుంబ నియంత్రణ అంటే ఏమిటో ఈ దేశప్రజలకు తెలియదు కాని ఈ కాలపు అమ్మాయిలకు మాత్రం అధిక సంతానంమీద అంతగా ఆసక్తిగా లేదని రాజుగారు గమనించారు.

పాతకాలం స్త్రీల నెవరిని చూసినా కనుబొమల మధ్యనో, చుబుకం మీదనో, చెంపలపైనో, పెద్దగా పచ్చబొట్లు కనిపిస్తాయి. ఐతే ఈ తరంవాళ్లు పొడిపించుకోవటం లేదట.

లిబియా స్త్రీలు దాదాపు 70 శాతం అందగత్తెలని చెపుతూ మూర్తిరాజు గారు వారిని "లేత ఎరుపు గులాబీరంగుతో, మెరుపైన కళ్లతో, మంచి పలు వరుసతో, కొట్టవచ్చినట్టుగా బలంగా కనుపించే 'కుచ' సంపదతో" ఆకర్ష ణీయంగా వుంటారని దాపరికం లేకుండా వర్ణించారు.[2] ఈ పుస్తకానికి శుభా కాంక్షలు అందజేసిన యుగకవి, శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారు పై విష యాన్ని దృష్టిలో పెట్టుకునే కావచ్చు "లజ్జలో మజ్జనం చెయ్యని ఆయన నిస్సం కోచ అభివ్యక్తులు ఆయన అమాయక నగ్నవాగ్మితని ఆవిష్కరిస్తున్నాయి" అని వ్రాయవలసివచ్చింది.[3]

## ii) ఆచార వ్యవహారాలు :

లిబియాలో సన్నిహితులు, ఆప్త మిత్రులు కలుసుకున్నప్పుడు పరస్పరం 'సబాల్ ఖైర్' (గుడ్‌మార్నింగ్) లు చెప్పుకుని, కరచాలనం చేసుకుంటారు.[4]

---

2. నవ వన్నెల మధ్యధరా - పేజీ 91.
3. శుభాకాంక్షలు - పేజీ. 8.
4. 'మషాల్ ఖైర్' అంటే గుడ్ ఈవినింగ్ అని, 'అంషియార్ ఖైర్' అంటే గుడ్‌నైట్ అని అర్థం. పేజీ. 89.

తర్వాత మగవారు మగవారిని, స్త్రీలు స్త్రీలను ముద్దు పెట్టుకుంటారు. ఒకవేళ స్త్రీలు పురుషులను కాని, పురుషులు స్త్రీలను కాని కలిసినప్పుడు కేవలం కర చాలనం మాత్రమే చేస్తారు కాని ముద్దుల జోలికి పోరు. మొత్తంమ్మీద ఈ చుంబన సంప్రదాయం ఇప్పటి తరంలో క్రమంగా తగ్గిపోతున్నదని రచయిత గమనించారు. ముద్దు పెట్టుకున్న తర్వాత పరస్పరం పలకరించుకునే మాట "కైఫ హాలక్" (How are You?) అన్నమాట. ఇదంతా వాళ్ళు మర్యాదగా పాటించి చేస్తారే కాని తప్పుగా భావించరు. దూరంనుండి నమస్కరించే సంప్ర దాయంలోంచి వచ్చిన మనకవి కొత్తగా, పూర్తి ఎబ్బెట్టుగా కూడ అనిపిస్తాయి. ఇట్లాంటి అనుభవమే కొత్తగా అద్దెకు దిగిన ఇంట్లో రాజుగారికి ఎదురైంది.

అద్దెకోసం ఇల్లు చూస్తునప్పుడు ఆ ఇంటి మధ్యలోవున్న తలుపు తెరుచు కొని "బిలబిలమంటూ ఆ యింటి ఆవిడ, వారి పెళ్లికెదిగిన ముగ్గురు పెద్ద అమ్మాయిలు. చిన్నపిల్లలు వచ్చి" ఈయనకు షేక్‌హాండ్ ఇచ్చారట.[5] ఈ ప్రథమానుభవపు పులకింతతో 'కరెంట్ షాక్ కొట్టినట్టు' అనిపించిందని వ్రాశారు.

'రోము నగరంలో రోమను లాగే జీవించు' అన్న సామెత పిరికివాళ్ళు చెప్పే పనికిరాని సామెతలా భావించారు మూర్తిరాజుగారు. అందుకే లిబియాలో ఉంటూ కూడ అక్కడి ఆచార సాంప్రదాయాలకు అనుగుణంగా కాక, ఇండియన్ లాగే జీవించాలని నిశ్చయించుకున్నారు. భార్యాపిల్లలతో ఉన్నారు కూడానాయె. ఈ సామెతనే మార్చి 'Live in Rome as Indian' అని అన్నారు.

లిబియాలో సినిమా నిర్మాణం లేదు. చిత్రాలను దిగుమతి చేసుకొని అరబిక్ సబ్ టైటిల్స్‌తో చూపిస్తారు. సినిమాలు కేవలం మగపిల్లలు, పురుషు లకే పరిమితం, ఆడవాళ్ళు ఇండ్లలో టి. వి. చూస్తారు. ఎక్కువ మంది గుమ్మడి గింజలు కొనుక్కొని తింటూ సినిమాలు చూస్తుంటారు.

### iii) మార్కెట్లో ధరవరలు :

లిబియాలో దుకాణదారుడు చెప్పిందే ధర. బేరాలు లేవు. అట్లాగని మోసం చేస్తారని కాదు అర్థం. దుకాణంలో కొన్న వస్తువుల్ని నచ్చకపోతే వారం రోజుల

5. నవ వన్నెల మధ్యధరా - పేజీ. 48.

తర్వాత కూడ మార్చుకోవచ్చు లేదా వాపసుకూడా చేయవచ్చు. ఇక్కడ నైట్ క్లబ్బులు లేవు కాబట్టి ఒక వ్యక్తికి నెల ఖర్చు ఆయా ప్రదేశాలను బట్టి 20 నుండి 60 (600-1800 రూ॥) దీనార్లదాకా ఉంటుందట.

లిబియాలో 60% మాత్రమే తమ సంవత్సరాదాయంలో మిగుల్చుకొని స్వదేశాలకు పంపుకునే వీలుంది. ఇండియాకు ఈ డబ్బు చేరడానికి అప్పట్లో నెల రోజులైనా పట్టేదని మూర్తి రాజుగారు వ్రాశారు.

లిబియాలోని మార్కెట్ల ధరల పట్టికను రచయిత గ్రంథంలో వివరంగానే పేర్కొన్నారు. వాటిలో కొన్ని దిగువ ఇవ్వబడ్డాయి.

| వస్తువుల పేర్లు | ఆయా ప్రాంతాలు, సీజన్లను బట్టి కిలో/లీటరు ధర రూ॥లలో వరకు | |
|---|---|---|
| | రూ॥ల నుండి | రూ॥లలో |
| పెట్రోలు | — | 1-00 |
| కిరోసిన్ | 0-43 | 0-08 |
| బియ్యం | 1-50 | 1-80 |
| సర్ఫ్ 200 గ్రాములు | 2-50 | 8-00 |
| గొర్రె మాంసం | 55-00 | 65-00 |
| కోడి మాంసం | 14-00 | 18-00 |
| కందిపప్పు | 15-00 | 25-00 |
| గ్యాస్‌స్టవ్ బర్నర్లది | 120-00 | 300-00 |

కిలో బియ్యం ఖరీదు కంటె 200 గ్రాముల సర్ఫ్ ప్యాకెట్టుకే ఎక్కువ ధర ఉండటం గమనార్హం. అట్లాగే కోడి మాంసం కంటె కందిపప్పు వెల అధికంగా ఉండటం దారుణం.

ఇక్కడ గ్యాసు సిలిండర్లు ఎన్నైనా కొనుక్కోవచ్చు. ఒక సిలిండర్ గ్యాసుధర 85 పైసలు (1 పైస = 29 పై). గ్యాసు చాలా చౌక కాబట్టి 99 శాతం ప్రజలు గ్యాసుతోనే వంట చేసుకుంటారు.

ఉల్లిగడ్డలు ఇక్కడ బంగారంతో సమానం. కిలో దీనారున్నర, రెండు దీనార్లదాకా ఉంది ధర. (అంటే 28 - 56 దాకా.)[6] వెల్లుల్లి ఇంకా ఎక్కువ ఖరీదు కిలో 40 - 120 రూ॥ దాకా అమ్ముతారు.

---

6. మనదేశంలో అప్పుడు జనతా పాలన ఉంది. ఉల్లిగడ్డలకు ధర బాగానే ఉందప్పుడు.

ఇక్కడ రైళ్ళులేవు. 2200 కి. మీ. పొడవుగల మధ్యధరా సముద్ర తీరంలోనే ఎన్నో ఓడ రేవులున్నాయి. కాబట్టి దిగుమతులన్నీ పెద్దపెద్ద ఓడల ద్వారా వస్తాయి లిబియాలో పండ్ల ఉత్పత్తి లేనట్లే లెక్క. ఖర్జూర, దానిమ్మ, నారింజ, ఆపిలు చివరకు అరటి పండ్లు కూడ కిలోల లెక్కన తూచి అమ్ము తారు. నారింజపండ్లు కిలోకు నాలుగైదు వస్తాయి. కాని ఖరీదు 80 పైసలు. (28 రూ॥).

## 2. రమణాబాయమ్మగారి 'సింహళద్వీపయాత్ర:*

శ్రీమతి తాడూరి రమణాబాయమ్మగారు సింహళద్వీపయాత్ర ఏ సంవత్స రంలో చేశారో తెలియదుకాని వారి యాత్రా విశేషాలు మాత్రం సెప్టెంబరు 1920 భారతి మాస పత్రికలో ప్రకటితమయ్యాయి. ఆ వ్యాసం పేరు 'సింహళ ద్వీప యాత్ర.' రచయిత్రి జన్మస్థలాదికం గురించి కూడ ఏ వివరాలు లేవు. కాని క్రింది వాక్యాలనుబట్టి ఆమె కోస్తా ఆంధ్రదేశానికి చెందినట్లుగా తెలుస్తున్నది: "తూర్పు సముద్రతీర వాసులము, ఆంధ్రులమైన మనము భానూదయమునేకాని భూగ ర్భమునకేగు భానుని యస్తమయ మెన్నడును పరిస్ఫుటముగా దర్శింపజాలము."

### i) ప్రయాణ మార్గము :

రమణాబాయమ్మగారు మద్రాసు నుండి శ్రీలంకకు వెళ్ళు ప్రయాణ మార్గాన్ని ఇట్లా తెలియజెప్పారు: మద్రాసులో రాత్రి 7 గంటలకు 'బోటు మెయిలు'లో బయలుదేరితే సరాసరి ఆ రైలు మర్నాడు సాయంత్రం నాలుగున్నర గంటలకు ధనుష్కోటికి చేర్చుతుంది. అక్కడి నుండి శ్రీలంకకు వెళ్ళే స్టీమ రులో ప్రయాణించి రెండు గంటలకాలం సముద్రయానం తర్వాత తలైమన్నారు రేవు వస్తుంది. ఇక్కడ వైద్య పరీక్షలు, కస్టమ్సు వారి 'తనిఖీల' తర్వాత సమీపంలోనే ఉన్న కొలంబో రైలులోకి ప్రవేశించి సరిగ్గా 12 గంటల ప్రయాణా నంతరం కొలంబో చేరుకోవచ్చు. ఇది అరవై సంవత్సరాలనాటి యాత్రా మార్గం.

### ii) స్టీమరు ప్రయాణంలో ఇబ్బందులు :

ప్రయాణం కొందరికి సరిపడదు. అందులో సముద్ర ప్రయాణం చాల మందికి ఇబ్బందికరంగా ఉన్నట్లు తమ మొదటి అనుభవంలో పేర్కొంటుంటారు కూడ. సాధారణంగా సాయంకాలాల్లో సముద్రం అల్లకల్లోలంగా ఉంటుంది.

* శ్రీమతి తాడూరి రమణాబాయమ్మగారు.

ఆ అలల తాకిడికి ఎంత పెద్ద స్టీమరైనా చిన్న నావలాగా ఊగిసలాడవలసిందే. ఈ ఊపును తట్టుకోలేక చాలమంది వాంతి చేసుకుంటారు. దీన్నే 'సీ సిక్‌నెస్' అంటారు. ఆ సమయంలో యాత్రికుల ప్రవర్తన ఎట్లా ఉంటుందో రచయిత్రి ఇట్లా వ్రాశారు: "తోటి ప్రయాణికులు వీక్షించెదరేమో యను శంకచే అంచున నిలబడి వెనుకకు దృష్టిని మరల్చి తమ పనిని ముగించువారును, వాంతి చేసికొను వారిని చూచి మరికొందరు తామట్టి యూపునకు లోబడమను భ్రాంతిచే వారలను హాస్యము జేసి స్వల్ప కాలములో తాము కూడ నట్టి స్థితికే వచ్చువారును నగు చుందురు." ఐతే స్టీమరులోని నౌకర్లు చిన్న చిన్న బకెట్లను చేతిలో పట్టుకొని తిరుగుతూ వాంతి చేసుకొనే వారి దగ్గర ఉంచుతారట!

## iii) శ్రీలంక విశేషాలు :

కొలంబో సింహళ ద్వీపానికి ముఖ్యపట్టణం. ఇక్కడ క్వీన్ స్ట్రీట్ చాలా విశాలమైన వీధి దీనికి దగ్గరలోని రత్నపురిలో రత్నాల గనులున్నాయి. తాబేలు చిప్పలతో హారాలు, యేనుగు వెంట్రుకలతో ఉంగరాలు తయారుచేసే స్వదేశ పరిశ్రమలు బీద వాళ్ళకు జీవనాధారంగా ఉన్నాయట. కాండీ పట్టణం ప్రకృతి సౌందర్యానికి ఆటపట్టు. "ఎచ్చట జూచినను సుందరగిరులే! ఏ వైపు దృష్టి నిగిడ్చినను మనోహర పుష్పలతాదులే! ఏమూల తిలకించినను ఉద్యానవనములే! ఎటు వీక్షించినను రత్నకంబళ్ళు పరచినటుల పచ్చిక మైదానములే!" ఇవన్నీ ఆ నగర సౌందర్యాన్ని ద్విగుణీకృతం చేశాయని వ్రాశారు. ఈ నగరంలోనే మూడు వేల సంవత్సరాల క్రిందటి బుద్ధ దేవాలయం దర్శనీయమైంది. బుద్ధుని నిర్వాణానంతరం ఇక్కడ పార్వతీదేవి విగ్రహాన్ని తొలగించి దాని స్థానంలో బుద్ధుని విగ్రహాన్ని ప్రతిష్ఠించినట్లు ప్రతీతి.

## iv) లంకా ద్వీపంలోని ప్రజలు :

సింహళీయుల మాతృభాష సింగరీ భాషకూ,సంస్కృతానికీ దగ్గరి సంబంధ ముంది. ఇది ఉష్ణప్రదేశం కాబట్టి దుస్తుల అవసరం ఎక్కువగా కనబడదు. పురుషులలాగే స్త్రీలు కూడా ఐదు మూరల వస్త్రాలనే ధరిస్తారు. అక్కడ కొబ్బరి నూనె విస్తారం కాబట్టి' స్త్రీల శిరోజాలు పొడవుగా, ఒత్తుగా, పట్టుకుచ్చుల్లాగా మెరుస్తూండడం' రచయిత్రి గమనించారు. శ్రీలంకలోని ప్రజలు గ్యాసు మూలంగా వంట చేసుకోవడం రమణాబాయమ్మగారికి వింత గొలిపింది. భారత దేశంలో లేని ఈ సౌకర్యం ఆ ఖండానికి సమీపంలోనే ఉన్న శ్రీలంకలో ఉండ డాన్ని చూచిఆమె ఆశ్చర్యపడింది. ఎందుకంటే, ఆ కాలం నాటికి గ్యాసు పొయ్యి సౌకర్యం కేవలం విదేశాలకు మాత్రమే పరిమితమై ఉంది.

# చివరి మాటలు

ప్రపంచంలో దినచర్య వ్రాసుకునే అలవాటు ఎప్పుడు పుట్టిందో తెలియదు కాని ప్రయాణ వివరాలను నమోదు చేసుకునే సంప్రదాయం చిరకాలంగా కనిపిస్తుంది.

యాత్రా చరిత్రల గురించి పరిశోధనలోకి దిగిన తర్వాతగాని దాని లోతుపాతులు, ముఖ్యంగా దాని విశేషవ్యాప్తి తెలియరాలేదు.

ఇప్పటి వరకు తెలుగులో నా చేతికి దాదాపు 160 యాత్రా చరిత్రలు (పుస్తకాలు,వ్యాసాలు) మాత్రమే అందాయి. ఇవిగాక నేను ఆయా వ్యక్తుల ద్వారా విన్నవి మరెన్నో ఉన్నాయి. దీనివల్ల నేను గ్రహించిందేమిటంటే - యాత్రా చరిత్రల కోసం వెతికితే దేశంలో నేడున్న గ్రంథాలయాలు అందించే సహాయం చాల పరిమితమైనదని. దీనికి కారణం 19, 20 శతాబ్దాల్లో ఎందరో యాత్రా మూర్తులు వ్రాసుకున్న యాత్రానుభవాలు కాలగర్భంలో కలసిపోయి ఉంటాయి.

మరొక విషయమేమిటంటే, ఎన్నో యాత్రా చరిత్రలు అముద్రిత రూపంలో వుండి ఏ అటకలమీదనో చెదలుపట్టి ఉంటాయి లేదా ఆయా వారసుల గతస్మృతులకు ప్రతీకలై శిథిలావశేషాలై ఉంటాయి. ఏ అదృష్టవంతుల స్మృతులో ముద్రితములైనప్పటికీ అవి గ్రామ, పట్టణ, నగర స్థాయిలకు మాత్రమే పరిమితమై ఉండి ఉంటాయి. యాత్రికుల్లో చాలమంది కీర్తికాంక్షలేని వారవడం చేత అవి ఈనాటి పరిశోధనకు అందడం కష్టమే.

కాశీయాత్రకు వెళ్ళిన పలువురు సామాన్యులు, అసామాన్యులు తమ యాత్రా నుభవాలు వ్రాసి పెట్టుకున్న వ్రాత ప్రతులను ఆయామఠాల్లో లేదా ఆయా విడుదుల్లో వదలిపెట్టేవారని ఇటీవల కాశీకి వెళ్ళివచ్చినవారిద్వారా తెలిసింది. ప్రత్యేకంగా వాటి గురించి సర్వే జరిపితే గాని తెలియరాని విషయమిది. ఈ విధంగా సమగ్ర యాత్రా చరిత్రల సంగ్రహణం ఎంత గహనమో దీనివల్ల గ్రహించవచ్చు.

పరిశోధనకు ముందు నేను ఊహించిందంతా వాస్తవానికి తల్లక్రిందైనది. ఐతే సర్వ సమగ్ర సామగ్రి సేకరణ వీలు కానప్పటికీ లభించిన సామగ్రిని ఒక సమీక్షా ధోరిణితో, పరిణామదృష్టితో ప్రదర్శించడానికి ప్రయత్నం జరిగింది. విశ్లేషణ, సాధారణీకరణ ఫలితాలను సాధించడానికి విషయపరిమితి, విషయ కాలవైవిధ్యాలూ మొదలైనవీ పరిమితులు విధించాయనే చెప్పాలి. ఐతే కొన్నిచోట్ల తులనాత్మక పద్ధతిని అనుసరించడంవల్ల ఆయా కాలాల చరిత్రల్లోని మార్పులు తెలుసుకోవడానికి వీలయింది.

తెలుగులో యాత్రా చరిత్రలపైన నాకు తెలిసినంతవరకు ఇదే మొదటి సిద్ధాంత వ్యాసం. ఈ విషయంపైన ఇంకెంతో పరిశోధన మున్ముందు జరుగవలసి ఉంది. అంతవరకు ఇది భూమికగా ఏర్పడిన, వర్ణనాత్మకంగా జరిగిన తొలి పరిశీలనగా భావించవలసి ఉంటుంది.



# యాత్రాచరిత్రల పట్టిక

## 1. తెలుగులో యాత్రాచరిత్రలు :

**గ్రంథాలు :-**

| | | |
|---|---|---|
| 1. | అంతా కలిస్తే అమెరికా | కొడాలి వేంకటేశ్వరరావు, నవోదయ పబ్లిషర్స్, విజయవాడ, ప్రథమ ముద్రణము. జూలై 1977. |
| 2. | అంతేవాసులతోడ హంపీ విహార యాత్ర. | ముమ్మన్నేని లక్ష్మీనారాయణ, కోటయార్య వైదిక సాహిత్య మండలి, అమృతలూరు (పోస్టు), గుంటూరు జిల్లా. |
| 3. | ఆంగ్లసీమలో ఆమని పీణలు. (ఇంగ్లాండు యాత్రా కవితలు) | అవంత్స సోమసుందర్, కళాకేళి ప్రచురణలు, పిఠాపురం, ప్రథమ ముద్రణము: సెప్టెంబర్, 1986. |
| 4. | ఇనుపతెర వెనక ... (సోవియట్ రష్యా పర్యటన - అనుభవాలు) | డా॥ రావూరి భరద్వాజ, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, చంద్రం బిల్డింగ్స్, విజయవాడ - 4, ప్రథమ ముద్రణము: జనవరి, 1985. |
| 5. | ఏనుగుల వీరాస్వామయ్య గారి కాశీయాత్ర చరిత్ర | 'చెన్న పట్టణములో నుండిన సుప్రసిద్ధ ఆంధ్ర మహా పురుషుడు 1830-1831 మధ్య భారత దేశ స్థితిగతులను గురించి వ్రాసిన దినచర్య, లేఖలు.' ప్రథమ ముద్రణము: ఏప్రిల్ 1838, ద్వితీయ ముద్రణము: డిసంబరు 1869, తృతీయ ముద్రణము: సెప్టెంబరు 1941, సంపాదకుడు: దిగవల్లి వేంకట శివరావు, బెజవాడ, వెల: రూ. 2-12-0. |

| | | |
|---|---|---|
| 6. | ఐతిహాసిక యాత్రలు ('ఆంధ్రభోజ' 'సాహితీ వల్లభ' శ్రీశ్రీముళ్ళపూడి తిమ్మరాజ చౌదరి గారి) | వివిధ రచయితలు, నరేంద్రనాథ సాహిత్య మండలి, తణుకు, ఆంధ్రప్రదేశ్, ఏప్రిల్ 1978. |
| 7. | కళ - ప్రకృతి. | విద్వాన్ సూరాబత్తుల సుబ్రహ్మణ్యము, వేంక ట్రామ అండ్‌కో, విజయవాడ, ప్రథమ ముద్ర ణము: జనవరి 1956, వెల: రూ. 1-8-0. |
| 8. | కాంగ్రెస్ వైద్యదళము మలయా యాత్ర | చింతలపాటి శివరామశాస్త్రి, ప్రచురణ : శ్రీ హరనాథమురళి, తెనాలి, ప్రథమముద్రణ : 1947. |
| 9. | కాశీయాత్ర (పూర్వభాగము) | ఆకుండి పరబ్రహ్మశాస్త్రి, 'ఇయ్యది సకల యాత్రా జనోపయోగార్థము ధర్మకర్త బిరు దాంచితులగు ఆకుండి వ్యాసమూర్తి సిద్ధాంతి గారి కుమారుడు పరబ్రహ్మశాస్త్రిచే రచియింప బడినది'. రాజమహేంద్రవరము విద్యా నిలయ ముద్రాక్షరశాల యందు ముద్రింప బడినది. మొదటి కూర్పు : 1914. రెండవ కూర్పు: 1916, వెల: 6 అణాలు. ఉత్తరభాగం అలభ్యం. |
| 10. | కాశీయాత్ర | చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, తిరుపతి వేంకటేశ్వర కృతులు, షష్టిపూర్తి మహోత్సవ సంఘము, బందరు. 1934 |
| 11. | కాశీయాత్ర | స్నేహలతా కవితా సంఘ పుష్పము: 41. గ్రంథకర్తలు: వాజపేయ యాజుల రామ సుబ్బారాయుడు అండ్ వెంకట నారాయణ (సోదర కవులు) స్నేహలతా కవితా సంఘాధ్య క్షులు, కొల్లాపురము. (శ్రీజటప్రోలు సంస్థా నము). 1934 |
| 12. | కాశ్మీర దీపకళిక | డా. నాయని కృష్ణకుమారి. ప్రతులకు: ఉద యిని, 8-3-898/2, నాగార్జున నగర్, హైదరా బాద్-500873. ప్రథమ ముద్రణ: మార్చి 1978. ద్వితీయముద్రణ: డిసెంబరు, 1986. |

| | | |
|---|---|---|
| 13. | కైలాస దర్శనం (బ్రహ్మమానససరోవర యాత్ర) | పి. వి. మనోహరరావు. ప్రతులకు: రచయిత, 6-4-108. బ్రాహ్మణవీధి, హనుమకొండ-11. ప్రథమముద్రణ : మార్చి, 1986. |
| *14. | గంగా సేతు యాత్రా ప్రకరణము అను యాత్రా చరిత్ర | వెంకటేశ్వరయ్య. గొబ్బూరి వేంకటానంద రాఘవరావు గారి 'ఆంధ్ర వచన రచనా పరిణామము' అన్న గ్రంథంలో 'యాత్రా చరిత్రలు' అన్న శీర్షిక కింద పై పుస్తకం పేర్కొనబడింది. అంతకుమించి వివరాలు తెలియలేదు. |
| 15. | గాలిమేడల అమెరికాలో. | ఎల్. ఎన్. రావు. మెంబర్, సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటీ, ప్రచురణ కర్తల వివరాలు లేవు. 1954. |
| *16. | (నా) చైనా యాత్ర | అయ్యదేవర కాళేశ్వరరావు ఇది పెద్దపుస్తకమేనని చీమకుర్తి శేషగిరిరావుగారు చెప్పారు. |
| 17. | చైనాయానం | శ్రీశ్రీ, నవయుగ బుక్ సెంటర్, ఏలూరు రోడ్, విజయవాడ - 2, ప్రథమ ముద్రణ : మార్చ్, 1980. |
| 18. | తిరుపతి యాత్ర | స్వామి ఓంకార్, శ్రీ గౌతమీ గ్రంథాలయం, రాజమండ్రిలో చ. 771 నెం. తో ఉంది. పుటలు 23. |
| 19 | తిరుమల తిరుపతియాత్ర | యం. గోపాలాచార్యులు, దేవస్థానం కమిటీ వారి తరపున కమీషనరు అగు శ్రీ ఎ జయరామనాయుడు గారిచే ప్రచురింపబడింది. 1948. వెల రూ. 0-7-0. |
| 20. | నవభారత సందర్శనం (ఉత్తరాపథంలో ఆంధ్ర రైతుల విజయ యాత్ర-నా అనుభవాలు) | కె. వి. సుబ్బయ్య, యువ కర్షక ప్రచురణలు, గుంటూరు - 1. ప్రథమ ముద్రణ : జులై, 1957. |

| | | |
|---|---|---|
| 21. | నవభారతి | శ్రీమతి మాలతీ చందూర్ 'పాతలోంచి కొత్తలోకి అడుగిడుతున్న భారత దేశపు పునర్నిర్మాణ కార్యకలాపాలను కొన్నిటిని ప్రత్యక్షంగా చూచిన పిమ్మట వ్రాసిన వ్యాస పరంపర' శ్రీ కమలా పబ్లిషింగ్ హౌస్, విజయవాడ - 2, ప్రథమ ముద్రణ : 1978. |
| 22. | నవ వన్నెల మధ్యధరా (నా లిబియా ప్రయాణానుభవాల వ్యాస - కావ్యము) | సి. వి. మూర్తి రాజు, ప్రతులకు : క్వార్టర్ నెం. 293 హెచ్/2/బి. హెచ్.ఇ.లిమిటెడ్, రామచంద్రాపురం, హైదరాబాదు- 500032. మొదటి ముద్రణ : 1979. |
| 23. | నా అమెరికా పర్యటన | ఆవుల గోపాలకృష్ణమూర్తి, ప్రభాత్ పబ్లిషింగ్ హౌస్, మెయిన్ రోడ్, తెనాలి, ప్రథమ ముద్రణ : ఏప్రిల్, 1966. |
| 24. | నా అమెరికా యాత్ర | శ్రీమతి పి రుక్మిణమ్మ, శ్రీకాళహస్తి తాలూకా రచయితల సంఘము, శ్రీ కాళహస్తి, ప్రథమ ముద్రణ : 1976. |
| 25. | నా ఉత్తరదేశ యాత్ర (ప్రసిద్ధ స్థలాలను గురించిన విశేషాలు) | బులుసు వేంకట రమణయ్య, 33, సింగరాచారి వీధి, ట్రిప్లికేన్, మదరాసు-5, ప్రథమ ప్రచురణ : మే, 1958. |
| 26. | నా తీర్థయాత్ర (ఎల్లోరా-అజంతా) | అడవి బాపిరాజు. ప్రకాశకులు : అణా గ్రంథ మాల, సోల్ డిస్ట్రిబ్యూటర్సు:- కేశవ పబ్లికేషన్సు అండ్ బుక్‌స్టాల్స్ లిమిటెడ్, జాంబాగు, హైద్రాబాదు-దక్కన్. 1941, వెల. 0-1-0. |
| 27. | నా దక్షిణదేశ యాత్రలు | బులుసు వెంకట రమణయ్య, 33, సింగరాచారి వీధి, ట్రిప్లికేన్, మదరాసు-5. |
| 28. | నా మహారాష్ట్ర యాత్ర ప్రథమ భాగము. | జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, 292 ఎస్ప్లనేడ్, మద్రాసు-1, 1951. |

| | | |
|---|---|---|
| *29. | నా మానస సరోవర యాత్ర | జస్వంత సింహ. ఇది పుస్తకరూపంలో వున్నట్లు చీమకుర్తి శేషగిరిరావు చెప్పారు. |
| 30. | నా యాత్ర | ప్రాతూరి వేంకట శివరామశర్మ, విజయ ముద్రాక్షరశాల, బాపట్ల, (ముఖపత్రం లేక పోవటం వల్ల ఇతర వివరాలు తెలియలేదు). శ్రీ గౌతమీ గ్రంథాలయంలో ఈ పుస్తకం 'Rare Material' కింద భద్రపరచ బడింది. |
| 31. | నా రష్యా పర్యటన | ఎన్.వి. జనార్దనరావు. వెంకటరత్నమ్మ పబ్లికేషన్స్, దేవ, వయా - ఆచంట, పశ్చిమ గోదావరి జిల్లా, తొలి ప్రచురణ : 1977. |
| *32. | నా రాజస్థానీ యాత్ర | జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తి. ఈ యాత్ర 1944 లో జరిగినట్లు ప్రసిద్ధ పాత్రికేయుడు జి. కృష్ణ గారు చెప్పారు. |
| 33. | నా శ్రీశైల యాత్ర | చివుకుల పెదవేంకటాచలపతి, చినగంజాం, వైశ్య ప్రెస్, నెల్లూరు, తొలి ముద్రణము : 1950. వెల. 0-8-0, (దీనిలో 169 పద్యాలున్నాయి.) |
| 34 | నీలగిరి యాత్ర | కోలా శేషాచల కవి. సూపరింటెండెంటు, గవర్నమెంట్ ప్రెస్, మదరాసు వారిచే ప్రచురితము. 1953. |
| 35. | నేను చూసిన అమెరికా | అక్కినేని నాగేశ్వరరావు, జ్యోతి బుక్స్, విజయవాడ - 2, ప్రథమ ముద్రణ: జనవరి, 1965. |
| 36. | నేపాల యాత్ర (పశుపతినాథము) | బులుసు సూర్యప్రకాశశాస్త్రి, సాధన గ్రంథమండలి, తెనాలి. తొలి ముద్రణ : 1958. వెల 1-4-0. |

| | | |
|---|---|---|
| *37. | పురుషోత్తమ చరిత్ర. | అల్లూరి లక్ష్మీనరసింహం. గొఱ్ఱాటి వేంకటానంద రాఘవరావు గారు తమ 'ఆంధ్ర వచన రచనా పరిణామము' అన్న గ్రంథంలో 'యాత్రా చరిత్రలు' అనే శీర్షిక కింద ఈ పుస్తకాన్ని పేర్కొన్నారు. |
| 38. | ప్రథమ సోషలిస్టు దేశంలో పర్యటన - పరిశీలన. | చుక్కపల్లి పిచ్చయ్య. నవజీవన్ బుక్ లింక్స్, విజయవాడ - 2. ప్రథమ ముద్రణ: 1980. |
| 39 | ప్రాక్ - పశ్చిమములు. | కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య. వరల్డ్ టీచర్ ట్రస్టు ప్రచురణ, 14-38-2, రాధా మాధవమ్, మహారాణి కాలనీ, విశాఖపట్టణం-2. ప్రథమ ముద్రణ : జనవరి, 1982. |
| *40. | ప్రిన్స్ - ఆఫ్ వేల్సు యాత్రా చరిత్ర. | కొక్కొండ వేంకటరత్నం పంతులు గారు. 'మా మహారాజుతో దూర తీరాలు' అన్న యాత్రా గ్రంథానికి నిడుదవోలు వేంకటరావుగారు వ్రాసిన పీఠికలో దీని వివరాలున్నాయి. |
| 41. | బదరీ యాత్ర. | బులుసు సూర్యప్రకాశశాస్త్రి. సాధన గ్రంథ మండలి, తెనాలి. ప్రథమ ముద్రణ : 1949. |
| *42 | బొబ్బిలి రాజావారి యాత్రా విశేషాలు. | మండపాక పార్వతీశ్వర శాస్త్రి, రంగరాయ విలాస ప్రెస్, బొబ్బిలి, 1867. |
| 43. | భూప్రదక్షిణుడు భార్యకు వ్రాసిన లేఖలు. | అత్యం నరసింహమూర్తి (న్యూయార్కు), అద్దేపల్లి అండ్ కో, సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి, పునర్ముద్రణ: సెప్టెంబర్, 1961 |
| 44. | మధుర స్మృతులు (సోవియట్ యూనియన్ పర్యటన అనుభవాలు) | కాంచనపల్లి వెంకట రామారావు. నల్లగొండ ఇస్కస్ ప్రచురణలు, 1983. |

| | | |
|---|---|---|
| 45. | మరో ప్రపంచం | శ్రీ పడాల సోవియట్ పర్యటనానుభవాలు, ఆంధ్రశ్రీ పబ్లికేషన్స్, రాజమండ్రి-103, ప్రథమ ముద్రణ: నవంబర్, 1977. |
| 46. | మా ఉత్తర భారత యాత్ర. | శ్రీమతి ముళ్ళపూడి కమలాదేవి, శ్రీ నరేంద్ర నాథ సాహిత్య మండలి, తణుకు, ఆంధ్ర ప్రదేశ్-1972. |
| 47. | మా మహారాజుతో దూర తీరాలు | కురుమెళ్ళ వెంకటరావు, ఏ వన్ ప్రింటింగ్ వర్క్స్, హైదరాబాదు, ప్రాప్తిస్థానము: రచయిత, ఐ.ఎస్-57, ఎర్రంమంజిల్ కాలనీ, హైదరాబాదు, ప్రథమ ముద్రణ : 1966. |
| 48. | మా విజ్ఞాన యాత్ర | వేగుంట కనక రామబ్రహ్మం, ఇతర వివరాలు లేవు. కాని శ్రీ గౌతమీ గ్రంథాలయం, రాజ మండ్రిలో ఈ పుస్తకం ఎ ఆర్.నం. 395/12515 నెంబరుతో ఉంది. |
| *49. | యాత్రాలాపము | రాజమండ్రి నివాసి (ముని) పేరు తెలియదు. తన యాత్రానుభవాలను తెలుగులో చెప్పగా గుజరాతీలో వ్రాయబడిందట; తర్వాతనే తెలుగులో అచ్చయిందనీ, లావు పుస్తకమనీ శ్రీమతి మాలతీ చందూర్ చెప్పారు. |
| 50. | రష్యాలో ఏముంది? | ఏ. ఎన్. పోశెట్టి, ప్రజారాజ్యం పబ్లికేషన్స్, జెండా గల్లి, నిజామాబాదు-1, ప్రథమ ముద్రణ: అక్టోబర్ 1986. |
| 51. | రష్యాలో స్నేహయాత్ర | డా॥ వాసా ప్రభావతి, వాసా ప్రచురణలు, మలక్‌పేట, హైదరాబాదు. ప్రథమ ముద్రణ: జూన్, 1988. |
| 52. | శ్రీ వేంకటాచల యాత్ర | కేసారపల్లి చెంగయ్య, యన్.వి.యన్. ప్రెస్, తిరుపతి, 1908. |
| *53. | శ్రీశైల యాత్ర | మున్నంగి లక్ష్మీనరసింహ శర్మ, ఈ పుస్తకం ప్రస్తావన గొబ్బూరి వేంకటానంద రాఘవరావుగారి గ్రంథంలో ఉంది. |

54. సీమకు స్టీమరులో* (1928) — డి. వి. సుబ్బారెడ్డి, ప్రకాశకులు: రచయిత, 1-10-32, అశోక్‌నగర్, హైదరాబాదు. ప్రథమ ముద్రణ : డిసెంబర్, 1968.

55. సువర్ణ సుందర మలేషియా — డా. త్రిపురనేని వేంకటేశ్వరరావు, కవిరాజ సాహిత్య విహారము, గుడివాడ, ప్రథమ ముద్రణ : 1981.

56. సోవియట్ రష్యాలో పదిరోజులు — డా. సి. నారాయణరెడ్డి, ప్రచురణ : భారత సోవియట్ సాంస్కృతిక సంఘం, (ఇస్కస్), ఆంధ్రప్రదేశ్ రాష్ట్రసమితి, 5-9-61, లాల్ బహుదూర్ స్టేడియం, హైదరాబాదు-1, ప్రథమ ముద్రణ : ఏప్రిల్, 1980.

57. హెనోయి విశేషాలు-కాంబోడియా కబుర్లు — క్రొవ్విడి లక్ష్మన్న, విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, ప్రథమ ముద్రణ: మార్చి 1957, వెల రూ. 1-2-0. (ఇందులో యాత్రా స్పర్శ లేదు)

* ఈ గుర్తుగల గ్రంథాలు అలభ్యములు.

## 2. యాత్రాసంబంధి వ్యాసాలు :

1. అనుభూతికి అక్షరాకృతి — జి. పద్మావతి, 'కాశ్మీర దీపకళిక' యాత్రా గ్రంథంపై సమీక్షా వ్యాసం, ఆంధ్రభూమి దినపత్రిక, మార్చి 9-1987.

2. అబ్దుల్ రజాక్ — భావరాజు వేంకట కృష్ణారావు, భారతి, సాహిత్య మాస పత్రిక, రక్తాక్షి సంవత్సర భాద్రపదం (సెప్టెంబర్, 1924).

3. అబ్దుల్ రజాక్ — భావరాజు వేంకట కృష్ణారావు, భారతి, రక్తాక్షి, మార్గశీర్షం, (డిసెంబర్, 1924).

4. అబ్దుల్ రజాక్ — భావరాజు వేంకట కృష్ణారావు, భారతి, రక్తాక్షి, మాఘం (ఫిబ్రవరి, 1925).

| | | |
|---|---|---|
| 5. | 'అలల సవారీ చేసిన అమ్మాయి' | ఈనాడు, 14-9-1988. |
| 6. | ఆంధ్రుల నౌకాయాన కౌశల్యము | బోయనపల్లి పద్మరాజు, భారతి, పార్థివ, మాఘ (ఫిబ్రవరి, 1946). |
| * 7. | అఖండ యాత్ర | వేముల వేంకట అప్పారావు, భారతి, ఖర, మాఘ (ఫిబ్రవరి, 1952). |
| 8. | 'ఆదిలాబాద్ యువకుల లక్షదీవుల సాహస యాత్ర' | ఈనాడు (ఆదిలాబాదు), 14-8-1989. |
| 9. | ఇంగ్లండు యాత్ర | టంగుటూరి ప్రకాశం గారి 'నా జీవిత యాత్ర - ప్రథమ ఖండము'లో ఈ యాత్రా ప్రసక్తి ఉంది, (పుటలు 118-136) శిల్ప గ్రంథమాలిక - ప్రథమ కుసుమం, మద్రాసు, 1946. |
| 10. | ఉత్తర హిందూ దేశ యాత్ర | ఆచంట జానకిరాం. భారతి, క్రోధన, ఆశ్వ. (అక్టోబర్. 1925). |
| * 11. | ఎంకి పాటలు - తిరుపతి యాత్ర | నండూరి వెంకట సుబ్బారావు. భారతి, జనవరి, 1924. |
| 12. | 'ఎర్ హోస్టెస్ సాహస యాత్ర' | ఈనాడు, 1-12-1985. |
| 13. | కమల్‌హాసన్ విదేశీ యాత్రానుభవాలు. | విజయచిత్ర, మార్చి, 1988. |
| 14. | 'కాలినడకన భారత దర్శన్' | న్యూస్‌టుడే, ఈనాడు. 31-3-1989. |
| 14/1. | కాశీయాత్ర. | దేశభక్త కొండ వేంకటప్పయ్య పంతులు 'స్వీయచరిత్ర - ప్రథమ భాగము'లో కాశీ యాత్ర ప్రసక్తి (పుట 141) ఉంది. ప్రకాశకులు: ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచారం సంఘం, విజయవాడ - 2, 1952. |

| | | |
|---|---|---|
| 15. | 'కాశీరామేశ్వర యాత్రలు' | కొండాలి లక్ష్మీనారాయణ రచించిన 'శ్రీ రాజా వేంకటాద్రినాయుడు' అన్న గ్రంథంలో ఈ యాత్రల గురించి ఆరు పేజీల ప్రస్తావన ఉంది. 1812-18 సంవత్సరాల్లో నాయుడు గారు కాశీయాత్ర చేసినట్లు పేర్కొనబడింది. ప్రచురణ: శ్రీ భావనారాయణ స్వామి వారి దేవస్థానము, పొన్నూరు, 1968. |
| 16. | కాశీ శతకమ్ | యస్వీ. జోగారావుగారి సంపాదకత్వంలో వెలువడ్డ 'శ్రీ ఆదిభట్ల నారాయణదాసు సారస్వత నీరాజనము' అన్న గ్రంథంలో దీని ప్రస్తావన ఉంది. ఈ పుస్తక ప్రచురణ: రచయితల సహకార సంఘము, గుంటూరు. జనవరి, 1975. |
| 17. | కాశ్మీర దీపకళిక | నాయని కృష్ణకుమారి 'కాశ్మీర దీపకళిక'పై 'శేరా' వ్రాసిన సమీక్ష. ఆంధ్రప్రభ దిన పత్రిక. |
| 18. | కాశ్మీర దీపకళిక | 'కాశ్మీర దీపకళిక యాత్రా చరిత్ర కాదు, తెలుగు వచనానికి రసగుళిక!' అన్న శీర్షికతో 'చేరా' గారి సమీక్ష, ఆదివారం ఆంధ్రజ్యోతి మార్చి 22, 1987. |
| 19. | కాశ్మీర యాత్ర | డా. టి. గౌరీశంకర్ రచించిన 'అమర భవాని (జీవిత రేఖలు)' అన్న గ్రంథంలో - కాశ్మీర యాత్ర ప్రసక్తి (పుట. 82) ఉంది, ప్రచురణ : రాణీ భవానీదేవి మెమోరియల్ ట్రస్టు, చల్లపల్లి, కృష్ణా జిల్లా, ప్రథమ ముద్రణ : మార్చి, 1986. |
| 20. | కొచ్చి ప్రయాణము | పెద్దిభొట్ల వీరయ్యగారి 'స్వీయ చరిత్ర' లో కొచ్చి ప్రయాణం (పుట. 80)తోపాటు కాశీ, భద్రాచలం, స్టీమరుపై చెన్నపట్నానికి చేసిన యాత్రల ప్రసక్తులు కూడ ఉన్నాయి, ప్రచురణ : 1959. |

| | | |
|---|---|---|
| *21. | కైలాస యాత్ర (పద్య) | చోడవరపు జానకి రామయ్య అండ్ పువ్వాడ శేషగిరిరావు, భారతి, ప్రజోత్పత్తి, మార్గశిర, డిసెంబర్, 1931. |
| 22. | కైలాస యాత్ర (హిమాలయ వైభవము) | కొ. సత్యనారాయణ, భారతి, బహుధాన్య, ఆషాఢ (జూలై, 1938). |
| 23. | గోముఖ యాత్ర | శ్రీ ప్రణవానంద, కృష్ణ. క.గో. సంపాదితము, భారతి, విక్రమ, జ్యేష్ట (జూన్, 1940) |
| 24. | జర్మనీ యాత్ర | డా. వుప్పల లక్ష్మణరావు గారి 'బతుకు పుస్తకం' (పుట. 95-97) లో దీని ప్రస్తావన ఉంది. విశాలాంధ్ర ప్రచురణ. అగస్టు,1983. |
| 25. | తిరుపతి యాత్ర | పైడి లక్ష్మయ్యగారి 'జ్ఞాపకాలు-వ్యాపకాలు' అన్న గ్రంథంలో తిరుపతి యాత్ర ప్రసక్తి (పుట 91-92)తో పాటు విదేశపర్యటన కూడ ఉంది. తెలుగు విద్యార్థి ప్రచురణలు, మచిలీపట్నం. ప్రథమ ముద్రణ : 1984. |
| 26. | దక్షిణదేశమందలి కొన్ని స్థల విశేషములు. | డా॥ వారణాసి యశోదాదేవి, కిన్నెర, 1951. |
| 27. | నా అమెరికా పర్యటన-అనుభవాలు | డా॥ ఆరుద్ర, విజయచిత్ర, ఫిబ్రవరి 1988. |
| 28. | నా ఐరోపా ఖండ యాత్ర | శ్రీమతి వంగల వాణీబాయి, భారతి, ప్రమోదూత, చైత్ర (ఏప్రిల్ 1930). |
| 29. | నా ఐరోపా యాత్ర | వి. ఎన్. శర్మ, భారతి, విక్రమ, ఆషాఢ (జూలై, 1940). |
| 30. | నానాదేశ సందర్శనము (ఫ్రాన్సు, ఇటలీ) | 'గృహ'. భారతి, ధాత, కార్తిక (నవంబర్, 1936) |
| 31. | నానాదేశ సందర్శనము (జర్మనీ) | 'గృహ'. భారతి, ధాత, మార్గ, (డిసెంబర్ 1936) |
| 32. | నా నెల్లూరు మండల యాత్ర | మల్లంపల్లి సోమశేఖర శర్మ, భారతి, విభవ భాద్రపద. (సెప్టెంబర్, 1928) |

| | | |
|---|---|---|
| 33. | నా నెల్లూరు మండల యాత్ర | మల్లంపల్లి సోమశేఖర శర్మ, భారతి, విభవ' కార్తీక, (నవంబర్, 1928) |
| 34. | నా ప్రయాణానుభవములు | డా॥ వి. ఎన్. శర్మ, కిన్నెర, జనవరి, 1954. |
| 35. | నా రష్యా యాత్ర. | పురాణం సుబ్రహ్మణ్య శర్మ. ఆంధ్రజ్యోతి సచిత్ర వార పత్రికలో 17-7-87 నుండి 9-10-87 దాకా 13 వారాలపాటు ధారావాహికంగా వెలువడ్డ వ్యాస పరంపర. |
| 36. | నా విదేశయాత్రానుభవాలు | శ్రీమతి డి. కామేశ్వరి. వనిత, జనవరి-సెప్టెంబర్, 1988. |
| 37. | నా విదేశీయాత్రానుభవాలు | శ్రీ శ్రీ 'అనంతం'లో రష్యా పర్యటన వివరాలు (పుట. 191-220) ఉన్నాయి. శ్రీ శ్రీ సాహిత్య సర్వస్వం-20, కూర్పు: చలసాని ప్రసాద్. విరసం ప్రచురణ, ఆగస్టు, 1986. |
| *38. | నా శృంగేరి యాత్ర | దేశభట్ల లక్ష్మీనరసింహం పంతులు. ఇవి మొత్తం నాలుగు వ్యాసాలు. 'శ్రీ సాధన పత్రిక'లో ఫిబ్రవరి 22, 1936 సంచిక నుండి నాలుగు వారాలపాటు ప్రకటించబడ్డాయి. ఈ వివరాలు శ్రీ ఘట్టమరాజు గారు 'మూడు అజ్ఞాత యాత్రా చరిత్రలు' అన్న వ్యాసంలో తెల్పారు. విశాలాంధ్ర ఆదివారం (13-3-1988) సంచిక. |
| *39. | నా హంపీ విజయనగర యాత్ర | ముదిగంటి జగ్గన్న శాస్త్రి. భారతి, భావ, జ్యేష్ఠ. (జూన్, 1934) |
| 40. | నేను చూసిన ఆస్ట్రేలియా | డా. కొల్లి కృష్ణకుమారి. వనితాజ్యోతి, డిసెంబర్, 1988- మే. 1989. |
| 41. | నేను చూసిన జర్మనీ | డా. గండికోట లక్ష్మీనరసింగరావు. ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక. 24-7-1985. |

| | | |
|---|---|---|
| 42. | పశ్చిమ జర్మనీ యాత్రా విశేషాలు | ఎ.బి.కె. ప్రసాద్. ఆంధ్రజ్యోతి దినపత్రిక, (23-10-1983 నుండి 26-10-1983.) |
| 43. | పాశ్చాత్య దేశాల్లో 50 రోజులు (యాత్రా సాహితీ వ్యాసము) | డా॥ సి. నారాయణరెడ్డి. ఆంధ్రప్రభ సచిత్ర వార పత్రికలో 19-8-1981 నుండి 23-9-1981 దాకా ఆరు సంచికల్లో వరుసగా ప్రకటితం. |
| 44. | ఫాహియాన్ భారత యాత్ర. | పణితపు నాగేశ్వర రావు. ఆంధ్రప్రభ ఆది వారం అనుబంధం సంచికలు. 12-5-1985 - 30-6-1985 (8 సంచికలు) |
| 45. | ఫాహియాన్ భారత వర్ష యాత్ర. | వేలూరి సత్యనారాయణ గారి ఈ గ్రంథంపై 'ఆ' రాసిన సమీక్ష. భారతి, బహుధాన్య, శ్రావణ (ఆగస్టు, 1938). |
| *46. | ఫాహియాన్ యాత్రికుడు | వేలూరి సత్యనారాయణ. శారద, మే, 1924. |
| 47. | 'ప్రపంచ యాత్ర చేసి ప్రమాదాలు ఎదుర్కొన్నాడు' | ఈనాడు (ఆదివారం 1-12-1985) |
| 48. | బదరీ నారాయణ యాత్ర. | మంత్రి ప్రగడ నరసింహం. ప్రమాది, మాఘ (ఫిబ్రవరి, 1940) భారతి - ప్రమాది, ఫాల్గుణ (మార్చి, 1940) భారతి - విక్రమ, చైత్ర (ఏప్రిల్, 1940). భారతి - |
| 50. | 'బెలూన్‌లో సాహస యాత్ర' | ఆంధ్రభూమి దినపత్రిక, 19-2-1989. |
| 51. | భద్రాచల యాత్ర | పెద్దిభొట్ల పీరయ్య, శారద, జూన్, 1925. |
| 52. | భారతదేశ యాత్ర | సముద్రాల లక్ష్మణయ్య గారు వ్రాసిన 'మహర్షి - సద్గురు శ్రీ మలయాళ స్వామి జీవిత చరిత్ర'లో కాశీ నివాసం, తిరుపతి యాత్రల గురించిన ప్రస్తావన ఉంది. శ్రీ వ్యాసాశ్రమ స్వర్ణోత్సవ సమితి, చిత్తూరు, 1976. |

| | | |
|---|---|---|
| 53. | భూదాన పర్యటన | సంగెం లక్ష్మీబాయి గారి 'నా అనుభవములు' అన్న గ్రంథంలో (పుట 87-95) ఈ పర్యటన వివరాలున్నాయి. సికింద్రాబాద్ ప్రింటర్స్, 1971. |
| 54. | మహారాష్ట్ర యాత్ర | జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తి, భారతి, ఫిబ్రవరి 1936 నుండి జూన్ 1937 వరకు. |
| 55. | 'మహారాష్ట్ర'నికి మా సాహిత్య యాత్ర | శ్రీమతి మాలతీ చందూర్, ఆంధ్రజ్యోతి సచిత్ర వార పత్రిక, 20-12-1985 సంచిక. |
| 56. | మా ఉత్తరదేశ యాత్ర | శ్రీమతి బసవరాజు రాజ్యలక్ష్మమ్మ వ్రాసిన 'అప్పారావు గారు-నేను' అన్న గ్రంథంలో ఈ యాత్ర ప్రసక్తే కాకుండా కాశీ, శ్రీశైలం, కోలారు యాత్రల ప్రసక్తి కూడ ఉంది. ఉదయభాస్కర్ పబ్లిషర్స్, విజయవాడ, 1965 |
| 57. | మా ధర్మ యాత్ర (షోరనూర్, గురువాయూర్) | ఉమానంద్, భారతి, సర్వజిత్, ఆషాఢ (జూలై, 1947) 'కలగూరగంప' శీర్షిక కింద ఈ వ్యాసం ప్రకటితం. |
| 58. | మా మహారాజుతో దూర తీరాలు | కురుమెళ్ళ వెంకటరావుగారి యాత్రాగ్రంథం పై 'వాణి కుమార' చేసిన సమీక్షాత్మక గ్రంథ విమర్శ. భారతి, నవంబర్, 1966. |
| 59. | మారిషస్‌లో తెలుగు వాణి | వేమూరి రాధాకృష్ణమూర్తి, మారిషస్‌లో పర్యటించిన అప్పటి విద్యా సాంస్కృతిక శాఖ మంత్రి మండలి వెంకట కృష్ణారావుగారు పర్యటనలో పొందిన అనుభూతులను రచయిత వివరించారు (పుట 4-13). |
| 60. | మార్క్‌ట్వైన్- భారత దేశం | శ్రీకాన్మన్ కాగల్ 'స్పాన్' పత్రికలో వ్రాసిన వ్యాసం వివరాలు. భారతి, ఫిబ్రవరి, 1967. |
| 61. | 'మార్గాన్ని కనుక్కునే యాత్ర' | ఈనాడు, 1986 (తేదీ తెలియలేదు) |

| | | |
|---|---|---|
| 62. | ముచ్చటగా మూడు వారాలు "మలేషియాలో తెలుగు వాణి"(యాత్రా సాహితీ వ్యాసము) | డా॥ సి. నారాయణ రెడ్డి, ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక, 8-9-1976, 15-9-1976 సంచికలు. |
| *63. | మృత్యుగుహ (కైలాస పర్వత యాత్ర) | కనకదండి గోపాలకృష్ణశాస్త్రి, భారతి, పార్థివ, పుష్య (జనవరి, 1946) |
| 64. | మేఘసందేశములో మేఘుని మార్గము-భౌగోళిక వాతావరణ విశేషములు. | సర్దేశాయి తిరుమలరావు, భారతి, డిసెంబరు 1966. |
| 65. | మేఘసందేశము-మేఘుని మార్గ సమన్వయము | వి. రాజగోపాలరావు, భారతి, ఫిబ్రవరి 1967. |
| 66. | మ్యూనిచ్ నగరంలో ఒక వారం | డా॥ చల్లా రాధాకృష్ణశర్మ, జగతి, అక్టోబర్ 1976 - ఏప్రిల్ 1977. |
| 67. | యాత్రా చరిత్రము | మండపాక పార్వతీశ్వర శాస్త్రి, అముద్రిత గ్రంథ చింతామణి, జూన్ 1895. |
| 68. | యాత్రా మార్గదర్శి (దక్షిణ భారతము) | రాగం వేంకటేశ్వర్లుగారి గ్రంథంపై సమీక్షా వ్యాసం. భారతి, జనవరి 1958. |
| 69. | రష్యాలో స్నేహ యాత్ర. | డా. వాసా ప్రభావతి గారి యాత్రాగ్రంథంపై సమీక్షా వ్యాసం. రచన: వి. ఎల్. శారద. వనితా జ్యోతి, ఫిబ్రవరి 1989. |
| 70. | లండన్ యాత్రానుభవాలు. | టి. శివశంకరంగారు తమ లండన్ యాత్రానుభవాలను లేఖల రూపంలో వారం వారం 'శ్రీ సాధన పత్రిక'లో ప్రచురింపచేశారు. మొదటి లేఖ 1930 మే 31 వ తేదీన వెలువడింది. ఈ వివరాలను ఘట్టమరాజుగారు 'మూడు అజ్ఞాత యాత్రా చరిత్రలు' అన్న వ్యాసంలో తెల్పారు. విశాలాంధ్ర, ఆదివారం (13-3-1988) సంచిక. |

| | | |
|---|---|---|
| 71. | సోమసుందర్ యాత్రా కవిత 'ఆంగ్లసీమలో ఆమని పీణలు' | ఈ గ్రంథంపై మాదిరాజు రంగారావు గారి సమీక్షా వ్యాసం. స్రవంతి, ఆగస్టు 1989. |
| 72. | రామేశ్వర యాత్ర. | ఆ. సూర్యనారాయణ గారు రచించిన 'సౌరిస్ (జీవితం)' అన్న గ్రంథంలో చలం గారి రామేశ్వర యాత్ర ప్రస్తావింపబడింది. (పుట. 126-127) ముద్రణ: ఆగస్టు, 1975. |
| 73. | రామేశ్వర యాత్ర. | మాదిరాజు రామకోటీశ్వరరావు గారు తమ 'స్వీయ చరిత్ర'లో (పుట. 213-214) రామేశ్వరయాత్రను గురించి ప్రస్తావించారు. ముద్రణ: శార్వరి, శ్రావణం (1960). |
| 74. | 'విండ్ సర్ఫింగ్‌లో వండర్‌బాయ్' | క్రీడాప్రతినిధి, ఈనాడు 29-4-1988. |
| 75. | వి. ఆర్. చిత్రా వారి జపాను పర్యటనము. | భారతి, ఏప్రిల్, 1933. |
| 76. | విదేశ గమనము వలన గలుగు కోటి లాభములు | 'ఇంగ్లాండులో నున్న యొక్క యాంధ్రునిచే వ్రాయబడినది' ఆంధ్రపత్రిక, సంవత్సరాది సంచిక, 10-4-1912. (పుటలు. 123-124) |
| 77. | విదేశీ యాత్రికులు-ప్రాచీన ఆంధ్రదేశము | భావరాజు వేంకట కృష్ణారావు, భారతి, భావ, భాద్రపద (సెప్టెంబర్, 1934). |
| 78. | విపులాచ పృథ్వీ | డా. దాశరథి తాము లండన్, అమెరికా, మలేషియాలకు చేసిన యాత్రలను 'విపులాచ పృథ్వీ' అనే శీర్షికతో 'వ్యాస పీఠం' అనే గ్రంథంలో (1985) పొందుపరిచారు. మహాంధ్ర ప్రచురణలు, 104 (సి. బ్లాక్), మాతృశ్రీ అపార్టుమెంట్స్, హైదర్‌గూడ, హైదరాబాద్ - 500 029. |

| | | |
|---|---|---|
| 79. | విలాస యాత్రలు | శ్రీమతి యస్. సావిత్రమ్మ, భారతి, ప్రమోదూత, శ్రావణ (ఆగష్టు, 1930) |
| 80. | శ్రీ తిరుపతివేంకటేశ్వర కవుల విజయయాత్రలు | నోరి నరసింహశాస్త్రి, భారతి, నవంబర్, 1970. |
| 81. | సంచారం | లింగం వీరభద్రయ్య చౌదరి 'స్వవిషయం మూడవ భాగం' అన్న తమ స్వీయచరిత్ర గ్రంథంలో కుర్తాళం, టెన్‌కాశి, మదురై ప్రాంతాలకు చేసిన పర్యటన (పుటలు: 982-996) వివరాలున్నాయి. |
| 82. | 'సాహసమే ఊపిరిగా స్కై-స్కూటర్‌పై సహారా యాత్ర' | ఈనాడు (ఆదివారం) 28-5-1989. |
| 83. | సింహళ ద్వీపయాత్ర | శ్రీమతి తాడూరి రమణాబాయమ్మ, భారతి, శుక్ల, భాద్రపద, (సెప్టెంబర్, 1929). |
| 84. | "సినారెతో రెండు రోజులు" | డా॥ ఎన్. గోపి. ఆంధ్రజ్యోతి (దిన) 26 ఫిబ్రవరి 1990. |
| 85 | సోవియట్ యూనియన్‌లో మనోసారి (యాత్రా సాహితీ వ్యాసము) | డా. సి. నారాయణరెడ్డి, ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక, 31-8-1988 నుండి 21-9-1988 దాకా నాలుగు వారాలపాటు ప్రకటింపబడినవి. |
| 86. | హిమాలయ పర్యటన | సంజీవదేవ్ రచించిన 'తెగిన జ్ఞాపకాలు'లో ఈ పర్యటనతో పాటు ఉత్తరదేశ యాత్ర ప్రసక్తికూడ ఉంది. ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ. 1970. |

## 3. అనువాద యాత్రాచరిత్రలు :

| | | |
|---|---|---|
| 1. | ఆఫ్ఘనిస్థాన్ | మూలం : డా. అమలేందు గుహ. సీనియర్ రీసెర్చ్ ఫెలో, అనువాదం: ఎస్ వి. సుబ్బయ్య కవిరాజ పబ్లిషర్స్, తెనాలి, మే, 1967. |

| | | |
|---|---|---|
| 2. | ఈశ్వరాన్వేషణము | మూలం : స్వామి రామదాస్, అనువాదం : కె రామచంద్ర రావు, ప్రచురణ : వి. బి. సుబ్బయ్య అండ్ సన్స్,1961.బెంగుళూరు-2. |
| 3. | ఓల్గాసే గంగా | మూలం : రాహుల్ సాంకృత్యాయన్, అనువాదం : విశాలాంధ్ర ప్రచురణ. |
| 4. | కడలి మీద కోన్ - టికి | మూలం : థార్ హియెర్డ్ హాల్, అనువాదం : విద్వాన్ దేవరకొండ చిన్ని కృష్ణశర్మ, ప్రేమ్ చంద్ పబ్లికేషన్స్, విజయవాడ, ప్రథమ ముద్రణ : 1957. |
| 5. | కాసీ లేకుండా కాలినడకన ప్రపంచ యాత్ర | మూలం : సతీష్ కుమార్, అనువాదం : వేమూరి రాధాకృష్ణమూర్తి, శ్రీనివాస ప్రకాశన సమితి, 959, ఖైరతాబాద్, హైదరాబాద్-4, ప్రథమ ముద్రణ : డిసెంబర్, 1968. |
| 6. | చంద్రలోక యాత్ర | మూలం: జాన్ వెర్గిన్ విలానిలమ్, అనువాదం: జి. వి. చిదంబరరావు. |
| 7. | జీవన లీల (Gujarati Travelogue) | మూలం: కాకా సాహెబ్ కాలేల్కర్. అనువాదం: పురాణం సుబ్రహ్మణ్య శర్మ. సాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ. ప్రథమ ముద్రణ: 1967. ప్రకాశకులు: అద్దేపల్లి అండ్ కో, రాజమహేంద్రవరం. |
| 8. | నా పడమటి ప్రయాణం. | మూలం. డి. యఫ్. కరకా. అనువాదం: అడివి బాపిరాజు, విద్వాన్ విశ్వం. హైదరాబాదు, 1947. |
| 9. | నా భారతదేశ యాత్ర. | మూలం: హెచ్. యన్. బ్రెయిల్స్ ఫర్డు, అనువాదం: కాళోజి నారాయణరావు. దేశోద్ధారక గ్రంథమాల, సికింద్రాబాదు. విక్రమ - ఫాల్గుణం (ఏప్రిల్, 1941) వెల: ఎనిమిది అణాలు. |

| | | |
|---|---|---|
| 10. | నా రష్యా యాత్ర | నిత్య నారాయణ బెనర్జీ (మూలం) రామమోహన్ (అనువాదం). విశ్వసాహిత్య మాల, ముంగండ, వయా అంబాజీపేట, తూర్పు గోదావరి జిల్లా. నవంబర్, 1987. వెల: ఎనిమిది అణాలు. |
| 11. | నా సోవియట్ పర్యటనానుభవాలు | చంద్ర రాజేశ్వరరావు. అనువాదం: నిడమర్తి రాజేశ్వరరావు. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, ఏలూరు రోడ్డు, విజయవాడ - 2. ప్రథమ ముద్రణ : ఆగస్టు, 1971. |
| 12. | ప్రపంచ యాత్ర - I | కే.పి.యస్. మీనన్. అనువాదం : వి. నారాయణ రావు. గుండిమెడాన్, 620, పవరుపేట, ఏలూరు, అక్టోబర్, 1966, దక్షిణ భాషా పుస్తక సంస్థ సహకారంచే ప్రకటితము. |
| 13. | ప్రపంచ యాత్ర - II | కే.పి.యస్. మీనన్. అనువాదం: ఇస్మాయిల్. (మిగతా వివరాలు పైదానివలె) |
| 14. | వెన్నెలకంటి సుబ్బారావు జీవయాత్రా చరిత్ర*(1784-1839) | అనువాదం: డా॥ అక్కిరాజు రమాపతిరావు. శ్రీ భారతి ప్రచురణలు, సికింద్రాబాదు - ప్రథమ ప్రచురణ. ఏప్రిల్, 1976. (నూటయాభై సంవత్సరాల క్రితం సుబ్బారావు ఇంగ్లీషులో వ్రాసుకొన్న స్వీయ జీవిత వృత్తాంతం. Published for the information of his relatives and friends by his son in 1873). |
| 15. | సోవియట్ దేశం - భూతలస్వర్గం. | మెల్లీ సోలింగర్, ఉప్పల లక్ష్మణరావు. అనువాదం: సెట్టి ఈశ్వరరావు. ప్రజా ప్రచురణాలయం, హైదరాబాదు. ప్రథమ ముద్రణ: జూన్ 1945. వెల: కల్దార్ రూ. 1-0-0. హాలీ రూ. 1-2-8. |

# ఉపయుక్త గ్రంథసూచి

## 1. యాత్రాసంబంధి గ్రంథాలు :


1. ఆంధ్రప్రదేశ యాత్ర (ఇరవైఒక్క జిల్లాలు-సుమారు రెండువందల స్థలాలు) — రచయిత్రి : కమలవాసిని, వాల్తేరు, ప్రమాదీచ, విజయదశమి.
2. ఆసేతు కైలాస పర్యంత సంపూర్ణ భారతదేశ సవ్యప్రదక్షిణ తీర్థ యాత్రా ప్రదర్శిని. — ఇట్టింకి నరసింహమూర్తి, తోలేరు, వీరవాసరం (పోస్టు), భీమవరం తాలూకా, పశ్చిమ గోదావరి జిల్లా.
3. ఫాహియాన్ భారత వర్ష యాత్ర — వేలూరి సత్యనారాయణ, విజ్ఞాన చంద్రికా గ్రంథమాల, విజయవాడ. తృతీయ ముద్రణ, 1939. వెల రూ. 1-4-0
4. భారతదేశ తీర్థయాత్రా చరిత్ర — పుప్పల సత్యనారాయణ శ్రేష్ఠి ప్రకాశకులు: మాజేటి చిన సూర్యనారాయణ, అనకాపల్లి, ప్రథమ ముద్రణ: సర్వధారి, మాఘము (1949.)
5. యమ్.యన్. రాయ్ స్వీయ గాథలు — అనువాదం: బి. యన్ యల్. హనుమంతరావు, ప్రజా సాహిత్య పరిషత్తు, తెనాలి-2. ప్రథమ ముద్రణ: ఫిబ్రవరి, 1965.
6. యాత్రా మార్గదర్శి - I (దక్షిణభారత-మలబార్, కేరళ, మైసూరు, కూర్గు ప్రాంతములు). PILGRIM & TOURST GUIDE (Revised & Enlarged Edition) — రాగం వెంకటేశ్వర్లు, ప్రకాశకులు: శ్రీ సీతారామ నామ సంకీర్తన సంఘము (రి). శ్రీ రామనామ క్షేత్రము, గుంటూరు. మార్చి 1957. ప్రథమ ముద్రణ : డిసెంబరు, 1953.

| | | |
|---|---|---|
| 7. | యాత్రా మార్గదర్శి-(ఉత్తరభారత-హిమాచల ప్రాంతములు) | రాగం వేంకటేశ్వర్లు, ప్రకాశకులు: శ్రీ సీతా రామనామ సంకీర్తన సంఘము (రి). శ్రీ రామనామ క్షేత్రము, గుంటూరు-1955. ప్రథమ ముద్రణ: డిసెంబరు, 1955. |
| 8. | లోక సంచారి (ఘుమక్కడ్ శాస్త్రి) | రాహుల్ సాంకృత్యాయన్, అనువాదం: ఆలూరి భుజంగరావు. విశాలాంధ్ర ప్రచురణాలయం, ఏలూరు రోడ్డు, విజయవాడ-2. ప్రథమ ముద్రణ: నవంబర్, 1966. |
| 9. | విదేశ యాత్రికులు-ప్రాచీనాంధ్ర దేశము (పరిష్కృత ద్వితీయ ముద్రణము) | భావరాజు వేంకట కృష్ణరావు, గ్రంథకర్తచే ప్రకటితము. 1934. |
| 10. | శ్రీ ఉత్తరదేశ సంపూర్ణ క్షేత్ర యాత్రాదర్శిని | కొల్లూరు వేంకటరావు, వేగుచుక్క ప్రింటింగ్ వర్క్స్, రాజాం, శ్రీకాకుళం జిల్లా. ప్రథమ ముద్రణ: జూన్, 1968. |
| 11. | శ్రీ కాశీక్షేత్ర మాహాత్మ్యము వచన కావ్యము (యాత్రా వివరములతో) | లక్ష్మి ఇందిరా ట్రేడింగు కంపెనీ, నారద ఘాటు, వారణాశి - 1, వారిచే ప్రకటితము. 1981. |
| 12. | శ్రీశైల మహాక్షేత్ర యాత్రా దర్శిని (నాడూ - నేడూ) | ఓరుగంటి వెంకటరమణయ్య, శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జున స్వామివారి దేవస్థానం, శ్రీశైలం, ప్రథమ ముద్రణ: 1978. |
| 13. | సార్థవాహులు | హిందీ మూలం: డా. మోతీచంద్, అనువాదం: ముట్నూరి సంగమేశం. సాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ, ప్రథమ ముద్రణ: 1970. |
| 14. | సుందర భారత యాత్ర-I (ద్వారకా, కాశీ ఖండములు) | బులుసు సుందర ప్రకాశ శాస్త్రి, సాధన గ్రంథమండలి, తెనాలి, మన్మథ-శ్రావణం (1955) వెల: 2-8-0. |

| | | |
|---|---|---|
| 15. | సుందరభారత యాత్ర-II (జగన్నాథ ఖండము, మధ్య భారతము, రామేశ్వర ఖండము, పరిశిష్ట ఖండములు). | వివరాలు పైదాని వలెనే. |
| 16. | హిందూదేశ యాత్రా స్థలములు రెండవ పూర్ణయాత్ర. | పూర్ణయాత్రా స్పెషల్ ట్రెయిన్ సర్విస్ కంపెనీ, విశాఖపట్టణము వారిచే నిర్వహింపబడింది. యాత్ర చేసిన క్రమంలోనే గ్రంథ రచన జరిగింది. లోపలి పుటలు కొన్ని చిరిగి పోవటం వల్ల ఇతర వివరాలు తెలియరాలేదు. |

## 2. ఇతరములు:

| | | |
|---|---|---|
| 1. | అమరకోశము (సంస్కృతాంధ్ర వివరణము ప్రథమ కాండము.) | సంపాదకులు: చలమ చర్ల వేంకట శేషాచార్యులు. ప్రచారకులు: శ్రీ జయలక్ష్మి పబ్లికేషన్స్, హైదరాబాదు, 1989. |
| 2. | ఆంధ్ర మహాభారతము (సంశోధితముద్రణము) | తెలుగుశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయము, హైదరాబాదు. |
| 3. | ఆంధ్ర వచన రచనా పరిణామము | గొబ్బూరి వేంకటానంద రాఘవరావు. పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో, సరస్వతీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరం. ప్రథమ ముద్రణ: అక్టోబర్, 1961. |
| 4. | ఆంధ్ర వచన వాఙ్మయము | నిడుదవోలు వేంకటరావు, ప్రకాశకుడు : యన్. యన్. సుందరేశ్వరరావు, హైదరాబాదు-197. |
| 5. | ఆంధ్ర వచన వాఙ్మయము-ఉత్పత్తి వికాసములు. (క్రీ.శ. 18వ శతాబ్ధి అంతము వరకు) | డా॥ ఎం. కులశేఖరరావు, విజ్ఞానపురి కాలనీ విద్యానగర్, హైదరాబాదు. |

| | | |
|---|---|---|
| 6. | ఆంధ్రుల సాంఘిక చరిత్ర | సురవరం ప్రతాపరెడ్డి, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు, 1949. |
| 7. | కళా ప్రపూర్ణ శ్రీ దువ్వూరి వేంకట రమణశాస్త్రిగారి స్వీయ చరిత్ర | ప్రచురణ: రచయితల సహకార సంఘము, గుంటూరు. రిజిష్టరు నెం. 2257, స్థాపన, 1-1-72. |
| 8 | చారిత్రక శ్రీశైలము, భారతీయ సంస్కృతి, చారిత్రక కాశీ క్షేత్రము | కొండాలి లక్ష్మీనారాయణ, ఇతిహాస పరిశోధక మాల, మోపర్రు, తెనాలి తాలూకా, ఆంధ్ర ప్రదేశ్. ముద్రణ: జనవరి, 1972. |
| 9. | తేవారం త్రయము | బి.జి.యల్. స్వామి, భారతి, మార్చి, 1977. |
| 10. | ధీరాన్వేషకులు | ఖండవల్లి బాలేందు శేఖరం, 1951. |
| 11. | నీలగిరి చరిత్ర | బేతపూడి సుందరరావు (1864), ఇది నీలగిరిని కనిపెట్టిన చరిత్ర గ్రంథమని నిడుదవోలు వారు తమ 'ఆంధ్ర వచన వాఙ్మయము'లో పేర్కొన్నారు. |
| 12. | నేటి మానవుని కృషి | మూలం : F.G. ప్యాన్. అనువాదం: చింతా దీక్షితులు. ఆక్స్‌ఫర్డు యూనివర్సిటి ప్రెస్, బొంబాయి. 1945. |
| 13. | ప్రపంచ రాజ్య సర్వస్వము | ఆంధ్ర సారస్వత పరిషత్తు. హైదరాబాదు. |
| 14. | ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము | కుందూరి ఈశ్వర దత్తు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, కళాభవన్, సైఫాబాద్, హైద్రాబాద్. ప్రథమ ముద్రణ : జనవరి, 1963. |
| 15. | ప్రియదర్శి అశోక | మూలం : ధీరేంద్రలాల్ ధర్. అనువాదం : గొల్లపల్లి వెంకటేశ్వరరావు. నవోదయ పబ్లిషర్స్, విజయవాడ-2. ముద్రణ : జనవరి, 1960. |

| | | |
|---|---|---|
| 16. | బ్రౌణ్య తెలుగు ఇంగ్లీషు నిఘంటువు | ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు - 1966. |
| 17. | మనుచరిత్రము (స్వారోచిష మనుసంభవము) | అల్లసాని పెద్దన. వ్యాఖ్యాత : వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి, వేంకట్రామ అండ్ కో, 1968. |
| 18. | మలయాళ వాఙ్మయ చరిత్రము | మూలం: పి కే. పరమేశ్వరన్ నాయర్. అనువాదం: దివాకర్ల వేంకటావధాని. సాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ, ప్రథమ ముద్రణ : 1978. |
| 19. | మహోన్నత మానవుడు రాహుల్ సాంకృత్యాయన్ | సేకరణ : బండ్లపల్లె ఓబుల్ రెడ్డి, జయంతి పబ్లికేషన్స్, కారల్ మార్క్స్ రోడ్, విజయవాడ-2. ముద్రణ : నవంబర్, 1984. |
| 20. | లోకాలోకనం (A Collection of Telugu Essays) | టి. ఉదయవర్లు, కిన్నెర ఆర్టు థియేటర్స్, హైదరాబాదు, ముద్రణ: డిసెంబర్, 1998 |
| 21. | విజ్ఞాన సర్వస్వము - 6వ సంపుటము | 'తెలుగు చాటువులు' రచన: మహంతి, పుటలు: 670-672. |
| 22. | 'విద్యార్థి కల్పతరువు' అను ఆంధ్ర భాషా విషయ సర్వస్వము | ముసునూరి వేంకటశాస్త్రి, వేంకట్రామా అండ్ కో, 1967, హైదరాబాదు. |
| 23. | విశ్వగుణాదర్శము | సంస్కృతమూలం: వేంకటాధ్వరి, అనువాదం: దేవరాజు పండితుడు, (పుస్తకం పై పుటలు చిరిగి ఉండటం వల్ల ప్రచురణ వివరాలు తెలియవు). |
| 24. | వ్యాసనవమి | ('కర్మయోగి వీరబ్రహ్మం' వ్యాసం) డా. ఎన్. గోపి, చైతన్య పబ్లికేషన్స్, హైదరాబాదు, 1986. |
| 25. | స్వీయ చరిత్రము | చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు గారు, ప్రచురణకర్త : చదలవాడ పిచ్చయ్య, ఆంధ్ర రాష్ట్ర అరసం కార్యదర్శి, 1984. |

| | | |
|---|---|---|
| 26. | మహా . భాగవతము (రెండవ సంపుటము) | బమ్మెర పోతనామాత్య ప్రణీతము, ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ, కళాభవన్, సైఫాబాద్, హైదరాబాదు - 4. 1983. |
| 27. | శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు | ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, కళాభవన్, సైఫాబాద్, హైదరాబాదు-4. |
| 28. | మాహర్షుడు | మూలం: వి.డి. గంగల్, అనువాదం: ఆర్. రాఘవరావు, నేషనల్ బుక్ ట్రస్టు ఇండియా, న్యూఢిల్లీ, ముద్రణ: ఫిబ్రవరి, 1971. |


## 3. ఇంగ్లీషు గ్రంథాలు :


| | | |
|---|---|---|
| 1. | A Book of India | Edited by : Dr. B. N. Pandey Rupa & Co., By arrangement with Collins, 1982. (Wm. Collins Sons & Co. Ltd., London), Printed by : Rekha Printers (P) Ltd., A - 102/1, Okhala Industrial Estate, Phase-II, New Delhi-110 020. |
| 2. | A History of South India (from pre-historic times to the fall of Vijayanagar) | K. A. Neelakanta Sastry, Madras, Oxford University Press, 1966, Delhi, Bombay, Calcutta. |
| 3. | Along the Pilgrim Path (A record and review of Brahma Samajes in India) | V. Ramakrishna Rao, Printed at : George Press, Cocanada, First Edition : 1938. |

| | | |
|---|---|---|
| 4. | A Soviet Journey | Alex La Guma, Progress Publishers, Moscow - 1978. |
| 5. | As they saw India | K. C. Khanna, National Book Trust of India, First Edition : 1971. |
| 6. | Escape with me! (A travel book) | Osbert Sit well Pan Books Ltd., 8 Head fort place, London, S.W. 1. First Edition : 1948. |
| 7. | Hindu manners Customs & Ceremonies, 1806 | Abbe J. Dubois, Translated by Henry K. Beauchamp, Third edition, 1906, Reprinted in 1958. |
| 8. | History of the Telugu Christians | By A. Father of the Mill Hill, St. Joseph's Society, Printed at TRICHINOPOLY, 1910. Price Rs. 1/-, Pages 312. |
| 9. | Indian Travel Diary of a Philosopher | Count Hermann Keyserling, Translated from German by : J. Holroyd - Reece, Bharatiya Vidya Bhavan, Bombay, 1959. |
| 10. | In the Vision of God | Swami Ramdas, Gen. Editors : K. M. Munshi, R. R. Diwakar, Bharatiya Vidya Bhavan, Chaupatty, Bombay, 1963. |
| 11. | In Quest of God | Swami Ramdas, Bharatiya Vidya Bhavan, Bombay, 1961. |
| 12. | Journey round the world | K.P.S. Menon, Bharatiya Vidya Bhavan, Bombay, 1966. |
| 13. | Letters from India | Julia Thompson<br>తెలుగుదేశం నుండి ఇంగ్లాండుకు వ్రాసిన లేఖలివి. వీటిలో యాత్రా స్పర్శ ఉన్నట్లు ఆరుద్ర గారు చెప్పారు. |

| | | |
|---|---|---|
| 14. | Memories of Europeon Travel | Swami Vivekananda, Advaita Ashrama, 5, Delhi Etalla Road, Culcutta-14. |
| 15. | Pictures of England | పోతం జానకమ్మ. ఈమె భర్త రాఘవయ్య గారితో ఇంగ్లాండు, యూరప్ దేశాల పర్యటన చేసివచ్చి, ఆ వివరాలను 'శ్రీమదాంధ్ర భాషా సంజీవని (24-2-1874)' పత్రికలో ప్రకటించినట్లు అక్కిరాజు రమాపతిరావు గారి గ్రంథం 'వీరేశలింగం పంతులు : సమగ్ర పరిశీలన'లో ఉంది.<br>ఈమె యాత్రా వివరాలు తర్వాత 'Pictures of England' పేరుతో ఇంగ్లీషులోకి అనువదించబడ్డాయని ఆరుద్ర గారు చెప్పారు. |
| 16. | Taverniers Travels in Ihdia | Published in London in 1697. Republished by the 'Banga Basis' office 38-2, Bhowani Charan Butt's Street, Calcutta, 1905. |
| 17. | The Random House Dictionary of the English Language - the Unabridgde edition. | |
| 18. | The World we saw | K. M. Munshi, Bharatiya Vidya Bhavan, Bombay-1960. |
| 19. | To Badrinath | Bharatiya Vidya Bhavan, Bombay. |

| | | |
|---|---|---|
| 20. | Travels in India, Ceylon and Borneo | Captain Basil Hall, R.N. F.R S. Published by: George Rutledge & Sons Ltd., Broadway House, Carter Lane, London. |
| 21. | Webster's Third New International Dictionary of the English Language Unabridged, 1768. Vol. II & III. | — |
| 22. | Westward through orient. | Jaico Books Publication. |


## 4. హింది గ్రంథాలు :


| | | |
|---|---|---|
| 1. | విశ్వభ్రమణ్ | సేఠ్ గోవింద దాస్<br>హింది పాకెట్ బుక్స్ ప్రై. లి.<br>జి. టి. రోడ్, ఢిల్లీ - 32. |




# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 4 | 5 | ప్రవజ్య | ప్రవజ్య |
| ,, | F.N | ప్రవజ్యా | ప్రవజ్యా |
| 5 | F.N | ద్రష్ణం | ద్రష్టం |
| 7 | ,, | 1668 | 1768 |
| 18 | 9 | చేస్తున్నాను? | చేస్తున్నారు? |
| 21 | 8 | 18 వ శతాబ్దంలో | 15 వ శతాబ్దంలో |
| 29 | 16 | చెడిపోవ జెడలగా | చెడిపోవ వెడలగా |
| 45 | 3 | పండితరాలు | పండిత రాయలు |
| 48 | 13 | జనిపిస్తుంది. | కనిపిస్తుంది |
| 57 | 13 | 1983 లో | 1893 లో |
| 59 | 2 | 1966 | 1967 |
| 70 | 3 | 'ఇండా' | ఇండికా |
| 75 | చివరిలైను | 629-44 | 629-45 |
| 92 | 6 | కాలిట్ | కాలికట్ |
| 93 | 13 | Withington (16-2-16) | Withington (1612-16) |
| 95 | 4 | Tapitaion Beril Hall | Captain Basil Hal |
| 107 | F.N | అదేపుట - 19 | అదేపుట 91. |
| 110 | 4 | 'కాశీయాత్ర' | 'కాశీయాత్రా చరిత్ర |
| 110 | చివరిలైను | మొదటిసారిగా 953 | మొదటిసారిగా 1953 లో |
| 111 | 16 | క్రియాత్మకంగా | ప్రక్రియాత్మకంగా |
| 112 | 12 | గతచరిత్ర ప్రసక్తి | గత జీవితప్రసక్తి |
| 120 | 11 | form | from |
| 128 | F.N 6 వ లైను | 'Poems' | 'Peons' |
| 170 | 4 | మున్నీరు | మున్షీలు |
| 170 | 9 | జనాబానది | జూబానది |
| 177 | F. N . శ్లోకం | నహ్నాత్యహో | నస్నాత్యహో |

| | | | |
|---|---|---|---|
| 192 | 6 | 1794 | 1784 |
| 194 | 9 | 1882 | 1822 |
| 204 | 12 | కాసో | కానో |
| 205 | 1 | చూసుకున్నారనీ | మానుకున్నారనీ |
| 217 | 11 | శేషగిరికవి | శేషాచలకవి |
| 273 | 3 | బెల్మ్రియర్ | బెర్నియర్ |
| 354 | 22 | క్రమసంఘం | క్రయసంఘం |
| 385 | F. N. | ధర్మ సంపద | ధర్మ సంసద్ |
| 393 | చివరిలైను | తెలిపు పాస్ | లిపుపాస్ |
| 397 | 24 | 4190 మీ | 4910 మీ |
| 400 | 1 | (4,800 మీటర్ల | (6,800 మీ) |
| 395-400 | - | దార్వెస్, ఫార్వెన్ | |
| ,, | | దార్వెన్ | దార్వెన్ |
| 434 | 4 | మతెవదరాన్ | మతెనదరాన్ |
| ✓ | 16 | వాన్ సరస్సుకూ | సెవాన్ సరస్సుకూ |
| 485 | 6 | 1956లో దాదాపు 35 | 1966లో దాదాపు 36 |
| 489 | 4 | గ్రిటా గార్యో | గ్రిటా గార్బో |
| 498 | F.N. | నాల్ట్‌డిస్క్రీ | వాల్ట్ డిస్నీ |
| 499 | 2 | ఆర్క్యాన్‌సాన్‌సాన్ | ఆర్క్యాన్‌సాన్ |
| 503 | 14 | 1877 లో | 1977 లో |
| 511 | 13 | విరాలలో | విరామం చేస్తూ |
| 537 | F. N | FN-22 | FN. 24 |
| 538 | F. N. | 23,24,25 | FN. 25, 26, 27 |
| 547 | 12 | కృతలు | కృతజ్ఞతలు |
| 547 | 13 | జనాంతర | జననాంతర |
| 576 | 7 | బివియా | లిబియా |
| 576 | 13 | 0.08 | 0.80 |
| ,, | 26 | కిలోదీనారున్నర, | కిలోదీనారు, దీనారున్నర |
| 577 | 9 | 1920 | 1929 |